THE

# ELUGU ENCYCLOPA

A DICTIONARY OF

*Arts, Sciences, Literature, History and Gei Information.*

EDITOR-IN-CHIEF

K. V. LAKSHMANA RAO, M. A.

VOLUME 2

Atak—Abul

'నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ విద్యతే'

# ఆంధ్రవిజ్ఞానసర్వస్వము


ముఖ్యసంపాదకుడు

కే. వి. లక్ష్మణరావు, ఎం. ఏ.


## సంపుటము ౨

అటక—అబుల్


ప్రకాశకులు.

ఆంధ్ర విజ్ఞానసర్వస్వ కార్యాలయము

మౌంటురోడ్డు, మదరాసు.

౧౯౧౬.

౫౮౭-౭౧౮ పుటలు పియర్ లెసు ముద్రాలయమందును

తక్కినదంతయు

ఇండియా ప్రింటింగు వర్క్సు ముద్రాలయమందును ముద్రితము.

**అటకమా.** ఇదిదక్షిణఅమెరికాలోని యుత్తరచిలీలో నొక మాగాణము. [illegible] చదరపుమైళ్ళ విస్తీర్ణము గలది. ఇందు వెండి గనులును, రాగిగనులును విశేషము గలవు. ఉప్పువిశేషముగ నెగుమతిచేయఁబడుచున్నది. ఈ ఫేర నొక యెడారిగూడ గలదు. అందు అగ్నిపర్వతములు గలవుగాని, యీ ప్రాంతమున వెండి, రాగి, సీసము, నిక్కెల్ లోహము వెలిగారము, ఇనుము, ఉప్పు మొదలగునవి దొరకును. ఈయెడారి అటకమా, లాస్ ఆండిస్, మున్నగు మాగాణములకు వ్యాపించి యున్నది.

**అటగడ (జమీందారి.)** ఇది చెన్నపురి రాజధానిలోని గంజాము జిల్లాకుఁ జెందిన యొక జమీను. ౧౮౭౪-వ సం॥న కళ్ళికోట రాజాగారు దీనిని క్రయమునకుఁ గొనిరి. అప్పటినుండి యిది వారిస్వాధీనములోనె యున్నది.

**అటబాపో.** ఇది వెనిజూలాలో నొకనది. ఉత్పత్తిస్థానమునకు నూటనలువది మైళ్ళక్రింద సాన్ ఫెర్నాండోడీ అటబాపోవద్ద ఒరినోకో నదితోఁ గలియుచున్నది. ఇది కొంతవఱకు కొలంబియా వెనిజూలాలకు మధ్య యెల్లగ నున్నది.

**అట్లలంటా.** ఆర్కేడియాలోని అటలంటా అనుయువతి. ఈసెన్‌కును క్లైమీనాకును బుట్టిన కూతురని లోకోక్తి. ఈమె పుట్టినతోడనే ఈమెతండ్రి ఈమెను పార్థినియన్ కొండలపై విడిచిపెట్టెనఁట. ఒక ఆడు ఎలుఁగుపాలిచ్చి ఈమెను గాపాడెనఁట. ఈమెకు కాలిడోనియన్ అడవిపందుల వేఁటాడుటయందతి చోద్యము. ఈమెతండ్రి ఈమెను పెండ్లి చేసికొమ్మని చెప్పఁగా ఈమె తన్ను నడకలో గెల్చునట్టి వానినే పెండ్లాడెదనని ప్రతిజ్ఞ చేసెనఁట. మానవులలో నీమెను గెల్చునంతటి పురుషుఁడు లేనందునఁ దుదకు మిలానియన్ (Milanion) అను వాఁడు బంగారుపండ్లను మూడింటిని అక్కడక్కడ త్రోవలోఁ బారవేసి, వానిని నెత్తుకొనుటకు ఆమెవంగినప్పుడు ఆమెపరుగు నధిగమించి మాయోపాయముచేత గెల్చి ఆమెను పెండ్లియాడెను. వెనుక వీరిరువురును కామోద్రేకమున నొక దేవాలయములో మైథిల గలిపినందునశపింపఁబడి సింహములయిరఁట.

౨. బియోటియన్ అటలంటా అనుయువతి యొకతె గలదు. ఆమె కథలను ఇట్లె చిత్రముగా నుడివెదరు. ఈమె స్కోనియస్ అను వాని కూతురు. ఈమె హిప్పొమెనసు అను వానిని పెండ్లాడెను. అటలంటా, అట్లాంటా అను రెండు పేరులును ఆర్టిమిస్ అను పేరునకు మాఱునామములే.

**అట వీపురి.** పాండవుల కాలము నందు కళింగదేశమునకు దక్షిణమునందుండెను.

**అటహాల్పా.** పెరూదేశమును ఇంకా జాతివారు పాలించుచుండిరి. వారిలో అటహాల్పా తండ్రియైన హైనాకేపెక్ ప్రసిద్ధి బడసి యుండెను. అతఁడు చనిపోయిన త[illegible]

డనే అటహాల్పాకు దాయాదియగు హాస్కారు అనువాఁడు రాజ్యమును గైకొనెను. అందు వలన అటహాల్పా హాస్కారుతోఁ గొన్ని యుద్ధములు జేసి, తుదకు పూర్ణ జయముఁ బొంది పెరూదేశమును బాలించుచుండెను. తరువాత కొంత కాలమునకు కాజామర్కా యందు ఫిజారోకును అటహాల్పాకును సమావేశము గల్గెను. అప్పుడా స్పెయినుదేశపు నాయకుఁడు అటహాల్పాను క్రీస్తుమత మవలంబింపుమనియు ౫వ చార్లెసునకుఁ గప్పము గట్టుమనియు నిర్బంధింపఁగా అటహాల్పా దీని కెంత మాత్రమును సమ్మతింపక తిరుగఁబడెను. కావున స్పెయిను సైన్యము ఇంకా రాజును పట్టుకొని అతనిపరివారమును హింసించెను. తరువాత నొక సంవత్సరములోపల అటహాల్పాను నామకార్థముగా న్యాయస్థానమున విచారించినట్లు విచారణచేసి చంపించిరి.

**అట్టకట్టుట.** పుస్తకసంరక్షణార్థమై చేయుసదుపాయము లీశీర్షిక క్రింద వర్ణింపఁబడును. అట్టలచేతనే కాక పుస్తకములనేక విధముల రక్షించు మార్గములున్నవి. కావున పై శీర్షికయొక్క పేరు పూర్తిగసార్థకముకాదు. లిపి కనిపెట్టి వ్రాతప్రతులు ఆచరణములోనికివచ్చిన వెంటనే వానిని కాపాడుమార్గములుఁగూడ కనిపెట్టియుండవలెను. వ్రాతప్రతులుగాని, ముద్రితగ్రంథములుగాని చెడ పట్టకుండుటకును, పురుగు తినకుండుటకును, అనాదినుండి వివిధదేశములలో వివిధోపాయములున్నవి. పుస్తకములు క్రిమికీటకాదులచే నశింపకుండఁ జేయుటకు నాంగ్లభాషలో "బైండుచేయుట" యని పేరు.

బైండుచేయునప్పు డుపయోగించు అట్టలయొక్క పదార్థమును, ఆకారమును, పుస్తకములయాకృతినిబట్టి యుండును. పుస్తకముల యొక్క యాకృతి దేశములనుబట్టి మాఱుచుండును. పెక్కుదేశములలో పురాతనశాసనములు రాతిమీఁదఁగాని రాగిరేకుల మీఁదఁగాని వ్రాయుచుండెడివారు. మనదేశములోఁగూడ నిదియేయాచారము. ఇట్టి శాసనములు శిథిలము కావుఁగాన నేవిధమైన రక్షణమును అవసరము లేదు. శాసనములుగాక యితర గ్రంథములు భూర్జపత్రముల మీఁదఁగాని తాటియాకుల మీఁదఁగాని వ్రాయునాచారము మనదేశములో నుండెడిది. ఉత్తరహిందూస్థానములో ముఖ్యముగ భూర్జపత్రములే వాడెడివారు. ఇదియొక విధమైనచెట్టుయొక్క తాట. దక్షిణహిందూదేశములో తాటియాకు విశేషముగ వాడుకలోనున్నది. ఇట్లే వివిధదేశములలో వివిధములగు సాధనములుండెడివి. ఈ యాకులమీఁదఁగాని తాటలమీఁదఁగాని వ్రాయుట మూఁడు విధములుగనుండెడిది. మనదేశములో ఆకులమీఁద నిలువుగ వ్రాయుటయాచారము. బౌద్ధులయొక్కయు, హిందువులయొక్కయు పురాతన గ్రంథములిట్లు వ్రాయఁబడినవియే. ఇతర దేశములలో ఆకులమీఁద అడ్డముగ వ్రాయుటయు, నిలువుగ పొట్టిపంక్తులలో వ్రాయుటగూడ వాడుకలో నుండెడివి. ఈ రెండు విధములుగ వ్రా

సిన దేశములలో వ్రాతప్రతులు చుట్టలుచుట్టి గొట్టములలోను కొయ్యపెట్టెలలోను భద్ర పరిచెడివారు. వ్రాతగ్రంథము లమూల్యము లగుటచే ప్రతిదేశములోను ప్రాణతుల్యముగఁ జూచెడివారు. మనదేశములోఁగూడ కౌళ్లు, ఖరారునామాలు, పత్రములు చుట్టలుగఁ జుట్టి గొట్టములలో దాచుట యాచారమై యున్నది. తాటియాకు గ్రంథములను భద్ర పఱచుటకు ఎడమవైపునను, కుడివైపునను బెజ్జములువేసి యినుపకడ్డీలనుదూర్చి, కఱ్ఱ పలకలతో నిరుప్రక్కల బంధించెదరు. అచ్చుకూటములు వెలసిన తరువాత ఇప్పటికిని సంస్కృతగ్రంథములు కొన్ని విడిపత్రములపై నచ్చొత్తి కొయ్యపలకలనడుమ భద్రపరచు నాచారముగలదు. ముద్రణయంత్రములు కనుఁగొనక పూర్వమె బైండుచేయువారు కంటి కింపగునట్లు అట్టలపై చిత్రించుట కుపక్రమించిరి. ఇవి దేశాంతరములలో చిత్రకారుల యభిరుచినిబట్టి యుండెడివి. మనదేశములో పుస్తకములపై చిత్రవిచిత్రమైన పూజలుగాననగును. ముద్రణయంత్రములు ప్రబలి కాగితము వ్రాతకు సాధనమైనప్పటికిని బైండుచేయు వ్యాపారములో చిత్రకారుని జీవనముపోలేదు. ఇప్పటికిని పుస్తకముల యట్టలపైచిత్రవిచిత్రములగు బొమ్మలుండును. మతగ్రంథముల మీఁదను, శుభకార్యముల పట్ల బహుమతి చేయుటకేర్పడిన పుస్తకములమీఁదనుముఖ్యముగచిత్తరువులుండును. అందునకై విదేశములలో గొప్ప గొప్ప బైండువ్యాపారస్థు లీషాపులలో నెక్కుడు జీతములనిచ్చి చిత్రకారుల నేర్పఱచుకొనెదరు. ఈవ్యాసములో బైండుచేయునప్పు డుపయోగించు నవీన పద్ధతులు మాత్రము వర్ణింపఁబడును.

### అట్టలుకట్టు మార్గములు.

అట్టకట్టుటకు ప్రథమమున చేయవలసిన పని పుస్తకముకొఱకు ముద్రితములైన కాగితములను మడచుట. ఈ మడతలనే విభాగములు (Sections) లందురు. అచ్చువేయునపుడివి యొక్కొక్క కాగితముగానుండును. ఈ కాగితమును సగమునకు మడచి ఆ మడతను తిరిగి సగమునకు మడవవలయును. రాయల్, (Royal) ఆక్టేవో (Octavo) సైజు పుస్తకముల విభాగములకు పై విధమున రెండు మడతలుండును. క్రౌన్ (Crown) సైజు పుస్తకముల విభాగములకు మూఁడు మడతలుండును. మడచు విధము క్రిందిపటములోఁ జూపఁబడినది.

(౧౯౦వ పుటలో ౧, ౨ పటములుచూచునది.)

ఈ ప్రకారము మడతపెట్టఁబడిన విభాగములనన్నిటిని వరుసలెక్క ప్రకారముసరిగా బొత్తిపెట్టి చక్కగానణఁగియుండుటకు ఇందుకొఱకు నిర్మింపబడిన యొక ప్రెస్సులో బాగుగా నొత్తవలయును.

ఈ ప్రెస్సుయొక్క పటము క్రిందఁజూపఁబడినది.

(౧౯౧వ పుటలో 3వ పటమును చూచునది.)



3-వ పటము.

తరువాత వానిని ఆ ప్రెస్సులోనుంచి తీసి మడవఁబడిన వానియొక్క భాగములు ముందు వెనుకలకు హెక్కువ తక్కువలుగా కనుపడకుండులాగున సమముగా బొత్తిపెట్టి కుట్టుటకు వీలగులాగున రంధ్రములు చేయు నిమిత్తము యీబొత్తిని ఒక ప్రెస్సులో బిగించ వలయును. పిమ్మట కుట్టఁబడువైపున పైభాగ మున నొక యంగుళమును క్రిందిభాగమున ఒకటింబాతిక అంగుళమును విడచి తక్కిన ప్రదేశమును సమానాంతరములుగా నాలుగు భాగములుచేసి గురుతు నిమిత్తము పెన్సి లుతో నడ్డముగా గీతలుగీచి ఆగీతలవెంబ డిని జవరంపముతో పీసము అంగుళమున్న నెక్కువలోతు పెగకుండులాగున మట్టముగా కోయవలయును. ఇట్లు కోయఁబడిన పిమ్మట నీ విభాగములను విడదీయునపుడీ కోతలు దాటి వెనుకభాగమున రంధ్రములవలె నేర్పడి వీనియందు సూదిని జొన్పి కుట్టుట కుప యోగపడును. దీని వివరమీ క్రిందిపటమునఁ జూపఁబడినది.



౪-వ పటము.

ఎ. ఎ. ప్రెస్సుదిమ్మెలు.
బి. విభాగముల బొత్తి.
సి. జవరంపము.

ఈ ప్రెస్సు పుస్తకములకు వీపు చేయుటకు కూడ నుపయోగ పడును.

రెండవపని కుట్టుట. ఇందుకొరకు నిర్మింప బడిన ప్రెస్సులో నూలు దారములనుగాని పటములో చూపునుగానిజూపఁబడిన ప్రకా రముదృఢముగా కట్టవలయును. వీనిని విభాగ ములవీపుపై నెంతెంత దూరములలో కోతలు కోయబడియున్నవో అంతే దూరములలో

పైకోత క్రిందికోతలను విడిచిపెట్టి మధ్యనున్న మూడు కోతలకు మూడింటిని కట్టవలయును. ప్రెస్సుయొక్క స్తంభములకమర్చబడిన మరదిమ్మెలను పైకి త్రిప్పుటవలన దారములను ఇష్టము వచ్చినంత బిగింపవచ్చును. తరువాత నావిభాగములలో చివరసంఖ్యతో కుట్టుకు మొదలిడవలయును. అనగా నొక పుస్తకమునకు ౬౮ విభాగము లున్నయెడల ముందుగా ౬౮ నెంబరుగల విభాగముతో ప్రారంభించి దానివెనుక ౬౩ దానితరువాత, ౬౨ యీప్రకారముగా తీసికొని కుట్టుచుండవలయును గావున కడపటి విభాగమును తీసికొని దానివీపుపై కోయబడిన ౫ కోతలలో పైక్రింది కోతలను రెంటినివదలి వానిమధ్యనున్న 3 కోతలును కుట్టుప్రెస్సుకుకట్టబడిన 3 దారములకు సరిగా చేర్చియుంచి పుస్తకములను కుట్టుట కేర్పడిన దారమును రెండుమూడడుగులు తీసికొని సూదిలోనెక్కించి ముందుగా క్రిందివైపు మొదటి రంధ్రముద్వారా పైభాగమునుంచి లోనికి సూదిని పోనిచ్చి అక్కడనుంచి దానిపై రంధ్రముద్వారా వెలుపలకురానిచ్చి అక్కడనున్న ప్రెస్సుకు కట్టబడిన దారమును లోగొనితిరిగి ఆ రంధ్రముద్వారానే సూదిని లోపలకు రానియ్యవలయును. అక్కడనుంచి దానిపై రంధ్రమునకును దాని తరువాత దానిపై రంధ్రమునకును పైప్రకారముగానే దారమునుతీసి దానిపైనున్న మొట్టమొదటి రంధ్రముద్వారా వెలుపలకు తీయవలయును.

పిమ్మట దారముయొక్క కొనను ప్రారంభించినచోట రెండంగుళములు మిగులులాగున దారమునంతయులాగి ఆకొనను వ్రేలితో నొక్కిపట్టి రెండవకొనను గట్టిగా లాగినయెడల నీకుట్టుదారము చక్కగా ప్రెస్సుదారములతో బిగియును. పిమ్మట దానివెనుకటి సంఖ్యగల విభాగమును తీసికొని వెనుకటివలెనే ప్రెస్సుదారముల దగ్గరగా చేర్చి కుట్టు దారమునకు సమీపముగా నీవిభాగము యొక్క పైవైపు మొదటి రంధ్రముందును గనుక నిప్పుడు సూదిని ఆరంధ్రముద్వారా పోనిచ్చి వెనుకటివలెనే దారమును యీ ౫ రంధ్రములలోనుంచి తీసి బాగుగా బిగించి లాగవలయును. అప్పుడు యీరెండు విభాగములును కలసి యుండును. మొదట కుట్టు ప్రారంభించినచోట మాత్రము యీ రెంటికిని సంబంధము విడియుండును గనుక మొదట విడచిపెట్టిన ౨ అంగుళముల దారపుకొనను యీ కుట్టుదారముతో చేర్చి ముడివేయవలయును. ఇప్పుడివి పూర్తిగా నేకమైయుండును. తరువాత నింకొక విభాగమును తీసికొని పైప్రకారముగానే వెనుకటివానితో చేర్చి కుట్టవలయును. ఇంతటినుంచి ఒక్కొక విభాగమునుకుట్టి దారమును బిగలాగిన వెంటనే దానిక్రింది భాగముయొక్క కుట్టులోనుంచి సూదినిపోనిచ్చి దానితో నీదారమును ముడివేయుచుండవలయును. ఈలాగు చేయనియెడల విభాగములన్నియు నంతటకుకలసియుండవు.

ఈ విధమున నొక్కొక విభాగమును కుట్టుచు మొదటివిభాగము వచ్చునప్పటికి కుట్టు పూర్తియగును. విభాగముల యొక్క గీ రంధ్రములనుంచి దారమును పోనిచ్చు విధము క్రింది పటముతో స్పష్టముగా చూడనగును.







గీ-వ పటము.

కుట్టు ప్రెస్సు.

ఏ.ఏ. మరస్తంభములు. బి.బి. మరదిమ్మలు. వీటిని పైకి త్రిప్పుట్టవల్లను దారములు బిగియును.

సి. అడ్డు కమ్మి. డి.డి. ప్రెస్సుదారములు. వీటిని ప్రెస్సుయొక్క పీఠము క్రిందనుండితీసి సి. అడ్డుకమ్మికి కట్టవలయును.

ఙ-వ పటము.

ఏ. విభాగము. బి. విభాగముయొక్క పైభాగము.

సి. విభాగపు మడత లోపలిభాగము;

డి. దారము- ...... ఈ గీటు విభాగము లోపలనున్న దారముయొక్క స్థితిని తెలుపును.

ఈ విధమున కుట్టుపనిముగించిన తరువాత కుట్టఁబడిన విభాగము లన్నియు దగ్గఱగా నుండులాగున చేతివ్రేళ్లతో బాగుగా దట్టించి, వెనుకభాగమున నంతటను సమముగా జిగురును పూసి, ఆరినతరువాత కుట్టుప్రెస్సుకు కట్టఁబడిన దారములను పుస్తకమున కిరువైపులను ఒక్కొక యంగుళము కొనలుండు లాగున కత్తిరించి వేయవలయును. ఇప్పుడు కుట్టుప్రెస్సులో నుంచిపుస్తకము పైకివచ్చును. ఈ కుట్టులలో నింకను మరికొన్ని విధములుకలవు గాని వానిలో నీవిధమే దృఢమైనది గనుక నిది యేయిందు తెలుపఁబడినది. తక్కిన వానిని ప్రత్యేకముగా వ్రాయఁబడిన పుస్తకబంధనమను గ్రంథమునఁ జూడనగును.

కుట్టుపని పూర్తియైనపిమ్మట పుస్తకపు అంచులు సరిగానుండుటకు కోత కోయవలసి యున్నది. అంచులుకోయుటకు ముందుగా పుస్తకారంభమున ముఖపత్రమును

(Titlepage) అంటించి పిమ్మటపుస్తకమునకిరు వైపులను రెక్కకాగితములు (Fly leaf) నంటించవలయును. ఇవిపుస్తకముల కట్టలనంటించుట కుపయోగపడును. ఈ కాగితములు సాధారణగ్నుల తోనున్న వివిధములగు లతా చిత్రములతోనున్న, యిందునిమిత్తము నిర్మింపబడియుండును వీనినియోకడుపేపెర్సు (End-papers) అనగాచివరకాగితములనివాడుదురు. దృఢమైన తెల్లకాగితమునైనను వాడవచ్చును. రెండు కాగితములకురంగులుగాని చిత్తరువులుగానియొకవైపునవేయుండుట వలన నీకాగితములనువాడు నెడల చిత్తరువులు లేనివైపున నే పుస్తకమున కంటించవలయును. పుస్తకపు కొలతకు రెట్టింపుగా నీ కాగితములను రెండిటినిదీసి కొని సగమునకు మడచి మడతవద్ద కాలంగుళము వెడల్పున కాగితముపొడుగునను జిగురు రాచిపుస్తకపువీపుప్రక్కనిరువైపులనొక్కొకటివంతుననంటించవలయును. తరువాత్తకోత నిమిత్తము కొయ్యతోఁజేయబడిన పలకలను (Cutting Boards) కోయవలసిన యంచు దగ్గర కోసివేయవలసిన భాగమును ఘట్టముగా నొకగీతగీచి యీ గీతకుసరిగా కోతపలక యొక్క పై అంచువచ్చు లాగుననుంచి రెండవవైపున పుస్తకపు అంచుకుసమముగా నేదేని యట్టనొకదానిని దాపుచేసిదానివెనుక రెండవకోతపలకనుచేర్చి వీనినన్నిటిని కదిలిపోకుండులాగున జాగ్రత్తగా కోతప్రెస్సులోఁ జేర్చి బిగింపవలయును. పిమ్మట దానిని కోయ నిమిత్తము నిర్మింపఁబడిన చిత్రికవంటి సాధనమును కోతప్రెస్సుపైనున్న కాలువవంటిగాడిలో కత్తితోనివైపును తగిలించిదానిపిడిని రెండు వైపుల రెండుచేతులతోఁ బట్టుకొనిముందుకు వెనుకకు త్రోయుచు చేతిలోనున్న పిడిని కొంచెముకొంచెముగాత్రిప్పుచుండవలెయును. ఇట్లుత్రిప్పుచుండుటచే దానిలో నమర్చఁబడిన కత్తికొంచెముకొంచెముగాముందుకుజరుగుచు చిత్రికను త్రోయుచుండుటవలన పుస్తకపు కాగితములకు రాచుకొని వానిని తెగకోయుచుండును. పూర్తిగా తెగువఱకు నీలాగు కోసి ప్రెస్సులో నుంచి పుస్తకమును తీసిపైప్రకారముగా నే మరియొక యంచును కోయవలయును. ఈ విధముగా పుస్తకముయొక్క మూడంచులను కోయవలయును. ఈపని చేయునపుడు ముద్రితభాగమునకు వెలుపలి భాగము (Margin) అన్నివైపుల సమముగానుండు లాగునను, పుస్తకమునకైమూలలు లేక ఘట్టమునకు సమముగానుండు లాగునను సరిచూచుకొని జాగరూకతగా నుండవలయును. ఈకోతప్రెస్సును సాధారణపుస్తక బంధకులు మాత్రమే వాడుదురు. గొప్పముద్రణయంత్రాలయములలో నీపనికి కట్టింగు మెషీను (Cutting Machines) లను వాడుదురు. అవి యీపని నెక్రమముగా నెరవేర్చి వందలకొలది పుస్తకములనతిశీఘ్రకాలమునకోయగలవు. వీనిరూపమీప్రక్కపటములోఁజూపఁబడినది.





౭-వ పటము.

ఏ. ఏ. ప్రెస్సుదిమ్మలు.

బి. చిత్రిక.

సి. చిత్రికయొక్క పిడి కోయునప్పుడు దీని రెండువైపులను రెండు చేతులతో పట్టుకొని ముందుకు కొంచెము కొంచెముగా త్రిప్పుచుండవలయును.

డి. చిత్రిక సరిగా ముందు వెనుకలకు నడచుట కుపయోగపడు కాలువ.







౮-వ పటము.

కట్టింగు మెషీను.

ఇకనుపుస్తకమునకు వీపునేర్పరుప వలయును. దీనిని(Backing) అందురు. పుస్తకములకే పనిచేయుటచే క్రింది పటములో చూపఁబడిన ప్రకారముగా సొగసైన రూపమేర్పడి చదువుటకు చాల నుపయోగకరముగానుండును.

పుస్తకమునకు వీపునేర్పరచుటకు ముందుగా ౧౦ వ పటములో కనుపరచిన రీతిని వీపుభాగమున నర్ధవలయాకారమైనగూనును, ముందుభాగమున నదేవిధమైన పల్లమును



౯-వ పటము.

వచ్చులాగున చేతివ్రేళ్లతో బుస్తకపుకాగితములను మెలకువగా లాగియును వీపుభాగ

మున నిరువైపుల ముందుకు నొక్కియును పైనచెప్పబడిన ధ్యాకృతి వచ్చులాగున చేసి. (Backing Boards) అనిచెప్పబడు కొయ్యపలకలను పుస్తకముయొక్క వీపునకు ముప్పీసము అంగుళము యెడమున నిరువైపులను పటములో కనుపరచిన విధమునచేర్చి ప్రెస్సులో బిగించవలయును.

౧౦-వ పటము.




ఏ. వీపుచేయబడిన భాగము.

బి.బి. వీపుచేయుటవలన పుస్తకపు వీపు భాగమున నిరుప్రక్కలను పైకిపెరిగిన కోణములు. (ఇవి పైకిపెరుగుటచే పుస్తకముపై కట్టబడు నట్టలయొక్క దళసరి వీనిలో నిమిడియుండి పుస్తకపు వీపు అట్టలతో కలసి మట్టముగానుండును).

సి.సి. వీపు పలకలు. (Backing Boards).

డి.డి. ప్రెస్సు దిమ్మలు.

ఇందుకు ౧౨వ పటములోఁ గనుపరచిన ప్రెస్సు నుపయోగింపవచ్చును. తరువాత వీపుచేయుసుత్తితో (Backing Hammer) పైనచెప్పబడిన విధమున వీపుభాగమున దృఢముగాను, నున్నగాను అర్ధవలయాకారము పటములో చూపబడిన విధమున వచ్చువరకు మెల్లగా కొట్టుచుండ వలయును. తరువాత దీనికంతటను జిగురురాచి యీవీపుయొక్క కొలతకు సరిపోగా నిరుప్రక్కల నొక్కొక యంగుళమెక్కువగాను, పైభాగమునను క్రింది భాగమునను ౧ అంగుళము తక్కువగా నుండునంత సైజుగుడ్డనుగాని మరియేగట్టి గుడ్డనుగాని దానిపై నంటించ వలయును.

వీపు యేర్పడిన తరువాత చేయుపని అట్టల నతికించుట. ఇందుకు మిల్బోర్డ్లు (Millboards) లనఁబడునట్టలు మిక్కిలి ప్రశస్తమైనవి. ఇప్పుడు వీనికంటె తక్కువ వెలగల గడ్డియట్టలను (Straw boards) వాడుచున్నారు. ఇవి ౨౫ x ౩౦ అంగుళముల కొలతగలిగి ౧ పౌను మొదలు ౨౧ పౌనులవరకు బరువు కలిగి యుండును. బరువు హెచ్చినకొలఁది వీని దళసరి హెచ్చుచుండును. మిక్కిలి పలుచని పుస్తకములకు ౧పౌను అట్టలను సాధారణపు పుస్తకములకు ౧౦పౌను అట్టలును పెద్దపుస్తకములకు ౨ లేక ౨౧ పౌనుఅట్టలునుఉపయోగించఁబడు చుండును. పైన చెప్పఁబడిన యట్టలలో దేనినైనను తెచ్చి పుస్తకముయొక్క కొలతకు వీపు భాగమునకు గాక తక్కిన మూఁడు భాగములకంటె సుమారు ముప్పీసము అంగుళముపైని మిగిలి యుండులాగున కొలతవైచి ఆకొలతకు సరిగా రెండుముక్కలను తెగకొట్టవలయును. తరువాత వీనినిపుస్తకమున కిరువైపుల సమముగాఁజేర్చి పుస్తకము కుట్టునప్పుడు ఒక్కొక్క యంగుళము కొస మిగిలియున్న యడ్డదారములనువీపుపై నంటింపఁబడిన గుడ్డకు బెజ్జముచేసి దాని ద్వారమున పైకి తీసి వీనికి సరిగా నట్టలకు పైనుంచి యేటవాలుగా నొక బెజ్జము చేసిపై దారములను దానినుండి పైకిలాగి వానిపైన విప్పి

యట్టలపై నంటించవలయును. వీపున కంటించిన గుడ్డయొక్క రెండంచులను పుస్తకము యొక్క రెండు రెక్క కాగితములకు (Fly leaf) నంటించవలయును. తరువాత పుస్తకముల నిమిత్తము సిద్ధము చేయబడిన తోలునుగాని కాలికో గుడ్డనుగాని అన్ని వైపుల నట్టలకంటె ౻ అంగుళము యెక్కువగా నుండులాగున కొలతవైచి రెండువైపులను నిడి యొక్కటే వచ్చులాగునజూచి కత్తిరించి క్రింది ౧౧ వ పటములోఁ గనబడుచున్న విధమున ముందుగా నొక యట్టపై నంటించి పుస్తకపు వీపుతో సమాన కొలతగల బిరుసైన దళసరి కాగితము ను పుస్తకపు వీపు భాగమును కప్పునట్టుగుడ్డ లోపల నంటించి పిమ్మట రెండవవైపుననున్న యట్టకు తక్కిన గుడ్డనంటించవలయును.

౧౧-వ పటము.




ఎ. పుస్తకము. బి.బి. అట్టలు. సి. కాలికో గుడ్డ. డి. అట్టలోపలకు మడచి యంటింపబడిన కాలికో గుడ్డయంచు. (మిగిలిన యంచులను కూడనిట్లేయంటించ వలయును) ఇ. అట్టలలోనికి యెక్కించ బడిన (పుస్తకపు) అడ్డుదారములు. ఫ. రెక్క కాగితముల కంటించ బడిన వీపుగుడ్డ.

తరువాత గుడ్డయొక్క యంచుల నన్నిటిని మూలలకు కత్తిరించి యట్టలలోపలకు మడచి యంటించి పుస్తకమునకు రెండువైపుల నంటించబడియున్న రెక్క కాగితముల పైపొరలట్టలకంటించి చక్కగా నణగియుండుటకు ప్రెస్సులో నదిమి యుంచి తీయవలయును.

ఇప్పటికి దాదాపుగా నట్టకట్టుపని పూర్తియైనదనియే చెప్పవచ్చును. ఇఁకను దీనిపై యలంకరణములు కొన్ని యున్నవి. అవేవన: అట్టలపై నంచులను చిత్రించుట, వీపుపైఁగొన్ని మట్టములను, చిత్తరువులను, పేరును వేయుట మొదలగునవి. వీనిలో నట్టలపై నంచులు వేయుటకుఁ బ్రథమమున నీక్రింది పటములోఁ

౧౨-వ పటము.



పుస్తకపు అట్టపైచేయబడు చిత్రములు.

జూపఁబడిన రీతిని నాలుగు మూలలయందును తీపనికొరకు నిర్మింపఁబడిన యచ్చుదిమ్మెలను సమముగాఁ జేర్చి గట్టిగా నదుముగా నాటియా

కృతి దానిపై నొక్కఁడు పడియుండును. ఈ మూలలమధ్య నుండుమట్టములను గానీ, లత లనుగాని, వానికొఱకుఁ జేయఁబడిన పిడిగల చక్రములనదుముము దొర్లించుట వలనఁగాని (Palettes) పేలట్లతో నదుముట వలనఁగాని యేర్పరుప వచ్చును. ఈపనిముట్లలో పెక్కు రకముల చిత్తరువులు చెక్కఁబడి యుండును. ఈ పనినంతయు నట్టలకు గుడ్డనంటించిన పిమ్మట నాతడిఆరకముందు లోపల నెఱవేర్చ వలయును. (నవీన పుస్తకములకు సాధారణముగా నీపనిచేయ) బడుటలేక పోయిననుపని వారలకు తెలియు నిమిత్తము వ్రాయఁబడినది.

పుస్తకపు వీపునపట్టములను గాని చిత్రములను గాని పేరునుగాని క్రింది పటములోఁ గనఁబఱచిన విధముగా వేయఁదలఁచినయెడల పుస్తకమును వీపుభాగముపైకి కనుపడులాగున నొకప్రెస్సులో బిగించి బంగారు రేకును (Gold leaf) సన్నపేలికలుగాఁగత్తిరించిపైన చెప్పిన మట్టములు, పేర్లు, మొదలగు చోట్ల నతి జాగ్రత్తగాఁజేర్చి పైన పేర్కొనఁబడిన పేలట్లను బాగుగా వేడియెక్కునటులఁగాచి వెంటనే బంగారు రేకుపై నుంచి గట్టిగానదుముట వలన నీ పనిముట్టుయొక్క వేడిచే బంగారు రేకుకఱఁగి యచ్చుతో నొక్కఁబడినంత భాగము జక్కగాపుస్తకమున కంటుకొని యుండును. పేరు వేయుటకును తడితోఁబోయఁబడిన యక్షరములను పిత్తళాక్షరభాజన (Brass Type holder) అను పనిముట్టులో సరిగాఁగూర్చిపైప్రకారము వేడిచేసి బంగారు రేకుమీఁదుగా నదుమవలయును. అచ్చుతో నొక్క

౧౩-వ పటము.




పుస్తకపు వీపుపై చేయబడు చిత్రములు, పేరు మొదలగునవి.

బడిన భాగమునకుపైగానున్న నొక్కఁబడని బంగారు రేకునుకుంచెతో మెల్లగాఁదుడిచిన యెడల రాలిపోవును.

శ్రీ. తి. వీ.

**అట్టపాడి లోయ.**—ఇది యొక లోయ, లేక, కనుమకు పేరు. చెన్న రాజధానిలోని మలబారు జిల్లాకు చెందిన వలవనాడు జిల్లాలో నున్నది. దీని వైశాల్యము సుమారు ౨౫౦ మైళ్లు. భవాని నది దీనిలో ప్రవహించుచున్నది. ఈ ప్రదేశము నందు జనులు చలిజ్వరములుచే బాధపడెదరు.

**అట్టహాసము.** భారత వర్షీయ తీర్థము.

**అటారి.** ఇది పంజాబు రాష్ట్రమందలి ముల్టానుజిల్లాకుఁజెందిన కబీర్వాలాతాలూకాలోని యొక గ్రామము. మహాఅలెగ్జాండరు హిందూదేశముపై దండెత్తివచ్చి స్వాధీనపఱచుకొనిన పట్టణములలో మూఁడవది ఇదియే. ఇప్పు డిచ్చట శిథిలమగుచున్న కోటయొకటి కలదు.

**అట్బారానది.** అబిసీనియాలోనిది. నైలునది యొక్క ఉపనది, నిడివి ౫౦౦ మైళ్లు. దీనియొద్దున అట్బారా యుద్ధము జరిగెను.

**అట్లాంటా.** అమెరికా యందలి యునైటెడ్ స్టేట్సులోని జార్జియాయను భాగమునకు ముఖ్యపట్టణము. ఇచ్చట నుండి పొగాకు, ప్రత్తి, ఎగుమతి యగును. ఇచ్చట యంత్రములు విక్రయించుట, యంత్రసాధనములు చేయుట, నున్నితమైన కొయ్య సామానులు చేయుట, కాగితములు చేయుట, ప్రత్తిపనులు, ప్రత్తిగింజలు నూనె తీయుట, మొదలగు వ్యాపారములు గలవు. ఇచ్చట ౧౮౭౦వ సంవత్సరమున క్లార్కు సర్వకళాశాల ప్రతిష్ఠింపబడెను. ౧౮౮౮వ సంవత్సము నీగ్రో జాతివారైన నల్లమనుష్యులకు అట్లాంటా సర్వకళాశాలయు నిచ్చట స్థాపింపఁబడియుండెను.

## అట్లాంటిక్ మహాసముద్రము.

మన ప్రపంచము భూభాగమనియు జలభాగమనియు వ్యవహరింపబడు రెండుముఖ్య విభాగములుగ కన్పించుచున్నది. అందు జలభాగము మూడింట రమారమిగ రెండుపాళ్లని చెప్పవచ్చును. స్థూలదృష్టితో వర్ణించవలసినచో భూభాగమంతయు జలభాగమునుండి పైకుబికి వచ్చియుండు ద్వీప మనిన నంతవిపరీతముగా నుండదు. ఈ ద్వీపముయొక్క చుట్టును వంకర టింకరగా సముద్రము ఆవరించియున్నదనుట పై వర్ణనచేతనే స్పష్టము. ఇట్లా వరించియుండు జలభాగమును ఒక్కటిగ వ్యవహరించుటగాని అనామకముగా వ్యవహరించుటగాని మానవుని కార్యములకు అనుకూలము కానందుచేత భూభాగమును ఖండములుగా విభజించి వ్యవహరించునట్లే దీనినికూడ ఖండములుగా విభాగించి వ్యవహరించుచున్నాము. ఈ ఖండములకే మహాసముద్రములని పేరు.

ఇట్టి మహాసముద్రములలో నొకటి అట్లాంటిక్ మహాసముద్రము. విస్తీర్ణమున అట్లాంటిక్ మహాసముద్రము మొదటిది కాకున్నను ఇతరవిధముల నిదియే మిక్కిలి ప్రముఖమనుటకు సందేహము లేదు. ఆకారమున నీ మహాసముద్రము అవగ్రహమును S పోలియుండును. ఇది ఉత్తర అమెరికా దక్షిణఅమెరికా తూర్పు తీరములను ఐరోపా ఆఫ్రికాల పశ్చిమతీరమును నొరసికొని ఉత్తరమున ఉత్తరమహాసముద్రముతోను దక్షిణమున దక్షిణమహాసముద్రము హిందూమహాసముద్రముల తోను కలిసిపోవుచున్నది. ఈ మహాసముద్రపు విస్తీర్ణము రెండుకోట్ల యేబదిలక్షల చదరపు మైళ్లు. ఈ మహాసముద్రమున నుండు గొప్పవిభాగములు కొన్ని కలవు. అట్టివానిలో పడమటి పార్శ్వమున కరిబియన్ సముద్రమును మెక్సికో సింధుశాఖయు సెంటులారిన్సు సింధుశాఖయు హడ్సను మహాఖాతమును తూర్పుప్రక్కన మధ్యధరాసముద్రమును నల్లసముద్రమును ఉత్తరసముద్రమును బాల్టిక్ సముద్రమును పేర్కొనదగినవి.

ఈ అట్లాంటిక్ మహాసముద్రమును రెండుముఖ్య విభాగములుగ వర్ణింపవచ్చును. ఉత్తరఅట్లాంటిక్ మహాసముద్రము, దక్షిణ అట్లాంటిక్ మహాసముద్రము. ఉత్తర అట్లాంటిక్ మహాసముద్రమును ఉత్తరమహాసముద్రముతో కలుపునట్టి మార్గములు నాల్గు కలవు. ౧ హడ్సను జలసంధి; వెడల్పు రమారమి అరువది మైళ్లు. ౨ డేవిస్ జలసంధి; వెడల్పు రెండువందలమైళ్లు. 3 డెన్మార్కుజలసంధి; గ్రీన్లాండు ఐస్లాండుమధ్య వెడల్పు ౧౩౦ మైళ్లు ౪ నార్వేజియన్ సముద్రము; ఐస్లాండు నుండి నార్వే ఉత్తరతీరము వరకు వెడల్పు రమారమి ౪౦౦ మైళ్లు. ఈ నాలుగు మార్గములు అట్లాంటిక్ మహాసముద్రము నుండి ప్రారంభమగు ప్రదేశమున ఉత్తరట్లాంటిక్ వెడల్పు ౬౦వ అక్షాంశము వద్ద ౨౦౦౦ మైళ్లు; ౫౦వ అక్షాంశమునకు వచ్చునప్పటికి ఐర్లాండు న్యూఫౌండులాండ్లకు మధ్య ఈ వెడల్పు ౧౭౫౦ మైళ్లకు తగ్గుచున్నది. అచ్చటనుండి మరల హెచ్చుచు ౪౦ వ అక్షాంశము వద్ద ౪౧౦౦ మైళ్లు అగుచున్నది. భూమధ్య రేఖ వద్దకు వచ్చునప్పటికి దక్షిణ అమెరికా యందలి సాన్‌రోక్ అగ్రమునుండి పశ్చిమ ఆఫ్రికాలోని పాల్మాస్ అగ్రమువరకును ౧౬౦౦ మైళ్లు వెడల్పు కన్పించుచున్నది. ఈ విధముగా వెడల్పు విభేదములచేతనే ఉత్తరట్లాంటిక్ చుట్టునుండు తటరేఖ యెంతవంకరటింకర అయినదియు నెంతనిడివైనదియు సూచితమగుచున్నది.

ఈ విషయమున ఉత్తరట్లాంటిక్‌నకును దక్షిణట్లాంటిక్‌నకును మిక్కిలి తారతమ్యమున్నది. దక్షిణట్లాంటిక్కునందు భూమిలోనికి చొరబడు అఖాతములుగాని సముద్రములుగాని సింధుశాఖలుగాని లేనే లేవు. దానినానుకొని యుండు తటరేఖయు నే మాత్రము వంకర టింకరలను ప్రదర్శిం

చుటలేదు. దక్షిణమహా సముద్రముతో చేరుచోట వెడల్పు ఎక్కువ. దక్షిణ అక్షాంశరేఖ ౩౫ న వెడల్పు ౩౭౦౦ మైళ్లు.

ఈ మహాసముద్రమునకు తూర్పు పడమరలలో నుండు భూఖండముల ఏటవాలు ఈ సముద్రపు వైపునకే అగుటచేత ఆ భూఖండములయందు ప్రవహించు ముఖ్యనదీనదములలోననేకములు ఇందు ప్రవేశించుచున్నవి. అందుచేత ఆ భూఖండములపైబడు వర్షపాతమున విశేషభాగము ఈ మహాసముద్రమును చేరుచున్నది.

సెంట్ లారిన్సు, మిసిసిపీ, ఒరినాకో అమోజాన్, కాంగో, నైజర్, ల్వారు, ర్హైను, ఎల్బు, మధ్యధరా సముద్రమున సంగమించు రెండు నదులు బాల్టిక్ సముద్రమున సంగమించునదులు ఇవన్నియును అట్లాంటిక్ మహాసముద్రములోనికి తమజలములను జేర్చునవియె. రమారమి ౧౩౫౦౦౦౦ చదరపుమైళ్లు భూభాగమునుండి ప్రవహించు జలమంతయు ఈమహాసముద్రములోనికి చేరుచున్నదని లెక్క వేసియున్నారు.

సముద్రభాగమును భూభాగమువలె మిట్టపల్లములై చిత్రవిచిత్రములుగా పరగుచున్నది. భూతలముపై సముద్రమట్టము మొదలు ఘనహిమాలయమునందలి ఎవరెస్టు శిఖరము (రమారమి ౬ మైళ్లవరకును) మిట్టపల్లము లేర్పడునట్లె జలభాగమునందును భూమట్టము మొదలు పసిఫిక్ మహాసముద్రమున ఒక్కెడ ౬ మైళ్లకుపైబడి లోతుపల్లము వరకును మిట్టపల్లములు కలవు. ఈ కారణముచేత సముద్రమట్టమునకుపైన గన్పించు భూభాగమువలెనే సముద్రమున లోపలగూడ నొక్క భూభాగమున్నది. ఇది ఎత్తుగనుండి భూఖండమునకు అంటి కొంతదూరము మిక్కిలి యెక్కువగు పల్లముగ మారువరకును కాంటినెంటల్ షెల్ఫు (అనగా భూఖండ సంలగ్నమను) పేరున బరగుచున్నది. ఈ భూఖండసంలగ్నముగాక అచ్చటచ్చట భూతలముపై కొండవరుసలు, పీఠభూములుండురీతినే సముద్రాంతర్భాగమునను ఉచ్చస్థానములును మిట్టవరుసలును గలవు.

అట్లాంటిక్ మహాసముద్రమున పైన జెప్పబడిన అవగ్రహాకారమును అనుసరించుచునే ఆవలి ఈవలిగట్టులకు నట్టనడుమన ఉత్తరము ౫౦-వ అక్షాంశరేఖకును దక్షిణము ౫౦-వ అక్షాంశరేఖకును మధ్య నొక మిట్టలవరుసగలదు. ఈవరుస యున్నంతదూరమును సముద్రపులోతు రమారమి ౧౭౦౦ బారలు. ఈ మిట్టలవరుస ఉత్తరపు చివరను విరివియై ఎత్తై సముద్రముమీదికి పొడసూపి అజోర్సు దీవులుగా పరిణమించుచున్నవి. ఆ ప్రాంతమునన ఈవరుస తూర్పుపడమరలకు తిరిగి ఐరోపాలోని ఐర్లాండునుండి ఉత్తర అమెరికా లోని న్యూఫండుల్యాండువరకును వ్యాపించుచున్నది. సముద్రముగుండా వార్తలనంపవలసివచ్చినయెడల తంత్రులనువైచుటకు సముద్రములోని ఎత్తుప్రదేశము లేఆధారముకావలెను. అట్టి ఆధారము తూర్పుపడమరలకువ్యాపించిన

మిట్టలవరుస. ఉయ్యుండుటచేత దానికి టెలిగ్రాఫుల మిట్టయని పేరుపడియున్నది.

పైన వర్ణింపబడిన అవగ్రహాకారముగు మిట్టలవరుసల యిరుప్రక్కలను కొలచి గ్రహించుమిగా భూఖండముల దరివరకును అనగా నిదివరకుచెప్పిన భూఖండ సంలగ్న మద్దు దాకువరకును అగాధమైన లోతులు కలవు. ఇవి ఒక్కొక్క ప్రదేశమున నొక్కొక విధమాయి కన్పించుచున్నవి.

దక్షిణాట్లాంటిక్ అంతర్భాగము నందలి మిట్టపల్లముల విషయమై ఇంకను పరిశోధనలు జరుగుచునే యున్నవి.

అట్లాంటిక్ మహా సముద్రమునందు విశేషముగా పేర్కొనదగిన దీవులెన్నో లేవు.

మధ్య ధరాసముద్రమునందలి కొన్ని దీవులును, ఐసుల్యాండును, బ్రిటిషుదీవులును, అమెరికాలోని న్యూఫౌండుల్యాండు పశ్చిమ ఇండియా దీవులును ఫాల్కులాండుదీవులును, భూమండలమునకు అనతిదూరమున భూఖండమునకు చేరినట్లే యెన్నదగి యున్నవి. మధ్య సముద్రమునందు దీవులగుంపులును కలవు. అందు:—అజోర్సుదీవులు, మెడీరాదీవులు, కన్నరీదీవులు, కేప్‌వర్డుదీవులు, అసెంషన్‌దీవి, సెంట్‌హెలీనాదీవి మున్నగునవి కలవు.

ఉష్ణత:—సముద్రజలమునకు వేరువేరు భాగములయందు వేరువేరు ఉష్ణము కాన్పించుచున్నది. ఇందుకు కారణము లనేకములు కలవు. భూమధ్యరేఖకు సమీపమున నుండుట దూరమున నుండుట మాత్రమేగాక ఆయా ప్రాంతములయందు సముద్రములోనికి పడు నీటిప్రవాహములను బట్టియు, అందు కలిసి వచ్చు ఉప్పు మొదలగు పదార్థముల పరిమాణమును బట్టియు, సముద్రపునీటికి ఉష్ణతను గ్రహించు విడుచు శక్తులు మారుచుండును. అట్లగుటచేత సముద్రపునీటిని పరిశీలించినప్పుడు ఉష్ణత భిన్న భిన్నముగా వ్యాపించుట కానవచ్చుచున్నది. అట్లాంటిక్ మహాసముద్రము నందలి ఉష్ణతను వర్ణింపవలసినచోట ఉత్తర దక్షిణములను వేరుచేసివర్ణింపవలసియున్నది.

ఇందులో ఉత్తరట్లాంటికున అధికతమోష్ణత ఆఫ్రికాఖండ పరిసరమున అయిదవ ఉత్తరఅక్షాంశ రేఖకడ ప్రారంభించి రమారమి పడమట ౨౦-వ ధ్రువరేఖ వరకును పోయి అచ్చటనుండి కరీబియన్ సముద్రప్రాంతమున జేరుచున్నది.

అచ్చట ఉష్ణత ౮౦ డిగ్రీలు ఫారన్‌హీటు; అచ్చట నుండి కొంచెము ఈశాన్యమునకు పోయినయెడల ఉష్ణత తూర్పువైపునకు తక్కువగుచు పడమటివైపునకు హెచ్చుగను కన్పించుచు ఉ. అ. ౨౦ చేరునప్పటికి తూర్పునుండి పడమరకును ఒక్కసమానముగా ౬౦ డిగ్రీలు అగుచున్నది.

ఇదేరీతిని కొన్ని విభేదములతో తగ్గుచు ఉత్తరమహాసముద్రము చేరుసప్పటికి ఉష్ణత కొంచె మించుమించుగా క్రొనరాక పోవు చున్నది.

దక్షిణ అట్లాంటిక్ మహాసముద్రము నందు ఉష్ణత ఉత్తరట్లాంటిక్ నందువలె మిక్కిలి విభేదములకు ఆకరముగాదు. భూ మధ్యరేఖకు దగ్గిరగానుండు ప్రదేశములలో ఉష్ణమెక్కువగాను సమోష్ణతారేఖ వంకర గాను కన్పించుచున్నది.

ఇంకనుదక్షిణమునకు పోయినకొలదిఉష్ణము తగ్గుచు సముద్రమున తూర్పునుండి పడమరకు సమానమగుచున్నది.

సముద్ర పదార్థములలో ఉప్పు మిక్కిలి సాధారణమైనది. అదెచ్చటెచ్చట ఎక్కువగా నుండునో అచ్చటచ్చటజలము ఎక్కువకటు వుగానుండును. అట్లాంటిక్ సముద్రమంతయు మొత్తముమీద అన్ని మహా సముద్రముల కంటె ఉప్పు దనమునకు పేరుపడి యున్నది. ఈ అట్లాంటిక్ మహాసముద్రమునకునుకూడ. ఉత్తరట్లాంటిక్ మహాసముద్రమున ఉ-అ-౨౦-౩౦ లకునడుమనుండు భాగమును, దక్షిణ మహాసముద్రమున ద-అ-౧౦-౨౦ కి మధ్య నుండుభాగమును ఈ రెండు భాగములును పేర్కొనదగినవి.

ఈ భాగములకు ఉత్తరమునను దక్షిణ మునను పోనుపోను ఉప్పు దనముతగ్గుచు హెచ్చుచున్నది.

ఉష్ణతయందువలె ఉప్పుదనము విషయ మునగూడ కొన్ని విభేదములు ఉ. అ. మహా సముద్రమున కన్పించుచున్నవి.

అందులో నుత్తరమున తూర్పుభాగమున నెక్కువ ఉప్పుదనమును కన్పించుటయు పశ్చిమభాగమున అట్లు లేకుండుటయు కాన నగును. ద-అట్లాంటిక్ నందు ఇట్టి భేదము లేక తూర్పునుండి పడమరవరకును ఒకేవిధ ముగు ఉప్పుదనము దక్షిణమునకు పోయినకొలది నుతగ్గుచు దక్షిణ అమెరికా దక్షిణతమ భాగములయందు సముద్రజలము కొంచె మించుమించుగా ఉప్పులేనిదనియే చెప్పవలసి యున్నది.

"సముద్రముల యందు జలమొకచోట నుండి మరియొకచోటికి ప్రవహించుచున్నది. ఇట్టి ప్రవాహములకు ముఖ్యకారణములు రెండు.

(౧) వాయువులు :—వాయు లేవైపునకు వీచునో నావైపునకే సముద్రమందలి జలము కూడ ప్రవహించుచుండును.

(౨) ఉష్ణత:—భూమధ్యరేఖసమీపమం దుష్ణత మెండగుటచే, నచ్చటిజలము వేడి మెక్కి పలుచనయి, ధ్రువములవైపు ప్రవ హించును. భూమి పడమరనుండి తూర్పునకు తిరుగుచుండుటచే నీ ప్రవాహములదిక్కులకు కూడ మార్పులు గలుగుచున్నవి."

అట్లాంటిక్ మహాసముద్రమున వాణిజ్య వాయువులను వాయువులు వీచుచున్నవి.

ఇందులోనొక్కటి ఉత్తరార్ధ గోళమున ౩౦ వ అ-ప్రాంతమున ప్రారంభమయి ఈశాన్య మూలనుండివీచును. మరియొక్కటిదక్షిణగోళమున౩౦ అ నుండిప్రారంభమయి ఆగ్నేయము నుండివీచును.

ఈ వాయువులచేతను భూభ్రమణము చేతను పైచెప్పిన ఉష్ణతకారణము చేతను అట్లాంటిక్ మహాసముద్రమున ప్రవాహము లేర్పడి యున్నవి.

" వాణిజ్యవాయువులును భూభ్రమణమును, కలిసి ఆఫ్రికాఖండతీరములనుండి దక్షిణఅమెరికా తీరములవరకు ఉష్ణజలప్రవాహములను పుట్టించుచున్నవి. బ్రెజిలులోని సెంటురోకు అగ్రసమీపమున, పడమటికిపోవుచున్న ప్రవాహము రెండుపాయలుగా-చీలి, యందొకటి బ్రెజిలుతీరముల మీదుగాను, రెండవది గయానాతీరముల మీదుగాను పోవుచున్నవి. (పటమును చూడుడు) అందు రెండవపాయ, ఈశాన్య వాణిజ్యవాయువుచే గలిగిన ప్రవాహముతో కలిసి, మెక్సికో ఖయుకాగ్ర కుడములోనికి పోయి, అచ్చటనుండి ప్రసిద్ధిగాంచిన గల్ఫ్‌స్ట్రీమ్ అనుపేర, ముప్పదిమైళ్ల వెడల్పును, ౮౮౦ గజములలోతును, గంటకు నాలుగుమైళ్ల వేగమును, ౮౦ డిగ్రీలవేడిమియును, మనోహరమైన నీలవర్ణమును గలిగి బయలుదేరుచున్నది. ఇట్లు బయలుదేరి ఈశాన్యమూలకు, వెడల్పు అధికమగుచు వేడిమియు, లోతును, వేగమును తగ్గుచుపోవును. న్యూఫౌండులాండు సమీపమున దీనివెడల్పు ౩౨౦ మైళ్లు. అట్లాంటిక్ సముద్రమందు, ౪౭ అక్షాంశమందు రెండు భాగములుగా చీలి, యొకటి, బ్రిటిషు దీవుల యొక్కయు, నార్వేదేశముయొక్కయు, పశ్చిమతీరములందు ప్రవహించును. ఈ ప్రవాహమందలి ఉష్ణతయు జలముచేతనే; పైదేశములయందు అక్షాంశమునుబట్టి యుండవలసినంత చలిలేదు. రెండవభాగము దక్షిణమునకు తిరిగి, పోర్చుగలు దేశముయొక్కయు, ఆఫ్రికాఖండముయొక్కయు, పశ్చిమ తీరముల ప్రవహించి, ఈశాన్యవాణిజ్య వాయువుచే కలిగినప్రవాహముతో కలిసిపోవును.

ఉత్తరమహాసముద్రమునుండి, గ్రీన్‌లాండు దేశమునకు పడమటి ప్రవాహమును, తూర్పుప్రవాహమును, కలియుటచే నేర్పడిన శీతజల ప్రవాహము, లాబ్రెడారుప్రవాహమను పేర, ఉత్తరఅమెరికాతీరములకును గల్ఫ్‌స్ట్రీమునకును మధ్యను ప్రవహించి, గల్ఫ్‌స్ట్రీము ప్రవాహములో కలిసి నశించిపోవుచున్నది." [గా. హ.]

**అట్లాంటిక్ సిటీ.** అమెరికాలోని యునైటెడ్ స్టేట్సునందలి న్యూజర్సీ మండలమున కలదు. ఆరోగ్యవంతమగు పట్టణము. వినోదార్థము జనులు అచ్చటకిబోయి యుందురు. ౧౮౭౭ వ సంవత్సరమున నీ పట్టణమునకు అగ్నిబాధ కలిగెను.




**అట్లాసుపర్వతములు.** ఆఫ్రికాఖండమునందు వాయవ్య భాగమునందు పర్వత సమూహమునకు నీపేరు. మొరాకోయందలి నన్ను అనుఅగ్రమునుండి ట్యూనిసునందలి బానుఅగ్రమువరకును నీపర్వతములు కలవు. దీని యొక్క పంక్తియని వర్ణించుటకు వీలు లేదు. పీఠభూములును ఉచ్ఛ్రయ భూములును మధ్య మధ్యను నొప్పుచుండ గుములుగుములుగానుండు పర్వతసమూహములన్నిన వీనిని వర్ణించినవార మగుదుము. ఈ పర్వతములను రెండువిభాగములు చేయవచ్చును.

౧: మొరాకో అట్లాసుపర్వతములు ౨. ట్యూనిస్ఆల్జీరియాల అట్లాసుపర్వతములు ఈ రెంటనెచ్చటను ౧౧౧౦౦ అడుగులను మించిన యెత్తుగల శిఖరములేదు. మొరాకో అట్లాసులోని టిజిటూంజుర్తు అను శిఖరమును టిజిలుకూంటుఅను శిఖరమును పేర్కొనదగినవి. ఈ అట్లాసుపర్వతములలో అగ్ని పర్వతములు భయమేమియును లేదు. మంచు ఎల్లప్పుడును కప్పియుండు శిఖరములు యెన్నియో లేవు. ఈపర్వతములయందలి యుపత్యకములు మిక్కిలి ఫలవంతములు. ఉపత్యకముల నానుకొనియుండు పర్వతముల కీభాగములు మంచి యడవులచే నావృతములైనున్నవి. ఈ పర్వతములందలి లోహ గనులనింకను త్రవ్వియుండ లేదు.

**అట్కిన్ సన్** (ఎడ్విన్ ఫెలిక్సుతామస్.) ఈతఁడు బాల్యమునందు డబ్లిను నగరమందలి ట్రినిటీ కళాశాలలో విద్య నభ్యసించెను. ఇండియను సివిలు సర్వీసుపరీక్షలో కృతార్థుడైనతర్వాత ౧౮౬౨ లో హిందూదేశమునకు వచ్చి పశ్చిమోత్తర పరగణాల నుద్యోగమునఁ బ్రవేశించెను. ౧౮౮౧ లో అక్కడనే సెన్ససు ఆఫీసరయ్యెను. ఈతఁడే ఆపరగణాల ఇంపీరియల్ గజటీర్ అను గ్రంథమునకు సంపాదకుఁడు. తరువాత కొంతకాలము ఈతఁడు బంగాళా దేశములోను, పశ్చిమోత్తర పరగణాలలోను అక్కౌంటెంట్లు జనరలు ఘనియుండెను. ౧౮౯౦ సం॥ లో మరణించెను.

**అట్కిన్ సన్** జేమ్సు. (౧౭౮౦-౧౮౫౨.) ఈతఁడు ౧౭౮౦ లో జన్మించెను. బాల్యమున లండను, ఎడింబరో నగరముల వైద్యవిద్య నభ్యసించి ౧౮౦౫ లో బంగాళా మెడికలు సర్వీసులోఁజేరి ౧౮౧౩ లో బకర్గంజ్ లో సివిల్ సర్జనుఆయెను. ఈతఁడు పెరిషియను భాషనభ్యసించి ఆభాషలోనె చాలగ్రంథముల రచించుటయేగాక ఆ భాషలోని చాల గ్రంథములను ఇంగ్లీషులోనికి తర్జుమా జేసెను.

కొంతకాల మీతఁడు ఫోర్టు విల్లియము కళాశాలలో పెరిషియను భాషను బోధించు ప్రొఫెసరుగనుండెను. తరువాత నీతఁడు తిరిగి సర్జను పదవిలోచేరి ఉత్తర ఇండియాలో చాలచోట్ల ఉద్యోగముఁ జేసెను. ౧౮౪౨లో ఈతఁడు 'అంగ్లేయులు ఆఫ్ఘని స్థానముపై దండువెడలుట,' అను గ్రంథమును వ్రాసెను. ఈతఁడు ౧౮౫౨ సం॥ మున చనిపోయెను.

**అటిట్లన్.** మధ్య అమెరికా గాటిమాలలో నొక సరస్సు. ౨౪ మైళ్లు నిడివి; వెడల్పు ౧౦ మైళ్లు. దీనికి దక్షిణకొసను అటిట్లన్ అగ్నిపర్వతముగలదు. దాని యడుగున సాంటియాగోడీ అటిట్లన్ అను పట్టణమున్నది.

**అట్టిలా.** హూన్సు అను ఒకజాతివారి నాయకుడు (క్రీ. ము. ౪౦౬-౪౫౩) ౪౩౪-వ సంవత్సరమున బలవంతముగా రాజ్యము

గాని తన సహోదరునితో కలహము చేసి తుదకు మోసముగా చంపించెనని సహితము కొందరు చెప్పుదురు. తన జీవితకాలమంతయు దండయాత్రలు చేయుటయందును, యుద్ధములు చేయుటయందును కాలముగడుపుచు కొంతవరకును ఏకచ్ఛత్రాధిపత్యముగా నేలెననియే చెప్పవచ్చును. ఇటలీ, రోం, మొదలగు దేశములసహితము నితడనిన భీతిచెంది యుండిరి. ఇతడు రోంమీదికి దండయాత్రకు వెళ్లదలచి ప్రయత్నము చేయుచుండెనుగాని అకస్మాత్తుమరణము తటస్థించెను.

౪౫౩-వ సంవత్సరము బర్గండిగాజపుత్రికను వివాహమాడి ఆరాత్రియె అకస్మాత్తుగ మృతిజెందెను. హున్నుతెగవారికి మిగుల ధీరులని ప్రఖ్యాతిగల్గుటకు ఇతని ధైర్యసాహసములే కారణము.

ఈ జాతివారిలో కొందరు హిందూదేశ ద్దండయాత్ర సహితము చేయ సమకట్టిరి.

**అటోక్లిసు.** క్రీ. పూ. ౪-వ శతాబ్దమున నితఁడు గొప్పవక్తయు, సేనానాయకుఁడుగను నున్నవాఁడు. ౩౭౧-వ సంవత్సరమున స్పార్టను జాతివారితో స్నేహము చేసి ౩౬౨-వ సంవత్సరమున గ్రీసుదేశము మీఁదికి దండయాత్ర వెడలెను.

**అటోలికస్.** ఇతఁడు గ్రీసుదేశముయొక్క పురాణపురుషుఁడు. ఇతనితండ్రిపేరు హెరంసు. ఇతని కూతురగు అంటిసీలియకు ఒడీసియస్ అనుపుత్రుఁడు పుట్టెను. ఇతఁడు టక్కు, టమార విద్యల సాటిలేని శూరుఁడు. మాయయు, మోసమును నితనికిపుట్టినిల్లు. ఇతఁడొక సమయమున దొంగిలించి దొంగిలించిన సొత్తులను చాటుపర్చి తానుసహితము దాఁగికొనెను. తుదకు సిసిఫస్ అను వాఁడీతని గనిపెట్టెను.

౨. అటోలికస్. పై శేణియందు నున్న గ్రీకుదేశీయుఁడు. గొప్పజ్యోతిష్కుఁడు. ఇతడు సూర్యాది గ్రహములను గణించి రెండు పుస్తకములను వ్రాసియున్నాఁడు.

**అఠిదము.** భారత వర్షీయదేశము. (భార. భీష్మ. అ. ౯.)

**అడవులు.** మామూలు మాటలలో అడవిఅనగా నేమో అందరు ఎరిగినదేగాని సర్కారు లెక్కలు దాఖలాగాగాని, శాస్త్రరీత్యాగాని అడవిఅనగానేమి అని ప్రశ్న వేసినయెడల నీ దిగువవిధమున వివరింపవచ్చును. ఒక దేశమునందు కలపయొక్కగాని, అడవిదినుసులయొక్కగాని శీతోష్ణాది స్థితులయొక్కగాని అభివృద్ధినిమిత్తమై ప్రత్యేకముగా నిరూపణ చెంది యున్న ప్రదేశములకు అడవులనిపేరు. ఒకానొకప్పుడు వర్షములు సరిగాలేని దేశములలో వర్షములు సరిగా కురియుటకును, దేశమునందలి నీటిప్రవాహములు అభివృద్ధియగుటకును కొన్నిచోట్ల అడవులను పెంచుదురు.

పేరు.

మఱికొన్నిచోట్ల పశువులమేత కొఱకును, అడవిజంతువుల అభివృద్ధికొఱకును, అడవులను పెంచుదురు. ఇట్టి ప్రదేశములన్నియు అడవులు అనుశీర్షిక క్రిందనే చేరును. ఒకానొకప్పుడు పశువుల మేతకొఱకేర్పడిన కొన్ని అడవులలో ఏవిధమైన చెట్లును లేక పోవచ్చును. అట్టి చెట్లులేని ప్రదేశములనుకూడ శాస్త్రరీత్యా అడవులనియే చెప్పవలెను.

పుట్టుక.

ప్రపంచారంభమున మానవుడు నాగరికత నెఱుగని దినములలో నీరులేని భూమియంతయు అడవిగనేయుండి యుండవచ్చును. అట్టి అడవులలో ఆయా ప్రదేశములయొక్క వర్షపాతమునుబట్టియు శీతోష్ణస్థితిని బట్టియు, భూసారమును బట్టియు, నదులయొక్కయు సముద్రములయొక్కయు కొండలు గుట్టలు మొదలగువానియొక్కయు సామీప్యమును బట్టియు ఒక్కొకచోట చిన్నచిన్న పొదలును, తుప్పలును, ఒక్కొకచోట వెడల్పు అయిన ఆకులతో నిండియుండు మఱ్ఱులు మద్దులు మామిళ్లు టేకులు మొదలగు పెద్దపెద్ద చెట్లును, ఒక్కొకచోట ఆకాశమువంకనే బోపు ఈతలు తాళ్లు వెదుళ్లు మొదలగునవియు, మఱికొన్నిచోట్ల బ్రహ్మజెముళ్లు, తుమ్మలు, మొదలగు ముండ్లచెట్లును, వృద్ధిబొందుచుండును. ఈ చెట్లన్నియు యెవ్వరు పెంచకయే పెరుగుచు, చంపకయేచచ్చుచు భూమిపయి బడి యెండుచు క్రుళ్లిపోవుచుండి యుండును. ముసలిచెట్లు ముదిమిచే జచ్చినచోట్లపిల్లచెట్లు నవనవలాడుచు బుట్టుకొని వచ్చి యుండును. ఇట్లు క్రాగ్రాగా భూసారమధికమై మానవుడు నాగరీకుడై ఈ అడవుల నాశముచేయ ప్రారంభించెను. బహుశః మొట్టమొదట తన నివాసము కొఱకును, తాను పెంచిన ఆవులు, దూడలు, మేకలు మొదలగువాని నివాసము కొఱకును ఇతడు కొద్దిమాత్రపు అడవిని కొట్టుటకు ప్రారంభించి యుండును. పిమ్మట తనపశువుల మేతకొఱకు కొంతఅడవినికొట్టి బయలుగాఁజేసి తరువాత ఆ ప్రదేశమునందు వ్యవసాయమునకు ప్రారంభించి యుండును. ఇట్లు దేశదేశములందలి ప్రజలునువారివారి దేశములలో అడవులనుకొట్టి అదేప్రదేశములందు పట్టణములను కట్టియుందురు. ప్రజాభివృద్ధి హెచ్చినకొలదిని యెంతకొట్టినను తరుగక చీమలుదూరని చిట్టడవులును, కాకులుదూరని కారడవులును ఇంకననేకము లీ ప్రపంచమునగలవు. గోదావరీ ప్రాంతము లందలి రంప, భద్రాచలము మూలలకొన్ని అడవులలో నిప్పటికిని మానవసంచార మెఱుగని ప్రదేశము లనేకములఁగూర్చి మీరువినియుండ వచ్చును.

జాతి భేదములు.

భూసారమును, వర్షపాతమును, శీతోష్ణస్థితులను బట్టి ఒక్కొక అడవిలోని చెట్లు ఒక్కొక రీతిగ నుండునని చెప్పియుంటిమి. స్వతస్సిద్ధముగ పెరుగుచుండు అడవులలోని చెట్లు నానాజాతులుగ నుండును. కాని ఒక్కొక అడవియందు ఆయాచెట్ల అభి

వృద్ధికి అనుకూలముగనుండుకొన్ని కారణము లనుబట్టి కొన్నిచెట్లు తక్కిన వానికంటె హెచ్చుగ పెరుగును. ఎట్లన సముద్రతీరముల యందు నారికేళవృక్షముల అభివృద్ధిహెచ్చుగ నుండును. మదరాసు రాజధానిలో తూర్పు సముద్రమువద్ద అనగా మద్రాసులో బయలుదేరి అడ్డముగా బోవుచు పశ్చిమ సముద్రమువరకు చూచినయెడల సముద్ర తీరమున ఇసుకనేలలుండువరకే తాటిచెట్లు కనబడునుగాని ఆగోర్కాణము దాటిన తరువాత మలబారు చేరువరకు తాటిచెట్లే కనబడుట అరుదుగ నుండును. ఇట్లే కొన్ని అడవులలో టేకును, కొన్నిఅడవులలో మద్దియు వేగిసలును, కొన్నిఅడవులలో మరిచిగంధపు మ్రాకులును, మఱికొన్ని అడవులలో వెదురు పిడెములును హెచ్చుగనుండును. ఈ భేదములు మనదేశములో సామాన్యముగ వర్షపాతమునుబట్టియు భూమియొక్క ఎత్తునుబట్టియు నేర్పడి యుండును. ఇందులో జేర్చిన పటము జూచినచో నీదేశమునందలి హెచ్చువర్షములకును అడవులకునుగల సంబంధము తెలియగలదు.

వర్షముయొక్క హెచ్చుతగ్గులను బట్టియు, నదులయొక్కయు సముద్రముయొక్కయు సామీప్యమును బట్టియు, ఎత్తునుబట్టియు అడవులీదిగువ నుదహరించిన ప్రకారము ఏడు తరగతులుగ విభజింపనగును.

వర్షమునుబట్టి:— 1. నిత్యము పచ్చని యడవులు (Evergreen).
2. ఆకురాల్చు అడవులు (Deciduous).
3. మెట్ట అడవులు (Dry).

ఎత్తునుబట్టి:— 4. హిమాలయపు అడవులు (Alphine).

నదీప్రవాహముల ముంపునుబట్టి:— 5. ముంపు అడవులు (Riparian).

సముద్రపు పోటునుబట్టి:— 6. పోటు అడవులు (Tidal).

రాతినేల, అనావృష్టి, సీటిముంపులనుబట్టి:— 7. గొడ్డునేలలు (Barren lands).

నిత్యము పచ్చనిఅడవులు (evergreen)

1. వర్షములు అధికముగనుండు ప్రదేశములలోనున్న అడవుల యందునిత్యమును పచ్చగనుండు (evergreen) చెట్లయొక్క అభివృద్ధి హెచ్చుగ నుండును. నిత్యము పచ్చగనుండు అడవులు హిందూదేశమునందు పశ్చిమ తీరముల యందును, బర్మా, అండమాన్ దీవుల యందును, హిమాలయ పర్వత క్రిందిభాగముల యందు కొంతవరకును కర్ణాటకదేశమున† కొంతవరకును వ్యాపించి యున్నది. నిత్యము

† మహానది మొదలు దక్షిణమున ఆర్కాటు వరకును పడమర కోయంబుత్తూరు వరకునుండు ప్రదేశములలో నీయడవులు ఖండఖండములుగా నున్నవి.

పచ్చనిఅడవులని చెప్పుటచే ఆకులను రాల్చు చెట్లు ఈ అడవులలో నుండనే యుండవని తలపకూడదు. ఈ అడవులందు ముఖ్యముగ మద్ది, చీనాధూప* కొంగు* ఎణ్ణె* అశోకము, గుగ్గిలము, నేరేడు, అడవిమామిడి, పొన్న, పనస, వేగిస మొదలగు జాతుల చెట్ల యభివృద్ధి హెచ్చుగ నుండును. కాని, అక్కడక్కడ దేశస్థితినిబట్టి ఈ అడవులలోకూడ టేకు, పాల, విరుగుడుచేవ, తుమికి, చందనము, దిరిసెన, చిందుగ, మొదలగు ఆకురాలు చెట్లుగూడ కలిసియుండును.

**2. ఆకురాలు అడవులు (Deciduous).** పైనిచెప్పిన నిత్యముపచ్చని అడవుల కంటె సంవత్సరమునందు కొంతకాలము తమ ఆకులనురాల్చి తిరిగి చిగుర్చు స్వభావము గల చెట్లుండెడు అడవులే హిందూదేశము నందు హెచ్చుగ నున్నవని చెప్పవచ్చును. ఇవి వర్షపాత మంతగ లేని ప్రదేశములలోకూడ వర్ధిల్లును. ఈ అడవులు హిమాలయ పర్వతపు క్రిందిభాగము మొదలు కన్యాకుమారి వరకు దేశము పొడుగునను తగిన వర్షములును నేలలునుగల చోటులందెల్ల గలవు. ఈ అడవుల లోనే విలువగల కలపయంతయు దొరకును. ఇందు టేకు, మద్ది, వేగిస, కొండ తంగేడు, సాలు, (గుగ్గిలము లేక అందుగ (ధూపను) పాల, చందనము, తుమికి (నల్లచేవ లేక కోవిదార) మంచిగంధము, విరుగుడుచేవ, కొంగు, చెన్నంగి, నరవేప, ఊటె, మొదలగు విలువగల వృక్షములును, ఇవిగాక, ఇప్ప, బిల్లు, సోమి, బాదము, తాడి, క్షరక, చిరుమాను, తుమ్మ, చంద్ర, కవిడి, శీకాయి, జాలె, కోరింద, కొండతామర (పొలికి), గులిబూత, నేరేడు, చింత, కడిమి, మొదలగు ననేక రకముల చెట్లును, ఇంకను కత్తినూనెలు, వార్నిసులు మొదలగు వస్తువులనిచ్చు అనేకములైన ఇతర చెట్లును ఈ ఆకురాలు అడవులలోనుండును.

**3. మెట్ట అడవులు (Dry Forests).** ఇంతకంటెను వర్షము తక్కువగల ప్రదేశములలో నుండునడవులలోని చెట్లు అంతగా పెరుగక గిడసబారి యుండును. ఇట్టి అడవులలోని ఫలసాయము విలువగలదిగ నుండదు. ఇందు అక్కడక్కడ పైనిచెప్పినజాతుల చెట్లు ఒకొక్కటి చొప్పునపలుచగనుండును. ఈ అడవులలో తరుచుగ తుమ్మ, చంద్ర, శీకాయి, కరక్కాయి, మోదుగ, తంగేడు, వేప, సోమి, బిల్లు, గుమ్మడి, కుంకుడు, గానుగ, రేల, చింత, దిరిసెన, సీమచింత, చీకరేణి, జమ్మి, ఇప్ప, సిస్సా మొదలగు ననేకజాతుల చెట్లుండును. ఇందే నక్కెరి, బలుసు, వెలుతురు, రేగు, కాకపాల, పరిమి, గొట్టి, ముసిడి, నేపాలం, జెముడు, ఉప్పి, పురుగుడు, జిల్లేడు, మొదలగు తుప్పలు హెచ్చుగ నుండును.

**4. ఎత్తు.** వర్షము మూలమున అడవులలోని చెట్ల బగ్రింక జాతుల భేదము లెట్లేర్పడుచున్నవో అట్లే ఆయా ప్రదేశముల యెత్తునుబట్టికూడ జాతిభేద

* అరవము. పశ్చిమతీరమండలి అడవులలోని చెట్లు.

ములు ఏర్పడుచుండుటకు గ్రీష్మవలయమునుండు ముతో కొంచ మించుమించుగ సమానమైన ఎత్తుగల బిట్రగుంట మొదలగు ప్రదేశములలో తప్ప అడవులు మొదలుకొని నీలగిరి కొండలమీద నుండు వివిధజాతులగు నిత్యము పచ్చగనుండు వృక్షములవరకు ఏ భేదము గమనింపనగును. ఎత్తు అధికమైనకొలది చల్లదనమధికమగును. చల్లదన మధికమైన కొలది చెట్ల అభివృద్ధి హెచ్చుచుండును. సముద్రపు లెవలులో నుండు తుప్పలు నీలగిరికొండలలో గానరావు. నీలగిరి కొండలలోనుండు పర్ణములు (Ferns) సముద్రపు లెవలులోనుండు అడవులలో పెరుగవు. ఇట్లే హిమాలయపర్వత ప్రాంతములలో అడుగుభాగమున ఉష్ణప్రదేశములందు పెరిగెడిచెట్లు పెరుగును. మీదికి పోనుపోను మిక్కిలి శీతల ప్రదేశములగు ఐరోపాలోని నార్వేవంటి ప్రదేశములలోని పెరిగెడిదేవదారు వృక్షములు పెరుగును. ఇట్టి ప్రదేశముల ఎత్తునుబట్టి వృద్ధిబొందెడు అడవులను హిమాలయపు అడవులని చెప్పవచ్చును.

హిందూదేశము సందరి హిమాలయపు అడవులలో రెండు విభాగములుగలవని చెప్పవచ్చును.

౧. పడమరహిమాలయపుఅడవులు:—

హిమాలయపు అడవులు. (Alpine).

ఇందు క్రింది భాగమున నుండు ప్రదేశములలోని యుష్ణము బయళ్లలోనుండు ఉష్ణముతో సమానముగనుండును. ఎత్తు భాగములు ౨౦,౦౦౦ అడుగులవరకుపోవుచు సంవత్సరము పొడుగున్నను మంచుతో కప్పబడియుండును. ఇందు తూర్పువైపున వర్షములు హెచ్చుగను ఆఫగనిస్థానమువైపున వర్షములు తక్కువగను ఉండును.

౨. తూర్పు హిమాలయ పర్వతపు టడవులు:—ఇందు సింధూరపు (Oak) అడవులు ౩,౦౦౦ అడుగులు మొదలు ౧౦,౦౦౦ అడుగుల ఎత్తువరకును, గన్నేరు (Rhododendron) అడవులు ౧౦,౦౦౦ అడుగుల పైఎత్తుమీదను పెరుగును. దేవదారు (Deodar) అడవులును ఇందు తరుచుగ గానగును.

పైనిచెప్పిన పర్వతపు టడవులలో ముఖ్యముగ జూనిపర్ (బదరి), బిర్చి, స్ప్రూసు, ఫిర్, దేవదారు (కొండ పాలకట్టె), సీడరు, సైప్రసు (తమాల లేక శోకవృక్షము లేక నల్లచీకటి మ్రాను), ఓకు (సింధూరము లేక అల్లోనుచెట్టు), రోడోడెండ్రను (గన్నేరు), పైను, మొదలగు చెట్లుండును. తగిననేలయు శీతోష్ణస్థితియు గలచోట్ల ఐరోపాలో విస్తారముగ పెరుగు, యూ, బాక్సు, అక్రోటు, ఐవి (తీగె), మిసిల్టో, రోజా (గులాబి) మొదలగునవికూడ ఈ అడవులలో పెరుగును.

5. అప్పటప్పటి నదీప్రవాహముల ముంపుచేగాని, చెరువులలో నుండియు, నదులలోనుండియు వచ్చు ఊటవలనగలిగిన ముంపుచేగాని సంవత్సరములో చాలకాలము బంద బందగా నుండునేలలోని అడవులొక తరహాగా పెరుగును. ఈఅడవులకుప్రత్యేకలక్షణములుకొన్ని

బంద అడవులు. (Riparian).

యుండుటచేత వీనిని ప్రత్యేకముగా నొక తరగతిగా జేర్పదగియున్నది. ఈ అడవుల యొక్క వృద్ధి ఆ ప్రదేశములయొక్క వైసర్గికస్థితిని బట్టియుండును. బర్మాలోని బంద నేలలోనుండు అడవులును, సింధునదియొక్క క్రిందిభాగము లందలి పల్లపు నేలలందుండు అడవులును వేర్వేరు స్వభావములు గలిగి యున్నవి. బర్మాలోని బందలు సంవత్సరము పొడుగునను తడిగానుండుటచేత ఈ అడవులలో పాచిమాను, చిరిమాను, అడవిమామిడి, నేరేడు, మోవి, రుద్రాక్ష, రేల, సీమతంగేడు మొదలగు చెట్లుండును. తుప్పలలో ఆదొండ, బూడదేణి, రేగుత్తి, నల్లుప్పి తడిక, బొద్దు తంగ్రడ, బిక్కి, చిరిబిక్కి, చిట్టమట్ట, కొండపాపిడి మొదలగునవి యుండును. ఈ అడవులలో తీగెలు దట్టముగ నల్లుకొని లోపలి కెవ్వరును చొర శక్యముగాకుండ జేయును. ఈతీగెలలో మల్లె, గుముడు, ముల్లుకోరింత, తీగెలు ముఖ్యములైనవి.

ఇట్లుగాక సింధునది తీరముల నుండు బంద అడవులలో వర్షము హెచ్చుగనుండదు. అప్పుడప్పుడు పొంగివచ్చు సింధునదియొక్క వరదలచే నివి ముంపు నొందుచుండును. ఇందుచేత పెద్దపెద్ద తుమ్మలిక్కడి బంద నేలలలో పెరుగును. ఈ అడవుల పంచలయందు పల్లిగి (ప్రక్క); సిస్సూ మొదలగు చెట్లు విస్తారముగ నుండును. మెట్టనేలలు సమీపించు సరికి జమ్మి, పొన్నగోగు, చేకోడి, నల్లుప్పి, ఆదొండ, మొదలగు చెట్లు కానవచ్చును.

**పోటు అడవులు. (Tidal)**

6. ఈ అడవులు సముద్రతీరము నందుండు ఒండుపు నేలలలో నుండును. ఇవి నదీముఖములను బట్టియు ఉప్పుటేళ్లను బట్టియు కాల్వలను బట్టియు ఆయా ప్రదేశముల లోపలి భాగములకు చొరుచుకొని పోవును. ఈ అడవులు సముద్రపు పోటు పాటులవలన హెచ్చుచు తగ్గుచుండు నీటిముంపుయొక్క స్వభావమును బట్టి వృద్ధిక్షయముల నొందుచుండును. ఈ నీటిలోనుండు ఉప్పుయొక్క హెచ్చు తగ్గులను బట్టియే ఆయా ప్రదేశము లందలి చెట్లును మారుచుండును. సముద్రపుముఖములోని నేలలలో 'ఉప్పుపొన్న' మొదలగు చెట్లధికముగ నుండును. నేలమీదకు పోనుపోను తిల్ల, మడ, ఈత, దాసాన, కొండ గోగు, చుక్కలి (తిలక), మొగిలి, అడవిబెండ, కొండపత్తి, గంగరావి, గానుగ, మొదలగు చెట్లు కానవచ్చును.

**గొడ్డునేలలు. (Barren)**

7. బొత్తుగ వర్షములేనినేలలు చెట్లులేక యెడారులుగ నుండును. ఇట్టి యెడారులు సింధు, రాజపుత్రస్థాన ప్రాంతములయందు గలవు. మిక్కిలి నిలువుగనుండు కొండలమీద మట్టి నిలుచుటకు తగినంత పదును లేక పోవుటచేత వర్షము కురిసినప్పుడెల్ల నున్నగ కడిగివేసినట్లగును. ఇట్టిబండరాళ్లమీదనుకూడ చెట్లు మొలవవు. బొత్తుగ పల్లముగనుండి సంవత్సరము పొడుగునను నీటిముంపులోనేయుండు ప్రదేశములలోకూడ చెట్లు మొలవవు. ఇట్టిప్రదేశ

ములు మనజిల్లాలలో కొండగుమాలలకొండ్లగను, ఆస్సాము, బెంగాలు, బర్మాలలో హెచ్చుగను ఉన్నవి. ఈ ప్రదేశములలో కూడ అప్పుట ప్పుట వాని స్వభావము మారుచుండుటచే జమ్ము, గడ్డి, తుప్పలును మొలుచుచుండును. రయితాధీనములో లేని ఇట్టిప్రదేశములన్నియు సర్కారు లెక్కల దాఖలా అడవులుగానే జేరుచుగాపున వీనినిగూడ నిక్కడ నొకతరగ తిగ నేర్పరచితిమి.

భూమధ్యరేఖ.

ఈ భేదములుగాక భూగోళముయొక్క మధ్యభాగమున నుండు భూమధ్యరేఖ మొదలు, కొనలయందుండు ధ్రువముల వరకును శీతోష్ణస్థితి ఎట్లు మారుచుండునో అడవులయొక్కస్థితియు అట్లే మారుచుండును. భూమధ్యరేఖకు దగ్గర నుండు అడవులలో వందలకొలది జాతుల చెట్లు పెరుగును. పోనుపోను చలిప్రదేశములకనగా ధ్రువముల పైపునకుపోగా అడవులలో చెట్లజాతులు తగ్గిపోవును. ధ్రువమునకు దగ్గరనున్న నార్వే దేశము నందలి అడవులలో ఐదారు జాతుల చెట్లే యుండును. ఇదిగాక మధ్యరేఖకు సమీపముననున్న ఇండియా, బర్మా దేశములలోని అడవులలో వెడల్పైన ఆకులుగల టేకులు, నారికేళములు మొదలగు చెట్లును, మిక్కిలి చేవగలిగి విలువగల చెట్లును హెచ్చుగనుండును. ధ్రువము సమీపమునకు పోనుపోను చేవలేనట్టియు సూదివంటి ఆకులు గలిగినట్టియు, దేవదారు మొదలగు తేలిక జాతులు హెచ్చుగనుండును.

ఉపయోగములు.

ప్రజలకు కావలసిన కలప నిచ్చుటయు, పశువులకు కావలసిన మేత నిచ్చుటయు, వివిధములగు అడవిపదార్థముల నిచ్చుటయు అందరు నెరిగిన ఉపయోగములే. వర్షములు సరిగా కురియక క్షామభయముగల సంవత్సరములలో అడవి ప్రదేశముల సమీపమునందున్న ప్రజలు తమ పశువులను అడవులకు తోలి వానిని కాపాడు కొనుచుండుట మనమందర మెరిగినదే. క్షామ కాలములందేల! డెల్టా తాలూకాలలోని కాపులు వ్యవసాయపు పనులున్నంత కాలము పశువుల చేపనులు చేయించుకొని పనిలేని దిన ములలో ప్రతిసంవత్సరము పశువులను మెట్ట గ్రామములయందలి బీటి మేతనిమిత్తము కంచె లకు తోలుటలేదా? అడవి పంచలనుండు ప్రజలు తమకు కావలసిన తలుపులకు దూల ములకు ద్రాకులను, పూరిండ్లకు వెదుళ్లు తా టాకులును, గడ్డియు, ఆవములకు పొయిలకు కర్రలను కంపలను సులభముగ తెచ్చుకొను చున్నారు. నాగళ్లకును, బండ్లకును కావ లసిన యావత్తు కలపయును అడవిప్రక్క నుండు వ్యవసాయదార్లకు కొనకయే వచ్చును. ఇప్పుడిప్పుడు కొందరు వ్యవసాయ దార్లు తమభూములకు ఆకుపెంటవలన గలుగు బల మును గ్రహించి పచ్చిఆకులను విరివిగ తెచ్చి తమ పొలములలో వేసికొని బలపరచుకొను చున్నారు.

అనేకులీ ప్రాంతముల వారలు కట్టెలు

కొట్టి కావిళ్లమీదను బండ్లమీదను యేబది నూఱు మైళ్లవరకును తీసికొనిపోయి అమ్ముకొనుచు తమ జీవనము గడపుచున్నారు. మఱికొందరు అడవులలోనితోళ్లు, కొమ్ములు, మైనము, తేనెయు, జీడిగింజలు, కరక్కాయలు, ముసాంబరము, ముసిడిగింజలు మొదలగు మందుదినుసులను, శీకాయి, కుంకుడుకాయలు, గుగ్గిలము, సాంబ్రాణి, తంగేడుపట్ట, లక్క, జిగురులను, తోళ్లూర వేయుటకును రంగులు వేయుటకును ఉపయోగించు చెట్ల బెరడులను, లెక్కలేని చిల్లరవస్తువులను, అడవులనుండి తెచ్చి అమ్ముకొనుచు జీవించుచున్నారు.

ఇట్టి చిల్లర యుపయోగము లిట్లుండగా అడవియుండు స్థలమును బట్టియు, దానియందుండు వివిధపదార్థములను ఇతరప్రదేశములకు చేర్చుటకుతగిన రహదారీలను బట్టియు, అడవులయొక్క ఉపయోగములను నిర్ణయింపనగును.

అడవులనుండి వచ్చు ఫలసాయమును మొత్తముమీద మూడువిభాగములగ నెంచవచ్చును.

౧. కలప; ఇందు వంటచెరకుకూడ జేర్చనగును.

౨. వెదురు.

3. ఇతరఫలసాయములు. ఇందు గడ్డి మేకలమేతయేగాక అడవిలో దొరకెడి ఇతర వస్తువులను, వానినుండి తయారగు అన్ని వస్తువులను చేర్చనగును.

కలపలో ముఖ్యమైనవి:—

టేకు, మద్ది, వేగిస, దేవదారు, సాలు, గుగ్గిలపుకఱ్ఱ, విరుగుడుచేవ, సిస్సు, తుమిద, (నల్లచేవ లేక కోవిదార), కాచు, మంచిగంధము, ఎఱ్ఱచందనము, తుమ్మ, కొండతంగేడు, మొదలగువి.

ఇవిగాక వందలకొలది ప్రాకులు మంచి గుణములుగలవి హిందూదేశపు అడవులలో గలవు. కాని వానియుపయోగములంతగా ప్రజలకు తెలియకపోవుటచేతను, ఒక్కొకచోట తగినంత లాభమువచ్చు వ్యాపారము నడపు వర్తకస్థానములును, ఖారుఖానాలును లేకపోవుట చేతను, విలువగల రకముల ప్రాకులు కొన్ని అడవులలోనే మడసిపోవుచున్నవి.

ఇగ్లాండులో బక్కింగు హాంషైరులోనున్న హైవెకోంబు అను నొకగ్రామము చుట్టును ౨౦,౦౦౦ పనివారలు ఒక్క బీచ్ కఱ్ఱనుండి కుర్చీలు వగైరా సామానులను నిరంతరము తయారు చేయుదురు. కాబట్టి అడవులనుండి వచ్చు రాబడి, వాస్తవి స్తీర్ణమునుబట్టిగాక వాని ఫలసాయమును ఉపయోగపరచుకొను పద్ధతులను బట్టియుండును. ఈదేశములోనొక్క అడవి ఫలసాయమునుండి సర్కారువారికి ౧౮౬౪-౬౫ సంవత్సరము మొదలు ౧౯౧౦ సంవత్సరమువరకు వచ్చునికరాదాయమును ఈ క్రిందిపట్టీలో చూపియున్నాము.

| సంవత్సరములు. | | | శిస్తు. |
|---|---|---|---|
| ౧౮౬౫- | ౭౦ | రూ॥ | ౧౩,౭౨,౭౩౩ |
| ౭౦- | ౭౫ | ,, | ౧౭,౮౩,౨౪౮ |
| ౭౫- | ౮౦ | ,, | ౨౨,౨౪,౬౮౭ |
| ౮౦- | ౮౫ | ,, | ౩౩,౮౫,౭౪౫ |
| ౮౫- | ౯౦ | ,, | ౫౦,౬౬,౬౭౧ |
| ౯౦- | ౯౫ | ,, | ౭౩,౭౦,౫౭౨ |
| ౯౫-౧౯౦౦ | | ,, | ౭౯,౨౩,౪౮౪ |
| ౧౯౦౦-౧౯౦౫ | | ,, | ౯౧,౧౪,౩౬౭ |
| ౧౯౦౫-౧౯౧౦ | | ,, | ౧,౧౬,౦౫,౯౪౩ |

ఈ నికరాదాయముగ్గాక ఉచితముగగాని తక్కువ ఖరీదులకుగాని అడవుల ప్రాంతములందుండు జనులకిచ్చిన ఫలసాయముయొక్క వెలగూడ లెక్కలోనికి తీసికొనవలయును. ౧౯౧౧ వ సం॥ లెక్కలనుబట్టి అడవుల మీద నికరాదాయము ౧౨౧ లక్షల రూపాయలును, ప్రజలకు ఉచితముగగాని తక్కువ వెలకుగాని ఇచ్చిన ఫలసాయముయొక్క వెల రు. ౫౩,౫౮,౫౫౪ లును మొత్తము రు. ౧,౭౪,౧౯,౯౮౫ లును ఉన్నట్టు తేలుచున్నది. ఈ అడవులలో ౨౬౦౫ లక్షల ఘన అడుగుల ప్రమాకులును ౨౨౪౮ లక్షలవెదుళ్లును ఫలించినట్లు సర్కారు లెక్కకు వచ్చియున్నది. ఇదిగాక ఇతరచిల్లర ఫలసాయముయొక్క అమ్మకమువలన ఈ సంవత్సరములో సర్కారునకు ౯౫,౨౭,౮౨౨ రూపాయలు జమ వచ్చియున్నది. ఈ చిల్లర ఫలసాయములో ముఖ్యమైనవి పశువులమేతవలన వచ్చినపన్ను, అమ్మినగడ్డి, రబ్బరు, లక్క, రంగుపదార్థములు, కాచు, కాంభోజిబంక, ఏలకులు, కిరక్కాయలు, తోళ్లూర వేయుట కుపయోగించు చెట్లపట్టలును ముఖ్యములైనవి.

పైజెప్పిన ప్రస్తుతోపయోగములు గాక ప్రతి దేశమున కింతకంటె అనేకరెట్లు ఎక్కువ యుపయోగములు అడవుల్లవలనగలుగుచున్నవి. ఒక దేశముయొక్క శీతోష్ణస్థితియు, ఎండవానలును, భూసారమును, నీటివసతులును, ఆరోగ్యమును, అందమును ఇవి యన్నియు కొంతవరకు అడవులవలనే గలుగుచున్నవి. చెట్లుచేమలులేని ఎడారినేలలు సంవత్సరము పొడుగునను ఎండచేకాలుచు వానచే కొట్టుకొని పోవుచు సంపూర్ణమైన దెబ్బల ననుభవించుచుండును. వృక్షసహితమైన నేలలట్లుగాక కొంతవర కెండను కొంతవరకు వానను అనుభవించుచు, సమశీతలమైన వాయు ప్రచారముగలిగి శోభిల్లుచుండును. ఈ ప్రకారము దేశముయొక్క నైసర్గికగుణములను అభివృద్ధిజేసెడు ఉపయోగములకు నైసర్గికోపయోగములని పేరు. వీనిని క్రింద వివరించెదము.

ప్రస్తుతోపయోగములు, నైసర్గికోపయోగములు.

చెట్లకొమ్మలు ఎండనువాననుకూడ కొంతవరకడ్డనేయాపి, వాని యుద్రుతమంతగా భూమినిచేరకుండ చేయును. అధికమైన గాలిదెబ్బతగలకుండ చెట్లును, గడ్డియు, భూమిని కాపాడును. భూమినిచేరిన వేడి వెంటనే చల్లారిపోకుండగను, తేమ వెంటనే హారించి పోకుండ

నైసర్గికోపయోగములు.

గను కూడ చెట్లే భూమికి సహాయపడును. పెద్దచెట్లనుండి రాలెడు ఆకులు, పూవులు, కాయలున్ను, పెద్దచెట్ల నీడలలో పెరుగు చిన్న మొక్కలును, గడ్డి మొదలగునవియు భూతలమునకొక కవచమును నేర్పడి భూమికెక్కువ చలిగాని, ఎక్కువ వేడిగాని తగలకుండ సమశీతోష్ణముగా నుంచును. భూమిలోపలను, భూమిమీదను ప్రవహించు నీటియూటలు గంటి పోయి భూమి వేడెక్కిపోకుండ ఈ కవచము కాపాడును. మిట్టప్రదేశములు వానలచే కరిగి కారి పోకుండగను, ఎండలచే పొడి పొడియై రాలిపోకుండగను చెట్లవేళ్లు భూమియందలి వెవ్వేరు భాగములను దగ్గరకుచేర్చి కట్టియుంచి భూతలమునందు హెచ్చుమార్పులు కలగకుండ కాపాడును. కొండలమీది రాళ్లు విఱిగి ప్రక్క గ్రామములమీద పడకుండ ఒక్కొకచో అడవులే కాపాడును. ఇట్టి యుపయోగములు చిరకాలమునుండి ప్రజలకు తెలియును కాని ఇప్పటి శాస్త్రజ్ఞులు ఒక అడవిప్రదేశమును దాని ప్రక్కనున్న మరియొక బయలు ప్రదేశమును రెంటిని సమమైన స్థితిగతులు గల్లవానిని శోధించి ఈ క్రిందివిషయములను కనిపట్టి యున్నారు.

౧. అడవులు దేశముయొక్క ఉష్ణాధికమును శీతలాధికమును తగ్గించి నేలను గాలిని సమశీతోష్ణ స్థితికి దెచ్చి దేశముయొక్క ఆరోగ్యమును వృద్ధిచేయును.

మనహిందూ దేశమున ఎండకాలము రాకమునుపే చెట్లన్నియు చిగిర్చి పచ్చని ఆకులతో నిండియుండుట మనమందర మెఱిగినదే. పీని చల్లనినీడచే గాకపోయిన యెడల ప్రజలింకను మలమల మాడవలసినదే. ఇట్లే పెద్దపెద్ద అడవులు దేశమధ్యమున అక్కడక్కడ నున్నయెడల వేసవికాలపు యుపద్రవ మింకను తగ్గియుండవచ్చునని గ్రహింపనగును.

౨. దేశమునందలి గాలిలోని తడిని హెచ్చించి నేలలు వెంటనే పొడియారి పోకుండ కాపాడును.

3. దేశమునందలి వర్షమును హెచ్చించును. అడవులులేనిచోట్లకంటె అడవులున్నచోట్ల వర్షములు హెచ్చుగ కురియునని చెప్పుదురుగాని దీని నిశ్చయమును ఋజువుపరచుటకంతగా నిదర్శనములులేవు. ఒకవేళ అడవులున్న ప్రదేశములలో కొంచమెక్కువవానలు కురిసినను కురియవచ్చును. అడవులుండు కొన్ని కొండలమీద వర్షములు హెచ్చుగ కురియుచుండుట చూచుచున్నాము. అట్టి హెచ్చు వర్షములు ప్రత్యేకము అడవులక్కడనుండుటచేత నెంతవరకు కురియుచున్నవో ఆయడవులక్కడలేనిచో నెంతతక్కువకురిసి యుండునో నిర్ధారణ చేయుటకు తగిన నిదర్శనము లింకను సరిగా తెలిసియుండలేదు. ఏలయన వర్షముయొక్క హెచ్చుతగ్గులు ప్రత్యేకము అడవుల మూలముననేగాక ఆయా ప్రదేశములయొక్క యెత్తు, వాయుప్రచారము, భూమధ్యరేఖనుండి దూరము, సముద్రతీరమునుండి దూరము మొదలగు అనేక

స్థితి గతులనుబట్టి ఏర్పడియుండుటచే అడవులు వలన ఎంతమార్పుగలుగు చున్నదియు, ఇతర కారణములచేత నెంతమార్పుకలుగు చున్నదియు చెప్పుటకష్టము.

౪. అడవులు లేనిదేశములయందు నీటిపారుదల వర్షకాలములో మిక్కిలి హెచ్చుగను, ఎండకాలములో మిక్కిలితక్కువగను ఉండును. అడవులు గలదేశములలో వర్షకాలమునందు కురియునీరు కొంతవరకు భూమిలోనికిదిగి కొంతకాలము అక్కడదాగియుండి సంవత్సరము పొడుగునను ప్రవహించెడి యూటలుగను నదులుగను బయలువెడలి నిరంతరమైన ప్రవాహమును దేశమునకిచ్చును. అడవుల మూలమున వరదలయుపద్రవము కొంతవరకు తగ్గును. చెట్లుచేములులేని బోడిరాళ్ల మీద వానకురిసిన యెడల వాననీరంతయు వెంటనే వెల్లువలుగా క్రిందికి దొర్లిపోయి వరదలై గ్రామములను ముంచివేయును.

౫. కొండలు విరిగిపడిపోకుండగను, నేల కరగిపోకుండగను చెట్లు కొంతవరకు కాపును. నదులును పల్లపుభూములును వరదలచే వరగోసికొని పోకుండ చెట్లు కొంతవరకు సహాయపడును. బంజనేలలలో నొందుడు మన్ను చేరి మెరకెక్కుటకును, భూసారమధికమగుటకును అడవులు సహాయపడును.

౬. వాయుప్రచారమధికతీవ్రముగాకుండ అడవులు కాపాడును. చుట్టుపక్కల నుండు ప్రదేశములలోని ప్రజలకును పైరులకున్ను అధికమైన వేడిగాలిగాని, అధికమైన చలిగాలిగాని తగులకుండ అడవులు కాపాడును. పసువులకును, మృగములకును, పక్షులకును నిలువ నీడనిచ్చి కాపాడును. కొన్ని అడవులు అనారోగ్య ప్రదేశములను సాధారణముగ ఆరోగ్యవంతములుగమార్చును. కొన్నిచోట్ల అడవులు దేశమును శత్రువులనుండి కాపాడును.

౭. అడవులు దేశముయొక్క అందమును హెచ్చించును. ఒక్కటే బట్టబయలుగనున్న ప్రదేశములలో నక్కడక్కడ నొక్కొక అడవి ప్రదేశమున్న యెడల ప్రజల మనస్సులకొక తరహా విశ్రాంతియు ఉత్సాహమును ఆనందమును కలుగును.

అడవుల పరిపాలన.

అనాదియందు సాధారణముగ అడవులకు పరిపాలనయే యుండియుండదు. అడవు లెక్కువగనుండి మానవులు తక్కువగ నున్నపుడు సృష్టియందు మానవునకుగాలియు, నీరును, ఎట్లుఉచితగ దొరకుచున్నవో అట్లే అడవియందలి కందమూలాది ఫలసాయములును కర్రకంపలును ఉచితముగనె దొరికియుండును. ఇప్పుడుకూడ కొన్నియడవులలో నేవస్తువునకుగాని వెలయే లేదు. అరటిపండ్లు, పనసపండ్లు, నారింజపండ్లు, మొదలగుననేకపండ్లును, కాయలును, పువ్వులును, ఇవియవి యననేమి ఎనుములు, ఏనుగులు, గుఱ్ఱములు, మేకలు, మొదలగు జంతువులును, చూచువారులేక మడసిపోవుచున్నవి. కాని మానవాభివృద్ధి హెచ్చి అడవి తగ్గియున్నచోట్ల, ఇది నాది, అది నీది అను ఏర్పాటులు పుట్టినవి. తోడనే ఎవరిది

వారు పాత్రిత పెట్టుకొనవలెనను తలంపును పుట్టియుండును. దీనినిబట్టియే చట్టములును, ఆచారములును ఏర్పడియుండును. నాగరికత చెందిన ప్రతిదేశమువారును తమ అడవులు నాశముకాకుండ కాపాడుకొనవలయు నని గ్రహించిరి. ఈవిషయమున జర్మనిదేశీయులు ప్రథమమున మార్గదర్శకులు. జర్మని దేశములో స్వతహాగా అడవులు హెచ్చుగ నుండెను. మిక్కిలి చలిదేశమగుటచే వారికి ఆహారమెంత అవసరమో చలిమంటలకు కట్టెలును అంతే అవసరమయ్యెను. ఇందు చేత వారు వ్యవసాయమునకుతగిన భూమిని ఎంత ఫలవంతము జేయుటకు ప్రయత్నించిరో, వారల అడవులను అంతఫలవంతముగ జేసికొనుటకు మొదటినుండియు ప్రయత్న మిడిరి. ప్రతిజిల్లాయందును అధికారులను, పాఠశాలలను, ఏర్పరిచి అడవులు వృద్ధియగు నట్లుచేసి ప్రయత్నము లొనరించిరి.

ఇట్లుచేసియు దేశములో రమారమినాలవ వంతుభాగము అడవులుగాబెంచియు, తమకు కావలసిన కలపదేశములో దొరకకపోవుటచే ప్రతిసంవత్సరమును ౨౬ లక్షలు టన్నుల కలపను ఇతరదేశములనుండి రవాణా చేసికొనుచున్నారు. వీరిదానిని కనిపట్టి ఫ్రెంచి వారును, ఆస్ట్రియా, డెన్మార్కు, బెల్జియం దేశస్థులును వారివారి కనుకూలమగు రీతిని అడవులను సంరక్షించుకొనిరి. కాని ఇంగ్లండు దేశములో ప్రజాభివృద్ధి మిక్కిలిఅధికమగుట చేతను, వ్యవసాయమునకును ఇతరవర్తక వ్యాపారములకును భూమి అధికముగ కావలసివచ్చుటచేతను, నలుప్రక్కల సముద్ర తీరముగలదై ఇతరదేశములనుండి కలప అతిసులభముగ సంపాదించుకొన గలిగియుండుటచేతను, ఆదేశమునందలి ప్రజలు మొదట నుండి అడవుల నాదేశములో పెంచుటకంతగా శ్రద్ధచేసినవారుకారు. కాని మన హిందూ దేశమునందలి అడవులను బ్రిటిషు ప్రభుత్వమువారు మిక్కిలి శ్రమజేసి వృద్ధిచేసి యున్నారు. జర్మనీదేశములోని శాస్త్రవేత్తల వద్దకు ప్రత్యేకము విద్యార్థుల బంపించియు, జర్మనీదేశపు శాస్త్రవేత్తల నీ దేశమునకు రప్పించియు మనదేశపు పరిపాలకులు మన అడవులను లాభకరముగ పెంచుటయేగాక సింహళము, మలయా, జపాను మొదలగు దేశములవారికికూడ నిప్పుడు మార్గదర్శకులై యున్నారు.

మనదేశమాదియందు దండకారణ్యాది యడవులచే నిండియుండెను. ఆర్యాదులు నదీ తీరములయందుండెడి ఫలవంతములగు అడవు లను కొట్టుకొనుచు వ్యవసాయమున కుప యుక్తముగఁజేసి కొనుచురాగా అనార్యు లగు అడవిజాతులవారలు అడవులకాల్చుచు బయళ్లేర్పరుచుకొనుచు, కొంతకాల మక్కడ నివసించి చుట్టునుండు వేట జంతువులు తగ్గిపోయిన తరువాత వేరొకచోటికి తమ నివాసస్థానమును మార్చుకొని క్రొత్త అడ వులను కాల్చి, కొట్టి బయలుజేసికొనుచు, కొండనక బయలనక దేశమునందలి అడవు

లను కొంతవరకు నశింపజేయుచు వచ్చిరి.

ఇట్లు ఖాండవదహనము మొదలుగా వేల కొలది సంవత్సరములు గడువగా బ్రిటిషు ప్రభుత్వము వచ్చిన తరువాత ప్రజాభివృద్ధి హెచ్చుగుటచేతను, వ్యవసాయముచేయు ప్రదేశ మధికమగుటచేతను, పశువు లభివృద్ధి యగుటచేతను, నాగలికొరకు అడవులను కొట్టి ఆహారముచేతను, అడవు లింకను త్వరలో నాశనము కాజొచ్చెను. రైళ్లు వచ్చి క్రొత్త మార్గము లేర్పడిన కొలది ఆ మార్గముల వెంట క్రొత్త ప్రదేశములు వ్యవసాయమగుట చేతను, కలపవ్యాపారమునకు సదుపాయములు హెచ్చుట చేతను అడవులన్నియు మరింత నాశనము కాజొచ్చెను. ఇట్లు కొంతకాలము జరుగగా సర్కారు పనులకు సహితము కలప దొరకకపోయిన ప్పుడు అడవులన్నియు అకారణముగా నశింపు జెందినందులకు వారు పశ్చాత్తాపమును జెంది పునరుద్ధారణచేయుటకు ప్రారంభించిరి.

౧౮౦౫వ సం॥ రములో ఈస్టు ఇండియా కంపెనీయొక్క డైరక్టర్లు, ఇంగ్లాండులో ఓకు చెట్లు ఖర్చు అయిపోవుటచేత రాజుగారి ఓడలకు కలప కావలసి యున్నదనియు, మలబారునుండి టేకు ఎంత పంపగలరనియు ఇక్కడి కంపెనీ అధికారులకు వ్రాసిరి. అంతట కొంత విచారణజరిగి తుదకు ౧౮౦౬వ సం॥ రములో కాప్టెన్ వాట్సన్ అను పోలీసు యుద్యోగస్తుని మలబారులో ఫారెస్టు కాన్సర్వేటరుగా నియమించిరి. ఆయన ౧౭ సంవత్సరములు పనిచేసి అడవిలోనుండు టేకుచెట్లు సర్కారు సొత్తనియు, వానిని ప్రజలు కొట్టకూడదనియు శాసించెను. కాని, వర్తకులయొక్కయు, రైతులయొక్కయు అసంతృప్తి హెచ్చుగుటచే అప్పటి మదరాసు గవర్నరగు సర్ తామస్ మన్రోగారు ౧౮౨౩ సంవత్సరములో ఈశాసనములను రద్దుచేసిరి. కాప్టెన్ వాట్సన్ తరువాత ఆపని కెవ్వరు నేర్పడకయుండక పోవుటచే పూర్వపుప్రకారమే అడవులను లెక్కలేకుండ నరకివేసిరి. ౧౮౫౨ సం॥ మున బర్మాలోని పెగూ రాజ్యము బ్రిటిషు పరిపాలనలో చేరిన పిమ్మట గొప్పగొప్ప అడవులు సర్కారునకు చేరియుండెను. లార్డుడాల్ హౌసీ గారి ప్రభుత్వములో జర్మనీనుండి డాక్టరు బ్రాండిస్ అను ఆయనను రప్పించి పెగూదేశమందలి అడవులకు సంరక్షకునిగా నేర్పరిచిరి. ౧౮౪౭వ సం॥ రమున బొంబాయి రాజధాని కొక సంరక్షకుని, ౧౮౫౬ సం॥ లోనే మదరాసు రాజధాని కొక సంరక్షకుని నియమించిరి. పిమ్మట బ్రాండిస్‌గారినే ౧౮౬౪వ సం॥ న హిందూదేశము నందలి అడవులకు ఇన్‌స్పెక్టరు జనరల్‌గా నేర్పరిచిరి. వీరు ఈ యుద్యోగమున ౧౯ . సంవత్సరములు మిక్కిలి శ్రమపడి కీర్తివహించిరి. వీరును, వీరి తరువాతవచ్చిన వీరి శిష్యులే ప్రస్తుతపు ఫారెస్టు డిపార్టుమెంటునకంతకును నిర్మాతలని చెప్పవచ్చును. ౧౮౬౫వ సం॥ మున సాలుకు ౧,౮౪,౦౦౦ రూపాయల జీతముమీద

[illegible] ఇంపీరియల్ ఫారెస్టు ఆఫీసర్లను [illegible]. అప్పటి నుండియు ఈ డిపార్టు [illegible] పెరుగుచువచ్చి ఈశతాబ్దారంభమున [illegible] ఇంపీరియల్ సర్వీసు ఆఫీసర్లును ౧౩౪ [illegible] ప్రావిన్షియల్ సర్వీసు ఆఫీసర్లును, ౧౪,౮౭౪ [illegible] ఉద్యోగస్థులును ఫారెస్టు డిపార్టు [illegible] పనిచేయుచుండిరి. వీరిజీతముల [illegible] ౧౯౧౦-౧౧ సంవత్సరములలో 23 లక్షల రూపాయలకుపైగ ఖర్చైయుండెను.

[illegible] ఇండియా గవర్నమెంటువారికి [illegible] ఇన్స్పెక్టరు జనరల్ [illegible] అను అధికారి గలడు. వీరికి నెలకు [illegible] వీరికిలోబడి, ప్రతిరాజ [illegible] పరిపాలన ఆ రాజధానుల [illegible] మెంటువారునూ మకొనెదరు. ఈరాజ ధానిలో రివిన్యూబోర్డువారికి లోబడి సర్క్యురు [illegible] కలరు. వీరు ఉత్తరసర్కిల్, [illegible] సర్కిల్, పడమరసర్కిల్, దక్షి [illegible] సర్కిల్, అను నాలుగు భాగములలో [illegible] పరిపాలించుచున్నారు. ఈ [illegible] క్రింద అవసరమునుబట్టి కొం [illegible] డిప్టీ కాన్సర్వేటర్లును, అసిస్టాంటు కాన్సర్వేటర్లును ఉన్నారు. వీరిక్రింద రేంజ [illegible] క్రింద ఫారెస్టర్లును, వారిక్రింద [illegible], వారిక్రింద అవసరమైనచో [illegible] వాచర్లును, కూలీలును, ఏర్పడి [illegible].

[illegible], ప్రావిన్షియల్, ఈ ౨ భేదములకు ౧౬ [illegible]

ఈరాజధానిలో ఈప్రక్కపట్టికలోనుదహ రించినప్రకారము ఫారెస్టు డిపార్టుమెంటులో ౩౦౬౪ మంది పనిచేయుచున్నారు. వీరి జీతములక్రింద ౧౪,౭౮,౪౮౭ రూపాయలు ఖర్చు అగుచున్నది:

ఒక్కొక్క జిల్లాయందు ఆయాజిల్లాలకు సంబంధించిన ఫారెస్టుపనులు నెరవేర్చుటకై డిస్ట్రిక్టు కలెక్టరుకులోబడి ఒకరిద్దరు డిస్ట్రిక్టు ఫారెస్టు ఆఫీసరను అధికారులుందురు. ఈ ఫారెస్టు ఆఫీసర్లు ప్రజల సంబంధము వచ్చినపుడెల్లను ఆయాప్రాంతముల రివిన్యూ ఉద్యోగస్థులతో సంప్రతించి పని చేయు చుందురు.

ఇంపీరియల్ సర్వీసులోని ఉద్యోగస్థులను, ఇంగ్లాండులో పరీక్ష ఇచ్చినవారలనే నియ మింతురు. అట్లు నియమింపబడినవారు ౧౯౦౬ వ సంవత్సరమునకుపూర్వము ఉత్తరహిందూ స్థానమున కూపర్సుహిల్ అనుచోటనున్న రాయల్ ఇండియన్ ఇంజనీరింగు కాలే జిలో మూడుసంవత్సరములు చదివినపిమ్మట కొంతకాలము ఐరోపాలోని అడవులకు తరి ఫియత్తు నిమిత్తము పంపబడుచుండిరి. పై సంవత్సరములో ఆకాలేజికూడ మూసివేసిరి. ఇప్పుడు ఇండియన్ ఫారెస్టుసర్వీసుకుకావలసిన ప్రొబేషనర్లను సెక్రిటరీ ఆఫ్ స్టేట్సువారు సివిల్ సర్వీసు కమీషనర్లుచేసిన పరీక్షనుబట్టి నియమించుచున్నారు. ఇట్లు నియమింపబడిన వారు రెండుసంవత్సరములు ఆక్సుఫర్డులోను, ఒక సంవత్సరము ఐరోపాఖండ మందలి అడ వులలోను తరిఫియతునుబొంది ఆక్సుఫర్డు యూనివర్సిటీలో పట్టాను పొంది హిందూ దేశమునకు అసిస్టాంటు కాన్సర్వేటరు ఉద్యో గములకు వచ్చెదరు.

## 1914 సం॥ రములో ఈ రాజధానిలో ఫారెస్టు డిపార్టుమెంటులో పనిచేయుచున్న ఉద్యోగస్తుల పట్టీ.

| హెదా. | ఐరోపియనులు. యూరేషియనులు. | స్వదేశీయులు. | మొత్తము. | ఒక్కంటికి నెలకు జీతము. |
|---|---|---|---|---|
| ఇంపీరియల్ సర్వీసు ఆఫీసర్లు— | | | | |
| కాన్సర్వేటర్లు ... | 4 | ... | 4 | రూ. 1500 మొ. 1900 వరకు. |
| డిప్టీ కాన్సర్వేటర్లు ... | 24 | ... | 24 | ,, 580 మొ. 1250 వరకు. |
| అసిస్టెంటు కాన్సర్వేటర్లు ... | 3 | ... | 3 | ,, 380 మొ. 540 వరకు. |
| ప్రావిన్షియల్ సర్వీసు ఆఫీసర్లు— | | | | |
| ఎక్స్ట్రా డిప్టీ కాన్సర్వేటర్లు ... | 3 | 2 | 5 | ,, 575 మొ. 850 వరకు. |
| ,, అసిస్టెంటు కాన్సర్వేటర్లు. | 13 | 12 | 25 | ,, 250 మొ. 550 వరకు. |
| సబార్డినేట్లు— | | | | |
| రేంజర్లు ... | 7 | 164 | 171 | ,, 50 మొ. 150 వరకు. |
| డిప్టీ రేంజర్లు ... | ... | 173 | 173 | ,, 30 మొ. 40 వరకు. |
| ఫారెస్టర్లు ... | ... | 257 | 257 | ,, 15 మొ. 25 వరకు. |
| గార్డ్లు ... | ... | 1422 | 1422 | ,, 6 మొ. 12 వరకు. |
| ఆఫీసు ఎస్టాబ్లిష్మెంటు— | | | | |
| అకౌంటెంట్లు ... | ... | 37 | 37 | ,, 30 మొ. 60 వరకు. |
| గుమాస్తాలు ... | ... | 480 | 480 | ,, 20 మొ. 150 వరకు. |
| జవానులు ... | ... | 463 | 463 | ,, 6 మొ. 8 వరకు. |
| మొత్తము ... | 54 | 3010 | 3064 | |

ప్రావిన్షియల్ సర్వీసులోని ఉద్యోగస్తులను డేరాడూనులోనున్న ఫారెస్టు కాలేజీలో పరీక్షనిచ్చినవారినుండి ఎత్తుకొనెదరు. సబార్డినేటు ఉద్యోగస్తులను కాన్సరువేటరులు నియమించి వారలకు ఫారెస్టుపనులను నేర్పెదరు. డేరాడూనులోనున్న ఫారెస్టు కాలేజీగాక బొంబాయి రాజధానిలోని పునహాలోగూడ ౧౮౭౮వ సంవత్సరము మొదలు సాలుకు ౫౦ మంది విద్యార్థులకు అడవివిద్యను నేర్పెదరు. ౧౯౧౨వ సంవత్సరములో నీ రాజ

దేశములోని కోయంబుత్తూరులో నొక ఫారెస్టు కాలేజి నేర్పరచియున్నారు. ఈ ఫారెస్టు కాలేజిలో నుండి గతసంవత్సరములో ౨౩ రు సబ్ అసిస్టెంటు ఆఫీసర్లు కృతార్థులైరి. ఇవిగాక ప్రతిసర్కిలునందును సంవత్సరములో ఆరుమాసములు ఫారెస్టుస్కూలుపెట్టి దేశభాషలో అడవివిద్యను నేర్పెదరు. ఈస్కూళ్లయందు ఉచితముగ విద్యచెప్పుచు, ఉద్యోగములమీదనుండి అడవివిద్యను అభివృద్ధి చేసికొనువారలకు చదువుచుండు కాలములలోకూడ ఆయా గ్రేడులనుబట్టి జీతములు నిచ్చుచున్నారు. ఇంకను, ఈ విద్యచాలదు. స్కూలు ఫైనలువరకు చదివి వచ్చీరాని ఇంగ్లీషుతో వృత్తి యేమియును లేక దేశమునందసంతృప్తితో తిరుగుచున్న వందలకొలది విద్యార్థులను ఈదారికి త్రిప్పి ప్రతిసంవత్సరము ఈరాజధానియందు ౫౦౦కాదు ౧౦౦౦ మందివరకైనను ఫారెస్టువిద్యలో తరిఫీయతు చేసివారి కీపనియందు నుత్సాహము గలుగునట్లుచేయవలెను. దేశభాషలయం దీవిద్య నేర్పినగాని ఇట్టి స్థితికలుగదు. ఇక్కడి కళాశాలలలో ప్రకృతి శాస్త్రమునందు గొప్ప మార్కు లిచ్చినవారికి ప్రోత్సాహమునిచ్చి వారికిఅడవివిద్య చెప్పించి విరివిగ సుపీరియర్ సర్వీసులోని యుద్యోగముల నిచ్చినయెడల సీమ యెక్కడనుండియో వచ్చి దేశముయొక్క స్థితిగతులనుగాని, దేశభాషలనుగాని ప్రజల స్వభావములనుగాని యెరుగని యుద్యోగస్థులకంటె నెక్కువలాభకరముగ సర్కారు పనులు నెరవేర్పగలరని నిశ్చయముగ చెప్పవచ్చును. అడవులలోని అధికారులకెవ్వరికి నిప్పటికిని తెలియని విషయములెన్నియో అడవిజనులకు తెలియును. ఒకకఱ్ఱ తలుపులు చేయుటకుగాని, నిప్పుపుల్ల చేయుటకుగాని మంచిదా కాదాయని ప్రశ్న వచ్చినపుడు దానికొకానొకప్పుడు ఫారెస్టు ఉద్యోగస్థులకంటె పల్లెటూరివాడంగియే సరియైనజవాబు చెప్పగలిగియుండును. ఈకఱ్ఱలో చెమురున్నది, ఆకఱ్ఱలో లేదు, దీనికి చెదలంటును, అది చీకిపోవును అను విషయములు ఆయా ప్రదేశములలో నుండువారలకు పసితనమునుండియు స్వాభావికముగ తెలిసియుండును. అదేప్రశ్నను ఫారెస్టు యుద్యోగస్థుని అడిగినయెడల వృక్షశాస్త్ర గ్రంథములన్నియు త్రిప్పి ఇది నాకు సంబంధించినది కాదు "ఫారెస్టు ఎకానిమిస్టు" అను ప్రత్యేక శాస్త్రవేత్తనడగవలెనని జవాబుచెప్పును. *ఇట్టిలోపములను నివారించుటకు ఆయా ప్రదేశములందలి లోకానుభవమే ముఖ్యము.

ఇట్టిలోకానుభవమును సంపాదించుటకు దేశభాషాజ్ఞాన మవసరము. స్వస్థలములోని అడవులందు ప్రజలకుతగినంత ప్రోత్సాహము కనుపరచి ఆయాప్రదేశములయందు కార్ఖానాలను వృద్ధిచేసి ఒక్కొక అడవిలోని ఫలసాయమును అక్కడనే తగురూపములగు సామానులుగ మార్చి అవసరమైనచోట్ల కెగుమతి చేసినయెడల ఇప్పటికంటె అడవులు

* G. O. నెం 3142 ది 8-11-1914 చూడుము.

కొన్ని కాలములో ననేకరెట్లు సర్కారునకు ఫలము నొసగుననియు, దేశమును భాగ్యవంతముగ జేయ గలుగుననియు నిశ్చయముగ చెప్పవచ్చును. ప్రస్తుతము అడివి అను పేరుచెప్పిన ప్రజలకుగల భయమును అసంతృప్తియు, నశించిపోవును.

గలదు. ఇది ఈదేశముయొక్క మొత్తపు పరిమాణములో రమారమి అయిదవవంతుం ఉంటచేత ఈదేశమునకు తగినంత అడివి యున్నదని కొందరనుచవచ్చునుగాని యది సరిగాదు. ఏలయన నీ దేశమునందలి యడవి సర్వత్ర సమముగాపంచబడియుండక ఒక

| ప్రదేశము. | చదరపు మైళ్ల విస్తీర్ణము. | జనసంఖ్య. | చదరపు 1 మైలుకు జనసంఖ్య. | అడవి చదరపు మైళ్లు. | అడవి విస్తీర్ణము (పాళ్లు). | మనిషి 1 కి అడవి ఎకరములు. | |
|---|---|---|---|---|---|---|---|
| | | | | | | ఎ. | సెం. |
| సంయుక్తరాష్ట్రము | 106,402 | 46,835,108 | 440 | 4174 | 3 పాళ్లు. | 0 | 5 |
| బంగాళా దేశము ... | 111,447 | 52,468,818 | 470 | 7011 | 6 ,, | 0 | 8 |
| పంజాబు ... | 97,218 | 19,731,722 | 230 | 8733 | 8 ,, | 0 | 25 |
| బొంబాయి ... | 122,978 | 19,587,383 | 159 | 12379 | 10 ,, | 0 | 39 |
| మదరాసు ... | 129,870 | 40,347,357 | 391 | 20030 | 14 ,, | 0 | 31 |
| మధ్యపరగణాలు. | 99,803 | 13,916,308 | 139 | 21384 | 21 ,, | 0 | 96 |
| అస్సాము ... | 74,501 | 33,229,865 | 446 | 28905 | 30 ,, | 0 | 53 |
| బర్మా ... | 108,837 | 9,878,593 | 91 | 137227 | 80 ,, | 8 | 96 |
| ఇండియా మొత్తము | 868,763 | 238,688,119 | 245 | 243,478 | 23 ,, | 0 | 65 |

**అడవులవిస్తీర్ణము.** హిందూదేశములోని అడివులలో కొన్ని సర్కారు స్వాధీనములోను, కొన్ని స్వదేశ రాజుల స్వాధీనమునందును, కొన్ని ప్రజల స్వాధీనమునందును వున్నవి. 1911 సంవత్సరపు లెక్కల ప్రకారము 243,478 చదరపుమైళ్ల విస్తీర్ణముగల అడవి హిందూదేశము నందు

ప్రదేశములో అడవియెక్కువ హెచ్చుగనె, మరియొక ప్రదేశములో అడవి పొత్తుగ లేకయు నుండుటచేత పైపట్టీలో చూపిన ప్రకారము ఆయా రాజధానుల లెక్కలను మనము గమనించిన యెడల అడవులయొక్క హెచ్చుతగ్గులు తెలియగలవు.

1914 సంవత్సరపు లెక్కల ప్రకారము ఈ రాజధానిలోని అడవుల విస్తీర్ణమును లక్షల ఎకరములలో తెలుపు పట్టీ నీప్రక్క చేర్చియున్నాము.

| జిల్లా. | జమీందారీలు ఇనాములు మినహా విస్తీర్ణము. | వ్యవసాయపు భూమిని విస్తీర్ణము. | గవర్నమెంటాధీనము కాని భూమి విస్తీర్ణము. | రిజర్వు అడవుల విస్తీర్ణము. | మొత్తము విస్తీర్ణములో నూటికి అడవి ఎన్ని పాళ్లు. |
|---|---|---|---|---|---|
| ఉత్తరఖండము : గంజాం ... | 29.2 | 4.4 | 24.8 | 4.0 | 13.9 |
| విశాఖపట్నం ... | 8.4 | 1.8 | 6.6 | 6.6 | 23.6 |
| గోదావరి ... | 21.2 | 6.0 | 15.2 | 15.2 | 37.9 |
| కృష్ణా ... | 16.7 | 10.1 | 6.5 | 6.5 | 10.6 |
| కర్నూలు ... | 40.3 | 15.2 | 25.0 | 25.0 | 41.8 |
| మొత్తము ... | 116.0 | 37.7 | 78.2 | 32.7 | 28.2 |
| మధ్యఖండము : బళ్లారి ... | 29.8 | 19.5 | 10.2 | 4.4 | 14.7 |
| అనంతపురం ... | 37.1 | 17.8 | 19.2 | 4.8 | 12.9 |
| గుంటూరు ... | 29.1 | 18.4 | 10.7 | 5.2 | 17.8 |
| కడప ... | 32.2 | 9.6 | 22.5 | 11.6 | 36.1 |
| నెల్లూరు ... | 23.2 | 9.4 | 13.8 | 4.7 | 20.2 |
| చెంగల్పట్టు ... | 12.8 | 6.7 | 6.1 | 1.3 | 10.4 |
| చిత్తూరు ... | 17.5 | 4.5 | 12.9 | 5.3 | 30.5 |
| మొత్తము ... | 182.0 | 86.3 | 95.7 | 37.5 | 20.6 |
| దక్షిణఖండము : నార్తార్కాడ్ ... | 25.5 | 10.9 | 14.5 | 7.7 | 30.2 |
| సవుతార్కాడ్ ... | 24.1 | 15.2 | 8.8 | 2.1 | 8.9 |
| సేలం ... | 31.2 | 11.1 | 20.0 | 9.2 | 29.4 |
| తిరిచినాపల్లి ... | 22.5 | 15.5 | 6.9 | 2.1 | 9.7 |
| తంజావూరు ... | 15.8 | 11.4 | 4.3 | 0.1 | 0.7 |
| మధుర ... | 20.7 | 11.5 | 9.2 | 4.2 | 20.3 |
| రామనాడు ... | 4.4 | 2.6 | 1.8 | 0.4 | 10.4 |
| తిరునల్వేలి ... | 17.9 | 12.0 | 5.9 | 22.7 | 12.6 |
| మొత్తము ... | 162.0 | 90.5 | 71.8 | 28.3 | 17.4 |
| పడమరఖండము: దక్షిణకన్నడము. | 25.7 | 8.2 | 17.5 | 5.1 | 19.8 |
| మలబార్ ... | 36.9 | 13.3 | 23.5 | 3.5 | 9.7 |
| నీలగిరి ... | 6.5 | 1.9 | 4.5 | 3.4 | 52.5 |
| కోయంబుత్తూరు. | 45.5 | 25.1 | 20.4 | 15.0 | 33.0 |
| మొత్తము ... | 114.0 | 48.6 | 66.1 | 27.2 | 23.7 |
| రాజధాని మొత్తము ... | 575.0 | 263.2 | 312.0 | 125.8 | 21.8 |

జనసంఖ్య హెచ్చిన కొలది అడవుల యొక్క ఉపయోగము హెచ్చుగ నుండును గాని అడవు లున్న చోట జనసంఖ్య హెచ్చుగ నుండదనియు జనసంఖ్య హెచ్చుగ నున్న చోట అడవు లుండవనియు తెలియగలదు.

ఫారెస్టు డిపార్టుమెంటువారు అడవులను రిజర్వు అడవు లనియు, సంరక్షణాలోనున్న అడవు లనియు పబ్లికుఅడవులనియు మూడువిధము లుగ విభజించియున్నారు.

అడవుల తరగతులు.

కలపకొఱకుగాని, ఇతర అడవిపదార్థము లకొఱకుగాని, నీటి ప్రవాహములను సంరక్షించుటకుగాని, మఱియే ఇతరకారణములవలన గాని శాశ్వతముగ అడవులుగ నుండుటకు ఏర్పాటుకాబడిన భాగములు రిజర్వు అడవులనబడును.

రిజర్వు.

శాశ్వతముగ అడవులుగ నుంచుట్లయు నిశ్చయముగ నేర్పడక, ప్రస్తుతము ప్రజలు తము ఇచ్చ వచ్చినట్లు నరికివేసి అడవియొక్క పెంపును నాశనము చేయకుండ కొన్ని తగు నిబంధన లేర్పరచి ఏవోకొన్ని చెట్లనేకొట్ట నిచ్చుచు సర్కారు సంరక్షణలో నుంచుకొనిన అడవులకు సంరక్షణాలోనున్న అడవు లనిపేరు. సంరక్షణాలోని అడవులలో అవసరమునుబట్టి కొన్ని అడవులను రిజర్వుగా మార్చుదురు. మఱికొన్ని అడవులు ప్రజల కుపయోగపడునట్లు కొన్ని నిర్ణయములతో నట్లేయుంచుదురు.

సంరక్షణ.

పబ్లికులేక తరగతి విభాగముకాని కొన్ని యడవులు పై వానికంటె ఎక్కువగా ప్రజలకువిడిచి వేయబడును. ఇందు కొన్నిటితోని ఫలసాయమునుబొత్తుగనిబంధనలేలేకుండ ప్రజలుతమ ఇచ్చవచ్చినట్లుపయోగపరచు కొనవచ్చును.

పబ్లికు.

1901-వ సం॥ పు లెక్కల ప్రకారము సర్కారు క్రిందనున్న 2,08,398 చదరపుమైళ్ల అడవులలో 88,140 చదరపుమైళ్లు రిజర్వుగాను 10,488 చదరపుమైళ్లు సంరక్షణాలోను మిగిలిన 1,09,741 చదరపుమైళ్లు తరగతి విభాగము లేని పబ్లికు అడవులుగానుపుండెను. 1911 సం॥ రపు లెక్కలప్రకారము 2,43,478 చదరపుమైళ్ల అడవులలో 96,337 చదరపుమైళ్లు రిజర్వుగాను, 8057 మైళ్లుసంరక్షణాలోను, 138,584 మైళ్లు తరగతి విభాగములేని పబ్లికు అడవులుగా నున్నది. ఈపదిసంవత్సరములలో అడవుల విస్తీర్ణము నూటికి 15-వంతు హెచ్చినట్లును తెలియగలదు. కాని తరగతిలేని యడవులలో చాల భాగము జనసంఖ్యలేని బర్మా మొదలగు ప్రదేశములలో చేరియుండుటచేత తరగతి లేని అడవులు లెక్కకు హెచ్చుగా నున్నట్లు కనబడుచున్నను జనసంఖ్యగలచోట్ల లెక్కలు చూచిన తరగతివిభాగముకానిఅడవి బొత్తుగ తక్కువగ నున్నట్లు తెలియగలదు.

1911 సం॥ రపు లెక్కలప్రకారము తరగతిలేని 138వేల చదరపుమైళ్ల బర్మాదేశము

నందు 111 వేల చదరపుమైళ్లును, అస్సాము నందు 22 వేల చదరపుమైళ్లును తరగతిలేని అడవియున్నది.

సంయుక్తరాష్ట్రముల యందు 30 చదరపు మైళ్లును, పంజాబునందు 1319 చదరపు మైళ్లును, మదరాసు నందు 1401 చదరపుమైళ్లును, మాత్రముగలవు. మధ్య పరగణాల యందును, బొంబాయి యందును, బంగాళాయందును, ఈబాపతు అడవి లేనే లేదు.

దీనినిబట్టి జనసంఖ్యహెచ్చుగలేని దేశములో తరగతి విభాగములేని అడవులు హెచ్చుగనున్నట్లును ప్రజాభివృద్ధి హెచ్చిన చోట్ల బొత్తుగ అడవి లేనట్లును తెలియ గలదు.

ఫారెస్టు డిపార్టుమెంటువారిపని మూడు విధములగునది.

౧. మొత్తము మీద దేశమునకులాభము గల్గునట్లు అడవులను వృద్ధిజేయుట.

౨. అడవుల సమీపములోనుండు ప్రజలకా యడవుల వలని సదుపాయములు ఎక్కువగా కలుగునట్లు చేయుట.

3. అడవులలో నుండివచ్చు ఫలసాయమును ఎట్లు ఖర్చుపరచిన ఎక్కువ యుపయోగకరమో ఆపద్ధతుల వెంబడిన దానిని వ్యయ పరచి సర్కారునకు అడవులవలని ఆదాయము హెచ్చు అగునట్లు చేయుట.

ఈ మూడువిధులను ఫారెస్టు డిపార్టుమెంటువారు మనరాజధానిలో నెట్లు నెరవేర్చుచున్నారో క్రింద చూడగలరు.

హిందూదేశములో అడవులను గూర్చిన అడవి చట్టములు. మొదటిచట్టము ౧౮౬౫ వ సం॥ రములో పుట్టియున్నది. రయితాధీనముకాని భూమియంతయు సర్కారు సొత్తుఅనే పునాదినిబట్టి ఈఅడవుల చట్టములు ఏర్పడినవి. మధ్యరాష్ట్రములలోను, పంజాబులోను, బర్మాలోను, బేహారు, కూర్గు, సంయుక్త రాష్ట్రములలోను మొదట కొన్ని నిబంధన లీచట్టమునుబట్టి పుట్టినవి. పిమ్మట ౧౮౭౮ సం॥ రమ ౭వ నెంబరు ఆక్టు ప్రకారము [మద్రాసు రాజధానియు, బర్మా తప్పతక్కిన] హిందూదేశములోనిఅడవులన్ని యుఫారెస్టు చట్టములలోచేరినవి.

౧౮౮౧, ౮౨ సంవత్సరములలో లోయర్ బర్మా, అప్పర్ బర్మాలకును, ౧౮౮౨ మద్రాసునకును,* ౧౮౯౧ సంవత్సరములో పల పైఆక్టులు అములులోలేని అన్ని ఇతరదేశములకు ఫారెస్టు చట్టము లేర్పడెను. ఈ చట్టము లేర్పడిన తరువాత ఏయే అడవులు ప్రత్యేకము సర్కారువారివో, ఏయే అడవులు ఇతరులవో అను విషయము నిర్ధారణ కావలసి వచ్చెను. కొన్ని అడవులు సర్కారు వారివైనను ప్రజలు వానిలో కొంతవరకు కొన్ని హక్కులను ఆనుపూర్వముగా గలిగియుండిరి.

* ఇది 1882 సం॥ రపు 5 నెంబరు ఆక్టు. ఈఆక్టు 1885 సం॥ రమ్ము డిసంబరునెల 3-వ తేది గల గవర్నమెంటు నోటిఫికేషనుబట్టి మదరాసు రాజధానిలో భద్రాచలము, రేకపల్లి, తాలూకాలకు మొట్టమొదట అములులోనికి వచ్చినది.

ఆహక్కులు వారికెంత వరకు గలవో అట్టి అడవులలో సర్కారువారి కెంతహక్కు గలదోయను విషయములను నిర్ధారణచేయ వలసివచ్చెను.

ఏదైనను ఒక అడవిని సర్కారువారు స్వంత అడవిగా నేర్పరచ నెంచిన యెడల ఆ ప్రదేశములోని జనులకును, ఆ ప్రదేశము నందు హక్కుగలదని తోచినవారికెల్లరకును తమ అభిప్రాయమును వెల్లడిచేసి, ఆ ప్రదేశము నందలి వారలు తమహక్కులను, అభ్యంతరములను తెల్పుకొనుటకు, మూడు నెలల వరకు గడువిచ్చెదరు. ఫారెస్టు సెటిల్మెంటు ఆఫీసరు అనుపేరుతో నొక రెవిన్యూడిపార్టుమెంట్ ఆఫీసరును, ఒక ఫారెస్టు డిపార్టుమెంటు ఆఫీసరును జేరి తగవులన్నియు తీర్చిన మీదట ఫలాని ప్రదేశములు సర్కారు వారిస్వంత ఫారెస్టు అనియు, ఫలాని ప్రదేశములు వారి సంరక్షణ లోని ఫారెస్టు అనియు నిర్ధారణచేయుదురు.

సర్కారువారు రిజర్వు చేయదలచుకొన్న అడవులసరిహద్దులు స్పష్టముగా తెలియుటకుగాను గుర్తులేర్పరుచుదురు.

డిమార్కేషన (సరిహద్దుగుర్తులు.)

ఈగుర్తులు జనసంఖ్య విస్తారముగాలేని పెద్దపెద్ద అడవులలో నెట్లున్ననుజనసంఖ్యయు పశువులును హెచ్చుగల ప్రదేశములలో మిక్కిలి స్పష్టముగ నుండవలెను. లేనియెడల ఆక్రమణలను సులభముగ కనిపట్టుటను ఫారెస్టు అధికారులకును కష్టమే. ప్రక్కభూముల అధికారులకును గుర్తులకనిపట్టుటకష్టమే. గ్రామములసమీపములో రిజర్వు అడవులున్నయెడల వాటి సరిహద్దుల చుట్టురంగుపూసిన పెద్దపెద్ద నోటీసు పలకలను కట్టవలెను. దూరమునుండి పశువులకాపరులు చూచుకొనుటకు స్పష్టముగ తెలియవలెను.

ఫారెస్టురిజర్వుల సరిహద్దులు వంకరటింకరలుగానుండక తిన్నగానుండవలెను. కొంత భాగము రిజర్వులోనుండి బయటకు పోవుట కైనను సర్కారువారు ఒప్పుకొనవలసి వచ్చును. వంకరటింకలగానున్న యెడల అడవిని కాయువారలకును కష్టము. బైటవారలు తమ పశువులు వగైరాలు రిజర్వులోనున్నవో బైటనున్నవో తెలిసికొనుటయు కష్టము. అడవులసరిహద్దులు గ్రామముల సరిహద్దులవరకు వ్యాపించి యున్నయెడల చెదరుపశువులువచ్చి అడవిని పాడుచేయుటకు వీలు హెచ్చుగానుండును. ప్రజలకును పరిపాలకులు వలన బాధలు హెచ్చుగనుండును. కాబట్టి రిజర్వుఅడవులను డిమార్కేషన చేయునపుడు సాధ్యమైనంతవరకు అడవికిని రైతాధీన భూములకును అరమైలుదూర మయినను పబ్లికు ఫారెస్టుగా నుండవలెను.

ఒక్కొక సంవత్సరమునకు లక్షలకొలది మనుష్యులను జంతువులనుశిక్షించి వేధించుట కంటె (పట్టీచూడు) అరణ్యపాలకులు తమ సరిహద్దులనుదిట్టముచేసుకొని, సిబ్బంది స్వతంత్ర్యముయొక్క యుపయోగము తగ్గింప ప్రయత్నింపవలెను. జనసంఖ్య హెచ్చుగనున్న చోట్లడవిచుట్టును

వలెను. ఆ గ్రామములోనుండు పశువులకు, సదరు అడవిలోనుండు మేతచాలదని తోచిన యెడల సదరు అడవిలో మేపుకొనదగిన పశువుల సంఖ్య యింతనియేర్పరచి, ఆ సంఖ్యకు తగిన పశువులను విడదీసికొను హక్కు గ్రామ పంచాయితీదార్లకు యిచ్చివేయ వలెను. అయినను తరగతి అడవులలో సామాన్యముగా కట్టుబాట్లేమియు చేయనక్కఱలేదు. అనేకచోట్ల గ్రామస్థులే ఆకట్టుబాట్ల నేర్పరచుకొనెదరు.

vii. ప్రస్తుతము ఉపయోగములో నున్న మేత చీట్లను (పర్మిటు) పంచిపెట్టుటలో ఏదైన్ని మార్పు చేసినయెడల చక్కగనుండునా? ఏవిధమున మార్పు చేయవలయును.?

జవాబు: చేయవచ్చును. అనేకచోట్ల పర్మిటు పద్ధతినే తీసి వేయవలెను. ఎక్కడైన నుంచిన యెడల వానిని పంచిపెట్టు ఏర్పాటులు గ్రామస్థులకే విడిచి పెట్టవలెను.

viii. కొన్ని గ్రామముల సమీపమున చిన్న చిన్న రిజర్వు అడవులు చెల్లాచెదురుగానున్నవి. అట్టి అడవులను ఫారెస్టు డిపార్టుమెంటు సంరక్షణలో నుంచుకొనవలెనా? లేక రివిన్యూ డిపార్టుమెంటువారికి ఇచ్చివేయవచ్చునా? లేక గ్రామస్థులకే యిచ్చి వేయవచ్చునా?

జ॥ సామాన్యముగా ఏదో కొంత శాశ్వతమైన మొత్తమును ఏర్పాటుచేసి, గ్రామపంచాయితీదార్లకే యిచ్చివేయుట మంచిది. లేక యెడల అట్టివానిని అడవుల పట్టీలో నుంచి తగ్గించుట యుక్తము.

ix. ప్రస్తుతము అడవులలోనుండు వంట చెఱుకును అమ్మివేయు పద్ధతులలో ఏమైనను లోపములున్నవా? అట్లున్నచో అట్టిమార్గములను సులభపరచుటకు ఫారెస్టు కమిటీవారేమైన సలహాను చెప్పగలరా.?

జ॥ ఇప్పుడు సర్కారువారి పద్ధతి సరిగానేయున్నది. ఇట్లే సరిగా నడిపించిన యెడల ముందు ముందు వంట చెఱుకుయొక్క సప్లయి వృద్ధికాగలదని తోచుచున్నయది.

x 1911 సం॥ మే నెల 29 తేదీని వెలువడిన 1605 రివిన్యూ నెంబరులో నుదహరించిన గవర్నమెంటు తీర్మానములో మార్పులేమైనను చేయవలెనా? ఎట్టిమార్పులు చేయవలెను.?

జ॥ అడవులలో పసిరక ఎఱువును పెంచుటకు కావలసినవిత్తనములను పంచిపెట్టు పెత్తనమును ఫారెస్టు డిపార్టుమెంటువారి చేతులలో నుండితీసివేసి, వ్యవసాయపు డిపార్టుమెంటు వారికిని, రివిన్యూ డిపార్టుమెంటువారికిని ఇయ్యవలెను. ఇదితప్ప వేరేమియు మార్పుల క్కఱ లేదు.

xi. గ్రామముల ప్రక్కనుండు అడవులు గ్రామస్థులకు కావలసిన పశువులమేత, వంట చెఱుకు, పసిరిక ఎఱువు, మొదలగువానిని తగినంత సప్లయిచేయ లేకపోయిన చోట్ల అది యేకారణములచేత కలిగినదని కమిటీవారి అభిప్రాయము? ఉన్న లోపములను తీర్చుటకును,

శాశ్వతముగ ప్రజలయుపయోగార్థ మేర్పాటు కాబడిన అడవులు నాశనము కాకుండు టకును కమిటీవారేమి సలహానిత్తురు?

జ॥ అడవులన్నిటినిఒక్కటే విధముగజూచుటచేత నిదివరకున్న లోపములు కలుగుచున్నవి. ఈలోపమును సవరించుటకే కమిటీవారు అడవులను తరగతివారిగా విడదీసియున్నారు. తాముచెప్పినప్రకారముఅన్ని అడవులను విడదీసి సాధ్యమైనంతవరకు క్రిందితరగతి ఫారెస్టు వుద్యోగస్థులకును పల్లెటూరి ప్రజలకును సంబంధము లేకుండ జేసిన యెడల పైని చెప్పిన లోపములు నివారణ అగునని కమిటీవారి అభిప్రాయము.

**xii.** కమిటీవారుసలహాయిచ్చు, ఒక్కొక పనివలన, సర్కారుకుఎంత తగులుబాటగును?

జ॥ మొట్టమొదట సర్కారునకు జమ వచ్చు సొమ్ములో కొంతనష్టము రావచ్చును. అదియెంత యుండునో ఉజ్జాయింపున్నకూడ చెప్పలేము. కాని దీనివలన గలుగు నష్టము హెచ్చుగానుండదు. కొంతవరకున్న సుప్రజలకుగలుగు సుఖమునుబట్టి పోల్చినయెడల మొత్తముమీద చాల లాభకరముగనుండునని తలచుచున్నాము.

ఈపైనజెప్పిన పండ్రెండుప్రశ్నలును కమిటీవారు నాల్గుతరగతులుగ విభజించిరి. (1) పశువులమేతకు సంబంధించిన విషయములు (2) వంటచెఱకునకు సంబంధించిన విషయములు(3) పసరుఎఱువునకు సంబంధించిన విషయములు (4) ఇతర విషయములు. ఈనాల్గు విషయములలో నొక్కొకదాని నెత్తుకొని కమిటీవారు విమర్శించిరి. అందు మొదటి రెండు విషయములనుగూర్చి కమిటీవారి అభిప్రాయములు ప్రజలకు తెలిసియుండవలసిన యుక్తమనియెంచి వానిక్రింద సంగ్రహముగ తెలిపితిమి.

పశువుల మేత. "పశువుల మేతవిషయములో తక్కినవానిలో నన్నిటికంటె ప్రజలకెక్కువగునొత్తుడు కలిగినదనుమాటవాస్తవము. ప్రస్తుతముప్రజలవద్దవసూలుచేయబడు కొద్దిపాటిరుసుమువలన వారికేమియు నొత్తుడు కలుగలేదనియు, వారికి కలిగిన కష్టములన్నియు నీ రుసుము వసూలగు పద్ధతులను బట్టి పుట్టినవికాని పన్ను ఇచ్చుకొనుట యందు వారికి భారమేమాత్రములేదనియును కమిటీవారి అభిప్రాయము. నెల్లూరు జిల్లాలోని అనేకశ్రోత్రియ గ్రామములలో, సర్కారు అడవులవంటి అడవులుగల స్వంతదారులు పశువు ఒక్కంటికి రూపాయిన్నరవరకును వసూలు చేయుచున్నారనియు, చెంగల్పట్టుజిల్లాలో ఒకజత ఎడ్లు ఒకదినమునకు ఎనిమిదణాల పాటుపడుచున్నవనియు, అందుచేత ఒక సంవత్సరపు మేతకగు, ఖర్చును ఒక్కొక పశువు కొద్దిగంటలలోనే సంపాదించుకొనగలిగియున్నదనియును కమిటీవారుఅభిప్రాయపడుచున్నారు."

"ప్రజలకష్టములుపన్నువలనకలుగుటలేదని మొత్తముమీదకమిటీవారుఅభిప్రాయపడియున్నను,మధుర,అనంతపురముజిల్లాలలోనిప్రజలు అందరును మేత నుచితముగా నియ్యవలసిన దని అడిగినట్లు వారు ఒప్పుకొనుచున్నారు. రామ్‌నాడ్ జిల్లాలో ఒకరిద్దరు రయితులు ఉచితముగా అడవులలో పశువులను మేపు కొననీయవలసిన దని కోరుచు డిల్లీ దర్బారు సమయమున కింగు ఎంపరరు గారికి మెల్మొరాండమును పంపుకొని యున్నారు. కొందరు కాన్ఫరెన్సులలో తీర్మానములును చేసియున్నారు. ఇవియన్నియు కమిటీవారి నోటీసులోనికి వచ్చియున్నవి. పశువుల నుచితముగ మేయనిచ్చుటయేగాక యుచితముగవంటచెఱకును తీసికొనిపోనిచ్చుటకును

ఉచితముగ ఆకు వెంటను ఎత్తుకొని పోనిచ్చుటకును, వ్యవసాయపు పనిముట్లకు, కావలసినకలపయు తీసికొని పోనిచ్చుటకును, ఇది యుది అననేల, సర్కారువారు అడవులలోని యావత్తుసొత్తును తాము ఉపయోగించు కొనుటకుగాని, పొద్దుజేసికొనుటకుగాని, తమకేస్వాతంత్ర్యముండవలసినదనియు సర్వవిధములైన కట్టుబాట్లను తీసివేయవలసిన దనియు, అనేకచోట్ల, ప్రజలందరు కోరుచువచ్చిరి. అయితే అనంతపురం జిల్లాలోమాత్రము మేకలనుఅడవులలోనికి రానియ్యకూడదన్ చెప్పుకొనుచు నచ్చిరి."

"మధురజిల్లాలో కొందరు జమీందారుల అడవుల లోనిరయితులు ఏ కట్టుబాట్లునులేక అడవిని కొట్టు కొనిపోవుటచేత సదరు అడవులు శీఘ్రముగ నశించి పోవుటయేగాని దగ్గరనున్న మధుర పట్టణములో వంట చెఱకు వెలయెంతమాత్రము మారలే దనియు అదే జిల్లాలో అయ్యలూరువద్ద తొప్పుసామి కొండమీద కలపతో నిండియున్న సర్కారు అడవులను, బోడిగా నిలుచున్న జమీందారుల అడవులను, ఒకదానిప్రక్క నొకటి యుండుటజూచిన ఆశ్చర్యకరముగా నున్న దనియు" కమిటీవారు చెప్పిరి.

పైని చెప్పిన ప్రకారము ప్రజలు అడివి ఫలసాయ మునుచితముగానెత్తుకొనిపోవుటకుతమకు హక్కు ఎందు లేకలదని మొరపెట్టుకొనుచున్నారో యను విషయ మును కమిటీవారు ఆలోచించి ఈక్రింది రీతిని తెలిపిరి.

"చిరకాలమునుండి, అడవి ఫలసాయమును వార నుభవించు చుండుటయు, ఒకయూరినిచేరిన యడవి ఆ యూరివారలు తమదేయని తలంచు చుండు టయు, నిట్టి యాశకు కారణమని తోచుచున్నది. ఏబది సంవత్సరముల కిందట దేశములో సగభాగము అడవిచే గప్పబడియున్నప్పుడు అడవిని కొట్టుకొని పోయినవారలు ప్రజలకొక యుపకారమే చేసినారని చెప్పవచ్చును. ఇప్పుడు ఒక్కొక జిల్లాలోనిరయితా ధీనపు భూమి రెట్టికిరెట్టు హెచ్చియున్నది. మనము పీల్చు గాలికెట్లు వెలలేదో అట్లేవెలలేక పడియుండెడి వంట చెఱకునకు టన్ను ఒకటికి 15 రూపాయల చొప్పున ఇప్పుడు వెలయేర్పడినది. దీనినిబట్టి ప్రస్తుతపు స్థితిగతు లెట్లు మారిపోయినవో తెలిసికొన వచ్చును."

"పూర్వకాలములోగూడ, ఈరాజధానిలోనియడవు లలోనుండుసొత్తునుప్రజలుఉచితముగతీసికొని పోయిరని చెప్పుటకువీలులేదు. 1634వసం॥లో బందరులోనిఈస్టిం డియా కంపెనీవారికి గోల్కొండ సుల్తానుయిచ్చిన ఫర్మానాలో పశువుల మేతకును వంటచెఱకునకును ఇయ్యవలసిన యొకపన్నును వారికితీసివేసినట్లు కన బడుచున్నది. గుంటూరుజిల్లాలో1797సం॥ లోపశువుల మేతకు పన్నున్నట్టు అప్పటి లెక్కల వలన కనబడు చున్నది. 1808 సంవత్సరములో ఆజిల్లామీద సర్కారు నకులక్షరూపాయలును, నెల్లూరుజిల్లామీద లక్షా ఏబది వేలరూపాయలునుజమవచ్చియున్నట్లు తెలియుచున్నది. ఇతర జిల్లాలలోకూడ మైనము, వంటచెఱకు, గొర్రెల మేత, మేకలమేత, చెట్లబంక, బెరడు మొదలగు వాని మీద కొంతపన్ను విధింపబడి యున్నట్లు తెలియు చున్నది."

వ్యవసాయపు పశువులను ఉచితముగా మేయనిచ్చు టనుగూర్చి కమిటీవా రిట్లభిప్రాయపడిరి.

"సామాన్యముగామంచివ్యవసాయపు పశువులను మేత కొరకు అడవులకు పంపనే పంపరు. ఇందులకునాలుగు కారణములు కనబడుచున్నవి. (1) పశువులకు వ్యాధివ చ్చునని భయము (2)అడవిమృగముల వలని భయము (3) పశువులకుతగినంత మేత అడవులలో దొరకదని భయము (4)మొత్తనినేలలలోనడుచుటకు అలవాటుపడినబరువైన జంతువులకాళ్లు బండరాళ్లమీద నెక్కుటవలనచెడిపోవు ననుభయము. కాని, నెల్లూరుజిల్లాలో 'కంచెలపద్ధతి' అనగా కంచెఒక్కంటికి ఇంతయని, గడ్డి పెంచిన బీళ్లను గుత్తకు తీసికొని వ్యవసాయపు పశువులను అక్కడిరయి తులు మేతకుతోలుచుండుటను మేము గమనించి యు న్నాము. ఇంటివద్దమేపుటకు నెల1కి8రూపాయలగుపశు వునకు సర్కారువారువిధించిన మూడణాల పన్నో ఎనిమి దణాల పన్నో తీసివేసిన ఎంత? విధించిన ఎంత? దీని నొక లాభముగా ప్రజలు గ్రహింపరు. ఒకవేళ ఈస్వల్ప పన్ను కొట్టివేసినను అడవులలో కాపురములుండి కూలికి పశువులను మేపు లంబాడీవాళ్లకు లాభమే

గాని, నిజముగ పశువుల అధికారుల కేమియు లాభము కలుగదు. ఈలంబాడీ వాళ్లు పశువులకు తలకింతని యేర్పరచుకొని అన్ని కర్చులతో పాటు సర్కారు వారికి పన్ను కూడ తామే చెల్లించుకొందురు. ఒక్కవేళ ఈ పన్ను హెచ్చే అని కమిటీవారు తలచినను, వ్యవసాయపు పశువులకు పన్ను లేకుండ జేయవలెనని యెంచినను, వ్యవసాయపు పశువులేవో యితర పశువులేవో తెలిసికొనుటకు సర్కారు ఉద్యోగస్థులకు తగిన సదుపాయములు లేవు. ఒక్కొక్కప్పుడు వ్యవసాయము చేయు భూమిని పట్టివాని పశువులను, లెక్కప్రకారము కొన్నిటిని అడవిలో మేయ నీయవచ్చునని తలచినను, అదికూడ రైతులకు అనేక విధములగు చిల్లర వ్యయములను, ఒత్తుడునకును కారణమగును. కాబట్టి ఉచితముగా మేయనిచ్చుట వలన ప్రజలకింతగా లాభముండదని కమిటీవారి అభిప్రాయము."

అడవి ప్రక్కలగాని అడవిమధ్యను గాని యున్న గ్రామములలోనుండు పశువులకన్నిటికిని మేత నుచితముగా నిచ్చుటనుగూర్చి కమిటీవారి అభిప్రాయము.

"కమిటీవారు పరీక్ష చేసిన రయితులందరును, ఏకగ్రీవముగ అడవి ప్రక్కనుండు గ్రామపు పశువులకే, మొదటి హక్కు నీయవలసినదని అభిప్రాయపడి యున్నారు. ఈవిషయమును 1895 సం॥ లోనే, రవిన్యూ బోర్డు వారు గమనించిరి. ఫలానా అడవియందు ఇన్ని పశువులకు దగిన మేత గలదని డిస్ట్రిక్టు ఫారెస్టు ఆఫీసరు మొట్ట మొదట నేర్పరచుకొని చీట్లను (Permits) గ్రామములోని పశువులకే మొదట ఇచ్చుచున్నారు. అయినను ఈప్రెసిడెన్సీలోని అనేక అడవులగతి చూడగా, ఏవో కొన్నిటిలో తప్ప తక్కిన అడవులలో తగినంత మేత అన్ని పశువులకును దొరకదని తెలియుచున్నది. ఒకవేళ అన్ని పశువులను ఉచితముగానే మేయవచ్చునని సర్కారువారు అభిప్రాయపడినను, ప్రక్కనుండు గ్రామముల వారి పశువులే ఎక్కువగ మేయునుగాని, దూరదేశపు పశువులంత ఎక్కువగ రానేరవు. అడవులలోనికి మితముగానే పశువులను రానిచ్చుటానికి పూర్తిగ మేత దొరుకునట్లు సర్కారువారు చేసినప్పుడు ఊరి పశువులను గూడ నుచితముగ మేయనిచ్చుటకంతగ అవసరము కనపడదని కమిటీ వారి అభిప్రాయపడుచున్నారు."

"ఒకవేళ రయితుల కింత సదుపాయము చేసినను అనాది నుండియు అడవులను పాడుచేయు నలవాటుగలవారగుటచేత వీరికి తమ చేతిలోని సొమ్ము పెట్టికొనుకొన్నప్పుడుగాని సర్కారు వారిచ్చు సదుపాయముల యొక్క విలువ తెలియదు. ఏదో కొంత రేటు ఏర్పరచి అడవులను గ్రామస్థులు బాగుగ పెంచినప్పుడు ఆ రేటును తగ్గించునట్లును, నాశనము చేసినప్పుడు దానికి శిక్షగా ఆ రేట్లను హెచ్చించునట్లును, చేసిన యెడల ప్రజలకు ప్రోత్సాహముగానుండును. బొంబాయి రాజధానిలో ఈ ప్రకారము చేసియున్నారు."

ప్రజలు పంపుకొను అర్జీలు ఎంత వరకు నిజము అను విషయము కమిటీవారాలోచించి యిట్లనిరి.

"ఒక్కొక రైతు ఏబది, అరువది మైళ్ల దూరము నడచి వచ్చి వందలకొలదిగా గూడి కమిటీవారితో మనవిచేసికొనుటకై రోజులకొలది కమిటీవారి మకాములందు పడియుండెడివారు. ప్రయాణమై పోవుమార్గములలో అడ్డములుగొట్టుచు తమ బాధలను ఆలకింపవలసినదని బ్రతిమాలుకొనెడివారు. ఒక్కొకచోట కమిటీ వారాచోట్లకు బోయి పరీక్షించినప్పుడు వారు చెప్పు బాధలన్నియు వారి తలలలో గాని నిజముగా నేలమీద కనబడలేదు. కాని యేదో యొక బాధ లేనిదే, రైతులింత కష్టపడి బహుదూరములేల వచ్చెదరు? ఇదిగాక అడవుల పరిపాలన విషయములలో గవర్నమెంటు వారియొక్కయు బోర్డు వారి యొక్కయు తీర్మానములును, కాంగ్రెసులలోను కాన్ఫరెంసులలోను శాసననిర్మాణ సభలలోను జరుగుచుండు తీర్మానములును ఇవి యన్నియు, ఒక్కటేపాట పాడుచున్నవి. ఎన్ని సదుపాయములు ప్రజలకిచ్చినను ఈ దేశములోని అన్ని డిపార్టుమెంటులలోను ఫారెస్టుడిపార్టుమెంటును ప్రజలు నానాటికి ఎక్కువగనే దూషించుచున్నారు. ఫారెస్టు చట్టములను అతిక్రమించి నందులకై శిక్షలు అంతకంతకు హెచ్చుచున్నవి. దీనిని బట్టిచూడ ఈ అసంతృప్తికి తగినంత కారణమేదో యుండవలయును. అడవి ప్రదేశములను నిర్ణయించుటయందు గాని ఆ అడవు

లలో పనిచేయు పద్ధతులయందుగాని ఆ పద్ధతులను అమలులోనికి తెచ్చువిధములయందుగాని ఈకారణ ముండవచ్చును."

కమిటీవారు పరీక్షించిన ప్రతిజిల్లా యందు ప్రజలిట్లు మొరపెట్టుకొనిరి.

"అడవులు గ్రామములకును, రైతాధీనపు భూములకును దగ్గరనున్నవనియు, నల్లరాతి బండలు, బ్రహ్మజెముడు మొక్కలు తప్ప వేరేమియులేని గొడ్డునేలలన్నిటిని అడవులుగా మార్చి తమ్ము బాధించుచున్నారనియు, అడవుల సరిహద్దులు పాము మెలికలవలె వంకరటింకరలుగా నుండుటచేత వ్యవసాయపు దారులు తమపొలములకు పోవుటకుగాని తమపశువులనిటునటు చెదరిపోకుండ తోలుకొని పోవుటకుగాని సాధ్యముగా నుండకున్నదనియు, తమకు దేవాలయములకు పోవుటకు మార్గము లేకుండ జేసిరనియు, పశువులు మేయు బీళ్లను అడవుల అధికారులు అడ్డదిడ్డముగ మూసివేయుచు పశువులకు మేతలేకుండ జేయుచున్నారనియు, సరిహద్దు గుర్తులు సరిగా తెలియక పోవుటచేత గొడ్లను కాయువారలు ఏప్రదేశము అడవిలోని భాగమో ఏది వెలుపలి భాగమో తెలిసికొన లేకుండనున్నారనియు, ఒకటిరెండు పశువులు చెదరి అడవిలోనికి పోయినప్పుడు మంద అంతయు తోలుకొనిపోయి బందెలదొడ్డిలో పెట్టుచున్నారనియు, పన్ను ఇచ్చి మేపుకొనువాడుకగల పశువులనుగూడ గొడ్లకాపరివాడు చీటిని తనతో తీసికొని వచ్చుటకు మరచిపోయిన కారణముచేతనో కొద్ది నిమిషములు దగ్గర లేకపోవుటచేతనో మందనంతను బందిలదొడ్లలో పెట్టుచున్నారనియు, అడవిసరిహద్దులలో ఆయాసము తీర్చుకొనుటకు విశ్రమించియున్న పశువుల మందలను గూడ అక్రమముగా బందెలి దొడ్డియందు పెట్టుచున్నారనియు, అట్లుపెట్టినప్పుడు బందితీసికొనుట యేగాక జుల్మానాలనివర్రో ఒక కొద్ది తరగతి అడవి యుద్యోగస్థుడువచ్చి అక్రమముగా రెట్టికి రెట్టి వసూలు చేయుచున్నాడనియు, ఈ బాధలను పడలేక పశువుల మందలను అమ్ముకొనవలసి వచ్చుచున్నదనియు, ఒకవేళ మేజస్ట్రీటుల వద్దకు తీర్మానమునకు పోయిన యెడల ఆమేజస్ట్రీటు అడవి యుద్యోగస్థులకు భయపడు చుండుటచే అక్కడ వారు వేయు జుల్మానాలు వీరు వసూలుచేయుదానికంటె ఎక్కువగా నుండుననియు, తాముచేసినతప్పులకు అన్నిటికిని కారకుడైన అడవియుద్యోగస్థుని సాక్ష్య మొక్కటియే మేజస్ట్రీటు ఎదుట చాలుననియు, తనయూరిసాక్షులెవరైనను తన పక్షమున సాక్ష్యము చెప్పిన యెడల మేజస్ట్రీటులు నమ్మరనియు, ఎంతకష్టపడియైనను అడవిలోనికి పశువులను పోనీయక జాగ్రతపెట్టినను పర్మిట్ చీటినిగూడనుంచుకొనినను అడవి గార్డునకు ఇయ్యవలసినఫీజు నీయకపోయినయెడల బందెలు జుల్మానాలు శిక్షలు తప్పవనియు, తమస్వంతఅడవులలోనుండి పుల్లలు తెచ్చుకొనినను దొంగతనమే యగుననియు, తప్పుచేసినను చేయకపోయినను గార్డు తృప్తి యగువరకు అన్నియుతప్పులే యనియు, ఇట్లు, అనేకరైతులు చెప్పుచు వచ్చిరి. ఒకరిద్దరు మాత్రము, ఈయుద్యోగస్థులకు తామిచ్చునదేదియో యిచ్చి తమయిష్టము వచ్చినట్లు చేసికొనెడి వారమని చెప్పిరి."

"రైతులు చెప్పుకొను దానిలోగూడ చాలభాగము నిజమున్నదని కమిటీవారు తెలిసికొనియున్నారు. అడవులు గ్రామమున నంటియున్న మాట నిజమే కాని, అది అడవియుద్యోగస్థుల తప్పుకాదు. అడవి గ్రామమునకు అరమైలుకంటె దగ్గరగనుండ గూడదని చట్టములో నున్నది. గ్రామమును, వ్యవసాయపు భూములును అడవి వరకును పెరిగినవి కాని, అడవి గ్రామము వరకును జరగలేదని కమిటీవారు చెప్పిరి."

"అడవియుద్యోగస్థులు ప్రజలమీద కొంచెము కఠినత్వమును చూపియున్నను, ఒక్కొక్కప్పుడు వారిపనులు మిక్కిలి కష్టమైనవి. ఫారెస్టు గార్డులయొక్కయు వాచెర్లయొక్కయు హానిలనుగూర్చి వినియుండకపోలేము. పశువులు తగ్గిపోయినవి, పశువులను అమ్ముకొంటిమి అనుమాటలబద్ధము. గుంటూరుజిల్లాలో మేతలేక పశువులు చనిపోయినవనిచెప్పు ఊరియందుమూడు పందల పశువులుండ జూసినచోట, తొమ్మిది వందలున్నవి. మాపశువులకు మేతలేదని రైతులు మొత్తుకొనిన కొన్ని చోట్ల, వేలకొలది యెకరముల కాలీస్థలములున్నవి."

"కాబట్టి కొంతవరకు ఈ ఫిర్యాదులను అబద్ధములనియెను ఎడమిచ్చినను ఇప్పుడున్నంత లోతుగ వ్యాపించిన అసంతృప్తికి నిజమైన కారణములు లేకపోలేవు. ఒకానొకచోట వారు చెప్పుకొను మొరలన్నియు నిజమైనవే. పదహారు చదరపుమైళ్ల యడవిని 8 రూపాయలు మొదలు 12 రూపాయలవరకు జీతముగల యొకగార్డు ఇద్దరు ముగ్గురు టెంపరరీ కూలీల సహాయముతో కాపాడవలసి వచ్చినప్పుడు, తనపనిని తాను చేసికొనలేక పోవుటయు, అప్పుడప్పుడు అప్రయత్నపూర్వకముగా చేతిలోనికి వచ్చిన నైకమును స్వీకరించుటయు, మానవజన్మమెత్తినవ్యక్తికిని సహజముకాని అసహజము కాదని మా అభిప్రాయము. ఒక్కసారి అక్రమపు పద్ధతులకు దిగి అలవాటుపడినవాడు తరువాత వానిని మానుట దుర్లభము. ఇట్లు మొదట ప్రజలబలవంతమువిూద తీసికొనువాడు కాలముగడచినకొలదిని వారలను బలవంతపెట్టి శిక్షించి తీసికొనును. ఇట్టి అసంతృప్తి యంతకు పరిహారము అడవియుద్యోగస్థులకును ప్రజలకునుగల సంపర్కమును తగ్గించుట తప్ప వేరేదియు లేదని యెంచి ఈ కమిటీవారు తమశక్తికొలదిని యోచించి కొన్ని సలహాలనిచ్చియున్నారు."

ప్రస్తుతము రిజర్వుగానున్న అడవులను ఐదు తరగతులుగా విభజించుటకు కమిటీవారు సిఫార్సు చేసియున్నారు.

i. దేశముయొక్క శీతోష్ణస్థితి అభివృద్ధినొందుటకు గాని జలాధారములకు కాపాడుటకుగాని నిర్మితములైన అడవులును, గ్రామములకును వ్యవసాయపు భూములకును సమీపమునలేని అడవులును, మొదటి తరగతివి. ఈ యడవులు ప్రస్తుతమువలెనే ఫారెస్టు డిపార్టుమెంటువారి స్వాధీనమునందుండవలయును.

ii. గ్రామములకును వ్యవసాయపు ప్రదేశములకును దూరముగ లేనప్పటికిని కలప మూలమునగాని వంటచెఱకు మూలమునగాని విలువగల ఫలసాయము నిచ్చునట్టివియు, ఇట్టి ఫలసాయము నిచ్చుటకు ముందైనను తగియుండునట్టివియు, కొన్ని అడవులు రెండవతరగతిలోనివి. వీనిలో పశువులమేత అంత ముఖ్యమైనదిగాదు. మిక్కిలి తక్కువైనమితి యేర్పరచినగాని ఈ అడవులలోనికి పశువులను రానిచ్చినయెడల విలువగల యడవి ఫలసాయము చెడును. ఈ అడవులలో చెట్లు అధికముగ నుండుటచేత ఆనీడలో గడ్డికూడ సాధారణముగ మొలవదు. కావుననీఅడవులలో మేసినపశువులంతగా వృద్ధిబొందవు.

iii. సముద్రపుటోరలనున్నయిసుకపర్రలలో పెంచు సరుగు(చౌకు)తోపులు, తుమ్మతోపులు మొదలగునవి మూడవతరగతిలోనివి.

iv. గ్రామములను జేరియుండి ముఖ్యముగా పశువులమేయుట కుపయోగించుచు కొంతవరకు చెట్లయభివృద్ధికిగూడ పనికివచ్చు అడవులు నాల్గవతరగతిలోనివి. వీనిని సరిగా నిర్ధారణచేయుట కష్టము. ప్రత్యేకము కలప కొరకు యేర్పడిన రెండవతరగతిలోని యడవులకును ప్రత్యేకము పశువులమేతకొఱకు ఏర్పడిన ఐదవతరగతి యడవులకును మధ్యనుండు అడవులన్నియు ఈతరగతిలో చేరును.

ఈ యడవులలో కొన్నిటియందలి చెట్లు మిక్కిలి అభివృద్ధిజెంది మంచిఅడవులు కావచ్చును. ఆచుట్టునుండు ప్రదేశమునకు దగినంతకలపను సప్లయిచేయుటకు చాలియుండవచ్చును. కాని, ఇందుచే పశువులమేతను బొత్తుగ నశింపుచేయుటకు చాలినంత కారణము లేకపోవచ్చును. కాబట్టి ఈ యడవులు కొంతవరకు మేతకొఱకును కొంత అడవి ఫలసాయముకొఱకును ఏర్పడినవి. నెల్లూరుజిల్లాలోని కావలియందును, చెంగల్పట్టు జిల్లాలోని గూడలూరునందును ఇట్టి అడవులను కమిటీవారు చూచియున్నారు.

v. మఱియెందుకునుగాక పశువులమేతకొఱకే యెక్కువయుపయోగకరమగు అడవులు ఈయైదవ తరగతిలోనివి. ఈ తరగతియడవి రాజధాని పొడుగునను కలదు. 1890 సం॥ ఉత్తరవులప్రకారము క్రొత్తగాజేర్చిన ప్రదేశములన్నియు ఈతరగతిలోచేరును. గ్రామములప్రక్కనుండుతుప్పలు, దుబ్బలు, మొదలగునవన్నియు వీనిలోనివే. వీనిలో సర్కారువారు పనిచేసినను లాభముండదు. వంటచెఱకు స్వల్పముగా దొరికినను, అమ్ముప్రదేశములకు దూరమగుటచేతను, అడవి పెరుగు ప్రదేశములలో దానికి వెలలేకపోవుటచేతను, సర్కారునకు కూలిగిట్టదు.

పశువులు మేయుటకు తగు బీళ్లుగా నేర్పరుచుటయేవీనిని రిజర్వు ఫారెస్టులుగా నుంచుటయందలి యుద్దేశముగాని మరేదియునుగాదు.

vi. ఎందునకును పనికిరాని బండభూములుఆరవతరగతిలోచేరును. ఇవి పశువుల మేతకుకూడ పనికిరావు.

ఇట్లు విభజించిన ఆరు తరగతుల అడవులను ఎట్లు పరిపాలింపవలెనను విషయమునుగూర్చి కమిటీవారిట్లు జెప్పిరి.

1. మొదటి తరగతి అడవులను ఫారెస్టు డిపార్టుమెంటువారే పరిపాలించుకొనవలెను. ఏయే పశువులను ఎన్నిటిని ఎప్పుడు ఈ అడవులలోనికి రానియ్యవలెనో వారే నిర్ణయించుకొనవలెను. ఈ అడవుల లోనికి సాధారణముగ దూరమునుండి కంచెలకు తోలు మందలను చేర్చుకొనవచ్చును.

2. రెండవతరగతి అనగా వంటచెఱకు, కలప అడవులుకూడ ఫారెస్టువారి పరిపాలనలోనే యుండవలెను. ఇందు తమ అడవియొక్క వృద్ధిచెడకుండ ఎన్ని పశువులను చేర్చుకొనవచ్చునో అంతకంటె ఎక్కువ పశువులను రానియ్యకూడదు. ఒకవేళ యడవులు గ్రామములను జేరియున్నయెడల వానిలోనికి కొన్ని పశువులను రానిచ్చునపుడు ఆయాప్రదేశముల జనసంఖ్యనుబట్టియు వ్యవసాయదార్ల అవసరమునుబట్టియు ఏయే అడవులలో నెన్ని పశువులను రానియ్యవచ్చునో నిర్ణయించుటకు ఆయా ప్రదేశముల రివిన్యూ అధికారులతో ఫారెస్టు అధికారులు సలహాచేయవలెను. ఇద్దరునుచేరి ఏయే గ్రామములకు ఎన్నిచీట్లు ఇయ్యవలెనో ఏయే బ్లాకుల లోనికి ఏయేగ్రామముల పశువులను రానియ్యవచ్చునో నిర్ధారణచేయవలెను. అడవుల సరిహద్దులలోపలనున్న గ్రామముల పశువులకును సరిహద్దు నంటియున్న గ్రామముల పశువులకును ముందు హక్కు ఇయ్యవలెను. కొద్దిపశువులనే అడవులలో మేయనిచ్చునెడల, మంచి మేత పట్టుననియు అట్టిమేతను ఏలమువేసి యెవరు హెచ్చుపొమ్మిచ్చుటకు తయారుపడుదురో వారికేల ఈ యడవుల నియ్యకూడదనియు కొందరడుగవచ్చును. కమిటీవారు ఆపద్ధతి నంగీకరింపరు. అడవిప్రక్కనున్న ప్రజలకు దరినున్న అడవులలో లాభమున్నప్పుడే యడవులను రక్షించుట సులభమనియు, గ్రామములలో ప్రజ లిట్టి సదుపాయములచే మిక్కిలి తృప్తిపొందుదురనియు యోచించి కమిటీవారు ఏలపుపద్ధతికి అంగీకరింపలేదు. ఒక గ్రామమున కిచ్చినమేతచీట్లను ఆ గ్రామములో నుండు రైతులలోనుండి యేర్పడిన పంచాయితీదార్లు తమ గ్రామములలోని పశువులకు పంచవలెను.

3. ప్రత్యేకము వంటచెఱకుకొరకై యేర్పడిన మూడవతరగతి అడవులను ఫారెస్టు డిపార్టుమెంటువారి పరిపాలనలోనుండి బొత్తిగా తొలగించివేయవలెను. అనేకచోట్ల ప్రయివేటుగా రైతులు పెంచుచున్న వంటచెఱకు అడవులు సర్కారు అడవులకంటె అనేకరెట్లు బాగుగనున్నవి.

ఇతరులకుమార్గమును చూపుటకుగాని ఎక్కడనైనను క్రొత్తపద్ధతులమీద అడవి పెంచుటకుగాని, వ్యాసులను కుదుర్చుటకుగాని, తమ పరిపాలనలో కొద్దిగ ఈబాపతు అడవిని పెట్టుకొనవచ్చునుగాని వంటచెఱకును పెంచి అమ్ముట వ్యాపారము సర్కారువారు విరివిగా పెట్టుకొనకూడదని కమిటీవారి అభిప్రాయము. తామెక్కడనైనను పెట్టుకొనునెడల ఆ అడవుల చుట్టును దట్టముగ కంచెలువేసికొని కాపాడవలెను.

4. నాలుగవ తరగతి అడవులవిషయమే ముఖ్యముగ యోచింపదగినది. గ్రామస్థులకు విడిచిపెట్టితిమా చెట్లు పాడయిపోయి అడవివిలువ తగ్గిపోవును. ఫారెస్టు డిపార్టుమెంటుకు విడిచిపెట్టితిమా పశువుల మేత కూడదనిన తప్ప పూర్వపు తగవులు తప్పవు.

గ్రామముల దరినున్న అడవులలో పశువులమేత బొత్తిగ కూడదనుటకు వీలులేదు. ప్రస్తుత మొకవేళ కొంత వరకు నష్టము వచ్చినట్లు కనబడినను ప్రజలకు అడవుల పరిపాలనలో కొంతవరకు స్వాతంత్రము కలుగజేసిన యెడల కొద్దికాలములో అడవులు తప్పక బాగుపడును నని యుద్దేశముతో కమిటీవారు పశువులమేతపూచి గ్రామ పంచాయితీదార్లయందే యుంచి యున్నారు.

ఒక్కొక్క గ్రామములోని అడవి పరిపాలనకు ఆ గ్రామముయొక్క పంచాయితి వేరుగా నుండవలెనుకాని, కొన్ని గ్రామములొక గ్రూపుగాచేసి, ఒక్కొక గ్రూపునకొక పంచాయితి యేర్పాటుచేయకూడదు. ఏగ్రామముతో సంబంధించిన యడవికి ఆగ్రామపు పంచాయితి వేరుగనున్నయెడల వారు ఇతరగ్రామముల పశువులను ఆ గ్రామపు అడవిలోనికి రానియ్యకుండ చూచుకొనెదరు. సులభముగను చూడగలరు. ఒకానొకప్పుడు ఆ గ్రామములోనున్న పశువులే అడవిలోనున్న గడ్డికి మించియుండుననితోచిన యెడలసర్కారువారు ఎన్నిపశువులను ఆయాగ్రామపు అడవిలో మేయనియ్యవచ్చునో యేర్పాటుచేసి అన్ని మేతచీట్లనే గ్రామ పంచాయితీదార్లకియ్యవలెను.

ఈ చీట్లను పంచాయితీదార్లే వారి గ్రామములో తగిన పశువులకు పంచిపెట్టుకొనెదరు. ఫారెస్టు వుద్యోగస్థు లప్పుడప్పుడు తామిచ్చిన చీట్లకుమించి పశువులడవిలో మేయకుండ చూచుకొనవచ్చును. గార్డులను వాచర్లను తీసివేయవలెను. గ్రామస్థులే అడవులకు కావలసినచోట్ల కంచెలు చేసికొనవలయును. ఫారెస్టువారుగాని, కంట్రాక్టర్లుగాని వేసిన కంచెలను కాపాడవలెను. అడవులలో క్రొత్తగా మొక్కలు పెరుగుటకై వానిని మూసివేయునప్పుడు సామాన్యముగా నొక గ్రామమునకు చేరిన అడవిలో సగభాగము ఒకసారియు రెండవసగము మరియొకసారియును మూయవలెను. అడవిలోని చెట్లనుకూడ తామే కాపాడెదమని ఆయా గ్రామముల పంచాయితీదార్లు పూచీపడేయెడల వారిని ప్రోత్సాహము చేయవలెను. బాగుగ కాపాడిన గ్రామముల వారికి ఆ అడవులను కొట్టినప్పుడు కలపలో కొంతభాగము ఉచితముగ బహుమానముగా నియ్యవలెయును. తేదారాగల సంవత్సరముల పశువుల మేతపన్ను తగ్గించవలెను. ఇట్లుచేసినయెడల వారికిని ప్రోత్సాహము కలిగి అడవుల వృద్ధివలన తమకును లాభము కలుగుననియెంచి కష్టపడి అడవులను వృద్ధిచేయుదురు. మేతకు మించిన పశువులను రానియ్యరు. అడవిని "ఇక్కడ మూసినారు, అక్కడ మూసినారు" అనరు. ఎంత అడవిని పనులకై మూసివేసి కాపాడిన, అంతలాభము వారికిని ఉండును గనుక జాగ్రత్తగ చూచుకొనెదరు. ఇతర గ్రామముల పశువులమందలువచ్చి అడవిని పాడుచేయనియ్యరు. మేతచీట్లుకూడ మితముగానేయుండును గాన పశువులున్ను బాగుపడును. ఒకానొకచో పంచాయితీదార్లు బాగుగా పనిచేయక అడవి చెడిపోవుచున్నట్లు తోచినయెడల రాగలవరతులో మేతపన్ను హెచ్చు చేయవచ్చును. ఇంకనువారు సరిగా పనిచేయనియెడల పంచాయితీదార్లను తీసివేసి ఫారెస్టు డిపార్టుమెంటువారు ఆ అడవిని తమ పాలనలోనికి తీసికొనవచ్చును.

5. అయిదవ తరగతిఅనగా మేతఅడవులు. ఈ అడవులను కాపాడుపని పూర్ణముగా పంచాయితీదార్లకే ఇచ్చివేయవలెను. మేతపన్ను వసూలుచేయుట, తగినన్ని పశువులనే మేయనిచ్చుట, చెట్లపెంపును కాపాడుట మొదలగు పనులన్నియు, పంచాయితీదార్లే చూచుకొనవలెను. ఫారెస్టుగార్డులను తీసివేయవలెను. ఒక్కొక్క గ్రామములోనుండు రిజర్వుకాని భూములు కూడ ఈపంచాయితీదార్ల పరిపాలనలోనే యుండవలెను.

6. ఆరవతరగతిలోజేరిన అడవులన్నిటినిసర్కారువారుఫారెస్టు డిపార్టుమెంటువారినుండి తీసికొని తమ స్వాధీనములో నుంచుకొని రైతాధీనముకాని బంజరు భూములతో పాటు చూచుకొనవలెను.

పైనిజెప్పినప్రకారము పంచాయితీదారులచేతులలో అడవి పరిపాలనయంతయు నిచ్చినయెడలసాధారణముగా పంచాయితీదారుగా గ్రామములోభాగ్యవంతులే వచ్చుటచేత భాగ్యవంతులందరును జేరిఅడవిలోని ఫలసాయమునంతయు ననుభవించిబీదవారలకు బొత్తుగాలేకుండ జేయుదురేమొ యను భయము కమిటీవారికి లేకపోలేదు. అయినను గొప్పఅన్యాయముగాని, పక్షపాతముగాని ఏదైనను జరిగినట్లు తోచినయెడల రెవిన్యూ డివిజనల్ ఆఫీసరు తిట్టి పంచాయితీదార్లను తమహోదాలనుండి తొలిగింపవచ్చుననియు, మూడు సంవత్సరముల కొకసారి పంచాయితీదార్లనుతిరిగి ఎన్నుకొనుచుండవలెననియు ఏర్పాటుచేసినయెడల మొత్తమువిూద సర్వ

మునకు వచ్చుచున్నను ఇంకెవ్వరికిగాని పంచాయితీ దారు లు న్యాయముగా చెప్పవలెను. దేనినైనను చేయకగాని తిరుగుబాటు చేసినవారి యొక్క పశువులను అడవి లోనికి రానీయకుండుటకు పంచాయితీ దారుల కధి కారముగలదు.

6. వారియొక్క తగవులులేకుండ అడవిలో మేయుచుం డిన పశువులను బందెల దొడ్డిలో పెట్టుటకు వారికి అధి కారము గలదు.

7. ఇంటి పనులకుగాని వ్యవసాయపు పనులకుగాని కావలసిన కలపను ఇచ్చుటకును దాని పరిమాణమును హెచ్చించుటకును తగ్గించుటకును పంచాయితీదారుల కధికారముకలదు.

పైని చెప్పిన విషయములలో ఏదైనను తగవులున్న యెడల పంచాయితీ దారులే తీర్చుకొనుటకు వారికి సర్వ స్వాతంత్ర్యములుండవలెనుగాని వారిపైని అప్పీలు ఉండ కూడదు. మొత్తము మీద పంచాయితీ దారులు చక్కగా పనిచేయనియెడల వారిని తీసివేసి క్రొత్త పంచాయితీ దారులను ఎన్నుకొనవలెను. క్రొత్త పంచాయితీ దారు లుగూడ సరిగా పనిచేయనియెడల ఆగ్రామమున పంచా యితీ పద్ధతి తీసివేసి అడవిని ఫారెస్టువారి పరిపాలనలో నుంచవలెను.

మేత పన్ను విధించు పద్ధతులు.

గడచిన 5 సంవత్సరములలో సర్కారువారు ఒక్కొక్క ఖండముమీదనుగలుపన్నంతయు వచ్చినదో ఆ మొత్తమును సాధారణముగ విధించవచ్చును. ఒకానొకప్పుడు కాలమును బట్టియు ప్రజల బీదరికమును బట్టి యును కొంచెము తగ్గించవలసివచ్చును. కొన్నిచోట్ల ఎక రాకు ఇన్ని అణాలని ఏర్పాటుచేయవచ్చును.

పంచాయితీలకు ఇచ్చు ప్రతిఫలము.

పంచాయితీదారులు తమ గ్రామమునందలి యడవిని వృద్ధి పొందించినందులకు వారికేమియు ప్రతిఫలము ప్రత్యేకముగా నీయ నక్కరలేదు. క్రొత్త మొక్క లను వేసి అడవులను వృద్ధిచేయుటకై వారికి సొమ్ము ఇయ్యకూడదు. ఇచ్చినయెడల దానికి వారు లెక్కలు పెట్టవలెను. అధికారుల తగాదా హెచ్చగును. చేతులలోని సొమ్మును అపహరించుటకుగూడ పంచా యితీ దారులలో కొందఱకు బుద్ధి పుట్టవచ్చును. అడ వులను ఇప్పటిస్థితిలో నుంచుట కంటె వృద్ధిపఱచుట మిక్కిలి అవసరమైనచోట్ల ఒక్కొక్క పనికి కొంత సొమ్ము ఏర్పాటుచేసి ఆ పనిని చక్కగా నెరవేర్చిన పిమ్మట పంచాయితీ దారులకు ఆ సొమ్మునిచ్చి వేయ వచ్చును. పంచాయితీదారులెవరైనను తమంతటతామే తమ గ్రామపు టడవులను వృద్ధిచేసికొనుతలంపుతో క్రొత్త మొక్కలను వేసి పెంచుకొనుచున్నయెడల అట్టివార లకు ఫారెస్టువారు విత్తనములను సలహానుఉచితముగా నిచ్చుచు సాధ్యమైనంతవఱకు సహాయపడవలెను. ఏగ్రా మస్థులయినను తమ అడవిని చక్కగా పెంచుకొను చున్నయెడలగాని లాభమునంతయు శాశ్వతముగా ఆగ్రా మము వారే పొందవచ్చుననియు వారిమూలమున అభి వృద్ధియైన అడవులకు పన్ను ఎన్నడును సర్కారువారువృద్ధి చేయగనియు స్పష్టముగా చెప్పవలెను.

ఫారెస్టు కమిటీవారిచ్చిన అభిప్రాయము లలో గవర్నమెంటువారు చాలభాగమంగీ కరించి అడవులను వారు చెప్పినరీతిని విభాగ ము చేయుటకు గత సం॥ లో ప్రారంభించి యున్నారు. 8 జిల్లాలలో 50 పంచా యితీల నేర్పాటు చేయుటకు ఉత్తరవులు ఇచ్చియున్నారు. చిన్న చిన్న అడవులనుకొన్ని టిని ఫారెస్టు డిపార్టుమెంటుయొక్క పరిపా లననుండి తొలగించి యున్నారు. సర్కారు వంటి పెద్దకు వర్తకము చేయుటమాని ప్రయి వేటు కంట్రాక్టరుల కాపనిని విడచివేసిరి. ముందుముందైనను ప్రజలకును ఫారెస్టువారి కినిగల తగవులు తగ్గిపోగలవని తలచెదము.

iii. అడవులశత్రువులలో మూడవది అగ్ని.

అగ్ని.

అడవి ఉద్యోగస్థులపను లలో ముఖ్యమైనదియు

మిక్కిలి కఠినమైనదియు నగుపని. అడవులను అగ్ని నుండి కాపాడుటయే యని చెప్పవచ్చును. వేసవికాలములలో నీపని మిక్కిలి కఠినముగా నుండును. ఈదేశమునందు అడవులనుగొట్టి వ్యవసాయము చేయువారు కొందరు తాము పండించుకొనినభూమిలోని బలము తగ్గిపోయి నపుడు దానిని బలపరచుకొనరు. ఇందులకు బదులుగా క్రొత్త అడవులను కాల్చి, ఆభూమిలో వ్యవసాయము చేయుదురు. ఈ క్రొత్త భూములు రెండుమూడు సంవత్సరములవరకు బాగుగ ఫలింపవచ్చునుగాని కాలిపోయినఅడవి యొక్క విలువను ఆ అడవిలోని వ్యవసాయదారులు కనిపెట్టుటలేదు. ఒకానొకప్పుడు ఒక్కటి రెండెకరముల అడవిని కాల్పవలెనని యొకచోట నిప్పు అంటించగా నూరెకరముల అడవి కాలిపోవచ్చును. దీనినాపుట కెవ్వరి తరమును కాకపోవచ్చును. ఇట్లు అడవులను కాల్చుదురభ్యాసము చిరకాలము నుండి ఈ దేశమున పాతుకుని యుండుటచేత అడవులలోని యుద్యోగస్థుల కీయడవి నిప్పులనార్పుపని మిగుల కఠినముగ నున్నది. ఇట్లు ప్రయత్నపూర్వకముగా పెట్టిన నిప్పుగాక అప్రయత్నముగ అడవులకు నిప్పు అనేక విధములుగ నంటుకొను చున్నది. ఈ దిగువనుదహరించిన పట్టీవలన ఈ రాజధానిలోని అడవులలో నిప్పు ఏ ప్రకారము వ్యాపించు చున్నదో తెలియగలదు. బయిట నుండి వచ్చునిప్పునుండి అడవిని కాపాడుటకుగాను అడవి చుట్టును కొంతభాగములో నుండు చెట్లను పొదలను నరికివేయుదురు. ఇందలి కలపలను, తీసిన పిమ్మట నేలమీద ఎంతమాత్రము కాలిపోవు తుక్కు లేకుండగను, తిరిగి మొలవకుండగను, ఆ భాగములకు నిప్పంటించి, తగిన యుద్యోగస్థులును కూలీలును దగ్గరనుండి చూచుచు, కాల్చివేయుదురు. ఒకవేళ ఈ ప్రదేశములను దాటి అడవిలో నిప్పు ప్రవేశించినయెడల ఆ నిప్పు అడవియంతటను వ్యాపించకుండ అడవిలోపల అక్కడక్కడ పెద్ద పెద్ద వీధులు వీధులుగా ఖాళీ స్థలములుండునట్లు అడవిని నరికి నేలనుకాల్చి పరిశుభ్రముగ నుంచుదురు.

ఇట్లు కాల్చినభాగములకు నిప్పు * పుంతలని పేరు. ఈ ప్రకారము నిప్పుపుంతల నేర్పరచి అడవిని నిప్పునుండి సంరక్షించుటకు మన హిందూ దేశములో 1911 వ సంవత్సరములో 6,91,309, రూపాయలు ఖర్చుఅయి వున్నది. మనరాజధానిలో గడచిన సంవత్సరము ప్రత్యేక మిందులకు 1,34,269 రూపాయలు వ్యయపడి యున్నది.

జనసంఖ్యఅధికముగానున్న ప్రదేశములలో ఈ నిప్పు పుంతలను ఏర్పరుప బోవుస్థలములలోని చెట్లయొక్క కలపను ఇతరులకు వెంటనే కొట్టి తీసికొని పోవుషరతులతో అమ్మివేసిన సర్కారునకు ఖర్చు లేకుండనిప్పుపుంత

* అడవి వెలుపలి పుంతలు సామాన్యముగా 66 అడుగులును, లోపలి పుంతలు 33 అడుగులును వెడల్పుగ నుండును.

## 1912_13 సం॥ రములో ఈరాజధానిలోని అడవులను కాల్చిన నేరములను, అడవులవిస్తీర్ణమును ఎకరములలో జూపు జాబితా.

| A. అజాగ్రత్తగాను లేక కాల్చుటకు నియమింపని భూములను అజాగ్రత్తగా కాల్చుటచేతను. | | B. బయటి ప్రదేశములనుండి నిప్పు వ్యాపించి కాలుకొనుటచేతను. | | C. రిజర్వులలోనే నిప్పు ఆరంభమగుటచేతను. — అజాగ్రతవలనను, అకాస్మాత్తుగను: అడవి పనులకు నియమింపబడిన కూలివాండ్రు, గడ్డి కోయువారు, గొఱ్ఱెలకాపరులు వగైరాలవలనను. | | అడవులలో సంచరించు ప్రయాణికులు, పాటసారులవలనను. | | రైల్వే ఇంజనులవలనను. | | వంటలు చేసికొను లేక పొగ గొట్టములవలనను. | | ఉద్దేశపూర్వకముగను: క్రొత్తగా పంటలు వేయుటకు. | | తేనెలు తీయుటకు గాని వేటకు గాని. | | మరి యితరములయినవి. | | మొత్తము. | | D. తెలియని కారణములవలన. | | A, B, C, D, మొత్తము. | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 |
| నంబరు. | ఎకరములు. | నంబరు. | ఎకరములు. | నంబరు. | ఎకరములు. | నంబరు. | ఎకరములు. | నంబరు. | ఎకరములు. | నంబరు. | ఎకరములు. | నంబరు. | ఎకరములు. | నంబరు. | ఎకరములు. | నంబరు. | ఎకరములు. | నంబరు. | ఎకరములు. | నంబరు. | ఎకరములు. | నంబరు. | ఎకరములు. |
| 45 | 23601 | 166 | 52494 | 32 | 44309 | 254 | 53965 | 9 | 215 | 23 | 628 | 158 | 13350 | 32 | 11752 | 68 | 57376 | 578 | 159595 | 187 | 428879 | 1420 | 664068 |

1. సర్కారువారే అడవులలోని ఫలసాయమునుచేర్చి వెలుపలకు తీసికొనిపోయి తాము ఏర్పరచిన డిపోలలో ఆయా ప్రదేశములలో నుండు బజారువెలలకు అమ్ముకొనుట.

డిపోపద్ధతి.

2. కలప కొట్టి తీసికొనిపోవువారలకుగాని చిల్లర ఫలసాయమును తీసికొని పోవువారలకు గాని కొన్ని నిబంధనలకు లోబడి, చీట్లనిచ్చి వారివద్దనుండి సొమ్ము వసూలుచేసికొనుట.

చీటి లేక పర్మిటుపద్ధతి.

3. ఒకానొక ఖండమునందలి ఫలసాయము నంతను కొంత మొత్తమునకు గుత్తగానిచ్చివేసి కొన్ని నిబంధనల ప్రకారము గుత్తదారులను అడవి ఫలసాయమును తీసికొని పోనిచ్చుట.

గుత్తలేక. కంట్రాక్టు పద్ధతి.

ఈ పద్ధతులు ఆయాదేశము నందలి ఆచారమును బట్టి ఏర్పడి యుండును. ఈ రాజధానిలో గత సంవత్సరములలో వచ్చిన అడవి ఫలసాయము కొంత సర్కారు ఉద్యోగస్థుల మూలమునను కొంత కంట్రాక్టరుల మూలమునను వచ్చియున్నది. కొంత ఉచితముగ తీసికొనిపోబడియున్నది. సగటున హిందూ దేశములోని అడవులమీద సర్కారునకుచదరపుమైలునకు రు 50 ల చొప్పున రాబడివచ్చుచున్నది. అనగా ఎకరము అడవిభూమికి సగటున 0-1-3 రాబడి వచ్చుచున్నది.

పూర్వము సాధారణముగా పర్మిట్లమీద అడవి ఫలసాయమును అడవి ప్రక్క నుండు గ్రామములవారు కొట్టుకొనుచు అమ్ముకొనుచు నుండిరి. కాని అట్టి ఆచారమువలన అడవులకు ఎక్కువ నష్టము వచ్చుచుండెను. పర్మిటులు పొందినవారలు సామాన్యముగా పర్మిట్లమీద తాము తీసికొనిపోవుకలపకంటె హెచ్చుగ దొంగిలించుకొని పోవుచుండిరి. లెక్కలేనంతమంది ఎవరికివారు తీసికొనిపోవుచున్నప్పుడు అడవిని భద్రపఱచుట ఫారెస్టు అధికారులకును కష్టమే. ఒక్కచెట్టు కొట్టుటకు పర్మిట్టుగలవాడు తనకు కావలసిన కఱ్ఱను ఏరుకొనులోపల పది చెట్లను కొట్టి పారవేయును. ఈ ఎండిన చెట్లన్నియు నేలమీద బడి యుండి అడవికాలి పోవుటకు సహాయపడును. పర్మిటు పొందిన వాడు న్యాయస్థుడై జాగ్రతగలవాడైనను ఏ చెట్టును ఎట్లు కొట్టవలెనో తెలియక పోవుటచేత అడవి యొక్క వృద్ధికి కావలసిన లేతకొమ్మలను మంచికొమ్మలను నరికివేయును. ఇట్లు చేయుట చేత అధిక విలువగలఅడవి సరిగా పెరుగక కొద్దికాలములో నాశనము చెందును. అడవి చక్కగ పెరుగవలెననిన అడవిలోనున్న వంకరచెట్లను నీరసపుచెట్లను కొట్టివేసి బలముగ నున్న చెట్లను విత్తనముకొఱకును, చిన్న చెట్లు పెరుగుటకు కావలసిన నీడ కొఱకును తగు రీతిని పెంచవలెను. పర్మిటు పొందిన వాడన్ననో ఏ చెట్టు కంటికి బాగుగానుండిన

పర్మిటుపద్ధతివలన నష్టములు.

దానిని ముందునరికి వేయును. కొన్నిచోట్ల ఎండి పడిపోయిన చెట్లను మాత్రము పర్మిటుగలవారు తీసికొని పోవచ్చునని యేర్పాటు చేసియుండిరి. అట్టిచోట్లగూడ అడవులకునష్టమేవచ్చుచుండెను. అడవిలో దూరముగా పోయి ఎండుకట్టెలను వెదుకొనుటకు ఇష్టము లేక దారిని పోవునపుడు ప్రతిదినము కొన్ని కొమ్మలను నరికివేసి తానువారముదినములకు తిరిగి వచ్చునప్పటికి ఇవి యెండి తయారుగా నుండునట్లు చూచుకొనును. ఇట్టి వారల నందరిని పట్టుకొనుటకు 16 చదరపు మైళ్లకు ఒక్కడైయున్న ఫారెస్టుగార్డులు ఏమి పని చేయగలరు? కాబట్టి పర్మిటు పద్ధతివల్లన అడవులకు అనేక విధముల నష్టము వచ్చును.

పర్మిటు పద్ధతివలన లాభములు.

అడవి ప్రక్కలనుండు పట్టణములలోని ప్రజలకు తమగడపవద్దనే వంటచెరకు చౌకగా దొరకును. వేరేమియునుసంపాదనలేని బీదవారలు అనేకమంది అడవికి పోయి కట్టెలుకొట్టి అమ్ముకొని తమకు ఆదినమున కావలసిన దానిని తిండికి సులభముగా సంపాదించి జీవనముచేయగలరు. ఇట్టి జీవనము లేని యెడల వీరందఱు దొంగతనమునకు ప్రారంభింతురు. కాబట్టి అట్టివారికిని బీదరయితులకును ఈ పద్ధతిచాల యుపయోగముగా నుండునని కేశవపిళ్లగారు నొక్కి చెప్పిరి.

ఈపద్ధతివలన సర్కారు డిపోపద్ధతి

ప్రజలకు కావలసిన కట్టె అంతయు వెలలో హెచ్చు మార్పులు లేకుండ సాధారణముగ సంవత్సరపు పొడుగునను దొరుకును. ఈ పద్ధతివాడుకలోనికి వచ్చి 10 సంవత్సరములు కావచ్చినది. దీనివలనసర్కారునకు లాభముగా నున్నదని చెప్పుటకువీలు లేదు. ఏలయన ఫారెస్టు అధికారుల జీతము వగైరా ఖర్చులన్నియు కలుపుకొని చూచిన యెడల బజారులో నమ్ముధరలకు సర్కారు డిపోలో వంటచెరకు అమ్మినప్పుడు సాధారణముగా సర్కారునకు నష్టము వచ్చునుగాని లాభము హెచ్చుగా కనుపడదు. ప్రజలకు కొంతవఱకు దీనివల్లన సదుపాయములు కనపడుచున్నను ఫారెస్టు ఉద్యోగస్థులపని దీనివలన చెడిపోవుటచేతను తత్కాలమునకు యేర్పఱచినక్రిందిఅధికారులు మోసముచేసి నప్పుడు వారిని పట్టుకొనుటకు మిక్కిలి శ్రమకలుగుచుండుట చేతను ఈ డిపోపద్ధతి మొత్తము మీదఫారెస్టు డిపార్టుమెంటు వారికి నష్టమే యనిచెప్పవచ్చును. కలపకొట్టుపని అంతయు కంట్రాక్టు పద్ధతిమీద విడిచినయెడల ఫారెస్టు అధికారులు తమ కాలమునంతయు అడవిని పెంచుటయందును క్రొత్తపద్ధతు లేర్పరచి వృద్ధిచేసికొనుటకును ఉపయోగపరచుకొనవచ్చును.

గుత్తపద్ధతి.

అడవులలోకొంతభాగమును ప్రత్యేకపరచి దానిని కొంతకాలము లోపల కొన్ని షరతుల మీద పట్టుకొని పోవుటకు కొంతసొమ్మునకు అమ్మివేసిన యెడల ఆ యడవులను కొనుక్కొనిన వారు కొట్టుకొని పోయి వారికి లాభము

వచ్చునని తోచినచోట్ల అమ్ముకొందురు. ఇట్టి పద్ధతివలన పైనిచెప్పిన ప్రకారము కొన్ని లాభము లున్నవిగాని కొన్నిచోట్ల కంట్రాక్టుదారులందరు ఏకమై వెల హెచ్చించి వంటచెఱకు దొరకని కాలములలో ప్రజలను బాధింపవచ్చును. ఇట్టివి జరుగకుండ అవసరమైనచోట్ల సామాన్యపు ఖరీదునకు కలప దొరుకునట్లు సర్కారువారు అవసరమైనప్పుడు డిపోలను పెట్టినెడల ప్రస్తుతము కంట్రాక్టు పద్ధతియే ఈ దేశములో బాగుగనుండునని తోచుచున్నది. సర్కారువారికంటె కంట్రాక్టుదారులు అడవులను చక్కగా కొట్టుకొనగలరు. చక్కగా జేరవేసికొనగలరు. దొంగతనము జరుగకుండ కాపాడుకొనగలరు. అడవిచుట్టు నుండు గ్రామములలోని బీదవారలకు సంవత్సరముపొడుగునను పనిచూపించి జీవనము ఏర్పరచగలరు. అడవి పరిపాలకులు తీరికగా ఇతర పనులను చేసికొనవచ్చును. కింది తరగతి యుద్యోగస్థులు పెట్టుబాధలను తగ్గింపవచ్చును. కాని కంట్రాక్టరులకు అడవులను ఇచ్చివేయునప్పుడు అవసరమైనచో అడవి చుట్టునుండు గ్రామములోని ప్రజలకు కావలసినకఱ్ఱను స్వల్పకరీదునకు నిర్ణయముగా నిచ్చుచుండుటకు ఏర్పాటుచేయవలసియుండును.

గడచిన 5 సంవత్సరములలో ఈ రాజధానిలో ఫారెస్టు డిపార్టుమెంటువారు అడవి ఫలసాయమును సాధ్యమైనంతవఱకు కంట్రాక్టుదారులకు ఇచ్చి వారి మూలముననే సర్కారునకు రావలసినసొమ్మును చాల భాగమును వసూలుచేసిరి. ప్రక్కపట్టీనిచూచిన ఈ విషయము బోధపడగలదు.

తగిన కంట్రాక్టరులు దొరకనిచోటులందేగాని తక్కినచోట్ల డిపార్టుమెంటువారు స్వయముగా ఫలసాయమును రాబట్టి అమ్మరు. కాని పట్టణములకు దూరముగనున్న అడవులలోను, చలిజ్వరపు బాధలు హెచ్చుగనున్న అడవులలోనువచ్చు ఫలసాయమును కొనుటకు గుత్తదారులు సాధారణముగా నక్కరు. కావున తగిన వెలరానిచోట్ల డిపార్టుమెంటువారే ఈపనులన్నియు చేయవలసివచ్చును. ఇప్పటికిని కొన్ని జిల్లాలలో ఫారెస్టువారే ఈ వ్యాపారమును చేయుచున్నారు. మఱికొన్ని జిల్లాలలో అక్కడక్కడ పర్మిటుపద్ధతినిబట్టి అడవి ఫలసాయమును ఖర్చుచేయుచున్నారు. 1914 వ సం॥ రములో సర్కారువారికి వచ్చిన ఆదాయము ఏయేమార్గముల నెంతెంతవచ్చినదో తెలియుపట్టి నీక్రింద చేర్చియున్నాము ౬౧౨-వ పుటచూడుము.

అడవిలాభమా సేద్యములాభమా.

మానవ సంచారములేని ప్రదేశములో నెవ్వరు పెంచకయే చెట్లు తమంతటతామే పెరుగును. దాని పెంపునకు అనుకూలమగుస్థితిగతులున్న చోట్ల ఏచెట్టుగాని నేవళముగ పెరుగును. లేనిచోట్ల పెరుగక నేలబారుననేయుండును. మానవుల సంపర్క-

1914 సం॥ రములో సర్కారు స్వయముగా వసూలుచేసిన మొత్తములు 1913 సం॥ రమున కన్న తగ్గియున్నవి; కంట్రాక్టరుల మూలమున వసూలయిన మొత్తములు 1913 సం॥ రముకంటె హెచ్చినవి.

| ఫలితము వసూలుచేయు ఏజంసీ. | మంచిగంధముతప్ప యాకత్తు కలప. ఘ. అడుగులు | | వంటచెఱకు ఘ. అడుగులు. | | వెదుళ్లు సంఖ్య. | | చిల్లరఫలసాయములు (గడ్డి మేతపన్ను వగయిరా) విలువ రూ. పాయలు | |
|---|---|---|---|---|---|---|---|---|
| | 1912—13 | 1913—14 | 1912—13 | 1913—14 | 1912—13 | 1913—14 | 1912—13 | 1913—14 |
| సర్కారువలన ... | 7,10,239 | 5,79,081 | 53,03,751 | 32,59,127 | 43,46,266 | 10,55,627 | 54,744 | 58,626 |
| కంట్రాక్టరులవలన ... | 39,42,873 | 47,34,744 | 1,55,28,347 | 1,86,78,505 | 2,98,31,911 | 4,01,21,724 | 17,79,763 | 15,09,322 |
| హక్కుదార్లవలన ... | 34,193 | 2,38,584 | 1,54,854 | 7,92,444 | 18,685 | 2,163 | 26,274 | 28,044 |
| ఉచితముగా అనుభవించిన బాపతు ... | 1,19,098 | 1,88,684 | 1,05,296 | 30,104 | 1,08,106 | 79,283 | 12,676 | 6,682 |
| రాజధాని మొత్తము ... | 48,06,403 | 57,41,093 | 2,10,92,248 | 2,27,60,180 | 3,42,99,968 | 4,13,38,797 | 18,73,457 | 16,02,674 |

౬౫

## మదరాసు రాజధానిలో 1913-14 సం॥ రములో అడవి ఫలసాయమువలని ఆదాయము.

| ఫలసాయముయొక్క వివరము. | సర్కారు మూలముగా | వర్తకుల మూలముగా | ఉచితముగా నిచ్చినది | హక్కుదార్లు కొట్టుకొనినది. | మొత్తము. |
|---|---|---|---|---|---|
| కలప :— | | | | | |
| గుగ్గిలపుచెట్టు ... రూ. | 26,359 | 1,68,522 | ... | ... | 1,94,881 |
| టేకు ... | 1,73,935 | 49,726 | 2,261 | 1,725 | 2,27,647 |
| నల్లమద్ది ... | 48,638 | 56,711 | ... | ... | 1,15,349 |
| వేగిస ... | 12,490 | 47,179 | ... | 275 | 59,944 |
| ఏపి, (నరేపి) ... | 216 | 1,159 | ... | ... | 1,375 |
| విరుగుడుచేవ ... | 4,915 | 5,872 | ... | 725 | 11,512 |
| కొండతంగేడు ... | 5,971 | 1,237 | ... | 600 | 7,808 |
| మంచిగంధము ... | 15,607 | 14,751 | ... | ... | 30,358 |
| తుమికి (కోవిదార*) ... | ... | 325 | ... | ... | 325 |
| కొంగు † ... | 12 | 4,060 | 1,180 | 725 | 32,877 |
| చెన్నంగి, వెంకేకు, వరగోగు ... | 4,353 | 974 | ... | ... | 5,327 |
| ఇతరజాతులు ... | 2,86,585 | 43,74,228 | 1,85,243 | 2,07,634 | 50,53,690 |
| కలప మొత్తము ... | 5,79,081 | 47,34,744 | 1,88,684 | 2,38,584 | 57,41,093 |
| వంటచెఱకు | 82,59,127 | 1,86,78,505 | 30,104 | 7,92,444 | 7,60,180 |
| వెదుళ్లు ... | 20,282 | 2,13,800 | 899 | 342 | 2,35,323 |
| చిల్లరఫలసాయములు :— | | | | | |
| మేకగడ్డి ... | 8459 | 6,81,849 | 5,815 | 2,066 | 6,98,689 |
| ఆవురుగడ్డివగైరా ఇండ్లపైకప్పు ... | 842 | 9,219 | 93 | 69 | 10,223 |
| చింతపండు, కరక్కాయి, కుంకుడకాయలు, ముష్టివిత్తనములు ... | 13,342 | 97,456 | ... | ... | 1,16,798 |
| కొమ్ములు, తేనె, మైనము, బంక ... | 4028 | 4,506 | ... | ... | 8534 |
| దూపదామర, ఏలక్కాయలు, మిరియములు ... | 279 | 22,820 | ... | ... | 18,099 |
| తంగేడుచెక్క, వెంబాందం ... | 426 | 2,45,945 | 1 | ... | 2,46,372 |
| మైకా, రాయి, కంకర ... | 1 | 66,669 | 512 | ... | 67,182 |
| Platters వగైరాలకు ఆకులు ... | ... | 567 | ... | ... | 567 |
| ఈత, తాటి ఆకులు ... | 9 | 9,056 | 644 | ... | 9,709 |
| ఎరువు, చెత్త ... | ... | 87,876 | ... | ... | 87,876 |
| కచ్చూరము ... | 13,995 | ... | ... | ... | 18,095 |
| ఇతరపదార్థములు ... | 11,245 | 3,43,359 | 117 | 25,909 | 3,80,630 |
| చిల్లరఫలసాయముల మొత్తము ... | 53,626 | 15,09,822 | 6,682 | 28,044 | 16,02,674 |

* శ్రావణ నిఘంటు † అరవమునుండి.

ముగల అడవులలో నిట్లుగాదు. మానవుడు తనకు కావలసిన కఱ్ఱను అడవినుండి తెచ్చుకొనునప్పుడు ఆ అడవికి ఒకానొకప్పుడు ఉపకారమును చేయును. మఱియొకప్పుడు అపకారమును చేయును. ఎట్లనగా చెట్లు చిక్కగానుండి యొకదాని వృద్ధికి మరియొకటి ఆటంకముగానున్న చోట్ల బలహీనమైన చెట్లను కొట్టివేసిన యెడల బలముగల చెట్లు మరింత వేగముగా పెరుగును. బలముగల చెట్లనన్నిటిని నరికొట్టివేసిన యెడల బలహీనమగు చెట్లును, వ్యాధి పీడితమైన చెట్లును అడవియందు జేరి అడవి శీఘ్రకాలములో నాశనమగును. ఇది గాక చెట్లుదట్టముగనున్న అడవిలో వంకరటింకరలుగానున్న చెట్లనుకొట్టివేసిన యెడలతిన్నగనున్న చెట్లు చక్కగా పెరుగును. వంటచెఱకు కావలసినప్పుడు వ్యాధి పీడితమైన కొమ్మలను నరికిన యెడల తల్లిచెట్టు బాగుగా పెరుగును. చెట్లు నరకువానికి అడవిపెంపునందభిలాష లేని యెడల తన కంతగా లాభము లేక పోయినను సులభముగా అడవిని పాడుచేయ వచ్చును. పర్మిటు పద్ధతిని అడవిలోని కలపను కొట్టుకొని పోనిచ్చుచోట్ల ఇట్లే అడవులు దినదినమునకు క్షీణించుచున్నవి.

ఒక ప్రదేశమునందు అడవిని పెంచవలెనా, లేక చెట్లను నరికి వ్యవసాయము చేయవలెనా అనువిషయమును మొదట అడవి శాఖవారు లాలోచింప వలెను. దేశముయొక్క శీతోష్ణ స్థితి, వర్షము, జలాధారముల సంరక్షణ మొదలగు పైనిజెప్పిన నైసర్గికోపయోగములకుగాను మనము పెంచు అడవులుపోగా మిగిలినచోట్ల ఎక్కడ అడవులను పెంచిన లాభము కలుగును? ఎక్కడ పెంచిన నష్టము కలుగును? లాభమునకై వ్యవసాయపు నేలలలో క్రొత్త అడవులను పెంచుకొనువారును ప్రాతఅడవులను వృద్ధిచేయువారును దిగువ చూపినవిషయములను గమనింప వలెను.

౧౬ 1. తమ ప్రదేశములో కావలసిన జాతి అడవులనెక్కడ పెంచిన లాభమువచ్చును కలప ఆ ప్రదేశములో సహజముగా పెరుగునా పెరుగదా? అను విషయము మొదట చూచుకొనవలెను. ఇది భూసారము, వర్షస్థితి, సముద్రపు మట్టమునుపైనుండు ఎత్తు, మొదలగు వానిని బట్టి మారుచుండును. టేకు చెట్లు ముంపు నేలలలో పెరుగవు. యూకలిప్టసు చెట్లు ఎత్తుప్రదేశములలోనే గాని పెరుగవు. మంచి గంధపు చెట్లను సముద్రపు మట్టములోనుండు భూములలో పెంచిన యెడల ఆ మ్రాకులందు సువాసనయుండదు. కొన్ని జాతుల చెట్లు అన్ని నేలలయందును ఏదోయొక విధముగ పెరిగినను కొన్ని భూములలో మంచి కలప తయారుకాదు. చెట్లు గిడస బారి నేలనంటియుండును. ఇవే చెట్లు మరికొన్ని నేలలలో మిక్కిలి చక్కగనభివృద్ధి చెందును. కాబట్టి ఏయే స్థలములలో నే యే జాతి చెట్లను పెంచనగునో అడవి శాస్త్రి

సంగతులను చక్కగా నెరిగి వారి నుండి తెలిసికొన వలెను.

2. అడవులను పెంచుటకు తగినస్థితిగతులు పైని చెప్పిన ప్రకారమున్నను కొన్నిచోట్ల అడవిని పెంచుటకంటె వ్యవసాయముచేయుటయే లాభకరముగ నుండును. వ్యవసాయము వలనగాని, పశువులమేతవలనగాని, ఇతర ఉపయోగముల వలనగాని ఒక్కొక్క భూమి మీద సగటున లాభమెంత వచ్చునో చూచుకొన వలెను. వీనివలన కంటె, అడవులను పెంచుటవలననే యెక్కువ లాభమున్న యెడల నక్కడ అడవులను పెంచ నగును. తంజావూరు జిల్లాలోసం॥ రము పొడుగునను నీరు పారుదలనుగు చోట్ల వ్యవసాయము చేయుటయే లాభకరముగాని అడవినిపెంచుట ప్రయోజన కారికాదు. సముద్ర తీరముల నేమియు ఫలింపని ఇసుక నేలలందు సరుగు (చౌకు) మొదలగు అడవులను పెంచుటవలన లాభము కలదు. వరదముంపు గల ప్రదేశములలో కొన్నిచోట్ల పైరులు పెట్టుకొనుట కంటె తుమ్మ, మడ, తిల్ల మొదలగు కలపను పెంచుట లాభకరముగ నుండును.

3. అడవులవలని లాభములు కొన్నిచోట్ల పట్టణ సమీపమును బట్టిగాని, రహదారిలను బట్టిగాని, పడవలు, తెప్పలు పోదగిన కాలువల సమీపమును బట్టిగాని, యేర్పడియుండును. కలపను బండిమీద చేర వేయుటకు నీటిమీద జేరవేయుటకంటె సామాన్యముగా నాలుగు రెట్లు అధికముగ కూలి యగును.

4. వ్యవసాయపు భూముల ఫలసాయము ప్రతిసంవత్సరమును అనుభవమునకు వచ్చును. అడవిలోని ఫలసాయము అనుభవమునకు వచ్చుటకు అనేక సంవత్సరములు పట్టును. సరుగు చెట్లు వేసిన తరువాత 7 సం॥ రములకు ఫలితము నిచ్చును. తుమ్మలకు 10 లేక 15 సం॥ రములు పట్టును. టేకుచెట్లు వేసిన 70 మొదలు 100 సం॥ రములకు గాని పూర్తిగా ఫలము నియ్యవు. కాబట్టి అడవి పెంచువాడు తత్కాల ఫలితమును గోరువాడు గాక ధనికుడుగా నుండవలెను.

5. అడవియొక్క విలువ ఆయా ప్రదేశములలో నుండు జనసంఖ్యనుబట్టి యుండును. కూలి పనులకు బొత్తిగ మనుష్యులు దొరకనిచోట్ల భూమి ఖామందు లెంతఆశపడినను కొన్ని భూములు వ్యవసాయముకాక అడవులుగానే యుండును. అట్టిచోట్ల నున్న నేలలను అశ్రద్ధగా విడిచివేయక అడవులుగా పెంచుట లాభకరము. వ్యవసాయమునకు కావలసినంత మంది అడవి పెంచుట కక్కరలేదు. కొద్దిపాటి జన సంఖ్య యుండిన చాలును. కాబట్టి చలి జ్వరాది వ్యాధులు ప్రబలముగనున్న కొండప్రదేశములలో వ్యవసాయము చేయుట కంటె అడవులను పెంచుటయే లాభకరము.

6. ఇతర ప్రదేశముల నుండి సులభముగా కలప దిగుమతియగుటకు తగిన వీలు గల

చోట్ల క్రొత్తగ అడవులను పెంచిన లాభ ముండదు. ఇంగ్లాండు దేశము నలుప్రక్కల సముద్రతీరము గల ద్వీపమగుటచేత నాదేశమున కితర దేశములనుండికలప నీటిమీద సులభముగను చౌకగను దిగుమతి కాగలదు. కాబట్టి ఈ దేశమునందుండు విలువగల భూములలో అడవి పెంచి వానినుండివచ్చు కలపను పైనుండి వచ్చు కలపతో సమానమైన వెలల కమ్మిన ఎడల నేమియు లాభ ముండదు. అట్టి చోట్ల అడవులను పెంచుట వలన నష్టమేవచ్చును. కాని ఇంగ్లాండులో కూడ విలువలేని కొండ నేలలు కొన్ని గలవు. అట్టి చోట్ల అడవులను పెంచిన ఎడలకొంత వరకు లాభము రావచ్చును.

కాబట్టి ఏప్రదేశములందు అడవులను పెంచిన లాభమో తెలిసికొనుటకుసామాన్య సూత్రము లేవియునుపనికిరావు. ఆయా దేశముల స్థితిగతులను బట్టియు, భూమి విలువ, శీతోష్ణస్థితి, జన సంఖ్య మొదలగు పైని జెప్పిన కారణముల నన్నిటిని బట్టియు నాలోచించి ఆయా ప్రదేశములకు తగిన పద్ధతుల నేర్పరచుకొన నగును.

ప్రాత అడవులను వృద్ధిచేయుట.

ఇదివరకే కొంత కాలమునుండి పెరుగుచున్న అడవిని మనము పెంచవలెననిన మనమే పద్ధతిని పనిచేసిన హెచ్చు లాభము హెచ్చు కాలము వరకు వచ్చునో చూచుకొనవలెను. కఱ్ఱకు సమీపములో తగినవెల యున్నయెడల అడవిలో మనకు పనికిరాక కొట్టివేసిన కఱ్ఱల అమ్మకమువలననే అడవిని పోషించుటకుకావలసినసొమ్మంతయు వచ్చివేయును. ఈ మరమ్మతులవలన అడవికి శాశ్వతలాభము కలుగుటయేగాక మనకు ప్రస్తుత లాభముకూడకలుగును.

పనికిరాని కలపను ఏరికొట్టివేయుట.

మనము పనికిరాదనికొట్టి పారవేసినకఱ్ఱలను కొనువారు చుట్టుప్రక్కల లేనియెడల కొట్టివేయుటకేగాక ఈకఱ్ఱను అడవిలోనుండి బయటకు తీసివేయుటకును కాల్చివేయుటకును తిరిగి కొంత ఖర్చుఅగును. కొట్టిపారవేసినకఱ్ఱ చిల్లరగాపడియున్న ఎడల నిప్పంటుకొని అడవియంతయు నాశనమై పోవచ్చును. కాబట్టి యెంతఖర్చు అయినను ఈ యెండు కఱ్ఱలను, కంపలను అడవిలో నుంచకూడదు. కాబట్టి ఒకఅడవిలో మనము చేయదలచినపనులు మన కఱ్ఱకుగాని ఇతర ఫలసాయమునకుగాని రాబోవు ఖరీదులను బట్టియు ఆయా దేశములందుండు కూలిపనుల రేటులను బట్టియు నుండును. ఒక పట్టణపు సమీపమున అడవి యున్నయెడల పనికిరాని కఱ్ఱను మనమెంత కొట్టిన మన కంతయు లాభమే. అగమ్యమైన ప్రదేశములోనే ఈ అడవి యున్నయెడల మనముచేయునదంతయు దండగయే అగును.

మొదలంట నరుకుట.

కొన్ని చెట్లను విత్తనము వేసి పెంచుటకంటె ప్రాత చెట్లను మొదలంట నరికి వాని మొండెములను చిగుర్చుకొన నిచ్చినయెడలచాల లాభకారిగా

యుండవచ్చును. అట్టి అడవులలో నేల నంటియున్న తుప్పలను కొంతవరకు నరికివేసి అవసరమైన చోట్ల విలువగల టేకు మొదలగు చెట్ల విత్తనములను తగిన క్రమములో నాటవలెను. అడవి విస్తారముగనుండి నాటుట కసాధ్యముగా నున్న యెడల విత్తనములను అక్కడక్కడ నొక్కొకటి చల్లవలెను. కాని యిట్లు చల్లిన గింజలనేకములు మొలవవు. కొన్నిటిని ఎలుకలు తినివేయును. కొన్ని తగిన వానలు లేక యెండిపోవును.

పలుచన జేయుట.

కొన్ని అడవులలో నేలలేని కొన్ని చెట్లు ఎత్తుగా చిక్కగా పెరిగి నేలమీద నీడ హెచ్చయి తగినంత వెలుతురు లేకపోయిన యెడల నేల గలచెట్లు పెరుగకపోవచ్చును. లేత చెట్లు అడవిలో నొత్తుగా నొకదాని పైనొకటి యున్న యెడల చెట్లు సన్న బారి పోవుచుండవచ్చును. ఇట్టి చోట్ల కొన్ని కొమ్మలనుగాని, కొన్ని చెట్లనుగాని నరికి అడవిని పలుచన జేసి ఎండయు వెలుతురును నేలకు జేరనీయవలెను.

వడ్డాణము నరుకుట.

ఇట్లు పలుచన చేయునప్పుడు కొన్ని చోట్ల చెట్లను పూర్తిగా కొట్టివేయరు. ఏయే చెట్లను కొట్టివేయవలెనో వానిని నిర్ధారణచేసి వానికి గుర్తులు వేయుదురు. పిమ్మట ఆ చెట్ల మొదట చెట్టుచుట్టును వడ్డాణమువలె చేవవరకు కాటు పెట్టుదురు. ఇట్లు కొట్టిన చెట్లకు తగినంత ఆహారము వేళ్లనుండి కొమ్మలకు ప్రవహింపక పోవుటచేత చెట్టు క్రమముగా చచ్చిపోవును. ఒకానొకప్పుడు చెట్టిట్లు చచ్చుటకు రెండు సంవత్సరములు పట్టును. కొట్టిన చెట్లు నేలమీద చెత్తలో పడియున్న యెడల అగ్నిభయము హెచ్చుగనుండును. వడ్డాణము నరికిన చెట్లు నిలువబడియున్నంతకాల మంతగా అగ్ని వలని యుపద్రవముండదు. బర్మాదేశములో కూడ టేకుచెట్లకిట్లు వడ్డాణము నరుకుదురు. * ఈ చెట్లు క్రమముగ రెండుసంవత్సరములలో చచ్చి ఎండిపోయి చెట్టు కొట్టునప్పటికి మిక్కిలి తేలికయయి నీటిమీద రవాణాచేయుటకు అనుకూలముగనుండును కాని యిట్లు నెమ్మదిగా చచ్చుటచేత చెట్టులోనుండెడు చమురు హారించి పోయి టేకుయొక్క విలువ తగ్గిపోవును. ఇందుచేతనే బర్మా టేకుకంటె మలబారు టేకు మంచిదని చెప్పుదురు. వడ్డాణము నరుకుటవలన ఎండిన చెట్లు అడవిలో నెక్కువగానున్నప్పుడు అడవికి అగ్నిభయము హెచ్చుగా నుండు ననియు, ఎప్పటిచెట్లనప్పుడు కొట్టగనే అడవిలోనుండి తీసివేయునెడల మంచిదనియు కొందరి యభిప్రాయము.

తీగెలను చంపుట.

కొన్నిచోట్ల చెట్లమీద తీగెలు అల్లిబిల్లిగ నలుముకొని తల్లిచెట్లను పెరుగనియ్యవు. కొన్ని చోట్ల బదనికలు అనగా చెట్లమీదనే పుట్టిన

* పచ్చి కర్రలను నీటిమీద రవాణాచేయుటకు, మిక్కిలి బరువైనయెడల కొన్ని వెదుళ్లను జేర్చి తెప్పకట్టిన తేలికగాపోవును. కాబట్టి టేకుచెట్లకీ రాజధానిలో వడ్డాణము నరకరు.

తీగెలును, ఇతరచెట్లును, తల్లిచెట్టు యొక్క బలమునంతయు పీల్చివేసి దానిని కృశింపజేయును. ఇట్టి తీగెలను, బధనికెలను చంపివేయవలెను. కాబట్టి ప్రాతఅడవుల వలన శాశ్వతము లాభము వచ్చునట్లు జేయుటకు 1. పనికిరానిచెట్లను నరికివేయుట, 2. మొదలంట నరుకుట 3. తుప్పనరకుట 4. గింజ నాటుట 5. పలచనజేయుట 6. వడ్డాణము నరుకుట 7. తీగెలను చంపుట ఇవి యేడును ముఖ్యమైన పనులు.

క్రొత్త అడవులను పెంచుట.

ఈరాజధానిలో 1914 సం॥ రములో 2,02,097 ఎకరముల నేలయందు క్రొత్త అడవులను పెంచి యున్నారు. హిందూ దేశములో బర్మాతప్ప తక్కిన రాజధానుల యందుకంటె ఈ రాజధానియందే ఇట్టిఅడవుల పెంపుహెచ్చుగ జరుగుచున్నది.

పెంపుడు అడవులు.

తగిననేలయు, వర్షమును గలిగి మనకు కావలసినచెట్లులేని అడవులలో మనము క్రొత్త చెట్లను పెంచవలసి వచ్చును. ఇట్లు పెంచిన అడవులలో మలబారులోని నీలాంబూరు టేకు అడవులు మిక్కిలి పురాతనమైనవి. 1840 సం॥ రములో అప్పటి మలబారు కలెక్టరు వీనిని పాతించుటకు ప్రారంభించెను. 4200 ఎకరముల నేలలో నీపెంపుడు టేకు అడవి లదు. ఈ అడవుల మీద 1894 సం॥ రమునాటికి $10\frac{1}{2}$ లక్షల రూపాయలు ఖర్చు అయియుండెను. అప్పటికి ఆయడవి మీద ఖర్చుపడిన సొమ్మంతయు తిరిగి జమ వచ్చెను. ఈ అడవికి పూర్ణమైన వయస్సు అనగా 95 సం॥ రముల వయస్సు వచ్చువరకు సం॥ రము ఒక్కంటికి అడవిమీద 5 లక్షల రూపాయల లాభము రాగలదని ఫారెస్టు అధికారములు లెక్కించియున్నారు. అనగా సంవత్సరమునకు ఎకరమునకు 100 రూపాయలకు పైగా లాభమేర్పడియున్నది.

బర్మా దేశములోకూడ పెంచిన టేకు అడవులు మిక్కిలి హెచ్చుగ నున్నవి. అక్కడి రయితులకుకూడ అడవి నేలను మార్చి మార్చి వ్యవసాయము చేయు ఆచారముగలదు. కాని వారు వ్యవసాయము చేయు భూమిలో తాము చల్లుపైరు విత్తనములతో పాటు టేకు విత్తనములను చల్లి ఆ చెట్లుచక్కగ పెరుగునట్లు వారు చూచుకొనుచుండు షరతుతో వారికానేల లియ్యబడును. అడవి పెరిగినపుడు వారా నేలలనువిడిచి క్రొత్త నేలలకు వ్యవసాయమునకుబోవుదురు. ఈరాజధానిలో కొన్ని జిల్లాలలోకూడ నిప్పుడీపద్ధతి ప్రకారముకొన్ని అడవులను పెంచుచున్నారు.

ఒక ప్రదేశములో చెట్లు వృద్ధికావలెననిన సాధారణముగా ఆ ప్రదేశము లోనికి మనిషిగాని జంతువునుగాని పోనియ్యకుండ కాపుదలచేయుచు అగ్ని భయము లేకుండ జూచుకొనిన యెడల అడవి తానే పెరిగి పోవును. 1878 సంవత్సరములోని కరవులకు

జనసష్టముచే పాడుపడిన గ్రామము లుండు ప్రదేశము లనేకములు కడప, బళ్లారి ప్రాంతములయందిప్పుడు దట్టమైన అడవులతోనిండి యున్నవి. గహనస్థమైనఅడవిమధ్యనుండు దేవాలయములు, చింతలు మామిళ్లు మొదలగు పెంపుడు చెట్లు, పాటిసేలలు వీనివలన ఈ ప్రదేశములు గుర్తింప నగును. ఇవిగాక రాజకీయ సంబంధమైనకారణములచే ప్రజలు తమతమ గ్రామములు విడిచి పోవలసి వచ్చిన కొన్నిచోట్ల దట్టమైన అడవులిప్పుడు అల్లుకొని యున్నవి. పూర్వ మొకప్పుడు జగత్ప్రసిద్ధమైన విజయనగర సామ్రాజ్య వైభవములను సాటించు హంపీలోని పురాతనపు కట్టడములు ఇప్పుడు అరణ్య మధ్యమున గన నగును. వీనిని బట్టి మానవుని సంపర్కము లేనిచో ఈ హిందూ దేశమున అడవి తనంతట తానే పెరుగ గలదనిస్పష్టముగ చెప్పనగును. కాని ఇట్లు సహజ వృద్ధిగల అడవులలో టేకు మొదలగు విలువగలచెట్లు మిక్కిలి నెమ్మదిగ వ్యాపించును.

**టేకుఅడవులు.**

ఒక తల్లి టేకుచెట్టునుండిపడిన గింజ తల్లి చెట్టునుండి విస్తారముదూరముపోజాలదు. ఈ గింజ బరువైనదగుటచే తినుటకుపక్షులయిననుదీనిని దూరమున కెత్తుకొనిపోవు. ఎలుకలు, ఉడతలుమాత్రము కొంతదూరము ఎత్తుకొనిపోయి పడవేయవచ్చును. కానివీనినోటబడినగింజలు చాలభాగము మొలవనేరవు. ఇందుచేత టేకు అడవుల్ననుమనము పెంచవలెనని మనము టేకువిత్తనములను అడవిలో నాటవలెను. లేదా మొక్కలను పాతవలెను. గింజలను మనము విచ్చలవిడిగ చల్లినయెడల అందులో పదింటతొమ్మిది గింజలు మొలవవు. కాబట్టి మనము వేయదలచిన గింజలను మే, జూను, నెలలలో నొక వర్షదినమున గోరువెచ్చని నీళ్లలో 24 గంటలకాలము నానబెట్టవలెను. పిమ్మట ఈగింజల నొక గోగుగాబోసి ఆగోగును తడిఇసకతో మూసిపెట్టవలెను. అంతట ఈగింజలు మొలకలెత్తును. ఇంతకు పూర్వమే అడవిలో ఆరు అడుగులకొకటి చొప్పున గెడ్డపారతో ఆరు అంగుళములు లోతుగల దొలకలనుచేసి యుంచవలెను. ఈ దొలకలలో అయిదంగుళములవరకు మట్టి వేసిపూడ్చి పిమ్మట మొలకయెత్తిన గింజను పెట్టి దానిపైని తిరిగి మట్టితో పూడ్చివేయవలెను. ఇట్లు ఒక్క ఎకరమునకు రమారమి వేయిచెట్లు వేయవచ్చును. ఇదివరకే చెట్లున్న చోట వాని నీడలో మొలకలువేయకూడదు. ఈ మొక్కలు పెరుగుచురాగా 10 లేక 12 సంవత్సరములలోపల వీనిలో నాదారు చెట్ల నన్నిటిని కొట్టివేయవలెను. మొట్టమొదట ఒత్తుగాపాతిపెట్టుటచే చెట్లుబంకరటింకరలుగా పోకుండ నిలువుగా పెరుగును. ప్రక్కలకు పెరుగు చిన్నకొమ్మలను చిటికినవ్రేలులావు కాక పూర్వమే మొదటినుండి అంగుళము దూరములో కోసివేయవలెను. ఇట్లు కోయుట చేత కూడ చెట్లు నిలువుగా పెరిగిపోవును.

టేకు. కర్రకు వంకరలున్నకొలది వెలతగ్గి పోవును. పైనిజెప్పినట్లు మొదట ఒత్తుగనాటి పిమ్మట ప్రక్క కొమ్మలను శ్రద్ధగ కోసివేసిన యెడల మంచి నేలలో టేకుచెట్టును ఒక్క కొమ్మయినను లేకుండ 60 లేక 70 అడుగుల ఎత్తువరకును పెంచవచ్చును. కాని చెట్లు కొంతవరకు పెరిగిన తరువాత ఒత్తుగానున్న యెడల వానికి తగినంత వెలుతురు చాలక చక్కగా పెరుగవు. కాబట్టి చక్కగ తెలిసినవారలు ఏయే చెట్లను కొట్టవలెనో యోచించి నాదారువాటిని జబ్బువాటిని కొట్టివేసి మిగిలినవి పెరుగుటకు తగినసదుపాయములు చేయవలెను.

టేకుచెట్లు సామాన్యమైన నేలలలో ఏడాదికి ఒకఘన అడుగు సాఫయిన కర్రనిచ్చును. నిలంబూరు పెంపుడు అడవులలో కొన్నిచోట్ల చెట్టు ఒక్కొంటికి ఏటేట రెండు ఘనఅడుగులకంటె ఎక్కువగా తేలుచున్నది.

ఎకరము నేలలో టేకుఅడవివేయుటకు అగు ఖర్చును దానివలనవచ్చు రాబడియు తెలియజేయుపట్టీక్రింద జేర్చియున్నాము.

దానిని పట్టిచూడగా 10 సంవత్సరముల లోపల అడవిమీద ఖర్చుపరచిన సొమ్మంతేయు వడ్డీసహా వచ్చివేయు నని తెలియగలదు. 10 సంవత్సరముల పిమ్మట సామాన్యముగ ఎకరము 1-కి సం॥రమునకు 3 రూపాయలకంటె యెక్కువఖర్చు కాదు. కాబట్టి అడవి 100 సంవత్సరములు వరకు పెరుగునని తలచినయెడల మొదటి 10 సంవత్సరములుపోగా మిగిలిన 90 సంవత్సరములకు ఎకరాకు 270 రూపాయలు ఖర్చుఅగును. అప్పటికి ఎకరానేలలో కొట్టనవికొట్టగా చచ్చినవి చానగా 40 చెట్లు నిలిచియుండునని చెప్పవచ్చును. 90 సంవత్సరముల లోపలకొట్టిన చెట్లవలన వచ్చురాబడి ఖర్చులుపోగా 2000 రూపాయలకుతక్కువయుండదు. కడపటి ఫలసాయము చెట్టు 1-కి సగటున నూరేండ్లకు 80 చ. అ. లెక్క ప్రకారము లెక్కవేసినను 40 చెట్లకు 3200 ఘ. అడుగులకలప రావచ్చును. ఈకలప ఘ. అడుగు 1-కి 2 రు చొప్పునలెక్క వేసినను 6400 రూపాయలు జమ రాగలదు. కావున మొత్తముమీద ఎకరా అడవికి నికరాదాయము 6400+1200=8400 రూపాయలువచ్చును. అనగా సంవత్సరము 1-కి $\frac{8400}{100}=84$ రూపాయలుకంటె తక్కువగాకుండ రాబడి వచ్చునని చెప్పవచ్చును.*

టేకు చెట్ల వృద్ధి కనుకూలమగు నేలలు స్థితిగతులు.

నీటిముంపులేని నేల లెట్టివైనను తగినట్లు వర్షములు కురియు ప్రదేశములలో టేకుయొక్క పెంపున కుత్తమమైనవి. వేసవికాలాంతమున అధిక వర్షములు కురిసెడు మలబారు మొదలగు దేశములే చెట్లవృద్ధికి మిక్కిలి ప్రసిద్ధమైనవి. ఉత్తర హిందూదేశమున 25 డిగ్రీలవరకు టేకు అడవులుగలవు. 75డిగ్రీలు మొదలు 81

* ఈలెక్కలు బోర్డుఆఫ్‌రివిన్యూ ఫారెస్టు నెం. 258 తే 10—6—96 ప్రొసీడింగ్సు ననుసరించి వ్రాయబడినవి.

## నీలాంబూరు, ఫారెస్టు, డిప్టికాన్సర్వేటరు జే. ఫర్గూసన్ గారివలన తయారు చేయబడిన టేకు అడవుల జమా ఖర్చు పట్టీ.

### ఒకయెకరము అడవిని పెంచుటకు జమాఖర్చు.

| | | రూ. | అ. | పై. |
|---|---|---|---|---|
| చెట్లు కొట్టుటకు పూర్వము తుప్పు నరకుటకు | ... ... రూ. | 2 | 0 | 0 |
| చెట్లుకొట్టుటకు | ... ... ... | 5 | 0 | 0 |
| కాల్చుటకు | ... ... ... | 0 | 4 | 0 |
| కాల్చినమోళ్లు నరుకుటకు | ... ... ... | 3 | 8 | 0 |
| గుట్టపేర్చి కాల్చుటకు | ... ... ... | 10 | 0 | 0 |
| గుర్తులు పెట్టి గుంటలు త్రొవ్వుటకు | ... ... ... | 3 | 8 | 0 |
| మొక్కనాటుటకు | ... ... ... | 2 | 8 | 0 |
| రెండవకలుపుతీత | ... ... ... | 1 | 4 | 0 |
| మూడవకలుపుతీత | ... ... ... | 1 | 4 | 0 |
| నాలుగవకలుపుతీత | ... ... ... | 1 | 4 | 0 |
| టేకువిత్తనము (2పరలు) | ... ... ... | 0 | 8 | 0 |
| దున్ని మడిచేయుటకు | ... ... ... | 3 | 0 | 0 |
| ఇతర ఖర్చులు | ... ... ... | 2 | 0 | 0 |
| మొత్తము. | ... ... ... | 36 | 0 | 0 |

### తరువాత ప్రతి సంవత్సరమునకు ఎకరా 1-కి.

| | రెండవ సంవత్సరము. | మూడవ సంవత్సరము. | నాలుగవసంవత్సరము. | ఐదవసంవత్సరము. | ఆరవసంవత్సరము. |
|---|---|---|---|---|---|
| మొదటిద కలుపు తీతకు ... | 2 8 0 | 1 8 0 | 1 0 0 | 0 12 0 | 0 12 0 |
| రెండవ కలుపు ,, ... | 2 8 0 | 2 4 0 | 0 12 0 | 1 4 0 | 1 4 0 |
| మూడవ కలుపు ,, ... | 2 8 0 | 2 0 0 | 1 4 0 | 1 0 0 | |
| నాలుగవ కలుపు ,, ... | 2 8 0 | | | | |
| కొమ్మనరుకుటకు ,, ... | 0 4 0 | 0 8 0 | 0 8 0 | 0 12 0 | 0 12 0 |
| మొత్తము ... | 10 4 0 | 6 4 0 | 3 8 0 | 3 12 0 | 2 12 0 |

మొదటి పదిసంవత్సరములలోపల ఒక ఎకరా టేకు అడవివలన ఆదాయ వ్రయములు తెలుపు జాబితా.

| | రూ. | అ. | పై. | | రూ. | అ. | పై. |
|---|---|---|---|---|---|---|---|
| 1. సంవత్సరము. ఖర్చు. | 36 | 0 | 0 | తోపునరుకుటవలన జమ. | 36 | 0 | 0 |
| 2. ,, ,, | 9 | 4 | 0 | | | | |
| 3. ,, ,, | 6 | 8 | 0 | | | | |
| 4. ,, ,, | 5 | 12 | 0 | | | | |
| 5. ,, ,, | 4 | 4 | 0 | | | | |
| 6. ,, మొదలు 10 సం॥ వరకు | 16 | 8 | 0 | | | | |
| మొత్తము. | 78 | 4 | 0 | 300 కర్రలు 1-కి 8 అణాలవంతున | 150 | 0 | 0 |
| 11 సం॥ ,, | 3 | 0 | 0 | | | | |
| నరుకుటకు ,, | 2 | 0 | 0 | | | | |
| 300 చెట్లు లాటువేయుటకు ,, | 7 | 8 | 0 | | | | |
| తెప్పలేకబండిమీద చేరవేయుటకు | 27 | 0 | 0 | | | | |
| మొత్తము. | 39 | 8 | 0 | | | | |
| మొత్తమువెరసి. | 117 | 12 | 0 | మొత్తము. | 186 | 0 | 0 |

డిగ్రీల వేడిమి ఈచెట్టుయొక్కవృద్ధికి మిక్కిలి అనుకూలము. 50 అంగుళములకంటె వర్షము ఎక్కువగాగలచోట్ల టేకుఅడవులు మిక్కిలి యభివృద్ధిజెందును. 30 అంగుళములలోపు గలనేలలలో టేకుచెట్లు పెరుగవు. నీలాంబూరులోనము ద్రపుమట్టము నందును, అనామలై కొండలలో 2500 అడుగుల ఎత్తునను వైనాడులో 3000 అడుగుల ఎత్తునను, కూడ టేకు చెట్లు చక్కగ పెరుగుచున్నవి. కాబట్టి సామాన్యమైన ఎత్తుగల నేలలలో టేకుపెరుగునని చెప్పవచ్చును. కాని నేల బొత్తుగ బందగ నుండుచోట్ల టేకు బాగుగ పెరుగదు. టేకు చెట్లే ప్రత్యేకముగ నుండుచోట్ల కంటెచల్లని నీడనిచ్చు ఇతరచెట్లు కొన్ని వానికి సహాయముగ నున్న చోట్ల టేకుచెట్లు బాగుగ పెరుగునని తోచుచున్నది. ఒక టేకుచెట్లే యున్న అడవిలో వేసవి కాలములో అన్ని చెట్ల ఆకులు ఒకటే సమయమున రాలిపోవుట వలన నేల కాలి చెట్లకు ఉడుకు ఎక్కువ కావచ్చును: అందుచేత ఆకులు రాల్లని ఇతర చెట్లున్న ఎడల వేసవి కాలములో కొంత వరకు టేకుచెట్లకు నీడ యుండును. అనేక రకముల నేలలలో టేకుచెట్లు పెరుగవచ్చును గాని దీని పెంపునకు నీటి ముంపు బొత్తుగ

పనికిరాదని చెప్పియుంటిమి. ఇతర చెట్లు మిక్కిలిచిక్కగనున్న తోట్లను, వెడల్పు వట్టముగ నల్లుకొని యున్న తోట్లను పేకుఅభివృద్ధి కాదు. విస్తారము నీడగాని, పొదలుగాని, చిక్కని గడ్డిగాని పేకు మొక్కలు చిన్నవిగ నున్నపుడు వాని వృద్ధిని ఆటంక పరచును.

మైసూరును, మలబారును వీనికి పుట్టినిండ్లని చెప్ప వచ్చును. ఇవి రెండు మొదలు నాలుగు వేల అడుగుల ఎత్తుగల నేలలలో పెరుగును. ఈ అడవుల వలనసంవత్సరమునకు ఎకరాకు 282 రూపాయలు ఆదాయము రాగలదని మోరుకరు లెక్కపెట్టి యున్నారు.* బజారులో అమ్ము మంచిగంధపు చెక్కలలో తెల్లనిచెక్కలు కొన్నియు, పసిమి వర్ణముగలవి కొన్నియు నుండును. అందు తెల్లనివి లేతకర్ర. పసిమి వర్ణముగలవి చెట్లమధ్య నుండు చేవకర్ర. సముద్రపు మట్టమునకుపై 3000 అడుగుల కంటె క్రిందిభాగములలో మంచి గంధపు తోటలను పెంచిన ఏడలి ఆకర్రలలో సువాసన యుండదు. కాబట్టి మైసూరు మొదలగు కొన్ని దేశములనే దీని యభివృద్ధి హెచ్చుగ నున్నది.

మంచి గంధపు అడవులు.

యూకలిప్టసు అను ఒక దేవదారు జాతి చెట్లను నీలగిరి కొండలలో అడవులుగా పెంచుచున్నారు. ఈ చెట్లు 7000 అడుగుల ఎత్తుమీద చక్కగ పెరుగును. ఈ అడవుల వలన ఎకరమునకు 273 రూపాయల చొప్పున రాబడి రాగలదని మోరుకరు వ్రాసియున్నారు.* ఈ చెట్లకర్రకు సులభముగ చెక్కలు పట్టుటచేత చెదలువలని భయములేని నీలగిరి వంటి మిక్కిలి చలిప్రదేశములలో తప్ప ఈ కర్రయొక్క ఉపయోగ మంతగ మనకు లేదు. దీని ఆకులనుండి ఔషధముల కుపయోగించు నొకవిధమైన తైలమును తీయుదురు.

యూకలిప్టసు చెట్ల అడవులు.

క్యాజురీనా, లేక, చౌకచెట్లు. వీనినికొందఱు సరుగు చెట్లందురు. ఇవి, సముద్ర తీరమునందలి ఇసుక ప్రదేశములలో చక్కగ పెరుగును. ఈ అడవుల వలన సంవత్సరమునకుఎకరము ఒక్కంటికి 3-12-9ఆదాయము వచ్చునని ఈక్రిందిపట్టీవలన తెలియగలదు. బందలలో తుమ్మ అడవులవలన సాలునకు ఎకరమునకు 48 రూపాయలు వచ్చునని మోరుకరు లెక్కించియున్నారు*. కాబట్టి అడవులను పెంచ దలచువారు ఆయాస్థలములనుబట్టి ఏయేజాతి చెట్లను ఎక్కడ పెంచిన లాభమో తగిన అడవిశాస్త్రజ్ఞులనుండి తెలిసికొన నగును.

సరుగు అడవులు తుమ్మ అడవులు.

ఎకరము నేలలో సరుగుచెట్లు పెంచుటకు అయ్యే జమాఖర్చుల పట్టీ.

| | రు—అ—పై. | |
|---|---|---|
| నారు పెంచుటకు | 0—9—0 | |
| గోతులు త్రవ్వుటకు | 0—6—0 | |
| మొక్కనాటుటకు | 0—6—0 | |
| ఘాతులకు | 2—0—0 | |
| | | 3—5—0 |

* Forestry in Southern India, by Morgan.

| | |
|---|---|
| ప్రాటోవరు | 3-5-0 |
| 2 నెలలు 600 చెట్లకు ప్రతి దినము నీరుపోయుట్కు కూలి 1-కి 1 దినమునకు 0-2-0 చొప్పున | 6-12-0 |
| మూడు నెలలు దినము విడిచి దినము నీళ్లుపోయుటకు | 5-1-0 |
| మూడు నెలలు మూడు దినముల కొకసారి నీళ్లుపోయుటకు | 3-6-0 |
| మొదటి సం॥ కు అగుఖర్చు మొత్తము. | 15-3-0 |
| రెండవ సంవత్సరము మూడు దినములకు 1 సారి ఆరు నెలలు నీరుపోయుటకు | 6-12-0 |
| మూడవసంవత్సరము మూడు దినములకొకసారి నాలుగు నెలలు నీరుపోయుటకు | 4-8-0 |
| మొత్తము | 29-12-0 |
| 100 కి 10 చొప్పున ఇతర ఖర్చులు | 3-4-0 |
| మొత్తము ఖర్చు. | 33-0-0 |

10 సంవత్సరములకు సామాన్యముగా 1 సం॥ రమునకు 40 టన్నులు వంట చెరుకు తయారగును. చెట్లుకొట్టుటకు, జేర వేయుటకు అగు ఖర్చులుపోగా టన్ను 1-కి రు 3-0-0 వెలవేసి కొన్నను 40 టన్నులకు రు 120-0-0

| | |
|---|---|
| ఇందులో పెంపకపు ఖర్చు | 33-0-0 |
| వడ్డీ నూటికి 5 వంతున 10 సం॥ లకు | 16-0-0 |
| పైతన్కీదార్ల ఖర్చు 100 కి రు 10 చొప్పున 10 సంవత్సర ములకు | 33-0-0 |
| మొత్తము రు. | 82-0-0 |

పోగా 38-0-0 నికరము ఆదాయమువచ్చును. అనగా సంవత్సరమునకు ఎకరము1-కి 3-12-9 నికరాదాయము వచ్చునని చెప్పవచ్చును.

పైని జెప్పినవిగాక గృహోపకరణముల కుపయోగపడు అడవికర్రలపట్టీ నొకదాని 2-వ అనుబంధముగా జేర్చియున్నాము.

సర్కారు అడవులలో నితరులు కొట్ట కూడని చెట్లయొక్క జాబితాయును, సొమ్మిచ్చి కొట్టుకొనిపోతగిన చెట్లజాబితాయును, గోదావరి కృష్ణా జిల్లాలలో అడవి ఫలసాయమును విక్రయించు వెలలను తెలియుజేయు పట్టీలను 3-4 అనుబంధములుగా జేర్చియున్నాము.

అడవిలోనుండు కొన్ని పక్షులు పురుగులను తిని చెట్ల కుపకారముచేయును. అట్టిపక్షులను వేటకాండ్రు చంపకుండ సర్కారువారు కాపాడుదురు. ఇట్లుచంపకూడనిపక్షుల జాబితా నీక్రింద ఇచ్చియున్నాము.

చంప కూడని అడవిపక్షులు.

| | |
|---|---|
| వానకోవిల | ఏటిఇన్క |
| లకుముకిపక్షి | పిగిలిపిట్ట |
| కప్పపిట్ట | పొన్నంగి పిట్ట |
| పసిరికిపిట్ట | చిన్న చింద |
| పాలపిట్ట | గెంటపిట్ట (బుల్ బుల్) |
| మానుతొలచి | చింద |
| కోకిల | అడవికంపజిత్త |
| కొండపిట్ట | నంబుడిగాడు |
| చెల్లంచి | |

అడవులలో నివసించు క్రూర జంతువుల గూర్చి సంగ్రహముగనైన నిక్కడ వ్రాయుట యవసరమని తలచి గతసంవత్సరములో ఈ రాజధానిలో అడవి జంతువులవలన కలిగిన హానిని తెలుపుపట్టీ నీక్రింద జేర్చియున్నాము.

ఈరాజధానిలో 1914 సం॥ రములో అడవిమృగములవలన చంపబడిన జనసంఖ్య, పశువులసంఖ్య తెలుపు జాబితా.*

| | ఏనుగులు. | పెద్దపులులు. | చిరుతలు | ఎలుగులు. | తోడే. | హైనాలు. | ఇతరమృగములు. | మొత్తము | పాములు. | మొత్తము |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| చచ్చినజనులు ... | 1 | 156 | 115 | 18 | 5 | 11 | 43 | 349 | 1,514 | 1,863 |
| చచ్చిన జంతువులు ... | ... | 2,290 | 9,079 | 18 | 80 | 16 | 92 | 11,575 | 1,712 | 13,287 |

ఈ వ్యాసములో నింతవరకే గ్రంథము పెరిగిపోయినది. వ్రాయవలసిన విషయము లింకను అనేకములు అగాథములుగా నున్నవి. వ్రాయవలయునను నుత్సాహము హెచ్చుగ నున్నను వ్రాయుటకిక్కడ ఎడము చాలదు. కాబట్టి నూతనవిషయములను తెలిసికొనగోరు వారీక్రింద నుదహరించిన 5-వ అనుబంధము లోని గ్రంథములను చదువు కొననగును.

[ఆ. ల.]

1-వ అనుబంధము.

ఇంపీరియల్ ఫారెస్టు సర్వీసు.

ఇండియా గవర్నమెంటు సెక్రిటరీ ఆఫ్ స్టేటువారు అప్పుడప్పుడు ప్రచురము చేయు నిబంధనల ననుసరించి ఈ ఉద్యోగస్థులనువిర్పరతురు. ఈ ఫారెస్టు సర్వీసునకు కొత్తగ పనులునేర్పుటకు నెన్నబడునట్టివారలకు నియమములు 1912 సం॥ అక్టోబరు 8 తేదిగల ఫోర్టు సెంటు జార్జి గజిటీ 1 భాగము సప్లిమెంటులో 1 మొదలు 7, వ పేజీవరకు ప్రచురింప బడియున్నవి.

*ఇంపీరియల్ ఫారెస్టు సర్వీసు.*

అందులో ముఖ్యమైనవి :—

1. విద్యార్థులు 19 సం॥ ల వయస్సునకు లోబడియు 22-కు మించియు నుండకూడదు.

2. ప్రకృతి శాస్త్రములో నేదైన నొక దాని నెక్కువగ నేర్చి, యుండవలెను.

3. జర్మను భాషగాని, ఫ్రెంచిభాషగాని దెలిసి యుండవలెను.

4. కావలెసిన వారికంటె అధికముగ విద్యార్థులున్న యెడల వారిలో పోటాపోటీగా నొక పరిక్ష శివిల్ సర్వీసు కమిషనర్లు చేయుదురు.

5. సామాన్యముగా వీరికి రెండు సంవత్సరములు ఆక్సుఫర్డులోగాని, కేంబ్రిడ్జి లోగాని, ఎడింబరులోగాని విద్య నేర్పుదురు.

6. అనుభవము కొరకు సెలవు కాలములో ఐరోపాలోని అడవులలోత్రిప్పి విద్య గఱపుదురు.

*G. O. No, 989, dated 27th April 1915.

7. అడవి విద్య యందును, మరేదేని అప్పటికి నిర్ణయమైన ఇతర పాండిత్య మునందును పట్టము నిచ్చెదరు. ఇండియాలోని అడవి ఉద్యోగములలో అట్టివారికి అసిస్టెంటు కాన్సర్వేటరు పని నిచ్చెదరు.

8. వీరికి ఇండియా దేశమునకు వచ్చిననాటి నుండి జీతము నెల 1-కి 380 రూపాయలు ఇచ్చి, మద్రాసు ఫారెస్టుకోడ్ 9-వ అనుబంధములో ప్రకటించినట్లు ఈదేశ భాషల నేర్చుకొనుట కును, ఈదేశపు చెట్ల విషయము బోధచేసి కొనుటకును, ఇచ్చటి రివిన్యూ విషయములు తెలిసికొనుటకును, ఆఫీసుపనులు, లెక్కలు వగైరాలు తెలిసికొనుటకును ఒక సంవత్స రము గడువిత్తురు.

మద్రాసు ఫారెస్టు కోడు 12-వ అను బంధములో వీరికి తెలియగల దేశభాషలవివ రమును ప్రకటించి యున్నారు.

ఈ రాజధానిలో నీక్రింద వివరించిన ప్రకారము ఇంపీరియల్ ఫారెస్టు ఉద్యోగస్తు ల కుద్యోగములును జీతములును, ఏర్పడి యున్నవి.

1. అసిస్టెంటు కాన్సర్వేటరు.

రు 380-540. సం॥ రమునకు 40. వంతున వృద్ధి.

2. డిపిటీ కాన్సర్వేటరు.

రు 580-850. సం॥ రమునకు 40 వంతున వృద్ధి. తరువాత 50 వంతున 1250 వరకువృద్ధి.

3. కాన్సర్వేటరు:—

1. వ గ్రేడు 1500 రూపాయలు.

2. వ గ్రేడు 1700 రూపాయలు.

3. వ గ్రేడు 1900 రూపాయలు.

ప్రావిన్షియల్ ఫారెస్టు సర్వీసు.

(a) డేరాడూనులో పరిశోధన విషయమై ప్రావిన్షియల్ ఫారె స్టేర్పడిన శాఖాశాలలో స్టుసర్వీసు పూర్తిగా తేరిన వారిని,

(b) రేంజర్ల పదవినుండి రాదగినవారిని, ఈ ఉద్యోగముల కేర్పరుతురు.

2. ఉద్యోగస్తులు కావలసిన యవసర మునుబట్టి ప్రతి సంవత్సరము సెప్టంబరు నెలలో కొంతమందిని, ఫారెస్టు కమిషనరును మరియొకబోర్డు మెంబరును, మధ్యఖండపు కాన్సర్వేటరును చేరి, చక్కని దేహా రోగ్యమును, విద్యార్థిదశలో చక్కని నడ నడికయుగల పిన్నవారి నేర్పరుతురు. ప్రకృతి శాస్త్రముల పరిచయము ముఖ్యముగ గను నింతురు. ఇంగ్లీషునందును గణితమునందును చక్కని పరిశ్రమ గలవారుగా నుండవ లెను. వీరిని రివిన్యూబోర్డువారు ఏర్పరచి జిల్లా ల అడవి యుద్యోగస్తుల యభిప్రాయమునకు పంపుదురు.

3. దిగువ 6-వ కలములో నుదహరిం చిన ప్రకారము విద్యయందును, దేహాపటు త్వమునందును తగినపరీక్షల తేరవలయును.

4. వీరు 18 సంవత్సరములకులోబడిగాని 25 కు మించిగాని యుండకూడదు.

5. కాలేజిలో చేర్చుకొనుటకు పూర్వము 1 సంవత్సరము డిస్ట్రిక్టు ఫారెస్టు ఆఫీసరువద్ద తరిఫీయతు కావలెను. అప్పుడు వీరికి రూ. 40 జీతమును రూ. 20 ప్రయాణపు ఖర్చు లకును ఇచ్చెదరు. తరిఫీయతు సమయములో

తృప్తిగా పని చేయనియెడల వీరిని త్రోసి వేయుదురు.

6. డేరాడూనుకు పోకముందు వీరిని దేహదారుఢ్యము, ఇంగ్లీషు, గణితములందు పరీక్ష చేయుదురు.

అచ్చట నేర్పు అడవివిద్యను బోధ చేసికొనునంత ఇంగ్లీషు, గణితపరిచయ మవసరము.

7. డేరాడూను పోవుటకుముందు 4000 రూపాయలకు, ఇద్దరినలనా జామీనును, 5 సంవత్సరములు పనిచేయుటకు ఒడంబడికయు నివ్వవలెను. ఈ జామీనుదార్లు ఇండియను కాపురస్థులుగను ఇండియాలో ఆస్తిగల వారుగ నుండవలెను.

8. వీరికి డేరాడూనులో విద్య నేర్చుకొను కాలములో రైలు, ఓడ ప్రయాణపు ఖర్చులుగాక నెల 1-కి 80 రూపాయలను ఉచితముగా నిచ్చెదరు. పరీక్ష అయి మదరాసునకు రాగానే వారికికావలసిన దుస్తులు సొగయిరాలు తీసికొనుటకు రు 480 లు ఇచ్చెదరు. డేరాడూనుకుపోయి కాలేజిలో చేరుటకును పరీక్షలో కృతార్థులైన పిదప తిరిగి వచ్చి చేరుటకును ప్రయాణపు ఖర్చులు శి. స. రెగ్యులేషన్ ప్రకారము మిచ్చెదరు.

9. పరీక్షలో కృతార్థులుకాగానే వీరిని మొదట ప్రొబేషనరీ ఎక్‌స్ట్రా అసిస్టెంటు కాన్సర్వేటర్లుగా నియమింతురు. రెండు సంవత్సరములైన తరువాత క్రమముగాఖాళీలనుబట్టి ప్రావింషియల్ సర్వీసు పనులలో స్థిరముగా వీరిని నియమింతురు. ప్రొబేషనుకాలములో వీరికి జీతము రు 150 లు. అట్టి ప్రొబేషనులో రెండవ సంవత్సరముకూడ జరిగినయెడల 200 జీతము నిచ్చెదరు. ఈకాలములో వీరి స్వభాషగాక రెండవదేశభాషనుకూడ నేర్చుకొనిపరీక్షలో కృతార్థులు కావలయును.

10. 23 సంవత్సరముల వయస్సునకులోపల వీరికిస్థిరమైన ఉద్యోగము ఏర్పడిన యెడల 23 వ సం॥ రము వయస్సు వచ్చువరకు వీరియుద్యోగము పెంషను కాలములో చేరదు.

11. చాలకాలము ఉద్యోగము చేసి, పేరుపొందిన రేంజర్లకు వేరేపరీక్షలు లేకయే ప్రావింషియల్ ఉద్యోగముల నిత్తురు.

12. ప్రోవిన్షియల్ సర్వీసు వారికిగాని రేంజర్లనుండి వచ్చినవారికిగాని ఎక్‌స్ట్రా అసిస్టెంటు కాన్సర్వేటరు పనులనిచ్చి నెల 1 కి 250 జీతమును, ప్రతి సంవత్సరము 20 వంతున 550 వరకు వృద్ధియును ఏర్పరచియున్నారు.

## 2-వ అనుబంధము.*

ఆంధ్రదేశమందు గృహోపకరణములు మొదలగువాని కుపయోగకరమగు అడవి వృక్షములు.

అందుగ—Boswellia serrata
అడవి గోరింట—Erythroxylon monogyum
అడవిమంగ—Randia uligniosa
అడవిమునగ—Limonia alata
అశోక—Polyalthia longifolia
ఇప్ప—Bassia latifolia

* G. O. నెం. 3142 తేది 3—11—1914 చూడు.

*ఇరుసు—Mesua ferrea (rare)
ఇషిరషి—Erioglossum edule
ఉలిమిడి—(Craetava) religiosa
ఉసిరిక—Phyllanthus emblica
ఊడుగ—Alangium lamarckii
ఎఱ్ఱచందనము—Pterocarpus santalinus
ఎఱ్ఱజువ్వి—Ochna squarrosa
ఎలమద్ది—Anoguissus latifolia
ఏపి (నరేప)—Hardwickia pinnata
కడమి—Barringtonia acutangula
కదంబ—Anthocephalus cadamba
కరక—Terminalia chebula
కరల్లి—Carallia integerrima
*కరకాయ (కలిమి)—Limenia americana
కలిగొట్టు—Stereospermum chelonoides
కాచు (కసిరి)—Acacia catechu
కానరేగు—Flacourtia ramoutchi
కాకిదొమ్మ—Atalantia monophylla
కొండ అందుగ—Aglia Roxburghiana (rare)
కొండతంగేడు—Xylia dolabriformis
కొండవావిలి—Vitex leucoxylon
కొండవేప (మదగిరి)—Chukrassia tabularis
కొరివిపాల—Ixora parviflora
కొడిసె—Cleistanthus collinus
గంగరావి—Thespesia populnea
గుండుగు—Casearia graveolens
గరుగ—Garuga Pinnata
గుంపెన—Odina wodier
గుమ్మడి—Gmelina arborea
గొట్టి—Ziziphus xylopyra
చంపకము—Michelia champaca
చారుమామిడి—Buchnania latifolia
చింత—Tamarindus indica
చిందుగ—Albizzia odoratissima
చినాంగి (పుల్లమద్ది)—Terminalia paniculata
చిలకదుడుగ—Polyalthia cerasoides
చీకరేణి—Albizzia amara
చిత్రిబిక్కి—Gardenia lucida
చేతిప్ప—Hymenodictyon excelsum
టేకు—Tectona grandis
తడ—pterospermum suberiofolium
తాండ్ర—Terminalia belerica
తిల్ల—Excaecaeia agallocha
తుమ్మ—Acacia arabica
తుమికి—Diospryos melanoxylon
తురకవేప—Melia azedarach
* తూణు—Cedrela Toona
తెల్లపాల—Wrightia tomentosa
తెల్లపుల్కి—Givotia rottleriformis
తెల్ల విరుగుడు చేవ—Dalbergia lanceolaria
తొర్రెలగ—Limonia acidissima
దానిమ్మ—Punica granatum
దిరిసెన—Albizzia lebbek
దూదుప్పి—Careya arborea
నక్కరేణి (నక్కిబలుసు)—Canthium didymum
నక్కరేణు—Artocarpus lakoocha
నల్లమద్ది—Terminalia tomentosa
నాగగొలుగు—Murraya exotica
నార్బత్కి—Eirolaena condollei
నీటితుమికి—Diospyros ebenum
నీరిజ—Elaeodendron glaucum
నెమలి—Holoptereia integrifolia
పంతి—Gymnosporia poryleasa
పనస—Artocarpus integrifolia
పరిమి—Ziziphus afnoplia
పలవరేణి—Holarrhena antidysenterica
పల్లిగి—Tamarix gallica
పాలగరుడ—Alstonia scholaris
పాలరెంకి—Wrightia tinctor
పాసి—Anoguissus abirnenata

| | |
|---|---|
| పుత్రజీవ—Putranjiva roxburghi | మంచిగంధము—Santalum album |
| పురుగుడు—Dodonea viscosa | మఱ్ఱి—Ficus bengalensis |
| పెద్దబట్టు— Cordiamacliodii | మామిడి—Mangifera indica |
| పెద్దబిక్కి—Gardinia Catifolia | మారేడు—Aegle marmelos |
| పెద్దమాను Ailanthus exelsa | ముసిడి (ముష్టి)-Strychnos nuxvomica |
| *పైరు—Pleneostyla wightii | మొక్కయేప(ముక్కిడి)Schrebera swietenoides |
| పొన్న—Calophyllum inophyllum | రణబిళ్ల (పురుడొన)—Cipodessa fruticosa |
| పొనికి—Gyrocarpus jacquini | రుద్రాక్ష—Guazuma tomentosa |
| పొలికి—Sterculia urons | రేగు—Zizephus jujuba |
| బండారు—Adina cardifolia | రేల—Cassia fistula |
| బట్టగణపు—Stephegyne parvifolia | విరుగుడుచేవ—Dalbergia latifolia |
| బాడిశ—Erythrina indica | వెన్తేకు—Legerstraemia lanceolata |
| బిల్లు (బిల్లుడు)—Chloroxylon switenia | వెలగ—Feronia elephantum |
| బివ—Hemicyclia sepiaria | వేగిస—Pterocarpus marsupium |
| బుక్కపు—Caesalpinia sappan | వేప—Melia azadirachata |
| బూసి—Schleichera trijuga | సీమతంగేడు—Cassia siamea |
| బొట్టుకూర—Cordia fulvosa | సిస్సు—Dalbergia sissoo |
| | సోమి—Soymida febrifuga |

* అరవ పేర్లు.

## 3-వ అనుబంధము.

సర్కారు అడవులలో రిజర్వుడు అనగా కొట్టకూడని చెట్లు.†

| | | | |
|---|---|---|---|
| 1. తుమికి. | 7. కరక్కాయి. | 13. మామిడి. | 19. కాన్గు |
| 2. చందనము. | 8. చింత. | 14. పనస. | 20. చంద్ర. |
| 3. ఇట్టుగి. | 9. జల్లారి. | 15. టేకి. | 21. అడవిజాజికాయ |
| 4. ఎర్ర చందనము. | 10. సాలువ. | 16. బిల్లు. | 22. *పుంగై. |
| 5. పగి (వేగిస) | 11. తంబ. | 17. కొండతంగేడు. | 23. *దాల్చిని. |
| 6. పపి. | 12. ఇప్ప. | 18. కుంకుడు. | 24. ఇరుభోగం |

† 1912 రపు ఫారెస్టు మాన్యుయల్ చూడు. * అరవ పేర్లు.

## 4-వ అనుబంధము.

సర్కారు అడవులలోనుండు చెట్లన్నియు రిజర్వుడు, క్లాసిఫైడు, అన్‌క్లాసిఫైడు అని మూడువిధములుగా విభజింపబడి యున్నవి. రిజర్వుడుచెట్లు అనగా నెవరును కొట్టకూడనివి. 3 వ అనుబంధమునందు క్లాసుసైజులనగా తరగతి విభాగము చేయబడి ఆయాజిల్లాలలో నియమితమగు ఖరీదునకు ప్రజలకు ఇచ్చునవి. ఇందు మూడు తరగతులున్నట్లుగా క్రిందిపట్టీవలన తెలియగలదు. అన్‌క్లాసిఫైడు అనగాతరగతి విభాగముకాని ఇతరచెట్లు. ఈజాతి చెట్లకు నిర్ణయమైన వెలలేదు.

గోదావరి కృష్ణాజిల్లాల అడవులలోని కలప మొదలగువానికి సర్కారు రేట్లు.

| గోదావరి. | కృష్ణా. | |
|---|---|---|
| **1వ క్లాసు.** | | |
| బండారు | తెల్లతుమ్మ | చెక్కు—నివి బండి 1-కి రూ. 5 0 |
| చిరిమాను | తెల్లతుమ్మ | పలకలు తేర్చినవి ,, 7 8 |
| బట్టగణప | బట్టగణప | నెత్తిమోత 0 4 |
| చెనుగు | చిరిమాను | |
| తెల్లమద్ది | నెరేడు | |
| నల్లమద్ది | వెలగ | |
| నెమలి అడుగు | వేప | |
| | పగడ | |
| | పాల | |
| | సోమి | |
| | నల్లమద్ది | |
| **2-వ క్లాసు.** | | |
| తుమ్మ | నల్లరేగు | చెక్కు—నివి బండి 1 కి రూ. 2 8 |
| దిరిసెన | దిరిసెన | పలకలు తేర్చినవి ,, 3 12 |
| చిందుగ | చిందుగ | నెత్తిమోత 0 2 |
| నేరేడు | మద్ది | |
| వేప | రేల | |
| బూరిసి | జన | |
| ముషిడి | తడ | |
| | ముష్టి | |
| | చిల్ల | |

| 3-వ క్లాసు. | | గోదావరి. రూ.అ.పై. | కృష్ణా. రూ.అ.పై. |
|---|---|---|---|
| తాడి | చెట్టు 1-కి | 2—8—0 | 2—8—0 |
| ఈత | ,, | 1—0—0 | 1—0—0 |
| తాటిఆకు. | 1000-కి. | 1—0—0 | 1—0—0 |
| వంట చెఱుకు | | | |
| (ఎండినదిమాత్రము)బోటు టన్ 1-కి. | | 1—4—0 | |
| | బండి 1-కి. | 0—6—0 | 0—8—0 |
| | ఎద్దుమోత | 0—1—2 | 0—1—7 |
| | గాడిదమోత | 0—0—7 | 0-0-10 |
| | నెత్తిమోత | 0—0—3 | 0—0—3 |
| బొగ్గు | బండి 1 కి | 2—8—0 | |
| | ఎద్దుమోత. | 0—5—0 | 0—8—0 |
| | గాడిదమోత | 0—2—6 | 0—4—0 |
| | నెత్తిమోత | 0—1—3 | 0—2—0 |
| లోహములు. | | | |
| చెక్కు—నిరాయి. | బండి 1-కి. | 0—1—0 | 0—1—0 |
| చెక్కు—నరాయి. | ,, | 0—2—0 | 0—2—0 |
| కంకర. | ,, | 0—0—6 | 0—0—6 |
| మన్ను. | ,, | 0—0—6 | 0—0—6 |
| చిల్లర ఫలసాయము:— | | | |
| తంగేడుపట్ట. | బండి1-కి. | 1—8—0 | 1—8—0 |
| | ఎద్దుమోత | 0—5—0 | 0—5—0 |

2 నెత్తిమోపులు=1 గాడిదమోత.  
2 గాడిదమోతలు=1 ఎద్దుమోత.  
5 ఎద్దుమోతలు=1 బండి.  
100 ఘనఅడుగులు=1 బోటు టన్ను.

ఈ వ్యాసము వ్రాయుటయందు పయోగపడిన పుస్తకముల జాబితా నీ క్రిందను దహరించియున్నాము. హెచ్చు విషయములు తెలిసికొన నభిలాష గలవారా గ్రంథములను చూచుకొన వచ్చును.

5-వ అనుబంధము.


| గ్రంథము. | గ్రంథకర్త. |
|---|---|
| 1 ఫారెస్ట్రి ఇన్ బ్రిటిష్ ఇండియా. | బి. రిబ్బన్ ట్రాప్. |
| 2. మాన్యుయల్ ఆఫ్ ఫారెస్ట్రి (౫ సంపుటములు). | డబ్లియు. స్కిలిచ్. |
| i. యుటిలిటీ ఆఫ్ ఫారెస్ట్సు అండు ఫండమెంటల్ ప్రిన్సిపిల్సు ఆఫ్ శిల్వికల్చర్. | |
| ii. ప్రాక్టికల్ శిల్వికల్చర్. | |
| iii. ఫారెస్టు మానెజ్మెంటు. | |
| iv. ఫారెస్టు ప్రొటెక్షన్. | |
| v. ఫారెస్టు యుటిలైజేషన్. | |
| 3. ఫారెస్టుఫ్లోరా ఆఫ్ ది స్కూల్ సర్కిల్, నార్తువెస్టుప్రావిన్సెసు. | ఉపేంద్రనాథ్ కంజీలాల్. |
| 4. ఇండియన్ ట్రీస్. | సర్. డి. బ్రాండిసు. |
| 5. ఫారెస్ట్రి ఇన్ సదరన్ ఇండియా. | మార్గన్. |
| 6. స్టాటిస్టిక్సు ఆఫ్ బ్రిటిష్ ఇండియా. | |
| 7. శివిల్ యెస్టిమేట్సు. | |
| 8. మదరాసురాజధాని ఫారెస్టుడిపార్టుమెంటు వారి ఆన్యుయల్ అడ్మినిస్ట్రేషన్ రిపోర్ట్సు. | |
| 9. మదరాసు రాజధానిలోని పబ్లిక్కు సర్వీసు ఆర్గానిజేషన్ రూల్సు యొక్క అభిప్రాయిట్సు. | |
| 10. మాన్యుయల్ ఆఫ్ ఇండియన్ టింబర్సు. | జె. ఎస్. గ్యాంబెల్ |
| 11. మద్రాసు ఫారెస్టుఆక్టు. | |
| 12. ఫ్లోరా ఆంధ్రికా. | ఎలియట్. |
| 13. ఫ్లోరా శిలివటిక. | మేజర్ బెడ్డోం. |
| 14. 1912 స॥ ఫారెస్టు కమిటీవారి రిపోర్ట్సు. | |
| 15. ప్రిలిమినరీ లిస్టు ఆఫ్ వర్నాకులర్ నేమ్సు ఆఫ్ ఫారెస్టు ట్రీసు ష్రబ్సు అండ్ వుడి క్లైంబర్సు. మదరాసు రాజధాని. | |
| 16. ది ఇంపీరియల్ గజటీర్ ఆఫ్ ఇండియా. 3-వ సంపుటము. | |
| 17. ఎన్సైక్లోపీడియా బ్రిటానికా. ఫారెస్టుఅను వ్యాసము. | |

**అడ్డతీగెల.** గోదావరిజిల్లా ఎల్లవరం ఏజన్సీ డివిజనునకు ముఖ్యస్థలము. ఇదియొక చిన్నపల్లె. జనసంఖ్య 459. ఇచ్చట పోలీసు స్టేషను, రహదారి బంగళా, లోకల్ఫండు ఆసుపత్రియుం గలవు. ఇక్కడ వారమునకొకతూరి సంత జరుగుచున్నది. రంపయుద్ధములో నీ గ్రామము ప్రఖ్యాతిగాంచినది. రంపపితూరీలకు నాయకుడగు చంద్రయ్య మొట్టమొదట నిచ్చటి పోలీసుస్టేషనును ౧౮౭౯వ సంవత్సరము ఏప్రిల్ మాసాంతమున తగులబెట్టెను. ప్రభుత్వమువారు దీనిని వెంటనే మరమ్మతు చేయించి ఇందు పోలీసుసైన్యము నుంచిరి. కాని చంద్రయ్య మరల జూన్ నెలలో ఈ గ్రామము మీఁదికివచ్చెను. ఆనెల ౧౨వ తేది ఒక యూరోపియను అధికారిని పోలీసువారిని గ్రామమునకు వెలుపల నెదుర్కొనగ వారు ౮౮ గంటలు తుపాకులతో యుద్ధము చేసి రక్షణార్థము పోలీసు స్టేషను లోనికిఁ జొచ్చిరి. తరువాత మూఁడు దినములు చంద్రయ్య ఠాణాను ముట్టడించెను. లోనిపోలీసువారు అగ్నిభయముచే నింటి పైకప్పును దీసివైచిరి. వారిసాహాయ్యార్థము వచ్చిన భటులను చంద్రయ్య పాఱఁదోలెను. ఠాణాలోని భటులు ధైర్యము చేసి చంద్రయ్య మీఁదికురికి తాళలేక మఱల లోనికిం జొచ్చిరి. అనేకస్థలములనుండి సిబ్బంది పోలీసువారికి సాయము రాఁగా చంద్రయ్య ఈ ఠాణానువదలి పోయెను.

**అడ్డసరపు కుటుంబము.** అడ్డసరపు కుటుంబము కొంచెము పెద్దకుటుంబములలోనొకటి. దీనిలో గుల్మములు, తీగెలు, గుబురుమొక్కలేగాని పెద్దవృక్షములులేవు. బురదనేలల బెరుగునవి రాతినేలలందును బెరుగునవి మొదలగు నన్నిరకములీ కుటుంబమునఁ గలవు. ఈమొక్కలు విశేషముగ నుష్ణప్రదేశములందు వర్ధిల్లును; కాని మధ్యధరాసముద్రతీరములు 'యునైటెడ్ స్టేట్సు' 'ఆస్ట్రేలియా' మొదలగు దేశములందుఁగూడ గలవు. ప్రపంచమందంతటను నూటముప్పది నాల్గుజాతులును బదునారువందల తెగలును గలవు. మన హిందూదేశమునందును బ్రిటిషు బర్మాదేశమునందును గలసి నలుబదియైదు జాతులును ఐదువందల పది తెగలునుగలవు.

ఈకుటుంబపు మొక్కలయాకులు:-అభిముఖచేరిక. లఘుపత్రములు. కణుపుపుచ్ఛము లుండవు. సమాంచలము. సాధారణముగఁ బలుచగనుండును. పుష్పమంజరులు:- సాధారణముగ మధ్యారంభమంజరులు, వ్యధాభిసారి మంజరులును గలుగుచుండును. చేటికలు ఉపచేటికలు తఱుచుగా నుండుచుండును. పుష్పము ఓష్టాకారముగనైనను, అసరాళముగనైనను నుండును. పుష్పకోశమును, దళవలయమును సంయుక్తములే. ఒక్కొకవలయమున నాలుగో ఐదో చేరియుండును. రెండో నాల్గో కింజల్కములున్నవి; తఱుచు పుష్పోద్ధి తిత్తులలో నొకతమ్మి పెద్దదిగను రెండవది చిన్న

ములుగోరింట అందముగా నుండు చిన్న మొక్క. దీని పుష్పములు కొంచెము మించు మించు గరాటివలెనుండును. నాలుగు కింజల్కములలోను రెండు పెద్దవి రెండుచిన్నవి.

పెద్దములుగోరింట ఆకులకంటెఁ బొడుగుగా సన్నని ముండ్లుకలవు.

పెల్లములు గోరింట వర్షకాలములోఁ బుష్పించును. దీని కాయలలోఁగింజలు చాల కలవు.

పచ్చనాడాంబరము ఈపుష్పములో పైపెదవి వెనుక ప్రక్కకు వంగియుండును.

తెల్లరంటు గొట్టెచీమిడి మొదలగు మొక్కలింకను ఈకుటుంబమున కలవుగాని, వాని నన్నిటి నిచ్చోఁ జెప్పకొనుట యనవసరము.

**అడిగళులు.** ఈ జాతివారు సేవకావృత్తిచేత జీవించువారు. తిరువాన్కూరు ప్రాంతమున నుండు అంబలవాసుల వారిలో నొకశాఖ. పూర్వము శ్రీశంకరాచార్యులు కల్లుత్రాగగ వారిశిష్యులగు కొందఱు బ్రాహ్మణులును త్రాగిరట. అటుపైన శంకరుఁడు కొలిమిలో నినుము కఱఁగుచుండగా దానిఁ దీసికొని నిర్లక్ష్యముగా త్రాగి తనతో శిష్యుల కీయ వారు భయపడి తమ తప్పు నొప్పుకొని క్షమింపుమని యాతని వేడి, తాముచేసిన పాపపరిహారార్థము బ్రాహ్మణేతరులైరట. వారే ఇప్పటి అడిగళులని యొక ప్రతీతి గలదు. వీరు భద్రకాళి దేవాలయములలోఁ బూజారులు. వీరు కాళి ప్రీత్యర్థము మద్యముల నివేదనమొనర్చుటఁ గలదు. వీరు మంత్రజ్ఞులును, శక్తి పూజాపరులునుగా నున్నారు. వీరికి నుపనయన సంస్కారమును యజ్ఞోపవీత ధారణమునుఁ గలదు. వీరికి, దశగాయత్రి జపము గలదు. వీరిలో సీమంతము సేయుటలేదు. పురుడు పాటింపు లేదుగాని సూతకము ౧౧ దినములు పట్టుదురు. పురోహితులును, ఆచార్యులును, వారికి వారిబంధువులలోనేయుండవలయును. నంబుద్రిస్త్రీలు బయట తిరుగునపుడు తాటియాకు గొడుగుచేఁ బూనుటయు బుర్కా వేసికొనుటయు నాయర్ (శూద్ర) పనికత్తెను కూడ గొనిపోవుటయుఁ గలదు; అడిగళుల స్త్రీలకీయాచారము లేదు. నగలు మాత్రము నంబూద్రిస్త్రీలవలెనె ధరించుకొందురు.

**అడిచనల్లూరు.** చెన్నపురి రాజధానిలోని తిరునల్వేలి జిల్లాకు చెందిన శ్రీవైకుంఠము తాలూకాలోనున్న ఒక గ్రామము. గవర్నమెంటువారు ఈగ్రామ సమీపభూమిని త్రవ్వించి చూడఁగా ఇక్కడ శవములు చాల కనుపించుటచే నిది యొక గొప్ప శ్మశానవాటిక యని యూహించుచున్నారు. పూర్వమీసమీపమందున నేదియో యొక పట్టణ ముండి యుండవచ్చునని దానిని, పాండవులు లేక పల్లవులవంశమునకుఁ జెందిన వారలెవరో పాలించియుందు

రనియు వదంతి గలదు. ఇక్కడ దొరకిన వెండి, బంగారు, లోహపు వస్తువులను, అస్థులను ప్రోగుచేసి చెన్నపురియందున్న వస్తు ప్రదర్శ నాగారములలో నుంచియున్నారు. ఈ అడిచనల్లూరు సమీపమున నిప్పటికిని ద్రవ్వించి క్రొత్త సంగతుల గనుగొను చున్నారు.

**అడిదము సూరకవి.** శుద్ధాంధ్ర రామాయణ మునురచించిన బాల భాస్కర కవికుమారుడు, ఆంధ్రకవి, లక్షణవేత్త.

ఇతనిచే రచింపబడిన కావ్యము కవిజన రంజనము, దీనికి చంద్రమతీ పరిణయమని మారుపేరు. ఇందు హరిశ్చంద్ర చక్రవర్తికిని ఉశీనరరాజ కుమార్తెయైన చంద్రమతి దేవి కిని జరిగిన వివాహము వర్ణించి యున్నాడు. ఇందు హరిశ్చంద్రుని పూర్వచరిత్రమాత్రము గలదు. ఉత్తరచరిత్ర లేదు. ఇది మూడాశ్వాస ములుగల చిన్న పుస్తకము. ఇందలి పద్య సంఖ్య స్వల్పమైనను కావ్యము మిక్కిలిరసాత్మకమును శబ్దార్థాలంకార భూయిష్టమునుఅయి యుండుట బండితులు దానిని మొదటినుండియు బిల్లవసు చరిత్రమని గౌరవించుచున్నారు.

ఇతడు రచించిన లక్షణగ్రంథములు, ఆంధ్ర చన్ద్రాలోకము, ఆంధ్రనామశేషము, కవిసంశయవిచ్ఛేదము.

ఆంధ్ర చంద్రాలోక మనునది అలంకార ములయొక్క లక్షణలక్ష్యములను దెలుపు గ్రంథము. సంస్కృతమునందు చంద్రాలోక మను గ్రంథము గలదు. అది సాహిత్యవిషయ ములను జర్చించును. దానికి కర్త పీయూష వర్షుడని ఆ గ్రంథమునందే యున్నది. పీయూష వర్షుడనునది జయదేవునకు నామాంతరమనియు బ్రసన్న రాఘవ కర్తయైన జయదేవుడే ఈ చంద్రాలోకమునకు గర్తయని యు కొందఱు పండితుల యభిప్రాయము. ఇది ఇట్లుండ అడిదము సూరకవి చంద్రాలోక మును గాళిదాసుడు రచించెనని ఈక్రింది పద్యమున చెప్పియున్నాడు.

> గీ॥ బాలురకునైన దెలియగ, గాళిదాసు
> మును రచించె చంద్రాలోకమును ద్రిలింగ
> భాషచేసితి నీ కృపభవ్యముగను
> దీని గరుణించి గైకొమ్ము దేవదేవ॥

కాని కాళిదాసకృత చంద్రాలోకమున్న ట్లెక్కడను గానరాదుగాన నీ చన్ద్రాలోకమే కాళిదాసునిదియనిసూరకవి భ్రమపడెననిఆన్ధ్ర చన్ద్రాలోకము నచ్చు వేయించినఅక్కిరాజు ఉమాకాంతముగారు వ్రాసియున్నారు. ఏది ఎట్లున్ననుసూరన తెలిగించినది అప్పయదీక్షితులవారికువలయానందకారికావళి. దీక్షితుల వారు చంద్రాలోక మందలి చివరమయూఖ మునుండి అలంకార లక్షణ లక్ష్య శ్లోకము లను దీసికొని కొన్నిటి నూతనముగ గల్పి కువలయానందమును నిర్మించిరి. ఆకువల యానందమే సూరన కాలమున ఆంధ్రదేశము నందు చంద్రాలోకము పేరటను కాళిదాస

కృతిమనియు వ్యాప్తిః జెందియున్నట్లు మనము పై పద్యమువలన నూహింప వలసియున్నది.

భాషాంతరము చేయుటలో నీకవి మూలమును తుంచ తప్పకుండ తెలిఁగించినట్లు గానవచ్చుచున్నది.

ఉదాహరణములు:—

ఉపమాయత్ర సాదృశ్య లక్ష్మీరుల్లసతిద్వయోః
హంసీవ కృష్ణ తే కీర్తిః స్వర్గంగా మనుగావతేః
ఉపమానోపమే యత్వం యదేకస్యైవ వస్తున
ఇందు రిందురి వశ్రీమా నిత్యా దౌ తదనన్వయః

గీ॥ వర్ణ్య ముపమాన ముపమాన వాచకము స
మాన ధర్మము సంఘటింప నగునుపమ
హంసి చందాన నీకీర్తి యబ్జనాభ
యభ్రగంగావ గాహనం బాచరించు

హేత్వలంకారము:—

హేతోర్హేతు మతాసార్ధం వర్ణనం హేతు రుచ్యతే
అసావుదేతి శీతాంసుర్మాన చ్ఛేదాయ సుభ్రువామ్
హేతు హేతు మతోరైక్యం హేతుంకే చిత్ప్రచక్షతే
లక్ష్మీవిలాసా విదుషాం కటాక్షా వేంకట ప్రభో

గీ॥ కార్య కారణములు రెండు గలియఁబలికె
నేని యది హేత్వలంకృతి నానెసంగు
నుదయ మందెను నీశశి మదవతీక
దంబమానముల్వోచ్చు నైదంబుకొఱకు

గీ॥ కార్యకారణములకు నైక్యముగ నేని
గృతులఁగొందఱు హేత్వలంకృతియు యంద్రు
సత్కవులకబ్జ రమావిలా సములు వేంక
టేశ్వర కటాక్షముల నంగ నిందుమహాళి.

ఆంధ్రనామ శేషము పద్యరూపమైన చిన్న నిఘంటువు.

ఆంధ్రనామ సంగ్రహాములో లేని కొన్ని పదము లిందు చేర్చఁ బడినవి. కవిసంశయవిచ్ఛేదము వ్యాకరణ సంబంధమైన మూఁడాశ్వాశములుగల లక్షణగ్రంథము.

ఈకవి రామలింగేశ శతకమను గ్రంథము సీస పద్యములతో రచియించి యున్నాఁడు. ఇందు రాజులు ప్రజలను బెట్టి నట్టి బాధలు చక్కఁగ వర్ణింపఁ బడినవి. ప్రజాపీడకులైన రాజులను ధిక్కరించుటకే ఈశతకము పుట్టినట్టు కానవచ్చు చున్నది. అప్పటి జమీందారులవలనను వారి యధికారుల వలనను అప్పటి ప్రజలకుఁ బెక్కు కష్టములు సంభవించినట్లు శతకములోని వర్ణనలనుబట్టి మనమూహింప వచ్చును.

"మాన్యంబు లీయ సమర్థుఁడొక్కరుఁడు లేఁడు" మొదలగు సీసపద్యములు ఈ గ్రంథములోనివి, తెనుగు దేశమునం దిదివఱకే వ్యాపించి యున్నవి. శతకము నందలిచివర పద్యమగు సీ క్రింది సీసమువలన అప్పటి జమీందారులు ప్రజల సొత్తును అపహరించుట ఇండ్లు తగులఁ బెట్టుట మొదలైనఘోర కృత్యములనుఁ జేయుచున్నట్లు కానవచ్చుచున్నది.

సీ. భయమేల కొండంతపగతుఁడునాకున్న
మేరువు వంచిన మేటికలుగ
నాకేల శోకసంతాపము నందుఁగుంద
శీతాంశుమౌళినా చెంతనిలువ
తస్కర భీతికిఁ దల్లడిల్లగ నేల
ప్రమథులతో శూలపాణి నిలువ

* ఆంధ్ర చంద్రాలోకముయొక్క పరిశుద్ధమైన చక్కని ప్రతిని అక్కిరాజు ఉమాకాంతము గారు ప్రకటించి యున్నారు.

అగ్ని ఫీతికినాకు నలుకంగ నిక నేల
గంగాధరుండునా కడవనింప
నన్నుచు నెంతటి కెంతటి కలుదు తేశ
నమ్మియుంటిని నీ ప్రాపు నా మనమున
జాగరూకుడ వైనన్ను సాకవయ్య
రామ లింగేశ రామచంద్రపురవాస

పై గ్రంథములుగాక శ్రీరామ దండకము పొణ్ణుగుపాటి వేంకట మంత్రిశతకమను రెండు శతకములీ కవిరచించెనని యొకరు వ్రాసి యున్నారు కాని యాగ్రంథము లెచ్చటను గానరావు.

కవిస్థలము. ఈకవి తనగ్రంథముల నన్నిటిని రామచంద్ర పురమునందలి రామలింగేశున కంకితము చేసినందున నాతఁడు గోదావరిమండలనివాసుఁడనిమనమూహింపఁవలసి యున్నది. దంతకథలవలనను చాటుపద్యముల వలనను ఇతఁడు విజయనగర సంస్థానమునం దున్నట్లును అచ్చటిరాజులకు నాశ్రితుఁడుగనున్నట్లును పెద్దాపుర సంస్థానమునకు నప్పుడప్పుడు వచ్చుచున్నట్లునుకూడ గలదు. రామ చంద్రపురమతని జన్మస్థానమై యుండనోపు. పెద్దవాఁడైన తరువాత ధనార్జనకొఱకై విజయ నగరమునకు వెళ్లియుండ వచ్చును.

కవికాలము. రాజులయందుగలయసూయచే నీ కవి తనకావ్యము లేవియు రాజులకంకితము చేయలేదు. రామలింగేశునకే చేసెను. అందు వలన నాతని గ్రంథములలో నాతనికాలనిర్ణయమునకు నాధారము లేవియుగానరావు. కావున కవికాల నిర్ణయమునకు కింవదంతులే యాధారములు. ఈతఁడు విజయనగరము రాజైన రెండవ విజయరామ రాజునకును పెద్దాపురసంస్థానాధిపతియైన వత్సవాయి తిమ్మజగపతికిని సమకాలికుడని పరంపరాగత వార్తగలదు. రెండవ విజయరామ రాజు 1759 మొదలు 1794 వఱకు ప్రభుత్వము చేసెను. తిమ్మజగపతి 1759 మొదలు 1790 వఱకు రాజ్యమేలెను. కావున ఈ కవి పదునెనిమిదవశతాబ్దము మధ్యనుండి ఆ శతాబ్దాంతము వఱకు నుండెనని మన మూహింప వచ్చును.

**అడిదానవుఁడు.** అంధకునికొడుకు స్వస్వరూపమున మరణము చెందకుండునట్లు వరముఁ బొందియుండె. ఒకప్పుడు పార్వతీ దేవి వేషము ధరించి శివునిమోసము చేయ యత్నింపఁగా నితఁడు శివునిచేఁ జచ్చెను.

**అడిలంగు.** (౧) జోహాన్ క్రిస్టాఫ్. (౧౭౩౨-౧౮౦౬.) ఈతఁడు జర్మనీదేశస్థుఁడు. వైయ్యాకరణుఁడు; బహుభాషాకోవిదుఁడు. స్పాంటీకన్‌లో జనన మంది డ్రెస్డన్‌లో మృతినొందెను. ఈతఁడు తర్జుమాలయందును, శబ్దోత్పత్తి విచారమునందును, అనేక భాషలయందును ఆసక్తిగలిగి యా పరిశ్రమలయందుఁ దన కాలముఁ గడపెను. ౧౭౯౨-వ సంవత్సరము మొదలీతఁడు డ్రెస్డన్ ఎలెక్టొరల్ పుస్తక భాండాగారమునందు నుద్యోగిగనుండెను. ఈతఁడు గొన్ని గ్రంథములను వ్రాసెను.

(౨) ఫ్రీడ్రిల్ వాన్ (౧౭౬౭-౧౮౪౫.) ఈతఁడు పైవాని మేనల్లుఁడు; స్టెట్టిన్ లో జనించి సైంటు పీటర్సు బర్గులో మృతుఁడాయెను. సంస్కృతభాష, వాఙ్మయము రష్యన్ భాష, వీనిని గుఱించి ఈతఁడు కొన్ని గ్రంథములు వ్రాసెను.

**అడిలేయిడ్ రాణి.** (౧౭౯౨-౧౮౪౯.) ఇంగ్లాండును పాలించిన నాల్గవ విలియంరాజుభార్య; సాక్సుమీనింజన్ డ్యూకగు జార్జి కూమార్తె. ఆకాలపు రాజ్యవ్యవహారములందు జోక్యము కలిగించుకొనెనను వదంతికి ఫలముగ నామెయందు ప్రజలకుఁ గొంతప్రీతి తఱిఁగెనుగాని యామె నిక్కముగ ధర్మకార్యములయందు చాల శ్రద్ధగలిగి ప్రవర్తించు చుండెను.

**అడిలేయిడ్.** దక్షిణ ఆస్ట్రేలియాసీమకు రాజధాని. ఈ పట్టణము టారెన్సు నదిచే ఉత్తర అడిలేయిడ్ దక్షిణ అడిలేయిడ్ అని రెండుభాగములుగ విభజింపఁబడియున్నది. ఒక్కంట నివేశములు గలవు. రెండవదాన వ్యాపారము జరుగుచున్నది. ఈ పట్టణాధికారు లెల్లరు ప్రజలచే నిర్వచింపఁబడుచున్నారు. ఇచ్చట నొక సర్వకళాశాల యున్నది. ఇందు రమారమి వేయిమంది విద్యార్థులు విద్య నభ్యసించు చుందురు. జనసంఖ్య 1,62,094.

**అడ్వోవా.** ఆఫ్రికా ఖండమునందలి అబిసీనియా దేశములోని టిగ్రీమండలమునకు రాజధాని. ఇది అరేబియాకును సౌడను కును గల మార్గమధ్యమున నుండుటచేత మధ్యాఫ్రికాతో అరేబియా సలుపువర్తకమునకు ముఖ్యస్థానముగ నున్నది. అబిసీనియావారికిని ఇటలీ వారికిని జరిగిన యుద్ధములో నబిసీనియా వారు ౧౮౯౬ వ సంవత్సరమున నీపట్టణప్రాంతములలోనే ఇటలీవారిని పూర్తిగ నోడించిరి. ఈపట్టణము జనసంఖ్య 3000 మాత్రమె గలదు.

**అణిమ.** అష్ట మహా సిద్ధులలో నొక్కఁడు.

**అణిమాండవ్యుఁడు.** మాండవ్య ఋషికి నామాంతరము (చూడు 'మాండవ్యుఁడు'.)

**అణుహుఁడు.** (చం. వం) నహుషునికులజుఁడగు యయాతి పుత్రుఁడైన పూరుని కులమునందుఁ బుట్టిన విభ్రాజుని కుమారుఁడు. ఇతనికి నపుఁడను మారుపేరు కలదు. ఇతఁడు శుకుని కూఁతురగు కృత్వీ నామాంతరము గల కీర్తిమతిని వివాహమాడెను. (చూడు 'నపుఁడు')

**అతభాస్కానది.** అతబాస్కా కెనడా లోని యొకనది. ఇది 740 మైళ్లు పొడవు.

ఈనది అతిభాస్కయను సరస్సులో కీం ప్రవహించుచున్నది.

దీనికి మెస్లొండు, వెంబన, ఫైస్పు, స్లేవు, అను ఉపనదులు గలవు.

మొదట ఈ పేర నొక జిల్లాయుండెను. తరువాత కన్న డో దేశమంతొక రాష్ట్రమంతయు నీ పేరునఁబిలువఁబడుచున్నది. ౧౯౦౫ సంవత్సరమున నీ రాష్ట్రము విభజన చేయఁబడి ఇతర రాష్ట్రములలోఁ గలుపఁబడెను.

**అతలము.** పాతాళ లోకములలో మొదటిది. దాని వైశాల్యము పదివేల యోజనములనియు అచ్చటినేల తెల్లగనుండుననియుఁ బురాణప్రతీతి.

**అత్తరులు.** "అత్తరు" అను నీ పదము "ఇతర్=Itar" అను పారశీక పదము నుండి జనించినది. దీనికిహింపుక్రలు పర్యాయ పదములుగ పుష్ప సారము, పరిమళము, సుగంధ ద్రవ్యము, మొదలగు పదముల నుపయోగించెదరు. పాశ్చాత్య భాషలయందు "ఆటో=Otto" అను పదముకూడ అత్తరునకు పర్యాయపదముగా వాడుచున్నారు.

అత్తరు పదము.

అత్తరులను తయారుచేయుట మిక్కిలి పురాతనమైన పరిశ్రమ. మంచిదుస్తులు, ఆభరణములు మున్నగు అలంకరణముల యందు మనుష్యునకెంత యభిలాష యనాదినుండి కలదో భోగప్రధానములగు సువాసన ద్రవ్యములయందుఁగూడ నట్టి యభిలాష యుండును. కాఁబట్టియే ప్రతిజాతి యందును వారివారి నాగరికతనుబట్టి కొద్దియో గొప్పయో ఈ పరిశ్రమ యనాదినుండి గానవచ్చును. మిక్కిలి యనాగరికదశలోనుండు జాతులు ప్రకృతి యందుఁగల సుగంధద్రవ్యముల నట్లేవాడుక చేయుదురు. నాగరికత మీఱిన జాతులు ప్రకృతియందుఁగల పదార్థములనుండి సారములుదీసి యనేకవిధములైన యత్తరులను జేయుదురు.

మన దేశములో నీ పరిశ్రమ మహమ్మదీయుల దండయాత్రలకు పూర్వమే యున్నత దశయందున్నదని చెప్పుటకు అనేక నిదర్శనములు గలవు. వేదములలో చందనము, కస్తూరి మున్నగు పరిమళ ద్రవ్యముల పేళ్లు గలవు. ఇదిగాక పుష్పసారములు దీయుట చతుష్షష్టికళలలో నొకటిగ మనవారిచే పరిగణింపఁబడి యున్నది. మద్యసారములును, పుష్పసారములును ఒకేరీతిని వండుచుండినట్లు మన శాస్త్రగ్రంథములవలనఁ దెలియుచున్నది. వాసవదత్త, దశకుమారచరిత్ర, మున్నగు కావ్యములయందు కొన్ని పరిమళముల పేళ్లుగలవు. ఏడవశతాబ్దమునాటి వరాహమిహిరుని బృహత్సంహితలో చంపక మున్నగు పుష్పముల వాసనగల కృత్రిమ పరిమళముల తయారుచేయు మార్గములు వర్ణింపఁబడి యున్నవి.

హిందువులు పరిమళ పరిశ్రమల నెప్పటినుండి యెఱిగియున్నారు

హిందువులపూర్వార్ధపుఁగ్రీక వాఙ్మయమును పరిశీలించినయెడల కావ్యముల యందును పురాణముల యందేగాక ప్రాచీనములగు వేదముల యందును వివాహమంత్రములయందును, "అగరు, ధూపకర్పూర" ఇత్యాది పద ప్రయోగములను విరివిగ కనుగొన గలము. ఆర్యులకు పుష్ప సారములను గురించి తెలియుననుటకు మనవాఙ్మయమున ప్రబల నిదర్శనములు కలవు. అత్తరవులు భరతఖండము నుండి తమకు బహుప్రాచీన కాలమునుండియు వచ్చుచుండెడివనియు, వానిని వారు మిక్కిలి ప్రియముగకొని సేవించు చుండు వారనియు, గ్రీకు, రోమక, దేశ గ్రంథములయందు కనఁబడు చున్నది. క్రైస్తవుల వేదము (బహుప్రాచీన గ్రంథమునగు "బైబిలు") నందుఇండియా దేశము నుండి పాశ్చాత్యుల కత్తరవులు వచ్చు చుండెడివని వ్రాయఁబడియున్నది. ఇంక ననేక నిదర్శనము లున్నట్లు పాశ్చాత్యులు వాడుకొనియున్నారు.

ఆంధ్రుల పరిమళ పరిశ్రమ

ఇంకనుయాంధ్రులకీ పరిమళ విషయమును దెలియునాయని చూచిన శ్రీనాథాదుల "కస్తూరి భిక్ష"ను జూపించు కొన్ని చాటువులును, స్వతంత్ర రచనాకౌశలములు నగువీధి నాటికాదుల యందును పరిమళ ప్రశంస గానగును. మరియుపూర్వము రాజుల కొలువునందు డెబ్బదిరెండు నియోగులలో పరిమళ కారకుఁడొకఁడని అయ్యలరాజు నారాయణామాత్య విరచితమగు హంసవింశతియను గ్రంథమున కనఁబడుచున్నది. గణపతిదేవుని కాలమునగూడ నైపుణ్యముల వర్ణించిన "గురు ప్రధాన, సామంత, పురోహిత, జ్యోతిషక, మాలకారక, పరిమళకారక" ఇత్యాది నియోగులు నియమింపఁబడి యున్నట్లు కనఁబడుచున్నది.*

పరిమళకారకవృత్తి యెట్టిది.

ఈ పరిమళకారకవృత్తి యొకరివలనగాక యనేకమందివలన జేయఁబడు చుండినట్లును, ఒక రాజుక్రిందనే పలువురుద్యోగులీ వృత్తికై నేమింపఁబడుచుండినట్లును, కొందర త్తరులు చేయుటకు, కొందరు సంగ్రహ పరుచుటకు, కొందరు భాండాగారమున జాగ్రత పరుచుటకు, వారిపై నొక పెద్ద యధికారి కూడ నేర్పరుపఁబడియుండినట్లును, ఆపరిమళములకొరకేర్పరుపఁబడిన యుద్యోగు లమిత ధనవంతులుగ నుండుటయేగాక, వారియుద్యోగము మిక్కిలి గౌరవాస్పదమై యుండెడిదనుటకునుగూడ నిదర్శనములు కలవు. శ్రీనాథుఁడు వేమారెడ్డివద్ద నుండు సుగంధ భాండాగారాధ్యక్షుఁడైన సిరియాల తిప్పయ్యయను వైశ్యునకు తన హరవిలాసమును కృతి నిచ్చెనని నెఱిగినవారు పై సంగతులు

* ఆంధ్రుల చరిత్రము 263 పుట రెండవభాగము.

తెలిసికొనగలరు. వీనినిబట్టి పరిమళశ్రమ యాంధ్రులకు క్రొత్తగాదని మనము దెలిసి కొనవచ్చును. ధర్మరాజాదిరాజ సూర్యములు మొదలు (పురాణకాలమునుండి) మొన్నటి వరకు పరిపాలించిన యాంధ్రరాజుల వర కునుగల చరిత్రముల యందును, ప్రాచీన కాలమునందున్నుగూడ మనవారు పరిమళపరి శ్రమ నెరిగియుండిరి. మొన్న మొన్నటివరకు పరిమళ పరిశ్రమ మనదేశమన విచ్చలవిడిగ జరుగుచుండెడిది.

మహమ్మదీయుల దండయాత్రలు తరు వాత మనదేశములో పరిమళ కళాపరిశ్రమ మిక్కిలి యభివృద్ధి జెందినది. సహజముగా మహమ్మదీయులును, ముఖ్యముగ మొగలా యిలును మిక్కిలి భోగపరాయణులు. అందు చేత రాజులును ప్రజలునుగూడ అత్తరుల విషయమై యెక్కువ శ్రద్ధ దీసుకొనెడి వారు. "అత్తరు" అనుపదము మనకు వారి వలననే లభించినది. అక్బరు మహా చక్ర వర్తి కాలములో నత్తరులు తయారుచేయు టకు ప్రత్యేకమొక యుద్యోగ శాఖయుండె ననియు, ఆ శాఖవారియొక్క పనిని తానే తరుచుగ తనిఖీ చేయుచుండెడి వాడనియు ఆయన యధికారులలో నొకడగు అబుల్ ఫజల్ వ్రాసిన "ఐని అక్బరి"యను గ్రంథము నుండి తెలియవచ్చుచున్నది. అక్బరు చక్ర వర్తి పరిశ్రమ కళాభివృద్ధి నెరిగిన వారాతడీ యత్తరుల కొరకెంతపని జేయించువాడో తెలిసికొనవచ్చును.

మరియు మహమ్మదీయులు వారి యత్తరు లో నిజమైన పుష్పసారములు రాజేయక చందిని*, వేలు, మొదలగు తక్కువ మూల్య ముగల తైలములను పుష్పసారములతోగలిపి చౌకగనమ్మి, హిందువులయత్తరులకు పోటీ గల్పించిరి. నిజమైన పుష్పసారములను మాత్రమే జేయుట నెరిగిన హిందువులా పోటీ కాగలేకపోయిరి. క్రమముగా హిందు వులు పరిమళములచేయుటమానిరి. మహమ్మ దీయు లప్పటినుండియు మన దేశమునందలి యత్తరు పరిశ్రమకు ప్రధానులైరి. ఏపుష్ప సారమునైనను చందిని యత్తరువంటి తైల ముతోగలిపి నప్పుడు పరిమళమునకు చక్కని సుగంధము వృద్ధియగును. దీనికి కారణమా చందిని తైలమునందుండు యాగా వులమిశ్రమ స్వభావగుణ సంపత్తియే.

కావుననే మహమ్మదీయులు తులమునకు రూపాయి ధరగల చందినితో తులమునకే బది రూప్యముల వెలగల గులాబియత్తరును కలిపి చౌకగనమ్మిరి. ఆ యాచారములు మహమ్మదీయు లిప్పటికిని మానియుండలేదు. ప్రస్తుతము మనదేశమునందు మహమ్మదీ యులుచేయు అత్తరవుల వర్తకములో నూటికి తొంబదిపాళ్లు చందినీ మిశ్రితమే.

---

* చందినీ యత్తరు మంచిగంధపు చెక్కనుండి తీయుదురు. దీనినన్ని యత్తరువులలోను కలుపుదురు.

అత్తరులు కనుగొనినట్లు చెప్పుకథ.

ఒకరాజ తనూజాత ప్రతిదినము తాను స్నానముచేయు నీటియందు రాత్రివేళ పుష్పములను వేయించి యుదయమున నా పరిమళోదకముల స్నానము చేయుచుండెడి దనియు, నొకనాడామె యా నీటిని పరిశీలింప జిడ్డుగ రంగులతెట్టె కొంచెము పైన తేలి, పుష్పపరిమళము నధికముగ కలిగి యుండినదనియు, నామె సంతసించి యొక యీకతో నా తైలమునొకచిన్న గాజుబుడ్డిలోనికెత్తి జనకునికివ్వ నాతడు సంతసించి యామెకు కొన్నికోర్కెలుతీర్చె ననియు, నప్పటినుండి యామె ప్రతిదిన మత్తరు చేయుచుండెడిదనియు క్రమముగ నా యత్తరు చేయుపద్ధతి ప్రకటితమైనదనియు, వాడుకగ చెప్పుకొందురు. ఈ కథయందలి బాలిక నూర్జహానని కొందరు వ్రాసియున్నారు. కొందరట్లు కనిపెట్టినబాలిక యొక శత్రు తనూజాత యనియు, ఈ క్రొత్త సంగతి కనిపెట్టుటవలన నామెకు చెరనుండి విముక్తి కలిగినదనియు చెప్పుదురు. ఇదియెంత వరకు సత్యమో మనము నిర్ణయించుటకు వీలులేదు.

పాశ్చాత్యుల అత్తరు.

రసాయనశాస్త్రాభివృద్ధినొనరించుకొనుచు నెరిగిన దెల్ల రాబోవు సంతతి వారికి గ్రంథరూపమున వెల్లడిబఱచుచు పాశ్చాత్యులభివృద్ధి పరచుచున్నారు. అందు పూర్వము రోమను దేశజులును, పిమ్మట పరాసు. (French) వారి పరిమళపరిశ్రమ నత్యద్భుతముగ వృద్ధి చేసికొనిరి. పరాసులు కడచిన శతాబ్దమున నాగరికతయందు ప్రధానస్థానము నాక్రమించి ప్రపంచమునకే భయము నాశ్చర్యమును ఒనగూర్చిరి. అప్పుడే వారి పరిమళపరిశ్రమయు నగ్రస్థానమునకు బోయినది. పరిమళ విద్యకు వారిప్పటికిని ప్రపంచమునకొరకు గురుస్థానము నాక్రమించుచుండిరిగాని ఇప్పుడా పేరిరువది సంవత్సరములనుండి తగ్గుచున్నది. క్రమముగా నాంగ్లేయులలో, నమెరికనులు నాగరికతయందును, దానివెన్నంటి యుండు పరిమళములయందును క్రొత్త సంగతులు కనిపెట్టి పెంచి వారిని మించుచున్నారు. జర్మనీవారు వెనుకంబడి యుండలేదు. మంచుప్రదేశము లగుటచే పాశ్చాత్యదేశములయందు పుష్పములు సర్వకాలములయందు దొరకవు. ఎల్లప్పుడు పుష్పగుచ్ఛయుతములగు వృక్షలతాదికేదారములు గలిగి తత్పుష్పవాసిత పరిమళమిళిత వాయుమండల పరివృతులమై సుఖించు పూర్వదేశీయులమగు మనకు అత్తరులంతగా నవసరము లేదు, సంవత్సరమునకు రెండుమూడు మాసములు మాత్రమే పూవుల జూచు భాగ్యముగల పాశ్చాత్యులకు పుష్పసారముల యవసరమధికమయ్యెను. పుష్పములు లేనప్పుడు పుష్పము లుండునటుల జేయుటకు మొదట మానవుడెంతో శ్రమపడి యుండును. కావలసిన వస్తువులను పుష్పములతో కలిపియుంచి వానికి పరిమళము పట్టించు

టకు ప్రయత్నము చేయుటే దానికి కారణము. మొదట నెద్దియో పుష్పముతో నున్న వస్తువునకు దానిపరిమళము పట్టియుండుట, పిమ్మట నువును జాజు మొగలి మొదలగు పుష్పములు బట్టలతో నుంచి వానికి పరిమళమబ్బ జేయుట, పుష్పముల నెండబెట్టి పొడిచేసికొనుట, తొక్కి రసము దీసికొనుట, ఇట్లే క్రమాభివృద్ధినొంది యుండును. ఈ ప్రాథమికావస్థ నూహించుట కష్టము.

పాశ్చాత్యులు క్రమముగ నత్తరవులను చేయుపద్ధతిని హిందువులవలన దెలిసికొనుటకు పారశీకముగుండ మెట్టదాటివచ్చిరి. అందువలనే గ్రీసుదేశము వారు హిందువుల జ్ఞానములను పడమటి కంపుటకు మిక్కిలిసహాయ మొనరించిరి. గ్రీకునుండి రోమకపట్టణము ప్యారిసు నగరము మీదుగ యాంగ్లేయుల మన దేశమునకు నడచినట్లు విజ్ఞానయాత్రా చరిత్రమును వ్రాసినవారి యభిప్రాయము. ఆ జాతులకు గల పరిశ్రమా ప్రీతియే వారి నభివృద్ధికి దెచ్చినది. వారికి మనదేశమునందు గల కొన్ని పుష్పములు లేనందునను, వారిదేశమున పుష్పములు విరివిగా పెరుగనందునను వారికి కొంతకాలము వరకు అత్తరువులు చేసికొనుట కష్టమే యైనది. పాశ్చాత్యులిప్పుడు పుష్పములుగలదినములలో మంచియత్తరులు దీసికొని యుపయోగించుకొనుచు నమ్ముచు లాభమును పొందుచున్నారు. అంతేకాక క్రమముగా వారు కల్పిత పరిమళ ద్రవ్యములతో నత్తరులు చేసికొనసాగిరి. లవంగములు, ఏలకులు, పచ్చాకు, వట్టివేరు, మొదలగు వస్తువుల నుపవనదేశములనుండి తెప్పించుకొని వాని తైలములనుదీసి అత్తరులను జేయుచున్నారు. కొందరు రెండుమూడు మూలికల తైలములు గలిపి (Bouqets) మిళితముజేసి యమ్ముచుండిరి. కొంతకాలమునకు తరువాత కొన్ని మూలిక పరిమళసారములు గలుపగా నవి కొన్ని వింతపుష్పముల పరిమళముల నొసగినవి. క్రమముగా కొన్ని కృత్రిమ పుష్పసారములనిచ్చుట కాధారమైనవి. ఇప్పుడందువలన వారు జీలకర్ర, వాము, మిరియాలు, మొదలగు వస్తువులను దిగుమతి చేసికొని, వాని సారములదీయుచున్నారు. మరియు గులాబీ, పొగడ, మొదలగు పుష్పములు లేని కాలములయందు కల్పిత పరిమళ సారములను జేసికొని స్వభావసిద్ధమైన పరిమళ సారములకంటె ప్రశస్తమైన పరిమళమిదియేయని లోకమును సంతృప్తిచేయ గలిగిరి. ఈ కల్పిత పుష్పసారములు నిజసారములను (అత్తరులను) మించియుండును. మరియునివి చౌకగ లభ్యమగుచున్నవి. మనకువచ్చు పాశ్చాత్యపుటత్తరులు, "హీకో" పరిమళములలో కొన్ని నీరకములోనివే. ఇదియునుగాక వారు మనదేశమున మహమ్మదీయులమ్ముయత్తరులను, మాదిరితీసికొనిపోయి యట్టి యత్తరులను చౌకగచేసి, మహమ్మదీయుల యత్తరులకంటె చౌకగ, మంచివిగ నొసగుచున్నారు. అందువలననే మనదేశమునందు మహమ్మ

దీయుల చేతులయందు మిగిలియున్న ఈ యత్తరుల పరిశ్రమ క్రమక్రమముగా సన్నగిలు చున్నది.

ప్రపంచమునందలి యనేకవస్తువుల నుండియు, ఫల పుష్పముల నుండియు నత్తరులను తీయవచ్చును. ఏ వస్తువ నుండి తీసినయత్తరు కావస్తువ పేరుబెట్టిరి. కావున యత్తరవుల రకములిన్నియని నిర్ధారణచేయుటకు వీలులేదు.

రూపములు.

ఘనపదార్థములుగ నుండు యగరుండలు, కస్తూరి; చూర్ణరూపముననుండు బుక్కా, స్నానచూర్ణములు; నవనీతము వలె నుండు మొగముమెరుగులు; ద్రవరూపముననుండు తైలములు, తలనూనెలు; గాక కేవలము అత్తరులని చెప్పుటకు వీలైన రూపములనే యత్తరులని నిర్ణయించ వలయును.

(1) సారము. (otto) పుష్పతైలము లేక అసలు అత్తరు. దీనిని "మూలతైలము" (Essential oil) అని మూలికలనుండి తీసినచో చెప్ప నగును. ఒకవిధముగా సారముల క్రింద ప్రతిపరిమళముగల వస్తువునుండి తీసిన కలితీలేని తైలమును జేర్చనగును.

(2) అరకు. (Essence) పైజెప్పిన అత్తరు చిగురు సారాయముతో కలిసినప్పు డేర్పడు ఘాటైన ద్రవరూపము.

(3). టించరు (Tincture) పరిమళ భాగమును దంచిచేసిన కషాయము.

(4) తైలము. (Oil) చందనీ మొదలగు తైలములలో కలసిన మహామ్మదీయులమ్ము అత్తరువులవంటి మిశ్రమ పరిమళసారము.

(5) ద్రావకము. పైని రెండవ సంఖ్య క్రింద చెప్పిన అరకునకెక్కువచిగురు సారాయము జేర్చినది. ఇవియే యాంగ్లేయులు వాడు "లవండరు; ఉడుకులోని, చెర్రీబ్లాసం; నైటుకోడి" అను పాశ్చాత్యపుటత్తరులు.

6. పరిమళోదకము. (Perfumed water) నీటితో గలిసినది. ఇది అత్తరు తయారు చేయునప్పుడు మిగిలినది. ఇదియేపన్నీరు.

ఇంక ననేకరూపములుగలవు. వానిలో ముఖ్యమైన రూపములు పైన పేర్కొనబడినవి.

ప్రపంచము నందలి ప్రతివస్తువున కేదో యొక వాసనయుండుట స్వభావము. కాని మానవుల కుపయోగపడు పరిమళములనిచ్చు వస్తువులసంఖ్య మిక్కిలి స్వల్పము. కొన్ని పుష్పములు మిక్కిలి సున్నితములై సారములు గ్రహించుటకనువగు పద్ధతులు లేవు. కొన్నిటి నేకారణముననో మానవు లుపయోగించుకొనుట లేదు.

రకములు.

అత్తరులను జంతు, ఖనిజ, మూలికా, సంబంధములగు కొన్ని వస్తువుల నుండి తయారుచేయుదురు.

i. జంతు సంబంధమైనవి. (Animal) పునుగు, కస్తూరి, జవ్వాజి మొదలగునవి.

II. వృక్షాలికా సంబంధమైనవి (Vegetable) ఇందు:—

1. గింజలు. మిరియములు, యేలకులు, సోపు, జీలకర, వాము.

2. పుష్పములు. మల్లె, గులాబీ, పొగడ, మాలతి మొదలగునవి.

3. ఆకులు. పచ్చాకు, దవనం, కదంబము మొదలగునవి.

4. ఫలములు. నారింజ, నిమ్మ, దబ్బ, జాజికాయ.

5. వేళ్లు. వట్టివేరు, కచ్చూరము, దుంపరాష్ట్రము.

6. సమూలము. పప్పరమెంటు, మంచి గంధము, దేవదారు.

7. పట్ట. దాల్చిన చెక్క.

8. మొగ్గలు. లవంగములు, జాపత్రి.

9. గడ్డి. నిమ్మగడ్డి, దబ్బగడ్డి.

III. ఖనిజ సంబంధమైనవి. గంధకము, రాతిసిబొగ్గు ఇత్యాదులు.

ఈ పై వస్తువులేగాక నింకను ప్రతిశాఖయందు ననేక వస్తువులు జేరును. కొన్ని వస్తువుల యందలి పరిమళములను మనుజులు గ్రహించుట లేదు. ఇట్టి వస్తువుల (Raw materials) నన్నిటినుండియు నత్తరులు తీయ నగును. ఇందు చిత్రములు కొన్ని కలవు.

కొన్ని వృక్షముల వేళ్లయందొక పరిమళము. ఆకులయందు మరియొకటి, పుష్పములయందొకటి, ఫలములయందు మరియొకటి యుండును.

ఉదహరణముగ నారింజ చెట్టు తీసికొనుడు.

(1) పుష్పములనుండి తీసినసారము (Neroli).

(2) ఆకుల నుండి తీసిన సారము (Petit grain)

(3) ఫలముల తొక్కలనుండి తీసినసారము (Bergamot.)

(4) ఇంకను గింజలు, ఫలమంతయు, వీటినుండి తీసినసారములు వేర్వేరు పరిమళముల నిచ్చును.

ఈ పదార్థముల నుండియు, మామిడి మొదలగు పుష్పముల నుండియు, మన పూర్వులును, మహమ్మదీయులును గూడ అసలు అత్తరులు తీయుచుండిరిగాని యవి మిక్కిలి వెల యధికముగ నుండి రాసాయన శాస్త్ర సహాయమున పాశ్చాత్యులు దీయు సారములతో పోటీకి నిలువంజాలక యున్నవి.

**అత్తరుల రసాయన విభజనము.**

తైల పదార్థము లెన్నియు సాధారణముగ నీటియందు మిశ్రమము నొందవు. కొన్ని కొంత భాగము మిశ్రమ మొంది కొంతభాగమైన మిశ్రమ మొందక యుండును. అత్తరులను (అనగా కస్తూరిలేని

నిజమైన పుష్పసారములు(=Essential oils) నీటియందుమిశ్రమ మొందవు కావున నివి తైలస్వభావముకలవి. మరియు నీయత్తరుల కొంచెమొక కాగితముపై వేసినచో నచ్చట మరకను కలుగఁజేయును. ఇతర తైలములు చేసిన మరక యెండలోనుంచిన పోదు కాని యత్తరుల మరకయెండలోఁబెట్టిన పోవును. కావుననే యత్తరులు మామూలు నూనెల కంటె కొంచెము విలక్షణమైన నూనె లని చెప్పవచ్చును. అత్తరులు గాలితగిలినచో హరించి పోవును, (Volatile) మరియొక భేదము. నూనెలు బట్టీ పట్టి సంధానించిన యెడల తప్పక చెడిపోవును. అత్తరులట్లుగాక నీటి యావిరితో గలసి యావిరిరూపము నొంది మరల చల్లబరుచుటతోడనే తైలరూపము నొందును.

అత్తరును చేయు స్థలములు.

హిందువులు అత్తరులను పూర్వమెంత విరివిగ చేసినవారైనను ప్రస్తుతము తోటలు పెంచి వ్యాపారము కొరకు ఒకటి రెండు ప్రదేశములయందు మాత్రము అత్తరులను చేయుచున్నారు. ఇందు "ఘాజీపూరు" ముఖ్యము. కనోజీ, హైదరబాదు, మైసూరు లలోకూడ బహు స్వల్పముగ స్వదేశ సంస్థానముల స్వల్ప పోషణముతో జరుగు చున్నవి. ప్రస్తుతము విరివిగ నత్తరులు తయారుచేయు స్థల మొక్క ఘాజిపురము (Ghazipore) మాత్రమే. ఇచ్చట గులాబీ తోటలు కొన్ని వాదల ఎకరములు గలవు. ఇందు అన్నియుకోసి సంధానపు పద్ధతినే యత్తరువులు చేయుదురు. ఈ పరిశ్రమకు ప్రముఖు లిచ్చట మహమ్మదీయులే.

అత్తరు తయారు జేయు పద్ధతులు.

పరిమళకారుఁడు ప్రస్తుత మీ క్రింది పద్ధతులవలనత్తరుల తయారు చేయును. ఈ పద్ధతులు తయారు చేయ వలసిన యత్తరు రూపమునుబట్టియు, నత్తరు నిచ్చు వస్తువుయొక్క గుణభేదమును బట్టియు మారుచుండును. ముఖ్యమైన నాలుగు పద్ధతులుమాత్ర మిందు వివరించెదము. (1) పిండి తీయుట (Expression) (2) స్రవము. (Distillation) (3) పీల్పించి తీయుట (Absorption)(4) చివుక పెట్టుట (Maceration) ఇవిగాక నానబెట్టుట (Difusion) కరగించుట (Dissolution) మొదలగు పద్ధతులు మరికొన్ని గలవు గాని యవియంతగా ప్రయోజనము కావు.

(1) పిండి తీయుట.

ఈ పద్ధతి నత్తరుతీయ వలసిన వస్తువునందు తైలము మిక్కిలి యధికముగ నున్నప్పు డవలంబింపఁబడును. పరిమళభాగముగు తైలమధికముగానుండి వస్తువును వ్రేళ్లతో నదిమిన నూనె పైకివచ్చు నప్పుడీ పద్ధతి యవలంబింపఁబడును. ఈ పద్ధతి యందు పరిమళమును తీయవలసిన నారింజ, నిమ్మపండ్ల తొక్కలవంటి వస్తువుల నొక గుడ్డ సంచిలో పోసిగాని, పోయకగాని, ఒత్తుడు మరలో

పెట్టిగాని, గానుగలో వేసిగాని, యదిమి పరిమళభాగ మగుసువాసన తైలమును(అసలు అత్తరును) పిండుదురు. ఈ మర బలమగు ఇనుపపాత్రలం బోలియుండును. 6 అంగుళములు మొదలు వలయ ముండును. 12 అంగుళముల లోతుండును. సుమారు 5 మణుగుల పదార్థము పట్టుటకు వీలగునంత పెద్దదికూడ చేయ వచ్చును. ఆ పాత్రకు క్రిందనొక చిల్లియుండును, దానినుండి పిండబడిన తైలము క్రిందికి కారును. లోపల చిల్లులుగల కల్పితపీఠము (False-bottom) నొకటి యమర్చి దానిపైన నారింజ పండు తొక్కలు మొదలగు వస్తువులు నిలిచి మరియొక ఇనుప రేకును పైనవేయుదురు. ఆ ఇనుపరేకు వలయముగనుండి పాత్రలో నిమిడి యుండును. పైన మర త్రిప్పుట వలన క్రమముగా నా రేకు క్రిందికి దిగును. అందు వలన నారింజ తొక్కల యందు అసలు అత్తరు (Essential oil)ను కలిగియుండు గోళములు చితికి క్రిందికి రంధ్రముగుండ కాలువలు గట్టును. ఇట్లు తీసిన తైలముల యందు కొంతభాగము నీరు కలిసి యుండును. అదిస్వభావముగ కొద్ది కాల మొకపాత్రలో పోసి నిలువయుంచినచో నత్తరునుండి వేరు పడును. అప్పుడు నీరును తొలగించి తైలమును వడియబోసిన యెడల పరిశుభ్రముగ నుండును. తైలము స్వల్పముగ నున్నప్పుడు నోటిలో నొకగాజు గొట్టమును పెట్టుకొని నీటిపై తేలిన తైలపుబిందువుల నొగ్గి పీల్చి సమీకరణ మొనర్చనగును.

(2) స్రవము.

6 శేర్లు మొదలు (ద్రవపదార్థము నుగొలుచు శేరు) 120 శేర్ల వరకు పట్టుగాగి, ఇనుము లేక గాజుపాత్రతో చేయబడిన వాలుకా యంత్రమునొకదానిని సంపాదించి, అత్తరు దీయవలసిన పదార్థము నందు వేసి కొంచెము నీళ్లతో నాపదార్థము మునుగునట్లు చేయవలయును. ఈపాత్రకు మూతగా నొక బోలుగనుండు గొట్టముగల కమర్చిన గిన్నె వంటిదమర్చవలయును. ఈగిన్నెనుండి పొడుగైన గొట్టమును మరి మేకుచుట్లవలె గుండ్రముగ వంచి యొక నీటిపాత్రలోని కమర్చవలయును. ఆ నీటిపాత్రబయటికి గొట్టముకొన వచ్చియుండవలెను. ఈనీటి పాత్రయందెప్పుడును నీరు పడుచుండవలెను. పిమ్మట యంత్రమున కమర్చిన పదార్థములుగల పెద్దపాత్రయందలి నీరును ఉడకపెట్టవలెను. ఆవిరి తప్పిపోకుండ అదికినభాగము లన్నియు జాగ్రతగా మూయవలయును. అందువలన ఉడుకుపట్టినపిమ్మట నావిరి దారి లేక పాత్రనుండి పైనగప్పిన గిన్నెలోనికి, పిమ్మట గొట్టములోనికి, పిమ్మట నీరుపడు గొట్టముల వంకర ప్రదేశమునకు వచ్చి యచ్చట చల్లనినీరు పడుచుండుటచే నావిరి రూపముననున్న మేఘములు చలిగాలి తగిలి వానమైనట్లు ద్రవరూపమునొంది బయటికి గల కొనలోనుండి చుక్కలుచుక్కలుగా నీవ-

లకునచ్చును. అచ్చట నొక పరిశుభ్రమైన పాత్రలోనికి ద్రవమునుపట్టి యుంచవలెను. ఈయావిరితో బట్టీయందున్న వేడితగులగనే త్వరలో నావిరియగు పరిమళభాగము కూడ నీటితో కలసి వచ్చుచుండును. ఇట్లుతీసిన ద్రవమును కొంతకాలము మూతవేసి నిలువయుంచినచో పైకి తైలము తేలును. అదియే సుగంధతైలము. అప్పుడడుగుననుండు నీరును క్రిందికి క్రిందియంత్రసహాయమున విడదీయుదురు. ఈ యంత్రమును విభజనకారి (Seperator) అందురు. దీని కడుగున బిరడాగల గొట్టముండును. ఆ బిరడా కొంచెము త్రిప్పినచో నడుగున గలనీరు క్రమముగ క్రిందికిం బోవును. పైనిగల తైలము మాత్రము దిగపడునట్లు బిరడా సులభముగా మూసివేయవచ్చును. ఈసంధానపు పద్ధతి వలననే అత్తరు లన్నియు సర్వసాధారణముగా తయారుచేయంబడును. కొందరు వాలుకా యంత్రమున మొదటచెప్పినట్లు నీరుపోయక చిగురు సారాయము (Alcohol) ను పోసిబట్టీ తీయుదురు. అందువలన అత్తరు సారాయములోంగలిసి పైకివచ్చును. ఈపద్ధతి యిప్పుడు వాడుకలోలేదు. నీళ్లకంటె సారాయము స్వల్ప వేడిమివలననే ఉడుకు పట్టుటవలన కొన్నిగింజలు, లవంగములు మొదలగు వస్తువులనుండి తైలము పూర్తిగా తీయుటకు సారాయము శక్తిలేక యుండును. మఱియు నీటితో తీసినపిమ్మట వలసినవారు సారాయములోగాని, తైలములోగాని కలుపుకొనవచ్చును. మిచాం అనుచోట లవండరు తయారుచేయుట కుపయోగించు పెద్దయంత్రము మిక్కిలి గొప్పదికల్లదు. 100 మణుగుల వస్తువులనుండి యొకేమారు అత్తరు తీయుటకు ఇదిపనికివచ్చును. ఇరిత బ్రహ్మాండమగు వాలుకా యంత్రములు ప్రపంచమున మిక్కిలి కొద్దిగా కలవు. ఇంతకంటె చిన్నవి ఫ్రాన్సుదేశమున నుపయోగించెదరు. అందువలన వివిధములగు నత్తరు లొకే మారు తీయంగలరు. వారి బట్టీలు మనపూర్వులుపయోగించు బట్టీలంతమంచివి కావు. అత్తరుల తయారుచేయుపద్ధతి కనుగొనినవారలు మనవారేయైనను, మనదేశమున యంత్రము లభివృద్ధినొందక ప్రాథమికావస్థయందే యున్నవి. విదేశములయందు చల్లని నీరు పర్వతముల యందలి సెలయేళ్లనుండి తెప్పించి యావిరిని చల్లబరుతురు కాని ఇది యవసరముకాదు. ఉపయోగము మాత్ర మధికము. క్రొంచివారు బట్టీక్రిందమంట బెట్టింకాచెదరు. ఇందువలనపరిమళములకు మాడు వాసన రావచ్చును. లండనులోమాత్ర మట్లు చేయక 10 లేక 15 అశ్వశక్తిగల యావిరియంత్రపు టావిరితో నీ పని నడుపుదురు ఇప్పుడు ఫ్రాంసులోగూడ నీపద్ధతి యవలంభించుచున్నారు. లండనులో నొకపెద్ద వర్తకసంఘమువారిటీవల నొక క్రొత్తవాలుకా యంత్రమును కనిపెట్టి యున్నారు. ఈ యంత్రమువలన సంధానింపంబడిన నీరునుండి యత్తరు వేరుపఱచు శ్రమలేదు. ఆ పని

యంతయు యంత్రమే చేసికొన్నును. ఇది మిక్కిలి మంచిది.

ఘృతమ్ము (Pomade) అను పరిమళ

(3) చివుక పెట్టుట లేక నానబెట్టుట.

ములను ఫ్రెంచి వారు చేయుదురు. ఇవి బజారుల లో అమ్ము అంగరాగ ముల వంటివి కావు. మంచి దూడ క్రొవ్వును, దుప్పి కొవ్వును, పంది కొవ్వును, పరిశుభ్ర పరచి కలిపి పింగాణి పాత్రలో వైచి వెచ్చ పెట్టుదురు. అట్లు వెచ్చ పెట్టుటకు ఆవిరిగాని ఆవిరి స్నానము గాని యుపయోగింతురు. ఆ క్రొవ్వు కఱిగి వెచ్చగా నుండగా పుష్పములను దెచ్చి కఱిగిన క్రొవ్వులో వేయవలయును. అట్లు వానిని ఒకటి రెండు దినములుంచి నచో, క్రొవ్వునకు పరిళమును పీల్చుశక్తి గలిగి అది చాల పరిమళయుత మగును. ఈ క్రొవ్వు మరల స్వల్ప వేడిమిగల యావిరితో కరిగించి, వడపోసి మరల క్రొత్తపుష్పములం జేర్చుచు వలసినంత పరిమళ వంతముగ చేసి కొన వచ్చును. పరిమళతైలములు ఈ పద్ధతుల ననుసరించియే తయారు చేయుదురుగాని క్రొవ్వుకు బదులుగా నూనె నుపయోగించె దరు. అది ఆలివునూనెయైన ప్రశస్తము. మన నువ్వులనూనెయు నుపయోగించ వచ్చును. ఈ పద్ధతివలన నారింజ, గులాబీ, లవంగ పుటాకు, మొదలగు పరిమళములు తయారు చేయుదురు. పై పద్ధతులవలన తీయుటకు వీలు లేని అతిసున్నితములగు పరిమళ భాగములకు (పీల్చుట) అను నీ క్రింది పద్ధతి నుపయో గింతురు.

ఈ పద్ధతియందు ఫ్రెంచివారతి నిపుణులు

(4) పీల్చుట

ఈ పద్ధతి పరిమళ కారు లకు మిక్కిలి యుప యోగమైనది. ఫ్రెంచి ఘృతములు, తైలము లన్నియు నీపద్ధతి ప్రకారము తయారు చేసి నవియే. పైని జెప్పినమూడు పద్ధతుల యందలి స్వల్ప వేడిమికినికూడ చెడిపోవు గుణములు గల అతిసున్నితములగు పుష్పసారములీక్రింది పద్ధతిని యగ్నిసహాయము లేక తయారు చేయుదురు. నలుపలకలగు కమ్ములతో చేసినచట్టములను నిందు ఉపయోగిం తురు. ఈ చట్టములు మూడంగుళముల లోతుండును. అడుగుభాగముననద్దముండును. అది రెండడుగుల వెడల్పుండ వచ్చును. మూడడుగుల పొడవుండును. ఇట్టి చట్టము లను అద్దపుపలకలు బిగించినపిగా సంపాదించ వలయును. ఈయద్దపు చట్టములలో కొం చెము క్రొవ్వును కత్తితో నడుమున పట్టించి యద్దమంతయు కప్పవలెను. ఆ క్రొవ్వు అద్దము మీద పాతికయంగుళము దళసరిని పూయ వచ్చును. అందుపైని వికసించుటకు సిద్ధముగ నున్న మొగ్గలు వేసియుంచి 12 గంటల మొదలు 72 గంటలవరకు నుంచి, మరల నా పాతలోని పుష్పములుతీసి క్రొత్తమొగ్గలు వేయుచు వలసిన పరిమళమును క్రొవ్వుకు పట్టింపవచ్చును.

కొన్ని వర్తకసంఘములు బుత్తుకాలమునే నిట్టిచట్టములు మ్రూడువేల వరకు నుపయోగించుదురు.

పరిమళ పరిశ్రమ.

తైలములు చేయుట కాచట్టములకు అద్దము బిగించుటకు బదులుగా తీగవల్లుదురు. ఆతీగ వలన పైని నూనెలో ముంచిన గుడ్డలువేసి ఒక్కొకగడి కొక్కొక పుష్పము చొప్పున పైకి తొడిమ యుండునట్లుపెట్టి ప్రతిదినము క్రొత్త పుష్పములనుమార్చి నూనెనుపరిమళ నంతయునర్చుకొందురు. పరిమళముపూర్తిగా వచ్చిన పిమ్మట గుడ్డలను పిండి నూనెతీసికొని బుడ్లలో పోయుదురు. కొవ్వుకు బదులు కిరసనాయిలు సంబంధమైన (Parfine) అను వస్తువును వాడుటకు ప్రయత్నించిరి. కాని ఇందొక లాభమును, మరియొక చెడుగును కలదు. పారఫినుతో తయారుచేసినది మెతక వాసన వేయక యెంతకాలమైన నిలువయుండును కాని కొవ్వువలె పరిమళమునంతగా పీల్చుకొనలేదు.

పైన సర్వసాధారణమైన పద్ధతులుమాత్రము చెప్పబడినవి. కాని వివరముగ తెలిసికొనువారు పని ప్రారంభించవలయును. ప్రస్తుతము హిందూదేశమున నరణ్యముల యందును, ఇతర స్థలముల యందును విరివిగ పెరుగు పుష్పములు ఫలము లేగాక, తుంగ కాయలు, కచ్చూరములు, మొదలగు వేళ్లనుండియుదుంపలనుండియుకూడనత్తరులుచేసి లాభము పడయవచ్చును. కావలసిన రకముల యత్తరులను చేయగోరువారు కొన్ని ఎకరముల భూమియందు ముందు తోట అను పెంచి పుష్పములనుపొంది పిమ్మట యంత్రములను స్థాపించుట శ్రేయోదాయకము. మనదేశమునం దనేక ప్రదేశముల యందు కొన్నికొన్ని వృక్షములు పెక్కులు పెరుగును. వానినుండి తయారుచేసినచో తోటను పెంచవలసిన యగత్యముండదు. యంత్రములకంతగా ఖర్చులేదు.

తైలములలో గింజలు, వేళ్లు, దుంపలు మొదలగునవివేసి కాచి తీయుట యేగాక అత్తరులు స్రవింపుపద్ధతినే తయారుచేయువారు. ఆ బట్టీలే యింతవరకు నభివృద్ధి పొందుచుకొనక మనవారు ఇప్పటికొన్నికొన్ని స్వదేశ సంస్థానములయందును, ఘాజిపూరు, కనోజి పట్టణములయందును తయారుచేయు చున్నారు.

మన పూర్వుల పద్ధతులు.

గ్రాసు, కేన్నెసు, నైసు అనుపట్టణములలో మిక్కిలి ప్రసిద్ధములగు నత్తరువులు చేయుదురు. మరియు నగ్ని పర్వతములనుండి వెలువడిన పదార్థములవలన భూములు సారవంతములై నారింజచెట్లు విరివిగ పెరుగు ఇటలీదేశమునందును, సిసిలీద్వీపము నందును నారింజచెట్లయొక్క వివిధ భాగములనుండి విరివిగ నత్తరులు చేయుదురు.

విదేశములయందత్తరుచేయు ప్రసిద్ధ స్థలములు.

తూర్పు తురుష్కము నందును, బల్గేరియా దేశమునందును, గులాబీయత్తరు నిరివిగ తయారగుచున్న ఆంగ్లేయ దేశమునందు లవండరు, వప్పరి మెంటు మిక్కిలి మంచిరకములు తయారగును. వీనికి ముఖ్యస్థానమగుమిఛాము నందలిలవండరు సుప్రసిద్ధము. వెల యధికముగ నుండును. ఇంకను నితరప్రదేశములు చిన్న వనేకములుగూడ గలవు.

కల్పిత పరిమళములు.

19వ శతాబ్దాంతము నుండి కృత్రిమ పరిమళములు తయారు చేయుట పాశ్చాత్యులు కనుగొనిరి. అప్పటి నుండియు జర్మని, ఇంగ్లాండు, అమెరికా దేశములయందీ కృత్రిమ పరిమళము లనంతముగ తయారగుచున్నవి. సోడా దుకాణముల వాగుపయోగించు షర్బత్తులయందలి ఫలముల పరిమళములలో మూడువంతులు కల్పితములే.

ఇటీవలకనిపెట్టిన క్రొత్త సంగతులు

పరిమళములను కొన్ని మయినములతోడను, కాగితములతోడను కలిపి ఇటీవల తైలరూపమున నుండునవి ఘనపదార్థములుగాఁజేసి వానిని నుపయోగించుచున్నారు. ఇవి ఇంకను వర్తక రహస్యములుగా నుండుటచేత వానినిగురించి విపులముగ వ్రాయలేదు.

వం॥ సు॥ రా॥

## అత్తలూరి పాపకవి.

కౌశిక గోత్రుఁడు. అక్కిరాజు మనుమఁడు, శ్రీగిరి మంత్రిపుత్రుఁడు. ఈ కవి చెన్న బసవ పురాణమను గ్రంథమును వ్రాసి కంచుకూరి అమృతలింగమునకుఁగృతి నిచ్చెను. ఆ గ్రంథము పదునేడవశతాబ్ద ప్రారంభమున వ్రాసినట్లు తోఁచుచున్నదని బ్రౌన్ దొరగారును, ఈ కవి పదునెనిమిదవ శతాబ్దములోని వాఁడని మఱియొకఁడును జెప్పుచున్నారుగాని కవికాలము నిర్ణయించుట కెట్టి యాధారమును గనఁబడుటలేదు.

ఈ గ్రంథము ఆయిదాశ్వాసములుగల శైవపురాణము. అందలి కథను రేణుకమహర్షి అగస్త్యునకుఁ జెప్పినట్లుగా నున్నది. "ఓం" అనుదానికి నర్థము చెప్ప లేనందున బ్రహ్మను బ్రహ్మత్వమునుండి తొలఁగించి, తత్పదవిని బూనిన కుమారస్వామిని భూలోకమున జన్మించి ప్రజల నుద్ధరింపుమని పార్వతీ పరమేశ్వరులు వేడగ కుమారస్వామి చెన్న బసవన్నగఁ బుట్టెనని ఈ పురాణ సంప్రదాయము. ఈ పుస్తకమునఁ బురాణ లక్ష్యము లన్నియు గలవుగాని-ఇతర పురాణములకంటె ఎటుకల వర్ణన, తస్కరుల వర్ణన మొదలగు వాని మూలమున హాస్యరస మెక్కువగ నున్నది. కవిశైలి మృదువుగను మనోహరముగనే యున్నది.

**అత్యగ్నిష్టోమము.** యజ్ఞవిశేషము. అగ్నిష్టోమముకంటె నెక్కుడు ఫలమిచ్చునది.

**అత్పాడి.** అత్పాడి యన్నుగ్రామము బొంబాయిరాజధానిలోని అంధీ అను సంస్థానములో నున్నది. జనసంఖ్య ౧౯౦౧ లో ౫౦౨౭. ధంగాడీలనునొక పెగవారలిచ్చట ఖిలార్ అను పసువులను పెంచెదరు. అవియుండుటచేతనే ఈగ్రామమునకు ప్రసిద్ధికలిగినది. ఈగ్రామసమీపములో ఖరసమేడ్ అను చోట నాథుండరు దేవుని యాలయము గలదు. అందుచే అక్కడకు యాత్రికులు ప్రతిసంవత్సరము వెళ్లెదరు. అక్కడ గొప్పపసువుల సంతగూడ జరుగును.

**అత్రాఫ్-ఇ-బల్దాజిల్లా.** ఈజిల్లా హైదరాబాదు సంస్థానములో నున్నది. దీనికి ఎల్లలు ఉత్తరమున మెదక్, టల్ గన్ డాల్ అనబడు జిల్లాలు. దక్షిణమున మహబూబునగరము. తూర్పున నల్లగొండ. పడమర గల్బర్గ బీడార్ అను నవి. ఈజిల్లా (1) మెడ్చాలు (2) అంబరుపేట (3) షాహాబాదు (4) అసఫ్‌నగరము (5) పాట్లూరు జూకాలు అను నైదు తాలూకాలుగ విభజింపఁబడియున్నది.

ఈ జిల్లాయంతయు మొత్తముమీఁద పర్వతమయము. ఇక్కడ అనంతగిరి, రాజకొండ అనుకొండలు గలవు. నదులు మూసి, మంజీర, అను నవి. మఱికొన్ని చెఱువులున్నవి. అడవులు చాలకలవు. వానిలో వన్యమృగము లుండును.

ఈ జిల్లాయొక్క వైశాల్యము 33౯౯ చదరపుమైళ్లు. నదులు కాలువ లుండుటచే జిల్లాలో చాలభాగము క్షేమకనుండి చలిజ్వరములు, మన్యజ్వరములు తఱచుగ వచ్చుచుండును. అక్టోబరుమాసము నుంచి మార్చినెలాఖరువఱకు మాత్రము చాల ఆరోగ్యముగ నుండును.

పూర్వ చరిత్ర. ఈ జిల్లాను (౧౧౫౦-౧3౨౫) పూర్వము కాకతీయ వంశజులు ఓరగల్లు రాజధానిగ నేర్పఱచుకొని పాలించెడివారు. పదునాల్గవ శతాబ్దమునుండి ఇది మహమ్మదీయ పాలనములోనికి వచ్చెను. సుల్తాను మహమ్మదుషా భామినీ కాలములో (౧౫౧౨) తెలుఁగు జిల్లాలకు అప్పటి ఏలికయగు సుల్తాన్ ఖులి కుతుబ్‌షాయను నతఁడు తన స్వాతంత్ర్యమును ప్రకటించెను. తరువాత ఔరంగజేబు దక్కను దేశమును స్వాధీనపఱచుకొనునంత పర్యంతము ఈకుతుబ్‌షా వంశస్థులే ఏలుచుండిరి. ఔరంగజేబు ఈజిల్లాను ఢిల్లీ సామ్రాజ్యమునకు చేర్చెనుగాని హైదరాబాదు సంస్థానము ఏర్పాటయి నప్పుడు (అనఁగా పదునెనిమిదవ శతాబ్దములో) ఈ జిల్లా మరల దానినుండి వేఱుచేయఁబడెను.

ఇక్కడ ప్రసిద్ధికెక్కిన పట్టణమ్ములు రెండు కలవు. అందులో గోలకొండ యనునది యొకటి. దీనికే మహమ్మదు నగరమని పేరు.

ఈ పురము కుతుబ్ షాహి నవాబులకు రాజధానిగ నుండెడిది. హైదరాబా దిక్కడకు ఐదు మైళ్లలో యున్నది గోలకొండలో నవాబుల గోరీలును కోటయుఁ జూడఁదగినవి.

రెండవదియగు మైసారమ్ నగరము హైదరాబాదునకు పది మైళ్లలో కలదు. ఇక్కడ, శిథిలములగు దేవాలయములును, ఔరంగజేబు చక్రవర్తిచే పడఁగొట్టఁబడిన దేవాలయముల చిహ్నములును కలవు. హిందూ దేవాలయములను పడఁగొట్టించి ఆ రాళ్ళతో ఔరంగజేబుచేఁ గట్టింపఁబడిన మసీదుకూడ యొకటి గలదు. జనసంఖ్య ౧౯౦౧ లో (౮,౨౦,౭౦౨) ఈజిల్లాలో ౮౮౭ గ్రామములు కలవు. ఇక్కడ నున్న జనులలో నూటికి ౮౭ గురు హిందువులు. నూటికి ౮౬ గురు తెలుఁగుభాష మాట్లాడెదరు.

ఇచ్చటి జనులలో చాలభాగము కాపులు బ్రాహ్మణులును, కోమటులును, గాండ్లు (కల్లు గీయువారు), సాలెలును, చర్మము (తోలు)పనిజేయు గొడారి వాండ్లును గలరు. ఈ ప్రజలో నూటికి ముప్పదిముగ్గురు చొప్పున వ్యవసాయముచే జీవించెదరు. ఇక్కడ వరి వ్యవసాయము తక్కువ. కొన్ని చేతిపనులు గలవు. గుఱ్ఱములను పెంచెదరు.

అడవులలో మంచి కలపదొరకును. ఈ జిల్లాలో మంచిరోడ్లు ఉన్నవి. కాలువలును కలవు. ఇనుపదారి నూఱుమైళ్ల పర్యంతము వ్యాపించియున్నది. అందుచే జిల్లాలో వర్తకము బాగుగనే జరుగుచున్నది. కొద్దిపాటి ఎగుమతులును జనులకు కావలసిన పదార్థముల దిగుమతియును గూడ నున్నవి. దేశమునకు కఱవుబాధ విశేషించి లేదు.

పరిపాలన.

ఈ జిల్లా రాజకీక సదుపాయముల కై మూడు భాగములుగ విభజింపబడి యున్నది. రెండు తాలూకాలకొక తహశ్శీలుదారుండును. అనగా ఆఱు తాలూకాలను ముగ్గురుందురు. మొదటియాతఁడు అంబరుపేట షాహబాదునకు అధికారి. తక్కిన ఇద్దఱు తహశ్శీలుదార్లు ఈతనికి లోఁబడియుండెదరు. కాని వారిద్దఱును తమ తాలూకాలలో రెండవక్లాసు మేజస్ట్రీటుగను మూడవక్లాసు తహశ్శీలుదారు అధికారిగను ఉండెదరు. మొదటి తహశ్శీలుదారే జిల్లాకు ముఖ్యాధికారి. మిగత తహశ్శీలుదార్ల తీర్పులపై అప్పీలు ఈతనికి చేయవలెను. ఈతనికి సహాయోద్యోగి యొకడుండును. ఈతఁడు గ్రామములో లేని సమయములలో ఈ అసిస్టెంటు ఆతనికి బదులుగ కేసుల విచారించును గాని అన్ని సివిలు వ్యాజ్యములకును మొదటి తహశ్శీలుదారే స్వంతముగ తీర్పు చెప్పవలెను.

ఈతనికి పోలీసు సూపరింటెండెంటు కూడ తోడ్పడి క్రిమినలు వ్యవహారముల నెఱపును.

ఇక్కడ పెద్దచెఱసాల లేకపోవుటచే ఖైదీలనందఱను హైదరాబాదునకే పంపుదురు. విద్యమిక్కిలి తక్కువ. ప్రాథమిక పాఠశాలలు తొమ్మిదియు నొక మిడ్డిల్ స్కూలును గలవు. హైస్కూలు లేనేలేదు. సర్కారు వారు ధనము వ్యయపఱచుటకు వెనుదీయుట లేకపోయినను జదువుకొనువారిసంఖ్య తక్కువగుటయే దీనికిఁగారణము.

**అతికాయుఁడు.** రావణునకు ధాన్యమాలిని యను భార్యవలనఁ బుట్టిన పుత్రుఁడు. మిక్కిలి స్థూలశరీరము గలవాఁడు. వీఁడు తపస్సుచే బ్రహ్మదేవుని మెప్పించి దివ్యరథమును, అస్త్రంబును, కవచంబును, సురాసురులచే నవధ్యత్వంబును వడసి, ఇంద్రుని, వరుణుని నోడించెను. రామరావణ యుద్ధమునందు నీతనిని లక్ష్మణుఁడు బ్రహ్మాస్త్రముతోఁ జంపెను. (వా. రా. యుద్ధ. స. ౭౧)

**అతిథి.** ౧. అత్రిగోత్ర మందలి యొక ఋషి. (చూడుఁడు అత్రి.)

౨. (సూ. వం.) శ్రీరాముని పౌత్రుఁడు. కుశునిపుత్రుఁడు. ఇతని పుత్రుఁడు నిషధుఁడు.

**అతినాముఁడు.** చాక్షుష మన్వంతర మందలి సప్తర్షులలో నొక్కఁడు.

**అతిభానుఁడు.** కృష్ణునకు సత్యభామ యందు జనించిన పుత్రుఁడు.

**అతిబాహువు.** కశ్యపస్త్రీయైన ప్రాధకుఁ బుట్టిన గంధర్వులలో నొక్కఁడు.

**అతిమధురము.** ఇదియొక గురువింద జాతిచెట్టువేరు. ఈ వేరు నెండనిచ్చి చిన్న చిన్న ముక్కలుగాఁగోసి రవానా చేయుదురు. ఇది ఇండియాలోని యడవి భాగములయందుఁ దఱచుగా దొరకును. దీనికి [illegible] చక్కల కఱ్ఱవలెఁ బైబెరడు గోధుమవర్ణము కలిగి యుండును. నోటిలో వేసికొనిన నోరంతయు తియ్యఁగానగును. మిగిలినరసము లిందేవియుఁ గానరావు. ఇయ్యది మధుస్కంధములోనిది (అ. హృ. సూ. అ ౧౦). మిక్కిలి కఠినముగ నుండును. దీనినే యష్టిమధుకమనియు, మధుకమనియునందురు. చలువ, వీర్యవృద్ధి, బలము వీనిని గలుగఁజేయును. పైత్యము, రక్తపైత్యము, విదాహము, క్షయ, ఉబ్బసము, మేహము, ప్రదోషము, చర్ది వీనియందుపయోగింతురు. వ్రణములపై వస్తికర్మ (పిచికారీ) చేసినపిమ్మట నీ వేరుపొడి చల్లి కట్టుకట్టిన మలినమును శోధించును. దాహమును తగ్గించుటకింతటి యౌషధి వేఱేదియు నింకను కనుఁబడలేదు.

**అతిమూత్రము.** సామాన్యముగా మానవులు దిన మొక్కంటికి 50 అవున్సులు, అనగా రమారమి ఒకటిన్నర సేరు మూత్రమును విసర్జింతురు. ఇంతకంటె నెక్కువ మూత్రము నొకమానవుఁడు విసర్జించునెడల నది వ్యాధిలోఁ జేరును. మూత్రమును

హెచ్చుగవిసర్జించెడి యనేకులరోగులమూత్రములో చక్కెర యుండును. మూత్రమునందు చక్కెర లేని యతిమూత్ర వ్యాధియు గలదు. అట్టివ్యాధి వట్టి అతిమూత్ర వ్యాధి యనియు, చక్కెరగల అతిమూత్ర వ్యాధిని మధుమూత్ర వ్యాధియనియు చెప్పవచ్చును.

వట్టి అతిమూత్రవ్యాధి చాల నరుదు.

**వట్టి అతిమూత్రము**

సామాన్యముగ నాడువారలలో కంటె మగవారలలో నీవ్యాధి రెట్టింపు హెచ్చుగ నుండును. ఇది సామాన్యముగ నొక కుటుంబములో ననేకులకు వచ్చుచుండును. ఆ కుటుంబములలో మతిభ్రష్టత, మూర్ఛ మొదలగు నరముల సంబంధమైన వ్యాధులు తరుచుగ కానఁ నగును. ఒక కుటుంబములోని నాలుగుతరములవారిలో 26గురు రోగులు లెక్కకు వచ్చిరనియు అందు 11 గురి కీజాతి అతిమూత్రము కనఁబడెననియు నొక వైద్యుడు వ్రాయుచున్నాడు. సవాయి, మెదడు జ్వరములు, నెత్తిమీద దెబ్బలు, పొట్టమీద దెబ్బలు, భయము, విచారము, చలి, అతి త్రాగుడు, తిండిలేక పోవుట, ఇవియన్నియును ఈ వ్యాధితో సంబంధముకలిగి యుండవచ్చును.

**వ్యాధి లక్షణములు**

1. మూత్రము మిక్కిలి హెచ్చుగ నుండుట 2. భరింపరాని దాహము. ఇవి రెండును ముఖ్యమైన చిహ్నములు. వ్యాధి కాలక్రమమున రోగికి దెలియకుండగ గాని, అకస్మాత్తుగగాని రావచ్చును. ఒకానొక రోగి యొక దినమునకు 10 లేక 12 సేర్ల మూత్రమును విసర్జింపవచ్చును. త్రాగిన నీళ్లకంటె మూత్రమెక్కువగ నుండి దేహమును క్రమముగ కృశింపజేయును. మూత్రముయొక్క బరువు నీటికంటె వేయింటికి రెండుపాళ్లు మొదలు ఐదుపాళ్లవఱకు హెచ్చుగ నుండును (Sp Gr. 1002 to 1005). మూత్రములో చక్కెర యుండదు. దాహమధికముగ నుండును. నోరు, నాలిక, గొంతుక యారిపోవును. ఆకలి మిక్కిలి విపరీతముగ నుండును. మొట్టమొదట జీర్ణశక్తి సరిగా నుండునుకాని కొంతకాలమునకు తగ్గిపోవును. పిమ్మట కొన్నాళ్లకు కాళ్లనొప్పులు, నడుమునొప్పి మొదలగు గుణములు పుట్టును. తఱుచు తలనొప్పి వచ్చుట, శరీరముమీద దురదలు పుట్టుట, తిమ్మిరులుగ నుండుట, చూపు తగ్గిపోవుట, బుద్ధిబలము తగ్గుట, కోపము హెచ్చుగుట, విచారగ్రస్తముగ నుండుట, నిద్రలేకపోవుట, సంభోగేచ్ఛ కృశించుట, ఇవన్నియు వ్యాధి హెచ్చినకొలది గనుపింపవచ్చును.

**సాధ్యాసాధ్య లక్షణములు**

కొందఱి కీవ్యాధియందు దుర్గుణములు పుట్టకయే పోవచ్చును. కాని, బలహీనము హెచ్చయిన కొలది నితరవ్యాధులు కలిగి వానిచే బాధ కలుగవచ్చును. అన్నహితవెపుడు తగ్గునో అప్పుడే వ్యాధి క్రూరరూపము

జెందుచున్నదని తలపవచ్చును. మెదడు చెడి పోయినట్లు సూచన లున్నయెడల, వ్యాధి కుదరదని చెప్పవచ్చును.

**వ్యాధి కారణము**

ఈవ్యాధియొక్క కారణ మింకను సరిగా తెలియలేదు. మూత్రతిత్తుల (Kidneys) సంబంధమైన నరముల పటుత్వము తగ్గిపోవుటవలన నాయూయవయవములు సరిగా బనిచేయక పోవుటచేత నెత్తురులోని నీరు హెచ్చుగ బయలు వెడలిపోవును. క్రిందితరగతి జంతువుల మెదడులో నొకభాగమును మనము రేపినయెడల మూత్ర పరిమితి హెచ్చును. మానవులలో నట్టి రేపుదలకు గారణము శరీరములో నేదోయొక భాగమునందు బుట్టుచుండవచ్చును. చెవిలోపల చీముతో నిండుకొనియున్న కురు పున్నప్పుడు కొందఱకు మూత్రము హెచ్చుగ నున్నట్లును, కురుపు చితికి చీము బయటికిరాగానే మూత్రము సాధారణముగ నున్నట్లును, తిరుగ చీము చేరుకొనునప్పుడు మూత్రము హెచ్చుచు చీము పోయినప్పుడు తగ్గుచుండుటయు కొందఱు శోధకులు కనిపెట్టియున్నారు.

క్రిందితరగతి జంతువులలో జీర్ణకోశమునకు సంబంధించిన కొన్ని నరములను గోసివేసినప్పుడు మూత్రము హెచ్చగుటయు, మానవులలోగూడ జీర్ణకోశ సంబంధమైన కొన్నినరములు చెడిపోయినప్పుడు మూత్రము హెచ్చగుచుండుటయు నొకరు కనిపెట్టియున్నారు. మెదడునందు పుట్టినపుళ్ళి, కంతులు, మొదలగువ్యాధులవలన మూత్రము హెచ్చు కావచ్చును. సవాయి మొదలగు వ్యాధులవలన మెదడు చెడిపోయినప్పుడు కూడ మూత్రము హెచ్చుకావచ్చును. కాని మూత్రపుతిత్తులలోని వ్యాధివలన నీవ్యాధి కలుగుచున్నదనుటకు నిదర్శనములు లేవు.

**చికిత్స**

కారణము సరిగా దెలియకపోవుటచేత చికిత్సయు సరిగా తెలియలేదని చెప్పవచ్చును. ఏమందులైనను నప్పటికి కొంచెము గుణము కలిగింపవచ్చునుగాని వ్యాధిని కుదర్చనేరవు. ఎర్గాటు, బెలడోనా, నైట్రోగ్లిసరిను, లోహము, బ్రోమయిడు, మొదలగునవి కొంతవఱకుపయోగకరములు. విద్యుచ్ఛక్తివలన గొందఱకు గుణముకావచ్చును. ఆహారాదులను నిర్ణయముగానుపయోగించుటచే వ్యాధియొక్క క్రూరత్వము కొంతవఱకు తగ్గును. దాహము గలిగినపుడు త్రాగు నీటిని మిక్కిలి తగ్గించుటవలన ప్రయోజనములేదు. మంచుగడ్డ ముక్కలు తినుటవలన దాహము తగ్గవచ్చును. సారాయి, సోడావాటరు, కాఫీ, వీనిని వర్జింపవలయును. వీనివలన మూత్రము హెచ్చగును. ఆహారముతగ్గించునెడల తూనిక తగ్గిపోకుండ రోగినప్పుడప్పుడు తూచుచు సరి చూచుకొనవలయును.

కొద్ది వ్యాయామము, చక్కనిగాలి, తగిన దుస్తులు, వీనివలన రోగికి కొంత గుణముకలు

గును. శరీరమును పిసుకుట, గుద్దుట, పట్టుట మొదలగువానివలన సుఖముగలుగును. ఆవిరి పట్టుట, వేడినీళ్ల స్నానముచేయుట వీనివలన శరీరము, ఆరి ఘోకుండనుండును. మలబద్ధమునకు మిక్కిలి విరేచనకారియగు మందులను వాడకూడదు. ఎనీమా వలనగాని, ముసాంబరము, కాస్కారా సెగ్రడా మొదలగు మాత్రలవలనగాని, కడుపుకు కదలించు వ్యాయామము వలనగాని, విరేచనము చేయించవచ్చును.

**మధుమూత్రవ్యాధి**

మధుమూత్రవ్యాధి,* అనగా మూత్రమునం దెల్లప్పుడు ద్రాక్షచక్కెర *కనబడుచుండు వ్యాధి. ఈ వ్యాధి ఆడువారలలో కంటె మగవారిలో నెక్కువగానున్నట్లు వైద్యుల యభిప్రాయము. చిన్నవయస్సునందుకంటె 30 సంవత్సరముల వయస్సు గడచిన తరువాత నీ వ్యాధి హెచ్చుగనుండును. ఈవ్యాధి సామాన్యముగ భాగ్యవంతులలో హెచ్చుగ నుండునని యనేకుల యభిప్రాయముకాని బీద వారలలో లేకపోలేదు. వృత్తిని బట్టిచూడగా విస్తారము బుద్ధి పరిశ్రమగల వారికే యీ వ్యాధి హెచ్చుగ గలుగునని చాలమంది వైద్యుల యభిప్రాయముకాని మనోవ్యాపారమంతగ లేని వ్యవసాయదారుల యందును, పనివారలయందునుకూడ, నీవ్యాధి గలదు.

**వంశపారంపర్యము**

వంశపారంపర్యముగనే కాని మధుమూత్రము రాదని చెప్పుటకు నిదర్శనములు లేవు. కొన్ని కుటుంబములలో రెండుమూడు తరములవఱకును నన్నగా తండ్రి, తాతలు మధుమూత్రవ్యాధిగ్రస్తులై తాముకూడ మధుమూత్రవ్యాధి పీడితులగువారి ననేకులను మనము చూడవచ్చును. ఒకానొకచో నన్నదమ్ములలో నందఱకు కొద్దిగనో హెచ్చుగనో పెద్దవయస్సునందు మధుమూత్రముండవచ్చును. ఇదిగాక తమ వంశములో మూత్రవ్యాధి యెంతమాత్రము కానరాకపోయినను తమకుమధుమూత్ర ముండవచ్చును. కాబట్టి మధుమూత్రము వంశపారంపర్యముగ వచ్చెనా? తండ్రికి మధుమూత్రమును కలిగించినకారణములే కుమారునికిని తటస్థించెనా? అను విషయములను తెలిసికొనుట కింకను దగిన యాధారములు కానరావు.

**జాతి**

ప్రపంచమునం దన్నిదేశముల యందు కంటె బహుశా హిందూదేశమునం దీవ్యాధి హెచ్చుగ నున్నదేమోయని తోచుచున్నది.

* ఆయుర్వేదవైద్యులు దీనినే మధుమేహమందురు.

* చక్కెరలలో ద్రాక్షచక్కెర, చెఱకు చక్కెర, పాలచక్కెర అని భేదములు గలవు. ద్రాక్షచక్కెర ద్రాక్షపండ్ల రసమునుండి తీయవచ్చును. చెఱకుచక్కెరను పాలచక్కెరను, అట్లే చెఱకునుండియు, పాలనుండియు తీయవచ్చును. ద్రాక్షచక్కెర మైలతుత్తపు ద్రావకముల విఱిచివేసి దానినుండి రాగిని విడదీయును. చెఱకు చక్కెర, అట్లు చేయజాలదు.

అందును మహమ్మదీయుల యందుకంటె హిందువులయందీవ్యాధి హెచ్చుగనుండు. నని కొందఱు చెప్పుచున్నారు. అడవిజాతుల యందుకంటె నాగరకత చెందిన్న జాతులలోను, హీన వర్ణములకంటె నగ్ర వర్ణములలోను, ఈవ్యాధి, హెచ్చుగనున్నట్లు నిదర్శనములు గలవు.

తలమీద దెబ్బతగిలిన పిమ్మట మధుమూత్రము ప్రారంభించినట్లును, భయముచేగాని అధిక కామక్రోధములచేగాని, ధన నష్టము, ఉద్యోగనష్టము, మొదలగువానిచే గలిగిన యధికమనోవిచారముచేగాని, మధుమూత్ర మకస్మాత్తుగా బుట్టినట్లును నిదర్శనములుగలవు. 40 మొదలు 60 సంవత్సరముల లోపుగానుండు స్థూలకాయులకును, మధుమూత్రమునకును, కొంతవఱకు సంబంధము కలదని తోచుచున్నది. కాని, ఎన్నడును లావుగనుండి యెరుగని వారి కనేకులకు గూడ మధుమూత్ర వ్యాధిగలదు.

**ఆహారము**

మనము తిను నాహార పదార్థములను నాలుగు విధములుగ విభజింపవచ్చును.

1. వరిపిండి మొదలగు పిండి పదార్థములు. 2. చెఱకు చక్కెర, పాలచక్కెర, ద్రాక్ష చక్కెర మొదలగు చక్కెరలు. 3. కండను వృద్ధిచేయు మాంసము, గ్రుడ్లు, మినుములు, గోధుములు మొదలగు మాంసకృత్తు పదార్థములు. 4. నెయ్యి, నూనె మొదలగు క్రొవ్వు పదార్థములు.

1. సామాన్యముగ వ్యాధిలేని మనుష్యుడు పిండి పదార్థము లెంతతిన్నను మూత్రములో చక్కెర కానరాదు. కాని మధుమూత్ర వ్యాధిగలవారలు పిండిపదార్థముల నెక్కువగ దినినకొలదిని మూత్రములో చక్కెర యెక్కువయగును.

2. ఆరోగ్యవంతుడైనను మిక్కిలి యధికముగా చక్కెరను దినిన యెడల వాని మూత్రములో చక్కెర కనపడును. చక్కెరను నధికముగా దినుట కలవాటుపడిన వారల మూత్రములో బహుశా కొంతకాలమునకు నెల్లప్పుడు చక్కెర కనబడవచ్చును. ఈ విషయ మింకను నిశ్చయముగా దెలియదు. కాని చక్కెరనెక్కువ తిను భాగ్యవంతుల యిండ్లలో నీవ్యాధి యెక్కువగా గనబడుచుండుటచేత సందేహమునకు గారణమగుచున్నది.

3. పిండి పదార్థములను, చక్కెరలను, తగ్గించి మాంసకృత్తులను నెక్కువ తినుటచే మధుమూత్రము కొందరకు తగ్గును. మరి కొందరకు పిండిపదార్థములను, చక్కెరలను తగ్గించినప్పుడు మాంసకృత్తు పదార్థముల నుండియేచక్కెర పుట్టి మూత్రములో విశువక చక్కెర యుండును.

4. క్రొవ్వు పదార్థముల తినుటవలన మధుమూత్ర వ్యాధియందు హెచ్చు తగ్గులంతగా గానరావు.

పైవిషయములను బట్టిచూడగా నాహార మువలన నెంతవఱకు మధుమూత్రవ్యాధి నివృత్తి యగుచున్నదో తెలియదుగాని పిండి పదార్థములను, చక్కెరలను, తగ్గించినప్పుడు మూత్రములో చక్కెర తగ్గుచుండుట సాధారణముగా గానవచ్చునని తెలియుచున్నది. తిండి నెక్కువగా దినుచు లావుగ నున్నవారలకు మధుమూత్రవ్యాధి రావచ్చునని కొందఱు చెప్పుదురుగాని మొదటి నుండియు బొత్తుగ సన్నముగానున్న వారలుకూడ మధుమూత్ర రోగులుగ నక్కడక్కడనుండుటవలన స్థూలకాయమునకును మూత్రరోగమునకునుగల సంబంధ మింకను తెలియ లేదు.

సంభోగము

అధిక సంభోగమువలన నరముల పటుత్వముతగ్గి మధుమూత్రవ్యాధి కలుగునని కొందఱ యభిప్రాయము. మధుమూత్రవ్యాధిగల రోగులనేకులు తమ కధిక సంభోగమువలన నీవ్యాధికలిగి యుండవచ్చునని తామే చెప్పుదురు. కాని బొత్తుగ నెన్నడును సంభోగమెఱుగని బ్రహ్మచారులకుగూడ కొందఱకీ వ్యాధియుండుటచేత సంభోగమునకును, ఈ వ్యాధికిని, ఎంతవఱకు సంబాధమికలదో సరిగా జెప్పుటకు వీలు లేదు.

వివిధావయవముల యందలి వ్యాధులు

1. మెదడులో కొన్ని భాగములయందు వ్యాధి లేక దెబ్బలు.

2. వెన్నెముకలో కొన్ని స్థలములలో వ్యాధి లేక దెబ్బలు.

3. వెన్నెముక, ముందువైపున సింపతిటిక్ గ్యాంగ్లియా (Sympathetic ganglia) అను నరస్థానముల వ్యాధులు.

4. జీర్ణకోశమునకు సంబంధించిన నరముల వ్యాధులు.

5. వృకమము (Panereas), అనగా నొకానొక జీర్ణరసమును తయారుచేయు నొక గ్రంథి, అందలి వ్యాధులు.

6. థైరాయిడు సూప్రారినల్ (Supra-renal) పిట్యూటరీ (Pituitary) మొదలగు శరీరములలోని కొన్ని యితరగ్రంథుల వ్యాధులు.

7. కాలేయము (Liver) నందలి కొన్ని వ్యాధులు.

ఇవి యన్నియు నేవిధముననో మధుమూత్రమును బుట్టించును. కాని, ఇంతవఱకు నిశ్చయముగ నాయావ్యాధుల కారణములుగాని, వానివలన మధుమూత్రము పుట్టు రీతులుగాని, మనకు సరిగా దెలియవు.

లక్షణములు

కొద్దిపాటి మధుమూత్రవ్యాధి యందు మూత్రమునందు చక్కెర యుండుట తప్ప యితర లక్షణము లేవియు కానరావు. ముఖవర్చస్సు మారదు. కాని, తీవ్రవ్యాధియందు రోగియొక్క ముఖము ముడతలుపడి కృశించిపోయినట్లు స్పష్టముగా దెలియును. ఈలక్షణములు పెద్దతనములో మధుమూత్రముగల స్థూలకాయులలోకంటె, పసివారలలో నెక్కిలి

స్పష్టముగా దెలియును. కొందఱు లైఫ్ ఇన్సూ్యరెన్సుకొఱకుగాని, రాచపుండ్లు, కంటిలోనిపువ్వు, మొదలగు నితరవ్యాధులకైగాని వైద్యునియొద్దకు వెళ్లినప్పుడు, వైద్యుడు తమకు చెప్పగా మధుమూత్రవ్యాధి తమకున్నదని తెలిసికొందురుకాని తమకట్టివ్యాధియున్నదని యనుమానమైనను పొందియుండరు.

మధుమూత్రవ్యాధి యొక్క ముఖ్య లక్షణములు

1. మూత్రములో ద్రాక్ష చక్కెరుండుట.

2. మూత్రము హెచ్చుగ బోవుట.

3. దాహము.

4. మిక్కిలి యాకలి.

5. కృశించి పోవుట.

చక్కెర

మూత్రములో చక్కెర యెప్పుడు పుట్టెనో యనేక రోగులకు మొట్ట మొదట తెలియదని పైని చెప్పియుంటిమి. బలహీనము, శరీరము కృశించి పోవుట, పనిచేయ లేకపోవుట, సంభోగమునందిచ్ఛ తగ్గిపోవుట, అధికముగా నాకలిచే అధికకోపము మొదలగు లక్షణములను రోగి కనిపట్టవచ్చును. మూత్రములో చక్కెర పోవుట సాధారణముగా రోగులకు దెలియదు. కాని మూత్రము పోసినచోట్ల చీమలు పట్టుచుండుట కొందఱు రోగుల కనుమానము కలిగించును. మూత్రమునందు ద్రాక్ష చక్కెరయున్నట్టు లీ క్రిందిశోధన వలన దెలియగలదు.

1. ఒక్క తులము మైలతుత్తమును 15 తులములవాన నీటిలోగలిపి ద్రావకముచేయుము.

2. నాలుగు తులముల పొటాసియము టార్ట్రేటును రెండు తులముల కాస్టిక్ సోడాను 15 తులములవాన నీటిలోగలిపి ద్రావకము చేయుము.

ఒకటవ ద్రావకమును, రెండవ ద్రావకమును సమానభాగములుగ నెత్తి పొంగించి, అందుకు సమభాగము మూత్రముచేర్చి తిరిగి కాచినయెడల మూత్రములో ద్రాక్షచక్కెర యున్నయెడల దానిలో పసుపుపచ్చనైనట్టిగాని యెఱ్ఱనైనట్టిగాని పదార్థమేర్పడును. ఇది మైలతుత్తములోని రాగి.

మూత్రము హెచ్చుట

ఇదియు చక్కెరవలెనే దొంగతనముగా ప్రవేశించును. రాత్రుల యందు సామాన్యముగా నిద్రచెరుపుకొని మూత్ర విసర్జనకు లేవని వారలు లేవవలసి వచ్చుటచే కొందఱీ లక్షణమును గుర్తింతురు. మరికొందఱకు వైద్యులు చెప్పినగాని తెలియక పోవచ్చును. సాధారణముగా మనము దినమున కొకటిన్నర సేరు మూత్రమును విసర్జింతుముకాని తీవ్రమైన అతిమూత్రవ్యాధిగల రోగులు దినమునకు 6 మొదలు 8 సేర్ల మూత్రము విడువవచ్చును. మూత్రముయొక్క బరువు సామాన్యముగా నీటికంటె వేయింటికి 10 మొదలు 30 వంతులకు హెచ్చుగ నుండదుకాని మధుమూత్ర రోగుల మూత్రము వేయింటికి 25 మొదలు

50 రెట్లు హెచ్చుగ తూగవచ్చును. మధుమూత్రరోగుల మూత్రము సామాన్యముగా వట్టిగడ్డి వర్ణముగాను నిర్మలముగ నుండును.

**అతిదాహము**

మూత్ర మధికమైన కొలదిని దాహమధికమగును. ద్రవపదార్థములు హెచ్చుగా త్రాగిన కొలదిని మూత్రమధికమగును. అందున, టీ, కాఫీ, మొదలగునవి మూత్రమును మరింత హెచ్చించును. దాహముచే నాలుక యెండిపోయి బెరడుకట్టును. శరీరముకూడ నెండిపోయి పొడిపొడి వూడుచుండును.

**మితిమీఱిన యాకలి**

ఇది వ్యాధికొంతవఱకు ముదిరినతరువాత గాని యంతగ దెలియదు. మొట్టమొదట నాహారములోని పిండి పదార్థములుమూత్రము చక్కెరగా మారిపోవును. వ్యాధి ముదిరినకొలది మాంసకృత్తుపదార్థములుకూడ చక్కెరగా మారి మూత్రములో పోవుచుండుటచేత నాకలి యతితీవ్రమగును.

**కృశించిపోవుట**

సామాన్యముగా నాకలిబాగుగనుండి జీర్ణశక్తి సరిగా నున్నంత కాలము రోగులు కృశింపరు. కాని కొంతకాలమునకు జీర్ణశక్తియు నాకలియునుతగ్గును. దీనితో శరీరము శీఘ్రముగ గృశించిపోవును.

**ఇతర లక్షణములు**

చిగుళ్లుబ్బి, నాభి వ్రేల్లుబడి మెత్తగనుండి నొక్కిన నెత్తురు చీము వచ్చు చుండును. పండ్లు పుచ్చిపడి వదులై త్వరలో నూడిపోవును.

సామాన్యముగా మధుమూత్ర రోగులకు మలబద్ధము హెచ్చుగనుండును. కాలేయము (Liver) వృకము మొదలగు నవయవములు చెడిపోవచ్చును. ప్రేగులలో క్షయసంబంధమైన పుండ్లు పుట్టవచ్చును. ఊపిరి తిత్తులలో క్షయ ప్రారంభము కావచ్చును. ఇది మధుమూత్రరోగులలో నూటికి 30 మందికి మరణకారణమగును. క్షయ హెచ్చినపిమ్మట కొందఱకు నతిమూత్ర లక్షణములుతగ్గి దాహమును, మూత్రములో చక్కెరయుకూడ తగ్గిపోవచ్చును. గుండెలలో సామాన్యముగా హెచ్చుజబ్బు కానరాదు. మూత్రపిండములలో (Kidneys) మొట్టమొదట నేవిధమైన వ్యాధియుగానరాదు. కాని, కొంతకాలమునకు మూత్రపు తిత్తులుబ్బి 'శ్వేతధాతువు' అను మాంసకృత్తు పదార్థము చక్కెరతోకూడ వెలువడును.

**చర్మము**

తీవ్రమైన వ్యాధిలో చర్మమెండిపోయి గరగర లాడుచుండును గాని సామాన్యముగా మెత్తగనే యుండును. దురద హెచ్చుగ నుండును. జననేంద్రియముల ప్రక్కను మూత్రము తగిలినంత లెక్క దురద మఱియు హెచ్చుగ నుండును. పురుషాంగము చివర పుండుపడి తోలుత్రిక్కినిపోయి పైకిరాదు.

**కురుపులు, రాచ పుండ్లు**

ఇవి సామాన్యముగ వీపుమీదను, మెడ మీదనువచ్చును. కొంత మందికి కాలిలో నేదో చిన్న దెబ్బతగిలి యాభాగము చచ్చిపోవును.

కొద్దిగ గోకినచోటగూడ పుండ్లై, చీముపట్టి, ఆ ప్రదేశము చచ్చిపోయి మరణమ్మునకుగూడ గారణ మగును. కొందఱకు నరికాలిలో పుండ్లుపుట్టి లోలోపలతొలుచుకొనిపోవును. కాళ్లు చేతులు వాపుకూడ కొందఱకు రా వచ్చును.

కండ్లు

నూటికి దొమ్మండ్రుగురకు, అతిమూత్ర రోగులకు, కంటిలో నీరు కాసులను పొరలు పుట్టి చూపు తగ్గిపోవును. కంటిలోని యితర భాగములలోగూడ వ్యాధులు పుట్టి చూపు తగ్గిపోవచ్చును.

సంభోగశక్తి

సంభోగశక్తి సాధారణముగ తగ్గిపోవును. వయస్సు ముదిరిన యాడువాండ్రలో గొందఱకు సంభోగేచ్ఛ మిక్కిలి యధికమగునని యొకరు వ్రాసి యున్నారు.

నరముల పటుత్వము

బుద్ధి బలము తగ్గుటయు, నిద్ర వచ్చునట్లు మత్తుగా నుండుటయు, సామాన్య గుణములు. కాని, కొందఱకు ఉత్సాహము తగ్గియున్నను బుద్ధి కుశలత మాత్రము చినగవలకు జక్కగ నుండును. రాత్రులయందు పిక్కలు లాగుటయు, తిమ్మిరెక్కు నట్లుండుటయు గొందరకు వ్యాధియొక్క ప్రారంభావస్థలోనే కలుగును.

స్మారకము తగ్గుట

మధుమూత్ర రోగుల కంత్యమున సామాన్యముగా స్మారకము తప్పిపోవును. ఇదిచిన్న వయసువారలకును, పెద్దవయస్సువారలకుగూడ సంభవించును.

చాలదూరము రైలుమీద ప్రయాణము అధికమైనను, శరీర పరిశ్రమ మొదలగు వాని వలనను నీయపస్మార మకస్మాత్తుగ గలుగ వచ్చును. ఒక్కసారిగా నధికమైన పథ్యము పెట్టినప్పుడుకూడ నిది కలుగవచ్చును. చాల దినములు విరేచనములు లేకుండ నున్న యెడల నిది యకస్మాత్తుగ గనబడవచ్చును. శస్త్ర చికిత్స (Operation) యయిన వెంటనే యొకానొకప్పుడు స్మారకము తప్పిపోవును.

సాధ్యాసాధ్యములు

ఇది వ్యాధియొక్క తీవ్రతను బట్టియు రోగియొక్క వయస్సును బట్టియు మారుచుండును. సామాన్యమై తీవ్రముగల వ్యాధి, అనగా పథ్యముమీదనే మూత్రములో చక్కెర లేకుండపోవు వ్యాధి శీఘ్రములో సుముఖమునకు వచ్చును. నడిమిప్రాయము తీరినతరువాత వ్యాధి ప్రారంభమైన రోగులలోగూడ వ్యాధి తీవ్రముగ నుండదు. కాని పసివారలయందును, కొందఱకుతీవ్రవ్యాధులయందును ఏమందును, ఏపథ్యమును ప్రయోజనకారి కాదు. మిక్కిలి కృశించిపోవుట, క్షయవ్యాధి పాలగుట, వంశపారంపర్యముగ వ్యాధి యుండుట, బీదవాడగుట, స్మారకము తప్పుట, శరీరమునం దేభాగమైనను చచ్చిపోవుట, ఇవి యన్నియు నసాధ్యమైన వ్యాధికిలక్షణములు.

శరీరము లావెక్కుచుండుట, వ్యాధి చిరకాలము కీనను శరీరము కృశింపకుండుట, రోగికి సంతృప్తియై పక్వపానాదులకు కావలసిన యవకాశములు గలిగియుండుట, వయస్సు మించినతరువాత వ్యాధికలుగుట, ఇవి సుసాధ్యమైనవ్యాధికి లక్షణములు.

చికిత్స

ఇది రెండు విధములు. 1. ఆహారము. 2. మందులు. వ్యాధియొక్క తీవ్రమునుబట్టి యాహార పద్ధతి మార్చుకొనవలయును. పిండి పదార్థములు మానిన వెంటనే గాని, తగ్గించిన వెంటనే గాని మూత్రములోని చక్కెర తగ్గిపోవు వ్యాధి తీవ్రముకాని వ్యాధి. ఆహారములోని పిండి పదార్థములను బొత్తిగ తీసివేసినను మూత్రములో చక్కెర తగ్గిపోనివ్యాధి తీవ్రమైనవ్యాధి. తీవ్రముగాని వ్యాధిగలరోగికిచ్చు ఆహారములో చక్కెరయు, పిండి పదార్థములును, క్రమముగ తగ్గించినప్పుడు మూత్రములో నెప్పుడు చక్కెర లేకుండనుండునో కనిపెట్టవలయును. ఆపద్ధతిమీద నాహారము నిచ్చుచు కొంతకాలము గడపవలెను.

ఆహారము

పిమ్మట ఆహారములో పిండిపదార్థములను, చక్కెరయు, కొద్దిగ చేర్చినను మూత్రములో చక్కెరగానరాక ఆహారమంతయు జీర్ణమగును. ఇట్లు యెంతవఱకు పిండి పదార్థమును చక్కెరను దినినప్పుడు మూత్రములో చక్కెరయుండదో చూచుకొనుచు ఆహారములో సాధ్యమైనంతవరకు మాంస కృత్తుపదార్థములును, క్రొవ్వుపదార్థములును హెచ్చుగ జేర్చుకొనుచుండవలయును. తీవ్రమైనవ్యాధులలో నెంత యాహారము తగ్గించినను, ఏపదార్థము నిచ్చినను మూత్రములో చక్కెర తగకయుండును. ఇట్టివారలకు కఠిన పథ్యము పెట్టుటవలన నెంతమాత్రమును ప్రయోజనము లేదు. ఈ రాజధానియందు సామాన్యముగా అనేకరోగులకు వరిఅన్నమునుమార్చి గోధుమయన్నమును బెట్టిన తోడనే గుణము కనబడుచున్నది. ఈవ్యాధియందుపయోగింపవలసిన ఆహారపద్ధతి గూర్చి యాంగ్లవైద్యుల కింతవరకు జక్కగ దెలియునని జెప్పుటకువీలు లేదు. కాబట్టి యేమి యాహారము బెట్టినను రోగియొక్క తూనిక తగ్గిపోకుండ దగినంత యాహారము పెట్టవలెనని యనేకులయభిప్రాయము. కాని, కొందఱు వైద్యులు, రోగికేమియు నాహార మీయకుండ లంకణములమీదనే బెట్టి మధుమూత్రమును తగ్గింప వచ్చుననియు, మఱికొంద ఱధికముగ విరేచనములకు మందులిచ్చుచు మధుమూత్రమును తగ్గింప వచ్చుననియు జెప్పుదురు.

ఆంగ్లవైద్యుల యభిప్రాయమును బట్టి తినవచ్చిన, తినగూడని, పదార్థములయొక్క పట్టిక నీ ప్రక్కపుటలో జూపియున్నాము.

| తినవచ్చునవి. | తినకూడదు. |
|---|---|
| 1. మేక మాంసము, గొడ్డు మాంసము. | 1. జంతువుల యవయవములలోని కాలేయము మొదలగు తియ్యని పదార్థములు. |
| 2. కోళ్లు, అడవిపిట్టలు. | 2. చక్కెర వరిపిండి గలిసిన రొట్టెలు. |
| 3. చాపలు, పరిగెలు. | 3. వరి యన్నము, సగ్గుబియ్యము, ఆరోరూటు, టాపియోకా, వర్మిసల్లి మొదలగు బియ్యములు. |
| 4. మాంసమునుండి జేసిన షేర్వాలు. (చక్కెరగాని, వరిపిండిగాని జేరగూడదు). | 4. బంగళా దుంపలు. |
| 5. కోడి గ్రుడ్లు, మీగడ, వెన్న. | 5. గోధుమరొట్టె, బిస్కత్తులు. |
| 6. నెయ్యి, నూనె, క్రొవ్వు పదార్థములు. | 6. కంద, పెండలము శిలగడ దుంపలు (గన్సుసు) మొదలగునవి. |
| 7. తవిటి రొట్టెలు. | 7. చిక్కుడు గింజలు, పటాణి. |
| 8 ఆకుకూరలు. | 8. తేనె, తియ్యని పండ్లు, ఎండువి, పచ్చివి. |
| 9. దోసకాయ, గుమ్మడికాయ, అనపకాయ, వంకాయ, బీరకాయ, పొట్లకాయ మొదలగునవి. విస్తారము పప్పుగింజలులేని కూరలు చిక్కుడు, బెండ, మొదలగు వాని లేత తొక్కలు. | 9 తియ్యని సారాయము. |
| 10. ఊరుగాయలు. | 0. లెమనేడు, కోలా, మొదలగు తియ్యని నీరు. |
| 11. ఉల్లిపాయలు. | |
| 12. బాదముకాయలు. | |
| 13. అక్రోటు. | |
| 14. మంచి నీరు, సోడా వాటరు, మొదలగు నీళ్లు (మితముగ.) | |
| 15. కాఫి, టీ మితముగ. | |
| 16. ద్రాక్ష మొదలగు బలహీనమైన తీపు లేని సారాయము (మిక్కిలి మితముగ.) | |
| 17. ఆపిలు, సీమరేగు. | |
| 17. అధికముగ పాలు. | |
| 18. కోకో. | |

ఈ పట్టీవలన అతిమూత్రరోగులు తినవచ్చునను పదార్థములు చాల గనబడినను, ఈ రాజధానిలోని అతిమూత్రరోగులు విశేషముగ బ్రాహ్మణులేయై యున్నందున వరిఅన్నమునూని గోధుమన్నము దినుమనిజెప్పుటయు, చేతనైనయెడలకొంచెముచే మాంసముగాకపోయినను కోడిగ్రుడ్లు తినిపించుటయు, దప్ప యిచ్చటి వైద్యులు వేరు విధానముల నేర్పరచలేక యున్నారు. నిజ మెంతవరకో నిశ్చయముగా దెలియదుకాని, వరియన్నము కంటె అతిమూత్రరోగులకు గోధుమన్నముపకారిగా నున్నట్లిచ్చటి వైద్యుల యభిప్రాయము.

మందులు

మందులలో నేదియును అతిమూత్రమును గాని, మధుమూత్రమును గాని, తప్పకకుదుర్చ గలదని చెప్పదగినది యింతవరకు గానరాదు. నల్లమందును, దానినుండిబుట్టిన యనేకపదార్థములను, ఈవ్యాధియొక్క ప్రథమావస్థలయందు ప్రయోజనకారులుగా నున్నవి. సాలిసిలక్ ఆసిడ్ (Salicylic acid), సోడా బైకార్బనేట్ (Soda bicarbonate), యురే

నియం నైట్రేటు, (Uranium Nitrate), జాంబుల్ (Jambul), ఫిలోకార్పీన్ (Pilocarpine), బంగారము, (Gold) మొదలగు నితర మందులను మఱికొన్నిటిని వైద్యులీ వ్యాధిలో వాడుదురు.

స్మృతితప్పినప్పుడు సోడాపౌడరు (Soda-bicorbonate) దిన మొక్కంటికి 500 గ్రెయి నుల వఱకునిచ్చిన గుణమగును. విరేచనము, చేయుమందుల నియ్యవలెను. రాచపుండ్లకు శస్త్రవైద్యము చేయవలెను. శరీరముమీదదురదకు బోరిక్ ఆసిడ్ (Boric acid), కార్బాలిక్ ఆసిడ్ (Carbolic-acid) మొదలగువానితో జేరిన తైలములబూసిన నుపశమించును. థైరాయిడ్ సూప్రారినల్ (Thyroid Suprarenal) గ్రంథులనుండితీసిన పదార్థములనుకొందఱుపయోగింతురుగాని, ఇంకను వీని గుణములు జక్కగ దెలియలేదు.

(ఆ. ల.)

దీనినే "ప్రమేహ" మని యాయుర్వేద తంత్రము నందు వాడిన ట్లగపడుచున్నది. దీనిని గురించి చరకాచార్యుడను వైద్య గ్రంథకర్త మొట్టమొదట వ్రాసి యున్నాడు.

**ఆయుర్వేదీయ మతము**

సామాన్యముగా నే రోగమునకును నిదానము, సంప్రాప్తి, పూర్వరూపము, (వాని లక్షణములు,) ఉపద్రవములు, అవాంతర భేదములు, (వాని లక్షణములు,) చికిత్సలు, సాధ్యాసాధ్య విమర్శనము, అని యేడు విధములుగ సాధనగతి యుండును.

**ప్రమేహసామాన్య కారణములు, దోష దూష్యములు**

తఱుచు కూర్చొని యుండుట, తఱుచు నిద్రించుట, పెరుగు, గ్రామ్యములు, (గ్రామము లోనివి) ఔదకములు, (నీటిలోనివి) ఆనూపములు, (జలప్రాయప్రదేశములోనివి) అగు జంతువులమాంసములు, పాలు, క్రొత్తబియ్యపన్నము, క్రొత్తనీరు, చక్కెర, బెల్లముతో జేసిన పదార్థములు, ఇంకను కఫము, మేధస్సు, మూత్రము, వీనిని వృద్ధినొందించు పదార్థములు మున్నగువానిని అధికముగా నుపయోగించుటచే సామాన్యముగా నతిమూత్రము పుట్టును.

అతిమూత్రమునం దింకను దోషములు, దూష్యములు, నను రెండు విధములగు నాభ్యంతర (లోపలి) కారణములు కలవు. అవి యెవ్వియనగా:—

దోషములు-వాతము, పిత్తము, కఫము, అనునవి.

దూష్యములు-మేధస్సు (సన్నని యెముకలలోనుండు రక్తముతోగూడిన క్రొవ్వు,) మాంసము, క్లేదము (శరీరమునందలి నీరు) వస (మాంసములోని క్రొవ్వు) మజ్జ (పెద్ద యెముకలలోని క్రొవ్వు), శుక్లము, మేధస్సుతో గలిసియుండు రక్తము, లాలాజలము, (చొంగ-జొల్లు) మేధస్సు (హృదయమందలి చేరెడంత కఫరూపమగు పదార్థము) లసీకము (చర్మమునకును మాంసమునకును నడుమనుండు నీరు) అనునవి.

అట్టి పయిరోగము, కఫము ప్రధానమయి పుట్టినది, పిత్తము ప్రధానమయిపుట్టినది, వాతము ప్రధానమయి పుట్టినది, యని మూడు విధములు.

భేదములు

గోధుమలు మొదలగు గురువగుధాన్యములు, గురువగుమాంసములు, తీపు పదార్థములు, పాలు, మీగడ, జున్ను, మొదలగు వానిని దినుట, శుచి, వ్యాయామము, వీనిని వదలి, మితిమీరిన నిద్ర, ఎల్లపుడును పరుండియుండుట, ఇంకనుకఫము, మేధస్సు, మూత్రము, వీనినభివృద్ధి నొందించు విధుల నొనర్చుచుండుట, అనియెడు కారణములచే మిక్కిలి ద్రవయుక్తమగు కఫము, మిక్కిలి బంధింపబడిన మేధస్సు, క్లేదము, మాంసము, శుక్రము, రక్తము, వస, మజ్జ, చోంగ యను దూష్యవర్గమును, వాతపిత్తములు క్షీణించి యుండ నభివృద్ధినొందును. అట్లు వృద్ధిజెందిన కఫము శరీరమంతటనువ్యాపించుట. కారంభమయి మేధస్సుతోగూడి దానితోసమానములగు నితరక్రొవ్వుపదార్థములతో గలియును. ఇట్లు దుష్టమయిన మేధస్సు శరీరమందలి యొకవిధమయిన క్లేదమను జలముతోను, మాంసముతోను సంసర్గమును బొందును. క్లేదము మాంసమును సమానమగు మాంసముతోగూడిపయినివివరింపబోవు పిటకాదుల జనింపజేయును. అంతటితో క్లేద మూర నుండక శరీరమునంతను జెఱచి మూత్రముగా మారి, గజ్జలు, పొత్తికడుపు మొదలగువాని యందుండు మూత్రనాడులయొక్క మేధస్సు, క్లేదము వీనివలన నడ్డగింపబడి, వివృద్ధములగు మార్గములగుండ ప్రవేశించి వాని(మేదః క్లేదముల) తోగలసికొని మూత్రాశయము జేరి సరియయిన మూత్రముగామారి క్రింది వివరింపబోవుభేదములతో నధికముగ బయలు వెడలుచున్నది. (చ॥ ని॥ స్థా॥ ౪ ర)

కఫము వలని యతి మూత్ర సంప్రాప్తి

మిక్కిలి వేడిగానుండునట్టియు, మిక్కిలి పులుసు, ఉప్పు, క్షారము, కారముగానుండునట్టియు, పదార్థముల దినుట, జీర్ణము కాకుండ మారలదినుట, మిక్కిలివేడియగు నెండ, నిప్పు సెగ, వీనిని శరీరమునకు దగిలించుట, మనస్సంతాపము, మిక్కిలి శ్రమ, కోపము, విష మాహారము (సరికాని భోజనము) మొదలగు రూక్షకర్మలవలన పిత్తము ప్రకోపించి వాతకఫములు క్షీణించి యుండ పైనిచెప్పినట్లే మేధస్సు మొదలగు వాని జెఱచి దిగువ వివరింపబోవు లక్షణములతో మూత్రమును వెడలించును. (చ॥ ని॥ స్థా॥ ౪ ర॥ ౨౦.)

పిత్తమువలని యతి మూత్ర సంప్రాప్తి

కారము, ఒగరు, చేదు, ఈరసములతో గూడి రూక్షమైనట్టియు, మిక్కిలి లఘువుగను చల్లగనునుండునట్టియు, పదార్థముల సేవించుట, అతిమైధునము, అతి వ్యాయామము, వమన విరేచనముల నిరోధించుట, శిరోవిరేచనము నతిమాత్రముగా

వాతమువలని యతి మూత్ర సంప్రాప్తి

జేయుచుట, ఉపవాసము జేయుట్ల, దెబ్బ తగులుట, ఎండ తగులుట, ఉద్వేగమును జెందుట (కోపించబడుట) శోకించుట, రక్త మోక్షము (నెత్తురును శరీరమునుండి వెడలించుట) మొదలుకొని యుండుట, విషమ (మెఱకే) స్థలములయందు శరీరము నుంచుట, మొదలగువానివలన వాతము ప్రకోపించి పై యట్లనే శరీరమున వ్యాపించి పై కఫపిత్తములకంటె నధికప్రకోపముతో వసను గలసి కొని జెఱచి పై యట్లు మూత్రకోశమును జెఱచి "వసామేహమును" మజ్జను జెఱచి "మజ్జమేహమును" లసీకను జెఱచి "హస్తిమేహమును" మేధస్సును జెఱచి "మధుమేహమును" బుట్టించును. వాని లక్షణములు క్రింద వివరింపబడును.

పూర్వరూపము

పైనుదాహరించినమార్పులు శరీరములో జరుగుచుండు సమయము నందు, మేధో దోషము వలన శరీరమూత్రయు బూతి గంధయుక్తమగు మలభూయిష్ఠ మైయుండుటచే, దంతములు, కండ్లు, చిగుళ్లు, చెవులు, గొంతు, నాలుక, మొదలగువాని యందు మిక్కుటముగ మలము (దుర్గంధయుక్తమగు పాచి) చేరును (సు. ని. స్థా. అ ౬). కఫాది దోషములవలన, కాలుసేతుల యందు మంటయు, శరీరము, మస్సృణమై(బంకగలిగి)యుండుటయు, మిక్కిలి దాహము, నోరుతీపు బారుట, మొదలగు గుణములును కలిగి యుండును. (మా. ని. పం. శ్లో ౪)

అది యట్లుండగా నెవ్వానికి మూత్రరోగము జనింపబోవునో వాని మూత్రమునకును శరీరమునకును చీమలు, ఈగలు ముసరుకొని యుండును. వెంద్రుకలు చిక్కుపడుట, గోళ్లు పెరుగుట, మొదలగునవికూడ నుండును (చ. ని. అ ౪).

లక్షణములు

పైనుదాహరించిన దూష్యద్రవసంబంధము వలన మిక్కిలి యధికముగ నుండునట్టియు, వాతాది దోషములును దూష్యవర్ణములును, సంబంధించుటవలన గలుషముగ నుండునట్టియు, మూత్రము ప్రతిక్షణమందును వెలువడుచుండుట, శోష, తాపము, దప్పి, భ్రమ, సర్వావయవములు బలహీనములుగనుండుట, ఇట్టి లక్షణములు కలిగియుండునదియే యతిమూత్రమని యెఱుంగునది. (మా. ప్ర॥ శ్లో॥ ౬)

అవాంతరభేదములు, వాని లక్షణములు

అట్టి యతిమూత్రము ఈ ప్రక్క జూపిన పట్టిక ప్రకారము ౨౦ భేదములు కలిగి యుండును. వాని లక్షణములు మొదలగునవి యీ పట్టికలో గొన్నింటిని గననగును. మిగిలినవాని నాయా శీర్షికల క్రింద గననగును.

ఉపద్రవములు

వాతమువలన జనించు నతిమూత్రపు భేదమగు మధుమేహము మిగిలిన భేదముల యొక్క ముదురుటవలన జనించును. దానికిపైగా పిటకలు (పుండ్లు) జనించును.

అవాంతర భేదముల దెలుపు పట్టిక.

| నంబరు. | పేరు. | ఏదోష మరియొక్క భేదము. | వర్ణము. | గంధము. | సాధ్యమా? యాప్యమా? అసాధ్యమా? | మత్రా. |
|---|---|---|---|---|---|---|
| 1 | ఉదక మేహము. | శ్లేష్మము. | అచ్ఛసితము. | నిర్గంధము. | సాధ్యము. | చల్లగా నుండును. |
| 2 | ఇక్షు ,, | ,, | చెరకు రసము వలె నుండును. | ఇక్షుగంధము. | ,, | మధురము. |
| 3 | సాంద్ర ,, | ,, | ... | ... | ,, | పేరికొనును. |
| 4 | సురా ,, | ,, | సురావర్ణము. | సురా గంధము. | ,, | ... |
| 5 | పిష్ట ,, | ,, | తెలుపు | ... | ,, | ... |
| 6 | శుక్ర ,, | ,, | శుక్రవర్ణము. | శుక్రగంధము. | ,, | శుక్రమిశ్రమము. |
| 7 | సికతా ,, | ,, | ... | ... | ,, | ఇసుకవంటి కప కండములతో కూడియుండును. |
| 8 | శీత ,, | ,, | ... | ... | ,, | మధురము, శీతము. |
| 9 | శనైః ,, | ,, | ... | ... | ,, | కొంచెము కొంచెముగా వెడలును. |
| 10 | లాలా ,, | ,, | ... | ... | ,, | జిగటగా తీగలు సాగును. |
| 11 | క్షార ,, | పిత్తము. | క్షారోదక వర్ణము. | క్షారోదక గంధము. | యాప్యము. | క్షార రసము. |
| 12 | నీల ,, | ,, | నీలవర్ణము. | ... | ,, | ... |
| 13 | కాల ,, | ,, | భూగ్గురంగు. | ... | ,, | ... |
| 14 | హారిద్ర ,, | ,, | పచ్చరంగు. | ... | ,, | ... |
| 15 | మాంజిష్ఠ ,, | ,, | మంచి కషాయపురంగు. | దుర్గంధము. | ,, | ... |
| 16 | రక్త ,, | ,, | ఎరుపు. | ... | ,, | వేడిగను, ఉప్పుగ నుండును. |
| 17 | వసా ,, | వాతము. | మాంస రసపు వర్ణము. | మాంస రసపు గంధము. | అసాధ్యము. | మాటిమాటికి వెడలును. |
| 18 | మజ్జ ,, | ,, | మజ్జవర్ణము. | మజ్జ గంధము. | ,, | ,, |
| 19 | హాస్తి ,, | ,, | లసీకా వర్ణము. | ... | ,, | అప్పుడప్పుడు నిలచి వెడలును. |
| 20 | మధు ,, | ,, | తేనె రంగు. | మధుగంధము. | ,, | మధురము. |

అందు మధుమేహము ధాతుక్షయము వలన జనించిన వాత ప్రకోపమువలనగాని, వాతాదులివ్వే మూత్రద్వార నడ్డగింపబడుట వలనగాని, తేనెవలెనుండు మూత్రముగలిగి యుండును. ఆయ్యాదికూడ వాతాదుల యావరణవలన క్షణము తగ్గినదిగను క్షణము వృద్ధి చెందినదిగ నుండును. (చ. సూ. అ ౧౭).

దీనియందు తేనెంబలె మూత్రమును, శరీరము తియ్యబారుటయు, కలిగియుండుటచే నిద్దానికి "మధుమేహము" అని పేరుగలిగినది. (మా. ప్ర. శ్లో ౨౬)

దీనిని గురించిన చికిత్సలు మొదలగునవి "మధుమేహము" అను శీర్షిక క్రింద నుండును.

పిమ్మట జనించు పిటక లీక్రింది భేదములు కలిగి యుండును.

౧. శరావిక ౨. కచ్ఛపిక 3. జాలిని ౪. వినత ౫. అలజి ౬. మసూరిక ౭. సర్షపిక ౮. పుత్రిణి ౯. విదారిణి ౧౦. విద్రధి అని పది విధములు. వీని లక్షణములు మొదలగునవి "రాచపుండు" అనుశీర్షిక క్రింద జూడనగును.

చికిత్స

పైని వివరించిన యతిమూత్ర రోగము రాకుండుటకును, వచ్చిన యెడల శీఘ్రముగ హరించుటకును, తగిన ట్లీదిగువ వివరించినరీతిని నడవవలెను.

౧. ధాతుహితముగ వర్తించుట ౨. రోగముయొక్క పూర్వరూపమును దెలిసికొని వెంటనే తగుసాధనములను జేయుట 3. వ్యాధిప్రబలించిన యెడలతగినయౌషధములు మొదలైన చికిత్సల నడపుట.

౧ ధాతుహితముగ వర్తించుట

ధాతువు లనగా శరీరమూలం దుండు రక్తాది ప్రసరణ మార్గములు, వాతపిత్త శ్లేష్మములును గిచ్చుట నర్థము. అట్టివానికి హితమనగా పై నుదాహరించిన పదార్థములనెన్నడును మితిమీరి యుపయోగింపకుండుట (చ॥ ని॥ అ. ౪). మూత్రమునువృద్ధి పరుపకుండుట (అ. హృ. సూ. అ ౧౧. శ్లో ౧3), గ్రీష్మఋతువునందుతప్ప దక్కినఋతువులయందు పగలుపరుండ కుండుట, మిత సంభోగము, వీనిని మిక్కిలి శ్రద్ధతో జరుపుచు సర్వవిధముల చేతను శరీరము నారోగ్యస్థితిలో నుంచుచుండ వలయును. తీపు పదార్థములను దినుట మిక్కిలి శ్రద్ధతో మానవలెను.

౨. రోగముయొక్క పూర్వరూపమును దెలిసికొని వెంటనే సాధనములను జేయుట

వెనుక నుదాహరించిన పూర్వరూపము వ్యక్తపడిన వెంటనే వివేచన సాధనమును ముందుగ జేయవలెను. (శా. ఉ. ఖం ౪ అ)

తరువాత నవసరమును బట్టి గుదము గుండలోనికి గాని మలముపట్టి యుండు నా యా యంగములయందు గాని యీ దిగువ నుదాహరించిన కషాయములతో నిరూహవస్తి (పిచికారీ) జేయవలెను. నిరూహవస్తిని

గుఱించి "వస్తికర్మ," అను శీర్షికలోఁగని నగును. [శా. ఉ. ఖ. క్ష. అ ౬.

దీనినిగురించి మాతంగ్రష్టిగా ద్రాయుర్వేద్దానుభూతియందిట్లు వ్రాయుచున్నారు. "కారణం వినాకార్యానుత్పత్తేః కఫ దోష హరణఙ్ఞ ప్రథమం మేదోదోషహరణం తతః" అని మొదలుకొని "తస్మాత్స్రోతః కర్మశనైః కరణమఫేన నదధి యోగ ముపయుఞ్జాత్" అను వఱకు దానియర్థమేమనఁగా * కఫమే బహుమూత్ర మునకుఁ బ్రధానకారణ మగుటచేత దానిని తగ్గించు సాధనము తొలుత నుపయోగింప వలయును. దానికి మించి మేదోదోషము లోనికిఁజేరినచో నద్దానికి సాధన మొనరింప వలయును. ఇట్లు వసామజ్జ క్లేద, మాంస, మూత్రదోష హరములగు నౌషధముల నొక దానిని మించి నప్పుడింకొక దానిని బ్రయోగింపవలయును.

3 వ్యాధి ప్రబలించిన యెడలఁదగిన యౌషధములు మొదలైన చికిత్సల నడపుట

అందు మొట్టమొదటనే స్రోతస్సుల (నాడుల) అతిప్రచారముయొక్క మితిమీరిన నడకనుఁతగ్గించుటవలన వెనుక చెప్పిన దోషములొకదానితో నింకొకటిసంక్రమించుట కవకాశము చిక్కక యా యా దోషము లట్టె యుండి యుండును. పిమ్మట నుపయోగించు నౌషధమ్ములవలన నిలిచియున్న యా దోషములు స్వస్థలములోనే నశించిపోవును. కనుక నట్టి స్రోతస్సుల అతిప్రచారమును తగ్గించు నట్టి 'అఫేనదధియోగమును' ప్రథమములో, అనఁగా దోషము లొకదానితో నింకొకటి సంక్రమింపఁబోవు సమయములో నుపయోగపఱపవలెను.

అఫేనదధియోగ మనఁగా నల్లమందునొక పెసలగింజంత నొకకానిగ్రుత్తు యావుపెరుగులోఁగలిపి మర్దించినది. దానిని బుచ్చుకొనవలయును.

పిమ్మట నతిమూత్రము నడచునట్టి 'ధాన్వంతర ఘృతము' 'విడంగాది లోహము' 'మేహబద్ధ రసము,' 'లోధ్రాది కషాయము' మొదలగు నౌషధముల నాయాభేదములను బట్టి సేవించవలయును. ఈ యౌషధములను గురించి యాయా శీర్షికలలోఁ జూడనగును.

సాధ్యాసాధ్య వివరణము

అతిమూత్రము పుట్టునది మొదలు ౧ మాసములోపున సుసాధ్యము. అటు పిమ్మట సుమారు ౧ సం॥ రమువఱకు కష్టసాధ్యము. పిమ్మట మధుమేహముగా మారుటచే నసాధ్యము (ఆ. అ. )

అదిగాక శ్లేష్మముయొక్క ప్రబలత్వముచేత జనించిన ౧౦ భేదములును సుసాధ్యములు. పిత్తముయొక్క ప్రాబల్యము వలన జనించు భేదములు ౬ను, యాప్యములు (అనఁగా శరీర

* ఇయ్యది కఫమువలని అతిమూత్రమును జెప్పుచు వ్రాయఁబడినది.

ము[illegible]చునకే - అ. హృ. స్థా. ౧ అ).
వాలియు [illegible]బట్టుటచేత జనించిన ౪ భేద
ములు [illegible]ములు. (మరుజుని జంపునవి)
[illegible] వీని లాయా భేదములు
[illegible] స్ఫుటముగ వ్రాసి
యున్నారు.

మఱియు మధుమేహవ్యాధి గలవానికి గాని, మధుమేహవ్యాధిగల వంశమునందుగాని జన్మించిన వానికి బుట్టిన అతిమూత్ర మసాధ్యము, ఎట్లనగా:—

శుక్లము [illegible] యుండుటచే నట్టి శుక్లములచే జనించిన వానికిగూడ నాదోషము కలుగును. [illegible] "పుట్టుగ్రుడ్డి" మొదలగు వానివలె [illegible] నొందజాలదు.

(తి. ప. రా.)

**అతిరథుడు.** (చా. వం) సత్య [illegible]. [illegible]. ఇతడు [illegible] [illegible] బుత్తుడై [illegible].

**అతిరాత్రము.** అత్యగ్నిష్టోమము [illegible] ఫలమిచ్చు నొక యజ్ఞ [illegible]ము.

**అతిరాత్రుడు.** స్వాయంభువ [illegible] చక్షుర్మనువునకు నడ్వలయందు [illegible] పుత్రులలో నెనిమిదవవాడు.

**అతిసారము.** ఒక దినమునందు సామాన్యముగా మనము ఒకటి రెండుసార్లు మల విసర్జనము చేయుదుము. అట్లు గాక యేకారణము చేతనైనను దినమున కెక్కువ సార్లు విరేచనము లగుచుండు నెడల నట్టి వ్యాధికి అతిసార మని పేరు. పేగులయొక్క నడవడియందు చురుకు తన మధికమగుటచేగాని, పేగులయందు అధికముగ ద్రవపదార్థములు స్రవించుటచేగాని ఇట్టి విరేచనములు కలుగ వచ్చును. ఇట్టిస్థితి అనేక వ్యాధులచేత గలుగు గుణములలో నొకగుణమేగాని విరేచనము లొక వ్యాధియని సామాన్యముగ జెప్పనలవు పడదు. కాబట్టి విరేచములకు గారణము లగు యావ్యాధుల శీర్షికలక్రింద జూచుకొననగును. రెండుసంవత్సరములలోపు పిల్లలకును, ముసలి వాండ్రకును, అతిసారము తరుచుగ వచ్చును. దేశమునందలి శీతోష్ణస్థితి అకస్మాత్తుగ మారిన నప్పుడును అధికమగు వేసవికాలమునందును, విరేచనము లధికముగ నుండునని చెప్ప వచ్చును. ఆహారాదుల యశుభ్రతచేతను, జనసమ్మర్ద మధికమగుట చేతనుగూడ, అతిసారమధికము కావచ్చును.

అనేకవ్యాధులలో అతిసార మొక గుణ మని చెప్పియుంటిమి. కారణముల కాబట్టి వ్యాధి కారణమును బట్టి విరేచనములం దనేక భేదము లుండును.

కాని అకస్మాత్తుగవచ్చు నతిసారమనియు, చిరకాలమునుండి వచ్చుచున్న అతిసారమనియు రెండు విధములగు భేదములను మనము గమనింపవచ్చును.

పేగులలో నేభాగమైన నే పదార్థముచేతనైనను రేగి కందిపోవు యొకానొకప్పుడు పుండ్లు పడుటచేత అతిసారము పుట్టవచ్చును. ఇట్టి రేపుదలకు కారణములు 1. తగని ఆహారము, 2. పైత్యరసోద్రేకము, 3. పేగులయందు పెరిగినరాళ్లు, 4. ఏలికపాములు నులిపురుగులు మొదలగు పురుగులు, 5. విరేచనకారులగు మందులు, 6. పాషాణము మొదలగు విషపదార్థములు. కొన్ని జ్వరములయందును, అతిమూత్రము మొదలగు కొన్ని వ్యాధులయందును, ఆయా వ్యాధులవలన బుట్టిన విషయములను తొలిగించు నిమిత్తమై అతిసారమొకానొకప్పుడు పుట్టవచ్చును; భయముచే నతిసారము కలుగవచ్చును. సూక్ష్మజీవులచేగాని వానినుండిపుట్టు విషముచేగాని అతిసారము ఒకానొకప్పుడు కలుగును. ఇందులకు క్రుళ్లిపోయిన ఆహార పదార్థములలోని సూక్ష్మజీవులును, టైఫాయిడు, కలరా, క్షయ, మొదలగువాని సూక్ష్మజీవులును ముఖ్యమైన కారణములు. ఇట్లే ఇంక ననేక కారణములు గలవు.

విరేచనములగు నప్పుడు, సామాన్యముగా కొద్దిగనో గొప్పగనో నొప్పి, కడుపుబ్బరము, మొదలగు గుణములు లుండవచ్చును. ఆసనమునకు సమీపమునందుండు వ్యాధిచే గలిగిన విరేచనములలో నెక్కువగా తినవలెనను నాసక్తియు, ఆసనమ్ము నొప్పియు నుండును వ్యాధియొక్క ఉధృత్వమును బట్టి విరేచనములు సంఖ్యయందును, పరిమాణమునందును, రంగునందును, వాసనయందును, అజీర్ణమైన ఆహారము, ఆమము, కొవ్వు మొదలగు పదార్థముల విసర్జనమునందును, భేదములు కనుపట్టును.

లక్షణములు

అతిసారమ్ము కనబడిన తోడనే చికిత్స చేయుటకు ప్రారంభించక దాని కారణ మేదియో కనిపెట్టవలెను. అకస్మాత్తుగా అతిసారము వచ్చియున్న యెడల, మితిమీరి భుజించుటచేతనో, ఆహార పదార్థములలో నేదియేని చెడిపోవుటచేతనో, సరిపడక పోవుటచేతనో, అధికమైన వేడిచేతనో, తడిచేతనో, కలిగియుండవచ్చునని జ్ఞాపక ముంచుకొనవలెను. వాంతియు, నొప్పియు, అధికముగానుండి, విరేచనములు తీవ్రముగానున్న యెడల, విషపదార్థముగాని, క్రుళ్లిన పదార్థముగాని, సూక్ష్మజీవుల ప్రవేశముగాని కారణమని గ్రహింపవలెను. విరేచనములయొక్క లక్షణములను సరిగా పరీక్షించుట వలనను సూక్ష్మదర్శ

నిదానము

నితో విరేచనమును పరీక్షించుట వలనను, కారణము తెలియగలదు. ఒకానొకప్పుడు ఆసనమువద్దనుండు కొన్ని వ్యాధులలో నెక్కువ సార్లు విరేచనములకు పోవలసి వచ్చునట్లుండును. అట్టిది అతిసారములో చేరదు. ఆసనమును వ్రేళ్లచేగాని, యంత్రముచేగాని పరీక్షించిన యెడల నట్టివ్యాధి తెలియగలదు.

**చికిత్స**

ఆకస్మికముగా వచ్చిన అతిసారము, ప్రత్యేక చికిత్స అక్కర లేకయే, ఆహారమును నిలిపివేసి, ప్రేగులకు విశ్రాంతి కలిగించిన యెడల తగ్గిపోవును. ఒకానొకప్పుడు వ్యాధి ప్రారంభమైన వెంటనే విరేచనములకు మందు ఇచ్చుటచే మిక్కిలి గుణము కలుగును. ఆముదము, తులము లేక తులమున్నర యెత్తు ఇయ్యవచ్చును. నొప్పి యెక్కువగా నున్న యెడల వైద్యుడు యోచించి నొక గ్రెయినులోపుగా నల్లమందును దానితో కలిపి ఇయ్యవచ్చును. విరేచనములకు మందిచ్చిన తరువాత 24 గంటలకు పిమ్మటగూడ నతిసారము నిలువని యెడల, సీమసున్నము, దాల్చిన చెక్క, శొంఠి, ఏలకులు, కవిరి, లేత దానిమ్మ మారేడు, బిస్మతు ఓమము, మొదలగు మందులను యుక్తముగ చేర్చి ఇయ్యవచ్చును. దాహమున్న యెడల మంచుగడ్డ మిక్కిలి ఉపయుక్తము. ఒకానొకప్పుడు బిస్మతు, డోవరు పౌడరు కలిపిన పొట్లమును, అప్పటప్పట నిచ్చిన మిక్కిలి అనుకూలముగ నుండును. ఆసనము నొప్పి అధికముగ నుండినచో నల్లమందు అరఖు కలిపిన గంజి ఒకటి రెండవున్సులు ఆసనము గుండ పిచికారి చేసిన యుక్తము. కడుపు నొప్పికి కదలకుండ పరుండుట, వెచ్చని యొత్తడము, పలచని పలుచని యాహారము తప్ప ఇతర ఆహారములను వర్జించుట, ఈ మూంటి వలన విశేషముగ గుణమగును. భయముచే గలిగిన విరేచనములను అభ్యాసముచేసి నిలుపుకొనుటకు ప్రయత్నింపవలెను.

చిరకాలమునుండి వచ్చుచున్న అతిసారమునందు నాహార పద్ధతి సరిగా నడపుట మిక్కిలి ముఖ్యము. ఏయే పదార్థములు జీర్ణముకావో వానిని వెంటనే నిలుపవలెను. ఎల్లప్పుడు పడకలో పరుండి యుండుట వలనను, పాలుతప్ప ఇతర ఆహారములను వర్జించుట చేతను, అనేక వ్యాధులలోని అతిసారము నిలిచిపోవును. వ్యాధికి కారణమగు విషయమును కనిపెట్టి తొలగింపవలెను. పైని చెప్పినమందులనన్నిటిని ఉపయోగింపవచ్చును గాని వ్యాధి కఠినమైనప్పుడు ఔషధచికిత్సను వైద్యునకే విడచుట మంచిది. మొండి వ్యాధులలో ఆసన మార్గముల నౌషధముల నుపయోగించుట మంచిది. (ఆ. ల.)

**అతీతాధ్యాత్మము.** ఒకయజుర్వేదోపనిషత్.

**అతీశా.** ఇయ్యది లక్నోనగర వాస్తవ్యుఁడగు ఖ్వాజాహైదరుఅలీ అను నితని విద్యావిషయక బిరుదము. ఆతఁడు కొన్ని గ్రంథములను నుర్దూభాషలోను, పెరిషియను భాషలోను రచించి కీర్తిగాంచెను. ఈతఁడు 1847 లో చనిపోయెను.

**అత్తుంగల్.** అత్తుంగల్ గ్రామము చెన్నపురి రాజధానిలోని తిరువాన్కూరు సంస్థానమునకుఁ జెందిన 'చిరయంకిల్' అను తాలూకాలో నున్నది. అత్తుంగల్ నది దీని సామీప్యములో నున్నది. 1901 లో జన సంఖ్య 3889.

అత్తుంగల్ ఎస్టేటు తిరువాన్కూరు రాణులకు వంశపారంపర్యముగ వచ్చునది. తిరువాన్కూరుపాలనము జేయుచున్నవారిలో జ్యేష్ఠకుటుంబీకులవంశ నామధేయమునకు, అత్తుంగల్ మూత్తాతంపూరమని పేరు. ప్రతిజనవరి మాసారంభములోను నా దేశపాలకుఁడగు మహారాజు, ఈయత్తుంగల్ నుదర్శించి యా నెలదినము లచ్చటగడపును.

**అత్యుష్ణము.** భారతవర్షీయతీర్థము.

**అత్రి.** ౧ స్వాయంభువు మన్వంతరమునందు బ్రహ్మదేవునికిఁ గలిగిన పదిమంది మానస పుత్రులలో నొక్కఁడు. ఇతఁడు బ్రహ్మదేవుని నేత్రమునుండి పుట్టెను. కర్దమ ప్రజాపతికూఁతురు, అనసూయ యితనిభార్య. దత్తదుర్వాససోములు పుత్రులు. ఇతఁడు శివుని శాపముచే మరణముఁ జెందెను (చూడుము 'మహర్షులు')

౨. వైవస్వత మన్వంతరమునందు బ్రహ్మదేవునిచే మరలఁబుట్టింపఁబడినమహర్షి. ఇతఁడు బ్రహ్మదేవుని యజ్ఞమందలి యగ్నిజ్వాలలనుండి పుట్టెను. భార్య, అనసూయ. దత్తుఁడు, దుర్వాసుఁడు, సోముఁడు, అర్యమ్ము అను వారు నలుగురు కుమారులు. అమల యను బ్రహ్మనిష్ఠయైన కూఁతురు గలదు. ఇతఁడు జ్యేష్ఠమాసము నందుండు నాదిత్యునితోఁ దిరుగుచుండును (చూడుము శుక్రుఁడు ౫.)

రామాయణ కాలమునందు నితని యాశ్రమము చిత్రకూటపర్వతమునకు నాగ్నేయము నందుండెను. ప్రస్తుతపు రీవాప్రాంతమువఱకు నీయాశ్రమము వ్యాపించియుండెనని విద్వాంసుల యభిప్రాయము (హిందూ మహాయుగము. 3 వ ప్రకరణము.)

దాశరథియగు రాముఁడు దండకారణ్యమునకుఁ బోవునప్పు డీ ఋషియొక్క యాశ్రమమునందుఁ గొన్ని దినములుండి యాతనిచే గౌరవింపఁబడియెను. ఈతని భార్యయైన యనసూయ సీతకుఁ బాతివ్రత్యము బోధించి, రాక్షసులవలన బాధకలుగకుండ నంగరాగాదికముల నిచ్చెను. ఇతఁడు శ్రీరామునకు

[illegible] మార్గముఁ జూపెను. (వా. రా. అయో. స. ౧౧౩-౧౧౪.)

ఇతని [illegible] ముఁ [illegible] గాక అర్థస్వన, [illegible], కర్ణిక, పూర్వాతిథులను [illegible] కలరు. (మత్స్య. అ. ౧౯౪)

ఈ [illegible] ము వృద్ధిచేసిన ఋషులు (౧) [illegible] (౨) [illegible], (3) వాద్భుతక, (౪) ముద్గ, (౫) [illegible], (౬) వామరథ్య, (౭) [illegible] (౮) బీజవాప, (౯) ధనం [illegible] ములని [illegible] విధములు [illegible].

1. [illegible] ఉద్దాలక, [illegible] తు, గార్గ్రీవ, గార [illegible], [illegible], వామరథ్య, [illegible], కర్ణజిహ్వ, హరప్రీతి, [illegible], శాకలాయని, తైలప, నైతేయ, [illegible], [illegible], భగపాద, [illegible] ములను [illegible], [illegible], ఆర్చనానసులను [illegible] కలవారలు.

2. [illegible] కులోత్పన్నులయిన దాక్షి, [illegible], [illegible], బీజవాపి, [illegible], [illegible], గవిష్ఠిర, భలం [illegible], ఆత్రేయ, గవిష్ఠిర, [illegible] మిలనియు; ఆత్రేయ గవిష్ఠిర, అర్చ [illegible] విధములయిన త్రిప్రవ [illegible] గలవారు.

3. వాద్భుబలకులజులు ఆత్రేయ, ఆర్చనానస, వాద్భుతకులను త్రిప్రవరులు.

4. ముద్గలకులజులు ఆత్రేయ, ఆర్చనానస, పౌర్వాతిథులను త్రిప్రవరులు.

5. ధనంజయకులోత్పన్నులు. ఆత్రేయ, ఆర్చనానస, ధానంజయులను త్రిప్రవరులు.

6. అతిథి, 7. వామరథ్య, 8. సుమంగల, 9. బీజవాపగోత్రజులు, ఆత్రేయ, ఆర్చనానస, అతిథులనియు; ఆత్రేయ, ఆర్చనానస, గవిష్ఠిరులనియు, రెండువిధములయిన త్రిప్రవరులు. సుమంగల కులోత్పన్నులకు, ఆత్రేయ, సుమంగల శ్యావాశ్వులను విశేష ప్రవరకలదు.

అత్రిఋషియొక్క కన్యావంశము నందు కాలేయ, వాలేయ, వామరథ్య, ధాత్రేయ, మైత్రేయ, కౌండ్రేయ, శౌభ్రేయాదిఋషులు కలరు. వీరికి ఆత్రేయ, వామరథ్య పౌత్రీ యను ప్రవరులుకలవు. (మత్స్య అ. ౧౯౬) ఈకన్యావంశజులకును విశ్వామిత్రవసిష్ఠ గోత్రజులకును సంబంధ బాంధవ్యములు లేవు.

3. గౌతమ ఋషియొక్క మిత్రుఁడైన ఋషి. ద్వితీయార్థక శుక్రునియొక్క నల్గురు పుత్రులలో నొక్కఁడు. ఇతఁడొక సారి ద్రవ్యార్జనమునకై వేనకులోత్పన్నుఁడైన యొకరాజు యజ్ఞమునకుఁబోయి 'రాజా నీవు ఈశ్వరుఁడవు' అని స్తుతించెను. అంతగౌతముఁ డామాటలను దిరస్కరింప నిద్దఱికి వాదము

జరిగి, వివాదనిర్ణయముకొరకై వార్తు సనత్కుమారులయొద్దకుం బోయిరి. సనత్కుమారుఁడు అత్రిమాటయె నిజమని తీర్పుచెప్పెను. అంత నారాజు, అత్రికి మిగుల ధనంబొసంగి పంపెను. (భార. వన. అ. ౧౮౫.)

**అత్రౌలీతాలూకా.** ఈతాలూకా సంయుక్తరాష్ట్ర) మందలి అలీఘరు జిల్లాలో నున్నది. అత్రౌలీ గంగలీయను పరగణా లిందులోనివి. దీని వైశాల్యము ౩౪౪ చదరపు మైళ్లు. జనసంఖ్య ౧౯౦౧ లో ౧౯౮౦౩౪. ఈ తాలూకాలో ౨౮౪ గ్రామములును నాలుగు పెద్దపట్టణములును గలవు. తాలూకా ఫలవంతమైనది.

**అత్రౌలీపట్టణము.** ఇదిసంయుక్తరాష్ట్రములోని అలీఘరుజిల్లా యందలి అత్రౌలీ తాలూకాకు ముఖ్యపట్టణము. ౧౯౦౧ లో నీ పట్టణ జనసంఖ్య ౧౬౭౬౧. సిపాయీల కల్లోలకాలములో తిరుగుబాటొనర్చిన వారలకుం బావగుటచే నిది పేరు గాంచినది. ఇక్కడ పూర్వము హిందువులుగనుండి తరువాత మహమ్మదీయ మతము నవలంబించినవారలు గాపురమున్నారు. ఈ అత్రౌలీ పట్టణము ౧౮౬౭ నుండియుం బురపారిశుద్ధ్య సంఘము వారిచేం బాలింపం బడుచున్నది.

**అథగడము.** అథగడము ఎస్టేటు బంగాళా రాజధానికి చేరిన ఒరిస్సాలో నున్నది. దీనివైశాల్యము ౧౬౮ చ॥ మైళ్లు. జనసంఖ్య ౧౯౦౧ లో ౪౩౭౮౪. దేశము చాల ఫలవంతమైనది. ధాన్యము పండును. మహానదియను పేరుగలనది దీనిగుండ పాఱుచున్నది. అప్పుడప్పుడు వరదలు వచ్చుటచే జాలనష్టము గలుగుచున్నది.

ఈ ఎస్టేటు పూర్వము శ్రీకర నీలాద్రి బవర్త పాట్నాయక్ అనునాతనివలన సంపాదింపం బడినది. పూరిపట్టణ రాజునకీతఁడొకప్పుడు మంత్రిగనుండి యాతనికిం జాల నుపకారము సేయుటచే నారాజీతనికీ యెస్టేటు బహుమతిగ నిచ్చెనంట. రాజు సోదరిని పెండ్లియాడుటచే నెస్టేటు కట్నముగ నీయం బడెనని మరియొక వదంతిగలదు. ఏది నిజమో నిర్ధారణ చేయుటకు వీలులేనప్పటికిని పూర్వమీయెస్టేటు పూరి రాజులదని నమ్ముటకు నాధారముగలదు. ఈ యెస్టేటులో ౧౯౨ చిన్నగ్రామములుగలవు. రాఁబడి సంవత్సరమునకు నేఁబది వేల రూపాయలు. సాలునకు నేఁడు వేల రూప్యములింగ్లీషు ప్రభుత్వమునకుం గప్పము చెల్లింపవలెను.

**అథనతాలూకా.** ఈ తాలూకా బొంబాయి రాజధానిలోని బెల్గాము జిల్లాకు నీశాన్యమూలగనున్నది. దీనిలో ౮౨ చిన్న గ్రామములు గలవు. తాలూకా వైశాల్యము ౮౧౬ చదరపుమైళ్లు. జనసంఖ్య ౧౧౭౦౭౭. ఈతాలూకా గుండ కృష్ణానది ప్రవహించుచున్నది. అయినప్పటికి నిక్కడ పంటలు చాల తక్కువ.

**అథనేసియస్.** ఇతఁడు౩.వ శతాబ్దమున అలెక్జాంద్రియాయందుఁబుట్టెను. ఇతఁడు మతద్వేషియు వితండావాదియును. ఈ విపరీతమువలననే యితనిని దేశమునుండి వెడలఁగొట్టిరి. అప్పుడు కొంతకాలమడవులలో దాగి కాలము గడపుచుఁ దుదకు మతాభిలాషియై రాజునొద్దకు నుత్తరము లంపెను. రాజాతని మన్నించి తిరుగ దేశమునం దుండుటకు నుత్తరు విచ్చెను.

**అథమల్లిక్.** ఇది బంగాళా రాజధానిలోని ఒరిస్సాయందలి యొకయెస్టేటునకు పేరు. దీనివైశాల్యము ౭౩౦ చ॥ మైళ్లు. జనసంఖ్య ౧౯౦౧లో ౪౦౭౫౩. రాబడి ౭౦౦౦. ఇంగ్లీషువారికి సాలునకు రూ ౫౦౦ లుపన్ను చెల్లింపవలయును. ఈఎస్టేటులో ౪౮౦ పల్లెలు గలవు.

**అథర్టన్.** (చార్లెసు గార్డను) ౧౮౦౪-౫౩. న్యూహ్యాంప్‌షైరులోని అమ్హా రస్టు పట్టణములోఁ బుట్టెను. రాజకీయ విషయాభిలాషి. అమెరికాదేశీయ మహాజన సభలోఁ జేరొందినవాఁడు. బానిసవ్యాపారమున కనిష్టుఁడై మహాసభలందుఁ బెక్కండ్ర మాట సాగనీయక తన ఇష్టమునే ఫలింపఁ జేసెను.

**అథీన పట్టణము.** ఈ పట్టణము బొంబాయి రాజధానిలోని బెల్గాము జిల్లాయందలి అథీనతాలూకాకు ముఖ్యపట్టణము. జనసంఖ్య ౧౯౧౧ లో ౧౧,౧౦౭. ఇదిగొప్ప వర్తకస్థానము. అనాదికాలమునుండియుదీనికిఁ బ్రసిద్ధిగలదు. ౧౬౩౯ లో మందల్‌స్లోయను ఫ్రెంచిదేశపు బాటసారి యొకఁడు దీనిని గొప్ప వర్తకస్థానముగాఁ బేర్కొనియెను. ౧౬౭౦లో ఒగిల్‌బై యనునాంగ్లేయుఁడుగూడ దీనిని తాను రచించిన హిందూదేశ భూగోళములో వ్రాసియున్నాఁడు.

౧౬౭౯ లో దిలావర్‌ఖాన్ అను మొగలాయియొకఁడు, ఈపురమును శివాజీయొద్ద నుండి సంపాదింపఁగలిగెను. ఆతఁడక్కడి ప్రజలను బానిసలుగ నమ్మ తలంచెను.

అప్పుడు శివాజీ కుమారుఁడగు శంభాజీ తండ్రితో విరోధించి ఈఖాన్ దగ్గఱ నుండుట కిష్టపడి యుండెను. ఆతఁ డీకర్మకుఁ దన యసమ్మతిని వెలిబుచ్చుటయేగాక ఖానందుల కియ్యకొనక పోవుటచే నాతనివిడచి తిరిగి తండ్రినిజేరెను. ౧౭౨౦ సంవత్సర ప్రాంతమున నీ పట్టణమును నైజాము స్వాధీనపఱచుకొని దానిని కొల్హాపురనవాబునకిచ్చెను. ఈ నవాబుదీనిని ౧౭౩౦ లో సాతారపాలకుడగు రాజాసాహు యను నతనికి నిచ్చెను. ఇది ౧౮౩౯ లో నింగ్లీషువారి స్వాధీనమయ్యెను.

అథర్వణాచార్యుఁడు. ఆంధ్రమునందు వ్యాకరణమును రచించిన యొక విఖ్యాత లక్షణవేత్త. నన్నయభట్టు మొదట నాంధ్రశబ్దములను శాసించెను గనుక నాతఁడు ప్రథమాచార్యుఁడనియు, నాతని తరువాతఁ దెలుఁగు వ్యాకరణము వ్రాసినవాఁడు, భారతమును తెనిగింపఁ బూనినవాఁడు, అథర్వణాచార్యుఁడు గనుక నీతఁడు ద్వితీయాచార్యుఁడనియు నాంధ్రపండితులలోఁ బరంపరాగతమైన నమ్మకము కలదు. "ప్రథమాచార్యుఁడనఁబడు నన్నయభట్టారకుని తరువాతనే యీతఁ డుండకపోయిన యెడల నీతనిని ద్వితీయాచార్యుఁడనుట యెట్లుతటస్థించును" అని ఆంధ్రకవుల చరిత్రమునందు వీరేశలింగముగారు.* "ఇతనిని ద్వితీయాచార్యుఁడని పేర్కొందురు. ఇతఁడట్లు పేర్కొనఁబడుటచే నన్నపార్యుఁడు ప్రథమాచార్యుఁడనుట స్పష్టమగుచున్నది" అని శబ్దరత్నాకరమందు సీతారామాచార్యులు.

ఈతఁడు రచించె నన్న గ్రంథములు రెండు కనఁబడుచున్నవి; రెండు వినఁబడుచున్నవి. ౧. త్రిలిఙ్గ శబ్దానుశాసనము, ౨. కారికావళి, అనఁబడు వికృతి వివేకము, అను వ్యాకరణ గ్రంథములు రెండు కానవచ్చుచున్నవి. ౧. అథర్వణఛందస్సు, ౨. అథర్వణభారతము (విరాటాది పర్వములు) అను రెండుగ్రంథములీతనిచే రచింపఁబడినట్లు, అప్పకవి మొదలైన లాక్షణికులు చెప్పుటవలనఁ దెలియుచున్నది.

అథర్వణుఁ డన్నది వింత పేరు. ఆంధ్రదేశమునందు వినఁబడు పేరు నదికాదు. ఈపదము పెట్టుకొన్న బిరుదుగఁ గానవచ్చునది గాని, ఎల్లయ, మల్లయవలె వ్యక్తి నామముగఁదోఁచుటలేదు. తమ పేళ్లు ఘనముగ నుండవలయు నని యిట్టి మారుపేళ్లను పెట్టుకొనుట మన దేశమునందు నాచారమె. 'గాలినరసయ్య' యను పేరు పేలవముగ నున్నదని 'వాతూలాన్వయ అహోబలపతి' యని మార్పఁబడలేదా? 'కవిరాక్షసుఁడు' అన్న పేరును ఇట్టిదే. ఇతని మూలనామము మాత్రమింకను మనకుఁ దెలియలేదు. ఇట్లే ఈ గ్రంథకర్త 'అథర్వణాచార్యుఁ' డన్న బిరుదును తానే స్వయముగ ధరించియుండును, లేదా యతని భక్తులెవ్వరైన నాతనికి నొసంగియుందురు. ఈ బిరుదును బట్టి యీతఁడు అథర్వణశాఖవాఁడై యుండునని యూహింపవలసి యుండును. అట్లే పెక్కుజను లూహించుచున్నారు. కాని, ఆంధ్రదేశమునందు నెచ్చటను అథర్వణశాఖ కానరాదు. ఒక్క యాంధ్రదేశమునందే కాదు,

* ఆంధ్రశబ్దచింతామణి నన్నయ ప్రణీతము కాదని వీరేశలింగముగారి యభిప్రాయము. అయినను శబ్దములను శాసించి భారతము రచించినందున నాతనికిఁ బ్రథమాచార్యుఁడన్న బిరుదు వచ్చెననియు, అతని తరువాత అథర్వణాచార్యుఁడు భారతమును రచింపఁ బూనెఁగావున నితఁడు ద్వితీయాచార్యుఁ డనఁబడెననియు వారియూహ.

హిందూ దేశమునందలి యితర ప్రాంతములలోఁ గూడ నీశాఖవారు కానవచ్చుట యతీ దుర్లభము. ఇఁక నీ పేరెట్లు వచ్చియుండును? ఇందును గుఱించి పరిశోధించి చూడఁగా అథర్వణకృతమైన త్రిలింగశబ్దానుశాసనమునందే యొక యాధారము దొరకినది. పంచమ కాండమునందు, అథర్వశిఖోపనిషత్తు లోనిదియని "త్రిమూర్తులకు సంస్కృతాంధ్ర ప్రాకృతములు ప్రియకరములు. అనఁగా బ్రహ్మకు సంస్కృతము, విష్ణువునకుఁ దెలుఁగు, శివునకుఁ బ్రాకృతము ప్రియము" *ఈ వాక్య ముదాహరింపఁబడియున్నది. అథర్వ వేదమునందు నుదాహరింపఁ బడినది కావునను, విష్ణుదేవతాకము గనుకను, ఆంధ్రభాష అనాదియనియు, మిక్కిలి గౌరవము గలదియనియుఁ జూపుట యీగ్రంథకర్తయొక్కయు ద్దేశముగాఁ గానవచ్చుచున్నది. ఆంధ్రభాషాప్రాచీనత్వము వైదిక ప్రాశస్త్యముచే సుసంగతమని కాఁబోలు పై యథర్వవచనమును శోధించిపట్టు కొన్నగ్రంథకర్త కథర్వణాచార్యుఁ డన్న బిరుదు పెట్టఁబడియుండును. "సంస్కృతమున ప్రమాదమున నపశబ్దము నుచ్చరించినను, విన్నను పాణినిని స్మరింపవలెను" (శృతేఽపశబ్దేచోక్త్వా ప్రమాదాత్ పాణినింస్మరేత్) అని యిడివఱకే యొక కారిక కలదు. దానికి జతగా నీతఁడు తన గ్రంథమునందు "ఆఱు విధములైన ప్రాకృతములలోఁ బొరపాటైన యెడల వాల్మీకినిగాని, మహేశ్వరుని గాని తలఁచుకొనవలెను. ఆంధ్రమునఁ బొరపడిన నన్నే (అథర్వణునే) స్మరియింప వలయు" (ప్రాకృతే షడ్విధేచాపి వాల్మీకిం వా మహేశ్వరం - ధ్యాయే దత్రతుమామేవ స్మరేత్పండిత సమ్మతః) అని శ్లోకపాదములు చేర్చియున్నాఁడు. కావునఁ దాను పాణిన్యాద్యాచార్యులతో సమానుఁడును, ఋషియునని స్వాధిక్యతవిశేషముగఁ జెప్పుకొనుచున్నాఁడు. లోకులు ఋషియని యెంచుటకు నెల్లయ మల్లయ పేళ్లుపయోగకరములుగావు. 'అథర్వణుఁడు' అన్న పేరు గొప్పగాఁగానవచ్చును. అథర్వ వేదముతో సంబంధించిన ఋషియని ధ్వనించును. ఇట్టిపేరు కేవల కల్పితమని మనము నిశ్చయింపవచ్చును.

ఇతఁడు తన గ్రంథమునందుఁ బ్రతికాండమునకుఁ జివర "ఇతి చతుష్షష్టి కళాధురాథర్వణాచార్య విరచితే త్రిలిఙ్గశబ్దానుశాసనే" అని వ్రాసికొనియున్నాఁడు! అఱువది నాలుగు కళలును నీతనికివచ్చునని యర్థము.

ఈతని కాలము

ఇతఁడు మిక్కిలి పురాతనుఁడనియు, నన్నయతో సమకాలికుఁడనియుఁ బురాతనపండితులయభిప్రాయము. వారిట్లొక కథ కూడఁ జెప్పుచున్నారు. "అథర్వణాచార్యుఁడు

* అథర్వణ శిఖోపనిషది "త్రిమూర్తీనాం సంస్కృతాన్ధ్ర ప్రాకృతాః ప్రియంకరాః" ఈ వాక్యము ప్రస్తుత మచ్చుపడియున్న యే యథర్వణశిఖోపనిషత్తునందును గానరాదు!

భారతమును తెనిఁగించి దానికి రాజనరేంద్రుని కృతి కర్తనుగాఁజేసి బహుబహుమానము పొందవలయునని రాజమహేంద్ర వరమునకు వచ్చి నన్నయ భట్టునకు గ్రంథమునుజూపి తనకు రాజసందర్శనము చేయింపుమని వేఁడెననియు, ఆగ్రంథము సర్వోత్కృష్టముగా నున్నందున దానిని బ్రకటనపఱచిన యెడల స్వగ్రంథ ప్రాశస్త్యము చెడునని యతఁడాలాగుననే యనిచెప్పి త్రిప్పుచు నొక నాఁడథర్వణాచార్యుఁడింటలేని సమయమున నతఁడు బసచేసియున్న యింటివారికి లంచమిచ్చి యా పుస్తకమును కాల్పించెననియు, ఇల్లువిడిచి పోవునప్పు డథర్వణాచార్యుఁ డెవ్వరికో చూపుటకయి తనతోడఁగూడఁ దీసికొని పోయిన విరాట పర్వ మొక్కటి మాత్రము నశింపక మిగిలెననియు, ఈదుర్ణయము నన్నయభట్టు వలన జరిగినదని తెలిసికొని యథర్వణాచార్యుఁడాతనిని శపించుచు దుఃఖముతో లేచి పోయెననియు, సాధు పురుషునకు నిష్కారణముగా ద్రోహముచేసిన చింతచేత నన్నయభట్టు మతిచెడివెఱ్ఱివాఁడై గ్రంథరచనకు సమర్థుఁడుకాక పోయెననియు చెప్పుదురు."*

కొందఱు పైకథవలన నన్నయభట్టారకుని యందు గొప్పదోష మేర్పడుచున్నదని దానిని నమ్మక, ఈ యాచార్యుఁడు నన్నయకుఁ గొంచెము తరువాతి వాఁడనియు, నన్నయ మూఁడు పర్వములను తెనిఁగించినందున నితఁడు విరాటపర్వము మొదలు తెనిఁగింపఁ పూనెననియు, నన్నయ ఆంధ్రశబ్దచింతామణియను వ్యాకరణమును రచించినందున నీతఁడుదానికంటెఁబెద్దవ్యాకరణమునురచించెననియుఁ గావుననె యీతనికి ద్వితీయాచార్య బిరుదు వచ్చెననియుఁ జెప్పుదురు. ఇట్లు చెప్పువారందఱిది, అథర్వణుఁడు క్రీ.శ. పదునొకండవ, పండ్రెండవ శతాబ్దములవాఁడని భావము. కాని యీగాథలన్నియు నాధార రహితములుగనుక నమ్మఁదగినవికావు.

కాల నిర్ణయము

అథర్వణుఁ డీ కాలమువాఁడని నిశ్చయముగఁ జెప్పుటకు వీలు లేదుకానియీకాలమునకుఁబూర్వపువాఁడుకాఁడనిమాత్రము చెప్పుటకునాధారములున్నవి. అథర్వణుఁడు త్రిలింగశబ్దానుశాసనము నందు ప్రథమ కాండము అయిదవ శ్లోకములోను, తృతీయ కాండము పదుమూఁడవ శ్లోకములోను హేమచంద్రుని పే రుదాహరించి యున్నాఁడు. ఇతఁడు విఖ్యాతిచెందిన ప్రాకృతభాషాలాక్షణికుఁడు. ఇతఁడు క్రీ. శ. ౧౧౭౨-వ సంవత్సరమునందు మృతి నొందెను. కావున నితనిని ఉదాహరించిన యథర్వణుఁడు పండ్రెండవ శతాబ్దమునకుఁ బూర్వపువాఁడు అయియుండఁడు.

కారికలలోఁ దెలుఁగక్షరముల స్వరూపమిట్లు వ్రాయఁబడియున్నది:—

"పంచవర్గముల ప్రథమాక్షరములు (కచటతపలు) శంఖశార్ఙ్గాదికములవలె నుండును.

*ఆంధ్రకవులచరిత్రము.

ఆయక్షరములకు మీఁదిభాగమందు తిర్యగ్రేఖ లుండును. క్రింది భాగమందు దండరేఖ లుండును....."*

ఆంధ్రాక్షరములకు నీస్వరూపములు, పం [illegible] శతాబ్దాంతమువఱకుగాని ప్రాప్తింప [illegible] నీగ్రంథకర్త యాకాలమునకుఁ బూ [illegible] యుండెడనుటకు సందేహములేదు.

[illegible] శ. పదుమూఁడవ శతాబ్దము నందుఁ [illegible] నథర్వణుఁడు లేనట్లు తోఁచుచున్నది. కేతన తిక్కనసమకాలీనుఁడు. పదుమూఁ [illegible] శతా [illegible] మధ్యమువాఁడు. ఆంధ్రభాషా భూషణమను తెలుఁగు వ్యాకరణము వ్రాసి [illegible]. అందు నాతఁడిట్లు వ్రాసియున్నాఁడు.

౧. మున్ను తెలుఁగునకు లక్షణ
మెన్నఁడు నెవ్వరును జెప్పరేఁ జెప్పెద వి
[illegible]కరము మది మెచ్చఁగ
[illegible] భట్టాది కవిజనంబుల కరుణన్.

౨. సంస్కృత ప్రాకృతాది లక్షణము చెప్పి
తెలుఁగునకు లక్షణము మున్ను దెలుపకునికి
[illegible] నేరమిగాదు, నన్ను
[illegible] దలఁచిన తలఁపుగాని!

ఈ పద్యములనుబట్టి చూడ కేతన యాథర్వణ వ్యాకరణములను, ఎఱుఁగఁడనుట స్పష్టము. కేతన యెఱుఁగఁడనఁగా తిక్కన [illegible] యెఱుఁగదన్నమాట. ఇట్టి లక్షణ [illegible]ములె యాకాలమందు నస్తిత్వమునం దున్న యెడల తిక్కన యాస్థానపువారు వా నిని, ఎఱుఁగకుండుట యసంభవము. కావున నథర్వణుఁడు పదుమూఁడవశతాబ్దానంతరము వాఁడని తేలుచున్నది. ఇట్లీతనికాలమునకు నొకపరిమితి ౧౩-వ శతాబ్ద మేర్పడినది. ఇఁక రెండవ పరిమితి దొరకునేమో చూతము.

నిశ్చయముగ నీకాలపువాఁడని మన మెఱింగినవాఁడు కాకునూరి-అప్పకవి. ఈతఁడు తన గ్రంథము శా. శ. ౧౫౭౭-వ సంవత్సరమునఁ బ్రారంభించితినని యందే వ్రాసియున్నాఁడు. శా. శ. ౧౫౭౭ అనఁగా క్రీ. శ. ౧౬౫౬. ఇతఁడు అథర్వణఛందస్సును, అథర్వణ భారతమును, ఉదాహరించియున్నాఁడు. ఇతని సమకాలికుఁడైన అహోబల పండితుఁడును, అథర్వణుని, అతని వ్యాకరణకారికావళినిస్పష్టముగఁ బేర్కొని యున్నారు. కావున నీతఁడు క్రీ. శ. పదునేడవ శతాబ్దమునకుఁ దరువాతివాఁడు కాఁడనియు, పదుమూఁడవ శతాబ్దమునకును, పదునేడవ శతాబ్దమునకును నడుమనున్న పదునాల్గు, పదునైదు, పదునాఱు శతాబ్దములలో నెప్పుడో యుండియుండునని యు తేలుచున్నది.

ఈ రెండవ పరిమితిని నింకను గొంచెము వెనుకకులాగఁ బ్రయత్నింపవచ్చును. వెల్లంకి తాతంభట్టు కవిచింతామణియను లక్షణ గ్రంథమునందు నథర్వణునిది యని యొక పద్యమును ఉదాహరించి యున్నాఁడు. కాని, తాతంభట్టు కాలమును నిశ్చయముగ

* [illegible] సవిస్తరముగఁ జూడవలయు [illegible], ౧౨-వ సరేఫుటము, [illegible].

నిర్ణయించుటకు నాధారము లేవియులేవు. "ఈకవి కృష్ణరాయని రాజ్యారంభ కాలము నందుండినవాఁడు" అని వీరేశలింగముగారు వ్రాసిరి. కాని, అందునకు నాధారమేదియుఁ గానరాదు. ఈ కాల నిర్ణయమే నిజమైన యెడల భారతమును రచించిన అథర్వణుఁడు క్రీ. శ. పదునాఱవ శతాబ్దమునకుఁ బూర్వపు వాఁడని చెప్పవలయును. ఇంతకుఁ బూర్వము వారెవరును నథర్వణుని స్తుతించి యుండ లేదు. పేర్కొనియుండలేదు.

తత్కృత గ్రంథములు

అథర్వణుని పేరు మీఁదఁ బరంపరగవచ్చు చున్న గ్రంథములు నాలుగనియిదివఱకే చెప్పి యున్నాము. అందు రెండు వ్యాకరణములు, ఒకటి ఛందస్సు, ఒకటి కావ్యము. చివరవి రెండును నామావశిష్టములు. మొదటి రెండును మిక్కిలి యపరిశుద్ధ స్వరూపముతోఁ గానవచ్చుచున్నవి. ఈ నాల్గింటికిని నొక్కఁడే కర్తయై యుండునా? లేక భిన్న కర్తృకములైన యీ గ్రంథములకు పొరపాటున గాని, బుద్ధి పూర్వకముగ గాని యేక కర్తృత్వ మారోపింపఁబడెనా? యని కొందఱు ప్రశ్నలడుగుచున్నారు. త్రిలింగశబ్దానుశాసనమను గ్రంథము మిక్కిలి పురాతనమైనదనియు, దాని కర్త యొకఁడనియు, కారికావళి మిక్కిలి యాధునికమనియు, దానికర్త భిన్నుఁడనియు, శ్రీ పాడి వెంకటస్వామిగారు, ఆంధ్రపత్రిక యొక్క ౧౯౧౧-౧౨వ సంవత్సరపు సంవత్సరాది సంచికలో శోధకులచే గమనింపఁదగిన వ్యాసమును బ్రకటించియున్నారు. ఈగ్రంథమును గుఱించి క్రింద వ్రాయునప్పుడు, ఈ విషయ మెక్కువగాఁ జర్చించెదము. ఇఁక గ్రంథములనుగుఱించి వేఱువేఱుగ విచారించెదము.

౧ త్రిలింగ శబ్దానుశాసనము

ఇదియే యథర్వణ వ్యాకరణమను పేరఁ బరగుచున్నది. దీని ప్రతిమాకు నొక్కటియే దొరకినది. ఇది ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారములోనిది. ఇది మిక్కిలి యపరిశుద్ధ ప్రతి. తప్పుల తడికగా నున్నది. పేరు పెద్దదే కాని గ్రంథము చిన్నది. ఇందుఁ బదికాండములు గలవు. కాండ మొకటింటికిని ముప్పది పంక్తుల కంటె నెక్కుడు విషయములేదు. గ్రంథము విశేషముగఁ బద్యాత్మకము; అచ్చటచ్చట గద్యముకూడఁ గలదు. పదికాండములలోను క్రమముగ ౧ సంజ్ఞా, ౨ సంధి, ౩ తత్సమ, ౪ ఆచ్ఛిక, ౫ తద్ధిత, ౬ సమాస, ౭ కారక, ౮ ... తిజంత, ౯ క్రియా, ౧౦ కృదంతములను గుఱించిన నియమములు గలవు. ఈ గ్రంథమందలి లక్షణము మొత్తము మీఁద స్వల్పము. సంజ్ఞాపరిచ్ఛేదమందు, అచ్చులలో వక్రవక్రతమ సంజ్ఞలుగల యక్షరము లున్నట్టు చెప్పఁబడి యుండలేదు; కచటతపలకుఁ బరుష సంజ్ఞలేదు; గజడదబలకు సరళసంజ్ఞ లేదు; మిగిలినహల్లులకు స్థిరసంజ్ఞలేదు; ద్రుత ప్రకృతికము లెవ్వియో, కళలెవ్వియో వివరింపఁబడలేదు; తేనెటీఁగ, చిగురుటాకు, పేద

రాలు మొదలైన శబ్దములలోని టుగాగమ, రుగాగమములకు నియమము లేదు; నామ ప్రత్యయములు చెప్పఁబడియుండలేదు; తిజంతములందు లడాదుల ప్రత్యయములను, రూపములను, చక్కఁగ వివరింపలేదు. ఇట్లిప్పటి వ్యాకరణమునందుఁ గానవచ్చెడు పెక్కు నియమము లీ వ్యాకరణగ్రంథమునందు లేవు. ఈ స్వల్ప లక్షణములను జూచి కొందఱు "ఈ గ్రంథము నన్నయభట్టునకుఁ బూర్వ మనఁగా నాంధ్రలక్షణము మిక్కిలి తక్కువగా నున్న కాలమున రచింపఁబడియుండు" నని యూహించియున్నారు. కాని యట్టియూహ సరియైనదికాదు. కేతనకృతమైన ఆంధ్రభాషాభూషణముకూడ మిక్కిలి చిన్నది. అందు నెన్నియో లక్షణములు లేవు. అందుచే నది నన్నయకుఁ బూర్వకృతమని చెప్పవచ్చునా? కేతన వఱకు నాంధ్రము పరిపూర్ణావస్థ నెందియుండెను.

ఈగ్రంథమునందుఁ బ్రాచీ నాంధ్రలక్షణవేత్తలుగా నీ క్రిందివారు పేర్కొనఁబడి యున్నారు: 1 బృహస్పతి, 2 కణ్వుఁడు, 3 హేమచంద్రుఁడు, 4 పుష్పదంతుఁడు, 5 రావణుఁడు, 6 గౌతముఁడు, 7 ధర్మరాజు. వీరందఱును తెలుఁగు వ్యాకరణములను రచించినట్టును, ఆ గ్రంథము లథర్వణునకుఁ బూర్వముండినట్టును, ఈ గ్రంథమువలన సూచింపఁ బడుచున్నది.

బార్హస్పత్యాని సర్వాణి
కాణ్వం వ్యాకరణంవిదన్
కరోమ్యాథర్వణం శబ్దం
'సర్వలక్షణ లక్షితం.' ౧-వ కాండము

అని ప్రథమముననే యున్నది. బృహస్పతి కృతమైన వ్యాకరణమును, కణ్వకృత వ్యాకరణమును జూచి యీ యథర్వణ వ్యాకరణమును రచించుచున్నాఁడనని దీని కర్థము.

హేమచంద్రాది మునిభిః
కథితం చాంధ్రలక్షణం. ౧-వ కాండము

హేమచంద్రాది మునులచే నాంధ్ర లక్షణము చెప్పఁబడినది.

ఇందలి హేమచంద్రశబ్దము లేఖకప్రమాదజనిత మనియు, 'సోమచంద్ర' అని యుండవలెననియు, శ్రీ పాడి వెంకటస్వామిగారు వ్రాసిరి. కాని, హేమచంద్రునిపేరు త్రిలింగశబ్దానుశాసనమునందుఁ బెక్కుచోట్ల వచ్చినందునఁ బ్రమాదమనుటకు వీలు లేదు. ఇట్లే పైనిఁ జెప్పఁబడిన యితర నామములు నచ్చుటచ్చట నుదాహరింపఁబడినవి.

కాని, పూర్వమిందఱు త్రిలింగలక్షణములు వ్రాసిరని మనమేము నమ్ముటకు వీలున్నదా? బృహస్పతి, కణ్వుఁడు, రావణుఁడు, పుష్పదంతుఁడు, అను నామములె వీరు కల్పితలాక్షణికులని సూచించుచున్నవి. ఇవి కాల్పనిక నామము లగుటకు మఱియొక యాధారమున్నది. రావణుఁడనిన తోడనే మనము యీ పేరుగల మనుష్యుఁడొకఁడు వ్యాకరణము

రచించెనని అనుకొని పోవుదుమని గ్రంథకర్త యొకచోట (చతుర్థకాండమునందు). "అథ పౌలస్త్యరావణః" అనిచెప్పినాఁడు. అనఁగా 'శ్రీరాములవారి శత్రుఁడైన రావణుఁడు తెలుఁగు వ్యాకరణమును రచించెను. అందుండి నేను ఉదాహరించుచున్నాఁడను'. అని గ్రంథకర్తయొక్క అభిప్రాయము! పౌలస్త్య రావణుఁ డెక్కడ? ఆంధ్రవ్యాకరణ మెక్కడ? బృహస్పతి రచితమైన ఆంధ్రవ్యాకరణమును గాని,పుష్పదంతవ్యాకరణమునుగాని,ఎన్నఁడు నెవ్వరును చూచియుండలేదు. వినియుండ లేదు. పూర్వకాలపు సంస్కృతాంధ్ర గ్రంథకర్త లెవ్వరును దీనిని బేర్కొనలేదు. బృహస్పతి దేవగురువు, పుష్పదంతుఁడు మహిమ్నము రచించిన యతీశుఁడు. కాణ్వవ్యాకరణమును గుఱించి యీ గ్రంథమునందే యిట్లుచెప్పఁ బడియున్నది:—

"కణ్వోయథాహ:......ఆంధ్ర విష్ణోర నుజ్ఞాకృతస్య మద్వ్యాకరణస్యద్రోహీ [గురుద్రోహీ] తి."

అర్థము:—ఆంధ్రవిష్ణు నాజ్ఞవలనఁ జేయఁబడిన నావ్యాకరణమునకు ద్రోహము చేయువారు గురుద్రోహులు సుమీ.

ఆంధ్రవిష్ణువు, ఆజ్ఞయిచ్చినట్టును, కణ్వ మహర్షి యాంధ్ర వ్యాకరణము రచించినట్టును, దానిని నెవరునుదాటి లక్షణము చెప్పఁ గూడనట్టును, పై వాక్యము వలనఁ దెలియు చున్నది. ఈ "గురుద్రోహీ" అన్న తిట్టు వలననే యీ గ్రంథకర్తకుఁ దన వ్యాకరణమును 'ఎవరు లక్ష్యము చేయరు' అన్న భీతి కలిగి యున్నట్టును, అది మిక్కిలి ఆధునిక మైనట్టును, బాగుగ ధ్వనించుచున్నది. ఇందలి యాంధ్రవిష్ణువు ఎవఁడని విచారింపఁగా నీ గ్రంథమునందే "పదుమూఁడు యుగములు నిశంభువను రాక్షసునితోఁ బోరాడి వానిని జంపినవాడు" అనియున్నది. *ఈ ఆంధ్రవిష్ణువు శ్రీకాకుళము వాఁడని తెలియు చున్నది. ఇతఁడుసుచంద్రునికొడుకనుకొన్న నుఅట్టివాని యస్తిత్వమే సంశయాస్పదము. ఒక రాజట్టి వాఁడు నిజముగా నుండెనని యనుకొన్నను ఆతఁడు మిక్కిలి పురాతనుఁడై యుండవలెను. మగధము పాలించిన యాంధ్రరాజుల కంటెఁ గూడ మిక్కిలి పురాతనుఁడై యుండవలెను. అప్పుడీ యాంధ్రభాషకలదా? ఉన్నను బ్రస్తుత రూపమునకంటె మిక్కిలి భిన్నరూపముతో నుండవలెను. కావున నిప్పటియాంధ్రమునకు నప్పుడు లక్షణమెట్లు వ్రాయుటతటస్థించును? హేమచంద్రుఁడు జైనపండితుఁడు. ప్రాకృత వ్యాకరణము, ప్రాకృతకోశము వ్రాసినవాఁడు. తెలుఁగునకు నతనికి నెట్టి సంబంధమును లేదు. ఆతఁడు తెలుఁగు దేశమువాఁడు కాఁడు. ఔత్తరీయుఁడు. ౧౨-వ శతాబ్దాంతము వాఁడు. ఇందు "హేమచంద్రాదిమునిభిః కథి

* "ఆంధ్రవిష్ణుస్సురయుతో దనుజేన నిశంభునా। యుద్ధ్వాత్రయో దశయుగాన్ హత్వాతం రాక్షసోత్తమం (రాక్షసాధమం?)" 4-వ కాండము.

తం చాంధ్రిలక్షణమ్" అన్న వాక్యమునందు హేమచంద్రునకు మునియన్న బిరుదు ఈయఁబడినది. కావున త్రిలింగశబ్దానుశాసనము వ్రాయునాఁటికి హేమచంద్రుఁడు మిక్కిలి పురాతనుఁడై యుండవలెను. అప్పటికాతఁడు చనిపోయి మూఁడు నాలుగు వందల సంవత్సరము లయినను అయిపోయి యుండవచ్చును. హేమచంద్ర పాఠము పొరబాటు. సోమచంద్రపాఠము నిజమనుకొనినను, ఈపేరుగల ఆంధ్రవ్యాకర్త యెచ్చటను ఖ్యాతి చెంది యుండలేదు. ఇతరు లెవరును ఈతనిని పేర్కొని యుండలేదు.

సంస్కృత వ్యాకరణమువలె నాయా భాషలకు ఋషి ప్రణీతములైన వ్యాకరణము లుండినఁగాని ఆయా భాషలకు గౌరవములేదని మనపూర్వ పండితుల యభిప్రాయము. అందుచేతనే యఱవవారు తమభాషకు అగస్త్యముని లక్షణము చెప్పెననియందురు. తెలుఁగు భాషకు నట్టి ఋషిప్రణీతమైన వ్యాకరణములేక పోవుట యొకలోపముగఁ దోఁచి మనవారిట్టి ఋష్యాదులను ఆంధ్రవ్యాకర్తలుగఁ గల్పించియుందురు.

ఈగ్రంథకర్తకెవరో ప్రతిపక్షులున్నట్టును, ఈతఁడు వారికి జవాబుచెప్పి ఖండించుచున్నట్టును, ఈగ్రంథమునందే నిదర్శనములు కానవచ్చుచున్నవి. తృతీయ కాండమునందు:—

అత్ర త్రిలింగ భాషాయాం
లింగమర్యాద వాసితాః
శబ్దాః కేచిత్తు నేత్యాహు
రల్పజ్ఞా మందబుద్ధయః ॥౧౨.

అర్థము:- ఈ త్రిలింగ భాషలో లింగమర్యాదగలశబ్దములు * లేవని కొందఱు, అల్పజ్ఞులు, మందబుద్ధులు చెప్పెదరు.

ప్రయోగమేవ పశ్యంతి
మూఢా మేధావినస్తునః॥౧౪.

అర్థము : — మూర్ఖులు ప్రయోగమునే చూచెదరు ; బుద్ధిశాలు రట్లుచూడరు. ‡

ఆంధ్రసంస్కృత భాషాస్తు
దేవతార్హాః ప్రమోదతః
సుబంతైశ్చ కృదంతైశ్చ
యుక్తాఃస్వర్గప్రదా నృణాం ॥౧౫.

అర్థము:—ఆంధ్రిభాషయు, సంస్కృత భాషయు, దేవతలకుఁదగినవి. ప్రమోదమిచ్చునవి. అవి సుబంత కృదంతములతో నొప్పి లోకులకు స్వర్గమునిచ్చును.

ఆంధ్రి సంస్కృత భాషాభ్యాం
కవిత్వమృషితా ప్రదం ॥౧౬.

అర్థము:—ఆంధ్రి సంస్కృతభాషలలోఁ గవిత్వము చెప్పుటవలన ఋషిత్వము ప్రాప్తించును.

* లింగమర్యాద యనఁగా సంస్కృతమునందు నర్థమునుబట్టి లింగనిర్ణయములేదు; శబ్దమునుబట్టియే యుండును. ప్రతిశబ్దముయొక్క లింగమును వ్యవహారమునుబట్టి యిదివరకే నిర్ణయమైయున్నది. వానిని కోశములవలనఁ దెలిసికొనవలయును.

‡ ముఖ్యమేది ? ప్రయోగమా? లక్షణమా ? అన్న పోరాటమని చదువరు లెఱిగియేయుందురు.

మఱికొన్ని విశేషములు

ప్రాకృత వ్యాకరణమును పూర్వులు సంస్కృతమున వ్రాసిరని వీరును తెలుఁగువ్యాకరణముఁ గూడ సంస్కృతముననే వ్రాసిరి. భాష సంస్కృతము, విషయ మాంధ్రవ్యాకరణ మయినందున నంతటను లక్షణము కానవచ్చును; లక్ష్యములు కానరావు. ఇందుచే సూత్రముల యర్థముకూడఁ బెక్కు తావుల సంశయమునకు నాస్పదమగుచున్నది. 'శ్లో. ఉంచికుండావల్లవలవ వంకయుండతి పంచమీ.' 'సిద్ధారణే కన్నకంటె దశ్యేపారుడి రిష్యదే' * అని ౪-వ కాండమునందు పంచమీ విభక్తిప్రత్యయములు పెక్కులు చెప్పఁబడినవి. ఇందు లేఖక ప్రమాదముచే రూపముమారిన వెన్నియో తెలియదు. లక్ష్యములు, ఉండిన యెడల నిట్టిసంశయమునకుఁ గారణముండదు. 'పారుడి' అనుప్రత్యయము 'దేశ్యము' నందుఁ గలదని వ్రాసినాఁడు. ఇది యొకానొక దేశభాగమునందలి జాతీయమైయుండునని తోఁచెడిని. అట్టిభాగమెద్దియో తెలిసిన నీగ్రంథకర్తయొక్క నివాసస్థలముకనుఁగొనవచ్చును.

"అన్యదేశాగతం గ్రామ్యం
కావ్యానర్హ మ లక్షణం" ౧౪.

అని ప్రథమకాండములో నున్నది. అనఁగా అన్యదేశమునుండి వచ్చిన గ్రామ్యము అలక్షణము, కావ్యమునందు నుపయోగింపఁ దగినది కాదు. ఇట్లనుటవలన నీగ్రంథకర్త యభిప్రాయ మేమైయుండవలెను? స్వదేశజములైన గ్రామ్యపదముల వాడవచ్చుననియా? అట్లనుటకు వీలులేదు. ఇతని మతమునఁ బ్రయోగమున్నను-అనఁగాఁ బూర్వసత్కవుల ప్రయోగమున్నను - ఒకానొక శబ్దరూపము లక్షణయుక్తము కానియెడల నది గ్రామ్యమే. * ఇతని వ్యాకరణములో లేనిరూపమునకు సోమయాజి ప్రయోగమున్నను అది గ్రామ్యమే!

'కర్తృకర్మాదికం సర్వం
పాణినీయసమం మతం.'

కర్తృకర్మాదిక మంతయు ననఁగా తెలుఁగులోని కారకప్రకరణ మంతయు సంస్కృత వ్యాకరణమును అనుసరించి నేర్చుకొనవలసినదె; దీనికి దానికి భేదము లేదు; అని యీ గ్రంథకర్తయొక్క యభిప్రాయము! తెలుఁగు వ్యాకరణము మొదట వ్రాసినవారు సంస్కృత పండితులైనందున సంస్కృత వ్యాకరణమునకుఁ దెనుఁగు వ్యాకరణమును దాసిగఁ జేసిరి! కాని విభక్తులు, కారకములు మొదలైన విషయములయందు ఆంధ్రసంస్కృత భాషాసాంప్రదాయకములకు మిక్కిలి భేదమున్నది. దానిని వీరు గమనించినవారు కారు.

'అనుక్తం సర్వశాస్త్రంతు
రావణీయే విలోకయేత్' ౪-వ కాండము.

* 'కుండా' కు 'కుఁడా' 'ఘంకయుండితి' కి 'వంకడీతి' అనునవి పాడి వెంకటస్వామిగారి పాఠాంతరములు.

* 'అస్మన్మతేతు - అశాస్త్ర ప్రయోగో గ్రామ్యమితి' తృతీయకాండము.

ఈ వ్యాకరణమునందుఁ జెప్పఁబడని నియమములు రావణ వ్యాకరణము నందుఁ జూడ వలసినదని యర్థము! ఈ రావణుఁడు పౌలస్త్య రావణుఁడు!!

'బాలానాం స్వజబోధార్థం
సంగ్రహః కృతమేవహి.' ౧౦ వ కాండము.

బాలురకు సులభముగా బోధయగుటకై యిది సంగ్రహించితినని గ్రంథకర్త చివర చెప్పియున్నాఁడు. ఇంతకంటెఁ బెద్దవ్యాకరణము వ్రాసితినని సూచించుట కాఁబోలును.

అథర్వణ కారికలు

ఈ గ్రంథము యొక్క ప్రతులు రెండు నాకు దొరకినవి. ఒకటి శ్రీ వీరేశలింగము గారు అచ్చు వేయించినది; రెండవది ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమునందలి వ్రాత ప్రతి. ఈ గ్రంథమంతయుఁ బద్యాత్మకము. ప్రథమ ప్రతియందు ౩౭౭ కారికలు కలవు; రెండవప్రతియందు ౨౨౨ కారికలు కలవు. ఇట్లీ రెండు ప్రతులకును ౧౫౫ కారికల భేదము కలదు. ఈ భేదమునకుఁ గారణమున్నది. మొదటి ప్రతియందుఁ దెనుగు వ్యాకరణమునకు సంబంధము లేనట్టియుఁ, గేవలము సంస్కృత వ్యాకరణమునకు, సాహిత్యమునకు, సంబంధించినట్టియుఁ గారికలు రమారమి నూఱువఱకు నున్నవి. ఇవన్నియుఁ బురాతన సంస్కృత లక్షణ గ్రంథములలో నుండి యెత్తి వ్రాయఁబడినవి.

'తదల్ప మపినోపేతం
కావ్యేదుష్టం కథంచన
స్యాద్వపుస్సుందరమపి
శ్విత్రేణైకేన దుర్భగం'

అర్థము :- కావ్యమునందుఁ గొంచెమైనను తప్పు ఉండఁగూడదు. చక్కని శరీరమైనను ఒక్క కుష్ఠరోగముచే ద్వేషింపఁదగినది యగును.

అనిన మొదటి శ్లోకమే సంస్కృత సాహిత్య గ్రంథములోనిది.

'ఉపసర్గేణ ధాత్వర్థో
బలాదన్య త్రనీయతే
ప్రహారాహార సంహార
విహార పరిహారవత్.'

(క్రియాపరిచ్ఛేదము.)

అర్థము:- ధాతువుయొక్క అర్థము ఉపసర్గచే బలవంతముగా మార్చఁబడును. ఇందునకు నుదాహరణములు: ప్రహారము, ఆహారము, సంహారము, విహారము, పరిహారము.

ఇది సంస్కృత శబ్దములకు సంబంధించిన నియమము. తెనుఁగున ధాతువులకుఁ దగులునట్టి యుపసర్గలు లేవు గనుక నీ నియమము తెలుఁగు భాషకుఁ గాఁదగాదు. ఇట్టియసంబద్ధ కారిక లిందెట్లు వచ్చినవని విచారింప వలసి యున్నది. ఈ కారికావళిని సంగ్రహించినవారు వానిని అహోబల పండితీయమునుండి యెత్తి వ్రాసినట్టు కానవచ్చుచున్నది.

అహోబల పండితుఁడు తాను రచించిన కవిశిరోభూషణమను ఆంధ్రశబ్ద చింతామణి వ్యాఖ్యానమునందు నిట్లు వ్రాసినాఁడు:—

'యస్సారోఽథర్వణగ్రంథే
సోఽప్యత్రైవ విధీయతే
తేనతత్ఫక్కికాలోక
లోలతా త్యజ్య తాంబుధైః.'

అర్థము:— అథర్వణుని గ్రంథ మండలి సారమంతయు నిందుఁ జేర్చఁబడినది. కావున నా కారికలను చూడవలయునన్న కోరిక పండితులు విడువ వలసినది.

ఇట్లు అహోబలుఁడు అథర్వణకారికలను-అనఁగాఁ దెనుఁగులక్షణ సంబంధమైన శ్లోకములను - ఉదాహరించుటయేకాక ప్రసంగము ననుసరించి సంస్కృత వ్యాకరణసంబంధమైన కారికలను గూడ నుదాహరించియున్నాఁడు. అహోబలపతి గ్రంథమునుండి కారికలను ఎత్తివ్రాసినవానికి నిది సంస్కృతసంబంధమైనది, యిది తెలుఁగునకు సంబంధించినది, యన్నభేదము తెలియసందున నందు గానఁబడిన శ్లోకములనన్నిటి నెత్తివ్రాసెను!

ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమునందల్లి ప్రతియందుఁ బరిచ్ఛేద విభాగములేదు. కారికలన్నియు వరుసగా వ్రాయఁబడియున్నవి. వీరేశలింగముగారి ప్రతిలో నీకారికలన్నియు, సంజ్ఞ, సంధి, అజంతము, హలంతము, క్రియ, యనునైదు పరిచ్ఛేదములుగా విభజింపఁ బడినవి. ప్రతి పరిచ్ఛేదము క్రింద 'ఇతి శ్రీమదథర్వణాచార్య విరచితే...పరిచ్ఛేదః' అని యున్నది. ఇట్టి చివర వాక్యములుతప్ప, ఈ గ్రంథకర్త అథర్వణుఁడని తెలుపుటకు నీ గ్రంథమునందు మఱియే యాధారమును లేదు.

ఈ గ్రంథమునందుఁ బూర్వాంధ్రవ్యాకర్తలుగా హరి, శ్రీకవి, విష్ణుశర్మ, ధూర్వహుఁడు, శృంగారభూషణుఁడు, అనువారు పేర్కొనఁబడినారు. గ్రంథముచివరను "ప్రమాణ మకలంకస్య పూజ్యపాదస్య లక్షణం" అని యున్నది. ఇందువలన అకలంకుఁడను వాఁడితనికి గురువైనట్లును, అతఁడు తెలుఁగునకు వ్యాకరణము వ్రాసినట్లును సూచింపఁబడినది. కాని యీగ్రంథకర్తలలో నెవ్వరినేని ఆంధ్రవాఙ్మయము కనివిని యుండలేదు. హరికారికలని యొక గ్రంథము కానవచ్చుచున్నది. అది చిన్నయసూరి తెలుఁగు వ్యాకరణమునకు సంస్కృత భాషాంతరము; శిష్టుకృష్ణమూర్తి రచితమని కొందఱయభిప్రాయము. సంస్కృత వ్యాకరణమునకు సంబంధించిన కారికల భర్తృహరి (7-వ శతాబ్దమునాఁడు) రచించెను. వానికిఁగూడ హరికారికలని పేరు.

త్రిలింగ లక్షణముకంటె, నీకారికలు మిక్కిలి యాధునికములనియు, వీనిని అహోబలపండితుఁడే కల్పించి యుండవచ్చుననియు, గొందఱ యభిప్రాయము. ఈ కారికలలో నాధునిక ప్రయోగములకు లక్షణము లున్నవని శ్రీ పాడి వెంకటస్వామిగారు - పక్షునైదు ఉదాహరణము లిచ్చియున్నారు. అందు

ముఖ్యమైనవని తోఁచినవాని నిచ్చట నుదాహరించుచున్నాఁడను:—

1. ద్రుతమునకు నచ్చుపరమగు నపుడు ద్విత్వము వచ్చును; వచ్చెన్నతివ. కా. "నో వాద్విత్వం క్వచిచ్ఛిష్టం పరప్రాణేన సంగతేః" (అజంతపరిచ్ఛేదము 28)

2. సంబోధనమున 'కాన' యనునది తెలుఁగు పదములమీఁద వచ్చును. నాయమ్మ కాన, నా తల్లికాన. కా. "క్వచిదా మన్త్రణే కానో వైకృతాత్పరతో మతః" (అజంత పరిచ్ఛేదము 75)

3. ఒకానొకచో నర్థభేదమున 'ఇగా' యనునది వచ్చును, డుజ్లునునగును. ఎల్లిగా- ఎల్లిగాఁడు, పుల్లిగా- పుల్లిగాఁడు. కా. "అర్థభేదే క్వచిచ్ఛబ్దాదిగా స్యాచ్చతతో పిడుజ్" (అజంత పరిచ్ఛేదము 73)

4. పూజ్యార్థమున ద్రుత సహితమైన 'కారు' వచ్చును; రామయ్యఁగారు, వెంకయ్యఁగారు. కా. "పూజార్థే సద్రుతః కారు ర్భేదకం తూభయాత్మకం" (అజంత 74)

5. మనుజ సంజ్ఞలయందు 'రాజు' ది పదములు పరమగునపుడు పూర్వవర్ణములోపించి, దానికి బదులు అ, ఆ, ఇ, మ మొదలయిన వర్ణములు వచ్చును; రామరాజు, రామరావు, రామశెట్టి, అయ్యపరాజు, కృష్ణమరాజు. కా. "ద్వ్యాత్సరాది చతుర్వర్ణ పర్యంత జననామను లోపస్స్యాదాది* వర్ణానాం శబ్దే రాజాదికే పదే ॥ క్వచిదత్త్వం క్వచిచ్చాత్త్వం క్వచిదిత్త్వం క్వచిద్ద్రుతా । క్వచిన్మత్వం యథా యోగమన్యచ్చ వ్యవహారతః ॥" (అజంత ౧౦౯-౧౧౦)

* 'ద్వ్యాది వర్ణానాం' అని పాఠాంతరము. వెంకట స్వామిగారిప్రతి.

పై నిచూపిన శబ్దరూపము లిట్టివలివి; పదునేఁడు, పదునెనిమిది శతాబ్దములలోఁ బుట్టిన రూపములు కాని పూర్వ ముండినవి కావు. కావున నీ గ్రంథ మాధునికమని వెంకటస్వామిగారు నిర్ధారణచేసిరి.

ఛందస్సు భారతము

అథర్వణుఁడనువాఁడు తెనుఁగు ఛందస్సొకటియు, మహాభారతమునందలి విరాటోద్యోగపర్వములును రచించినట్లు ప్రతీతికలదు. ఈ రెండును తెలుఁగుభాషలో వ్రాయఁబడినవి. కానియెచ్చటను ప్రస్తుతముకానవచ్చుటలేదు. అందఱకుఁ దెలియునట్లు తెలుఁగున వ్రాయఁబడిన యీ గ్రంథములు లోపించుటయు, జనులకు సాధారణముగఁ దెలియనట్టిసంస్కృతమునందు వ్రాయఁబడిన రెండు వ్యాకరణ గ్రంథములు నిలిచియుండుటయు నాశ్చర్యము! అథర్వణఛందస్సును, విరాటపర్వమును అప్పకవి పేర్కొనియున్నాఁడు. త్రిలింగశబ్దానుశాసనమునుగాని, కారికలనుగాని పేర్కొనియుండ లేదు. ఈ రెంటిని అతఁడెఱిఁగియున్నఁ బేర్కొనియుండక పోవునా? అథర్వణకారికావళిని బేర్కొన్నవాఁ డహోబలపతి. అప్పకవికిఁ దెలియకయుండుటయు, కొం

చెను హెచ్చుతగ్గుగా సమకాలికుఁడును బ్రతిస్పర్ధియు నైన అహోబలునకుఁ దెలిసియుండుటయుఁ జూడ నీకారికలకు నహోబలపతియే కర్త యేమో యన్న సంశయము దృఢపడుచున్నది.

అథర్వణఛందస్సులోనివియని కొన్ని పద్యములును, విరాటపర్వములోనివియని కొన్ని పద్యములును, లక్షణగ్రంథములు వ్రాసినవారు కొందఱు ఉదాహరించి యున్నారు. కాని యవి యన్నియుఁ గలిసి పది పద్యములకంటె నెక్కుడుండవు. వీనిని బట్టి యాగ్రంథముల యోగ్యత మనము కనుఁగొనుటకు వీలులేదు.

[కొ. ల.]

## అథర్వతాపిన్యుపనిషత్తు.

అథర్వతాపిన్యుపనిషత్తను నామంబుచేఁ దాపినులని యథర్వణ వేదమునందుఁ బ్రసిద్ధిఁ గాంచినట్టియు నష్టోత్తర శతోపనిష ద్రాజంబులలో వన్నెకెక్కినట్టియు నుపనిషత్సప్తకంబు గణనీయంబై యున్నయది. అట్టి యుపనిషత్సప్తకంబెద్దియనః—1. నృసింహపూర్వతాపిని. 2. నృసింహోత్తర తాపిని. 3. రామపూర్వతాపిని. 4. రామోత్తరతాపిని. 5. గోపాలపూర్వతాపిని. 6. గోపాలోత్తరతాపిని. 7. త్రిపురాతాపిని.

ఇందుఁ బూర్వోత్తరంబులను నుపరిభాగంబుల ననుసరకుగొననిచో నియ్యవినృసింహరామ గోపాలత్రిపురాతాపనులను నాలుగు తాపినులుగ నొప్పుచుఁ దత్తన్నామకవాచ్యంబగుసగుణ బ్రహ్మను గూర్చి ముచ్చటింపుచు నట్టి సగుణ బ్రహ్మోపాసనంబును మందాధికారులకుఁ బ్రబోధింపుచుఁ గ్రమముగా నద్వైతతత్త్వము నుపదేశింపు మహోపనిషత్తులుగా నతిశయిల్లుచున్నయవి. ఈయుపనిషత్తుల యందు నుపదేశింపఁబడిన యుపాస్య దేవతలు నామమంత్ర వ్యవహారంబులచే నత్యంత భిన్నంబులుగాఁ దోచినను, ఉపనిషదంతర్గతంబులైన తత్తద్దేవతాకంబులగు హేతుస్వరూప కార్యంబులను, ఉపాసనావిధానంబులను, ఫలంబులను, విమర్శించినచో నట్టి భిన్నంబులుగాఁ దోఁచు నామమంత్రంబులచే సకల జగదంతర్యామియు, జగత్సృష్టిస్థితిధ్వంస హేతువును, బరమేశ్వరుండు నగు సగుణబ్రహ్మంబె యుపాస్యదైవముగా విధింపఁబడుచున్నాఁడని తేటతెల్లమగు. బ్రహ్మవిష్ణ్వీశ శక్త్యాది నామంబులు సగుణబ్రహ్మంబును బోధింపునను విషయమును విద్యారణ్యులవా రనుభూతిప్రకాశ యందంతర్యామి బ్రాహ్మణ తాత్పర్య కథనావసరంబునఁ బుష్కలంబుగ ముచ్చటించి యున్నారు.

శ్లో॥ "వ్యాసస్తత్తత్పురాణేషు
తత్తద్రూపత యోచితవాన్"

ఇట్టి యాశయమునే శంకర భగవత్పాదాచార్యులవారు ప్రధానముగఁ జేకొని యద్వైతమతమున కంగభూతములుగ శైవ శాక్తవైష్ణవకాపాలిక గాణాపత్య సౌరంబు

లను షణ్మతములు సిద్ధాంతీకరించి షణ్మత స్థాపనాచార్యులను సార్థక నాములైనట్లు నెల్లరు నెఱింగిన విషయమె. శంకర భగవత్పాదు లీ విషయమును విస్పష్టముగ దమ విష్ణు సహస్రనామ భాష్యంబున నీశ్వరుండు సర్వవాచకంబులకును వాచ్యుండని నుడువుచు వర్ణించి యున్నారు.

తాపిన్యుపనిషత్తులు తత్తద్దేవతాకంబులైన యుపాసనావిధానంబులఁ బుష్కలముగ వివరించి యున్నను అద్వైతతత్త్వమునే పరమావధిగాఁ గలిగియున్నటులు సుస్పష్టమగుటకు విద్యారణ్య గురుం డనుభూతిప్రకాశిక యొక్క యంతిమ యధ్యాయంబున నృసింహోత్తరతాపినియొక్క తాత్పర్యమును వివరించి యున్నారు.

శ్లో॥ అథ నృసింహతాపనీయే ఉత్తరస్మిన్ ప్రజాపతిః
దేవానబోధయన్మంత్ర రాజప్రణవమార్గతః
మంత్రరాజం పూర్వతాపనీయం శ్రుత్వాత దాధియా
నృసింహం సగుణం బ్రహ్మ దేవాధ్యబుద్ధిమాప్నుయాత్
తత స్తే నిర్గుణం బ్రహ్మప్రపద్యన్తే శుద్ధబుద్ధయః॥

ఇట్లు నృసింహతాపిని సగుణ నిర్గుణ బ్రహ్మంబుల బోధించిన న్యాయమునసే యితర తాపినులుగూడ సగుణ నిర్గుణబ్రహ్మంబుల బోధింపుటచే నయ్యవిగూడ నద్వైత మవధిగాఁ గలిగియున్నవని నిర్వచింపుట కెంతయు సందియంబు లేదు. ఇట్టి సామరస్యంబును గుర్తెఱుంగుటకు నాయాయి యుపనిషత్తుల యందుఁ బ్రతిపాదింపఁబడిన విషయంబులఁ బ్రత్యేకంబుగఁ గొంతవఱకు నెఱుంగుట యావశ్యకము.

నృసింహపూర్వతాపినియందు నృసింహమంత్ర రాజోపాసనా భేదంబులు, మంత్రరాజంబునకు సగుణ బ్రహ్మపరంబుగ నర్థము. మంత్రరాజంబు యొక్క శక్తి బీజములు, అంగమంత్రములు, ఉపాసనాంగ భూతంబైన చక్రరాజంబగు సుదర్శన నిరూపణము పుష్కలంబుగ ముచ్చటింపఁబడియె.

నృసింహోత్తర తాపినియందు మాండూక్యోపనిషత్సంవాదముచే మంత్ర రాజపర్యాయంబును బీజంబునునగు ప్రణవంబును ముచ్చటింపఁబడి పాదక్రమంబున షోడశకలోపాసనంబు నిరూపింపఁబడి పర్యవసానంబున సర్వప్రపంచోపశమంబును శాంతమును సర్వమంగళప్రదంబును సజాతీయ విజాతీయస్వగత భేదరహితంబును పారమార్థికంబు నగు నద్వైతతత్త్వ ముప దేశింపఁబడియె.

రామపూర్వ తాపినియందు రామశబ్దము పరబ్రహ్మ పరమనియు నుపాసకులకు నాతనికి రూపకల్పనఁజేయఁబడెననియు నిరూపింపఁబడి రామోపాసనాంగ భూతమగు సర్వావిధానము సంక్షేపంబుగ ముచ్చటింపఁబడియె.

రామోత్తర తాపినియందు రామమంత్రమునకును బ్రణవమునకునుగల సామరస్యము

పుష్కలముగ వర్ణింపఁబడి యద్వైతతత్త్వము ప్రదర్శింపఁబడియె.

గోపాలపూర్వ తాపినియందు శ్రీ కృష్ణ మంత్రంబుచే నుపాస్యంబగు దైవము సగుణ బ్రహ్మంబని నిరూపింపఁబడియె.

గోపాలోత్తర తాపినియందు శ్రీ కృష్ణ మంత్రంబునకును బ్రణవంబునకునుగల సామరస్యంబు వివరింపఁబడి యద్వైత తత్త్వము ముచ్చటింపఁబడియె.

త్రిపురాతాపినియందు మొదటి నాలుగు ఖండములచే భువనేశ్వరీ గాయత్రీమృగ్జలలి త్ర్యంబక మహామంత్ర పంచకంబునకును బ్రణవంబునకునుగల యర్థసామరస్యము విపులముగ వర్ణింపఁబడియె. ఐదవ ఖండమందన్ననో యద్వైత సిద్ధాంతములన్నియు సంక్షేపంబుగఁ బ్రదర్శింపఁబడియె. ఇయ్యైదవఖండమంతయు నించుమించుగా సర్వ విధంబుల నమృత బిందూపనిషత్తును బోలి యున్నయది. దానంజేసి యిందలి సిద్ధాంతములను గూర్చి యమృతబిందూపనిషద్వివరణమున గుర్తెఱుంగునది. శుద్ధాద్వైత బోధకంబగు నీఖండమునకుఁ బూర్వమందలి నాలుగు ఖండంబులచే నుదాహరింపఁబడిన మంత్రరాజపంచకంబు మందాధికారులచిత్త శుద్ధికై యుపదేశింపఁబడినదను విషయమును వేఱ వచింప నక్కఱలేదు. పై మంత్ర పంచకంబునకుం గూడ నృసింహ గోపాల రామమంత్రములట్ల ప్రణవ సామరస్యము పుష్కలముగ నిరూపింపఁబడి యుండుటచే నట్టిశబ్దములు విషయలోలురగు కాముకులు దలంచునట్లు కచ కుచాదులతో నొప్పు మనోహరంబులగు స్త్రీ మూర్తులయందుఁ బర్యవసానముగాక సగుణ బ్రహ్మవాచకంబులగుచు నద్వైత మవధిగాఁ గల్గియున్నవను విషయము నెల్లరు గుర్తెఱుంగునది.—

"ఈ యుపనిషత్సప్తకంబున నాయాయి దేవతావాచకంబులగు మంత్రంబులును, దదర్థంబులును, దదుపాసనావిధానంబులును, విపులముగనుండినను సంక్షేపంబుగ నద్వైత తత్త్వమే ముఖ్యముగాఁ దెల్పఁబడియున్నది. ఈ యుపనిషద్రాజ సప్తకంబుచేఁ దెలియవచ్చు మహత్తమంబగు సిద్ధాంత మెద్దియన:- సచ్చిదానందంబును నిరవయవంబును నిష్కలంబును నిష్క్రియంబునగు పరబ్రహ్మకు నుపాసకుల సౌకర్యమునకై బహువిధంగుల నామరూపంబులు గల్పింపఁ బడుటచే సకల శబ్ద వాచ్యుండు బ్రహ్మదక్క నన్యంబు లేదని. ఇట్టియాశయమును రామతాపిన్యుప నిషత్తు కంఠోక్తిగ వక్కాణింపుచున్నయది.

'శ్లో. చిన్మయస్యాద్వితీయస్య
నిష్కళస్యాశరీరిణః
ఉపాసకానాం కార్యార్థం
బ్రహ్మణో రూపకల్పనా
రూపస్థానాం దేవతానాం
పుంస్త్ర్యంగాదికల్పనా.'

ఇట్టి సకలవేదసార భూతంబగు సకలలోక హితంబునగు సిద్ధాంతంబును గుర్తెఱుంగని యజ్ఞులచే నృసింహ రామతాపినులు వైష్ణవాద్వైత బోధకమ్ము లనియు, గోపాలతాపిని వల్లభాచార్య మతబోధక మనియు, త్రిపురా తాపిని శాక్తాద్వైత ప్రతిపాదక మనియు నపార్థములు గల్పింపఁ బడుచున్నవి. ఇయ్యవి కేవల మజ్ఞానవిలసితంబులు. సకల జగదధిష్ఠానంబగు పరబ్రహ్మ యందుగాని సకల జగదంతర్యామియగు సగుణ బ్రహ్మయందుగాని యించుకంతయు స్త్రీ పుం భేదములఁ గల్పించుట కెంతమాత్రము నవకాశము లేదు గదా! అట్టి విషయంబున నంతర్యామియగు సగుణ బ్రహ్మంబును, అధిష్ఠాన భూతంబగు నిర్గుణ బ్రహ్మంబును, నిరూపించు నుపనిషత్తులు, కరచరణాద్యవయవ యుక్తంబులును, సజాతీయ విజాతీయ స్వగతభేద సహితంబులును, స్త్రీపుంభేద యోగ్యంబులు, నగు నుపాధులనే దైవరూపములని త్రికరణశుద్ధిగ వక్కాణింపు మతముల కెంత మాత్రము నాధారములుగా నోపవు. శబ్దాంత మందలి స్త్రీపుంలింగ ప్రత్యయ గ్రహణంబుచే నంతర్యామి యందు స్త్రీపుం వివక్షఁ జేయఁ బూనుట సంస్కృతభాషా నియమాజ్ఞాన విలసితంబుగాని వేఱొండుగాదు. అద్వైత తత్త్వంబునకు శాక్తమనియు శైవమనియు వైష్ణవమనియు కాపాలికమనియు గాణాపత్యమనియు సౌరమనియు భేద మెంతమాత్రమును లేదు. ఇట్టిభేదము మందాధికారులకు శాస్త్రముచే విధింపఁబడిన వ్యష్టిమూర్త్యుపాసనయందకావున శాక్తాద్వైతములోనుగాఁగలశబ్దములు శశవిషాణ తుల్యంబులు. ఇట్టియంశంబున నీయుపనిషత్తులే తన్నామకంబులగు దేవతలను స్త్రీపుం వివక్షచే నిరూపించుననియు నేతన్మంత్రంబుల యుపాసనను బ్రతిపాదించుననియు, నశాస్త్రీయంబులును బతనహేతువులు, నగు దురాచారంబులఁ బ్రతిపాదించు మోహ శాస్త్రంబులకు నాలవాలమనియు, నట్టిదురాచారంబులను శాస్త్రవిహితంబు లనియు, దలంచుట కేవల మజ్ఞాన విజృంభితము. విషయలోలు రీకుమార్గముల శాస్త్రీయంబులుగఁ బరిగణించి యాచరింపసమకట్టుచుందురని శ్రీకృష్ణభగవానులు గీతాశాస్త్రమున వివరించియున్నారు.—

'శ్లో॥ యామిమాం పుష్పితాం వాచం
ప్రవదంత్యవిపశ్చితః'
" అధర్మం ధర్మమితియామన్యతే
తమసావృతా
సర్వార్థాన్ విపరీతాంశ్చ
బుద్ధిః సాపార్థ తామసీ.''

ఇట్లు భగవద్వాచకంబుల యందు స్త్రీపుం భేదములఁ గల్పించి తత్తదను గుణంబులగు పిచ్చితలంపులను దలంచుచు విషయములకు బానిసలై తమ తమ యిచ్ఛానురూపంబులగు దుశ్చేష్టితంబుల శాస్త్రసిద్ధంబులని మోహశాస్త్రంబుల శరణుసొచ్చి యనా

చారంబులఁ బొల్పడుటచే ననివార్యంబైన నరకంబులఁ బొల్పడు నవివేకు లీయుపనిషద్రాజ పుస్తకంబును బూర్ణముగ విమర్శించినచో నట్టి యుపద్రవములఁ బొల్పడకుండ సత్పథంబు ననుసరించి శ్రేయస్సు నందుటకు నెక్కుడుసావకాశము చిక్కుఁ గావున నీయుపనిషత్పుస్తకంబు శ్రేయోభిలాషుల కెల్లరకును సర్వవిధంబుల విచార రమణీయము. ఇంతియె కాక పారమార్థికమును గుర్తెఱుంగక భగవన్నామ మాత్రైకశరణులై కుమతంబులఁజొచ్చి దుష్టాచారంబులఁ బొల్పడి మదమాత్సర్యంబులకు లోనై యనిశము కలహాయత్తచిత్తులై భ్రంశము నొందు వారలు స్వస్థచిత్తత నొందుట కీయుపనిషద్రాజ విమర్శనంబు పర మౌషధమని విబుధులెఱుంగునది. సకలామ్నాయసామరస్యంబును సకలపురాణ సామరస్యంబును బ్రతిపాదించు నీయుపనిషత్పుస్తకంబు సదా చింతనీయంబు.

(శ్రీ. క. భా.)

**అథర్వవేదము.** ఇది నాల్గవ వేదము. ఇతర వేదముల వలెనే యిదియు సంహితా బ్రాహ్మణములన్న రెండు భాగములు కలది. అయినను సాధారణముగ, అథర్వవేదమన్న, అథర్వ సంహితయని యర్థము చేసికొనవలెయును. ప్రతి వేదమునందును సంహితా భాగము బ్రాహ్మణభాగము కంటెఁ బ్రాచీనము. ఇచ్చట అథర్వణ సంహితను గుఱించి, మొదట సవిస్తరముగ వ్రాసి పిదపఁ దద్బ్రాహ్మణముల గుఱించియుఁ దదంతర్గతములైన యుపనిషత్తులను గుఱించియు ఇతరములైన యుపాంగములను గుఱించియు వ్రాయఁబడును.

ఋగ్యజుస్సామ వేదములకంటె నీవేదము వెనుకఁబుట్టినట్లు కాన వచ్చున్న. కొంతకాల

దీని అర్వాచీనత్వము

మూవఱకు వేదములు మూఁడేయున్నట్లు ఆర్యులలోఁ బ్రతీతియుండెను :-

"ఋచ స్సామానిజజ్ఞిరే
యజుస్తస్మాదజాయత"

[ఋగ్వే. ౧౦, ౯౦. ౯.

ఋక్కులును సామములును బుట్టెను ; అందువలన యజుస్సు పుట్టెను.

"త్రయో వేదా అజాయన్త, ఋగ్వేద ఏ వాగ్నే రజాయత యజుర్వేదో వాయోః సామవేద ఆదిత్యాత్" [ఐత. బ్రా. ౫. ౩౨.

మూఁడు వేదములు పుట్టెను. అగ్నినుండి ఋగ్వేదము, వాయువునుండి యజుర్వేదము, ఆదిత్యునినుండి సామవేదము పుట్టెను.

"యమృషయస్త్రివిదావిదుః ఋచస్సామానియజూంషి"

[తైత్తి. బ్రా. ౧.౨.౧.౨౬.

ఋషులు మూఁడు నేర్చినవారు ఏవేదమును ఋక్కులుగాను, సామములుగాను, యజుస్సులుగాను ఎఱిఁగియుండిరో

"త్రయీవై విద్యా, ఋచోయజూంషి సామాని" [శత. బ్రా. ౪. ౬.౭. ౧.

మూఁడే విద్యలు: ఋక్కులు, యజస్సులు, సామములు.

" యదృచైవహౌత్రం క్రియతే
యజుషాధ్వర్యవం సామ్నోద్గీథం
వ్యారబ్ధా త్రయీవిద్యా భవతి
అథ కేన బ్రహ్మత్వం క్రియత ఇతి
త్రయ్యా విద్యయేతి బ్రూయాత్ ".

[ఐత. బ్రా. ౫. 33.

హోత చేయవలసినపని ఋగ్వేద మంత్రములతోను, అధ్వర్యుఁడు చేయవలసినపని యజుర్వేద మంత్రములతోను, ఉద్గీథ చేయుపని సామ మంత్రములతోను చేయునే! బ్రహ్మ చేయవలసిన పని యే మంత్రములతోఁ జేయవలెనని యడిగిన నీ మూఁడు వేదముల మంత్రములతోఁ జేయవలెనని చెప్పవలెను.

పైని ఉదాహరించిన వేదవచనముల వలననే మొదట, వేదములు మూఁడనియు, వానికి 'త్రయీవిద్య' యన్న బిరుదుండెననియు, యజ్ఞయాగాదికములందు నీమూఁటినే యుపయోగించు చుండిరనియు స్పష్టపడుచున్నది. మనుస్మృతి యందుఁగూడ నీశ్లోకము కనఁబడుచున్నది :-

శ్లో. అగ్నివాయు రవిభ్యశ్చ
త్రయం బ్రహ్మ సనాతనం
దుదోహ యజ్ఞసిద్ధ్యర్థ
మృగ్యజుస్సామలక్షణం. [౧. ౨. ౩.

యజ్ఞసిద్ధి కొఱకు సనాతనములైన ఋగ్యజుస్సామములనెడు మూఁడు వేదములను అగ్నివాయు రవులనుండి పితికెను.

మనుస్మృతియందలి యీ శ్లోకమువలననే ఋగ్యజుస్సామములనఁబడు మూఁడు వేదములు, అథర్వ వేదముకంటెఁ బురాతనములనియు, యజ్ఞసిద్ధికి నవియే యుపయోగింపఁబడుచుండెననియు స్పష్టమగుచున్నది. మనుస్మృతి కాలమున నథర్వవేదము కలదు. అయినను మొదటి మూఁడు వేదములనుగుఱించియే మనువు 'బ్రహ్మ సనాతనం' అని వ్రాయుట విశేషాంశము.

ఇట్లు, అథర్వవేదము వెనుకఁ బుట్టినందున నితరవేదములతోఁ బాటు గౌరవము సంపాదించుకొనుటకు దానికిఁ గొంతకాలము పట్టెను. యజ్ఞయాగాదులకు సర్వము కానిది క్రమక్రమముగ నందులకుఁ దగినదయ్యె. యజ్ఞము జరుపుటలో హోత, అధ్వర్యుఁడు, ఉద్గీథ, బ్రహ్మ అనువారు నల్గురు ముఖ్యులు. ఇదివఱకుఁ జూపఁబడిన నైతరేయ బ్రాహ్మణమును (౫-౩౩) బట్టి హోత ఋగ్వేదము వచ్చినవాఁడుగను, అధ్వర్యుఁడు యజుర్వేదము వచ్చినవాఁడుగను, ఉద్గీథ సామవేదము వచ్చినవాఁడుగను, బ్రహ్మ, ఈ మూఁడు వేదములు వచ్చినవాఁడుగను, ఉండవలెను. అట్టదానికిఁ గాలక్రమమున నథర్వవేదమువారు బ్రహ్మస్థానము నాక్రమించిరి. అథర్వవేదము వచ్చినవాఁడు బ్రహ్మగా నుండవలెనన్న స్వామ్యమును సంపాదించిరి. గోపథబ్రాహ్మణమనునది అథర్వవేదమునకు సంబంధించినది. అందు నీసంగతి స్పష్టముగఁ జెప్పఁబడియున్నది:-

"ప్రజాపతిర్యజ్ఞమతనుత
సఋచైవహౌత్రమ్ అకరోత్.
యజుషాధ్వర్యవం సామ్నౌద్గాత్రమ్
అథర్వాంగి రోభిర్బ్రహ్మత్వమ్."
[గోపథ. బ్రా. 3.౨.

ప్రజాపతి యజ్ఞముచేసెను; అతఁడు ఋక్కులచే హౌత్రమును (హోతపని), యజుస్సుచే అధ్వర్యమును, సామములచే ఔద్గాత్రమును (ఉద్గాతపని), అథర్వమంత్రములచే బ్రహ్మత్వమును (బ్రహ్మచేయవలసినపని) చేసెను.

"కంవో హోతారం వృణీయామ్
కం అధ్వర్యుం। కం ఉద్గాతారమ్।
కం బ్రహ్మాణం ఇతి। తదోచుః
ఋగ్విదమేవ హోతారం వృణీష్వ
యజుర్విదమధ్వర్యుం। సామవిదముద్గాతారం
అథర్వాంగిరోవిదమ్ బ్రహ్మాణమ్
తథాహాస్యయజ్ఞ ఉశ్చతుష్పాత్ ప్రతితిష్ఠతి"
[గోపథ. ౨. ౨౪.

ఎవనిని హోతగ, ఎవనిని అధ్వర్యునిగ, ఎవనిని ఉద్గాతగ, ఎవనిని బ్రహ్మగ నెన్నుకొనవలెను? ఋగ్వేద మెఱిఁగినవానిని హోతగ, యజుర్వేద మెఱిఁగిన వానిని అధ్వర్యునిగ, సామవేద మెఱిఁగినవానిని ఉద్గాతగ, అథర్వవేద మెఱిఁగినవానిని బ్రహ్మగ నెన్నుకొనవలెను. అప్పుడుమీనియజ్ఞము నాల్గుకాళ్ళుగలదియై నిల్చును.

ఇట్లు అథర్వవేదము యజ్ఞార్హమగుటయే గాక యదిలేనిది యజ్ఞము సంపూర్తికాకుండ నేర్పడెను. పురాణకాలమువఱకు నీవేదము ప్రతిష్ఠహెచ్చి రాజపురోహితాదు లీవేదము నెఱిఁగినవారుగనే యుండవలయునని యేర్పడెను:-

పురోహితం తథాథర్వ
మంత్ర బ్రాహ్మణ పారగమ్.
[మత్స్య పురాణము.

అభిషిక్తోఽథర్వమంత్రై
ర్మహీంభుంక్తేససాగరామ్.
[మార్కండేయ పురాణము.

'అథర్వ వేదమందలి మంత్ర బ్రాహ్మణములను బాగుగ నేర్చిన వానిని పురోహితుని జేయవలయు'
[మత్స్య పురాణము.

'అథర్వమంత్రములచే నభిషిక్తుఁడైన రాజు సాగరయుక్తమైన భూమిని ఏలును'
[మార్కండేయ పురాణము.

అథర్వవేదము వెనుక పుట్టిన దన్న యభిప్రాయము కొందఱకు నిష్టములేదు. అట్లనుటవలన దీని యనాదిత్వమునకు (వేదత్వమునకు) భంగమువచ్చును. కావున నీ వేదముఁ గూడ మిగిలిన మూఁడు వేదములతోఁ బాటు అనాదియే యని వారితాత్పర్యము. ఇఁక "త్రయీవిద్య" యన్న వాక్యమునకు వారొకవిధముగ నర్థము చెప్పెదరు. ఋగ్యజుస్సామములనఁగా వేదములుకావు. వేదములోని మంత్రముల విధములు. ఒక విధమైన వృత్తము లనుకొన్నుఁడు. ఋక్కనఁగాఁ బద్యము, యజుస్సనఁగా గద్యము, సామమనఁగా సంగీతము. జైమిని పూర్వమీమాంసా సూత్రములలో నిట్లువ్రాసెను :-

"ఋగ్యత్రార్థ వశేన పాదవ్యవస్థా",
"గీతిషు సామాఖ్యా"
"శేషే యజుశ్శబ్దః" [పూ. మీ. ౨.౧.౩౫-౩౭.

ఎచ్చట నర్థము ననుసరించి పాదముల యేర్పాటు ఉండునో యది ఋక్కు. గీతములకు సామము లని పేరు, మిగిలిన వానికి యజుస్సులనియుఁ బేళ్ళు.

ఇట్లు చెప్పియున్నది గనుక 'ఋగ్యజుస్సామము' లన్నప్పుడు, అథర్వవేదము నందలి ఋక్కులు, యజుస్సులుకూడ వచ్చినవి. అందుచే నీవేదము, ఋగ్యజుస్సామములను పదము లందు లేదని చెప్పఁగూడదు, అనియీపక్షము వారు వాదించెదరు. సాయణాచార్యులవారు అథర్వభాష్య పీఠికలో నీవిధముగనే చర్చించి యీ వేదముయొక్క పురాతనత్వమును స్థాపింప యత్నించియున్నారు!

**ఈ వేదము పేర్లు**

ఈ వేదమునకు సాధారణముగ 'అథర్వవేద' మని పేరున్నను, మొదట దీనికి 'అథర్వాంగిరస' మని పేరుండెను. ఈ వేదమునందే (౧౦-౭-౨౦) 'అథర్వాంగిరసః' అన్న ద్వంద్వ బహువచనాంతనామముగలదు. అథర్వుఁడు, అంగిరసుఁడు, అను నిద్దఱు ఋషులు, ఈ వేదమునకుఁ బ్రవర్తకులైనందున దీనికీపేరు వచ్చెను. పూర్వము సృష్టికొఱకు స్వయంభువు బ్రహ్మ తపస్సు చేసెనఁట. అతని రోమకూపములలోనుండి చెమటపుట్టెనఁట. అందు నాతని ప్రతిబింబమునే చూచినందున నాతని రేతస్సు చలించెనఁట. ఆ రేతస్సుఁ జెమటయుఁ గలిసి రెండుభాగములయ్యెనఁట. ఒకదాని నుండి, భృగుమహర్షి పుట్టెనఁట. అతఁడు బ్రహ్మను జూడఁగోరి 'అథర్వాఙ్ ఏనమ్...', (గోప. బ్రా. ౧-౪) అని అన్నందున నతఁడు అథర్వణుఁడయ్యెనఁట. మిగిలిన సగము రేతస్సుచేరుటవలన వరుణాఖ్య బ్రహ్మ నావరించి యాతఁడుతపస్సుచేయఁగా సర్వాంగమునందును రసమై ప్రసరించెనఁట. అంగరసమునుండి అంగిరసఋషి పుట్టెనఁట. వీరిద్దఱవలన నిరువదిమంది అథర్వాంగిరసులను ఋషులుపుట్టిరఁట. వారిరువదిగురు గనుక అథర్వాంగిరస వేదమునందు నిరువది కాండములుగలవఁట! ఇందుచే నీవేదము సర్వశ్రేష్ఠమఁట! [సాయణభాష్యపీఠిక.

పురాణములనుబట్టి చూడ అథర్వణఋషినిగుఱించి యీక్రిందిసంగతులు తెలియుచున్నవి. స్వాయంభువ మన్వంతర మందలి బ్రహ్మ మానస పుత్రుఁడు. కర్దమ ప్రజాపతి కన్యయైన శాంతి యీతనిభార్య. ఇతనికి చిత్తియను రెండవ భార్యయుంగలదు. ఆమెయందు నీతనికి ధృతవ్రతుఁడు, దధ్యంచుఁడు అథర్వ శిరసుఁడు, అను ముగ్గురు పుత్రులు గలిగిరి. ఈ ముగ్గురికి అథర్వణులన్న సామాన్య నామము కలదు. రెండవ వాఁడగు దధ్యంచునకు దధ్యఙాథర్వణుఁడన్న వాడుక పేరుకలదు. ఈ అథర్వణఋషి బ్రహ్మ విద్య

నభ్యసించు నప్పుడు యజ్ఞుఁడను నింద్రునకు సహాధ్యాయిగా నుండెను. వీరికిద్దఱకును బ్రహ్మదేవుఁడు గురువుగా నుండెను (భా. ప్రా. కో.). అంగిరసుని గుఱించి యిదివఱకే వ్రాసియున్నాము.

అథర్వవేదమంత్రములలోఁ గొన్ని అథర్వణవంశజులచేతను, మఱికొన్ని అంగిరసవంశజులచేతను రచింపఁబడెనని అథర్వవేదమునందె కానవచ్చును. కొన్ని సూక్తములలో

"అథర్వణానాం చతుర్ఋచేభ్యస్స్వాహా
షడృచేభ్యస్స్వాహా!........." అని

కొన్ని సూక్తములలోను (౧౯-౨౩),

"అఙ్గిరసానామాద్యైః పఞ్చను వాకైః
స్వాహా షష్ఠాయస్వాహా......" అని
(౧౯-౨౪)

కొన్నిసూక్తములలోను, ఈసంహితయందే కానవచ్చుచున్నది. ధోరణిని పట్టి చూడఁగా అథర్వణుల రచన యెక్కువగను, అంగిరసులరచన తక్కువగను, మొదట అథర్వణుల కావ్యమేర్పడినట్టును, పిదప అంగిరసుల కావ్యము ఇమిడ్చఁబడినట్టును ఊహ తట్టుచున్నది.

"ఏతద్వై భూయిష్ఠం బ్రహ్మ యద్
భృగ్వఙ్గిరసః । యేఙ్గిరసః స రసః
యేఽథర్వాణస్తద్భేషజమ్
యద్భేషజం తదమృతం
యదమృతం తద్బ్రహ్మ"
[గోప. బ్రా. 3.4.

భృగ్వంగిరసమును వేదము పెద్దది, అంగిరసుఁడు రసము, అథర్వణుఁడు భేషజము, భేషజమే అమృతము, అమృతమే బ్రహ్మ వేదము.

ఈ గోపథబ్రాహ్మణములోని వాక్యము వలన నీవేదమునకు అథర్వాంగిరసమన్న పేరుగాక భృగ్వంగిరసమన్న పేరుకూడ నున్నట్టు కానవచ్చుచున్నది. ఇఁక చరిత్రదృష్టితోఁ విచారింపఁగా నథర్వణుఁడు, అంగిరసుఁడు, భృగువు, అనువారీ వేద ప్రవర్తకులైన కులపతులుగాఁ గానవచ్చుచున్నారు. కులపతి యనఁగా నొక కుటుంబమునకుఁ గాని శిష్యపరంపరకుఁ గాని యధిపతి. అథర్వణుఁడు, అంగిరసుఁడు, భృగువు ఈ ముగ్గురును, వీరి గోత్రమువారును నగు ఋషులు ఋగ్వేదకాలము నుండియు విఖ్యాతిఁ జెందినవారే. *

అథర్వవేదమునకు 'బ్రహ్మవేదము' అని కూడఁ బేరుకలదు. ఇది చివరకువచ్చినది. యజ్ఞమునందు బ్రహ్మగానుండ వలసినవాఁడు, అథర్వవేదజ్ఞుఁడుగ నుండవలయునన్న నియమము పుట్టినతరువాతఁగాని యీపేరు దీనికి రాలేదు. గోపథ బ్రాహ్మణమునందు నీపేరు మొదటఁగానవచ్చుచున్నది.

"చత్వారో ఇమేవేదా ఋగ్వేదో యజుర్వేదః సామవేదో బ్రహ్మవేదః" [౨-౧౬.

ఈ వేదములు నాలుగు. ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, బ్రహ్మవేదము.

* ఋగ్వే, ౬-౪౭-౨౪, ౮-౧౧-౨.

వేదముల కాలము నిర్ణయించుట మిక్కిలి కష్టము. నిశ్చయముగ ఆ వేద మిన్ని సంవత్సరములక్రింద వ్రాయఁబడినదని చెప్పుట యసంభవము. కాని పండితులు వలయునంత వఱకుఁ దమతమ బుద్ధిచాతుర్యమును ఉపయోగించి, యజ్ఞేయమైన వేదోత్పత్తి కాలమును గనుఁగొనుటకు యత్నించెదరు. అట్టి యూహాలు గుఱికిఁ బెత్తెడు హెచ్చుతగ్గుగ సరి పోవుచుండును. కావునఁ జదువరులిట్టి కాల నిర్ణయములను నిశ్చయమైనవిగను, ఎన్నడు తిరుగనివిగను నెంచఁగూడదు. ఇంత కంటె నెక్కుడు నిశ్చయమైనకాలనిర్ణయ మెవరైనఁ జేయువఱకు నీకాలనిర్ణయము గ్రాహ్యమని యెంచవలెను.

కాలనిర్ణయము

అథర్వవేదకాలమును నిర్ణయించుటకు నొక యాధారము పండితులు కనిపెట్టినారు. ౧౯-వ కాండమునందలి ౭-వ సూక్తమునందు ౨౮ నక్షత్రముల పేళ్లు చెప్పఁబడినవి.* ఆచెప్పుటలో నిప్పుడు మనము చెప్పునట్లు, 'అశ్విని,' 'భరణి' యని చెప్పియుండలేదు. 'కృత్తికా' నక్షత్రముతోఁ బ్రారంభింపఁబడి 'భరణి' నక్షత్రముతో ముగింపఁబడినది. ఇట్లు చెప్పఁబడుటయే కాలనిర్ణయమునకు నాధారము. ఇప్పుడు 'అశ్విని' నక్షత్రము 'రాశి చక్రము'నకు మొదటనున్నట్లు అప్పుడు 'కృత్తికా' నక్షత్రము రాశిచక్రమునకు మొదట నుండెను. 'అయన' మను శీర్షికక్రింద వ్రాయఁబడిన విషయమును చదివినయెడల, అయనమునకు చలనము కలదనియు, వృత్తిమండలి యొక బిందువు చలించిన నన్నిబిందువులును చలించుననియు, అందువలన రాశి చక్రమందలి ప్రథమస్థానముననుండిన నక్షత్రముఁగూడ మారుననియు, చదువరులు తెలిసికొనఁగలరు. అయన చలనగతి సంవత్సరమునకు రమారమి ౫౦" వికళలు (Seconds).

కృత్తికా నక్షత్రము రాశి ప్రథమమున నున్నకాలము మొదలు నేటివఱకు అయ

* చిత్రాణిసాకం దివిరోచనాని
సరీసృపాణి భువనేజవాని
అష్టావింశం సుమతిమిచ్ఛమానో
అహానిగీర్భిః సపర్యామినాకమ్. ౧
సుహవమగ్నే కృత్తికా రోహిణీ చాస్తు
భద్రం మృగశిరః శ మార్ద్రా
పునర్వసూ సూనృతా చారు పుష్యో
భాను రాశ్లేషా అయనం మఘామే. ౨
పుణ్యంపూర్వా ఫల్గుణ్యౌ చాత్ర హస్త
శ్చిత్రా శివా స్వాతి సుఖో మేఅస్తు
రాధే విశాఖే సు వా నురాధా
జ్యేష్ఠా సునక్షత్ర మరిష్టమూలమ్. ౩
అన్నం పూర్వా రాస తాంమే ఆషాఢా
ఊర్జం దే వ్యుత్తరా ఆవహన్తు
అభిజన్మే రాసతాం పుణ్యమేవ శ్రవణః
శ్రవిష్ఠాః కుర్వతాంసుపుష్టిమ్. ౪

నాంశము ఎంతచలించినదని చూడవలెను. కృత్తికా నక్షత్రమును కలుపుకొని లెక్క వేసిన ౨౪ నక్షత్రములు చలించినదనియు, కృత్తికను విడిచి లెక్కవేయఁగా ౩౪ నక్షత్రములు చలించెననియుఁగానవచ్చును. †ఒక నక్షత్రమనఁగా ౧౩°. ౨౦′ (పదుమూఁడు అంశముల యిరువది కళలు) కావున ౨౪ నక్షత్రములు,అనఁగా ౬౦°(అఱువదిఅంశములు). అయనము (సంపాతము) సంవత్సరమునకు ౫౧″ (ఏఁబదియొక వికళలు) చలించుటకు నొక సంవత్సరము పట్టిన ౬౦° అంశములు (౬౦×౬౦×౬౦ వికళలు)చలించుటకు నెంత కాలము పట్టును, అని త్రైరాశికముఁ జేసి చూచిన ౪౩౨౦ సంవత్సరములువచ్చును. ౩౪ నక్షత్రములె చలించినదనుకొనిన౩౩౬౦ సంవత్సరముల కాలము వచ్చును. కృత్తికయన్న నా నక్షత్రముయొక్క మొదలుకావచ్చును, తుద కావచ్చును, మధ్యకావచ్చును. అప్పు డేభాగము రాశి ప్రథమముగా నున్నదో చెప్పుటకువీలులేదు. కావున అథర్వ వేదమందలి ౘ సూక్తము రచింపఁబడి నేటికి రమారమి ౩౩౦౦ సంవత్సరములు మొదలుకొని ౪౩౦౦ సంవత్సరములయి యుండునని మన మూహింపవచ్చును. ఈ సూక్తము ౧౯వ కాండము నందలిది. ఈకాండ మితర కాండములకంటె నర్వాచీనమని పండితుల యభిప్రాయము. కావున నథర్వ వేదముయొక్క పూర్వభాగము లింతకంటెఁ బురాతనములై యుండవలెను. అంతకుఁబూర్వపువియైనఋగ్వేదాదులింకను బ్రాచీనములై యుండవలెను.

† విశ్వకోశము, ౧వ సంపుటము, ౧౫౯వ పుట.

ఆమేమహాచ్ఛతభిషగ్వరీయ
ఆమే ద్వయాప్రోష్ఠ పదానుశర్మ
ఆ రేవతీ చా శ్వయుజౌ భగంమ
ఆమేరయిం భరణ్య ఆవహన్తు ॥ ౫
[౧౯వ కాండము ; ౭వ సూక్తము.

అర్థము :-౧. ఆకాశమునందుఁ జిత్రముగఁ బ్రకాశించునవియు, ఎల్లప్పుడును ఆకాశమునందుఁ గలిసి శీఘ్రముగ తిరుగునట్టివియునగు నిరువది యెనిమిది నక్షత్రములను వాని అనుగ్రహము కొఱకు స్తుతిరూపమైన వాక్కుచేఁ గొల్చెదను.

౨. కృత్తికారోహిణులు ఆహ్వానమునకునర్హములు, మృగశిర శుభప్రదము, ఆర్ద్రా సుఖకారి, పునర్వసులు రెండును సత్యవాక్కుకలవి, పుష్యమి చక్కనిది, ఆశ్లేష వెలుతురుకలది, మఖ గంతవ్యస్థానము నాకగునుగాక.

౩. పూర్వోత్తరఫల్గునులు, హస్త, పుణ్యప్రదలు, చిత్ర శివప్రదము, స్వాతి సుఖము, రాధనామాంతరము గల విశాఖలు రెండును అనుగ్రహవంతులు, అనూరాధ పిల్చుటకు సులభమైనది, జ్యేష్ఠ మంచినక్షత్రము, మూల అరిష్టములేనిది నాకగుఁగాక.

౪. పూర్వాషాఢ అన్నము, ఉత్తరాషాఢ బలము, అభిజిత్తు పుణ్యము, శ్రవణము శ్రవిష్ఠలు (ధనిష్ఠ) పుష్టి నాకు నిచ్చుఁగాక.

౫. శతభిషము గొప్పఫలమును, ప్రోష్ఠపదములు రెండు (పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర) సుఖమును రేవత్యశ్వినులు భాగ్యమును, భరణి ధనమును, నాకు నిచ్చుఁగాక !

. ఒకానొక పండితుఁడు అయన చలనము నకు సూక్ష్మగణితముచేసి పైని ఉదాహరింపఁ బడిన సూక్తము క్రీ. శ. ౧౪౭౮-వ సంవత్సరమునకుఁ బూర్వము ౩౨౯౮ ఏండ్లక్రింద రచియింపఁబడియుండవలెనని సిద్ధాంతీకరించి యున్నాఁడు.*

కొందఱు పండితుల యభిప్రాయాను సారము అథర్వవేదము సంహితా రూపమును ధరించుటకును, నాల్గవ వేదమన్న గౌరవమును బొందుటకును, మిక్కిలి కాలము పట్టినను అందలి విడివిడి సూక్తములు కొన్ని మొదటి నుండియు—ఒకవేళ ఋగ్వేదము సంహితగా నేర్పడిన కాలమునుండియు—సంఘముయొక్క తక్కువ జాతివారిలో వాడుకగానుండెను. కాని యివి కట్టుబోతు తనమును గుఱించిన క్షుద్రమంత్రములైనందున నార్యులగువారు వానిని పెక్కుదినములవఱకు గ్రహించియుండరు. క్రమక్రమముగ నామంత్రములుకూడ సంహితా రూపమును ధరించి యితర సంహితలతోఁ బాటు యోగ్యత వహించెను. అందువలననే పూర్వ బ్రాహ్మణములలో అథర్వమును వేదముగఁ జెప్పకపోయినను, అథర్వణములను ఇతిహాస పురాణములతోఁ బాటుచెప్పిరి.

ఇప్పుడీ సంహితయొక్క శౌనకశాఖ యొక్కటే యగుపడుచున్నను చరణవ్యూహాది గ్రంథముల్లవలన దీనికి పూర్వము తొమ్మిది శాఖలుండినట్లు కనఁబడుచున్నది. అవియేవి యనః-౧ పైప్పలాద ౨ తౌద, ౩ మౌద, ౪ శౌనక, ౫ జాజల, ౬ జలద, ౭ బ్రహ్మవద ౮ దేవదర్శ, ౯ చారణవైద్యశాఖలు. ఈ తొమ్మిదిశాఖలవారికిఁ దొమ్మిది విధములైన సంహితలుండెనో, లేకయొక్కసంహితనే వారు కొంచెము మార్పుతో నుపయోగించుకొనుచుండిరో తెలిసికొనుట కిప్పుడు వేఱుసాధనమేదియు లేదు. పైప్పలాదసంహిత యొకటి యిటీవల కాశ్మీరదేశమునందు రాస్ దొర గారికి దొరకినది. దానియొక్క ప్రతికృతి (Photograph) అచ్చువేసి యున్నారు* ఇది భూర్జపత్రములమీఁద శారదలిపిలో వ్రాయఁబడియున్నది. ఈలిపి కాశ్మీరదేశమునందు వాడుకలోనున్నది. ఇందు ౨౦ కాండములుకలవు. కాని దీనికిని శౌనక శాఖ సంబంధమైన వాడుకలోనున్న సంహితకును జాలభేదము కలదు. ౧౯-వ కాండములోని పెక్కుసూక్తము లిందుఁగానరావు. ఇరువదవ కాండమందలి సూక్తము లీ గ్రంథమునందుఁ గానవచ్చినను, ఒక్కచోటఁగానరావు. పెక్కు కాండములలోఁ గానవచ్చును. ఋగ్వేదము నుండి తీసికొనఁబడిన మంత్రములు ౨౦-వ కాండమునందులేవు. స్వతంత్రములైన కొద్ది

అథర్వవేదశాఖలు

*The Theosophist, Sept. 1881, Vol. 2. No. 12.

*The Reproduction on 54 plates, edited by M. Bloomfield and R. Garth (Baltimore) 1901.

సూక్తములుమాత్రముకలవు. ఇందు రమారమి ఆఱువవంతు క్రొత్తసూక్తములున్నవి. ఈ సంహితకును శౌనక సంహితకును గల భేదమును గుఱించి యింకను శోధింపవలసియున్నది.

విష్ణుపురాణమునందు నీవేదము యొక్క శాఖాభేదములు మఱియొకవిధముగఁ జెప్పఁబడియున్నవి. వేదవ్యాసుఁడు సుమంతుఁడను తన శిష్యునకు నథర్వవేదమునేర్పెను. అతఁడు కబన్ధుఁడను వానికి నేర్పెరు. కబంధుఁ డా వేదములను రెండు భాగములుగఁజేసి దేవదర్శుఁడనువానికి, పథ్యుఁడను వానికి నిచ్చెను. దేవదర్శుఁడు నాలుగు విభాగములుచేసి మేధ, బ్రహ్మబలి, శౌష్కాయనుఁడు* పిప్పలాదుఁడు అను నల్గురు శిష్యుల కిచ్చెను. పథ్యుఁడను వాఁడు మూఁడు విభాగములుచ్ఛేసి, జాబాలి, కుముదుఁడు, శౌనకుఁడు అనువారికిచ్చెను. శౌనకుఁడు రెండుగ విభజించి బభ్రువను వానికి, సైంధవుఁడనువానికి నిచ్చెను. సైంధవుఁడనువాఁడు తానొక శాఖా ప్రవర్తకుఁడై, ముంజకేశుఁడనువానిని మఱియొక శాఖా ప్రవర్తకునిగఁజేసెను. [విష్ణుపురాణము 3-౬.

శౌనకశాఖకు సంబంధించిన అథర్వవేద సంహిత మొదట జర్మనీరాజధానియైన బర్లినులో ౧౮౫౫-వ సంత్సరమునందు ఆర్. రాథ్, డబ్ల్యు. డి. విట్నీ అను పాశ్చాత్య పండితద్వయముచేఁ బ్రకటింపఁబడినది. ఈ సంహితయే సాయణభాష్యముతో ౧౮౯౫-వ సంవత్సరమున బొంబాయిలో శంకరపాండురంగ పండిత అను నాతఁడు ప్రకటించెను. కానిసాయణభాష్యము అన్నికాండములకును దొరకినది కాదు. ౫, ౯, ౧౦, ౧౨-౧౬ ఈ కాండములకు సాయణ భాష్యము ముద్రితము కాలేదు. ఎవరైనను సంపాదించి ముద్రింపించిన వైదిక పండితులమీఁది మహోపకారమగును.

చరణవ్యూహమను గ్రంథమున, నథర్వవేదమునందు ౧౨౩౦౦ మంత్రములు (ఋక్కులు) ఉన్నవి* యని యున్నను, ఇప్పుడు కానవచ్చెడు శౌనకసంహిత ననుసరించి యీవేదమునందు ౭౩౧ సూక్తములును, రమారమి ౬౦౦౦ మంత్రములునుగలవు. ఈ లెక్క బొంబాయిలో శంకరపాండురంగ పండితులచేఁ బ్రకటింపఁబడిన సంహిత ననుసరించి యీయఁబడినది. బర్లినులోఁ బ్రకటింపఁబడిన సంహితయందును, బంగాలి విశ్వకోశ ముఖ్య సంపాదకునిచే నుపయోగింపఁబడిన సంహితయందును గొంచెము కొంచెముగ భేదముకలదు. సూక్తాదిక వివరమును, బర్లిను బొంబాయి ప్రతులకుఁగల భేదమును, ఈ ప్రక్కనీయఁబడిన పట్టికయందుఁ జూపఁబడినది.

గ్రంథ విభాగములు

* 'మౌద' అనిపాఠాంతరము. 'శౌల్కాయని' యని పాఠాంతరము.

* "ద్వాదశానాంసహస్రాణి మంత్రాణాం త్రిశతానిచ"

# అథర్వవేద పరిమాణపట్టిక

(బొంబాయి ప్రతినిబట్టి)

| కాండ సంఖ్య | సూక్త సంఖ్య | ప్రపాఠక సంఖ్య | అనువాక సంఖ్య | ఋక్ సంఖ్య | విశేషాంశములు |
|---|---|---|---|---|---|
| ౧ | ౩౫ | ౧,౨ | ౬ | ౧౫౩ | |
| ౨ | ౩౬ | ౩,౪ | ౬ | ౨౦౭ | |
| ౩ | ౩౧ | ౫,౬ | ౬ | ౨౩౦ | |
| ౪ | ౪౦ | ౭,౮,౯ | ౮ | ౩౨౪ | |
| ౫ | ౩౧ | ౧౦,౧౧,౧౨ | ౬ | ౩౭౬ | |
| ౬ | ౧౪౨ | ౧౩,౧౪,౧౫ | ౧౩ | ౪౫౪ | |
| ౭ | ౧౨౩ | ౧౬,౧౭ | ౧౦ | ౨౮౬ | బర్లిన్ ప్రతియందు ౧౧౮ సూక్తములే కలవు. |
| ౮ | ౧౦ | ౧౮,౧౯ | ౫ | ౨౯౩ | బర్లిన్ ప్రతియందు ౨౮౯ ఋక్కులు కలవు. |
| ౯ | ౧౦ | ౨౦,౨౧ | ౫ | ౩౧౩ | బర్లిన్ ప్రతియందు ౩౦౨ ఋక్కులు కలవు. |
| ౧౦ | ౧౦ | ౨౨,౨౩ | ౫ | ౩౫౦ | |
| ౧౧ | ౧౦ | ౨౪,౨౫ | ౫ | ౩౬౭ | బర్లిన్ ప్రతియందు ౩౧౩ ఋక్కులు కలవు. |
| ౧౨ | ౫ | ౨౬,౨౭ | ౫ | ౩౦౪ | |
| ౧౩ | ౪ | ౨౮ | ౪ | ౧౮౮ | |
| ౧౪ | ౨ | ౨౯ | ౨ | ౧౩౯ | |
| ౧౫ | ౧౮ | ౩౦ | ౨ | ౨౨౦ | బర్లిన్ ప్రతియందు ౧౪౧ ఋక్కులు కలవు. |
| ౧౬ | ౯ | ౩౧ | ౨ | ౧౦౩ | బర్లిన్ ప్రతియందు ౯౩ ఋక్కులుకలవు. |
| ౧౭ | ౧ | ౩౨ | ౧ | ౩౦ | |
| ౧౮ | ౪ | ౩౩,౩౪ | ౪ | ౨౮౩ | |
| ౧౯ | ౭౨ | ...... | ౭ | ౪౫౬ | |
| ౨౦ | ౧౪౩ | ...... | ౯ | ౯౪౧ | బర్లిన్ సంపాదకులు ఈకాండమందు ౧౦ సూక్తములను ౧౫౦ ఋక్కులను మాత్రము గ్రహించిరి. |
| ౨౦ | ౭౩౬ | ౩౪ | ౧౧౧ | ౬౦౧౯ | |

☞ ౧౯-వ కాండము వఱకును బొంబాయి ప్రతికిని బర్లిన్ ప్రతికిని విశేష భేదములేదు. విషయము ఒక్కటియే. కాని ౭-వ కాండమంతయు బర్లిన్ ప్రతిలో ౧౧౮ సూక్తములుగనే విభజింపఁబడినది. బొంబాయి ప్రతిలో అనుక్రమణి ననుసరించి ౧౨౩ సూక్తములుగ విభజింపఁబడినవి. అట్లే ౮-వ, ౯-వ, ౧౧-వ, ౧౫-వ, ౧౬-వ కాండములందలి కొన్ని పర్యాయ సూక్తములలోని రెండు పర్యాయములకు బర్లిన్ ప్రతిలో [illegible] సంఖ్యయే యీయఁబడినందున మొత్తముమీఁద ౧౮౯ ఋక్కులసంఖ్య తగ్గినది. ముఖ్యభేదము ౨౦-వ [illegible] మునందున్నది. ఈ కాండము బర్లిను వారికిఁ బూర్తిగ దొరకినట్లు లేదు. బొంబాయివారి ప్రతియుఁ [illegible] సంశయములతో నిండియున్నది. బర్లిను ప్రతి ననుసరించి చూడఁగా అథర్వ వేదమునందు ౫౯౭ సూక్తములును, ౫౦౩౮ ఋక్కులును గలవు. అనఁగా, అథర్వవేదసంహిత ఋగ్వేదసంహితలో సగమున్నదని [illegible].

సంహితయంతయు నిరువది కాండములుగను, కాండ మొకటి యిన్ని సూక్తములుగను, సూక్త మొకటి యిన్ని మంత్రములుగను విభజింపఁబడినది. మంత్రములనే ఋక్కులనియెదరు. కాండమునకిన్ని సూక్తములుండవలెననిగాని సూక్తమున నిన్ని మంత్రములుండవలెననిగాని నియమములేదు. ౧౭-వ కాండమున నొక్కటే సూక్తము కలదు; ౨౦-వ కాండమున ౧౪౩ సూక్తములుకలవు! ౧-వ కాండమందలి సూక్తములలో నాలుగు నాలుగు ఋక్కులే యున్నవి; ౧౧-వ కాండమందలి సూక్తములు ౬౦ ఋక్కులుగలవి! ఇది ముఖ్య విభాగము. ఈ వేదము నందలి యే మంత్రమునైన నుదాహరింప వలెనన్న ఇన్నవ కాండము, ఇన్నవసూక్తము, ఇన్నవ మంత్రము అనినఁ జాలును.

ఇఁక నీకాండములయు, సూక్తములయు రచనను గుఱించి విచారింపఁగా, ౧-మొదలుకొని ౭-వ కాండమువఱకు సూక్తములు వానియందలి మంత్రముల సంఖ్య ననుసరించి యేర్పాటు చేయఁబడినట్టు కానవచ్చును. ౧-వ కాండమందలి ప్రతి సూక్తమందును సరాసరి నాలుగు ఋక్కులును, ౨-వ కాండమందలి ప్రతి సూక్తమందును అయిదు ఋక్కులును, ౩-వ కాండమందలి ప్రతిసూక్తమందును నాఱుఋక్కులును, ౪-వ కాండమందలి ప్రతిసూక్తమందు నేడుఋక్కులును, ౫-వ కాండమందలి ప్రతిసూక్తమందు నెనిమిదిమొదలు పదునెనిమిదివఱకు ఋక్కులును, ౬-వ కాండమందుఁ బ్రతిసూక్తము మూఁడు ఋక్కులును, ఏడవ కాండమందలి సగముకంటె నెక్కుడుసూక్తములందు నొక్కొక ఋక్కును గలవు. ౮-మొదలు ౧౨-వ కాండమువఱకుఁ బెద్దపెద్ద సూక్తములుకలవు. ఇందు విషయము ననుసరించి సూక్తములను ఏర్పాటు చేయలేదు. సమ్మిశ్రయముగ నున్నవి. ౧౩-౧౮ కాండములవఱకు విషయముల ననుసరించి సూక్తము లేర్పాటు చేయఁబడినవి. ౧౪-వ కాండమందలి సూక్తములు వివాహ విషయకములు. అందలి ఋక్కులు చాలభాగమువఱకు ఋగ్వేదమందలి వివాహవిషయక ఋక్కులే. ౧౫-వ కాండమున 'వ్రాత్యస్తుతి' కలదు. ౧౬-౧౭కాండములలో నభిచారమంత్రములు కలవు. ౧౫-వ కాండమంతయు, ౧౬-వ కాండమందలి కొంతభాగమును గద్యముగా నున్నది. ఈగద్యము బ్రాహ్మణముల గద్య రచనవలె నుండును. ౧౬-౧౭-వ కాండములు మిక్కిలి చిన్నవి. ౧౬ నందు ౯ సూక్తములును, ౧౭ నందు ౧ సూక్తమును గలదు. ౧౮-వ కాండమునందు అంత్యవిధిని గుఱించియు, పితృగణములను గుఱించియుఁ గలదు. ఇవి ఋగ్వేదము ౧౦-వ మండలము నుండి గ్రహించినఋక్కులు. చివరవియైన ౧౯-౨౦ కాండములు రెండును వెనుకనుండి కలపఁబడినవి యని కొందఱు పండితుల యభిప్రాయ

ము. అథర్వవేదప్రాతిశాఖ్యమను వైదికవ్యాకరణమునందు నీరెండుకాండములును ఉదాహరింపఁబడియుండలేదు. ౧౯-వ కాండమునందు చిల్లరసూక్తములన్నియు మిశ్రమముచేయఁబడినవి. అందుఁ జాలభాగము పరిశుద్ధముగలేదు. కొన్ని సూక్తములు తప్ప ౨౦-వ కాండమందలి సూక్తము లన్నియు ఇంద్రసూక్తములు. ఇవి యేవిధమైన మార్పు చేయకుండ ఋగ్వేదమునుండి యెట్లున్న వట్లు ఎత్తి వ్రాయఁబడినవి. మొత్తముమీఁద నథర్వవేద మందలి ౬౦౦౦ మంత్రములలో ౧౨౦౦ మంత్రములు ఋగ్వేదమునుండితీసికోఁబడినవి. ఇతరకాండములలో ఋగ్వేదమునుండి తీసికొనఁబడిన మంత్రములలోఁ గొంతమార్పుచేయఁబడినది. ౨౦-వ కాండము నందలి ఋగ్వేదమంత్రములకు మార్పులేదు. ఇందువలన నీకాండము నూతనమనుట స్పష్టము. ఈ కాండమంతయు సోమయజ్ఞ విషయమైనది. అది యథర్వవేద విషయమునకు సంబంధించినది కాదు. ౨౦-వ కాండమందలి గద్యభాగమును (౪౮-౪౯ సూక్తములును), కుంతాప సూక్తములును (౧౨౭-౧౩౬ సూక్తములును) స్వతంత్రములు. అనఁగా నితర గ్రంథములనుండి తీసికొనఁబడినవికావు.

ప్రపాఠక విభాగము

ఈ వేదమునందు స్వతంత్రమైన ప్రపాఠక విభాగమొకటి కలదు. ప్రపాఠక మనఁగా నొక్కపాఠమునకుఁ దగినంతభాగ మని తోఁచుచున్నది. ఈవిభాగమునకు కాండములకును సంబంధములేదు. ఇన్నవ కాండమని చెప్పిన నిన్నవ ప్రపాఠకమన నవసరములేదు. ఇన్నవ ప్రపాఠక మనిన నిన్నవ కాండమన నక్కఱలేదు. ప్రపాఠకవిభాగము ౧౮-వ కాండము వఱకేయున్నది. ౧౯-వ, ౨౦-వ కాండములందు ఈ విభాగములేదు. ఇందువలనఁ గూడ నాకాండము లితరకాండములకంటె నాధునికములని యూహించెదరు. కాండమునకును ప్రపాఠమునకును సంబంధము లేకపోయినను ఒకకాండము చివరభాగము, రెండవకాండము మొదటిభాగముకలిసి ఒకప్రపాఠక మెప్పటికిఁ గాదు. కాండముచివర ప్రపాఠకముకూడ పూర్తియగును. మొత్తముమీఁద ౧౮-వ కాండము చివరవఱకు ౩౪ ప్రపాఠకములు కలవు. అనువాక విభాగముగూడ నొకటికలదు.

మొదటిమంత్రమేది?

రాథ్, విట్నీగార్లచే జర్మనీయందుఁ బ్రకటింపఁబడిన యథర్వసంహితయందును, బొంబాయిలో శంకరపాండురంగపండితునిచేఁ బ్రకటింపఁబడిన సంహితయందును సాధారణముగ నిప్పుడుదొరకు నథర్వసంహిత ప్రతులయందును, ఈ క్రింది మంత్రము ప్రథమమంత్రముగ నున్నది:-

యే త్రిషప్తాః పరియన్తి విశ్వా రూపాణి బిభ్రతః । వాచస్పతిర్బలాంతేషా తన్వో అద్య దధాతు మే॥

అర్థము:—విశ్వమందలి యన్ని రూపములను ధరించి తిరుగుచుండెడి త్రిసప్తుల (మూఁడు ఏడ్లు, అనఁగా పెక్కు దేవతల) యొక్క బలమును తనువును వాచస్పతి నాకునిచ్చుఁగాక.

సాయణాచార్యులవారు, ఈ మంత్రమునే ప్రథమ మంత్రముగా గ్రహించి భాష్యము చేసియున్నారు.

కాని యిప్పటి యథర్వసంహితలలో ౧-వ కాండమందు ౬-వ సూక్తమునకుఁ బ్రథమ మంత్రముగనున్న ఈ క్రిందిఋక్కు అథర్వవేదమునకుఁ బ్రథమ మంత్రమని వాడుక వైదికపరంపరగ వచ్చుచున్నది:-

శం నో దేవీరభిష్టయ ఆపోభవన్తు పీతయే
శం యోరభి స్రవన్తు నః.

అర్థము:—దివ్యమైన యీజలములు మాఅభీష్టము కొఱకు, మాపానముకొఱకు శుభప్రదములగుఁగాక; మాకు నవి యారోగ్యమును సుఖమును గురిపించుఁగాక.

ఈమంత్రమును గుఱించి యొక విశేషము కలదు. ఇది నాల్గువేదములలోను గానవచ్చుచున్నది. ఋగ్వేదమందు (౧౦. ౯. ౪), శుక్లయజుశ్శాఖయగు వాజసనేయ సంహిత యందు (౩౬. ౧౨), కృష్ణయజుశ్శాఖ యందు, తైత్తిరీయ బ్రాహ్మణమందు (౧. ౨. ౧.), సామవేదమునందు (౧. ౩౩) ఈ మంత్రము బహుస్వల్ప పాఠభేదములతో నగుపడుచున్నది. ఈమంత్రము అథర్వవేదమునకు మొదట నుండెనని యీక్రింది యాధారములవలనఁ గనఁబడుచున్నది:-

౧. శంనో దేవీ రభిష్టయ ఇత్యేవమాదిం కృత్వాథర్వ వేదమధీయతే. [గోపథ.౧. ౨౯.

'శంనో దేవీరభిష్టయ' అనునది యాదిచేసికొని అథర్వవేదమును అధ్యయనము చేయుదురు.

౨. బ్రహ్మయజ్ఞమునందు నన్ని వేదముల ప్రారంభ మంత్రములను జెప్పెదరు. అందు నథర్వవేదము ప్రారంభము 'శంనో దేవీరభిష్టయ' అన్నమంత్రముగాఁ జెప్పెదరు. బ్రహ్మయజ్ఞవిధాన మేర్పడినపుడు యథర్వేదమునకు మొదట నీమంత్ర ముండెనని యూహింపవలెను గదా?

౩. రాథ్, విట్నీలచే సంపాదింపఁ బడిన కొన్ని అథర్వవేద లిఖితప్రతులలోఁగొన్నింటిలోను, (I, R, O, Op)* శంకర పాండురంగ పండితునిచే సంపాదింపఁబడిన లిఖితప్రతులలో నొక్కదానిలోను (Sm**) 'శంనో దేవీ' యనునదియే మొదటి మంత్రముగనున్నది

౪. హలాయుధుఁ డనువాఁడు 'బ్రాహ్మణ సర్వస్వ' మను గ్రంథమును రచించెను. అందునాతఁడు,అథర్వవేదమునకు 'శంనో దేవీ' యనునదియె మొదటి మంత్రమనెను.

[విశ్వకోశము

౫. అథర్వ వేదముయొక్క పరిశిష్టములనఁబడుగ్రంథములలోఁ గొన్నిటిలో 'శంనో

---

* "*Sam no* as initial stanza of the Vulgate text—Whitney notes that this stanza is also found prefixed to the text of the Vulgate in four of the *mss* used by him, to wit, L. and R. and O. and Op." *Harvard Oriental Series*, Vol 7, p. C XVI.

** Critical notice P. 5.

దేవీ' యను మంత్రమును మొదటిప్రతీకముగ నీయఁబడినది. *

౬. మహాభాష్యమునందుఁ బతంజలి 'శంనోదేవీ'యను మంత్రమునుఅథర్వవేదమునకు మొదటి మంత్రముగ నిచ్చినాఁడనియు, నావేదమును, ఇతర వేదములకంటె శ్రేష్ఠమని చెప్పినాఁడనియుఁ గొందఱు పాశ్చాత్య పండితులు వ్రాసియున్నారు. ** కాని 'నవధాథర్వణో వేదః' అన్న వాక్యముతప్ప, ఈయర్థమిచ్చు వాక్యములేవియు మాకు నిప్పుడు బొంబాయిలో నచ్చుపడ్డ మహాభాష్యమునందుఁ గానరాలేదు. ఇతర ప్రతులలో నుండిన నుండవచ్చును.

పై ఆధారము లన్నియుఁ బట్టిచూడఁగా నొకప్పుడు 'శంనోదేవీ' యను మంత్రము అథర్వ వేదమునకు మొదటిది అయినట్టును తరువాత 'యే త్రిషప్తాః' యన్న మంత్రము ప్రథమస్థాన మాక్రమించినట్టును కానవచ్చుచున్నది. కొందఱు "పైప్పలాదశాఖకు 'శంనోదేవీ' యనునది మొదటిమంత్రమై యుండనోపు, శౌనక శాఖకు 'యే త్రిషప్తాః' అనునది మొదటిమంత్రమై యుండనోపు" అని యూహించెదరు. పైప్పలాద సంహితప్రతి కాశ్మీరములో దొరకినదితప్ప వేఱు లేదు. అందు మొదటిమంత్రము లేదు. కావున నిదమిత్థమ్మని స్పష్టముగఁ జెప్పుటకు వీలులేదు.

రచనా విశేషము

ఈవేదము ఋగ్వేదమువలెఁ బూర్తిగ ఛందోమయము కాదనియు, గద్యపద్యాత్మకమనియుఁ జెప్పియున్నాము. మొత్తముమీఁద నిందలి యాఱవవంతు గద్యాత్మకము. ౧౫-౧౬-వ కాండములు పూర్తిగ గద్యమునందు వ్రాయఁబడినవి. ఈ గద్యము ఐతరేయాది బ్రాహ్మణముల గద్యమువలె నుండును. ఛందోమయమైన భాగమునందు ఋగ్వేదాదికములందలి త్రిష్టుప్‌గాయత్రి మొదలయిన ఛందస్సులే వాడఁబడినను, బుద్ధిపూర్వకముగనో అజ్ఞానముచేతనో ఋక్ఛందశ్శాస్త్ర నియమములను బాటింపక యిష్టమువచ్చినట్లు మార్పులుచేయఁబడినవి. ౧౬-వ కాండమునఁ గొన్ని గద్యసూక్తములుగలవు. వానిలోఁ గొంతభాగము ఛందోమయముగ నుండును. మిగిలినది యట్లుండదు. పూర్తిగ ఛందోబద్ధములుకాని పద్యములును, గద్యములును, ఇష్టమువచ్చినట్లు ఈవేదమునఁ గలపఁబడినవి. ఒకప్పుడిదిగద్యమా? పద్యమా? యని కనుఁగొనుటకుఁ గూడ వీలుండదు.

* Bloomfield's Kausika Sutra, Introduction XXXVII & XXXVIII.

** "Mahabhashya not only mentions its Samhita (Saunakya or Paippalada) by the term 'శంశోంగిరసాః' but is peculiar in placing it, or rather its opening Stanza, 'శంనోదేవి' at the head of the list of Vedic writings. The scholialist explains this unusual position of the Atharvaveda on the ground that all sacrifices begin with the expulsion of demons (rakshasas and pisachas) from the sacrificial ground." [rundiss Indo-Arischen Philologie- The Atharvaveda, Strassburg 1899, p. 27].

వేద మంత్రములను రచించిన వారు మంత్రద్రష్టలు. వీరు ఆయా మంత్రములకుఁ గర్తలు. వేదము లపౌరుషేయములను వారు వీరిని కర్త లనక ద్రష్ట లనియెదరు. ద్రష్ట లనఁగాఁ జూచినవారు. వేదమంత్రము లంతకుఁ బూర్వమే యుండె ననియు, అవి యీ ఋషులకుఁ గ్గానవచ్చిన వనియు వీరి తాత్పర్యము. ఏ యే మంత్రమునకుఁగర్తయెవఁడో సాధారణముగ ఋగ్వేదాది మంత్రములవలనఁ దెలియును. కాని అథర్వవేద మంత్రములవలనఁ దెలియదు. కొద్ది మంత్రముల కర్తలను మంత్ర మందలి విషయమువలనఁ గనుఁగొనినను పెక్కు మంత్రముల కర్తలఁ దెలిసికొనుటకు వీలు లేదు. ఇచ్చటఁ బూర్వ పరంపరయే యాధారము. అనుక్రమణు లన్న గ్రంథములలో ఏ యే సూక్తము లెవ్వరెవ్వరు రచించినది యీయఁబడును. మంత్ర ద్రష్టలఁ దెలిసికొనుటకు మనకు నివియే యాధారములు. బృహ దనుక్రమణిక (పంచ పటలిక) లో నథర్వవేదపు ఋషుల పేళ్ళీయఁబడినవి. ఇట్టి ఋషులు రమారమి యెనుబది మంది కలరు. వారి నామము లీప్రక్క పట్టికలో అకారాదిగ నిచ్చుచున్నాము. ఒక్క సూక్తమునందలి వేఱు వేఱు మంత్రములకు భిన్న ఋషులుండరు. ఒక్క సూక్తమునకుగాని పెక్కు సూక్తములకుగాని ఒక్కఋషియో, యిద్దఱు ఋషులు కలిసియో యుందురు.

అథర్వవేదపు మంత్రద్రష్టలు

పట్టికలో నీయఁబడిన ఋషినామములలోఁ గొన్నికల్పితములుగఁ గాన వచ్చుచున్నవి. అంత్యవిధికి యముఁడు, వివాహ మంత్రములకు సూర్యా సావిత్రి, షామమంత్రములకు గరుత్మంతుఁడును, పురుషసూక్తమునకు నారాయణుఁడును ఋషులుగాఁ జెప్పఁబడుట చూడ అను క్రమణులు వ్రాసినవారు వారివారి యూహాలనుబట్టి దేవతలనుగూడ మంత్రద్రష్టలుగఁ జెప్పిరని మనమూహింపవచ్చును. ఈ ఋషులలో 'బాద్గరాయణి' యన్న ఋషి యెవఁడై యుండనోపు? వ్యాసునకుఁ గుమారుఁడు శుకుఁడు లేక మఱియొక బాదరాయణి పూర్వఋషులలో నుండెనా?

వీరిలోఁ బెక్కుమంది ఋగ్వేదాది ఋషులే. ఈ వేదమునందలి యెక్కువసూక్తములను 'అథర్వ' ఋషియు, 'బ్రహ్మ' ఋషియు రచించినట్లు కానవచ్చుచున్నది. అథర్వఋషి ౧౨౫ సూక్తములకుఁగర్త. బ్రహ్మ ౧౦౦ సూక్తములనురచించెను. అథర్వాంగిరసులుకలిసి ౧౭ సూక్తములకు, అంగిరసుఁడు ౧౬ సూక్తములకుఁగర్తలు. భృగువు ౨౨ సూక్తములకు, భృగ్వంగిరసులు ౨౨ సూక్తములకును గర్తలు. మిగిలిన ఋషులందఱును పదిసూక్తములకు లోపు రచించినవారే కాని అధికము చెప్పినవారులేరు. ఇందువలన ఈవేదమునకు అథర్వవేదము, బ్రహ్మవేదము, అథర్వాంగిరస వేదము, భృగ్వంగిరసవేదము అనిపేర్లు ఎందుకు వచ్చెనో చదువరులకు విస్పష్టముగఁ దెలియఁగలదు.

## అథర్వవేదఋషిపట్టిక

**అ**

అంగిరసుఁడు, అంగిరసప్రాచేతసుఁడు,
అగస్త్యుఁడు, అథర్వ వీతహవ్యుఁడు,
అథర్వాంగిరసుఁడు, అథర్వాచార్యుఁడు,
అథర్వణుఁడు, అథర్వుఁడు,
అప్రతీస్థుఁడు,

**ఉ**

ఉచ్చోచనుఁడు, ఉద్దాలకుఁడు,
ఉన్మోచనుఁడు, ఉపరి బభ్రువుఁడు.

**ఋ**

ఋభు కపింజలుఁడు

**క**

కబంధుఁడు, కశ్యప మారీచుఁడు,
కశ్యపుఁడు, కణ్వుఁడు,
కాంకాయనుఁడు, కారుపతి,
కుత్సుఁడు, కౌశికుఁడు.

**గ**

గరుత్మంతుఁడు, గార్గ్యుఁడు,
గోపథ భరద్వాజుఁడు, గోపథుఁడు.

**చ**

చాతనుఁడు

**జ**

జగద్బీజంపురుషుఁడు, జమదగ్ని,
జాతికాయనుఁడు.

**త**

త్వష్ట

**ద**

ద్రవిణోదానుఁడు, ధుర్హవణుఁడు.

**న**

నారాయణుఁడు,

**ప**

పతివేదన, ప్రజాపతి,
ప్రత్యాంగీరసుఁడు, ప్రమోచనుఁడు,
ప్రశోచనుఁడు, ప్రస్కన్వుఁడు,

**బ**

బభ్రుపింగళుఁడు, బాదరాయణి,
బృహచ్ఛుక్రుఁడు, బృహద్దివ అథర్వణుఁడు,
బృహస్పతి బ్రహ్మ,
బ్రహ్మస్కందుఁడు, భగుఁడు,
భరద్వాజుఁడు, భార్గలి
భార్గవవైదర్భి, భార్గవుఁడు,
భృగువు, భృగు అథర్వణుఁడు,
భృగ్వాంగిరసుఁడు భృగ్వాంగి రసబ్రహ్మ.

**మ**

మయోభువు, మాతృనామ,
మారీచుఁడు, మృగారుఁడు,
మేధాతిథి.

**య**

యముఁడు,

**వ**

వరుణుఁడు, వసిష్ఠుఁడు,
వామదేవుఁడు, విశ్వామిత్రుఁడు,
విహవ్యుఁడు, వీతహవ్యుఁడు.
వేనుఁడు,

**శ**

శంభువు, శాంతాతి,
శుక్రుఁడు, శునఃశేపుఁడు,
శౌనకుఁడు,

**స**

సవిత, సావిత్రీ సూర్య,
సింధు ద్వీపుఁడు, సింధుద్వీప అథర్వాకృతి.

అథర్వవేదమందలి విషయములు

వింశతికాండాత్మకమై రమారమి యాఱువేలమంత్రములుకలయథర్వ సంహితయందలి విషయము లివ్వియని చెప్పుట యెవ్వరికి సాధ్యము? ఒక్కొక సూక్తమందలి విషయము కొద్దిలో వ్రాసినను నొక గ్రంథమగును. మొత్తముమీఁద సూక్తములను విషయమునుబట్టి వర్గములుగా విభజించి, యొక్కొక వర్గములోని విషయమును మొత్తముమీఁద సామాన్యముగఁజెప్పిన నీవేదమందలి విషయము లిట్టివి గదాయని కొంతవఱకుఁ జదువరులకు బోధపడినఁ బడవచ్చును. ఆ విధము ననుసరించి యథర్వ సూక్తములు పదుమూఁడు వర్గములుగ విభజింపఁబడుచున్నవి. ఈ వర్గములు పరస్పరములు, అతివ్యాప్తి విరహితములు (mutually exclusive) కావు. ఒకవర్గములోని విషయము మఱియొక వర్గమునందు నొకప్పుడు కనఁబడవచ్చును. కాని మొత్తముమీఁద భిన్నవిషయ బోధకములు. అవియేవియనిన:-

౧. రోగనివారణమునకును, దయ్యములు వదలుటకును మంత్రములు (భేషజ్యాని); ౨. దీర్ఘాయువు, ఆరోగ్యమునిచ్చుటకుఁ బ్రార్థనలు (ఆయుష్యాణి); ౩. భూతములను, మంత్రగాండ్రను, శత్రువులను, పరిభవించుటకు శాపములు (అభిచారికాని,కృత్యాప్రతిహరణాని); ౪. స్త్రీసంబంధములైన మంత్రములు (స్త్రీకర్మాణి); ౫. ఐక్యాభివృద్ధికి, అధికారము హెచ్చుటకు మంత్రములు (సామనస్యాని); ౬. రాజునకు సంబంధించిన మంత్రములు (రాజకర్మాణి); ౭. బ్రాహ్మణులకు సంబంధించిన మంత్రములు; ౮. యోగక్షేమాభివృద్ధికి మంత్రములు (పౌష్టికాని); ౯. ప్రాయశ్చిత్త మంత్రములు (ప్రాయశ్చిత్తాని); ౧౦. సృష్టిసంబంధమైనవియుఁ బరతత్త్వసంబంధమైనవియు నగు సూక్తములు; ౧౧. సంస్కార సంబంధమైన సూక్తములు; ౧౨. వేఱువేఱు విషయములను గుఱించి చర్చించు కాండములు (౧౩-౧౮ కాండములు); ౧౩. కుంతాప సూక్తములు. ఇఁక నీపదుమూఁడు విధముల సూక్తములను గుఱించి కొద్దికొద్దిగా వివరించి, యొక్కొక విషయమును జూపుటకు రెండేసి గాని మూఁడేసిగాని సూక్తములాంధ్రీకరింపఁబడును.

౧. భేషజ్యాని

భేషజ్యాని, అనఁగా రోగనివారణ సంబంధములైనసూక్తములని యర్థము. ఈ వేదమునందు వేఱువేఱు రోగములు పోవుటకు వేఱువేఱు మంత్రములు చెప్పఁబడియున్నవి. తరువాత నభివృద్ధిచెందిన యాయుర్వేదమను వైద్యశాస్త్రమునకు నివి బీజభూతములనిచెప్ప వచ్చును. ఇందుఁజెప్పఁబడిన మంత్రములు, తాయెతులు, మూలికలు, మూఢ విశ్వాస పాత్రములై యుండును. కాని, మానవుల బాల్యావస్థలో నిట్టిమూఢవిశ్వాసములు సహజములు. ఇంగ్లీషువారి పూర్వులును, జర్మనీ

వారి పూర్వులును, ఇట్టి విశ్వాసముచే కలిగి యుండిరి!

జ్వరము, వరుసజ్వరములు, పసరికలు, [illegible] రక్తము కారుట, అజీర్ణము, జలోదరము, కుష్ఠు, గాయములు, క్రిములు పడుట, [illegible]రోగములు, విషము మొదలయిన లెక్కకు మించిన రోగములకు నివారణోపాయముల యిన మంత్రములున్నవి. ఇవి మందులు కావు. మంత్రములు! ఈమంత్రపఠనమువలననవిపోవు నని తాత్పర్యము. కొన్నిచోట్ల సహజముగఁ గొన్ని మందులుగూడఁ జెప్పఁబడినవి. గాయములకు మిరపగింజమందనియు(౬-౧౦౯), పీనలు విషమును బోఁగొట్టుననియు (౬-౧౦౦), అజశృంగియను నోషధి గంధర్వాప్సరో రాక్షసులఁ బోఁగొట్టుననియుఁ (౪-౩౭) జెప్పఁబడియున్నది. సాధారణముగా నిందు మందులుగాని, ఇతరోపచారములుగాని చెప్పఁబడియుండక పోయినను సూత్రకారు లచ్చటచ్చట గొంతవఱకుఁ జెప్పుచుఁబోయినారు. సాయణాచార్యులు తన భాష్యమునందు వానిని సంగ్రహించుచుఁబోయినాఁడు. ఇందునకు రెండుదాహరణములఁ జూపుచున్నాఁడ.

(౧) ౧-వ కాండమందలి ౧౭-వ సూక్తము, శస్త్రమువలనఁ దాకిన దెబ్బలోనుండి కారు రక్తమును నాపుటకుఁ బుట్టినది. దానికి సాయణాచార్యులవారు, ఉపోద్ఘాత మిట్లు వ్రాసిరి.

"శేస శస్త్ర ఘాతాది రుధిర ప్రవాహస్య......నివృత్తయే సంచపర్వణాదండేన రుధిరవషానస్థానాభిమంత్రణం వ్రణముఖే రథ్యాపాంసుసికతా ప్రక్షేపణాదికమ్ । అర్కకపాలికాబంధనంచ, ఇత్యేవ మాథికుర్యాత్."

సూత్రంచ "అమూర్యా ఇతిపంచ పర్వణాపాంసుసికతాభిః పరికిరత్యర్కకపాలికాం బధ్నాతిపాయయతి" ఇత్యాది. [కౌ-౪.౨.

అర్థము:—ఈ సూక్తము శస్త్రఘాతముచేఁ గలిగిన రక్త ప్రవాహము నాపుటకు (ఉపయోగింపవలెను). అయిదు గణుపులు గలకఱ్ఱతో నెత్తురు కారుచున్న స్థలము నభిమంత్రించి, వ్రణముఖమున వీథిలోదుమ్ము, ఇసుక, చల్లవలెను. ఎండిసబురుద కట్టవలెను. [కౌ-౪.౨.

(౨) ౧-వ కాండమునందలి ౨౫-వ సూక్తము, శీతజ్వరాదికములు నివారించుటకునై ఉపయోగింతురు. దానికి ఈ ఉపోద్ఘాతము కలదు.

"ఏకాహికాది శీతజ్వరసంతతజ్వరవేలాజ్వరాదిశాంతయే 'యదగ్నిరాపః' ఇతిసూక్తం జపేత్ । లోహకుఠారమ్ అగ్నౌసంతాప్య ఉష్ణోదకమధ్యే స్థాపయిత్వా తేనోదకేన వ్యాధితమ్ అభిషిఞ్చేత్।తథాచకౌశికః యదగ్నిరితి జపతి పరశుంతాపయతి క్వాథయత్యవసించతి ఇతి" [కౌ-౪.౨.

అర్థము:—ప్రతి దినము, దినమువిడిచి దినము, వచ్చు జ్వరములు మొదలయినవి.

శాంతించుటకు, ఈసూక్తమునుబఠింపవలెను. ఇనుపగొడ్డలి నిప్పులోకాచి, వేడినీళ్లలో వేసి ఆనీళ్లతో రోగిని అభిమన్త్రింపవలెను.

ఇఁక నీవిభాగమును, ఉదాహరించు రెండు సూక్తముల భాషాంతరీకరించుచున్నాము.

## ౧. రక్తమును ఆపుటకు

(౧-వ కాండము; ౧౭-వ సూక్తము.)

౧. ప్రవహించుచున్నవియు, రక్తమునకు నివాస భూతములయినవియూ నగు నీరక్తనాడులు (సిరలు) తోడఁబుట్టినవాండ్రులేని చెల్లెండ్రవలె హతవర్చసలై యాగిపోవును గాక.

౨. ఓ అధోభాగవర్తినియైన రక్తనాడీ (సిరా, ధమనీ)! ఆగిపో, ఊర్ధ్వనాడీ! (రక్తము ప్రవహించుట) ఆగిపో, మధ్యమనాడీ! ఆగిపో, అన్నిటికంటెఁ జిన్న నాడీ! ఆగిపో, అన్నిటి కంటెఁ బెద్దనాడీ! ఆగిపో.

3. నూఱు ధమనులలో (హృదయ గతమైన ప్రధాన నాడులలో) వేయిసిరలలో (శాఖానాడులలో) ఈనడిమివి ఆగిపోయినవి, మిగిలిననాడులన్నియు నాగిపోయినవి.

౪. ఓ నాడులారా! మిమ్ము నిసుకతోఁజేయఁబడిన పెద్దధనుస్సు చుట్టు నాక్రమించినది. కావున మీరు ఆగిపోవుఁడి. ఈ జనునకు సుఖమునీయుఁడి.

## ౨. జ్వరమును బోఁగొట్టుటకు

(౧-వ కాండము; ౨౫-వ సూక్తము)

౧. అగ్ని నీటిలోఁ బ్రవేశించి దానిని దహించెను. ధర్మవిదులు దానిని బ్రశంసించిరి. ఆ అగ్నియందు, ఓతక్మన్ (జ్వరమా!)నీదిగొప్పపుట్టుకయని చెప్పెదరు. కావున మమ్ము విడిచివెళ్లుము.

౨. ఓ తక్మన్! నీవు జ్వాలారూపము కలదానవైనను, ఉష్ణగుణముకలదానవైనను, శరీరసంతాపకారిణివైనను, నీపుట్టుకస్థలము కాష్ఠములైనను, పచ్చటియో దేవా! నీనామము హ్రూడు. మమ్ము విడిచి పొమ్ము.

3. ఓతక్మన్! నీవు శరీరమును లోపలశోషింపఁజేయువాఁడవైనను, శరీరమంతట శోషింపఁజేయువాఁడవైనను, రాజయిన వరుణుని కుమారుఁడవైనను, 'హ్రూడు' అను నామము కలవాఁడా! మమ్ము విడిచి పొమ్ము.

౪. శీతమును బుట్టించు జ్వరమునకు నమస్కారము. ఉష్ణమును బుట్టించు జ్వరమునకు నమస్కారము. శరీరమును శోషింపఁజేయు జ్వరమునకు నమస్కారము. దినదినమువచ్చు శీతజ్వరమునకు, రెండు దినములకు నొకసారివచ్చు శీతజ్వరమునకు, మూఁడు దినములకువచ్చు శీతజ్వరమునకు నమస్కారము.

### ౨. దీర్ఘాయువు నారోగ్యమునిచ్చు సూక్తములు (ఆయుష్యాణి)

సామాన్యముగా వేలువేలు రోగములను బోఁగొట్టుటకై యుపయోగించునట్టి సూక్తములకును వీనికిని భేదముకలదు. రోగములతో సంబంధము లేకుండ సామాన్యముగా నారోగ్యమును, ఆయుస్సును, కోరునవి యీ 'ఆయుష్యాణి' సూక్తములు. ఆయుస్సు, ప్రాణము, వర్చస్సు, బలము, మొదలయినవానిఁ గోరు సూక్తములు, ఆయురాది శబ్దములతో బ్రారంభింపఁబడిన మంత్రములు, ఈ వేదమునందు ౨౦౦ కంటె నెక్కుడు కలవు. నూఱు సంవత్సరముల వార్ధక్యము వచ్చువఱకును, యజమానుఁడు, బిడ్డలు మొదలయిన వారు బ్రతుకవలెననియీమంత్రములయందు సాధారణముగాఁ గోరఁబడియుండును. మరణము నివర్తించుటకును నిందుఁగోరంబడియుండును.

ఈ వస్తువులు వాడు నప్పుడు ఉన్నిచలువ కును, పట్టుచలువకును భేదమేమియు లేదు. పట్టును ఉన్నికంటె నెక్కువ పర్యాయము లు చలువచేయవలెను. ఈ రెండు పదార్థములుగాక మరియొక యోగము ప్రకారము పట్టును చలువఁజేయవచ్చును. ఈ యోగమునందు వాడెడి పదార్థమునకు "పొటాసియం పర్మాంగనేట్" (Potassium permanganate) అనిపేరు. దీనిని నీటిలోఁ గలిపినప్పు డొకవిధమైన యెఱ్ఱుపురంగుఁగలనీరేర్పడును. ఊరిలో కలరా యున్నప్పుడు సాధారణముగ దీనిని నూతులలోఁ గలిపెదరు. దీనియందు ప్రాణవాయు వెక్కుడు గలదు. అందుచేత నిది శీఘ్రముగ సూక్ష్మజీవులను జంపివేయును. దీనికి చలువఁజేసెడి గుణముగూడ ప్రాణవాయువు వలననే కలిగినది. పొటాసియం పర్మాంగనేటును కొంచెము నీటిలోఁ గలిపి యానీటిలోఁ గొంచెము గంధక ద్రావకముఁ గలపవలెను. ఈ నీటిలో పట్టుబట్టలనుగాని, దారపు విచ్చెలనుగాని కొంతసేపుంచి తరువాత గంధకపుపొగ కలిగించిన నీటిలో ముంచినయెడల పట్టుసంబంధమగు వస్తువులు తెల్లఁబడును. ఈ పద్ధతిప్రకార మొకపర్యాయము చలువఁజేసినఁ జాలును. కానియెక్కువ జాగ్రత్తతో పనిచేయవలెను. గంధక ద్రావక మెక్కువయిన యెడల పట్టును తినివేయును. కావున మితముగా వాడవలెను.

ద్రావకములవలన పట్టుచెడిపోవునని పైని వ్రాసియుంటిమి. పట్టు చలువకు లవణవాయువు పనికిరాదనిక్కూడ వ్రాయఁబడినది. స్వల్పముగ నుపయోగించిన యెడల నీరెండును జాగ్రత్తతో వాడవచ్చును. ఐదుపాళ్లు శంఖ ద్రావకమును, ఒకపాలు "నైట్రికాసిడ్డు"ను (సురేకారద్రావకము - అనఁగా సురేకారమును (Nitre) గంధక ద్రావకముతోఁ గలిపి నప్పు డేర్పడు ద్రావకము) గలిపి నాలు గయిదు రోజులు నులివెచ్చగ నుంచవలెను. ఈ రెండు ద్రావకములను గలిపి నప్పుడు లవణ వాయువేర్పడి మిశ్రణములో కలిగి యుండును. ఈ మిశ్రణమునకు 15 పాళ్లు నీరు గలిపి కొంచెము వెచ్చఁబెట్టి పట్టునూలును గాని, గుడ్డలనుగాని యందులో ముంచిన కొలఁది కాలములోనే యివి తెల్లఁబడును. సాధారణముగా పావు గంటకంటె నెక్కువ కాలముపట్టదు. కొన్ని తరుణములయందు పూర్తిగ తెలుపెక్కకమునుపే పట్టును పైకి దీసి రెండుమూఁడు సారులు మంచి నీటిలో జాడించి గంధకపు పొగతో పూర్తిచలువఁ జేయుదురు. ఈయోగము ప్రకారము చలువఁ జేసినపట్టునకు పసుపురంగు దట్టముగఁబట్టును. అందుచేత సాధారణముగ నీపట్టునకు వెంటనే పసుపురంగు వేయుదురు.

"టాసాసిల్కు" అని వాడఁబడు టాసూరుపట్టు సాధారణ పట్టుకంటె భిన్నమైనది. ఇది మన దేశములో విస్తారముగఁ జేయఁబడు

చున్నది. మామూలు పట్టుకంటె దీనిని చలువఁజేయుట కష్టము. టసూరు పట్టుచలువకును మామూలు పట్టుచలువకును కొంచెము భేదముండును. సోడాపొడి నీటిలో నుడకవేయుటవలన టసూరుపట్టు కొంతవఱకు తెల్లబడును. తరువాత దానిని గంధక ద్రావకముఁ గలిపిన నీటిలో నానవేసినచో బాగుగ తెల్లఁబడును. కాని యీబట్టలకు రంగులు చక్కఁగపట్టవు. కావున రంగులు వేయఁదలచిన టసూరుపట్టును వేఱుమార్గముల చలువఁ జేయుదురు. ఇందు ముఖ్యముగ నుపయోగించెడి పదార్థము "బ్రోమీనునీరు" (Bromine water). బ్రోమీను, లవణవాయువునకు సంబంధించి దానివలెనే చలువజేయు శక్తిగలిగియుండును. బ్రోమీను రక్తమువలె నెఱ్ఱని ద్రవపదార్థము. దీనినికొంచెము నీటిలోఁగలిపి యానీటిలో పట్టుబట్టలను కొంచెము సేపుంచి తరువాత గంధకపు ద్రావకముఁ గలిపిన నీటిలో నరగంటసేపు నానవేసినయెడల నది తెల్లఁబడి రంగులనాకర్షించు శక్తికూడ కలిగియుండును. ఇట్లు రెండు మూఁడు పర్యాయములు చేసిన యెడల బట్టలు మిక్కిలి తెల్లగనుండును. కొన్ని తరుణముల బ్రోమీనుకు బదులుగ ప్రాణవాయువుఁగలిగించిన "అమోనియనీటిని" వాడెదరు. ఈ నీటిలో బట్టలు కొంతసేపు నానిన తరువాత సబ్బులో నుడుకవేసి మంచినీటిలో జాడించినయెడల బాగుగ చలువయగును.

పట్టు సహజముగ లేతపసుపువన్నె గలిగియుండును. ఎన్నిమారులు చలువఁజేసినను ఈ సహజవర్ణము పూర్తిగపోదు. రంగులు వేయకుండ నమ్మెడిపట్టునకు నీసహజమయిన వన్నెపోయి అచ్చమగు తెలుపును నిగనిగయు వచ్చుటకు నీలిపెట్టెదరు. సబ్బులోనుడకవేసిన నూలును దారమగునట్లు పేనిబిగించి ఆసుబోసెదరు. అప్పుడు కళకళకాగెడు నీటియావిరిలో నీదారము నుంచినయెడల పట్టునకు తళుకువచ్చును. పట్టునకు సహజవర్ణముపోయి తెలుపెట్లు వచ్చునో యీక్రింది యోగము వలన తెలియనగును.—10 పౌనులు పట్టును చలువఁజేయుటకు:—

1. మూఁడు పౌనులు సబ్బునురుగులోఁ గలిపి పట్టును దానిలో నానవేయుట.
2. నానినపట్టును సంచులలోవేసి కుట్టి సబ్బునీటిలో నుడకవేయుట.
3. ఉడకవేసిన పట్టును మంచినీటిలో జాడించుట.
4. ఒకటిన్నరపౌను సబ్బు, కొంచెము నీలిమందు తొంబదిగేలముల నీటిలోఁ గలిపి యానీటిలో పట్టును నాననిచ్చుట.
5. తరువాత తులము గంధకముఁ గాల్చి ఈ పొగను పట్టునకుఁ బట్టించుట.
6. నూతినీటిలో జాడించి యారవేయుట.

అప్పటికి పట్టు బాగుగ తెలుపెక్కి నిగనిగలాడుచుండును. నీలిమందునకు బదులుగ జాభరాగింజ లుపయోగించినయెడల చైనాపట్టు

రంగువచ్చును. ఇట్లే లేతరంగులు వేయుట వలన పాలతెలుపు, అచ్చతెలుపు, నీలిగలిసిన తెలుపు మొదలగు కాంతులు వచ్చును.

ఇంతవఱకు బట్టలయొక్కయు, నూలుయొక్కయు చలువనుగూర్చి వ్రాయఁబడినది. ఇది ముఖ్యముగ రంగులు వేయుటకై వేసెడి

ఇతరవస్తువుల చలువ

చలువ. ఇవిగాక యలంకరణముల కుపయోగించెడి వస్తువు లనేకములు చలువజేయఁబడును. బుట్టలు, పెట్టెలు, సంచులు మున్నగునవి నేయుట కుపయోగించెడి యాకులు, పాశ్చాత్యులు పెట్టుకొనెడి టోపీల్లుట కుపయోగించెడిగడ్డి, పాశ్చాత్యస్త్రీలు అలంకరణమునకై టోపీలపై గుచ్చెడి యీకలు,మున్నగు వస్తువులన్నియుచలువఁజేసి తరువాత రంగులు వేయుదురు. వాసలీను (Vaseline)జేయుటకుఁ గావలసిన మైనము, చెక్కడపు పనులఁజేసెడి దంతము గుండీలు మున్నగునవి చేయుట కుపయోగించెడి యెముకలు, కొమ్ములు మొదలగునవి యన్నియుఁ జలువచేయఁబడును. కుంచెలను జంత్రవాయిద్యములయం దుపయోగించెడు వెండ్రుకలను, పుస్తకములను బైండుచేయుటకుఁ గావలసిన చర్మములను గూడ చలువఁజేసెదరు. కాగితములు తెల్లగనుండుటకు కాగితములు జేయుటయం దుపయోగించు పదార్థములు చలువఁజేయవలెను. ఈ పదార్థము లన్నియు చలువఁజేయు పద్ధతులు పైని వర్ణింపఁ బడినవియె. తప్పీళ్ళలో కొంచెము భేదముగాని పద్ధతులును, చలువఁజేయుట కుపయోగించెడి పదార్థములును, ఒక్కటియె. పైనిఁజెప్పఁబడిన చలువసున్నము, లవణవాయువు, గంధకపు పొగ, హైడ్రొజన్ పెరాక్సైడు, పొటాసియం పెర్మాంగనేటు చలువఁజేయుట కుపయోగించు పదార్థములు. సబ్బు, సోడాపొడి, సోడాక్షారము, చవుడు, గంధక ద్రావకము మొదలగునవి యుడకవేయుట కుపయోగించెడి పదార్థములు. జంతు సంబంధములగు పదార్థములను చలువఁజేయుటకు చలువసున్నముగాని లవణవాయువుగాని వాడక తక్కిన పదార్థములను వాడెదరు. కాగితములను చలువఁజేయు పద్ధతి నీక్రింద వ్రాసెదము. దీనినిబట్టి తక్కిన పదార్థము లెట్లు చలువఁజేసెదరో యూహింపనగును.

గుడ్డపేలికలు, గోగునార, జనపనార మున్నగు నారపదార్థములు, వెదురు, పేము, గడ్డిపరకలు, పనికిరానిప్రాతకాగితములు, మొదలగు పదార్థములతో కాగితములు చేయుదురు. వీనిని చలువఁజేసిన తరువాత కాగితములుచేయుదురుగాని ముందుగ కాగితములు చేసినతరువాత చలువఁజేయరు. కావున నా యాపదార్థములను చలువఁజేయుట కేర్పడిన పద్ధతుల ప్రకారము వానిని చలువఁజేయవలసి యుండును. గుడ్డపేలికలతో కాగితములు చేయునప్పుడు వానిని ముందుగ నీటిలో చీకనిచ్చి యంత్ర సహాయమువలన వెన్న

వలె మెత్తగ నగునట్లు పక్వము జేయుదురు. ఈ పాకమును సోడాపొడి నీటిలోనానబెట్టిన తరువాత చలువసున్నపు నీటిలో వుంచెదరు. సాధారణముగ నిప్పటికే యది తెల్లఁబడును. ఒకవేళ గుడ్డపేలికలు పక్కాఁరంగులు వేసిన వైనయెడల చలువ సున్నములో ముంచిన తరువాత గంధకద్రావకముఁ గలిపిన నీటిలో కొంచెము సేపుంచినచో నెటువంటి రంగు లయిననుపోయి కాగితపు పాకము (Paper-pulp) తప్పక తెల్లబడును. ఇట్లే నారపదార్థములతో కాగితములు చేయునప్పు డిదివరలో వర్ణింపఁబడిన యుక్తమార్గముల ప్రకారము నారపాకమును చలువఁజేయుదురు. నారకు తెలుపెక్కుట యాలస్యమగుటచే రెండు మూఁడుసారులు చలువఁజేసినఁగాని కాగితములు తెల్లఁగనుండవు.

హిందువుల చలువ పరిశ్రమ

కోరాలను మల్లుఁ జేయుట చలువయని మొట్టమొదటనే వ్రాసియుంటిమి. పాశ్చాత్య దేశములలో నిదియొక వ్యాపారముగ నున్నదని యిదివరలో వ్రాసినదానిని బట్టి చదువరులు గ్రహింపఁగలరు. మన దేశస్థులకు చలువఁజేయుట యనాదిగఁ దెలిసియున్నను ప్రత్యేకముగ చలువబట్టల వ్యాపారము మన దేశమున లేకుండెనని చెప్పవచ్చును. ఇప్పుడిప్పుడు బొంబై మున్నగు నగరములలో యంత్ర సహాయమున నేతపనిజరుగుచున్నది. ఈ యంత్రములలో తయారగు కోరాలు పాశ్చాత్య పద్ధతుల ననుసరించియే చలువఁజేసి యమ్మఁబడుచున్నవి. అందుచేత వీనిని గూర్చి ప్రత్యేకించి వ్రాయనక్కఱలేదు. చేతి మగ్గములమీఁద నేసిన వస్త్రము లట్లే యమ్ముట యలవాటుగాని మల్లుఁజేసి యమ్ముట వాడుకలేదు. అట్లయిన మన దేశీయులకు చలువఁజేయుట తెలియదాయని శంకింపవచ్చును. అనాదినుండి మన దేశములో చలువఁజేయుట చాకలివాండ్ర పనియై యున్నది. ఇంతియగాక రంగులు వేయుటకు వస్త్రములన్నియు చలువఁ జేయవలెను. కావున మన దేశములో చాకలివాండ్రును, రంగిరేజులును (రంగులు వేసెడివారు) చలువ చేయ నేర్చియున్నారు. కొన్ని ప్రదేశములలో రంగుల వాండ్రు చలువఁజేయక యా పని చాకలులకే వదలివేయుట గూడఁగలదు. సాధారణముగ తురకలు రంగులు వేయునప్పుడు చలువపనిఁగూడ వారే చేయుదురు. హిందువుల చలువఁజేయు పద్ధతులు పాశ్చాత్యుల పురాణపద్ధతులఁ బోలియుండును. చాకలిచవుడు, సున్నము, కుంకుడుకాయలు, పులిమజ్జిగ, గేదెపేడ, సోడాపొడి (సజ్జయని బజారులో నమ్ముదురు) ముండ్లతోట కూర, తెల్లగచ్చెరు, ఉత్తరేణి మొదలగు శాకపదార్థముల బూడిదె, చలువఁజేయుటకు ముఖ్యముగా వాడెడి పదార్థములు. సాధారణముగ చాకలివాండ్రు చవుడును సున్నమును వాడెదరు. కోరాలను మొట్టమొదట నీటిలో

నుతికి, చవుడు సున్నము గలిపిన నీటినిచాకి బానయందుంచి యానీటిలో నుడకపెట్టెదరు. బట్టలున్నంతసేపు బానమూత వేసియుం తురు. ఇట్లు మూతవేయుటవలన గుడ్డలకు వేడియెక్కువ తగిలి మురికి త్వరలో వీడిపోవును. తరువాత బట్టలను మంచినీటిలో జాడించి యిసుకపైగాని గడ్డిపైగాని యెండ వేసెదరు. అప్పుడప్పుడు నీరు చల్లుచు బట్టల నెండనిచ్చెదరు. ఇట్లు నాలుగైదుసారులుడికవేసినఁగాని బట్టలు పూర్తిగ తెల్లఁబడవు. అందుచేత క్రొత్తబట్టలు నానవేయుట కెక్కువ కాలము పట్టును. ఒకవేళ త్వరగాఁ దెచ్చిన యెడల మొదటితూరి చలువ బాగుగానుండదు. కలంకారీ యద్దకములకై చేసెడి చలువలో గేదెపేడ విస్తారముగా వాడుదురు. గేదెపేడలో నొకటి రెండు రోజులు నాననిచ్చి మంచి నీటితో శుభ్రముచేసి గడ్డిమీఁద నెండ వేయుదురు. ఎండచేతను, గాలిచేతను, అప్పుడప్పుడు చల్లనీటి చేతను బట్టలు క్రమముగా తెల్లఁబడును. బాగుగ చలువయగుటకు రమారమి యొకమాసము పట్టును.

ప్రత్యేకించి ఉన్ని చలువ మన దేశీయపద్ధతులలోలేదు. ముఖ్యముగ కంబళ్ళకును,తివాసీలకును ఉన్ని యుపయోగ పడుచున్నది. కాశ్మీర దేశములో పష్మీనాయను నొక యుత్తమ జాతి ఉన్నిగలదు. దీనితో శాలువలు, కండువాలు మున్నగునవి నేయుదురు. ఉన్నితోఁగూడ కాశ్మీరపు శాలువలు నేయఁబడుచున్నవి. దేనికి వాడినను రంగులువేసిన ఉన్నియే ముఖ్యమగుటవలన తెల్లనగువఱకు చలువఁజేయుట యవసరములేదు. రంగులు పట్టుటకు ఉన్నినంటియున్న మలినములు పోయినజాలును. ఉన్నిని శుభ్రముచేయుటకు, చవుడు, సున్నపు తేట, కుంకుడుకాయ నురుగు, సబ్బు ఉపయోగించెదరు. ఇవి గలిపిన నీటిలో నుడకవేయుటవలన మలినములు పోయి ఉన్ని రంగులు వేయుటకు యోగ్యముగానుండును. తెల్లశాలువలు, ధావళులు సామాన్యముగ తెల్ల ఉన్నితో నేయుదురు. తెల్ల ఉన్ని చాల వెలయగుటచే ధావళులు చాలవఱకు పచ్చ గానుండు ఉన్నితో నేసెదరు.

మన దేశములో నారపదార్థములను చలువఁజేయుటకు ప్రత్యేక పద్ధతులులేవు. జనుపనార, గోగునార, కలబందనార, కొబ్బెర పీచు, త్రాటినార, ఇవి మన దేశములో నెక్కువవాడుకలోనున్న నారపదార్థములు. వీనితో ముఖ్యముగ మోకులు, పరజాలు, గోనె సంచులు చేయఁబడుచున్నవి. వీనికొఱకు నార యెక్కువ తెల్లగనుండ నక్కఱలేదు. నారను నీటిలో నొకటిరెండు వారము లుడకవేసి రాళ్ళపై నుతికి యెండవేయుటవలన చాల భాగము తెల్లఁబడును. ఇంతకంటె వేఱు మార్గములఁ దెలుపుచేయుట మన దేశములో నలవాటులేదు.

ఉన్నికంటె పట్టుపరిశ్రమ మనదేశములో విస్తారముగ నున్నది. చెన్నపురికంటె బంగాళము, ఉత్తర హిందుస్థానము, బొంబై రాజధానియు, నెక్కువ పేరువడసిన పట్టువర్తకస్థానములు. ఉన్నివలెనే పట్టునుగూడ రంగులు వేయుటకే చలువఁజేయుదురు. కాని తెల్ల పట్టుబట్టలుకూడ విస్తారము వాడుకలో నుండుటచేత ప్రత్యేకముగ పట్టుకోరాలను చలువ చేయు మార్గములు మనవారికి తెలిసి యున్నవి. ఉన్నినుడకవేయుట కుపయోగించు వస్తువులే పట్టుచలువ కుపయోగించును.

రంగులువేయుపట్టును చలువఁ జేయుటకు, పట్టులో నైదవవంతు చాకలిచవుడు నీటిలో గలిపి యొకరాత్రి యంతయు తేరనిచ్చెదరు. మరునటిరోజు చవిటితేట నొకబానలో మురగఁబెట్టి పట్టునూలు నందులో ముంచెదరు. కొన్ని తరుణములందు చవుడుతోఁ బాటు కొంచెము సున్నముకూడఁ గలిపెదరు. కాని యేది యెక్కువైనను, విస్తారము సేపు ఉడుకఁ బెట్టినను, పట్టు చెడిపోవును. అందుచేత పట్టు విచ్చెలను వంకెలవలె నుండు కొయ్యలకుఁ దగిల్చి యుడకవేయుదురు. అప్పుడప్పుడు పైకిఁదీసి వేలితోఁ బట్టిచూచుచు జిడ్డు పూర్తిగఁబోయి దారము మెత్తఁబడు వఱకును ఉడకనిచ్చెదరు. ఉడికిన తరువాత పట్టువిచ్చెలను మంచినీటిలో నుతికి బాగుగ జాడించి యెండవేయుదురు. ఇట్లు నాలుగుసారులు చేయునప్పటికి తెల్లపట్టు పూర్తిగ తెల్లఁబడి పసుపుపట్టు పచ్చవాగుగా నుండును. కాని రెండును రంగులు వేయుటకు యోగ్యముగ నుండును. ప్రత్యేకించి తెల్లపట్టుబట్టలు చేయుటకును పైపద్ధతికిని కొంచెము భేదముగలదు. వీసెడుపట్టును అనఁగా 120 తులములుపట్టును చలువఁజేయుటకు 30 తులముల చాకలి చవుడును 30 తులములు దేశవాళీ సబ్బును (Country soap) కావలసి యుండును. మన దేశములో సబ్బుచేయుటకు చవుడును సున్నమును మరగఁబెట్టి యిప్పనూనెగలిపి కలియఁ బెట్టెదరు. సబ్బు తెట్టుగట్టి పైకి తేలును. ఈసబ్బు పట్టును చలువచేయుట కుపయోగింతురు. సబ్బును చవుడును గలిపిన నీటిని వెచ్చగా నుండగ తొట్లలోఁ బోసి పట్టుబట్టలనుగాని పట్టు నూలునుగాని కఱ్ఱలపైఁ దగిలించి తొట్లలో వ్రేలాడఁజేయుదురు. కఱ్ఱల రెండు కొనలను త్రిప్పుటవలన బట్టలయొక్క యన్ని భాగములును జక్కఁగ నానగలవు. చక్కఁగ నానినతరువాత బట్టలనుమంచినీటిలోజాడించి పిండెదరు. ఇప్పటికి పట్టు కొంచెము గౌర వర్ణము గలిగియుండును. దీనిని పూర్తిగ తెలుపుఁజేయుటకు గంధకపు పొగవేసెదరు. ఇందుకుఁగాను మూకుడులో కొంచెము గంధకమునుంచి దానిపై దట్టముగా నల్లిన యొక వెదురు పేళ్ళజల్లను బోలించెదరు. ఉడకవేసిన తడి పట్టుబట్టలను బల్లపై నుంచి పొగపైకిఁ బోకుండ నొకగుడ్డఁ గప్పెదరు. అప్పుడు గంధకమును వెలిగించినచో పొగ

గుడ్డలకు చక్కఁగఁబట్టును. ఒకగంటతరువాత మంచినీటిలో నుతికిన యెడల బట్టలుగ్గాని నూలు గాని పూర్తిగ చలువయగును. ఈ పద్ధతికిని పాశ్చాత్త్యుల నవీన పద్ధతికిని భేదము లేదని చదువరులు గ్రహింపఁగలరు.

. సాదా అద్దకము

వస్త్రములకుగాని వస్త్రములు చేయుట కుపయోగించు నూలునకుగాని రంగులు వేయుటకు అద్దకమనిపేరు. అద్దకమను శబ్దము ముఖ్యముగ నూలునకు, ఉన్నికి, పట్టునకు, నారపదార్థములకును రంగులు వేయుటయందు వర్తించుచున్నను, తదితర పదార్థములకుఁగూడ రంగులువేయుటకలదు. కొయ్యలకు బచ్చెనఁబోయుట, చాపలు నేయుట కుపయోగించెడి గడ్డిపదార్థములకు దంతములు, ఎముకలు, కొమ్ములు, తోళ్ళు, కాగితములు మున్నగు వస్తువులకు రంగులు వేయుటఁగూడ అద్దకమనియే యనిపించు కొనును.

ఎంత యనాగరకదశయందున్నను మనుష్యునకు అలంకరణములయెడ మిక్కిలి ప్రీతి యుండును. బంగారము, వెండి మున్నగు లోహములు దొరికిన వెంటనే యాభరణములు చేయుట కుపక్రమించెను. లోహములు సులభముగా దొరకనిచోట యాకులతోను, కొయ్యలతోను, ఎముకలతోను అలంకరణములు చేసికొనుటకు మొదలు పెట్టెరి.

చరిత్రాంశములు

మనుష్యుఁడు ఇల్లుఁగట్టుటకు నేర్చినప్పుడె గోడలపైఁ చిత్తరువులు వ్రాయుటఁగూడ నేర్పడినది. అట్లే బట్టలనేతతోడనే రంగులు వేయు విద్యకూడ పుట్టినదన్న నతిశయోక్తి కానేరదు. నేత తెలియక చర్మములతో శరీరమును ఎండనుండియు వాననుండియు గాపాడుకొనెడి కాలములో నయితము మానవ కోటికి రంగుల విషయమైన జ్ఞానము కొంచె ముండెడి దనుటకు తార్కాణము లున్నవి. ఏలయన వంటినిండబట్ట లేక కౌపీనములతో కాలము వెళ్ళబుచ్చు మిక్కిలి యనాగరక జాతులలోఁగూడ శరీరమంతయు పచ్చఁ బొడుచుకొనుట యాచారములో నున్నది. వీనినిబట్టి రంగులు వేయుట మిక్కిలి పురాతనమైన విద్యయనుటకు సందియము లేదు.

శైశవావస్థలో రంగులు శాశ్వతముగ నుండక యుతికినతోడనే వెలిసిపోవునవియై యుండును. ఆకు పసర్లతోను, పండ్లరసములతోను ఉపక్రమించియుండురు. ఇప్పటికిని కాకరాకుపసరు, ఆకుపచ్చ రంగుకును, నాగజెముడుపండ్లు ఎరుపు రంగుకును వాడు సంప్రదాయము కొన్ని జాతులలో మనదేశమునఁగలదు. ఈ రంగు లెండకెండినను వానకుఁదడిసినను వెలిసిపోవును. ఇంతియేఁగాక ప్రథమ దశలో రంగులువేయుట యొక వర్తకముగ నుండక యిండ్లలో నాడవాండ్రు పనిచేయుచుండిరి. ఏకు లొడుకుట, నేత నేయుట మొట్టమొదట గృహకృత్యము

లలోఁ జేరినట్లు, ఇంటివాడుకకుఁ గావలసిన బట్టలకు రంగులు వేయుటఁగూడ గృహవ్యాయామములలో నొకటియై యుండుననుటకు సందియములేదు. పక్కా రంగులు వేయు పద్ధతులు గనిపెట్టిన తరువాతను సంఘబాహుళ్యమువలన వృత్తు లేర్పడిన తరువాతను నేతపనులవలెనే యద్దకపుపనులుగూడ వర్తక సరిలోనికి దిగియుండును.

రంగులు వేయుట మొదటినుండియు కేవలము పౌరస్త్యుల విద్యయైయుండెను. పాశ్చాత్యు లీ విద్యను పౌరస్త్యుల నుండియే గ్రహించిరి. చీనా, పర్షియా, ఇండియా దేశము లీ విద్య కుత్పత్తిస్థానములని చరిత్రకారుల యభిప్రాయము. చీనావారి నాగరికము మన నాగరికముకంటెఁగూడ పురాతనమైనది. కాగితములు చేయుట, అచ్చొత్తుట చీనారాజ్యములోనె మొట్టమొదట కనిపెట్టఁబడినది. రంగులు వేయువిద్య చీనాదేశీయుల నుండి హిందువులు గ్రహించిరనుటకు కాధారములు లేవు గాని మన దేశీయులనుండి పారశీకులు నేర్చుకొనిరనుటకు దాఖలాలున్నవి. హిందువులు తూర్పున చైనారాజ్యముతోను, పడమరపారసీ యరబ్బులతోను, అనాదినుండి వర్తక వ్యాపారములు నిరాటంకముగ నడుపుచుండెడివారు. మొదటినుండియు హిందూదేశము కళాకౌశల్యములయం దెక్కుడు పేరుపొంది యుండుటచేత అరబ్బీ వర్తకులు రంగుబట్టలయందు హిందూదేశముతో వ్యాపారము జేయుచుండెడివారు. ఇట్టి రాకపోకలవలన అరబ్బీవర్తకులు హిందువుల పరిశ్రమిక జ్ఞానమును సంపాదించి ఫొనీషియనులకును, ఈజిప్టు దేశీయులకును నేర్పిరి. ఈజిప్టు దేశీయులు మిక్కిలి పురాతన కాలముననే పసుపు రంగును, నీలిరంగును బట్టలకు నెక్కుడు కౌశలముతో వేసెడివారని "ప్లిని" (Pliny) యను చరిత్రకారుఁడు క్రీ॥ శ॥ మొదటి శతాబ్దములో వ్రాసియున్నాఁడు. సుమారు నాలుగువేల సంవత్సరములకుఁ బూర్వమే యీజిప్టు దేశములో రంగులు వేయు నాచారము గలదని పరిశోధకులు చెప్పుచున్నారు. హిందూదేశము నుండియే యీ పరిశ్రమను అరబ్బీలద్వారా యీజిప్టువా స్తవ్యులు గ్రహించునట్లు చరిత్రకారులు నుడువుచున్నారు. దీనిని బట్టియె హిందువుల పరిశ్రమయొక్క పురాతనత్వమును గ్రహింపవచ్చును.

గ్రీసుదేశములో కాపురముండి వ్యాపారము జేయుచుండిన ఫొనీషియను వర్తకులును, ఈజిప్టు వర్తకులును రంగులను గ్రీసులోనికి దిగుమతి చేసెడివారు. కాని గ్రీకులయొక్కయు, రోమనుల యొక్కయు, రంగులువేయు పద్ధతులు మనకు బాగుగఁ దెలియవు. అలెగ్జాండరునకు పూర్వము అనఁగా క్రీ॥ పూ॥ ౩౩౬-వ సంవత్సరమునకు ముందు గ్రీకులకుఁ దెలిసిన రంగులు బహుస్వల్పమనియు, అతని తరువాత నీలి, నలుపు, పసుపు, పసరు రం

గులువేయుపద్ధతులు గ్రీసులో నభివృద్ధిఁ జెంది నార బట్టలకుఁగూడ పక్కా రంగులు వేయుట గ్రీకులు నేర్చిరనియు "ప్లినీ" యను చరిత్రకారుఁడు వ్రాసియున్నాఁడు. మహాపురుషుల జీవితములు వ్రాసిన "ప్లూటార్కు" అను చరిత్రకారుఁడు అలెగ్జాండరు చక్రవర్తి జీవితములో నిట్లు వ్రాసియున్నాఁడు. "పారసీకమునకు వెళ్లినప్పుడు (Persia) మహారాజుగారి సౌధములో నూటయెనుబదియేండ్లకుఁ బూర్వము తయారుచేసిన నలుపువాగుఁగల యెరుపు బట్టలు (Purple dyed material) అనేకము లుండెను. ఇంతకాలమైనను కాంతి చెడకుండుటనుబట్టి యీబట్టలు తేనెతో తయారు చేసియుండవలెను." అలెగ్జాండరు పౌరస్త్య దండయాత్రల తరువాతనే గ్రీసులో రంగుల పని యభివృద్ధియైన దనుటకు సందేహము లేదు. గ్రీకులు రంగులువేసిన పద్ధతులు మిక్కిలి సులభమైనవి. మొట్టమొదట క్రొత్త బట్టలను నీటిలో నుతికిసాగఁదీసెడివారు. ఇందువలన పుటరంధ్రములు పెద్దవగును. తరువాత బట్టలను రంగునీటిలో ముంచి రంగులు శాశ్వతముగ నుండుటకు వగరునీటిలో నానవేసెడివారు. వగరు వేయుటకు సామాన్యముగ పటిక నీ రుపయోగించెడివారు. ఇదియే గ్రీకుపద్ధతియొక్క సారాంశము.

క్రీ॥ శ॥ ఐదవ శతాబ్దివరకును ఐరోపా ఖండములో అద్దకపు పరిశ్రమ లేదని చరిత్రకారుల యభిప్రాయము. క్రీ॥ శ॥ ఎనిమిదవ శతాబ్దమున ఇటలీ దేశములో కొన్ని కుటుంబములవారు మాత్రము రంగులు వేసెడి వారని చెప్పుదురు. పదునొకండవ శతాబ్దములో పాశ్చాత్యులు మతసంబంధమైన యుద్ధమునకై జెరుసెలముపై దాడివెడలిరి. ఈయుద్ధమునకు రామదండువలె నైరోపా ఖండము నందలి ప్రతి దేశమునుండియు యోధులు బయలుదేరిరి. ఈ యుద్ధానంతరము భటులచ్చట కొంత కాలముండి తిరిగి తమ దేశములకుఁ బోవునప్పుడు పౌరస్త్యపరిశ్రామిక పద్ధతులను కొంతవఱకు గ్రహించి వానిని తమ దేశములలో నుపక్రమించిరి. ఈరీతిని ఇటలీ దేశములో కొన్ని క్రొత్తరంగులును రంగులు వేయుటకు నూతన పద్ధతులును పదునొకండవ శతాబ్దమున వెలసినవి. పదుమూఁడవ శతాబ్దము నాటికీపరిశ్రమకొంతయభివృద్ధియై వెన్నీసు పట్టణమునను, జర్మనీ దేశములోను రంగురేజులు తమ పరిశ్రమాభివృద్ధికై సంఘముల స్థాపించిరి. క్రీ॥శ॥ ౧౪౧౮-వ సంవత్సరములో నీ పరిశ్రమాభివృద్ధికిఁగాను బట్టల చలువ యొక పట్టణములోను అద్దకము మరియొక పట్టణములోను జరుగఁగూడదని జర్మను గవర్నమెంటువారొక శాసనముఁ జేసిరి. అప్పుడే రంగులువేయుట నేర్పుటకుఁగాను ఉపాధ్యాయులను ఊరూరికిఁ బంపఁదొడంగిరి. రంగులు వేయుటకు నీలిమందు వాడకూడదని కూడ తీర్మానించిరి.

క్రీ॥ శ॥ ౧౪౨౯-వ సంవత్సరములో ఇటలీ దేశము నందలి వెన్నీసు పట్టణమున రంగులు

వేయుటనుగూర్చి యొక పుస్తకము వెలువడె ను. ఐరోపా ఖండములో నీపరిశ్రమనుగూర్చి వ్రాసిన ప్రథమపుస్తక మిదియేయని చెప్ప వచ్చును. ఈ పుస్తకమునం దప్పటికాలమున వాడుకలోనున్న పద్ధతులు వర్ణింపఁబడినవి. అప్పటినుండియు పాశ్చాత్య దేశములలో నద్ద కపు పరిశ్రమ శీఘ్రముగ వృద్ధిఁజెందినది. ఇటలీనుండి జర్మనికిని, జర్మనీనుండి ఫ్రాన్సు కును, ఫ్రాన్సునుండి బెల్జియమునకును అద్ద కపు పరిశ్రామిక జ్ఞానము అచిరకాలములోఁ బ్రాకెను.

ఇంగ్లండు దేశములో పదుమూఁడవ శతా బ్దికి పూర్వము రంగుబట్టలనియు,రంగులనియు, సారస్వతమునందు చూచాయగ నున్నను వానినిగూర్చి విశేష మేమియులేదు. కాని పదునాలవ శతాబ్దములో మూఁడవ యెడ్వర్డు ప్రభువు బెల్జియము నుండియు, హాలెండు నుండియు రంగురేజులను బిలిపించి వారి నాద రించెను. వీరివలన నింగ్లండులో అద్దకములు కొంత యభివృద్ధియై క్రీ॥ శ॥ ౧౪౭౨-వ సం వత్సరములో నొకరంగురేజుల కంపెనియేర్పడి నది. క్రీ॥ శ॥ ౧౪౭౧-వ సంవత్సరములో నాల్గవ హెన్రీప్రభువు లండను పట్టణములోను చుట్టుప్రక్కల పదిమైళ్ళదూరమునను అద్దకపు పనులుజేయుట కొకకంపెనీకి సర్వస్వాతం త్ర్యమునిచ్చెను. అతని తరువాత ప్రభువు లీ హక్కుమునురద్దుచేయక అమలులో నుంచుచు వచ్చిరి. ఆహక్కువలన కంపెనీవారు నిర్దేశ స్థలములలో నద్దకములు వేయుటయేగాక తద్ది తరులెవరైన చాటుగ రంగులు వేయుచుం డినయెడల నట్టివారిని సోదాచూచి పట్టుకొని సర్కారుకు నప్పగింతజేయుటనధికారము గూడ నుండెను. ఈరీతిని సర్కారువారి ప్రోత్సా హము వలనను ఆదరణము వలనను ఇంగ్లం డులో నద్దకపుపరిశ్రమ కొంతవరకు నభివృద్ధిఁ జెందినది.

ఇంతలో క్రీ॥శ॥౧౪౯౨-వ సంవత్సరములో కొలంబసు అమెరికా ఖండమునుఁ గనుగొ నెను. ౧౪౯౮-వ సంవత్సరములో వాస్కోడి గామాయను నతఁడు ఐరోపా ఖండమునుండి సముద్రము మీఁదనే ప్రయాణముఁజేసి హిం దూ దేశముఁ జేరవచ్చునని జూపెను. రమా రమి యేకకాలముననుజరిగిన యీ రెండు విష యములును పాశ్చాత్యుల యార్థికాభివృద్ధికిని, పరిశ్రామికాభివృద్ధికిని, నిరుపమానములగు దోహదములైనవి. అదివరకు పాశ్చాత్య ఖండములోలేని రంగు పదార్థములన్నియు నమెరికా దేశమునుండి దిగుమతిఁ జేయఁ దొడంగిరి. వాస్కోడిగామా సముద్రపుదారి కనుఁగొనుటకు పూర్వము హిందూదేశము నుండి యెగుమతియగు ప్రతివస్తువును పర్షి యా, ఇటలీ దేశములద్వారా ఐరోపా ఖండ మునకు రావలసి యుండెడిది. వాస్కోడిగా మా పోర్చుగలు దేశీయుఁడు. ఈ దేశ వాస్త వ్యులను మనవారు బుడతకీచు లనియెదరు. ఐరోపా ఖండములో పోర్చుగలు స్పెయిను

దేశము లిరుగుపొరుగున నుండును. ఈరెండు దేశములు మొట్టమొదట హిందూదేశముతో వర్తకమునారంభించిరి. హిందూదేశము నుండి వచ్చెడి సరుకంతయు నీదేశములలోనికి పూర్వమువలెఁ గాక తిన్నగా సముద్రమువీఁదనే తెచ్చెడివారు. అద్దకపుబట్టలు, రంగులు మొదలగునవి హిందూదేశమునుండి విధివిరామము లేక దిగుమతిఁజేసి యితర దేశములకు రవాణా చేసెడివారు. కొంత కాలమునకు హిందువులుపయోగించెడి యద్దకపు పద్ధతులుఁ గూడనేర్చి తమ దేశములలో రంగుల వ్యాపారమును సాగించిరి. కొలఁది కాలములో హాలెండు దేశీయులు అనఁగా డచ్చివారుకూడ హిందూదేశముతో వర్తకము ప్రారంభించిరి. ఐరోపా ఖండమునందీ మూఁడు దేశములే మొట్టమొదట నద్దకములలో నెక్కువ ప్రవీణతఁ గాంచినవి. ఎరుపురంగు వేయుట కుపయోగించెడి మంజిష్ఠయు, కిరిమింజియు నితర దేశములనుండి తెచ్చి తమ దేశములలోఁ బెంచుటకు మొదలిడిరి. క్రీ॥ శ॥ ౧౬౩౦-వ సంవత్సరములో నొకడచ్చి శాస్త్రజ్ఞుఁడు కిరిమింజితో ఉన్నికి ఎరుపు రంగువేసి యీరహస్యమును వెల్లడిజేసెను.

క్రీ॥శ॥ ౧౬౦౩ సంవత్సరమువఱకు నింగ్లండులో నద్దకపు పరిశ్రమ విస్తారముగ లేనట్లు తోచుచున్నది. ఏలయన, ఆసంవత్సరములో "రాలీ" యను నతఁడు మొదటి జేమ్సు ప్రభువుతో నిట్లు విన్నవించెను. "ఇప్పటి వఱకు నాంగ్లేయులు ఉన్ని యద్దకమునందు కౌశల్యముఁ లేక యున్నారు. రంగులు వేయించుటకు వారు బట్టలను సామాన్యముగ హాలెండు దేశమునకు బంపుచున్నారు. ఈ రీతిని సాలుకు ౮౦,౦౦౦ బట్టలు రంగులు వేయించుటకై యితర చోట్లకు, బంపుచున్నారు!" ఈ మాటలు విని ప్రభువు తెల్లబట్ట లెగుమతి చేయఁగూడదనియు రంగు నింగ్లండులోనే వేయవలయుననియు నాజ్ఞాపించెను. ఈ హుకుమునకుఁ గోపించి హాలెండు, జర్మనీ దేశీయులు ఇంగ్లండులో రంగులు వేసిన గుడ్డలు కొనఁగూడదని సమ్మెకట్టిరి. ఆంగ్లేయులు వేసిన రంగులు బాగుండక పోయెను. ఈ కారణముచేత జేమ్సుగారి హుకుము కొంత కాలము తరువాత రద్దు చేసిరి. ౧౬౭౪-వ సంవత్సరమువరకును ఇంగ్లండులో మంజిష్టను (మదారుచెక్క) బెంచినట్లు కనబడదు. ౧౬౫౦-వ సంవత్సరమునకు పూర్వము వ్రాసిన గ్రంథములలో నూలు బట్టలయద్దకమునుగూర్చి యేమీలేదు. ౧౬౫౪-వ సంవత్సరమునకుఁ గూడ నాంగ్లేయులు వారి బట్టలను రంగుల నిమిత్తము హాలెండునకు, బంపెడివారు. ౧౬౬౨-వ సంవత్సరములో మొదటిపర్యాయము రాయల్ సొసైటీయను భౌతికశాస్త్ర సంఘమువారు అద్దకములను గూర్చియు,వానిపద్ధతులను గూర్చియు,నొకపుస్తకమును బ్రచురించిరి. ౧౬౬౭-వ సంవత్సర

ములో నొక డచ్చి యర్ధకుఁడు ఇంగ్లండునకు వచ్చి ప్రభుత్వము వారి యాదరణమును బడసెను. ౧౮౧౫-వ సంవత్సరములో ౭౦,౦౦౦ మంది పరాసు పనివాండ్రువచ్చి ఇంగ్లండులో నివాసము చేసికొనిరి. నాటినుండి యింగ్లండులోఁగూడ నర్ధకపు పరిశ్రమ తదితర దేశములతోఁ బాటు వృద్ధిఁ జెంద నారంభించెను. ఫ్రాన్సు, ఇంగ్లండు, జర్మనీ మున్నగునైరోపా దేశములలో ప్రభుత్వము వారే పుస్తకములు వ్రాయించియు నుపాధ్యాయుల నూరూరికిఁ బంపియు మరియు నితర ప్రోత్సాహములఁ బనివాండ్రకుఁగల్పించియు నీ పరిశ్రమను త్వరితములో నభివృద్ధిఁజేసిరి.

పదునెనిమిదవ శతాబ్దము రసాయన శాస్త్రాభివృద్ధి చరిత్రలో ముఖ్యమైన పట్టు. అర్ధకపు పరిశ్రమలో నుపయోగించెడి సోడా యుప్పు, చలువసున్నము, గంధక ద్రావకము మొదలగు వస్తువులను సులభముగను, తక్కువ ఖరీదునకును, తయారుచేయు మార్గములఁగనిపెట్టిరి. పందొమ్మిదవ శతాబ్దములో నర్ధభాగము గడచిన వఱకును స్వభావసిద్ధములగు మూలికలనుండి తీసిన రంగులనే వాడుక చేసెడివారు. కాని ౧౮౩౪-వ సంవత్సరములో నొక జర్మను శాస్త్రజ్ఞుఁడు "అని లీని" పదార్థము (Aniline) తోను చలువ సున్నముతోను ప్రశస్తమైన నీలిరంగును తయారు చేసెను. అని లీను మూలికలనుండి తయారు చేయఁబడిన పదార్థముగాదు. ఇది తారు(వాడకీలు) నుండి తయారుకాఁబడినది. తారెట్లు వచ్చెనో కొంచెము విచారణ చేయుదము. మనవలెగాక ఐరోపా ఖండవాసులకు నేలబొగ్గు (Coal-రాక్షసిబొగ్గు) ముఖ్యమైనఆస్తి. నేలబొగ్గు సహాయమువలన యంత్రములను నడిపి పరిశ్రమలు వృద్ధిఁజేసిరి. మనవలె గాక వారు నేలబొగ్గునే వంటచెఱుకుగ వాడెదరు. దానినుండి తీసిన వాయువుతో దీపముల వెల్గింతురు. వేయేల! వారి యార్థికాభివృద్ధికి నేలబొగ్గే యునికిపట్టు. దీపములకొఱకై వాయువును తయారు చేయుటకు నేలబొగ్గును, ఇనుపగొట్టములలో కూరి గాలి తగులకుండ మూతులు బిగించి కొలిముల లోఁ గాల్చెదరు. ఈ వేడిమికి నేలబొగ్గు వాయువును, తారును ఏర్పడి యినుపగొట్టముల మూతులకుఁ దగిలించిన తూములవంటి సన్నని యినుప నాళికల గుండ పైకివచ్చును. వాడకీలను పేరుతో నమ్మఁబడు తారు కొంచెము ద్రవముగ నుండు నల్లని పదార్థమని యందఱు నెఱిగిన విషయమే. దీనిని తిరిగి పైనిఁజెప్పిన రీతిని నేలబొగ్గువలె గాలిసోకకుండ మరగఁబెట్టవచ్చును. అప్పుడు పైనిఁజెప్పిన "అనిలీను" పైకివచ్చును. అనిలీను రంగులేనిదై నీటివలె స్వచ్ఛముగ నుండుద్రవపదార్థము. చలువసున్నముదీనితో గలిపి యానీటిలో గుడ్డనుముంచినచో గుడ్డకు నీలిరంగువచ్చును. ౧౮౫౬-వ సంవత్సరములో "పెర్కిన్" (Perkin) అను నాంగ్లేయ శాస్త్రజ్ఞుఁడు అనిలీను నుండి "మావ" ను

(Mauve) నల్లవాఁగుగ నుండు ఎరుపురంగును సాధించెను. ౧౮౬౮-వ సంవత్సరములో "అలిజరీన" ను, ఎరుపురంగు, జర్మనీ దేశములో తారునుండియే తయారుచేయఁబడినది. ఇంతకుపూర్వ మీరంగు మంజిష్టయను మూలికతో బట్టలకు వేసెడి 'వార్ను' అనఁగా అలిజరీను మదారుచెక్క యందున్న రంగుయొక్క సారమని గ్రహించునది. ప్రకృతిలోనున్న మూలికయందుఁగల స్వాభావ సిద్ధమగు రంగులయొక్క సారములను మూలికల సంబంధ మేమియు లేకుండ తయారుచేయుట కిదియే ప్రథమప్రయత్నము. ఓషధుల సంబంధమేమియు లేక వానియందు నిబిడీకృతమైయున్న రంగులవలెనుండి మనుష్యుని బుద్ధిబలముచేఁ జేయఁబడినరంగులకు "కల్పితపురంగులు" (Artificial dyes) అని పేరు. మూలికల సహాయముచే వేయఁబడు రంగులకు "స్వాభావ సిద్ధమగు రంగులు" (Natural dyes) అనిపేరు. ౧౮౭౮-వ సంవత్సరములో బేయురను నతఁడు నీలిచెట్టు సంబంధము లేకయే తారునుండి తనబుద్ధికౌశలము నుపయోగించి నీలిమందును సాధించెను. కావున నిదియు కల్పితపు రంగనియే తెలిసికొనునది. ౧౮౫౬-వ సంవత్సరము మొదలుకొని తారునుండి వేలకొలఁది రంగులు చేయుచున్నారు. పైనివర్ణించినరీతి తారును మరగఁబెట్టినప్పుడు ముఖ్యమైన మూఁడు ద్రవ పదార్థములు వీడిపోవును. వీనికి "బెంజీను", "నాఫ్తలీను", "అంత్రశీను" అనిపేర్లు. ఇవి స్వచ్ఛముగనుండి వాసనయందు కొంచెమించుమించుగ కిరసనాయిలును బోలియుండును. ఇవియు కిరసనాయిలువలె మండును. ఈమూఁడునుకల్పితపు రంగులకు గనులని చెప్పవచ్చును. ప్రతి సంవత్సరము వందలకొలఁది కల్పితపురంగులు క్రొత్త వితయారగుటవలన అద్దకములం దేభాయమైనను తెప్పించుట కవకాశములుగలుగుచున్నవి. కల్పితపురంగులలో చాలభాగము పక్కారంగులు గాకపోయినను కావలసినన్ని పక్కారంగు లుండుటచేతను, కాంతిలోఁ దీసిపోకుండుట చేతను, రంగులయొక్క సంఖ్య మితిమీరి యుండుటచేతను, పాశ్చాత్య దేశములలో నిప్పుడు మొదటినుండియు వాడుకఁ జేయఁబడుచుండిన స్వాభావసిద్ధములగు రంగులగంటె ఈరంగులువానిస్థానము నాక్రమించినవి. మూలికలతోటి యద్దకము లిప్పుడు పాశ్చాత్య దేశములలోఁగానరావు. క్రొత్త రంగుల తోఁబాటు అద్దకములయం దుపయోగించెడి పరికరములలోఁగూడ మార్పులు గలిగినవి. పూర్వ మద్దకములయం దుపయోగించెడి చేతిపాత్రలకు మారుగ యంత్రసామగ్రి యధికముచేసి మనుష్యునికష్టము తగ్గించిరి. రసాయన శాస్త్రాభివృద్ధియు, యంత్రశాస్త్రాభివృద్ధియు స్వల్పకష్టముతో తక్కువ వెలకు నిర్ణీత కాలములో నెక్కువపని జరుగుటకుఁ దోడ్పడినవి.

అద్దకపువిద్య రసాయనశాస్త్రమునకు సంబంధించినది. అద్దకము వేయఁబడు వస్తువుతో

రంగులకు సమ్మేళనముం గూర్చుటయే యద్ద కుని ముఖ్యోద్దేశ్యము.

సామాన్య పద్ధతులు

అందుసకుంగాను రంగు నీటిలో కరంగిపోవునదియైయుండి యా నీటిలో వస్తువును ముంచినప్పుడు రంగుతిరిగి నీటినుండి విడిపోవలెను. లేనియెడల రంగులు పట్టవు. బొగ్గుపొడి నీటిలోఁ గలిపి యా నీటిలోబట్ట ముంచినచో బట్టమాయునుగాని రంగంటదు. ఏలయన నిచ్చట రంగుపదార్థమగుబొగ్గుపొడి నీటిలో కరగదు. కావున రంగులకును, రంగులు వేయంబడు వస్తువులకును పరస్పరాను రాగములేనిది సమ్మేళనమొనంగూరదు. ఈ యనురాగము వస్తువు యొక్క స్వభావమును బట్టియుండును. పరస్పరానురాగ తారతమ్యమునుబట్టి రంగులు వేయుపద్ధతులుగూడ మారుచుండును. ఉన్నికిని, రంగులకును సాధారణముగ నెక్కువ యనురాగముగలదు. అందుచేత సామాన్యముగ ఉన్నివస్తువులను రంగునీటిలో ముంచిన చాలును. నూలునకును రంగులకును అనురాగము మిక్కిలితక్కువ. అందుచేత కొన్నిరంగులు నూలువస్తువులకు పట్టనే పట్టవు. తక్కినవి మరికొన్ని వగరుపదార్థములతోఁగలిపినప్పుడే యంటును. అనురాగ విషయమున పట్టువస్తువులు ఉన్నికిని నూలునకును మధ్యస్థముగ నుండును. రంగులనే బట్టికూడఅద్దకములపద్ధతులుమారుచుండును. కొన్నిరంగులు నేరుగ బట్టలకెక్కును. కొన్ని యితర పదార్థములతో దోహదముఁ జేసినఁగాని యంటవు.

రంగులు వేయుటకు సామాన్య పద్ధతులు నాలుగుగలవు:—

(1) రంగుకషాయములో బట్టనుముంచి యెండవేసినప్పుడు నీరినికిపోయి రంగుమాత్రము బట్టనంటియుండును. నీటికి బదులుగ నీటికంటె నెక్కువత్వరగా ఇనుకునట్టి మరియొక పదార్థములో (అమోనియా) రంగును కరిగించి యాకషాయములో బట్టనుముంచిన యెడల రంగు త్వరితముగఁ బట్టును.

(2) గాలియందుఁగల ప్రాణ వాయువు సహాయముతో రంగులువేయుట. కరక్కాయలూరవేసిన నీటిలో బట్టనునానవేసి తరువాత అన్నభేదిఁ గలిపిన నీటిలో ముంచిన యెడల మొట్ట మొదట రంగేమియుఁ గనుపడదు. కాని బట్టగాలి తారినకొలఁది రంగునకు కాంతిహెచ్చును.

(3) రెండు పదార్థములు గలిపినప్పుడు కొన్ని తరుణముల నీరెంటికంటె భేదమగు వేఱొక పదార్థ మేర్పడును. సున్నపు తేటకు చాకలి చౌడుఁగలిసిననీటి తేటఁగలపిన యెడల తెల్లని పదార్థమొకటి పెరుగువలె దిగును. ఇట్లే రెండు పదార్థములు గలిసినప్పుడు కొన్ని తరుణముల రంగుపదార్థము లేర్పడును. ఈ పద్ధతి ముఖ్యముగ ఖనిజ సంబంధములగు రంగులువేయుటకే యనుకరింపఁబడుచున్నది.

(4) బట్టలను వగరు, పులుపు గాని పదార్థములలో నానవైచి తరువాత రంగులు

వేయుట. ఈపద్ధతి ముఖ్యముగ నూలుబట్టల కవసరము.

రంగుల విభజనము

రంగులను అనేకవిధములుగ విభజింప వచ్చును. రంగులువేయు పద్ధతినిబట్టి వ్యష్టి రంగులనియు(Simple colours) సమష్టిరంగులనియు (Compound colours) నొక విభజనము. ఎరుపు, పసుపు, నలుపు, నేరుగ రంగు పదార్థములతో వేయవచ్చును. ఊదా, ఆకు పసరురంగులు నేరుగ నాయారంగుపదార్థములతోనైన వేయవచ్చును. లేక రెండు వ్యష్టి రంగుల మిశ్రణమువలననైనను వేయవచ్చును. ఎరుపుమీఁద నలుపు వేసినచో ఊదావచ్చును. లేక నేతలో పడుగునకు ఎరుపు, పేకకునలుపు నూలును,తీసికొనినచో నూదారంగేర్పడును. ఇట్లే పసుపుమీఁద నీలివేసినచో నాకుపసరు రంగువచ్చును. కావున ఊదాయును, ఆకు పసరును సమష్టిరంగులనవచ్చును.

పక్కారంగులు (Fast dyes) కచ్చారంగులు (Fugitive dyes),అని రెండవ విభజనము. చౌడులోనుడక వేసినప్పుడుగాని,ద్రావకములు సోకినప్పుడుగాని, సబ్బుతో జాడించినప్పుడు గాని, ఎండకెండి, వానకుఁదడిసి, గాలికారినప్పుడుగాని వెలిసిపోకయుండెడి రంగులకు పక్కారంగులనిపేరు. ఇట్టి సందర్భములలో వెలిసిపోయెడివానిని కచ్చారంగులందురు.

రంగులయొక్క ప్రకృతినిబట్టి "సోపాధిక రంగులు" (ఉపాధికావలసిన - Adjective or mordant dyes) "నిరుపాధికరంగులు" (ఉపాధియవసరములేని - Substative or direct dyes) అని మరియొకవిధము. సోపాధిక రంగులు వేయుటకుఁ బూర్వము బట్టలను ఉపాధులనఁదగు రంగులీయని పదార్థములలో నుడకవేయవలెను. సాధారణముగ నుపాధులు (Mordant) వగరుగగాని పులుపుగ గాని యుండును. అందుచేత మనదేశములో నుపాధులకు "కసటువస్తువు" లనియు ఉపాధులలో బట్టల నుడకవేయుటకు "కసటు వేయుట" యనియు పేర్లుగలవు. బట్టల నుపాధులలో నుడకవేసినఁగాని సోపాధిక రంగులంటవు. నిరుపాధికరంగులకు నుపాధు లనవసరము. బట్టలనురంగుకషాయములో ముంచిన చాలును. ఖనిజ సంబంధములగు రంగులలో చాలభాగము నిరుపాధికములు. ఇవిగాక నీలిమందు, పసుపు,జాఫరాగింజలు, కుసుంభాపూలు మొదలగు నోషధులును, తారు రంగులలో (కల్పితపురంగులు) చాలభాగమును నిరుపాధికములే. కాని రంగులదీప్తి హెచ్చించుటకు నిరుపాధికములకుఁ గూడ నుపాధులఁ దగిలించు నాచారముగలదు. తరుచుగవాడెడి యుపాధులలో పటికయు, క్షరక్కాయలును ముఖ్యములు.

అద్దకములయం దనుకరించెడి పద్ధతులనుబట్టి రంగులనైదువిధములుగ విభజింప వచ్చును. వీనినిగుఱించి యింకుక యాక్రింద వ్రాయఁబడును. కల్పితపురంగులు వెలసినతరు

వాత పాశ్చాత్యులు మూలికల నద్దకములలో వాడుటలేదని పైని వ్రాసియుంటిమి. ఈ క్రింద వ్రాయఁబోవు విభజనము ముఖ్యముగ కల్పిత పురంగులకే వర్తించును. ఒకేరంగును వేయుటకు రెండుమూఁడు పద్ధతులుగూడఁగలవు.

(1) ద్రావకపురంగులు (Acid dyes) :- ఇవి ఉన్నికిని, పట్టునకును రంగులు వేయుట కుపయోగించును. సామాన్యముగ నూలు గుడ్డలకును, నారవస్తువులకును, ఈ రంగులుపట్టవు. ఈ రంగులను బజారులో పొడిరూపమున నమ్మెదరు. నీటిలో వేసిన వెంటనేకరుగును. ఈరంగులలోచాలవఱకు నెండలోను, కొన్ని యుడకవేయుటవలనను వెలిసిపోవును. కాని కొన్నిపక్కా రంగులు గలవు. ఉన్నినరమునకు (పీచు) రంగువేయుట కివి యోగ్యములుగావు. ఈ రంగులతో నద్దకము వేయునప్పుడు గంధక ద్రావకముఁ గూడఁ గలిపినఁగాని రంగు లంటవు. అందుచేత వీనికి ద్రావకపురంగులని పేరుబెట్టఁబడినది. ఈ రంగులలో బట్టల నుడకవేయునప్పుడు రంగుచక్కఁగ వచ్చువఱకును కొంచెము గంధకద్రావకము అప్పుడప్పుడు కలుపుచుందురు. గంధకద్రావకము రంగుపదార్థమును విడగొట్టి బట్టలకంటించును. నీలిమందు ద్రావకపురంగులలో నొకటి.

(2) క్షారపురంగులు (Basic dyes) :- ఇవియు ద్రావకపురంగులవలె నీటిలో కరిగెడి పొళ్లు. ఇందు క్షారభాగమునందు (Basic part) రంగుండును. ఇదియొక ద్రావకముతోఁగలిసినఁగాని రంగేర్పడదు. ఉన్నియందును, పట్టునందును స్వభావసిద్ధముగ ద్రావకపదార్థములున్నవి. అందుచేత నీ రెంటికిని ఉపాధులులేకయే యీ రంగు లెక్కును. దూదియందును, నారయందును ద్రావకములు లేవు. అందుచేత నీ రెంటికిని క్షారపురంగులు నేరుగనెక్కవు. రంగులువేయుటకు పూర్వము వానిని ద్రావకోపాధులతో నుడకవేయవలెను. ఇందుకు ముఖ్యముగ వాడఁబడునది కరక్కాయల కషాయము. కరక్కాయ నీటిలోనానిన నూలుబట్టలుగాని నారవస్తువులుగాని క్షారపురంగులలో నుడకవేసిన యెడల రంగులు చక్కఁగనంటును. ఉన్నికంటె పట్టునకే రంగుల నాకర్షించుశక్తి యెక్కువగలదు. రంగుల నెక్కువదీప్తిమంతముగఁ జేయుటకు, ఉన్నిబట్టలను పట్టుబట్టలనుగూడ సబ్బుతో నుడకవేయుదురు. లేదా కొంచెము ద్రావకములనైనను గలిపెదరు. ఈ రంగులు సామాన్యముగ సబ్బునకువెలియవు కాని యెండ కెండినప్పుడు చాలవఱకు వెలిసిపోవును.

(3) సోపాధికరంగులు (Adjective or mordant dyes) :- ఈ రంగులయొక్క స్వభావమునుగూర్చి పైని వ్రాయఁబడినది. బట్టలను పాధులలో నుడకవేసినప్పుడే యీ

రంగులు శాశ్వతముగనుండును. మఱియు నివి ద్రావకములవలె పనిచేయును. కావున వీని యుపాధులు భస్మముల (Metallic oxides) నిచ్చెడి పదార్థముగ నుండవలెను. ద్రావకములు భస్మములతోఁగలిసి లవణములగును. ద్రావక ప్రకృతిఁగల సోపాధికరంగు లుపాధుల యందుఁగల భస్మములతో సమ్మేళన ములై లవణ (Salt) ప్రకృతిఁగల రంగు లేర్పడును. సోపాధికరంగు లన్నివిధములగు వస్త్రములకును వేయవచ్చును. స్వభావ సిద్ధములగు రంగులలో ననేకములు సోపాధికములే. మంజిష్ట, చిఱువేరు, పతంగి, కిరిమింజి మున్నగునవి సోపాధికములు. కల్పితపురంగులలో "టర్కీ-యెరుపులు" "అలిజరీనురంగులు" లోనగునవిసోపాధికములు.

(4) నిరుపాధిక రంగులు (Substantive or direct dyes) :—ఈరంగులను గూర్చి కూడ పైని వ్రాయఁబడినది. ఈరంగులు నూలుబట్టలకుఁగూడ, ఉపాధులు లేకయే వేయవచ్చును. స్వభావసిద్ధములగు రంగుల లోను, కల్పితపురంగులలోను నిరుపాధికములుగలవు. ఇవియన్నియుసామాన్యముగ నీటిలో కరగును. అందుచేత బట్టలకు హెచ్చుతగ్గులులేక రంగులు వేయవచ్చును. ఇవియన్నియు నెండకు వెలియకపోయినను కొన్నిరంగులు ద్రావకములుగాని క్షారములుగాని సోకినప్పుడు వెలిసిపోవును. శీఘ్రముగ నీ రంగులు బట్టల కెక్కుచుండుటకై యీ రంగులతో సాధారణముగ కొన్నిమందపదార్థములను గలిపెదరు. ఉప్పు, టంకము, సోడా పొడి, సబ్బులోనగునవి యిట్టి సాహాయ్య పదార్థములు. ఇవి యాలస్యముగఁబట్టెడి రంగులను త్వరపెట్టుటకును, త్వరితముగ నెక్కెడిరంగుల నాలస్యముగ నంటునట్లు చేయుటకును, ఉపయోగించును. ఈరంగులు కలుపుడు నేతలకుఁ(పట్టు,ఉన్నికలిసినవి లేకనూలుపట్టుకలిసినవి) గూడవేయవచ్చును. కల్పితపు రంగులలో "కాంగో యెరుపు" "బెంజీను రంగులు" ముఖ్యములగు నిరుపాధికములు.

(5) దోహదపు రంగులు (Developed colours) :- అద్దకములయందు దుపయోగించెడి కొన్నిపదార్థములు బట్టల యొక్క సంపర్కము గలిగినఁగాని రంగులేర్పడవు. రంగులనిచ్చెడి పదార్థముల కషాయములతో మరికొన్ని పదార్థముల:గలిపి బట్టల నందులో ముంచినఁగాని రంగులేర్పడవు. కావున నిట్టిరంగులకు దోహదపురంగులని పేరుబెట్టవచ్చును. ఇందు రెండుమూఁడు తరగతులు గలవు. స్వభావ సిద్ధములగు రంగులలోఁ గొన్నిదోహదపు రంగులు. నీలిమం దిట్టి జాతిలోనిది. "అనిలీను నలుపు," "ఆజోరంగులు" మున్నగు కల్పితపురంగులీజాతిలోనివి. ఖనిజ సంబంధము

లగు రంగులన్నియు దోహదపు రంగులు. దోహదపురంగులు ముఖ్యముగ నూలు బట్టలయద్దకమునం దుపయోగించెదరు.

నీలిమందు చూచుటకు, నల్లగానున్నను, ఈస్థితిలోరంగు వేయుటకుఁ బనికిరాదు. ఏలయన నీలిమందు నీటిలోకరగదు. కరిగినఁగాని రంగంటదు. అందుచేత రంగువేయుటకుఁ బూర్వము దానితత్త్వముమార్చిగుడ్డను దానిలో ముంచుదురు. గుడ్డను ముంచునప్పటికి తత్త్వము మారిన నీలిమందు రంగులేకయే యుండును. గుడ్డనుముంచియెండలోవేసినతరువాతగాలిసోకి నీలిరంగేర్పడును. నీలిమందును నీటిలో కరగునట్లు చేయుట కనేక పదార్థములుపయోగింతురు. అన్నభేది, సోడాపొడి గంధకపుపొగలు మున్నగువస్తువులవాడెదరు. ఒకపద్ధతిలో బెల్లపునీరు, తవుడు, సున్నము, సోడాపొడి, నీలిమందుతోఁ గలిపి మురగఁ బెట్టెదరు. ఇట్లు మురిగినరంగు నీరు బూడిదె రంగుఁ గలిగియుండును. ఈ నీటిలో బట్టను ముంచి గాలిలో నారవేసిన యెడల నిగనిగలాడుచు నీలిరంగువచ్చును.

అనిలీను నలుపు (Ainline black):- అనిలీను నీటివలె స్వచ్ఛమైన ద్రవపదార్థమని యిదివరలో వ్రాసియుంటిమి. ఇది ప్రాణ వాయువుతోఁ గలిసి అనిలీను నలుపను రంగగును. అనిలీను ప్రాణవాయువుతోఁ గలియుటకు కొన్ని వాహకము లవసరమై యున్నవి. అనేక వస్తువులు వాహకములుగ నుపయోగించు చున్నారు. మైలతుత్త మిట్టి వాహకములలోనొకటి. మైలతుత్తపు నీటిలో బట్టనుముంచిన తరువాత రంగునీటిలోముంచి ఎండవేసినప్పుడుగాలిలోనున్న ప్రాణవాయువు, అనిలీనుతో సంయోగమునొంది నల్లనిరంగు బట్టలకెక్కును. ఈరంగు వేయుటకుఁగావలసిన తప్పీళ్లు స్థలాంతరములో వ్రాయఁబడును.

ఖనిజ జాతిరంగులన్నియు (Mineral colours) దోహదపురంగులని పైనివ్రాయఁబడినది. ఇందు ముఖ్యమైనవి యైదారు మాత్రముగలవు. అవి యిచ్చట వర్ణింపఁబడును.

క్రోముపసుపు (Chrome yellow) :-ఇది నూలుబట్టలకువేసెడి రంగు. ఇది వేయుటకు బట్టను మొదట సున్నపు తేటలోనానవేసి, లెడ్డు ఆసిటేటులోగాని నైట్రేటులోగాని ముంచెదరు. (ఈ రెండును సీససంబంధమగు లవణ పదార్థములు. సీసము ఆసిటిక్ ద్రావకముతో గలిసి లెడ్డాసిటేటగును. అట్లే సీసము నైట్రిక్ ద్రావకముతోఁగలిసి లెడ్ నైట్రేటగును). తిరిగి యాబట్టను సున్నపు నీటిలోముంచి, పిండి, పొట్టాసియం బైక్రోమేటు (Potassium Bichromate) నీటిలో నానవేసెదరు. ఇట్లు కొంతసేపునానినగుడ్డను కొంచెముశంఖద్రావకము గలిపిన నీటిలోపిండి యారవేసెదరు. అప్పుడు తేటయగు పసుపుపచ్చరంగువచ్చును. ఈ పసుపురంగు వేసినబట్టను చిక్కని సున్నపు నీటిలో నుడకవేసినయెడల మంచి నారంజ పండువర్ణముగల రంగేర్పడును.

మండూరపువర్ణము – ముక్కుపొడివర్ణము (Iron buff) :-ఇది నూలుబట్టలకు మాత్ర ముపయోగింతురు. అన్నభేదిఁగలిపిన నీటిలో బట్టలను నానవేసి సోడాపొడినీటిలోగాని, సున్నపునీటిలోగాని యుడకవేసి యెండవేయుట వలన నీ రంగువచ్చును. ఉడకవేసిన బట్టలను నేరుగ నెండవేయుటకు బదులుగ కొన్నితరుణముల చలువసున్నములోఁగూడ నుడికించి తరువాత నెండవేయుదురు. అప్పుడు బట్టలకు ముక్కుపొడి రంగుపట్టును. ఈ రంగుతుడుకుట వలనగాని యెండవేయుటవలనగాని వెలియదు. కాని ద్రావకములు సోకినప్పుడు నిలువదు.

ప్రషియను నీలి (Prussian blue) :- ఇది యన్నివిధములగు బట్టలకును పనికివచ్చును. పట్టుయొక్క తూనిక హెచ్చించుటకే రంగు వేసి వర్తకులు మోసముచేయుదురు. నూలు బట్టలకును పట్టుబట్టలకును ముందుగ పైనిఁ జెప్పినరీతిని మండూరపురంగువేసి తరువాత నీలివేయుదురు. నీలివేయుటకు మండూరపు రంగుబట్టను "పొటాసియం ఫెర్రోసయనైడ్" (Potassium ferrocyanide) అను లవణ మును శంఖద్రావకమును గలిపిన నీట్టిలో నుడకవేయుదురు. నీలిరంగు ముదురుగ పడ వలెనన్నిట్లు రెండుమూఁడు పర్యాయములు చేయవలెను. ఉన్నికి నీలివేయుటకు ముం దుగ మండూరపు రంగువేయ నక్కఱలేదు. పొటాసియం ఫెర్రోసయనైడ్తో గంధక ద్రావకమును గలిపి నీటిలో కరగించి ఉన్ని నందులోవేసి క్రమముగ నానీటిని కళకళ కాగనిచ్చెదరు. ఇట్లు కొంతసేపుడికిన తరు వాత ఉన్నిని పైకిదీసి నీటిలో జాడించెదరు. రంగును మిక్కిలి దీప్తిమంతముగాఁ జేయుట కుడుకుచున్నప్పుడు తగరపునీరు (తగరమును శంఖద్రావకములోఁ గరగించి నీటిలోఁ గలు పుట-(Stannous chloride) కొంచెము గలి పెదరు. ప్రషియనునీలి సామాన్యముగ పక్కా రంగైనను క్షారములుసోకినప్పుడు వెలియును.

మాంగనీసుబ్రౌను (Manganese brown):- ఇది కొంచె మించుమించుగ మాంసము వర్ణము గలిగియుండును. ఇది ముఖ్యముగ నూలుబట్టలకువేయుదురు. కదాచిత్తుగ ఉన్ని కిని, పట్టునకును వేయు చున్నారు. ఈ రంగు వేయుటకు బట్టలను "మాంగనీసు క్లోరైడు" (Manganese chloride) అను లవణముఁ గలిపిన నీటిలోముంచి తరువాత సోడాక్షార మును (Caustic soda) చలువ సున్నమును గలిపిన నీట్టిలో నుడకవేయుదురు.

ఉపాధులు

బట్టలకు రంగు లంటుటకుఁగా నుపయో గించెడి కసటు వస్తువు లుపాధు లనవచ్చునని యిదివరలో వ్రాసియుంటిమి. ఇవి రెండు విధ ములు. ఖనిజ సంబంధములయినవి కొన్ని. వీనిని ఖనిజోపాధు (Mineral or inorganic mordants) లన వచ్చును. తక్కినవి మూలి కల సంబంధములు. వీనిని మూలికోపాధు (Vegetable or organic mordants) లన

వచ్చును. మన దేశములో పటిక, సజ్జికారము, అన్నభేది మొదలగు రెండుమూఁడుపాధులు తప్ప నెల్లప్పుడు మూలికోపాధులే వాడఁబడు చున్నవి. విదేశములలో నట్లుగాక రెండు విధములగు నుపాధులను సమముగ వాడుదురు.

ఖనిజోపాధులు:-గంధకద్రావకము, శంఖద్రావకము. నీటిలో వీనిని గలిపి బట్టలు ముంచుదురు.

పటిక:-ఇది అల్యూమినియమను లోహ సంబంధమగు లవణము. "అల్యూమినియం ఆసిటేటు" అను మరియొక లవణముగూడ వాడుటగలదు. ఇది విశేషముగ కలంకారీ యద్దకమునందుపయోగపడుచున్నది. సాదా యద్దకమునందు దూది, నార, ఉన్ని పదార్థములను కసటువేయుట కివి యుపయోగపడును. కాని పట్టున కివి వాడరు. ఉన్నియద్దకమునందు పటికయు, నూలద్దకమునందు అల్యూమినియం ఆసిటేటును వాడెదరు.

క్రోమియము:- ఇది యల్యూమినియమువలె నొకలోహము. ఆసిటేటు, సల్ఫేటు, క్లోరైడు, క్రోమేటు, బైక్రోమేటు మొదలగు క్రోమియములవణము లుపాధులుగవాడెదరు. పటికవలె నివియు పట్టుబట్టలకుతప్ప తక్కిన యన్నివిధములగు బట్టలకు నుపయోగపడు చున్నవి.

ఇనుము:-దీనిలవణము లనేకము లుపాధులుగ నుపయోగించెదరు. ఇవి యన్నివిధములగు వస్త్రముల యద్దకమునందు నుపయోగపడుచున్నవి. ఇందు అన్నభేది ముఖ్యమైనది. ఇదిగాక నైట్రేటు, ఆసిటేటుగూడ వాడుచున్నారు. పట్టునకు నలుపురంగు వేయుటకు నీ యుపాధులే ముఖ్యముగ వాడుదురు.

రాగి:-మైలతుత్తము (మయూరతుత్తము) రాగి సంబంధమగు లవణము. గంధకద్రావకములో రాగిని కరిగించుటవలన నిది యేర్పడును. ఇదిగాక "కాపర్ ఆసిటేటు"(Copper acetate-రాగిని వినీగరులో కరిగించుటవలన నేర్పడిన లవణము) గూడ నప్పుడప్పుడు వాడుట గలదు.

ఆంటిమొని (Antimony):-ఇది యొక లోహము. సౌవీరము ఆంటిమొని సంబంధమగు భస్మము. ఇది చింతపండు పులుసుతోఁ గలిసి యొక యుపాధిగ వాడఁబడుచున్నది. పట్టు, ఉన్ని బట్టలకు దీనిని వాడరు.

తగరము:-క్లోరైడు, నైట్రేటు తగర సంబంధమగు నుపాధులు. తగరమును శంఖద్రావకములో కరిగించుటవలన మొదటిదియు నైట్రిక్ ద్రావకములో కరిగించుటవలన రెండవదియు నేర్పడును. రంగులను మిక్కిలి దీప్తిమంతములుగఁ జేయుటకీ యుపాధులు వాడఁబడుచున్నవి. ముఖ్యముగ ఉన్నికిని, పట్టునకును వీనిని వాడుదురు. నూలునకును, నారకును విశేషముగ వాడరు.

పై నుదాహరించిన ఖనిజోపాధులలో బట్టలను ముంచినప్పు డాయుపాధుల యొక్క భస్మములు (Oxide-లోహము, ప్రాణవాయు

వుగల పదార్థములు బట్టల నంటియుండును. ఇవి రంగుపదార్థముల యందుఁగల రాగభాగముల నాకర్షించి బట్టల కంటుకొని యుండునట్లుచేయును. ఇదియే యుపాధులయొక్క ముఖ్యోద్దేశ్యము.

మూలికోపాధులు :-ఇందు ముఖ్యమైనవి "వినీగరు" (Acetic acid), చింతపండు పులుసు, నిమ్మకాయలరసము, కరక్కాయలు, కాచు, డివిడివిగింజలు లోనగునవి. ఇవిగాక కొన్ని చెట్లయొక్క చెక్కలు, బెరడులు, పూలు గూడ వాడుకలోనున్నవి. మూలికోపాధుల యొక్క సారములను వండి తీసి సీసాలలో నమ్ముచున్నారు. ఇందు మూలమున పని వాండ్రశ్రమ తగ్గును. అందుచేత మన దేశములో దొరకెడివస్తువులు సయితము విదేశములనుండి సారరూపమున దిగుమతి చేయఁబడుచున్నవి. కొన్ని తైలములు మూలికోపాధులుగ వాడుచున్నారు. ఇందు ముఖ్యమైనది "టర్కీయెరుపునూనె" (Turkey-red-oil). ఆముదముతో గంధకద్రావకమును గలిపి యుప్పునీరుపోసి కలియఁబెట్టుటవలన పైతైలమేర్పడును. ఇది ముఖ్యముగ నూలు బట్టలకుఎరుపురంగు వేయుటకుపయోగపడును. టర్కీయెరుపనునది యొక యెరుపురంగు పేరు. ఈరంగు వేయుట కుపయోగింతురుగాన దీనికి టర్కీయెరుపు నూనెయని పేరువచ్చినది.

బట్టలయొక్క స్వభావమునుబట్టి యుపాధులు వేయుపద్ధతులు మారుచుండును. ఉపాధులతత్త్వమునుబట్టికూడ పద్ధతులుమారును. ఉన్నిని కసటువేయునప్పుడు కొంచెము ఉపాధియు, నెక్కువనీరునుగలిపి ఉన్ని నందులో నుడకవేయవలెను. ఉపాధులు చక్కఁగఁ బట్టుటకు కొన్నితరుణముల సహకారవస్తువుల నుపాధులతోఁగలిపెదరు. గంధకద్రావకము, చింతపండు పులుసు, పులిమజ్జిగలోనగునవి ఉన్నికసటునందుపయోగించెడివస్తువులు. పట్టును కసటువేయుటకు నుపాధులలో నుడకవేయనక్కరలేదు. చల్లని నీటిలోనే చక్కఁగ నంటును. నూలునుగాని, నారవస్తువులను గాని కసటువేయుపద్ధతులు రంగునుబట్టియు, రంగులయొక్క కాంతినిబట్టియు మారుచుండును. పటికను, కాంతిఁగల యెరుపు వేయుట కుపయోగింతురు. తగరపు సంబంధములగు నుపాధులు రంగులను దీప్తిమంతములుగఁజేయుటకు వాడుదురు. ఇట్లే మైలతుత్తము, అన్నభేది, మూఁగరంగులు వేయుట కుపయోగపడును.

రంగులువేయుటకు పూర్వము చేయవలసినతంతు బట్టలయొక్క స్వభావమును బట్టియుండును. ఉన్నివస్తువులన్నియు క్షారములలో నుడకవేసి వానినంటియున్న మాలిన్యములను దీసివేయవలెను. పట్టుబట్టలను సబ్బులోనుడకవేసినగాని వానినంటియుండు కొవ్వు జిగురు మున్నగు జంతుసంబంధమగు దుర్వాసనవస్తువులుపోవు. నలుపురంగులు వేయునప్పుడు నూలు చలువ చేయనక్కరలేదు. కాని లేతరంగులుగాని మిక్కిలి కాంతిగల

రంగులుగాని వేయుటకు నూలుబట్టలనుచలువ జేసితీరుదురు. నూలుగుడ్డలు, ఉన్నిగుడ్డలు, ఉల్లాసీదాలు (ప డు గు కు నూ లు, పేకకు ఉన్ని) రంగులు వేయుటకుఁ బూర్వము సాపు చేయుదురు. నూలుబట్టలు సామాన్యముగ కసటు వేయుదురు. సాధారణముగ ఉన్నిబట్టలను పట్టుబట్టలను కసటు వేయ నక్కఱలేదు. రంగులు వేయుటకుఁ బూర్వము బట్టలను కసటు వేయుట సామాన్యాచారము. కాని రంగులను ఉపాధులతోఁ గలిపి యొకేమారు డక వేయుటయు, రంగులలో నుడక వేసిన తరువాతబట్టలను కసటు వేయుటయుఁగూడఁగలదు రంగులుచక్కఁగఁ బట్టుటకు చల్లనిరంగు కషాయములో బట్టలనుముంచి క్రమముగ నుడకఁ బెట్టుదురు. సాధారణముగ పట్టుబట్టల యద్దకములో రంగుకషాయము వేడిగనుండనక్కఱ లేదు. పాశ్చాత్యులిప్పుడు కల్పితపురంగులే వేయుచుండుటవలన నవివేయు యోగము లొకటి రెండిందుఁ దెలిపెదము:—

నూలుబట్టలకు అనిలీనునలుపు (దోహదపురంగు) వేయువిధము:—

| | |
|---|---|
| నవాసారము | 10 పాళ్లు. |
| సోడియము క్లోరేటు | 10 ,, |
| మైలుతుత్తము | 10 ,, |
| రంగుపదార్థము (అని లీను హైడ్రోక్లోరైడు) | 35 ,, |
| అనిలీనునూనె(యథోచితము) | |
| నీరు | 200 ,, |

ఇవి నలుపు వేయుటకుఁ గావలసిన వివిధ వస్తువులపాళ్లు. నవాసారమును, సోడియము క్లోరేటునుగలిపి కొంచెమునీటిలోఁ కరిగించెదరు.తరువాత ప్రత్యేకముగ మైలుతుత్తమును కొంతనీటిలోను,రంగుపదార్థమును మరికొంత నీటిలోను వేర్వేఱుగ కరిగించి దీని పులుపు విరుగునట్లు అనిలీనునూనె (Aniline oil) గలుపుదురు. ఇవియన్నియుఁజక్కఁగచల్లారిన తరువాత నవాసారమునీరు రంగుపదార్థముతోఁ గలిపి యటుమీఁద మైలతుత్తము నీరుగూడ నందులోఁబోసి చక్కఁగ గలియఁ బెట్టుదురు. ఈ మిశ్రణములో కావలసిన నీరంతయుఁబోసి బట్టలను ముంచి యొకపూట యెండవేయుదురు. ఇప్పటికి రంగు పూర్తిగ బట్టునుగాని బట్టకు నిగనిగరాదు. ఇందులకుఁ గాను పొటాసియం బైక్రోమేటు (10 పాళ్లు) సోడాపొడి (5 పాళ్లు) ఉప్పు (5 పాళ్లు) వేయి పాళ్ళ నీటిలోఁ గలిపి యానీటిలో రంగువేసిన బట్టల నుడికవేయుదురు.

ఉన్నిబట్టలకు ఆకుపచ్చరంగు వేయుట:- మూఁడు తానులకు,అనఁగా రమారమి రెండు మణుగుల యెత్తుగల బట్టలకు రంగువేయుట కీక్రిందఁజెప్పిన వస్తువులు కావలయును.

| | |
|---|---|
| పటిక | 3 వీసెలు. |
| నీలిమందుసారము | ,, |

పిక్రికుఆసిడ్డు 3 అరవీసె.
గంధకద్రావకము పావుశేరు.

ఈ వస్తువులకు రమారమి 50 కుంచముల నీటిలోఁ గలిపి బట్టల నా నీటిలో నొకగంట కాలముడక వేసినయెడల, ఆకుపచ్చరంగు బట్టలకు పట్టును.

పట్టుబట్టలకు నెమలి మెడరంగు (మైల తుత్తమురంగు) వేయుపద్ధతి:—

గంధకద్రావకము అరశేరు.
రంగుపొడి (మెథిలీనునీలి) శేరు.

ఈ రెంటిని నీటిలోఁ గలిపి నులివెచ్చగ నుండగ బట్టలను నానఁబెట్టుదురు. ఈపాళ్ళతో 80 పౌనుల పట్టునకు రంగువేయవచ్చును.

నూలుబట్టలకు వంగపండుపసుపు (క్రోము పసుపు) వేయువిధము:—

ఇది ఖనిజసంబంధమగు రంగు. మూఁడు మణుగుల యెత్తుగల బట్టలకీ క్రిందఁ జెప్పినఁ వస్తువులు గావలసియుండును.

లెడ్ ఆసిటేటు శేరునకు రెండు పలముల చొప్పున నీటిలోఁగలిపి బట్టలనందులోముంచి తరువాత సున్నపుతేటలో జాడించ్చిన పిమ్మట నాలుగుకుంచముల నీటిలో నరవీసెడు పొటాసియము బైక్రోమేటుఁ గలిపి యానీటిలో ముంచవలెను. ఇట్లు నాలుగు పర్యాయములు ముంచిన యెడల చాలును. గన్నేరు పువ్వు రంగు రావలెనన్న కొంచెము శంఖద్రావకముఁ గలిపిన నీటిలో నొకటి రెండు పర్యాయములు ముంచవలెను.

ఇంతవరకు నద్దకాంశములు చర్చింపఁబడినవి. వస్త్రకసరిలో బాహ్యాళ్యముమీఁద రంగులు వేయునప్పు డుపయోగించెడి పరికరములు, పదార్థములయొక్కయు, రంగులయొక్కయు, తత్త్వముల ననుసరించి యుండును. వానిని గూర్చి తప్పిళ్ళుచర్చించుటకిక్కడ నవకాశము చాలదు. కావున సంక్షేపముగ సూచింపఁబడును. వస్త్రకసరిలో చాలవఱకు పట్టును, ఉన్నిని కసటువేయకుండగనే రంగులు వేయుదురు. నూలుబట్టలను నారవస్తువులను రంగులువేయుటకుఁ బూర్వము కసటువేయుదురు. రంగులువేయుటయం దుపయోగించెడి నీటి విషయమై యద్దకములవారు చాలశ్రద్ధఁదీసికొనెదరు. ఏలయన తఱుచుగ నీటిలో కరిగియున్న పదార్థములవలన రంగులు చెడిపోవును. లోహసంబంధమగు పదార్థములు (అన్నభేది వగయిరాలు) కరిగియున్నయెడల నట్టి నీటిని వాడుకచేసినప్పుడు మూఁగరంగులేర్పడునుగాని దీప్తిమంతములగు రంగులుపట్టవు. ఇట్లే సీమసున్నముగూడ నీటిలో కరగియుండవచ్చును. ఈకారణములనుబట్టి యట్టినీటిని వాడుటకు పూర్వము వర్ణకారులు యుక్తమగు మార్గములచే శుభ్రముచేయుదురు. రంగులు వేయుట కిదివరలో కొయ్యతొట్ల నుపయోగించెడి వారు. కాని యిప్పుడు సామాన్యముగ ఇనుపతొట్లలో రంగులువేయుచున్నారు.

రంగులువేయఁబడు వస్తువులు మూఁడు స్థితులలోనుండివచ్చును. ఘుడివస్తువులను ఏకి

వడకకపూర్వము పీచుగనుండినప్పుడే రంగులు వేయవచ్చును. లేదా, వడికిన నూలునకును వేయవచ్చును. నేసినతరువాత బట్టలకు వేయవచ్చును. అద్దకపు పద్ధతులుగూడ తప్పీళ్ళలో నీపదార్థస్థితినిబట్టియుండును. రంగులకును రంగులువేయువస్తువులకును సంపర్కము గలుగఁ జేయుటకు రెండు మార్గములున్నవి. రంగు కషాయములో వస్తువులనుముంచి రంగు, బట్ట కంతయు సమముగఁ బట్టువఱకు రంగులో ద్రిప్పుచుండవలెను. లేదా వస్తువులనుతొట్లలో స్థిరముగనుంచి రంగు కషాయమును బట్టల కంతయు సమముగనంటునట్లు ప్రసరింపఁజేయవలెను. యంత్ర సాహాయ్యమువలన నీరెండవ పద్ధతి సాధ్యమగును. వస్తువులను పీచుస్థితిలో (వడకక పూర్వము) నద్దునప్పుడీ పద్ధతి నవలంబించెదరు. నూలునకును నేసినబట్టలకును రంగులు వేయునప్పుడు మొదటిపద్ధతి ప్రకారము వేయుదురు.

పీచులయద్దకము :—ఉన్నిని పత్తిని కొన్ని తరుణముల పీచుస్థితిలోనే యద్దుదురు. ఇందులకు మూతలేని కాగులలో వీనినుంచి రంగు కషాయముఁబోసి యుడకఁబెట్టెదరు. రంగు చక్కఁగనంటుటకు విరామములేకుండ కలియఁ బెట్టుచుందురు. అయినను సాధారణముగ కొంతపీచు జడలుగట్టి రంగు హెచ్చుతగ్గులుగఁ బట్టును. అట్లుగాకుండఁ జేయుటకై వేడిగనుండు రంగుకషాయమునే పీచుగుండ యంత్ర సహాయమువలన ప్రసరింపఁ జేయుదురు.

నూలద్దకము :—నూలనఁగా పత్తినూలే కాదు, ఉన్నినూలు, పట్టునూలు, నారనూలు (పురి) గూడ నిందులోఁ జేరును. నూలుకు లాడీలుగాకాని (నూలు పిళ్లు) మగ్గముమీఁద నెక్కించిన తరువాతఁ గాని రంగు వేయుదురు. లాడీలకు రంగు వేయునప్పుడు ౩-వ పటములోఁ జూపినటువంటి తొట్ల నుపయోగింతురు. ఈతొట్లు రాతితోఁ గాని కొయ్యతోఁ గాని కట్టెదరు. తొట్లలో రంగు కషాయమునుంచి నూలును పటములోఁజూపినరీతిని కొయ్యలనుండి వ్రేలాడఁ గట్టెదరు. తొట్లను రంగు కషాయముతో నింపి లాడీలనందులో ముంచెదరు. రంగును మరగఁ బెట్టుటకు పటములో జూపినటువంటి యొక గొట్టముద్వారా యావిరిని బంపెదరు. ఈ గొట్టము తొట్లయడుగు భాగమంతయు వ్యాపించుటచేత గొట్టముగుండ ప్రవహించెడి యావిరివేడిమికి రంగుకాగును. రంగుమరుగునప్పుడు లాడీలను క్రిందు మీఁదుఁ జేయుదురు. ఇందువలన రంగులు హెచ్చుతగ్గులు లేక చక్కఁగ నంటును. అద్దకముపూర్తియైన తరువాత లాడీలను నీటిలోఁజాడించి యావిరి వేడిమిచే నారవేయుదురు.

మగ్గముమీఁదనుండఁగనే నూలుకు రంగు వేయవచ్చును. ఇందులకు నిర్మించిన తొట్లు పడుగంతయు దూరుటకు తగినంత వెడల్పుగ నుండును. వరుసగ రెండుమొదలు నాలుగు తొట్లవరకుండును. మగ్గములు కప్పీలమీఁద

తొట్లలో ముంచెదరు. ఒకతొట్టినుండి మరియొక తొట్టిలో ముంచుటకుఁ బూర్వము మగ్గము నంటియుండు రంగు నీరంతయుఁ బోవుటకు నీటిని పిండు యంత్రముండును. రంగులో ముంచుట—పిండుట—ఈ పనులు నాలుగు తొట్లున్న యంత్రములో నాలుగు పర్యాయములు జరుగును. అప్పటికి రంగులు చక్కఁగ నంటును.



3-వ పటము

తఱుచుగ, నేసినబట్టలకారంగులు వేయుదురు. సాదారంగులన్నియు బట్టలకే వేయుదురు. ఏలయన వ్యాప్తిరంగులన్నియు నొక పర్యాయము వేసినచో నంటును. బట్టలకు రంగువేయుట యందు రెండుపద్ధతులు వాడుకలోనున్నవి. బట్టలను మడవకుండ వెడల్పుగ దూలములపైఁ జుట్టి యాదూలములు తిరుగుట వలన బట్టవిడిపోయి రంగులోమునిగి యంత్ర సాహాయ్యమువలన మరియొక్క దూలముపైఁ జుట్టుకొనును. ఇందున కుపయోగించెడి తొట్టి యొకటి 3-వ పటములోఁ జూపఁబడినది. ఈ తొట్లు కొయ్యతోగాని యినుముతో గాని చేయుదురు. ఈ పటములోఁ జూపిన తొట్టి యొక్క కడుపులో చిన్న చక్రములవలెనున్నది కప్పీలు. బట్ట వాని మీఁదుగ జారునప్పుడే కప్పీలుగూడ తిరుగును. తొట్టియొక్క పైభాగమున రెండువంకెలవంటి చేతులును, వానికి తగిలించిన యిరుసులపైఁ జుట్టుకొనియున్న బట్టచుట్టయుఁ జూడనగును. బట్టతప్పించినప్పుడు కుడియిరుసుపైఁ జుట్టుకొనియున్న బట్ట

క్రమముగతొట్టిలోఁబ్రవేశించియందున్నకప్పీల మీఁదుగ నెడమ యిరుసుపైఁ జుట్టుకొనును. తిరిగి మరఁద్రిప్పినప్పుడు ఎడమ యిరుసుపై నున్న చుట్ట విడిపోయి తొట్టిలోనున్న కప్పీల మీఁదుగ కుడియిరుసుపైఁజుట్టుకొనును. ఇట్లు ప్రతిబట్టయు రెండు పర్యాయములు రంగు కషాయములో ముంచఁబడును. సాధారంగుల కన్నిఁటికిని రెండుపర్యాయములు ముంచినఁ జాలును. రంగులువేసినబట్టల నీటిలో జాడించు టకూడ యంత్రసాహాయ్యముననే జరుగును.

బట్టలను నిలువునమడిచి యద్దవచ్చును. ఇందుకు తానులయొక్క కొనలను ఒకదాని కొకటి వదులుగకుట్టి పెద్దమోకువలెఁ జేయు దురు. ఇట్టియద్దకములో నుపయోగించెడి తొట్లు పైనిఁజూపిన తొట్టికంటె పెద్దవిగ నుండును. పైనిఁజెప్పినరీతినేగుడ్డలుకప్పీలమీఁద రంగు కషాయములోముంచి, తరువాత నుతు కుటగూడ యంత్రసాహాయ్యమువలననేజరుగు ను. రంగులువేయుట పూర్తియైన తరువాత బట్టలనెండవేయుటఁ గూడ యంత్రములతోనే చేయుదురు. ఇందుకుఁగాను పెద్దయినుప తూరలుచేసివానిపైనిబట్టలుచుట్టుకొనులాగుఁ జేయుదురు. తూరలగుండ నావిరిప్రసరింపఁ జేయుటవలన నవి త్వరలో వేడెక్కును. ఈ వేడిమికి వానిపైనున్నగుడ్డలు శీఘ్రకాలము లోనే యారును.

## శాస్త్రచర్చ

రంగులనఁగానేమి ? అవి యెట్లుగలుగు చున్నవి ? బట్టలకు రంగులు వేయునప్పుడేమి జరుగుచున్నది ? అన్ని రంగులును అన్ని బట్టలకెందుల కెక్కవు? కొన్నిబట్టల కుపాధు లెందునకుఁ గావలెను ? మున్నగు ప్రశ్నలకు జవాబులురావలసియున్నవి.

ప్రపంచము నందుఁగల వస్తువులలో రంగు గలవికొన్ని, రంగులేనివికొన్ని. ఈ భేదమెట్లు గలుగుచున్నది ? తేజస్తత్త్వ శోధనలనుబట్టి శాస్త్రజ్ఞులిట్లు సిద్ధాంతీకరించిరి. సూర్యకిరణ ములు మనకు తెల్లగఁ గనపడుచున్నవి. కాని నిశ్చయములో నేడు రంగులయొక్క మిశ్రణమునవలన సూర్యకిరణములకు తెలుపు వచ్చినది. ఊదా, నీలి, మబ్బు, ఆకుపసరు, పసుపు, పింగళవర్ణము, ఎరుపు, అను నేడు రంగులు సూర్యకిరణములయందిమిడియున్నవి. కొన్ని వస్తువు లద్దమువలె సూర్యకిరణముల యం దిమిడియున్న రంగులనన్నిటిని ప్రతిబిం బింపఁజేయును. అందుచేతనిట్టివస్తువులపైఁబడి ప్రసరించు కిరణములన్నియుఁ దెల్లగనుండును. ఇట్లు అన్నిరంగుల కిరణములను ప్రతిబింబించు వస్తువులు గాజువలె తేటపదార్థములయినచో నన్నిరంగులుగఁ గాన్పించును. తేటవస్తువులు గానిచో తెల్లగఁ గాన్పించును. కొన్నివస్తు వులలో రంగుకిరణములు హరించును. పైనిఁ జెప్పిన ఏడురంగుల కిరణములును హరించిన యెడల వస్తువులు నల్లగనుండును. లేక కొన్ని రంగులు మాత్రము హరించినయెడల వస్తువు లకు ప్రతిబింబించిన కిరణముల రంగుండును. ఎట్టిని వస్తువులన్నియు నాలురంగుల కిరణము

లనుహరించి యెఱుపు కిరణములను మాత్రము ప్రసరింపఁజేయును. ఇట్లే యూదావస్తువులు ఊదాకిరణములను మాత్రము ప్రసరింపఁజేసి తక్కినవానినన్నిటిని హరించుకొనును. కాని కొన్ని వస్తువు లన్నికిరణములను హరించుటయు, కొన్ని కొన్ని విధములగు కిరణములనే హరించుటయు మరికొన్ని వస్తువులే కిరణములనుహరింపక యన్నిటిని ప్రసరింపఁజేయుటయు, నెట్లువాటిల్లెనను నంశము మాత్రము వేదాంతమే.

రంగుగల వస్తువు లన్నియు రంగులు వేయుట కుపయోగించునా? ఎఱుపువేయుట కన్నియెఱ్ఱనివస్తువులు పనికివచ్చునా? పనికిరావు. ఈ వ్యత్యాసమెట్లు గలిగెనని యడుగవచ్చును. కల్పితపురంగులు (తారురంగులు) విరివిగ వెలసిన తరువాత రసాయన శాస్త్రజ్ఞులీప్రశ్నకు నుత్తరమిచ్చుటకై యనేకపరిశోధనలుజేసి కొన్ని వాదముల నుపపాదించిరి. రంగులనిచ్చెడి గుణము పదార్థములయొక్క రసాయనిక తత్త్వమును (Chemical constitution) బట్టియుండునని శాస్త్రజ్ఞులు దేల్చిరి. వస్తుతత్త్వ విచారమున రసాయన శాస్త్రము పరమాణు వాదమునే (Atomic theory) యామోదించు చున్నది. ఈ మతమువారికి వస్తువు లన్నియు నణు సముదాయములు. అణువు (Molecule) పరమాణువుల (Atoms) సముదాయము. అణునిరూపణమును (Molecular structure) బట్టి రంగు లేర్పడునని వీరి మతము. రంగులిచ్చెడిపదార్థములలోనియభారము (Molecular weight) హెచ్చినకొలఁది రంగులు మారుచుండును. మిక్కిలి తక్కువ బరువుగల యణువులుగల రంగుపదార్థములు పసుపుగను, అణుభారము హెచ్చినకొలఁది నాపదార్థమునుండియె పింగళ,రక్త, ఊదా, నీలిరంగు లేర్పడు ననియు, ప్రత్యక్షముగఁ జూపిరి. రసాయన సమ్మేళనము వలన నణుభారము హెచ్చించవచ్చును. అసలు పదార్థము రంగులేనిదైనను కొన్ని యణువులఁజేర్చి దానిని రంగుపదార్థముగఁ జేయవచ్చును. ఇట్టి యణువులను రాగదాయకములని చెప్పవచ్చును. రాగదాయకము లైదాఱుకంటె నెక్కువలేవు. రాగదాయ కాణువులు లేని పదార్థములు రంగుఁగలవైనను రంగులువేయుటకు పనికిరావు. ఒకేరంగు అన్నివిధములగు వస్తువులకు నేకరీతి నెందుకుఁబట్టదు? సామాన్యముగ ఉన్నికిని పట్టునకును బట్టినన్నిరంగులు నూలునకుపట్టవు. ఈవిషయముఁ దెలిసికొనుటకు ముందు రంగులయొక్క స్వభావమును, రంగులు వేయఁబడు బట్టలయొక్క స్వభావమును, కొంత చెప్పవలసి యున్నది. రంగుపదార్థములు రెండువిధములుగనున్నవి. కొన్ని ద్రావక స్వభావము గలవి. మరికొన్ని క్షార స్వభావము (Acid Basic) గలవి. జంతుసంబంధమగు పదార్థములలో (ఉన్ని, పట్టు) కొన్ని ద్రావక స్వభావముగలవి. మరికొన్ని క్షారస్వభావముగలవి. ఇట్టి సందర్భ

ములలో ద్రావక స్వభావముగల రంగులు క్షారస్వభావముగల పదార్థములకు చప్పున పట్టును. అట్లే క్షారస్వభావముగల రంగులు ద్రావకస్వభావముగల పదార్థములకు వెంటనే యంటుకొనును.

రంగులు బట్టలకెందున కంటుకొనవలెనను విషయమై రెండు మూఁడు వాదములున్నవి. ఇందు మొదటిది ‘మిశ్రణవాదము’’ (Mechanical theory). రంగు కషాయములో బట్టలను ముంచినప్పుడు రంగుయొక్క యణువులు బట్టలదారముల యందుండు మిక్కిలి సన్నని బెజ్జములలోనికిఁ జొచ్చి యచ్చటఁజిక్కికొనియుండునని (అనఁగా స్నేదైనవస్తువును నీటిలో ముంచినప్పుడు నీరా వస్తువునంటినట్లు రంగులు బట్టలకంటుకొనునని) యీ మతమువారి యభిప్రాయము. అప్పుడు రంగులన్నిబట్టలకును సమానముగ నెందుకుఁ బట్టవని యడుగవచ్చును. అన్నిదారములయందుండు బెజ్జములొకేరీతిని యుండవు. ఉన్నిదారమునందుఁగల బెజ్జములకును నూలుదారమునందుఁగల బెజ్జములకును భేదముగలదు. ఒక జాతిదారముయొక్క బెజ్జములు పెద్దవిగ నుండి తక్కినవి చిన్నవిగావచ్చును. ఇంతియగాక వివిధములగు రంగులయొక్క యణువుల పరిమాణములలోఁ దారతమ్య ముండవచ్చును. ఇదిగాక బట్టలనుడక వేయుటవలన బెజ్జములు పెద్దవియై చల్లనినీటిలో ముంచినప్పుడుగాని కసట్లువస్తువుల నోనవేసినప్పుడుగాని చిన్నవగును. ఇందుచేత నుత్తప్పుడు పట్టురంగులు కసటువేసిన తరువాత నంటుచున్నవి. ఈ కారణములనుబట్టి రంగులన్నివస్తువులకును ఏకరీతిని యంటవని మిశ్రణవాదులు తమవాదమును సమర్థింతురు.

రెండవది రసాయన సమ్మేళనవాదము. రంగులు బట్టలయందుండు కొన్నిపదార్థములతోఁగూడి క్రొత్తవస్తువులేర్పడుననియు, ఈయేర్పడుటవలననే రంగులంటుననియు, వీరి మతము. ఈవాదము ఉన్నియద్దకమునందును పట్టు అద్దకమునందును వర్తించునని చదువరులు గ్రహించియుండవచ్చును. ఏలయన ద్రావకరూపమగు రంగు, దారము నందుఁగల క్షారముతో సమ్మేళనమై రంగురూపమున నొక క్రొత్తవస్తు వేర్పడును. బట్టముంచక పూర్వమాద్రావక రూపమగు రంగున కేవిధమయిన రంగును లేకపోవచ్చును. కాని బట్టతో సంపర్కముగలిగిన తరువాత రంగు వచ్చును. ఇట్టి ప్రమాణములు సమ్మేళనవాదమును బలపఱచుచున్నవి. కాని ప్రత్తిసంబధమైనట్టియు నారసంబంధమయినట్టియు వస్తువులయొక్క యద్దకమునకు సమ్మేళనవాదము విరోధించును. ఏలయన, ఉన్నికిని పట్టునకును, అంటెడిరంగులు వీనికంటుటలేదు. ఇదిగాక నిరుపాధికములగు రంగులు (Direct dyes) వీనికి వేయునప్పుడు రంగు పట్టునుగాని యుడకవేసిన యెడల వెలిసిపోవును. దీనిని బట్టి యీ పదార్థములకు రంగుల నాకర్షించుశక్తి తక్కు

వని స్పష్టమగుచున్నది. ఇంతియగాక నీటిలో నెక్కువ రంగు గలిపినప్పుడు రంగు బట్టముగఁబట్టి, కలపనప్పుడు లేతరంగుపడును. రంగంతయు బట్టకు పట్టక కొంతనీటిలో నిలిచి యుండును. ఇచ్చట రెండుశక్తులకుఁ బరస్పర విరోధమున్నట్లు గనపట్టుచున్నది. బట్టలకుఁ గల రంగుల నాకర్షించుశక్తికిని, తనయందు రంగుల నిముడ్చుకొను నీటిశక్తికిని, పోటీపడి నట్లు స్పష్టమగుచున్నది. ఇవి రసాయన సమ్మేళనముయొక్క లక్షణములు గావు.

కేవల మాకర్షణశక్తి వలననే యద్దకమగు నని మరియొక వాదముగలదు. బలహీనుని చేతిలోనుండి బలవంతుఁడు సులభముగ లాగి కొనఁగలిగినట్లు బట్టలయొక్క యాకర్షణ శక్తి నీటిశక్తికంటె నెక్కువయైనప్పుడు రంగంతయు బట్టలకంటును. ఆకర్షణశక్తి లేనప్పు డంటదు. బట్టలశక్తియు నీటిశక్తియు సరిసమము లయి నప్పుడు కొంతరంగు నీటిలో నిలిచియుండును.

పైనిఁజెప్పిన దానిని బట్టి యిదమిత్థమని యొక వాదమును నిర్ధారణ చేయుటకు వీలు లేదు. ఉన్ని యద్దకము, పట్టు అద్దకమును, రసాయనసమ్మేళనము లనియు, నూలు యొక్కయు, నారయొక్కయు, నద్దకములు మిశ్రణములనియు పండితాభిప్రాయము.

హిందువుల పద్ధతులు

మన దేశమునందలి యద్దకపు పరిశ్రమ యొక్క పురాతనత్వమును గురించి చరిత్ర భాగమున నిదివరలో నించుక వ్రాసియుంటిమి. రమారమి యైదు వేల సంవత్సరములకుఁ బూర్వమే హిందువులు నీలిమందును మంజిష్ఠయును రంగులు వేయుటకుపయోగించెడి వారని నిదర్శనములున్నవి. మన దేశమునుండి యరబ్బీ వర్తకులద్వారా యీ పరిశ్రమజ్ఞానము, అరేబియా, పర్షియా, ఈజిప్టు దేశములకును, అచ్చటినుండి పాశ్చాత్యఖండవాసులకును వ్యాపించిన విధముఁగూడ పైనసంక్షేపముగఁ జెప్పఁబడినది.

మన దేశములోని ప్రతి రాజధానిలోను నేతపనులును, అద్దకపు పనులును గలవు. నూలుబట్టల యద్దకము ప్రతి పరగణాలోను కొద్దిగనో గొప్పగనో యున్నది. బంగాళము లో విశేషము పట్టు అద్దకము, పంజాబులో ముఖ్యముగ ఉన్ని యద్దకము, విస్తారముగ నున్నవి. బొంబై రాజధానిలో నూలు, పట్టు సమానమని చెప్పవచ్చును. మన రాజధాని లో నూలు అద్దకమే విశేషముగ నున్నది. తివాచీలు నేసెడి యేలూరు, అయ్యంపేట, రాయవేలూరు మున్నగు రెండుమూఁడు పట్టణములలోఁ దప్ప ఉన్ని యద్దకము సామాన్యముగ మనరాజధానిలో లేదు. బరంపురము, జగ్గయ్యపేట, కాంచీపురము, కుంభకోణము, బెంగుళూరు, పట్టణములలోఁ దప్ప తక్కినచోట్ల పట్టుబట్టల యద్దకము లేదు.

రంగులు వేయుటకుఁగావలసిన ముడిసరకు (Raw materials) మన దేశములో విస్తారముగనున్నది. అందుచేత ననాదినుండియు

మన దేశములో వ్యవసాయమువలె నద్దకములుగూడ నొక వృత్తియై దానివలన ననేకులు జీవించుచుండెడివారు. రమారమి నూరు సంవత్సరముల క్రిందట మన దేశమునకుఁ గావలసినవిపోఁగా విలువగల కోట్లకొలఁది బట్టలను ఇతర దేశములకు నెగుమతిఁ జేసెడివారు. ఇప్పుడు మన దిగుమతి వర్తకములో సుమారు సగముసొమ్ము బట్టలకె యిచ్చుచున్నాము.* నేత యంత్రములు వచ్చిన తరువాత చేతిమగ్గములు మూలఁబడినట్లు కల్పితపురంగులువచ్చి నాటురంగుల (Indigenous dyes) రూపు మాపినవి. వంశపరంపరగ వచ్చెడి యనుభవము గలవారుగాని నాటు రంగులు వేయలేరు. అందుచేత పూర్వము మన దేశములో రంగులు వేయుట యొక వృత్తియైనది. నాటు రంగులు వేయుటకు కాలమెక్కువ; శ్రమ యధికము; ఖర్చు విశేషము. కల్పితపు రంగులవెల స్వల్పము; శ్రమ తక్కువ; త్వరలో నద్దకము పూర్తియగును. ఇంతియగాక యెవరిమట్టుకు వారే తమబట్టలకు కల్పితపు రంగులు వేసికొనఁగలరు. ఈకారణములను బట్టి అదే వృత్తిగఁ జేసికొనిన అద్దకపు పనివాండ్రకు తగినంత యాదరణ క్రమముగఁ బోయినది. అదియుముగాక యద్దకముచేయువారు సామాన్యముగ విద్యావిహీనులగుటచేత నూతన పద్ధతులవలంబించికొనక పాతలనాటి త్రోవలనే పోవుటచేబట్టియద్దకపువిద్య మన దేశములో వృద్ధిచెందలేదు. మనకంటె వేయిమడుంగులువెనుక చిక్కియుండినను శాస్త్రజ్ఞానాభివృద్ధివలన పాశ్చాత్త్యులిప్పుడు పారిశ్రామిక విద్యలలో పౌరస్త్యుల తలఁదన్నఁగలిగిరి.

మన దేశములో సామాన్యముగ వేసెడి రంగులు పది పండ్రెండుగలవు :-నలుపు, నీలి, ఎఱుపు, పసుపు, ఆకుపచ్చ, తొగరు, గులాబి, జాభర, కుసుంబ, ఊదా, మామిడిచిగురు మొదలగునవి. ఇందు కొన్ని మిశ్రవర్ణములు గలవు. ముందుగఁ బసుపద్ది తరువాత నీలి వేసినయెడల ఆకుపచ్చ తయారగును. ఇంకొక రీతినిగూడ మిశ్రపురంగులు వేసెదరు. నేతలో పడుగునకుఎఱుపుదారము, పేకకునల్లదారము, వేసినయెడల బట్టకుఊదారంగేర్పడును. రంగు పదార్థము కొంచెము వాడుకచేసిగాని లేక యితరపదార్థములను రంగులతోఁగలిపి గాని లేతరంగులు వేయుదురు. గులాబి, తేట పసరు, లేతపసుపు మున్నగు రంగులిట్లు వేయుదురు. మిశ్రవర్ణములచేతనైననేమి లేతరంగులు వేయుటవలననేమి యనేక ఛాయలు(Shades) తీసికొని రావచ్చును.*

*1796-వ సంవత్సరములో మన దేశమునుండి యింగ్లండునకు మాత్రము ఎగుమతియైన బట్టల ఖరీదు 4,16,50230 రూపాయలు. 1912-వ సంవత్సరములో నితర దేశములనుండి మనము వాడుకొనుటకు దిగుమతియైన బట్టల ఖరీదు 60,82,00000 రూపాయలు.

* 1887-వ సంవత్సరములో 'సర్ తామస్ వార్డెల్' అనునతఁడు వ్రాయుచు మూలికలరంగులు చాల మంచివనియు, దొరతనమువారి యాదరణముండి

విదేశీయులకల్పితపురంగులు రాకపూర్వ మున దేశములో మూలికలతోనే రంగులు వేసెడివారు. ఇప్పుడు శైలసులభము, ఫల మధికమగుటవలన చాలవఱకు దేశీయులు గూడ ముఖ్యముగ పట్టు వస్త్రములకును, నూలుబట్టలకును విదేశపురంగులనే వాడు చున్నారు. విదేశీయులరంగులును గురించియు, వారి యద్దకపు పద్ధతులనుగురించియు పైని వ్రాసియుండుటచేత నిచ్చటస్వదేశపురంగులఁ గూర్చియు మనపద్ధతులనుగూర్చియు నించుక వ్రాసెదము. మన దేశములో సామాన్యముగ రంగులు వేయుటకు పూర్వము బట్టలను "కసటు వేయుదురు" (Mordanting). అనఁగా బట్ట లను వగరుగాగాని పులుపుగాగాని యుండెడి పదార్థములలో నుడకపెట్టెదరు. కావున మన దేశీయులు వాడుకచేసెడి రంగుపదార్థములను గూర్చియు, "కసటువస్తువులను" (Mordants) గూర్చియు ముందుగకొంచెము వ్రాయవలసి యున్నది.

రంగులు వేయుటకు మన దేశీయులు పండ్లు, పువ్వులు, ఆకులు, వేరులు, గింజలు, బెరడు లేక తొట, చెక్కలు, పప్పు, వాడుకఁ చేయు దురు. ఇవిగాక క్రిమికీటకాదుల సంబంధము లగు వస్తువులు, మట్టి సంబంధములగు పదా ర్థములుగూడ వాడెదరు. అందిక్రిందఁ జెప్పఁ బోవునవి ముఖ్యము లైనవి.

రంగులిచ్చెడి వస్తువులు

నీలిమందు:—ఇది నీలిచెట్టుయొక్క ఆకు లనుండి తీయఁబడును. ఇతరసైరులవలె దీనిని గూడఁ బెంచెదరు. నీలియాకును గచ్చు కుండ్లలోఁ ద్రొక్కి నీటిలో మురగనిచ్చెదరు. తరువాత నానీటిని మరగఁ బెట్టుటవలనగాని, సున్నముఁగల కయ్యలలో నెండఁబెట్టుటవలన గాని నీలిమందు చేయుదురు. ఇది ముఖ్య ముగ నూలు అద్దకములకును అప్పుడప్పుడు తివాచీలునేసెడి ఉన్ని యద్దకములకును వాడఁ బడుచున్నది.

లక్క:—ఇది పురుగులుపెట్టెడి యెఱ్ఱని వస్తువు. సామాన్యముగ బంకవలె రావిచెట్లు, మఱ్ఱిచెట్లు, మొదలగుచెట్లమీఁదను దొరకును. సాధారణముగ లక్కగూళ్లు అడవిచెట్లమీఁద నే దొరకును. చెట్లమీఁదినుండి యప్పుడేతీసిన దానికి పుడకలక్క యనిపేరు. కొయ్య ముక్కలుగూడ దీని నంటియుండును. అందు చేత దానిని పొడిచేసి పుడకలు విడఁదీయు దురు. అప్పుడు దానిని గింజలక్కయందురు. గింజలక్కను చక్కఁగ పొడిచేసి నీటిలో నాన నిచ్చి వడపోయుదురు. వడపోయఁగా వచ్చిన యెఱ్ఱ నీటిని ఎండలోఁ గొంతసేపుంచినచో

నచో చవుకగ చేయవచ్చుననియు, పాశ్చాత్యులుగూడ కల్పితపురంగులు వాడుట మాని మూలికలనే వాడవచ్చు ననియు నుడివెను. ఈయన యేడేండ్లు తదేకనిష్ఠతో పని చేసి 181 రంగుమూలికలనుండి 3500 రంగునమూనాలను తయారుచేసెను. వీనిని 354 కాగితములమీఁద నరిటించి కలకత్తా మ్యూజియములో 1886-వ సంవత్సరమున నుం చెను. తిరిగి 1908-వ సంవత్సరములోఁ జూచినప్పుడు స్వల్పసంఖ్య తప్ప తక్కినవి వెలియలేదు.

నెఱ్ఱ లక్క యచ్చులుగ నేర్పడును. దీనినే రంగులు వేయుట కుపయోగించెదరు. వడపోయునప్పుడు రంగుపదార్థమంతయు నీటితోఁ బోయి గౌరవర్ణముఁగలతెట్టు బట్టలో నిలిచి యుండును. దీనికి "షెల్లక్కు" యనిపేరు. లక్క యనేక విధములుగ నుపయోగ పడుచున్నది. రంగులు వేయుటకేగాక బొమ్మలు చేయుటకును, గాజులు చేయుటకును సీళ్లు వేయుటకును వాడెదరు. షెల్లక్కు సారాయిలోఁ గరిగించి వార్నిషుచేయుదురు. ఇది వడ్రంగమునందు మెరుగుపూతకు నుపయోగ పడుచున్నది. లక్క ముఖ్యముగ పట్టుబట్టలకెఱుపురంగు వేయుట కుపయోగింతురు.

కిరిమంజి (Cochineal):—ఆరుద్ర పురుగులవంటి యెఱ్ఱని పురుగులనుండి తీయఁబడిన రంగు. ఈ పురుగులు మొట్టమొదట నమెరికా ఖండము నందలి మెక్సికో దేశములో కనుఁగొనఁ బడినవి. కంపెనీ ప్రభుత్వములో మన దేశములోని కాపురుగులఁదెచ్చి పెంచుట కారంభించిరి. అసలైన కిరిమంజి పురుగులు నల్లులకంటె కొంచెము పెద్దవిగ నుండును. పట్టుపురుగులవలెఁగొన్ని చెట్ల యాకులమీఁద జీవించును. పురుగులను చెట్లనుండితీసి సళసళ కాగెడి నీటిలో వేయుదురు. కొలఁదికాలములోనే యవిచచ్చియుబ్బును. తరువాత నెండ బెట్టి గింజలవలెనుండు చచ్చినపురుగుల నమ్మెదరు. ఇది కీటక సంబంధమైన రంగని సామాన్యముగ నద్దకులకుఁ దెలియదు. వీసె పది రూపాయల వఱకును దీనికి ధరయుండును. అందుచేత ముఖ్యముగ పట్టునకు ఎరుపువేయుటకుమాత్రము వాడుదురు. ఉన్నికి నూలునకుఁగూడ నుపయోగించ వచ్చును.

చిరివేరు; తొగరుచెక్క:—దీనికి 'నూనా' యను పేరుగూడఁ గలదు. ఇందు చిరివేరు నిచ్చెడిచెట్టు రెండు మూఁడడుగులు కంటె నెత్తుపెరుగదు. తొగరుచెట్టు పెద్దది. మడ్డి జాతిలోనిది. తొగరుచెక్క రంగులు వేయుటకు పనికిరాదు. చిరివేరే వాడెదరు. దీనికి తెలుఁగు దేశములో సురంజియను హిందూస్థాని పేరుగూడఁ గలదు. వేళ్ళనుండి రంగు దీయుదురు. కొన్ని పదార్థములు గలుపుట వలన పసుపుగాని యెఱుపుగాని వేయ వచ్చును. చిరివేరు పొడి గొట్టి నీటిలో నానఁబెట్టినచో పసుపునీరువచ్చును. దీనికి సున్నపు నీరుగాని, పాలజెముడు బూడిదెగాని కలిపినచో చక్కని యెఱ్ఱరంగు వచ్చును. దీనికి కొంచెము గంధక ద్రావకము గలిపినయెడల తిరిగి పసుపురంగగును. చిరివేరు ముఖ్యముగ నూలుబట్టలయద్దకములో నుపయోగింతురు.

పలాశము:—మోదుగపువ్వు. పచ్చిపువ్వు నిమ్మపండువలె పచ్చగానుండును. ఎండిన తరువాత నారింజపండువలె కొంచెము ఎఱుపు దాళుగ నుండును. రంగునకై ప్రత్యేకముగ మోదుగచెట్లను బెంచు నలవాటులేదు. అడవి నుండియే పూలుదెచ్చి యమ్ముదురు. ఉన్ని యద్దకమునకును, నూలు అద్దకమునకును

ఉపయోగించెదరు. ఎండుపూలను నీటిలో నుడకఁబెట్టుటవలన రంగు నీరేర్పడును. పటికతో పసుపురంగును సోడాపొడితో నారింజ పండురంగును వేయుదురు.

పతంగిచెక్క:—ఇదికూడ మోదుగువలె అడవిచెట్టు. కొయ్యను ముక్కలుగా గాని పొడియగునట్లుగాని కొట్టి నీటిలో నుడకవేసినయెడల ఎఱుపురంగువచ్చును. కొయ్యకు చేవయెక్కిన కొలఁది రంగుముదురును. పటికతోఁ గలిపివేసినయెడల రంగునకు కాంతి హెచ్చును. పతంగిచెక్కతో ఉన్నికి,నూలునకు రంగు వేయవచ్చును.

కపిల:—దీనికి పున్నాగమను పేరుగూడఁ గలదు. ఇది వృక్షజాతిలోఁజేరినది. రమారమి నలువది యడుగులుపొడవు పెరుగును. వర్షాకాలములోపూచి వేసవిలో కాయలుపుట్టును. దీనిపండ్లచుట్టు నేర్పడుపొడి రంగులు వేయుట కుపయోగపడును. ఈ పొడి కొంచె మెఱ్ఱదాళుగనుండి పట్టునకు పసుపురంగును నారింజ రంగును వేయుటకుపయోగించును. ఈ పొడి నీటిలోగాని ద్రావకములలోగాని కరఁగదు. కావున మొట్టమొదట నీ పొడి నూనెతోను పటికతోను గలిపి ముద్దచేయుదురు. తరువాత చాకలి చవుడునున్నము గలిపిన నీటిలో నీ ముద్దను గలిపినయెడల కొన్నిగంటల కాలములో గన్నేరుపువ్వు రంగుగల తేటతేరును. ఈ నీటిలో బట్టనుకొంచెము నేపుంచినచో పసుపురంగును, రాత్రియంతయు నుంచినచో నారింజపండు వర్ణమును బట్టకెక్కును.

జాభరాగ్గింజలు:—ఇవి చూచుటకు తొగరు గింజలవలెనుండును. ఇందలి రంగు పదార్థము గింజలపైభాగమున నుండుటచేత వేడినీళ్ళతో నుడుకఁబెట్టుటవలన రంగునీరేర్పడును. పట్టుబట్టలకు పసుపురంగును కుంకుమ పువ్వురంగును వేయుట కుపయోగించును. కాని పక్కారంగుగాకపోవుటచేత విస్తారముగ వాడుకచేయుటలేదు. సన్న్యాసులు బైరాగులు మున్నగువా రుపయోగించెడి శాటీలకు రంగీవిత్తనములతో వేయుదురు.

పసుపు:—ఇది కొమ్ముపసుపనియు మానుపసుపనియు రెండువిధములు. కొమ్ముపసుపు నిత్యము వాడుకలోనుండి స్థిరుగ పెంచఁబడుచున్నది. మానుపసుపు అడవిలో పెరుగును. ఈ రెండును పసుపురంగు వేయుట కుపయోగించెదరు. కాని పక్కారంగుకాదు. ఆకుపసరురంగు వేయుటకును గూడ పసు పుపయోగింతురు. రంగు చక్కఁగఁ బట్టుటకుచేవఁగల కొమ్ములను పొడిచేసి నీటిలో నానవైచి యాకషాయముతో బట్టలకురంగువేయుదురు.

కుసుంబ:—ఇది వృక్షజాతిలోనిది. ఈ చెట్టుయొక్క గింజలునుండి చమురుదీయుదురు. పువ్వులలో రెండురంగు పదార్థము లున్నవి. ఒకటి పసుపు, రెండవది యెఱుపు. పసుపు పక్కారంగు కాకపోవుటచేత వాడుకలోలేదు. ఎఱుపుమాత్ర మద్దకమున కుపయోగపడును. ఈపువ్వులనుండి రెండు విధములరంగులు దీయుదురు. పువ్వులను నీటితో

ముద్దలుగఁజేసి జల్లెడవంటి చట్రముపైనుంచి నీరుపోయుదురు. అప్పుడు పూతలోనుండు పసుపురంగు కొట్టుకొనిపోయి రంగు వేయుట కుపయోగించు పూతమాత్రము నిలుచును. లేదా పూలను ఎండబెట్టి చూర్ణముచేసి యాచూర్ణము నమ్మెదరు. ఈపొడిని గుడ్డలో మూటగట్టి నీటిలో జాడించెదరు. అప్పుడు పసుపురంగంతయుఁబోయి కావలసిన పూత మాత్రము గుడ్డలో నిలిచియుండును. పసుపు పోఁగా నిలిచినపూతను నీటిలో నుడకబెట్టిన యెడల ఎఱ్ఱని కషాయమేర్పడును. దీనితో ఎఱుపురంగును గులాబిరంగును వేయవచ్చును.

కాచు:—ఇది తెల్లకాచు, నల్లకాచు, అని రెండువిధములుగ బజారులో దొరకును. నల్లకాచు రంగులు వేయుట కుపయోగించెదరు. కాచు చెట్టునుండివండినపదార్థము. కాచు చెట్టు రమారమి 15 అడుగులయెత్తుపెరుగును. చెట్టుయొక్క అంతర్భాగము ముక్కలుగఁ గొట్టి బానలలోవేసి నీరు పోయుదురు. కొంత నీ రినికి పోవులాగున మరగఁ బెట్టెదరు. తరువాత నాకషాయమును మిట్ట పళ్లెరములలోఁ బోసి మూఁడు వంతు లినికి పోవు వఱకునుమరగఁబెట్టెదరు. అప్పుడేర్పడినకాచు పాకము కలియఁబెట్టుచు నెండలో నుంచుట వలన కాచు ముద్ద యగును. తరువాత దీని నుండి నీరుపీల్చుటకు బూడిదె చల్లిన గుడ్డ మీఁద నారఁబెట్టెదరు. కాచు కరిగిన నీటిలో ముంచిన గుడ్డలకు, కపిలవర్ణము వచ్చును. కాచును పతంగి చెక్కతోఁగలిపి జేగురురంగును, మోదుగ పువ్వుతోఁ గలిపి గౌరవర్ణమును వేయుదురు.

చందనపు చెక్క:—దీనికి రక్తచందనమను పేరుఁగూడ గలదు. ఇది ముఖ్యముగ పులికాటు సమీపమునను, తిరుపతి కొండలయందును పెరుగును. తిరుపతిలో ముఖ్యముగ దీనిని బొమ్మలు చేయుట కుపయోగించెదరు. చూచుటకు ఏప చేవవలెనుండి యెఱుపురంగులు వేయుటకుపయోగపడును. కాని యిది పక్కారంగు కాదని మన దేశీయులు దీనినంతగ వాడరు. అందుచేత నిది విశేషముగ విదేశములకు నెగుమతి చేయఁబడుచున్నది. వారు మఱికొన్ని యితర పదార్థములతోఁ గలిపి ఉన్ని యద్దకములయం దుపయోగించెదరు.

రేవలచిన్ని:—ఇది సయాము, సింహళము, మలబారు దేశములలోఁ గొన్ని చెట్లు పెట్టెడి జిగురు. కొంచె మించుమించుగ కుంకుమపువ్వు ఛాయనుండును. దానిమ్మ తొక్కతోను పటికతోను గలిపివేసినయెడల పక్కా పసుపు రంగువచ్చును.

దానిమ్మతొక్క:—దానిమ్మపండ్ల నెండఁబెట్టి పైతోలుపొడిచేసి రేవలచిన్నితోఁగలిపి పసుపురంగు వేయుదురు.

అకల్బీరు:—ఇదిహిందూస్థానములోఁ బెరిగెడి చెట్టు. దీనికి తెలుఁగులేదు. దీనివేళ్ళు పట్టద్దకమున కుపయోగించును. దీనిని సాధారణ

ముగ పటికతోను, పసుపుతోను, దానిమ్మ
తొక్కతోను, శేవలిచిన్నితోను గలిపి ఉప
యోగించెదరు. దేనితోఁ గలిపినను పక్కా
పసుపురంగు వచ్చును.

కరక్కాయలు :—వీనితో పసుపు, నలుపు
వేయుదురు. పటికతో నూలుపైని పసుపును
దేనిపైనైనను అన్నభేదితో నలుపును వేయ
వచ్చును.

అన్నభేది :—ఇది యన్నివిధములగు వస్తు
వులకు రంగువేయుట కుపయోగపడును.
నూలు, ఉన్ని, నార, పట్టు, చర్మములు నలు
పుచేయుటకుఁగూడ నుపయోగించెదరు. కర
క్కాయనీటితోఁ గలిపి వాడవలెను. పసుపు
రంగులతో అన్నభేదిఁగలిపినచో కపిలవర్ణము
(Brown) వచ్చును. అన్నభేది బజారులో
దొరకును. కాని వెలయధికమగుటచేతఁ గొం
దఱు ఇనుపతుప్పును గంజిలో పులియఁబెట్టి
యన్నభేదికి బదులుగ దానిని వాడెదరు. ఇది
కూడ అన్నభేదివలెనే పనిచేయును.

మంజిష్ఠ :—మదారుచెక్క. ఇది రెండు
విధములుగ నున్నది. ఇందు మొదటిది చిరి
వేరు. ఇది చిన్నచెట్టు. విశేషముగ నెల్లూరు,
బందరు, చీరేల, వేటపాలెము మొదలగు
పట్టణములలో రుమాలుల యద్దకమునం
దుపయోగించెడి వారు. రెండవది త్రామ
వల్లి. ఇది తీగెజాతిలోనిది. ఈ రెంటికిని వేళ్లే
రంగువేయుటకు ప్రధానములు. వేళ్ల బెర
డు నీటిలో నానవైచి పటికనీటితోఁ గలిపి
యెఱుపు వేయుదురు. నూలద్దకమునందు
మాత్ర ముపయోగించెదరు. ఇంతియగాక
తలనూనెలకు రంగులువేయుటకుఁగూడ వీనిని
నుపయోగించెదరు. కల్పితపు రంగులు రాక
పూర్వము మన దేశమునుండి చిరివేరు,
మంజిష్ఠ, విస్తారముగ విదేశముల కెగుమతి
యగుచుండెడిది. సుమారు పది సంవత్సర
ములనుండి యెగుమతి దిగుమతులు లేవనియే
చెప్పవచ్చును.

పైనివర్ణించినవి మన దేశములో వాడుక
చేసెడి ముఖ్యమైనరంగు పదార్థములు. ఇవి
గాక మరికొన్ని మూలికలు కొద్దిగొప్పలు
కదాచిత్తుగ వాడుచున్నారు. ఇట్టివానిలో
వేపలిచెక్క, తాండ్రకాయలు, బాదము
చెక్క, నిమిరిచెక్క (నలుపురంగునకు) నల్ల
మద్దితాలు, పచ్చపువ్వులగోరింటాకు (పసుపు
రంగునకు) పిస్తాపూలు, పారిజాతపు పూలతొడి
మలు, నందివర్ధనాలు (పసుపురంగు) చెప్పఁ
దగినవి.

కసటువస్తువులు (ఉపాధులు)

కసటువస్తువులు (Mordants) రంగులకు
ఉపాధులని చెప్పవచ్చును. ఇతరపదార్థముల
తోఁగలియ నక్కఱ లేకుండ తమంతటతా
మంటెడిరంగులసంఖ్య మిక్కిలితక్కువ. ఇవియైనను సామాన్యముగ
ఉన్ని, పట్టు అద్దకములయం దుపయోగపడు
నుగాని నూలద్దకమునకు పనికిరావు. కాని
యద్దకమునకు పూర్వము బట్టలకు కొన్ని

పదార్థములతో నుడకవేసిన తరువాత రంగు నీటిలో ముంచినయెడల నన్నిరంగులను చక్కఁగఁ బట్టును. ఇట్టివి యుపాధిరంగు (Mordant dyes) లందురు. ఈయుపాధులు సాధారణముగ వగరుగను కొన్ని పులుపుగను ఉండుటచేత నీజాతి కంతకును కసటు వస్తువులని పేరుపెట్టఁబడినది. వీన్ని నుడక వేయుటకు కసటువేయుట (Mordanting) యనవచ్చును. రంగులు వేయుటకుఁ బూర్వము బట్టలను కసటు వేయవచ్చును. లేదా కసటు వస్తువును రంగులతోఁ గలిపి యుడక వేయవచ్చును. కొన్ని రంగుల విషయములో ముందుగ రంగునీటిలో నుడకవేసి తరువాత కసటు వేయవచ్చును.

కసటు వస్తువులలో కొన్ని రంగులనిచ్చెడి పదార్థములు గూడకలవు. కరక్కాయలతో పసుపురంగు వేయవచ్చును. కరక్కాయలతో కసటువేసి అన్నభేదితో నలుపు వేయవచ్చును. ఇట్లె దానిమ్మతొక్క, లద్దుగచెక్క మొదలగు కొన్నిమూలికలు కసటువేయుటకే గాక రంగు పదార్థములుగఁగూడ నుపయోగించవచ్చును. కొన్ని కసటువస్తువులు రంగుపదార్థములుగ వాడుటకువీల్లులేదు. పటిక, చౌడు మున్నగునవి యిట్టిజాతిలోనివి.

మన దేశములో తరుచుగ వాడెడి కసటు వస్తువులలో ముఖ్యములయిన వానిని గురించి కొంచెము వ్రాయఁబడును. కసటు వస్తువులన్నియు మూలికలు గావు. చాకలి చవుడు, పటిక లోనగు నవి మట్టివలె భూసంబంధము గలవి.

చాకలి చౌడు:—దీనికే సజ్జమట్టి యనియు, సజ్జాకార మనియు పేరు. ఇదియే యితర పదార్థములతోఁ గూడుకొనియున్న సోడా పొడి (Impure carbonate of soda). చవిటి భూములపై పొక్కువలె బైలుదేరెడి మట్టి పోగుచేసి కొంచెము సున్నముతోఁ గలిపి యుడకఁబెట్టి ముద్దలుగఁజేసి యమ్ముదురు. మన దేశములో నిది రెండు విధములుగ నుపయోగపడుచున్నది. కోరాలను చలువ చేయుటకును, రంగులు వేయుట కుపాధిగను (Mordant) వాడుచున్నారు.

పటిక:—రాగోపాధులలో నెల్ల మిక్కిలి యుపయోగకరమైనదియు, మిక్కిలి తరుచుగ వాడఁబడునదియు, మిక్కిలి పురాతనమైనదియు పటికారము. నూలు, ఉన్ని, పట్టు, నార మొదలగు పదార్థముల కన్నిటికిని రంగులు వేయుటయందిది యుపయోగించును. విదేశీయులు వాడుకచేసినంత తఱుచుగ మన రంగురేజులు పటికారమును వాడుటలేదు. ఇందునకు రెండు కారణములున్నవి. పటికారము సజ్జాకారము - కంటె ప్రియము. ఇంతియగాక సామాన్యముగ బజారులో నమ్మెడి పటికలో కొద్దియో గొప్పయో అన్నభేదియును గలిసి యుండును. నలుపు దప్ప తక్కిన రంగులయొక్క కాంతి, యన్నభేది తగ్గించుటచేత, బజారు పటికారమును తఱు

చుగ వాడుటలేదు. చిరివేరు, మంజిష్ట, కిరిమింజి, పసుపు మున్నగు రంగులకు పటికతో కసటువేయుదురు. పటిక నీటిలో ముందుగ బట్ట నుడకవేసి తరువాత రంగులో ముంచెదరు. కిరిమింజితో ఎఱుపు వేయునపుడు రెండు పనులును ఏక కాలముననే జరుగవచ్చును. అనఁగా పటిక నీటిలో కిరిమింజిని గలిపి బట్టల నందులో ముంచవచ్చును.

తంగెడు విత్తులు:—తంగెడు మొక్కలు మెరక భూమిని పెరుగును. విశేషము ఎత్తు పెరగవు. దీని పూలు పచ్చగనుండి గింజలు ఎఱ్ఱ వాగుగ నుండును. నీటిలో నుడకపెట్టినప్పుడు గింజలుబ్బి పొట్టలుపగులును. అటుతరువాత నా గంజిని నీలి మందుతోఁగలిపి యద్దకము వేయుదురు.

పిస్తాపప్పు:—ఇది గింజలోనుండి తీసిన పప్పుకాదు. ఇది యాకులనుండి పులిపిరివలె పుట్టి లోపలగుల్లగా నుండును. పిస్తాపప్పు కిరుమింజి రంగు వేయుటకు మాత్ర ముపాధిగా వాడఁబడుచున్నది.

గొత్తిపెంట:—ఎఱుపు వేయుటకు పూర్వము బట్టలను గొత్తి పెంటలో నాన్పుట యనాదినుండి వాడుకలో నున్నది. విదేశీయులుగూడ పూర్వము దీని నుపయోగించెడివారు. మన దేశములో చిరివేరుతో నెఱుపు వేయునప్పుడు గొత్తిపెంట నుపయోగించెడి యాచారముగలదు. కొన్ని యమ్లములు (ద్రావకములు) గూడ కసటువేయుటకుపయోగించెదరు. గంధక ద్రావకము నీలి మందుతో రంగులు వేయునప్పు డుపయోగించెదరు. అమ్ల చింతపండు లక్కతో నుపయోగించి యెరుపు వేయుదురు. ఇందునకు పాత చింతపండు శ్రేష్ఠము. చింతపండు పులుసులో బట్టలు నాన్పినతరువాత రంగులో ముంచెదరు. చమురు పదార్థములలోఁగొన్ని కసటువస్తువులుగా వాడఁబడుచున్నవి. నువ్వుల నూనె, ఆముదపుతొక్క కొన్నిసమయముల నుపయోగింతురు.

జెముడు కాడలు, ముండ్లగజ్జేరు, ఉత్తరేణి మొదలగు మూలికలనుగాల్చి యాబూడిదెను రంగుల కుపాధులుగా వాడుచున్నారు. ఇందు ముఖ్యముగ జెముడుబూడిదె తఱుచుగా వాడెదరు.

లద్దుగచెక్క, కరక్కాయలు, అన్నభేది, దానిమ్మతొక్క - ఇవి రంగు పదార్థములు. రంగుపదార్థములక్రింద వర్ణింపఁబడినవి. ఇవి రంగుల కుపాధులుగఁగూడ వాడఁబడుచున్నవి. పైని చెప్పినవిగాక తుమ్మయూట, తుమ్మజిగురు, జీడిగింజలకషాయము, బట్టలకు కసటువేయుట కుపయోగించెదరు.

మనదేశములో విస్తారముగ రంగులువేయఁబడుపదార్థములు నాలుగు. నూలు, ఉన్ని, పట్టు,నార. ఆంధ్రరాష్ట్రములో నూలద్దకము చాలచోట్లఁగలదు. బురంపురం, జగ్గయ్యపేటలలో పట్టద్దకము విశేషము. తివాచీలు, కంబళ్ళు, గొంగళ్ళు మాత్రము నేయుటకు

ఉన్ని యుపయోగ పడుచున్నదిగాని శాలువలుగాని తదితరములగు దుస్తులకు పనికి వచ్చెడి బట్టలుగాని ఉన్నితోఁజేసెడి యాచారము మనరాష్ట్రమున లేదు. నారతో బస్తాలను పరజాలను నేయుటకలదు. ఇవిగాక చాపలు నేయుటకుపయోగించెడి చిరిగడ్డి, తుంగ, కొబ్బెరాకులు, ఖర్జూరపాకులు మొదలగునవి కూడ రంగులువేయఁబడును.

మనదేశములో రంగులువేయుటకు పెద్ద బానలుగాని రాగిగంగాళములుగాని వాడుక చేసెదరు. వీనికి మన రాజధానిలో "గోలాము" లనిపేరు. వీనిలో కొన్ని యిరువది కుంచములవఱకు పట్టును. రంగుకషాయములను వీనిలో తయారుచేసి లాడీలనువానిలో ముంచెదరు. మనరాజధానిలో విస్తారముగ దారపులాడీలకే రంగులు వేయుదురు గాని నేసినతరువాత బట్టలకు వేయుట యరుదు. ప్రదేశమును బట్టియు, సంప్రదాయములను బట్టియు రంగులువేయుపద్ధతులున్ను, రంగులపాళ్ళును మారుచుండును. ఇందులోఁజాల వఱకువర్తక మర్మములుగలవు. ఐనను దొరతనమువారు తమయుద్యోగులచే నీవిషయమై రిపోర్టుల వ్రాయించి ప్రచురించియున్నారు. మనదేశములోనున్న యద్దకపు పద్ధతులనన్నిటినిగూర్చి సంక్షేపముగ వ్రాసినను ఒకగ్రంథమగును. కాఁబట్టి మచ్చునకై యీదిగువనిచ్చిన యోగ్యములతోఁ దృప్తిఁజెందవలసియున్నది:—

నూలద్దకము:—ఎఱుపువేయుట.

ఎఱ్ఱరంగు వేయుట కనేక రంగుపదార్థములున్నవని పైనివ్రాసినదానిని బట్టి గ్రహింపఁగలరు. మనరాజధానిలో(ముఖ్యముగ ఖందరు, చీరేల, గొల్లపాలెము మొదలగుచోట్ల) నూలున కెఱుపు వేయుటకుఁబూర్వమునూలు నీవిధముగ తయారు చేయుదురు. వీసెడు నూలునకు:—

| | |
|---|---|
| జెముడుకాడల బూడిదె | 5 పళ్లు |
| నువ్వులనూనె | 1 వీసె |
| గొర్రెపెంట | పావుసేరు |

వీనిని చక్కఁగ నీటిలోఁగలిపి తేర్చెదరు. నూలు నీతేటలో కొన్నిగంటలు నానిన తరువాత పిండి యెండవేయుదురు. ఇట్లెనిమిది పర్యాయములు చేయుదురు. ఇందున కథమము నాలుగు రోజులు పట్టును. ఇట్లు తయారయిన నూలును 5 పలములు చిరువేరుపొడి గలిపిన నీటిలో నానఁబెట్టెదరు. కొన్ని గంటలు నానినతరువాత పిండియెండవేయుదురు. ఈ రీతిని పదిసారులు రంగులో నాన్చి ఆఖరు తూరి పేపలి చెక్కతో నుడకవేయుదురు. అప్పటికి రంగున కొకవిధమైనకాంతివచ్చును.

గులాబిరంగు:—ఇందు కుసుంబా పూవులుపయోగింతురు. లేదా లేత యెఱుపువేసి గులాబీరంగు కలుగఁజేయవచ్చును. రమారమి యొకసేరు కుసుంబాపూలు (ఎండినవి) పొడి చేసి నీటిలోకడిగి చౌటినీటిలో నానవేయు

దురు. చక్కఁగ నానినతరువాత తేర్చి నిమ్మ పండ్ల రసముఁ గలిపెదరు. తెల్లఁగ చలువ చేసిననూలు నీకషాయములో ముంచినయెడల గులాబీరంగుపట్టును.

నీలిరంగు:—ఈ రంగు వేయుటకు మన దేశములో నీలిమందొక్కటియే కలదు. నూలును చలువచేసిన మీఁదనే రంగు వేయుదురు. వీసెడు నూలునకు:—

| | |
|---|---|
| నీలిమందు | 4 చటాకులు |
| చాకలిసోడు | 1 సేరు, 12 చటాకులు |
| సున్నము | 8 చటాకులు |
| బెల్లము | 2 చటాకులు |

ఇవి యన్నియు చక్కఁగ నీటిలోఁ గలిపి నాలుగైదు రోజులు మురఁగఁ బెట్టెదరు. కొందఱు తంగేడు విత్తులును, అరిటాకు బూడిదెనుగూడ కలిపి మురగఁ బెట్టెదరు. కషాయము చక్కఁగ మురిగినతరువాత నూలును ముంచెదరు. రంగంతయు నూలున కంటువఱకు నానెదరు. ముదురురంగు పడవలెనన్నచో తిరిగి యీరీతిని రంగు కషాయము తయారుచేసి ముంచెదరు.

ఆకుపచ్చ:—నీలియద్దిన నూలునకు పసుపు వేసినయెడల ఆకుపచ్చ రంగువచ్చును. ఇందునకుఁగాను:—

| | |
|---|---|
| పసుపు | అరవీసెడు |
| మోదుగపూవులు | వీసెడు |
| పటిక | సవాసేరు |

ఇవి చక్కఁగ పొడిచేసి కలిపి సళసళ కాగుచున్న కరక్కాయ నీటిలోఁ బోయవలెను. ఇందునకు వీసెడుకరక్కాయలు వ్రేళ్లు గొట్టి తగినంత నీటిలో నాననిచ్చి కాచవలెను. ఈ కాగుచున్న కషాయములో నీలి వేసిన నూలు ముంచిన యెడల ఆకుపచ్చ రంగు పట్టును. ఇది పక్కారంగు కాదు.

ఉన్నియద్దకము:—నీలిరంగు.

మనరాజధానిలో ఉన్నియద్దకము విశేషముగ ప్రభుత్వమువారి జైళ్లలో జరుగుచున్నది. జైళ్లలోకొంతవఱకు కల్పితపురంగులు వాడినను నీలిరంగు వేయుటకు నీలిమందు వాడుచున్నారు. నీలిలో లేత ముదురు చాయ లన్నియు నీలి మందునుండి సాధింపవచ్చును. ఈ రంగుయొక్క కషాయము రెండు విధముల తయారు చేయుదురు. ఇది మన దేశమున సర్వత్ర వాడుకలోనున్న రంగగుటచే నీరెండుపద్ధతుల నిందుఁ దెలిపెదము:-

(1) ఒకపౌను నీలిమందు మెత్తఁగ పొడిగొట్టి వస్త్రఘాలితము పట్టెదరు. మూఁడుపౌనుల గంధక ద్రావకము గాజు పాత్రలోగాని కుండలోగాని తీసికొని నీలిమందుపొడి కొంచెకొంచెముగ నందులో కరిగించి మూతవేసి రెండురోజు లెండలో నుంచెదరు. 10 పౌనుల ఉన్నికి రంగు వేయుటకు 10 కుంచముల నీరొక బానలోఁబోసి మరగఁ బెట్టి తయారైన రంగు కషాయము కొద్దికొద్దిగ మరుగుచున్న నీటిలో కలపవలెను. కషాయ మంత

యుఁ గరిగినతరువాత ఉన్ని నందులోముంచి కఱ్ఱలతో జాడించెదరు. రంగంతయు ఉన్నికి పట్టిన తరువాత నీటిలోజాడించి యారవేయుదురు. (2) పది పండ్రెండు కుంచములు బట్టెడి బానను కుతికలవఱకు భూమిలోపాతి వీసెడు నీలిమందుపొడియు కొంచెము నీరును అందులోఁ బోసి చక్కఁగ గిలకొట్టెదరు. 5 వీసెలు తంటెపువిత్తుల నొక బానలో పొట్లులుచితుకు దనుక ఉడకఁబెట్టి నీలిమందు బానలోఁ బోయుదురు. ఈ మిశ్రణ మొక పూటలో మురిగి పొంగువచ్చును. అప్పుడు క్రొత్తగాఁజేసిన సున్నము నీటిలోఁగలిపి రంగు కషాయముయొక్క పులుపువాసనపోవువఱకును సున్నపునీరు గలిపెదరు. ఇట్లు రోజునకు రెండు పర్యాయములు గలుపునప్పటికి ఎనిమిది రోజులలో బాననిండి నురుగుకట్టి తంటెపువిత్తులు తేలును. వానిని చిదిపి తిరిగి బానలో వేసినప్పుడవి మునుఁగును. ఇప్పటికి రంగుకషాయము తయారైనదని చెప్పవచ్చును. లాడీలనీ కషాయములో ముంచి రంగు చక్కఁగఁ బట్టులాగున చేతులతో నుసుముదురు. ఇట్లు చేయుటలో బానలడుగున తేలిన సత్తు లాడీల కంటకుండ జాగ్రత్త పడవలసియుండును. ఇది మిక్కిలి పురాతనమైనపద్ధతి. జైళ్లలోఁదప్ప తక్కినచోట్ల యద్దకులందఱు నీపద్ధతిని రంగులు వేయుదురు. ఈ కషాయముతో నూలునకును, ఉన్నికిని గూడ రంగు వేయవచ్చును. ఇందులో ముంచిన లాడీలను అద్దకమైన తరువాత మంచినీటిలో జాడించకుండ నెండవేయుదురు.

లేతయెఱుపు:—మన రాజధానిలో లక్కతోను, పతంగి చెక్కతోను ఎఱుపు వేయుచున్నారు. రంగు నెక్కువ వాడినచో ముదురెఱుపు వచ్చును. లేతయెఱుపు నచ్చుటకు:-

లక్క 4 పౌనులు
చింతపండు 12 ,,
పటిక సేరు

లక్కనీటిలోను నొకపూటనాననిచ్చి పల్చగ నూరెదరు. చింతపండును నీటిలోపిసికి పులుసు వడియకట్టి లక్కతోఁబాటు కాగులోఁ బోసెదరు. తరువాత పటికనీరు గలిపి మరగఁబెట్టి మరుగుచున్న రంగు కషాయములో లాడీలు ముంచెదరు.

జేగురులేక తొగరురంగు:—ఇది సమిష్టి రంగు. ఎఱుపుమీఁదగాని, గులాబిమీఁద గాని వేయుదురు. 10 పౌనుల ఉన్ని 5 పౌనుల పతంగిచెక్క పొడిని, పౌను పటికయుఁ గలిపి యుడకవేయుటవలన గులాబి యంటును. దీనిని అరవీసెడు కాచును, మూఁడు పలముల అన్నభేదియుఁ గలిపిన నీటిలో నుడక వేసినచో తొగరు రంగుపట్టును.

పసుపు:—ఇందునకుపయోగించెడిముఖ్య పదార్థములు పలాశము, పసుపు, పటిక. వీని పరిమాణములు మార్చుటవలన పసుపులో ననేక ఛాయలువచ్చును. 10 పౌనుల యున్నికి వంగపండు రంగువేయుటకు

మోదుగ పూవు ........1 పౌను.

పసుపు.................. ౩ పలములు.

పటిక.....................౩ ,,

పటికయు, పసుపును పొడిగొట్టి నీటితోఁ గలిపి కాగులోఁ బోయుదురు. మోదుగ పూలను గుడ్డతో వదులుగ మూటఁగట్టి యా నీటిలో విడిచి మరగఁబెట్టెదరు. మరుగుచున్న నీటిలో ఉన్ని లాడీలు ముంచెదరు. దీనికి పతంగిచెక్కఁగాని, లక్కఁగాని కలిపినచో నారింజపండు రంగువచ్చును.

పట్టద్దకము:—ఉన్ని యద్దకమునకును, పట్టద్దకమునకును సామాన్యముగ భేదము లేదు. ఉన్ని యద్దకమునందుపయోగించెడి రంగు పదార్థములును, పద్ధతులును పట్టద్దకమునకుఁగూడ పనికివచ్చును. అందుచేత నిచ్చట నొకటి రెండురంగులు వేయు యోగములకంటె నెక్కువ చెప్పుట యనవసరము.

దీప్తిఁగల యెఱుపు:—ఎఱుపు వేయుటకనేక వస్తువు లున్నవి. ఇందు కిరుమింజితో వేయు మార్గముఁ దెలిపెదము. పీసెడు పట్టునకు రంగు వేయుటకు:—

కిరుమింజి.........సవా శేరు.

పిస్తాపప్పు..........ముప్పావు శేరు.

పటిక.............ముప్పావు శేరు.

ఇందులో పిస్తాపప్పును, పటికయు నుపాధులు. శుభ్రము చేసినపట్టును ముందుగ నొకరోజు పటికలో నాన్పవలెను. పిస్తాపప్పును, పటికను వేర్వేరుగ పొడిచేసి నీటిలోఁ గలిపి మరగఁబెట్టవలెను. మరుగుచున్న రంగు కషాయములో పటికలో నాన్పిన పట్టులాడీలను ముంచి రెండు గంటలసేపుడుకవేయవలెను. రంగు చక్కఁగఁ బట్టినతరువాత మంచినీటిలో జాడించి యెండవేయుదురు.

ఆకుపచ్చ:—బంగాళములో పట్టున కాకుపచ్చ వేయుటకు పనసకాయ్యల కోతలో వచ్చెడి రంపపు పొట్టును, వసచెట్టుయొక్క ఆకులును, గలిపి మరగఁబెట్టి వడపోసి కొంచెము నీలిమందుఁ గలిపి యందులో పట్టును ముంచెదరు. లేత పసుపురంగు వేయుటకు కరక్కాయలు, అన్నభేది, పసుపు, దానిమ్మతొక్కలు, పటిక—ఇవి సమపాళ్ళు తీసికొని నీటిలో మరగఁబెట్టి యా కషాయములో ముంచుటవలన లేత పచ్చ రంగు పట్టును.

నలుపు (జీడినలుపు):—ఈ రంగు వేయుటకు పట్టును ఛలువ చేయనక్కఱలేదు. ముడి పట్టునే వాడవచ్చును. ఒక వీసెడుపట్టునకు రంగు వేయుటకు:—

తుప్పు పట్టిన యినుప ముక్కలను పులిసిన గంజిలో మూఁడు నాలుగు రోజులు మురగఁబెట్టిన తరువాత తేర్చెదరు. వీసెడు కరక్కాయ పేళ్ళు ఈ తేటలో నానవైచి పట్టునందులో నుంచి కాగఁబెట్టెదరు. కాగుచున్నప్పుడు పట్టును పైకిఁదీసి వీసెడు అన్నభేదిని ఆ మిశ్రణములో వేయుదురు. తిరిగి పట్టునందులోముంచి యొకటిరెండు గంటల

సేపు కాచెదరు. రంగంతయుఁ బట్టిన తరువాత పట్టును మంచి నీటిలో జాడించి నీడన నెండ వేయుదురు.

ధూపుచాయ-ఊదారంగు:—ఇవిసమిష్టి రంగులు. పేకపడుగులకు వేఱు వేఱురంగుల నూలు నుపయోగించుటవలన నీ రంగులు రాఁగలవని యిదివరలో వ్రాసియుంటిమి. ప్రత్యేకముగ ఊదారంగువేయుట కెఱ్ఱపట్టును ముందుగ కరక్కాయ నీటిలో నానవైచి తరువాత నీలిమందులోగాని,అన్నభేది నీటిలో గాని ముంచినయెడల ధూపుచాయవచ్చును.

నారవస్తువుల యద్దకమునకును, నూలద్దకమునకును భేద మేమియులేదు. కావున నీ విషయమై ప్రత్యేకించి వ్రాయ నవసరము లేదు. అద్దకమునందు నారవస్తువులకెక్కువ యుడుకులు గావలసియుండును. చాపలల్లెడి యాకులకు,గడ్డికిఁగూడ నిట్లేరంగువేయుదురు. ఇందునకు ముఖ్యముగ లక్క, పసుపు, నీలిమందు మొదలగు రెండు మూఁడు రంగులు మాత్ర ముపయోగింతురు.

ఉన్నిపట్టుకలిసిన బట్టలకు రంగువేయుట

ఉన్నిదారములును, పట్టు దారములును కలిసి నేయఁబడిన బట్టకు రంగువేయుట కొంచెము కష్టసాధ్యమైనపని. అందులో రెండు దారములకు నొక్క రంగేవేయుట కష్టతరము. ఎందుకనఁగా, ఉన్ని దారములకును, పట్టుదారములకును వేఱువేఱు రంగులతో స్నేహముండవచ్చును. ఉన్ని దారములకు బాగుగ పట్టెడిరంగే పట్టుదారములకుఁ బట్టక పోవచ్చును. అట్లే పట్టుదారములకు సక్కర వచ్చిన రంగు ఉన్నిదారములకు నక్కర రాక పోవచ్చును. కావున నిట్టివస్త్రములకు రంగు వేయుటలో రెండు విధములయిన దారముల కును పట్టెడి రంగులను ఉపయోగింపవలెను.

ఆజోరంగులు (Azo Colours), క్షారపు రంగులు(Basic Colours) యిట్టిబట్టలకు మిక్కిలి ఉపయోగించును. అలి రెండుదారములకు నొక్కరంగే వేయుట జరీను రంగులను (Alizarine dyes) కూడ వాడవచ్చును. నీలి రంగునకై ఆల్కలీ నీలము (Alkali blue), నలుపు, నీలము, కలిగిన రంగునకై నెపథాల్ నలుపు (Nappthol black), ఆకుపచ్చ రంగునకై నెపథాల్ పచ్చ(Nappthol green), ఎఱ్ఱరంగులకై ద్రావకపు మ్యాజంటా (Acid Magenta), అను ద్రవ్యములను వాడుకొనవచ్చును. ఇవి ఉన్ని దారములకును, పట్టుదారములకును సమానముగా పట్టును. టిటాన్ పసుపు (Titan Yellow), బ్రిలియంటు కాంగో (Brilliant congo), డయామైన్ కపిలవర్ణము (Diamine brown) మొదలైన నిరుపాధికపు రంగుద్రవ్యములు (Direct dyes) కూడ నిట్టిబట్టలకు ఉపయోగించును. ఇట్టి బట్టలకు నీలిరంగులు (Blue colours) అంతబాగుగఁ బట్టవు.

ఉన్ని పట్టుదారములు కలిసియున్న బట్టకు రెండు రంగులు వేసి మనోహరముగఁ జేయవచ్చును. ఇట్లు రంగు వేయుట, బట్టను ఒక్కసారిగాని, రెండుసారులుగాని, పెక్కుసారులుగాని రంగులో ముంచుటవలనఁ జేయవచ్చును.

బట్టకు రెండురంగులు వేయుట

౧-వ పద్ధతి:—ఒక్కసారియే బట్టను వేడినీళ్లలో నానఁబెట్టి కొంచెము గంధకద్రావకము (Sulphuric acid) వేసి ఉతికి, చల్లనీళ్లతో కొద్దిగా సబ్బుపెట్టి, వినీగరు లేక చింతపండుతో నునుపుచేయుటవలన ఉన్ని దారములకు నొకరంగు పట్టుదారములకు నింకొక రంగుపట్టును. ఏయేద్రవ్యములు వేసినందున పట్టుదారముల కేరంగు పట్టునది, ఉన్ని ధారములకు నేరంగుపట్టునది ఈక్రిందఁ జూపఁబడినది.

| పట్టుదారములకు పట్టెడిరంగు | ఉన్నిదారములకు పట్టెడిరంగు | ఉపయోగించిన సరుకులు |
|---|---|---|
| (1) గులాబి | ఎఱుపు | ఫ్లాక్సైన్ (Phloxine) |
| (2) బూడిదరంగు | (నీలి) | నీలి (Indigo extract 5%) |
| (3) పసుపు పచ్చ చాయ కలిసిన గోధుమవర్ణము | నీలవర్ణ మిశ్రితమైన గాఢమైన యెఱుపు | క్రైసొడైన్ అజోఫ్లవైన్, ఆసిడ్ మాజంటా (Chrysoidine Azoflavine and Acid magenta) |
| (4) బూడిద వర్ణము గలిసిన ఎఱుపు | నీలి | మెజంటా, నీలి (Magenta & indigo extract) |
| (5) గోధుమ | తమాల వర్ణము | ఆసిడ్ ఎల్లో, నీలి, ఆరంజిగ్రీన్ (Acid yellow, indigo extract orange green) |
| (6) గులాబి | ఎఱుపు | ఆసిడ్ మెజంటా (Acid magenta) |
| (7) పసుపు | గోధుమ వర్ణము | ఆసిడ్ ఎల్లో, ఆసిడ్ మెజంటా, ఆరానైన్, నీలి (Acid yellow, acid magenta, Auraneine indogo extract) |
| (8) నీలము | గోధుమ వర్ణము | మెలాకైట్ గ్రీన్ మెథిల్ మెజంటా, ఆసిడ్ ఎల్లో ఇండిగో, కార్మైన్ వైలెట్ (Malachite green methyl magenta, acid yellow, indigo, carmine vieolet) |

౨-వ పద్ధతి:—రెండు తడవలబట్టను రంగులో నానవేయుట. మొదటితడవ, వేడినీళ్లలో ద్రావకముకలుపుదురు. అదిఉన్ని దారములకు వన్నె తెచ్చును. రెండవతడవ చల్లనీళ్ళలో తడిపెదరు. కొంచెము ద్రావకము కలుపుదురు. ఈతడవ పట్టుదారములకు వన్నెపట్టును. మొదటిసారి ఆసిడ్ రంగులను ఉపయోగించెదరు. అవి రెండుదారములకుఁ బట్టునుగాని, ఉన్ని దారములకు చక్కఁగఁబట్టును. పట్టుదారములకు, స్వల్పముగఁ బట్టును. రెండవతడవ క్షారపు రంగులను (Basic colours) ఉపయోగించెదరు. అవి పట్టుదారములకు బాగుగ నంటుకొనును. కొద్దిగ ఉన్ని దారములకు నంటుకొనును. అందు కొన్ని ప్రక్రియలు ఈ క్రింద నీయఁబడినవి.

| పట్టుదారములకు పట్టెడి రంగు | ఉన్ని దారములకు పట్టెడి రంగు | మొదటపర్యాయము ఉపయోగించిన వస్తువులు | రెండవపర్యాయము ఉపయోగించిన వస్తువులు |
|---|---|---|---|
| (1) నీలము | ఎఱుపు | ఆసిడ్ మెజంటా (Acid Magenta) | అనిలైను (Aniline) |
| (2) ఆకుపచ్చ నీలము | ఆకుపచ్చ పసుపు | నైఫాల్ పసుపు (Naphol Yellow S.) | అనిలైను ఊదా (Aniline Blue) |
| (3) ఊదా | మడ్డిపచ్చ | ద్రావకపు పసుపు (Acid Yellow) | మెథాల్ ఊదా (Methol Violet) |
| (4) ఆకుపచ్చ | పసుపు | Do. | న్యూ విక్టోరియా పచ్చ (New Victoria Green) |
| (5) ఆకుపచ్చ కలిసిన పసుపు | ఆకుపచ్చ | లేపచ్చ (Light Green S.) | అరోమిన్ (Auromine) |
| (6) ఊదా | ఊదా ఎఱుపు | ఆసిడ్ మెజంటా (Acid Magenta) | నీగ్రోసైన్ (Nigrosine) |
| (7) జిల్లేడు పూలవన్నె | ఆకుపచ్చ | లే పచ్చ (Light Green S.) | సాఫ్రనైన్ (Sapranine) |
| (8) ఆకుపచ్చ | ఆలివ్ వన్నె | ద్రావకపు పసుపు (Acid Yellow) | సాఫ్రనైన్ కరుగు ఊదా (Sapranine and soluble Blue) |

కలంకారీ యద్దకము

బట్టలపైని కల్పిత రూపములను, వివిధములగు రంగులతో నద్దుటకు కలంకారీ యద్దకమని పేరు. నూలు, ఉన్ని, పట్టు, నార ఈ నాలుగు జాతుల బట్టలును కలంకారీ యద్దకమునకు పనికివచ్చును. కాని విశేషముగ నూలుబట్టలే వాడుదురు. బట్టల కొకవైపుననే యద్దకము వేసినప్పుడు "ఉల్టా సీదా" యందురు. సాధారణముగ రెండువైపుల అద్దుదురు. రెండువైపుల నొకేరూపముండవచ్చును లేక వేర్వేరు రూపముల నద్దవచ్చును. బట్టయంతయు తెల్లగనుండి బొమ్మలు మాత్రము రంగులు గలిగి యుండవచ్చును, లేక రంగు బట్టమీఁద తెల్ల బొమ్మలుండవచ్చును. అద్దినరూపములన్నియు నొకే రంగులో నుండవచ్చును. లేదా వివిధములగు రంగులలో నుండవచ్చును. ఒకే బట్టను ఇరువది రంగులలో నద్దుటకూడ గలదు.

సాదా యద్దకమునకును కలంకారీ యద్దకమునకును, సామాన్య శాస్త్రవిషయములలో భేదములేకున్నను సాదాయద్దకపు పద్ధతులీ యద్దకమునకు పనికిరావు. కలంకారీ యద్దకమునకు ప్రత్యేక పద్ధతులవసరము. ఏలయన కలంకారీ యద్దకమునం దొక బట్టమీఁద ననేక చిత్రరూపములుండి యొకదానిలో నొకటి కలిసిపోకుండ దేనికది వేరుగ నుండవలెను. ఇంతియగాక యద్దకము పూర్తియైన తరువాత బట్టమీఁదనున్న రూపసముదాయము చూచుటకు నందముగనుండవలెను. బట్టలమీఁద నేరంగు తరువాత నేరంగు నద్దవలెను? బొమ్మలయొక్క యాకృతు లెట్లుండవలెను? ఏబొమ్మ తరువాత నే బొమ్మయుండవలెను? ఈ విషయములు చక్కఁగ గమనించినఁగాని యద్దకము సొంపుగనుండదు. ఇందు కద్దకుఁడు మేధావంతుఁడై కల్పనాచమత్కృతియు, భావమును సంపూర్ణముగ వెల్లడి చేయఁగల చిత్రలేఖనా సామర్థ్యమును గలిగి యుండవలెను. ఈకారణములను బట్టి కలంకారీ యద్దకము సాదా యద్దకముకంటె వేయిమడుంగులు కష్టతరము.

నేతయొక్క యుత్పత్తి కాలమువలెనే యద్దకముల యుత్పత్తి కాలముగూడ నిర్ణయించుటకు వీలులేదు. కాని సాదాయద్దకములోనే కలంకారీ యద్దకముగూడ పరిపాటియైయుండును. ఇది కేవలము పౌరస్త్య విద్యయనియు పాశ్చాత్యులుపౌరస్త్యులనుండి గ్రహించిరనియు చరిత్రకారుల యభిప్రాయము. హిందువులును, చీనా వాస్తవ్యులును ఈ విద్యయందు మార్గదర్శులు. కాని చీనావాస్తవ్యు లంత ప్రవీణతఁ జెందలేదనుటకు కారణములున్నవి. అమెరికా ఖండమునందలి పెరూ, చిలి, మెక్సికో దేశములలో చాలకాలము క్రిందటనే కలంకారీ యద్దకమున్నట్లు దృష్టాంతములున్నవి. రమారమినాలుగువేల సంవత్సరముల క్రిందట నద్దినగుడ్డలు

ఈజిప్టు దేశములోని సమాధులనుండి యిటీవల తీయఁబడినవి. కాని దీనిని బట్టి వారద్దకపు బట్టల నుపయోగించెడివారని తెలిసినది. కాని వారికీ యద్దకపు పద్ధతులు తెలియునని నిర్ధారణ చేయుటకు వీలులేదు. క్రీ. శ. మొదటి శతాబ్దము నాటికి ఈజిప్టుదేశములో నద్దకము లున్నట్లు ప్లినీయను చరిత్రకారుఁడు వ్రాసియున్నాఁడు. ఈతని యనంతరము మూఁడువందల యేండ్లకు ఈజిప్టనులు రోమనులు అద్దకమునం దుపయోగించినయచ్చులు దొరకినవి. మన దేశీయులనుండి యీజిప్టను లీ పరిశ్రమను గ్రహించిరనియు వారిద్వారా పాశ్చాత్యులు నేర్చుకొని రనియు చరిత్రకారుల యభిప్రాయము. పాశ్చాత్యులలో స్పెయిను, ఇటలీ, జర్మనీ దేశములలో మాత్ర మీ పరిశ్రమ యుండెడిదికాని క్రీ.శ. ౧౪-వ శతాబ్దము తరువాత నద్దకపు పరిశ్రమ పాశ్చాత్యులలో పూర్తిగ నంతరించినది.

తిరిగి ౧౬-౧౭-వ శతాబ్ద ప్రాంతములలో హాలెండు దేశీయులగు డచ్చివర్తకులు మన దేశపు టద్దకపు పద్ధతులను నేర్చుకొని జర్మనీ దేశీయులకుఁ జెప్పిరి.* ౧౭-వ శతాబ్దమున జర్మనీలోని ''ఆగుస్బర్గ''ను పట్టణమున ప్రశస్తముగా కలంకారీబట్టలు, ఇతర దేశములకు రవాణా చేసెడివారు. వలసపోయిన పరాసులీ పరిశ్రమ నితరదేశములలో స్థాపించుటకు కారకులైరి. ౧౬౭౬-వ సంవత్సరమున నొక పరాసుయువకుఁడు మొట్టమొదట నింగ్లండులో తేమ్సునదీతీరమున అద్దకములు వేయుట కారంభించెను. అటు తరువాత క్రమముగ స్కాట్లెండు, లంకషైరు మున్నగు ప్రదేశములలో నుపక్రమింపఁబడినవి. ౧౮-వ శతాబ్దాంతమున అద్దకమునం దుపయోగించెడి యచ్చులలోను, తదితరపద్ధతులలోను మార్పులుగలిగి ప్రస్తుత పాశ్చాత్యకళాభివృద్ధికి కారకులైనవి.

తనభావమును చిత్రించి యా చిత్రితరూపమును రంగులతో బట్టలమీఁద ప్రతిఫలింపఁజేయుటయే యద్దకుని కర్తవ్యము. ఇందుకు ముఖ్యమైనవి యైదుసాధనములున్నవి. వానినీ క్రింద వివరించెదము.

ఉపకరణములు

౧. అచ్చులతో నద్దుట (Hand-block printing) :—ఇది మిక్కిలి పురాతనమైన పద్ధతి. పనికూడ మిక్కిలి సులభమైనది. బొమ్మలు అలికినట్లుండక చక్కఁగ నద్దకమగును. కాని పనియంతయు చేతితోఁ జరిగి యంత్రసంపర్కము లేకపోవుటచేత కాలహరణమగును.

* కలంకారీ గుడ్డలకు ఇంగ్లీషులో ''క్యాలికో'' లని పేరు. మన రాజధానిలో మలబారు ప్రాంతములనున్న ''కాలికట్టు'' పట్టణమునుండి కలంకారీ వర్తకము విశేషముగ జరుగుచుండెడిది. అందుచేత అద్దకపు బట్టలనన్నిటిని క్యాలికోలనిరి. ఇట్లే మనము ''చీటీ'' లను వాటిని పాశ్చాత్యులు ''చింట్జు'' అందురు. చీటీగుడ్డలు కూడ మొట్టమొదట మన దేశమునుండియే పాశ్చాత్య దేశముల కెగుమతి కాఁబడినవి.

కొయ్యలతో దిమ్మలుచేసి వానిమీఁద బొమ్మలను చెక్కుదురు. ఈ దిమ్మలు సాధారణముగ రెండు మూఁడంగుళముల కంటె నెక్కువ మందముగనుండవు. ఒకకల్పన చిత్రించుటకు రెండుమూఁడచ్చులు కావలసినప్పుడు ఆ దిమ్మలన్నియు నొకదానిలో నొకటి బిగించి యేకదిమ్మగఁ జేయుదురు. దిమ్మలను చిత్రిపట్టి నున్నగఁజేసి కాటుకతో వానిపైని బొమ్మలయొక్క యాకృతిని వ్రాయుదురు. తరువాత దిమ్మలను తడిగుడ్డలలోఁజుట్టి బొమ్మలను చెక్కుదురు. తయారైన యచ్చులపైని కొన్ని భాగములు పల్లములుగను తక్కినభాగములు యథాప్రకారముగ మెరకగను ఏర్పడును. అచ్చులను రంగులోముంచి బట్టపై నద్దినప్పుడు రంగు మెరకభాగములకు మాత్రమంటి గుడ్డమీఁద బొమ్మ లేర్పడును.

చెక్కుటవలన అచ్చులపై నాజూకుపని చేయుటకు వీలుండదు. అందుచేత సన్నని పూలు, పూజలు చేయవలసినప్పుడు వానిని రాగితోఁజేసి దిమ్మలలోనికి దిగఁగొట్టెదరు. కొన్నితరుణముల బొమ్మలను సీసపురేకుపై చిత్రించి యారేకును కొయ్యదిమ్మమీఁద బిగించెదరు. అచ్చుఁబోసికూడ దిమ్మలను తయారుచేయుటగలదు.

అచ్చులతో బట్టలనద్దుటకొక యెత్తయిన బల్ల కావలెను. ఈబల్లపై నొకచదరమైన రాయి పరచి రాతిపైని మెత్తనికంబళి ముడతలు లేకుండబిగించి కప్పుదురు. బల్లయొక్క రెండు వైపులను కప్పీలు బిగించి యాకప్పీలపైని బట్టనులాగి యద్దకమైన తరువాత రెండవ వైపునలాగి యారఁగట్టుదురు. ఈ బల్లగాక యద్దకమునకు రంగుతొట్టి యొకటి యవసరము.

అద్దకము వేయుటకు బల్లకు నెడమవైపున నున్న కప్పీలమీఁదుగా బట్టనులాగి ముడుతలు లేకుండ బల్లపైఁబరచును. తరువాత రూళ్లకఱ్ఱతీసికొని యెఱ్ఱనిసీమసున్నముతో నెక్కడ దిమ్మల నద్దవలెనో అక్కడ గుఱ్తులు పెట్టును. అచ్చులను రంగులలోముంచి గుఱ్తులుంచినచోటఁబెట్టి నొక్కును. రంగుచక్కఁగ నంటుటకై కొయ్యసుత్తెతో నొకటి రెండు సారులుకొట్టును. రెండవతూరి యద్దునప్పుడు రెండచ్చులునుగలిసి చక్కఁగ నుండవలెను గాని వంకరపోయి రెంటికిని మధ్యను సందులుండఁగూడదు. సరిగా నద్దుటకు దిమ్మలయొక్క నాలుగు మూలలను గుండు సూదులుండును. వీనిసహాయముతో నెక్కడ నద్దవలెనో యద్దకునికిఁ దెలియును. ఈరీతిని బల్లమీఁదఁ బరిచిన బట్టయంతయు నద్దఁబడినతరువాత నాభాగము నారుటకై జారవిడిచి యింకొక భాగము లాగుదురు.

అద్దకమునందు వేర్వేరు రంగులు బొమ్మలుండిన యెడల మొట్టమొదట బట్టనంతయు నొకరంగుఁగల బొమ్మలతోనద్ది యారనిచ్చి తరువాత మరియొక రంగులోముంచి యద్దుదురు. రంగులన్నియు పూర్తియగు దనుక

నిట్లే చేయుచుందురు. ఏకకాలమునసే రెండు మూఁడు రంగులనద్దుటకు ప్రయత్నములు జరిగినవి. ఇందు దిమ్మలయొక్క వేర్వేరు భాగములు ఆయారంగులతో మాత్ర మేక కాలమున ముంచియద్దుదురు. ఈమార్పువలన నేకకాలమున ఆరురంగులుకూడ అద్దవచ్చును. కాని యీ యద్దకములో నచ్చులకు మధ్యను సందులుండుటచేత నంతఁగా వాడుకలోలేదు.

౨. పెర్రోటీను సాధనము (Perrotine printing):--ఇది యంత్రసాహాయ్యమువలన జరిగెడి యద్దకపు పద్ధతి. క్రీ. శ. ౧౮౩౪ సంవత్సరములో "పెర్రో" యను నతఁడు నిర్మించుటవలన నీ యంత్రసాధనమున కాతని పేరిడిరి. ఇది యింగ్లండులో వాడుకఁ జేయక పోయినను పాశ్చాత్యదేశములలో కొన్నిటియందు వాడుకలోనున్నది. ఈ సాధనమునందు రూపములు చిత్రింపఁబడి మూఁడుదిమ్మలుండును. ఇవి సామాన్యముగ మూఁడడుగులు పొడవును మూఁడు మొదలు ఐదంగుళములవెడల్పును గలిగియుండును. ఈ మూఁడు దిమ్మలు సమభుజాకారమువచ్చునట్లు ఒకదానితో నొకటిచేర్పఁబడి యుండును. ఇటువంటిదియే మూఁడు ముఖములుగల మరియొక యినుప చట్రిమిందులో నిమిడియుండును. అద్దకమునం దొక్కొక్క దిమ్మదానికెదురుగనున్న పలుక పైనొక్కును. ప్రతిదిమ్మకును ఆయారంగులు గలతొట్టి కట్టఁబడును. అద్దకముగావలసిన బట్టదిమ్మలకును ఇనుపచట్రముయొక్క పలకలకును మధ్యనున్న స్థలములోగుండ జరిగి పోవుచుండును. యంత్రము పనిచేయునప్పుడు ఎంతరంగు కావలెనో యంత దిమ్మలపై కుంచెలతోఁ పూయుటయు, బట్టతనస్థలములోవచ్చినిలుచుటయు, అచ్చులు దానిపై నొక్కుటయు అద్దకమైనతోడనే బట్ట యావలికి జరిగిపోవుటయు మున్నగు క్రియలు అప్రయత్నముగ వాని యంతట యవే జరుగుచుండును.

ఈ యంత్రముతో నద్దుటకు నెక్కువ పనివాండ్రవసరములేదు. కాలహరణము గాక శీఘ్రముగ నద్దకము ముగియును. బొమ్మలు కూడ ఏకధారగనుండి ఒకటేదిమ్మతో నద్దినట్లు కలిసియుండును. కాని, యీపద్ధతి ప్రకారము మూఁడురంగులలో మాత్రమద్దకము వేయుటకు సాధ్యమగును. అందుచేత నన్ని దేశములలో విశేషముగ వాడుటలేదు.

3. చిత్రితమైన రాగిరేకులతో నద్దుట (Engraved coperplate printing):—రాగిరేకులపై రూపములను చిత్రించి ముద్రణాయంత్రములలోవలె వీనితో గుడ్డలనద్దుదురు. ఈ పద్ధతి యనేక దేశములలో వాడుకలోలేదు. కాని చిన్నిరుమాలపై నాజూకుగల యంచుల నొత్తుట కెస్విట్జరుల్యాండులో దీని నుపయోగించుచున్నారు.

౪. తిరుగుడు యంత్రముతో నద్దుట (Roller, cylinder or machine printing):-ఇదిప్రస్తుతము విశేషముగ వ్యాప్తిలో నున్న సాధనము.ఇది మొట్టమొదట ౧౭౮౫-వ సంవ

త్సరమునఁ గనిపెట్టఁబడి వెంటనే కొన్నిమా
ర్పులతో నేకకాలమున రెండుమొదలుకొని
యాఱు రంగులను ముద్రించుటకు యోగ్య
మగునట్లుచేయఁబడెను. ఈయంత్ర సాధన
మునందు మూఁడుభాగములు ముఖ్యములై
నవి. ఇందు మొదటిది యొకగుండ్రని యినుప
దూలము. యంత్రసహాయమువలన నిది పైకిఁ
గ్రిందికిఁబోవచ్చును. దీనికి క్రిందుగనొకరాగి
దూలముండును. ఇదియు నినుపదూలము
వలె గుండ్రముగనుండును. అద్దుటకుఁ గావల
సిన బొమ్మ లీరాగిదూలము పై చిత్రితములై
యుండును. రాగి దూలమునంటుచు క్రింది
భాగమున గుండ్రనికొయ్యతొట్టొకటిగలదు.
ఇది సగము వరకు రంగుతొట్టిలో మునిగి
యుండును; ఈమూఁడును గుండ్రముగ నుండి
యవసరమునప్పుడు గిరగిరఁ దిరుగును. పీనికి
నింగ్లీషులో "రోలర్సు" అని పేరు. రోలర్సుమీఁద
కంకరను దట్టించుటకు లాగడీ యినుపయం
త్రములవలెనుండును. పైనిఁజెప్పిన మూఁడు
రోలర్లును నొకయినుప చట్రములో బిగించి
యుండును. ప్రతిరంగుకు నొక్కొక్క యంత్ర
మిట్టిది యుండవలెను. ఈయంత్రముయొక్క
నిర్మాణమును ఉపయోగించెడి పద్ధతియు
నిందు వర్ణింపఁబడును. ఈ క్రిందఁజూపిన పట




ములో ౧-గురుతుగలిగి చక్రము
వలెనుండు పై భాగము ఇనుప
దూలముయొక్క చివరభాగము.
౨-అనునది దీనిమీఁద జుట్టియు
న్నమెత్త. ఈమెత్త ఉన్నితోను
నూలుతోను గలిపిచేయుదురు.
ఈమెత్త యద్దకమువేయవలసిన
గుడ్డను బొమ్మలపై చక్కఁగ
నొక్కును. ౩-గురుతుగలిగి ఇనుప
దూలము నంటియున్నది రాగి
రోలరు. అద్దవలసిన బొమ్మలు
దీనిపై చిత్రింపఁబడును. రాగి
రోలరున కిరుప్రక్కలను ౪-౫
గురుతుగల రెండు భాగములు
వ్రేలాడుచున్నవి. ఇందొకటి
యుక్కుతోను రెండవది

ఇస్త్రీ [illegible] ను చేయబడును. కావలసిన రంగు రంగునుండి యెక్కువ [illegible] న దానిని గీచివేయుటకు ఉక్కు [illegible] యుపయోగించును. అద్దకమునందంటుకొను దారములను మున్నగు వానిని ఇస్త్రీయది తీసివేయును. ఉక్కుస్తాగల కొయ్యగోలగు రాగిగోలగుకు రంగును పూయును. ఇది ఉక్కుస్తాగల రంగు [illegible] లో సగము మునిగి యుండును. [illegible] అనునది యద్దకము వేయవలసిన గుడ్డ. దీనికి ఇనుపదూలముననుసు మధ్యనొక కంబళి [illegible] యు రూపమున (అనగా ఇంఫ్యమునల) నుండు ఇనుప దూలమునులో [illegible] గుచుండును.

ఈ యంత్రములో పనిచేయునప్పుడు ఇనుప దూలమును రాగిగోలగుకు తగులులాగున బిగించి యంత్రమును త్రిప్పనారంభింపవలెను. అద్దవలసిన గుడ్డ ఇనుప దూలమునకును రాగి గోలగుకును మధ్యనుండును. యంత్రము పనిచేయునప్పుడు రంగు కొయ్యగోలనుండు రాగిగోలగు [illegible] చిత్రములున్న బొమ్మల [illegible] బాయబడును. బట్టలు దీని [illegible] నప్పుడు బొమ్మలు ముద్రితములగును. అద్దకమైన వెంటనే బట్టలు ఆవిరి గొట్టములలో నెండ వేయుదురు.

[illegible] సి వర్ణించిన యంత్రము ఒక్క రంగుతో నద్దుటకే పనికివచ్చును. ఎన్ని రంగులతో నద్దవలెనన్న అన్ని రాగిగోలలు యుండవలెను. ప్రతి యంత్రము [illegible] ని చెప్పిన రీతినే యుండి వీని కన్నిటికి పరస్పర సంబంధముండును. ఏకకాలమున పదునారురంగులతో నద్దుటకు వీలైనయంత్రములుగలవు. ఎంతపెద్ద యంత్రమైనను నిర్మాణవిధాన మొకటియే. కాని తప్పిళ్లలో నించుకు భేదముండును.

ఇటీవల నీ తిరుగుడు యంత్రములో ననేక మార్పులు జరిగినవి. వీనిలో రెండు ముఖ్యమైన మార్పులు చెప్పవలసియున్నది. ఇందొకటి "విరామ యంత్రము" (Intermitent machine). దీనివలన కొన్నిరంగు లంటకుండునటులుజేసి కావలసిన రంగులను మాత్రమే యద్దవచ్చును, లేదా యొకటేరంగును కొంత దూరమద్ది కొంత భాగము వదలివేసి తిరిగి యచ్చటినుండి యద్దుటకు వీలగును. మన దేశమునకుఁ బంపెడి శాలువులు చీరెలు మున్నగునవి ఇట్టి యంత్రములో తయారగు చున్నవి.

రెండవది "డూప్లె" యంత్రము (Duplex or Reversible machine). ఇందు రెండు రాగిరోలర్లుండును. ఈ రెండును ఏకరీతిని చిత్రితములై యుండును. ఈ యంత్రసాహాయ్యమువలన ఉల్టాసీదా లేకుండ బట్టలనద్దుటకు వీలగును. తిరుగుడు యంత్రములతో నద్దుటవలన మూఁడు లాభములున్నవి. పది గంటల కాలములో పండ్రెండువేల గజముల గుడ్డ నద్దవచ్చును. ఎంత సున్నితములైన బొమ్మలనైనను మోటబొమ్మలైనను బీరువోక్షుండ నద్దనగును. ఒకే బొమ్మను వివిధములగు రంగులతో నేకపర్యాయము రంగులు కలియకుండ నద్దవచ్చును.

రాగిరోలర్లపై బొమ్మలను చిత్రించుట

అద్దకముయొక్క ప్రాశస్త్యము చిత్రించిన బొమ్మలను బట్టియుండును. బొమ్మలు చక్కఁగఁ జెక్కినఁగాని యద్దకము తేటగా నుండదు. రాగి రోలర్లపై బొమ్మలు చెక్కుటకు మూఁడు పద్ధతులున్నవి.

(i) చేతితో ఉలిచేత నగిషీ చెక్కుట:—ఇది మిక్కిలి పురాతనమైన పద్ధతి. కాని మిక్కిలి యాలస్యమగు పద్ధతియగుటచేత నిప్పుడంత వాడుకలో లేదు. చెక్కదలచిన రూపములను రోలరు మీఁద రంగుతో గీచి యాగీతలలో నొక యులితోటి చెక్కుదురు. చెక్కినచోట్ల రాగి లేచిపోయి రూపముల యొక్క యాకృతియేర్పడును. ఎక్కువ యనుభవజ్ఞులుగాని యీ చెక్కడపుపని చేయఁజాలరు. చేతికిని కంటికిని నిలుకడ కుదురవలెను. మిక్కిలి చిక్కుఁగల నగిషీపనికిని యంత్రములకలవడని పెద్దవియగు రూపములకును ఈపద్ధతి యుపయోగపడుచున్నది.

(ii) ద్రావకముతో కరిగించి బొమ్మల నేర్పరచుట:—చిత్రకారునియొక్క రూపకల్పనము తుత్తనాగపు రేకుపై దింపి రాగిరోలరును చక్కఁగ నునుపుజేసి మైనముతోఁ గప్పుదురు. తరువాత నొకవాడిగల ఇనుపగంటముతోఁ నాతుత్తనాగపు రేకుమీఁది బొమ్మలను రాగిరోలరుపై వ్రాయుదురు. వ్రాసినచోట్ల మైనమువిడిపోయి తక్కిన రోలరంతయు మైనముతోఁ గప్పఁబడియుండును. బొమ్మలను వ్రాసినతరువాత రోలరును నైట్రికుద్రావకములోముంచి కొంతసేపుంచుదురు. అప్పుడు మైనములేనిచోట్ల రాగి యా ద్రావకములో కరిగి గుంటలేర్పడును. అటుతరువాత మైనమును గోకివేసినయెడల రోలరుపై బొమ్మల యొక్క యాకృతి యేర్పడును.

(iii) యంత్ర సాహాయ్యముతో చిత్రించుట:—ఈ పద్ధతిప్రకారము మొట్టమొదట బొమ్మలను ఉక్కురోలరుపైఁ జెక్కి దానిని కాల్చి చల్లనీటిలో ముంచుటవలననది బిరుసెక్కును. దీనిని మరియొక యుక్కురోలరుపై నొక్కునట్లుజేసిన యెడల మొదటిబొమ్మ దీనిపైఁ బడును. కాని మొదటి రోలరులోనున్న పల్లములకు మెరకులును, మెరకలున్నచోట్ల పల్లములును ఏర్పడును. ఈ రెండవరోలరునుగూడ మొదటిదానివలె బిరుసెక్కింతురు. తరువాత నీ రోలరుతో రాగి రోలరుపై నొక్కినయెడల మొదట వ్రాసిన బొమ్మ దీనిమీఁద నేర్పడును.

౫. చిల్లి రేకులతో నద్దుట:—ఇది మిక్కిలి పురాతనమైన సాధనము. జపాను దేశములో విస్తారముగ వాడెడివారు. మన దేశములో నిప్పటికి వాడుకలోనున్నది. అట్టలపై గాని సన్నని రేకులపై గాని బొమ్మలనువ్రాసి ఆయాచోట్ల కత్తితో కోయుదురు. వీనిని బట్టపై నుంచి కుంచెలతో రంగులు వేయునప్పుడు కత్తిరించినచోట్ల రంగంటి, తక్కినచోట్ల తెల్లఁగానుండును. ప్రతి బొమ్మయు నీపద్ధతి

వలన నద్దుటకుసాధ్యమగును. వేర్వేఱు రేకులు దీసికొని వివిధ రంగులుతోఁగూడ నద్ద వచ్చును. కాని యితరపద్ధతులకును దీనికిని చిత్రించుటయందు భేదమున్నది. ఎట్లన ఈ పద్ధతి ప్రకారము మామిడిపిందెల యంచు నద్దవలెనను కొందము. మామిడి పిందెలను అట్టచేయునప్పుడు మధ్య మధ్యను కొంచెము వదలి కత్తిరించనిచో పిందెలు అట్టలో నిలువవు. ఇట్టియట్టతోఁజేసినయంచు అద్దినప్పుడు బొమ్మలు ఏకధారగానుండక మధ్యమధ్యను తెల్లనిభాగములుండును.

పైని వర్ణించిన సాధనములు మాత్రమే గాక యితరసాధనములుగూడ కొన్నిగలవు. రూప కల్పనమును బట్టియు, బట్టలయొక్క సున్నితమును బట్టియు, నద్దకపు పద్ధతులు మారుచుండును. కొంతవరకు యంత్రములతో నద్ది తరువాత చేతిదిమ్మలతో నద్దుటగూడ కలదు. ఇట్లే సాదాబొమ్మలు యంత్రములో నద్ది యెక్కువ నగిషీగల వానిని చేతిదిమ్మలతోగాని చిల్లి రేకులతోగాని యద్దుదురు.

కలంకారీ యద్దకమున కుపయోగించు బట్టలను సాదాయద్దకము వేయునప్పటికంటె

**బట్టలను తయారు చేయుట**

నెక్కువ జాగ్రత్తతో చలువ చేయవలెను. కలంకారీబట్టలను ప్రత్యేకముగ చలువచేసి సాపుచేసినఁగాని యద్దకము చక్కఁగాపడదు. నేతలోవచ్చిన హెచ్చుతగ్గులనుదీసివేసి చలువ చేసిన తరువాత బట్టలను ముడుతలుపడకుండ ఇనుపరోలర్లపైఁ బట్టుదురు: తరువాత వానిని టర్కీయెరుపు నూనెలో (సాదా యద్దకము చూడుడు) ముంచి యెండవైచి ముడుతలు పడకుండ నుంచెదరు. ముఖ్యముగ నెరుపు రంగులును, రోజా రంగులును వేయుటకు నూనెలో నాన్పుట యవసరము. ఈపని వలన తక్కిన రంగులకుఁగూడ నొకవిధమగు తళుకు వచ్చును. అందుచేత సామాన్యముగ బట్టలను నూనెలో నాన్పుదురు.

సాదాయద్దకమునకును కలంకారీ యద్దకమునకును రంగులు తయారుచేయుటలో భేదమున్నది.

**రంగులను తయారుచేయుట**

కేవలము శాస్త్రజ్ఞానమే గాక యనుభవము కూడ లేనిదే రంగులను చక్కఁగఁ గలుపుట దుర్లభము. రంగుల యొక్క లేత ముదురులనుబట్టి వాని భాగములు మారుచుండును. ఇంతియగాక యొకే నమూనాలో రెండు మూఁడు రంగులుండునప్పుడు వానిలో నొకదానితో నొకటిపరస్పర వైషమ్యము లేకుండునట్లు రంగులును గలపవలసియుండును. "సాదాయద్దకము" లో వ్రాసిన రంగుల విభజన క్రిందఁగూడ వర్తించునుగాన నిక్కడ తిరిగి దానినిగూర్చివ్రాయ నక్కరలేదు. కొన్నిరంగులు తమంతటతామే బట్టల కంటుకొనును. కొన్ని యితర పదార్థముల సహాయమునగాని యంటుకొనవు. మరికొన్ని యుపాధులతో నద్దవలెను. కొన్ని

తరుణముల ఉపాధులను మాత్రము బట్టలపై నద్ది తరువాత రంగులో ముంచెదరు.

సాదాయద్దకమునందు రంగులు సామాన్యముగ కషాయ స్థితిలోనుండును. బట్టలను రంగులకషాయములలో ముంచినప్పుడు రంగు లంటును. కాని కలంకారీ యద్దకమునందు రంగులు కషాయములుగఁ జేయరు. దిమ్మలను ముంచి బట్టలపై నంటించుటకు వీలగునంత పల్చగ మాత్రముండును. ఇట్లు చేయుటకు రెండుద్దేశములున్నవి. రంగులు నీటివలె పల్చగానున్న యెడల దిమ్మలను రంగులో ముంచి బట్టలపై నద్దులోపల కొంత క్రిందపోయి నష్టమగును. ఇంతియగాక రంగు పల్చగానున్నప్పుడు బట్టపైనద్దిన తరువాత నద్దిన చోట్లనేయుండక యిరుప్రక్కలకుఁ బ్రాకును. అందుచేత బొమ్మలుచక్కఁగ నుండక చెదరిపోవును. ఈ కారణములనుబట్టి కలంకారీ యద్దకమునందు వాడెడిరంగు లెప్పుడును గోదువలె జిగటగలిగియుంటుకొనుటకు వీలుగ నుండును. ఇట్లు చేయుటకు రంగులను కొన్ని యితరములగు జిగటపదార్థములతోఁ గలిపెదరు. ఈ పదార్థములకు "జిగురులు" (Thickening agents) అని పేరు. వీనిని గూర్చి యించుక వ్రాయవలసియున్నది.

జిగురులు (Thickeners):— ఇవిరంగులను గట్టిపరచుటకై కలిపెడి జిగటగల వస్తువులు. గంజి, మైదాపిండి, తుమ్మజిగురు, సీమ జిగురు, సెనిగాలు జిగురు, జిగటమట్టి, సర్వీసు, బెల్లపునీరు, గ్లిసరీను, కోడిగుడ్లసొన మున్నగునవి తరుచుగ వాడఁబడు జిగురులు. కోడిగుడ్ల సొనతప్ప తక్కినవన్నియు నీటిలో కలిపి కాని ఉడకఁబెట్టి కాని పక్వమునకుఁ దేఁబడును. ఒక పెద్దగిన్నెలో నీరుఁ బోసి యందులో నొక చిన్నగిన్నెనుంచి దానిలో జిగురు పదార్థమునుంచి కొంచెము నీటితోఁ గలిపెదరు. పెద్దగిన్నెలోని నీరు మరగఁబెట్టినప్పుడు యావిరికి జిగురు పక్వమునకువచ్చును. అన్ని జిగుర్లను అన్ని రంగులకు నుపయోగించుటకు వలనుపడదు. రంగుల స్వభావములను బట్టి జిగుర్లు మారుచుండును. కొన్ని జిగుర్లను జేయుపద్ధతులను వాని యుపయోగములను గూర్చి యిచ్చట సంక్షిప్తముగ వ్రాయఁబడును.

గంజి:—ఇది సర్వసామాన్యముగ ననేక రంగులకు వాడెడి జిగురు. ఎక్కువ క్షారస్వభావముగల (సున్నము వలె గాటయినవి) రంగులతోఁగాని ద్రావక స్వభావముగల (గంధకద్రావకమువలె పుల్లనివి) రంగులతో గాని కలుపుటకు పనికిరాదు. క్షారపు రంగులతోఁగలిపినప్పుడు గంజి ముద్దగట్టును. ద్రావకపు రంగులతోఁ గలిపినప్పుడు జిగురు చెడి బిరుసెక్కును. కాని తక్కిన యన్నివిధములగు రంగులతోఁగలిపి వాడవచ్చును.

గంజిచేయుటకు 15 పౌనుల మైదాపిండికి కొంచెము చల్లనీరు గలిపి మీగడవలె నగునట్లు చేయవలెను. తరువాత కొంచెము "ఆ

లివు నూనె" (Olive oil) కలిపి పదిగ్యాలనుల నీటిలోఁ గలియఁబెట్టి, మరగఁబెట్టి చల్లార్చెదరు. అప్పటికి గంజి పక్వమునకువచ్చును.

గోధుమ పిండి:— ఇదియు గంజివలెనే పైనిజెప్పినరీతి నుడకఁబెట్టి తయారు చేయఁబడును. పటిక, అన్నభేది మున్నగు ఉపాధులను చిక్కఁగఁ జేయుటకు మాత్ర ముపయోగఁ బడుచున్నది. తక్కిన రంగులతోగాని యుపాధులతోగాని కలుపుటలేదు.

తుమ్మబంక ౖ సైనిగాలు జిగురు:—ఇవి యనాదినుండియు కలంకారీ యద్దకమునందు వాడుకలోనున్నవి. కాని వానివెల యధికమగుటచేత నిప్పుడు తరుచుగ వాడుటలేదు. లేతరంగుల నద్దుటకివి ప్రశస్తమైన జిగురులు. ముదురు రంగులువేయుటకు పనికిరావు. గంజిపెట్టిన బట్టలు నీటిలోజాడించి నప్పుడా గంజి పూర్తిగపోక బట్టలు కొంచెము బిరుసుగ నుండును. తుమ్మబంకపెట్టిన గుడ్డలట్లుగాక యుతికినవెంటనే జిగురు బట్టలనుండి విడిపోయి బట్టలు మెత్తగ నుండును. అందుచేత నివి మిక్కిలి సున్నితములగు బట్టల నద్దునప్పు డుపయోగపడుచున్నవి. ఆరులేక యెనిమిది పౌనుల బంకను గ్యాలను నీటిలోనుడకఁబెట్టిగాని చల్లనీటిలో నాన్చిగాని తయారు చేయవచ్చును.

సీమజిగురు (British gum):—ఇది మైదా పిండివేయించి తయారుచేయఁబడును. ముదర వేగినయెడల నల్లగానుండును, లేనిచో నెఱ్ఱవాగుగానుండును. ముదరవేగినకొలఁది జిగట హెచ్చును. లేతగా వేగినపిండి మూఁడు పౌనులు గ్యాలను నీటిలోఁగలిపిన యెడల మంచి జిగురు తయారగును. ముదరవేగినది గ్యాలనుకు పదిపౌనులవరకుఁ గావలెను. ముదర వేగిన పిండితోఁజేసిన జిగురు ద్రావకపు రంగులకును క్షారపురంగులకుఁగూడ నుపయోగించును. గంజివలె నీజిగురు బట్టలకు దట్టముగఁ బట్టదు. అందుచేత నిది ముదురు రంగులు వేయుటకు పనికిరాదు.

"డ్రాగను" జిగురు (gum tragacanth): ఇది బజారులోదొరకును. కలంకారీ యద్దకమునకిదియొక ముఖ్య పదార్థము. గంజితోగాని మైదా పిండితోగాని కలిపి వాడెదరు. పూత రంగులు (pigmet colours) వేయుటకును ఉపాధి రంగులువేయుటకును వాడవచ్చును. దీనితోఁ గలుపుటవలన గంజి బట్టలకు దట్టముగఁబట్టి యుతికిన తరువాత బట్టలు నున్నగా నుండును. చల్ల నీటిలోగాని వేడినీటిలోగాని నానఁబెట్టుటవలన నీజిగురు తయారగును.

కోడిగుడ్లసొన:—ఇందులోని జిగురు గల భాగమునకు "అల్బుమిన్" (albumen) అని పేరు. దీనిని రక్తమునుండి కూడ తీయవచ్చును. ఇది రెండు విధముల నుపయోగపడుచున్నది. రంగులకు జిగురు బుట్టించఁగలదు, పూతరంగులను బట్టలకు దట్టముగ నంటునట్లును చేయఁగలదు. ఇది యెప్పుడు చల్లనీటితోనే తయారుచేయఁబడును. చక్కఁగా

తయారగుటకు కొన్నిరోజులుకూడ పట్టును. రక్తమునుండి తీసిన అల్బుమిను గ్యాలనుకు నాలుగు పౌనులును కోడిగుడ్లసొనయైనచో గ్యాలనుకు ఆరు పౌనులును గావలసి యుండును. కోడిగుడ్ల సొనవెల యధికమగుటచేత లేతరంగులు వేయుటకు మాత్రము వాడుచున్నారు. "డ్రాగను" జిగురును కోడిగుడ్ల సొనను చెరిసగముగలిపి పూతరంగులు వేయుట కుపయోగించెదరు. ముదురురంగులు వేయుటకింతకంటె నెక్కువపాలు 'అల్బుమిను' కావలసియుండును. ఈ జిగురుతో రంగుల నద్దిన తరువాత బట్టల కావిరిఁబట్టెదరు. అట్లు చేసినప్పుడు 'అల్బుమిను' గడ్డకట్టి రంగులు బట్టలకు గట్టిగ నతుకుకొనును.

జిగురులను రంగులను కలిపి యుడకఁబెట్టి యద్దుటకు తయారుచేసి బట్టలకతుకుకొనుటకు ఇతర పదార్థములతోఁ గలిపెడివారు. కాని యిప్పుడు జిగురును,రంగులను అంటుడు పదార్థములను వేర్వేరుగతయారుచేసి యద్దునప్పుడు మాత్రము గలుపుదురు. రంగులతోఁ గలిపెడి జిగురులపాలు ఎక్కువైనచో లేత రంగులు వేయవచ్చును.

అద్దుటకు పూర్వము జిగురులు గలిపిన రంగులను వడకట్టుటముఖ్యము. ఇసుక మున్నగు గట్టిపలుకులు రంగులతోఁ గలిసియున్న యెడల రోలర్లపై గీతలుపడి బట్టలు చెడిపోవును. అందుచేత రంగులు మెత్తగనుండుటా యత్యవసరము. వడకట్టుటకు రంగులను జిగురులతోఁ గలిపిన తరువాత గుడ్డ సంచులలోగాని పట్టుసంచులలోగాని పోసి పిసికెదరు. ఇట్లొకటి రెండు సారులు చేయు సరికి గట్టి పలుకులన్నియు సంచులలో నిలిచి మెత్తని రంగులుమాత్రము వెలువడును.

అన్ని జిగురులు అన్ని రంగులతోఁ గలుపుటకు వీలులేదని స్పష్టముగ వ్రాయఁబడినది. రంగులు మిశ్రణముఁజేయుటకు జిగురులకును రంగులకును పరస్పరవైషమ్యము లేకుండనుండవలెను. కొన్ని జిగురులకు మిక్కిలి వేడిబెట్టినఁగాని జిగటరాదు. కాని యావేడిమికి కొన్ని రంగులు చెడిపోవును. కావుననట్టిరంగులతో నీజిగురు గలుపఁగూడదు వేడిమికి చెడిపోవు రంగులతో గంజిని మైదాపిండిని గలపఁగూడదు.

జిగురులకును రంగులకును పరస్పరానురాగ ముండఁగూడదు. అట్లుగానిచో జిగురులు రంగులతో రసాయన సంయోగము నొంది రంగులు వర్ణములు మారిపోయి నూతన పదార్థములేర్పడును. ద్రావక స్వభావము గల రంగులతో గంజిఁ గలపఁగూడదు. క్షారస్వభావముగల రంగులతో తుమ్మబంక మున్నగు జిగురులు మాత్రమే వాడవలెను.

జిగుర్లయొక్క పాకము జాగ్రత్తతోఁ గని పెట్టవలెను. ఏలయన జిగురుయొక్క పక్వమును బట్టి యవి యారుటకుఁ గావలసిన కాలము ఎక్కువ తక్కువ లగుచుండు. ఆ రెండుకాలమును బట్టి రంగులయొక్క కాంతి

హెచ్చుటయు తగ్గుటయు సంభవించుచున్నది. పటికతోను అన్నభేదితోను గంజినే వాడుదురు. ఏలయన నవి కొంచెము మాలిన్యముగ పనిచేయును. అందుచేత తుమ్మ బంక మొదలగుగోదులు పనికిరావు. ఇట్లే రంగులయొక్క లేతముదురుచాయలు జిగుర్ల యొక్క గట్టిపలుచఁదనములను బట్టి యుండును. గంజి వాడుటవలన వచ్చెడి ముదురు చాయలు గోదులవలన రావు.

కొన్ని తరుణములు జిగురులను రంగులతో గాని యుపాధులతోగాని కలిపినప్పుడా జిగుర్లు వానితో సంయోగము నొంది క్రొత్త రంగులను సృష్టించును. ఇట్టి స్వభావముగల జిగురుల నాపదార్థములతోఁ గలపఁ గూడదు.

అద్దకము పూర్తియైన తరువాత బట్టలనుతికినవెంటనే జిగురులుబట్టలనుండిశీఘ్రముగ విడిపోవలెను. లేనిచో రంగులయొక్క దీప్తి తగ్గిపోవును.

జిగుర్లతోఁ గలిపి యద్దినప్పుడు సామాన్యముగ బట్టలు కుంగును. జిగురు చిక్కనైన కొలఁది కుంగుట హెచ్చగును. ఇట్టి స్థితిలో రెండుమూఁడు రంగులలో నద్దినప్పుడవి సమానముగనుండక వ్యాప్తియందు హెచ్చుతగ్గులు గలిగి కాంతిలోఁగూడ భేదములుండును. ఇట్టి యవాంతరములు రాకుండుటకై రెండుమూఁడు జిగుర్లు గలిపిన మిశ్రణముల నుపయోగించెదరు. సామాన్యముగ తుమ్మ గోదుతో బంకమట్టిగలిపి వాడుదురు. అద్దకమునం దుపయోగించెడి రంగుల వరుసను బట్టికూడ జిగుర్లు మారుచుండును. ముదురు రంగులు గంజితోఁ గలిపి మొదట నద్దెదరు. లేతరంగులు గోదులతోఁ గలిపి తరువాత నద్దెదరు. నాజూకైన మాపకల్పనముల నద్దుటకు తుమ్మ బంక లోనగు గోదులను వాడుదురు గాని గంజి మైదా పిండిమున్నగు చిక్కని జిగుర్లను వాడుకఁజేయరు.

### అద్దకపు పద్ధతులు

ఇంతవఱకు బట్టలను, రంగులను తయారుచేయు పద్ధతులు వర్ణింపఁబడినవి. ఇఁక రంగుల నద్దెడి మార్గములు వర్ణింపవలసి యున్నది. రంగుల యొక్క తత్త్వమును స్వభావములను బట్టి యద్దెడి "సంప్రదాయములు" మారుచుండును. ఈ సంప్రదాయములకే "పద్ధతులు" (Styles of printing) అనిపేరు. ప్రస్తుతము రంగులయొక్క సంఖ్య మితిమీరి యుండుటచేత పద్ధతులు గూడ ననేకములున్నవి. కాని రంగుల స్వభావములను బట్టి రెండు సామాన్య పద్ధతులు దేలుచున్నవి. కొన్నిరంగులు బట్టలకు తగిలినంత మాత్రముననే యంటుకొనును. ఇవి సామాన్యముగ ఖనిజ స్వభావము గల రంగులు. ఇంగిలీకము జేగుర్లు, గంగజిందూరము లోనగునవి యిట్టి జాతిలోనివి. ఇట్టి రంగులను జేగుర్లతో గలిపి చిక్కఁగఁజేసి దిమ్మలతోనద్ది ఎండఁగట్టెదరు. సామాన్యముగ కోడిగుడ్ల సొనతోఁ గలిపి

యద్దుదురు. అప్పుడు పక్కా రంగులు నిలిచి యుండును. వీన్నిని పూతరంగులన (pigments) వచ్చును. ఈ యద్దకమునకు 'పూయుపద్ధతి' (pigment style) యని పేరు.

కొన్ని రంగులు ముఖ్యముగ మూలికల సంబంధము లగునవి (vegetable dyes) పూతఁబూయుటకువలనుపడనివి. ఇట్టిరంగులకు సాదా యద్దకిమునందు వర్ణింపఁబడిన పద్ధతు లన్నియు వర్తించును. ఇం దనేక పద్ధతులు గలవు. ఒక బట్టలో కొన్ని భాగములకే రంగు వేయుటవలన సాదా యద్దకమునందు వీలులేని పద్ధతులు గూడ నొకటి రెండున్నవి. ఈ పద్ధతు లన్నియు నీ ధిగువ సంక్షేపముగ వర్ణింపఁబడును.

(1) పూతరంగుల పద్ధతి (pigment style):—ఇది పురాతన పద్ధతి. కల్పితపు రంగులు లేని కాలమున నీ పద్ధతి మిక్కిలి వాడుకలో నుండెడిది. బచ్చెన పోసినప్పుడు కొయ్య బొమ్మలకు రంగు లంటునట్లు ఇవి బట్టల కద్దుకొనును. రంగులను బట్టల కంటు కొనునట్లుచేయు జిగురులకు బంధనములని (fixingagents) పేరు. పూత రంగులతో వాడుకచేయు బంధన పదార్థము అల్బుమిను. ఇందుకు కోడిగుడ్ల సొనయైనను రక్తములో నుంచి తీసిన అల్బుమినైనను వాడవచ్చును. పూతరంగులతో నద్దిన బట్టలు సబ్బులో నుతికినప్పుడు గాని యెండవేసినప్పుడు గాని వెలిసిపోవు.

ఈ పద్ధతిలో ముఖ్యముగా వాడెడి రంగులు:-క్రోమ్ పసుపు (chrome yellow); క్రోమ్ ఆరెంజి (chrome orange); క్రోమ్ పచ్చ (Chrome green); అల్ట్రా మెరీన్ (ultra marine) (నీలము); దీపపు కొడి; జేగురు మన్ను; తుత్తనాగ భస్మము (Zinc oxide) (తెలుపు); ఇంగిలీకము మొదలగునవి. ఇవియన్నియు నొకేరీతిని అద్దఁబడును. ఒకదానితో మరియొకటి గలిపి వేర్వేరు ఛాయలు తెప్పించవచ్చును. లేచాయలకు అల్బుమిను కొంచెముగను, ముదురు చాయలకు నెక్కువగను వాడవలెను. రంగుల నెంత మెత్తఁగ పొడిచేసిన నంత దీప్తివంతము లగును. అద్దుటకుఁగూడ ననుకూలముగా నుండును. రంగులు మిక్కిలి మెత్తగ నుండనియెడల నద్దకములో ముద్దలుపడి హెచ్చు తగ్గులుగ నంటుకొనును. రంగుపొడిని అల్బుమిను నీటితో చిక్కఁగఁ గలిపి తరువాత గంజితోగాని యితర జిగుర్లతోగాని పలుచన చేసెదరు. ఈ క్రింది యోగములవలన నీ పూతరంగుల వాడెడి పద్ధతి తెలియును.

ముదురు పచ్చ:—

రంగు........8 పౌనులు

అల్బుమిను......1 గ్యాలను (5 పౌనుల అల్బుమను గ్యాలను నీటిలోఁ గలప వలెను)

ఈ రెంటిని చక్కఁగఁ గలిపి వడబోసి యద్దవలెను.

నీలము (Dark ultramarine blue):—

24 పౌనులు (మణుము) అల్టా)మెరీను రంగును దీసికొని మెత్తగ పొడి జేసి

| | | |
|---|---|---|
| $4\frac{1}{2}$ | గ్యాలనుల | అల్బుమిను నీటితోను |
| $2\frac{1}{2}$ | ,, | (డాగను జిగురు నీటితోను |
| $\frac{1}{32}$ | ,, | అమ్మోనియాతోను |
| $\frac{1}{16}$ | ,, | గ్లిసరీనుతోను |
| $\frac{1}{32}$ | ,, | కర్పూరతైలముతోను |
| $\frac{1}{16}$ | ,, | పత్తిగింజలనూనెతోను |

చక్కఁగఁ గలిపి మొత్తము 8 గ్యాలను లగు వరకును నీరుపోసి కలియ పెట్టవలెను. అప్పటికి రంగు పక్వమునకువచ్చి యద్దుటకు సిద్ధముగ నుండును. అద్దిన తరువాత బట్టలకు ఆవిరియైన పట్టెదరు, లేదా సలసలకాగెడి సున్నపునీటిలో స్నానముంచెదరు. ఇట్లుచేయుటవలన అల్బుమిను గడ్డకట్టి బట్టలకంటుకొనును. దానితోఁబాటు రంగులును బట్టల నంటియుండును. కాని యీ రంగులు వేయుటకు రెండాక్షేపణలు గలవు. పూతరంగులు వేయుటవలబట్టలుబిరుసెక్కును. ఇంతియగాక యివి పక్కారంగులైనను బట్ట లకు రాపిడితగిలినప్పుడు రంగులు కొంతవరకు రాలిపోవును. ఈ కారణములను బట్టి యిప్పు డీరంగులు సామాన్యముగ నాటకపు తెరల కును కిటికీలకునుఅడ్డముగట్టుట కుపయోగించు గుడ్డలకును వేయుచున్నారు. దుస్తుల కుపయో గించెడి వస్తువుల కరుదుగవాడెదరు.

ఇతరములగు పూతరంగులు:— పైనిఖనిజ సంబంధములగు రంగులనద్దుటవర్ణింపఁబడినవి. మూలికల సంబంధములగు రంగులను గూడ కొన్నిటిని ఖనిజ సంబంధములగు రంగులవలె నద్దవచ్చును. ఇందు స్వాభావికపు రంగులును కల్పితపు రంగులును గలవు. ఇంతియగాక వీనిలో కొన్ని నిరుపాధికపు రంగులు. మరి కొన్ని సోపాధికపు రంగులు. ఇవిగాక మరి కొన్ని యితరజాతులలోఁ జేరిన కల్పితపు రంగులుగూడ కలవు. ఇవి యన్నియు పైని వర్ణించిన పూతరంగుల పద్ధతి ననుసరించియే యద్దఁబడును. వీనిలో కొన్నిటి నిచ్చటఁ దెలి పెదము.

నిరుపాధికపు రంగులపద్ధతి (Direct dyeing colours):—ఈ రంగులలో కొన్ని సాదా యద్దకమను భాగములోఁ జేర్కొనఁబడినవి. నూలునకును ఈ రంగులకును ఒక విధమైన యనురాగము గలదు. అందుచేత నివి యుపా ధులు లేకయే బట్టలకంటును. అయినను నివి మిక్కిలి పక్కారంగులనిపించుకొనవు. అందు చేతప్రస్తుతమివి యద్దకమైనబట్టలకు మెరుగుఁ బెట్టుటకు మాత్ర ముపయోగించెదరు. ఈ రంగులతో గులాబి, మబ్బు, నీలము, పసుపు రంగులుమాత్రము వేయవచ్చును. ఈరంగుల నద్దునప్పుడు జిగుర్లనుమాత్రమేకాక కొంచెము క్షార స్వభావముగల లవణములను (alkaline salts) గూడఁగలిపెదరు. ఈ రంగుల నన్నిటి నీక్రిందఁజెప్పినపాళ్లు దీసికొని యద్దవచ్చును:-

| | |
|---|---|
| $\frac{1}{4}$ పౌనురంగు | $\frac{1}{4}$ పౌను "సోడాఫాస్ఫేటు" |
| $\frac{1}{4}$ గ్యాలననీరు | $\frac{1}{8}$ పౌను "సోడాసల్ఫేటు" |
| $\frac{3}{4}$ గ్యాలను గంజి | |

వీనిని గలిపి యద్దిన తరువాత బట్టల కావిరిపట్టి

గోరువెచ్చని సబ్బునీటిలో నుతికి యెండవేయుదురు.

సోపాధికపు రంగులపద్ధతి (Mordant dye-stuffs):- ఇందు "అలిజరీన్" తరగతి రంగులు ముఖ్యమైనవి. మంజిష్ఠ లేక మదారు చెక్క దీనికి సరియైనమూలిక. దీనిసారమునకును "అలిజరీనుఎరుపు"నకును(alizarine red) భేదమేమియులేదు. వివిధములగు ఉపాధుల తో అలిజరీనుఁ గలిపి యద్దిన యెడల వేర్వేరు చాయలు వేయవచ్చును. పటికతో నెరుపు రోజారంగులును, అన్నభేదితో ముదురెరుపును, ఈ రెంటియొక్క మిశ్రణముతోఁ గలిపినప్పుడు జేగురు కపిలవర్ణములను వేయవచ్చును. ఈతరగతిలోఁ జేరినపతంగిచెక్క, కాచు, లాగువుడ్డు, బ్రేజిలువుడ్డులోనగునవి కలంకారీ యద్దకమునం దుపయోగింతురు. ఈ రంగులన్నిటిలో నెరుపువేయుట కష్టము. అద్దకము పూర్తియైన తరువాత మెరుగుఁ బెట్టుటకు కొన్ని యితర పదార్థములుగలిపెదరు. ఇందు ముఖ్యములయినవి నూనె, చింతపండు మరి కొన్ని లవణములు. పటికయు, అన్నభేదియు నీరంగుల కుపాధులుగ వాడెదరని పైనిఁవ్రాసితిమి. ఇవి గంధకద్రావక సంబంధములగు లవణములు. వీనికంటె వినీగరు సంబంధములగు "ఆసిటేట్లు" శ్రేష్ఠములయినవి. వీనితో నద్దిన తరువాత నావిరిపట్టినప్పుడు వినీగరు బట్టలనుండి శీఘ్రముగ విడిపోయి రంగులనాకర్షించెడు భస్మములు (oxides) మాత్రము నిలుచును. ఈ రంగులనద్దెడి పద్ధతులలో మచ్చుకొరకై యొకటి రెండిందుచూపెదము. ఈదిగువనిచ్చిన పాళ్లుస్థిరములుగావు. అద్దకులు తమతమ యిష్టానుసారముగమార్చుచుందురు:

అలిజరీన్ ఎరుపు (ముదురు చాయ — (purple):—

$9\frac{1}{8}$ గ్యాలనులు గంజి,
$\frac{1}{8}$ ,, అలిజరీను
$\frac{1}{2}$ ,, వినీగరు
$\frac{1}{8}$ ,, కాల్సియమ్ ఆసిటేటు
$\frac{1}{8}$ ,, ఐరన్ ఆసిటేటు

అలిజరీను నీలము (alizarine blue) :—

1 పౌను అలిజరీను బ్లూపొడి
1 గ్యాలను నీరు
$3\frac{1}{2}$ ,, చిక్కని గంజి
$1\frac{1}{2}$ ,, క్రోమియమ్ ఆసిటేటు

స్వాభావికపు రంగులలోఁ జేరిన "లాగువుడ్డు" (చెక్క) (log wood) తో నలుపద్దుటకు :—

లాగువుడ్డు నలుపు (log wood black) :—

15 పౌనుల గంజి
10 ,, సీమ జిగురు
$4\frac{1}{2}$ గ్యాలనులు నీరు
$\frac{3}{4}$ గ్యాలను వినీగరు
$1\frac{1}{2}$ ,, లాగువుడ్డుసారము
$\frac{3}{8}$ ,, క్వెర్సిట్రన్ సారము (Quercitran extract)
వీనిని చక్కఁగా కాచి చల్లారిన తరువాత
$\frac{1}{2}$ పౌను ప్రషియేటు ఆఫ్ పొటాసియము(Red prussiate of potash)
$\frac{1}{4}$ గ్యాలను నీరు
2 ,, క్రోమియమ్ ఆసిటేటు కాఁగినసీరు
$\frac{1}{8}$ పౌను పొటాషియమ్ క్లోరేటును



యూరోప్ దేశమందలి పూర్వకాలపు కలంకారి అద్దకము

గలిపి యద్దెదరు. అద్దకము ముగిసిన తరువాత బట్టల నెండవేసి గంటసేపు ఆవిరిఁబట్టి నీటిలో జాడించెదరు. పొక్కానల్లు పేర్పడును.

అనిలీను క్షారపురంగులు (Basic aniline dyes) :- ఈ రంగులన్నియు కరక్కాయ నీటితో నద్దెదరు. వీనితో నీలము, ఊదా, పసుపు, పచ్చ మున్నగు చాయలు వేయవచ్చును. ఇవి సబ్బులో నుడక వేయునప్పుడు వెలియక పోయినను ఎండసోకినప్పుడు కొంతవఱకు వెలవెలపోవును. రంగును గంజితోఁ గలిపి కరక్కాయ కషాయముతోఁ గలియఁబెట్టి యద్దెదరు. ఎక్కువ మొత్తము తయారు చేయునప్పుడీ మిశ్రణము నుడకఁబెట్టి పక్వము చేయుదురు.

మెథిలీన్ నీలము (Methylene blue) నద్దుటకు:-

2 గ్యాలనులు మెథిలీన్ నీలిరంగు (9 పాళ్లనీరు; 1పాలు రంగు కలిపి కొంచెము వినీగరు కలిపినది)
6 ,, చిక్కని గంజి
1 ,, డాగ్రను జిగురు నీరు
1 ,, గాఢమైన కరక్కాయ కషాయము.

తక్కిన క్షారపు రంగులన్నియు నీరీతినే పాళ్లు గలపఁబడును. అద్దిన తరువాత బట్టల కావిరిపట్టి "ఆంటిమొనిటార్ ప్రేటు" అను లవణము గలిపిన నీటిలో ముంచెదరు. ఇప్పుడు రంగు లెక్కువ పక్కాగానుండును.

నీలిమందుతో నద్దుట (Application of indigo): — కలంకారి యద్దకము నందు నీలిమందద్దుటకు రెండుమూఁడుపద్ధతులున్నవి. అందు గ్లూకోజు పద్ధతియు, హైడ్రోసల్ఫైటు పద్ధతియు ముఖ్యములయినవి. ఈ పద్ధతులలో నీలిమందు మొట్టమొదట తెల్లగనుండి బట్టలుముంచి యారవేసిన తరువాత గాలి సోకినప్పుడు నలుపెక్కును.

౧ గ్లూకోజుపద్ధతి:- గ్లూకోజనఁగా నొకవిధమైన పంచదార. దీనికి బదులుగ మనదేశములో బెల్లము వాడెదరు. మూఁడుపాళ్లు గ్లూకోజును ఏడుపాళ్లు నీటిలో కరిగించి యానీటిలో బట్టనుముంచి యారవేయుదురు. ఆరిన బట్ట మీఁద రంగుల నీ క్రిందఁజెప్పిన పాళ్లు గలిపి యద్దెదరు.

7½ గ్యాలనులు సోడా క్షారము గలిపిన జిగురు
1 ,, సోడా క్షారము
1½ ,, నీలిమందు(1పాలుమందు; 4 పాళ్లనీరు)

ఇట్లద్దిన తరువాత బట్ట కావిరిపట్టి నీడను ఒకటి రెండురోజు లారనిచ్చి చల్లనీటిలో జాడించిన తరువాత సబ్బుపెట్టి మెరుగుఁబెట్టెదరు. ఎఱ్ఱ చీరమీఁద నల్లంచులు, నల్ల చుక్కలుగల బట్ట లీ విధముగనే తయారగును. తెల్ల బట్టకు బదులుగ నెఱ్ఱబట్టమీఁద పైనిఁజెప్పిన విధముగ నీలి యద్దెదరు. నీలిమందుతోఁ గలిపిన సోడా క్షారము ఎరుపురంగును తినివేయునుగాన అట్టిచోట్ల నీలి చుక్కలుండి బట్టయంతయు నెఱ్ఱగ నుండును.

౨ హైడ్రోసల్ఫైటుపద్ధతి (Hydrosulphite process):- ఇది గ్లూకోజు పద్ధతికంటె

త్వరితముగ జరుగును. ముడి బట్టలనే యద్దవచ్చును. అందుచేత విశేషముగా వాడుకలోనున్నది. రంగు నీ విధముగ తయారు చేయవలెను:—

౨౦ పౌన్లు హైడ్రో సల్ఫైటు ౧౫ పౌన్లు సోడాక్షారముతోఁ గలిపి నూరవలెను. తరువాత ౧౫ పౌన్లు నీలిమందు ౨౦ పౌన్లు సోడా క్షారముతోఁ గలిపి ప్రత్యేకముగ నూరవలెను. దీనిలో కొంచెము తుమ్మజిగురు గూడ వేసి నూరెదరు. ౧౫ పౌన్లు నీమ జిగురును, ౨౫ పౌన్లు సోడాక్షారమును గలిపి వేరుగ నూరెదరు. ఈ మూటిని గలిపి యద్దెదరు. అద్దిన తరువాత బట్టల నావిరిఁబట్టి చల్లనీటిలో జాడించి తరువాత వేడి నీటిలోగాని సబ్బులోగాని యుదికి యార వేయుదురు.

ఆజోరంగులు (Azo-colours):— ఇవి దోహదపు రంగులలోఁ జేరినవి. అనఁగా రెండుమూఁడు పదార్థములు గలిపి యద్దిన తరువాత బట్టలమీఁదనే రంగు లేర్పడునుగాని వేర్వేఱుగ నీ పదార్థములు రంగులుగావు. ఈ రంగు లేర్పడుటకు రెండు తరగతుల పదార్థములుకావలెను. నాప్థలీను (కల్లరాయుండలనియమ్మఁబడునవి) సంబంధ ద్రవ్యములును, "డైయాజో" (Diazo-bodies) అనుమరియొక పదార్థసంబంధములగు ద్రవ్యములును గలిసి ఆజోరంగులగును. ఈ రంగులతో నెరుపు, రోజా, నారింజ, కపిల, జేగురు, నీలి, నలుపు మున్నగు పక్కారంగులు వేయుదురు. మల్లులను సోడాక్షారములోఁ గలిపి నప్తాలు (B-Nappthol) లో ముంచియెండిన తరువాత డైయాజో రంగుతో నద్దెదరు. వేడిసోకినప్పుడీ రంగులు చెడిపోవున్నగాన చుట్టు మంచు గడ్డవేసి చల్లగ నుంచెదరు.

గంధకపు రంగులు (Sulphur dyes):— ఇవియు పూతరంగులవలె బట్టల కుశోధులు లేకయే పట్టును. వీనిలో ననేక తరగతులు గలవు. కాని యద్దెడు పద్ధతులలో భేదము లేదు. వీనితో పసుపు, కపిల, ఊదా, నీలి, నలుపు, గోధుమ లోనగు రంగులు వేయవచ్చును. ఈ రంగులలో గంధక ముండుట చేత నీపేరు గలిగినది. ఈ రంగుల కన్నిటికి నీ క్రింది యోగము వర్తించును.

3 పౌన్లు రంగుపొడి
5 ,, గ్లిసరీను
8 ,, నీరు
10 ,, నామగుడ్డ (సగముగుడ్డ సగమునీరు గలిపినది)
4 ,, హైడ్రో సల్ఫైటు
70 ,, సోడాక్షారముతోఁ గలిపిన నీమ జిగురు

వీనిని గలిపి మల్లులమీఁద నద్దవచ్చును. అద్దిన తరువాత నావిరిబట్టి సబ్బు నీటిలో జాడించి యెండవేయుదురు.

అనిలీను నలుపు (Aniline black):— ఈ రంగుతో సాదా యద్దకము వేయు పద్ధతి యిదివరలోఁ జెప్పఁబడినది. ఇది పక్కారంగు. ఉపాధికముగ నిరుపాధికముగను గూడ వాడవచ్చును. దీనినికూడ దోహదపు రంగని చెప్పవచ్చును. అనిలీనను ద్రవపదార్థము ప్రాణవాయువుతో సంయోగముఁ జెందియీ నలు పేర్పడుచున్నది. "సోడియము

క్లోరేటు'' అను పదార్థముతోఁ గలుపుట వలన దానికి ప్రాణవాయువు లభించును. ఈ రంగును వేయుమార్గము:—

10. (పౌనులు) గంజి, 2 సీసా జిగురు, 6 పొటాసియమ్ ఫెర్రోసైనైడ్, 7 గ్యాలనులు నీరును గలిపి సలసలకాచి. $2\frac{3}{4}$ పౌనులు సోడియమ్ క్లోరేటు పొడిఁ గలపవలెను. చల్లారిన తరువాత $8\frac{1}{4}$ పౌనుల అనిలీను రంగును గలిపి యద్దెదరు.

అద్దుట పూర్తియైన పిదప నావిరిఁబట్టి కొంచెము పొటాసియమ్ బైక్రోమేటు గలిపిన నీటిలో ముంచి తరువాత సబ్బుతో జాడించి యెండ వేయుదురు. ఇది నలుపు వేయుటకేగాక మెరుపుమీఁదనట్లు ధూపు చాయ వేయుటకుఁగూడ నుపయోగింతురు.

(2) ఉపాధుల పద్ధతి (Printing of mordants):—పూతరంగుల నద్దుటయు, సోపాధిక రంగులైనచో రంగుల నుపాధులతోఁగలిపి యద్దుటయు నిదివరలో వర్ణింపఁబడినవి. ఉపాధులను మాత్ర మద్ది, తరువాత బట్టల సాదా యద్దకము నందువలె నద్దుటగూడ కలదు. ఇట్లద్దినప్పు డుపాధులున్నచోట్ల మాత్రము రంగులంటి తక్కిన బట్టయంతయు తెల్లగ నుండును. ఇది రెండవ పద్ధతి. మిక్కిలి పురాతనమైనది. విశేషముగ వాడుకలో నున్నది. ఈ పద్ధతివలన నద్దెడి రంగులన్నియు సోపాధికపు రంగు లేయని వేఱుగఁ జెప్ప నక్కరలేదు. ఈ పద్ధతి రెండు విధములుగ విభజింపవచ్చును.

మంజిష్ఠ పద్ధతి (Madder style):— ఈ పద్ధతి ప్రకారము ముద్దాగు పట్టుగాని తివ్వల్యముగను అలిజరీను ఎగువబడు విద్యతోను రంగుగాని యద్దుదురు. ప్రయోగ్య యుపయోగింపదగు యుపాధులు రెండు — సిలికా, అన్న భేది. ఈ రెండును రంగు ద్రావక సంబంధములగు లవణములు. సిలికాను నీసిగిను సంబంధములగు లవణములు లక్కాను బాగుగ పనిచేయుననియు అందుచేత సిలికా, అన్న భేదిక బదులుగ అల్యూమినియము అసిటేటు, ఐరను అసిటేటులను ఉపాధులుగ నుపయోగింపవలెననియు నిదివరలో వ్రాసి యుంటిమి. అల్యూమినమునకు యుపాధితో నెరుపు రంగులును, ఇనుపరాయితో నలుపును వేయవచ్చును. ఈ రెంటి మిశ్రణములను వాడినచో నెరుపునకును, నలుపునకును మధ్యనున్న ఛాయలన్నియు సులభముగ చేయవచ్చును. ఈ రెండుపాధులకును అద్దకులలో సాంకేతిక నామములు గలవు. అల్యూమినియమ్ అసిటేటుతో నెరుపురంగు వేయుదురుగాన దానిని "ఎఱుపుసార" (Red liquor) మనియు ఐరను అసిటేటులో నలుపు రంగు వేయుదురుగాన దానిని "నలుపుసార" (Black liquor) మనియు పిలిచెదరు. కావున నికమీఁద ఈసాంకేతిక పదములను వాడినప్పుడా యా యుపాధులని గ్రహించవలెను. ఈయుపాధులను జిగురులతోఁ గలిపి యద్ది తరువాత రంగుకషాయములో ముంచెదరు.

ఉపాధుల నద్దుట మిక్కిలి కష్టము. అనుభవజ్ఞులుగాని చాకచక్యముతో నద్దఁజాలరు. చక్కఁగా నద్దినగాని రంగులు ముద్దలుకట్టక హెచ్చుతగ్గులు లేకుండ పడవు. అందుచేత నుపాధుల నద్దుటలో నద్దకు లొకటి రెండు విషయములలో నెక్కుడు జాగ్రత్తతో పని చేయుదురు. ఉపాధులనద్దిన తరువాత బట్టలను నీడన ఆలస్యముగ నారనీయవలెను. అట్లుగానిచో నుపాధులెక్కువగ నెండి రంగుల స్థిరముగ నంటునుగాని సాఫుగా నంటవు. రంగు కషాయము పలుచనగనుండవలెఁగాని యెక్కువ చిక్కఁగనుండఁగూడదు. అద్దినబట్టలను రంగులోముంచినప్పుడా కషాయ మెక్కువ వేడిగానుండక నులి వెచ్చనగనుండవలెను. ఈ విషయము లుపేక్షించినచో బట్టలయందు తెల్లఁగనుండవలసిన చోట్లఁగూడ రంగులంటి తరువాతఁదెలుపుఁ జేయుట దుర్లభమగును. "నలుపుసారము" తో నద్దినప్పుడు రంగులు శీఘ్రముగ నంటును. రంగులయొక్క యుధృతమును తగ్గించుటకై నలుపు సారముతో కొంచెము "ఉల్లిపాషాణము" (White arsenic) కలిపి మరగఁబెట్టెదరు. అద్దినతరువాత రంగు వేయుటకుఁ బూర్వము బట్టల నొక చల్లనిగదిలో రెండుమూఁడు రోజులారనిచ్చెదరు. ఇట్లు చేయుటవలన నుపాధులయందుండు విసిగరు ఇగిరిపోయి రంగులంటుటకు సిద్ధముగనుండును.

నలుపు సారమును ఎరుపు సారమును గలిపినమిశ్రణములతో నద్ది యనేకఛాయలు వేయవచ్చునని పైని వ్రాయఁబడినది. ఈక్రిందఁ జూపిన పట్టికలోఁ, దెలిపినవిధమున ఎరుపు నలుపు సారములపాళ్లు దీసికొని యద్దిన యెడల నేకకాలమున ఒకేరంగుతో ఆఱు వేర్వేఱు ఛాయలను బట్టపై నుత్పత్తి చేయవచ్చును.

| వస్తువులు | ఎరుపు | రోజా | జేగురు తొగరు | ముదు రెరుపు | ఊదా | నలుపు |
|---|---|---|---|---|---|---|
| ఎరుపు సారము | ౨ గ్యాలను | 3 గ్యాలనులు | ౧౦౪ గ్యాలనులు | | | |
| నలుపు సారము | | ... | ౧౪ ,, | ౧ గ్యాలను | ౪ గ్యాలను | ౨ గ్యాలనులు |
| నీరు | ... | ౨ గ్యాలనులు | ... | ౧౧ ,, | ౧౧౪ ,, | ౮ ,, |
| సీమజిగురు | ... | ౩౬ పౌనులు | ... | | ౩౬ పౌనులు | |
| వినీగరు | ... | ౧ గ్యాలను | ... | | ... | |
| తగరపు లవణము (Tin crystals) | ౧౪ పౌను | ౫ పౌను | ... | | ... | |
| పత్తిగింజలనూనె | ౧ గ్యాలను | ... | ౧ గ్యాలను | ౫ గ్యాలను | ... | ౧ గ్యాలను |
| గంజి | ౧౬ పౌనులు | ... | ౧౬ పౌనులు | ౧౬ పౌనులు | ... | ౧౬ పౌనులు |

ఈ పట్టికలోఁజూపిన యుపాధులు రెండే యైనను (ఎరుపు సారము, నలుపుసారము) రంగునుబట్టి పాళ్లు మారినవి. అందుచేత్త నివి యాఱు ఉపాధులుగనే భావింపనగును. పై పట్టికలో చుక్కలు పొడిచినచోట్ల నేమియు లేదని గ్రహించునది. అనఁగా ఆ యా రంగుల కాయా వస్తువు లక్కఱ లేదని తెలియనగును.

ఈపట్టికను పరీక్షించి చూచినయెడల కొన్ని చాయలకు నలుపుసార మక్కర లేదనియు, కొన్నిటికి నెఱ్ఱుపుసార మక్కర లేదనియు, మరికొన్నిటికి రెండునుగావలెననియుఁ దేలును. ఒక్క పర్యాయ మన్నిరంగులు, ఎట్లుపట్టు నని సంశయము దోపవచ్చును ఒకే గుడ్డ మీఁద నాలు ఉపాధు లున్నట్లుభావించునది. అద్దినతరువాత నొక దానితో నొకటి సంబంధములేకయుండును. ఇట్టి బట్ట రంగునీటిలో ముంచినప్పుడు ఉపాధియొక్క స్థితినిబట్టి రంగుల చాయలేర్పడును. ఈ యుపాధుల నద్దుటకు వేర్వేఱు తిరుగుడు యంత్రము లుండును. ఈ యంత్రముయొక్క నిర్మాణమును గూర్చియు,కార్యవిధానమును గూర్చియు నిదివరలో వ్రాసియుంటిమి. ఆఱు వేర్వేఱు ఉపాధుల నద్దుట కిట్టి యంత్రము లాఱు దేనికది ప్రత్యేకముగనుండి యన్నియుఁ గలిసి యొక పెద్ద చట్రమున బంధింపఁబడియుండును. ఈయంత్ర సహాయమున ఆఱుపాధులును ఒకేపర్యాయ మద్దకమగును.

పై పట్టికలోఁ జూపిన యుపాధులను మల్లుల పై నద్ది రెండుమూఁడు రోజులారనిచ్చి యావు పేడలో నూరవేసెదరు. ఊరినబట్టల కద్దకము వేసి నీటిలో జాడించి, సబ్బుతో నుదికి తిరిగి మంచినీటిలో జాడించెదరు. బట్టలకు మెరుఁగుఁ బెట్టుటకుఁ బూర్వము కొంచెము చలువసున్నముఁగలిపిన నీటిలోముంచెదరు. ఇట్లుచేయుట వలన ఉపాధులద్దని చోట్ల నంటిన రంగులు విడిపోవును.

ఉపాధుల నద్ది యూరవేసిన తరువాత రంగులు వేయుటకుఁబూర్వము బట్టలను సీమసున్నము, ఆవుపేడయును గలిపిన నీటిలో నొకటి రెండు గంటలసేపు నానిచ్చెదరు. ఇట్లు చేయుటవలన నుపాధులతోఁ గలిపినఁజిగుళ్లు విడిపోయి యుపాధులు మాత్రము నిలిచియుండును. ఈస్థితిలో బట్టలు రంగులను జక్కఁగ నాకర్షించును. పేడనీటిని తొట్లలోఁగలిపి బట్టలనందులో నెడతెగక త్రిప్పుచుందురు. సామాన్యముగ బట్టలను రెండు పర్యాయములు పేడలోనుడికించెదరు. మొదటిపర్యాయమున ఈ క్రిందనిచ్చిన భాగములను దీసికొనవలెను:—

10 గ్యాలనుల నీరు
1 పౌను సీమసున్నము
5 పౌనులు ఆవుపేడ

రెండవపర్యాయ ముడకవేయునప్పుడు,

10 గ్యాలనుల నీరు
½ పౌను సీమసున్నము
2½ పౌనులు ఆవుపేడయును

దీసికొని చక్కఁగఁగలిపి నిమ్మళముగ నుడకవేయవలెను. పేడలో నుడక వేసిన బట్టలను మంచినీటిలో జాడించి తరువాత నెర్రరంగు వేయుదురు. రంగువేయుట కుపయోగించెడి తొట్లు సాదాయద్దకమునందు వర్ణింపఁబడినవి. ఈ తొట్లపై కొయ్యల నడ్డముగ వేసి బట్టలను వానికి వ్రేలాడవేయుదురు. అప్పుడు

బట్టలో చాలభాగము రంగులోను కొంత భాగము రంగు వెలుపలను ఉండును. కొయ్యలను తరుచుగ త్రిప్పుటవలన బట్టలను పూర్తిగ రంగులో మునుగులాగు చేయవచ్చును. రంగు, సీమసున్నము, సర్వీసు (Glue) గలిపిన కషాయము, రంగు తొట్టిలో నుండును. వీనిపాళ్లు రంగువేయుటకుఁ గావలసిన బట్టయొక్క విస్తీర్ణమునుబట్టి యుండును. బట్టలో సగముభాగము రంగువేయవలసివచ్చినప్పుడు డీ క్రింది భాగములను దీసికొందురు.

$4\frac{1}{2}$ తులములు రంగు

$1\frac{1}{2}$ తులములు కాల్సియమ్ ఆసిటేటు

10 తులములు సర్వీసును

నూరుతులముల యెత్తుగల బట్టనద్దుటకుతగినంతనీటిలోఁ గలిపి బట్టల నందులో ముంచి క్రమక్రమముగ నుడకబెట్టెదరు.

ఇట్లు రంగు వేయుటకు రమారమి రెండు గంటలు పట్టును. రంగు వేసిన తరువాత బట్టలను సబ్బులోనుదికి యెండ వేయుదురు.

ఇతరయుపాధులతో నద్దుట:—

మంజిష్టపద్ధతిలో వాడఁబడెడి యుపాధుల రెంటినిగూర్చి పైని వ్రాయఁబడినది. ఇదిగాక ఈపద్ధతి ప్రకారము రంగులద్దుటకు మరి కొన్నియుపాధులు గలవు.వీనిలో కరక్కాయ నీరు, క్రోమియమ్ అనుధాతు సంబంధములగు నుపాధుల్ను, నాఫ్థాల్ అనునవిముఖ్యములయినవి. కరక్కాయల సారముతోనద్దుటకు

5 పౌనులు కరక్కాయలసారము

1 గ్యాలను వినీగరు

9 గ్యాలనులు గంజియ్ను, డ్రాగనుజిగురును

గలిపిన పాకమును, జక్కుఁగఁ గలిపి యద్దిన తరువాత బట్టల నెండవేయుదురు. ఉపాధులను బట్టలకు బాగుగ బంధించుటకై.

1 పౌనుటార్టార్ ఎమెటిక్ (Tartar emetic- సౌవీరమును, పొటాసు క్షారమును, చింతపండుపులుసును, గలిపి తయారు చేసిన లవణము.

$\frac{1}{2}$ పౌను సీమసున్నము

8 గ్యాలనులు నీరును

గలిపి బట్టలను దానిలో ముంచెదరు. ఎండినతరువాత నీబట్టలకు అనిలీను క్షారపురంగుల వేనినైనను అద్దవచ్చును. క్రోమియము సంబంధములగు నుపాధులలో క్రోమియమ్ క్రోమేటును (Chromium chromate) క్రోమియమ్ ఆసిటేటును(Chromium acetate) ముఖ్యములు. వీనిని గంజితో గాని తుమ్మ బంకతో గాని గలిపి యద్దిన తరవాత సోడాపొడి నీటిలో బట్టలనుముంచెదరు. ఇట్లు చేయుటవలన నుపాధి బట్టలకు బంధింపఁబడును. క్రోమియమ్ ఆసిటేటుతోనద్దిన బట్టలను సోడా నీటిలో నుడకవేయుటకుఁ బూర్వము ఆవిరిఁ బట్టుదురు. ఈయుపాధులతో సోపాధికపు రంగులన్నియు నద్దవచ్చును. రంగులలో నుడకవేయుటయందు పైనిఁజెప్పిన మంజిష్టపద్ధతికిని దీనికిని భేదములేదు.

బందరులో నుపయోగించు అచ్చుపుష్పములు



5-వ పటము



6-వ పటము

### 3 వివర్ణపద్ధతి (Discharge style):—

ఇదివరలో రెండుపద్ధతులు వర్ణింపఁబడినవి. అందు రెండవదానిని నుపాధిపద్ధతికి సరియైన వ్యతిరిక్తమని వివర్ణపద్ధతిని చెప్పవచ్చును. ఉపాధిపద్ధతిలో తెల్లబట్ట మీఁద రంగుబొమ్మలుండును. వివర్ణపద్ధతిలో రంగుబట్ట మీఁద తెల్లబొమ్మలువచ్చును. ఉపాధిపద్ధతిలో రంగు లుండవలసినచోట్ల నుపాధుల నద్ది రంగుకషాయములో బట్టనుముంచుటవలన నాయాచోట్ల రంగులంటును. వివర్ణపద్ధతి ప్రకారము బట్టకుమొందుగ సాదాయద్ద కము వేసి తెల్లబొమ్మలు రావలసినచోట్ల "వివర్ణకర ములు" (Discharges) అనఁగా రంగులను పోఁగొట్టెడి పదార్థములను అద్దెదరు. ఇట్లు చేయుటవలన వివర్ణకరముల నద్దినచోట్ల రంగులు విడిపోయి రంగు బట్టమీఁద తెల్లనిబొమ్మ లేర్పడును. లేదా మరియొక రీతిని నిదే ఫలమును బొందవచ్చును. సాదాయద్ద కమునకుముందు బట్టను ఉపాధినీటిలోముంచి యెండిన తరువాత నుపాధి నిర్మూలనములను (వివర్ణకరములను—ఉపాధుల గుణమును నశింపఁజేయునవి) బట్టపై నద్దెదరు. అప్పుడట్టిబట్టను రంగు కషాయములో ముంచిన యెడల నుపాధి నిర్మూలముల నద్దినచోట్లు తెల్లఁగ నుండి తక్కినబట్టంతయు రంగుఁగలిగి యుండును. ఇప్పుడును గూడ రంగుబట్టమీఁద తెల్లబొమ్మ లేర్పడును.

ప్రస్తుతమునం దీపద్ధతి మిక్కిలి ప్రాముఖ్యముఁ జెంది యున్నది. ఈపద్ధతివలన బట్టలమీఁద నద్దిన రంగులనుగాని యుపాధులనుగాని కోరినచోట్ల నిర్మూ లము చేయుటకు వీలగుచున్నది. రంగు బట్టలమీఁద తెల్లబొమ్మలనుగాని వేఱురంగుఁగల బొమ్మలనుగాని యద్దుట సాధ్యమగుచున్నది. ఇంతియగాక యీపద్ధతి నద్దినరంగులు ఇతరమార్గముల వేసిన రంగులకంటె నెక్కువ కాంతిఁగలవిగ నగుపడును.

కోరినచోట్ల రంగులను గాని యుపాధులనుగాని పోఁగొట్టెడి పదార్థములకు "వివర్ణకరముల"ను పేరు పెట్టఁబడినది. ఇందు ముఖ్యములై తరుచుగ వాడుకలోనున్న వివర్ణకరముల నిచ్చట చెప్పెదము:- చింతపండు ద్రావకము (Tartaric acid), నిమ్మ పండు ద్రావకము (Citric acid - నిమ్మయుప్పు), ఆక్సాలిక్ ద్రావకము (Oxalic acid), సోడాక్షారము (Sodium hydroxide), పొటాసియమ్ డైక్రోమేటు (Potassium dichromate), సోడియమ్‌బైసల్ఫైటు (Sodium bisulphite), టిన్ క్లోరైడు (Stannous chloride), తుత్తినాగపు పొడి (Zinc dust) రంగులయొక్కయు ఉపాధులయొక్కయు తత్త్వము లనుబట్టి తన్నిర్మూలమునకై వాడెడి వివర్ణకరము గూడ మారుచుండును. ఇచ్చట కొన్ని యుపాధులను రంగులును వానినిపోఁగొట్టుటకు వాడెడి వివర్ణకర ములను చెప్పఁబడును.

పటిక ; అన్నభేది: - ఈ యుపాధులనుగాని యిదివరలోఁ జెప్పఁబడిన వీనిసంబంధములగు ఇపి టేట్లుగాని పోఁగొట్టుటకు నిమ్మఉప్పు చింతపండు వాడెదరు. బట్టల నుపాధులలో ముంచి యెండవేయు దురు. తరువాత నిమ్మయుప్పుగాని చింతపండు పులుసు గాని బంకమట్టితో చిక్కఁజేసి యారినబట్టపై నద్దెదరు. అద్దిన తరువాత బట్టకావిరిబట్టి యావుపేడ లో నుడకవేసిన పిదప యథాప్రకారముగ రంగు నీటి లో ముంచెదరు. ఈ ద్రావకములు (పులుసువస్తువులు) అద్దినచోట్ల యుపాధులు కరిగిపోయి రంగు వేసినప్పుడు తెల్లఁగ నిలిచియుండును. తక్కినచోట్ల రంగం టును. ఈ విధముగ రంగు గుడ్డపై తెల్లని బొమ్మ లేర్పడును. ఇందు పైనిజెప్పిన మంజిష్టపద్ధతి ప్రకా రము రంగు వేయఁబడును.

ఈరీతినే సా వీర సంబంధములగు నుపాధులను (Antimony mordants) పోఁగొట్టుటకు సోడాక్షార మును, క్రోమియము సంబంధములగు నుపాధులకు (Chromium mordants) నిమ్మపులుసుమగాని,సోడి యము క్లోరేటు, పొటాసియమ్ ఫెర్రోసైనైడులను (Sodium chlorate and yellow prussiate

of potash) గాని వాడవలెను. ఇవి యుపాధులను పోఁగొట్టి రంగులద్దెడి పద్ధతులు. సాదాయద్దకము వేసినతరువాత కోరినచోట్ల నిరంగుఁగావించుటయు వేఱురంగుల నద్దుటయుఁగూడ కలదు.

టర్కీ-యెఱుపుపై తెలుపద్దుట:-నిమ్మఉప్పును జిగుర్లతోఁగలిపి యెఱ్ఱబట్టపై నద్ది యెండిన తరువాత చలువసున్నపు నీటిలో (Bleaching powder) ముంచవలెను. అప్పుడు బట్టంతయు నెఱ్ఱఁగనుండి యద్దిన చోట్లుమాత్రమే తెల్లఁగనుండును. చలువసున్నము బట్టనంతయు చలువసేయునుగదా యెఱుపెట్లు నిలుచునని శంకగలుగవచ్చును. ద్రావక సంబంధములగు పులుపువస్తువులతోఁ గలిసినప్పుడే చలువసున్నము పనిచేయును, అందుచేత నిమ్మకాయపులుసు నద్దినచోట్లే తెల్లనగును. ఇందుకు పాళ్లు:—

6 పౌనులు నిమ్మపులుసు గాని చింతపండుపులుసుగాని
1 గ్యాలను నీరు
4 పౌనులు సీమజిగురు.

వీనిని గలిపి మరఁగఁబెట్టి యద్దవలెను. టర్కీ-యెఱుపుమీఁద పసుపద్దవచ్చును. ఇందుకు సీసపు సంబంధములగు లవణములను వివర్ణకరములతోఁగలిపి యద్దవలెను.

పసుపద్దుటకు:—

15 పౌనులు సీమ జిగురు
$1\frac{1}{2}$ గ్యాలనులు సీమ జిగురు పాకము (నీటితోఁ గలిపినది)
$2\frac{1}{2}$ గ్యాలనులు నీరు
20 పౌనులు చింతపండు పులుసు
12 పౌనులు లెడ్‌నైట్రేటు (సీస సంబంధమగు లవణము) వీనిని గలిపి, యద్ది, ఆరిన తరువాత బట్టను చలువసున్నపు నీటిలోముంచి యెండనిచ్చి చివరకు పొటాసియమ్ బైక్రోమేటు నీటిలో ముంచెదరు. అప్పుడు సీసము క్రోమేటుతో సంయోగించి "క్రోమ్ పసుపు" (Chrome yellow) ఏర్పడును, అనఁగా నెఱుపు బట్టమీఁద పసుపురంగద్దకమగును. ఇట్లే,వివిధ పదార్థముల నద్ది యెఱుపుమీఁద తెలుపు, నీలి, పసరు, పసుపు మున్నగు రంగు లొకేబట్టపై వివర్ణపద్ధతి మూలమునఁ దెప్పించవచ్చును.

నీలిమందుతో కలంకారీ యద్దకము చేయుట మనదేశములో ననాదిగ వాడుకలో నున్నది. నీలిమీఁద తెలుపద్దుటయు, తెలుపుమీఁద నీలినద్దుటయు ముఖ్యములయినవి. దీనికి విదేశీయులు "చీనానీలిపద్ధతి" (China blue style) యని పేరిడిరి. ఈపద్ధతిలో తెల్లబట్టలమీఁద చక్కని నీలిబొమ్మలద్దకమగును. ఇందుకు నీలిమందును అన్నభేదితోఁ గలిపి తెల్లబట్టపై నద్దుదురు. అద్దినబట్టను మొదట సున్నపుతేటలోను, తరువాత అన్నభేది నీటిలోను ముంచి యారవేయునప్పు డద్దినచోట్లకు నీలి రంగంటును. బాగుగ తేటగఁ గనఁబడుటకు నీలిమందుతో కొంచెము తాళకము (orpiment) గూడ కలిపెదరు.

ఎఱుపుమీఁదవలె నీలిమీఁదఁగూడ తెలుపునుగాని యితర వర్ణములగాని యద్దవచ్చును. ఇందుకు రెండు విధములు గలవు. మొదటిదానిలో 'సోడియమ్‌క్లోరేటు' (sodium chlorate) వివర్ణకరము. దీనిని పొటాసియమ్ ఫెర్రోసైనైడ్‌తోను నిమ్మపులుసుతోను గలిపి యద్ది తరువాత బట్టల కావిరిఁబట్టెదరు. రెండవపద్ధతిలో వివర్ణకరము పొటాసియమ్ క్రోమేటు (Potassium chromate). దీనిని సరియైన జిగుర్లతోఁగలిపి యద్దిన తరువాత బట్టలను గంధకద్రావకమును, ఆక్సాలిక్ ద్రావకమును గలిపిన వేడినీటిలో ముంచెదరు. కాని యీపద్ధతిలో గంధకద్రావకమువలన బట్టలకు సత్తువ తగ్గును. ఈ రెండుపద్ధతులవలన నీలి బట్టపై తెల్లబొమ్మలువచ్చును. వివర్ణములతో పూతరంగులను (Pigment colours) గలిపి యద్దినయెడల నీలిపై వేర్వేఱు రంగుల నద్దవచ్చును.

ఇట్లే గంధకపురంగులు, క్షారపురంగులు మున్నగు కల్పితపురంగుల నన్నిటిని వానికై యేర్పడిన వివర్ణకరములచేత విడఁగొట్టి రంగుబట్టలమీఁద తెలుపద్దకము వేయవచ్చును.

### 4. ఆవిరి పద్ధతి (Steam style): —

ఇది యొక నూతనపద్ధతి. ౧౭౮౦-వ సంవత్సరములో మొదట వాడుకలోనికి వచ్చెను. రంగులను గాని యుపాధులను గాని బట్టలకు బంధించుటకై యావిరి నుపయోగించినయెడల యావిరి పద్ధతి యనవచ్చును. ఈ పద్ధతి కుదాహరణములు పైని చాలవఱకుఁ జెప్పఁబడినవి. ఈ పద్ధతి ముఖ్యముగ సోపాధికపు రంగుల నద్దుట కుపయోగపడుచున్నది. రంగును, ఉపాధిని జిగురుతోఁగలిపి యద్దినమాత్రమున రంగు బట్టకంటదు. కాని యద్దిన బట్టను ఆరనిచ్చి తరువాత నావిరిఁ బట్టినయెడల రంగుపట్టును. ఆవిరి పట్టిన తరువాత నంటుటచే నిట్టి రంగులకు "ఆవిరిరంగులు" (Steam Colours) అను పేరుగూడ కలదు. అద్దకముయొక్క వేగము తగ్గించుటకు రంగులతో కొంచెము వినీగరును, కరక్కాయల సారమును గలిపెదరు. నూనెఁగలిపి యుడుక వేసిన బట్టపై రంగుల నద్ది తరువాత నావిరిఁ బట్టెదరు. రంగులు చక్కఁగ నంటిన తరువాత బట్టలను సబ్బుతో నుతికి యెండవేయుదురు.

ఆవిరి పట్టకమునుపే యంటెడునవి యావిరి రంగులనిపించుకొనవు. "ఆవిరి నీలము" (Steam blue) వేయుటకు నీలి మందవసరములేదు. పొటాసియమ్ ఫెర్రోసైనైడు, చింతపండు గుజ్జు, గంధక ద్రావకములను గంజితో పక్వముచేసి యద్దిన తరువాత బట్టలను గాలి కారనిచ్చి యరగంటసేపు ఆవిరిఁ బట్టిన నీలి రంగువచ్చును. ఇట్లే "ఆవిరి పసుపు" (Steam Yellow), "ఆవిరి పసరు" (Steam Green), "ఆవిరి యెరుపు" (Steam red) మున్నగు రంగులు గలవు. అనఁగా నీ రంగులు అద్దిన మాత్రముచేత బట్టల కంటక యావిరిఁబట్టి నప్పుడే యంటునని గ్రహించునది.

### 5. నిరోధ పద్ధతి (Resist or reserve style): —

ఇదియు నొక ముఖ్యమైన పద్ధతియె. ఉపాధుల నద్దినప్పుడు బట్టలు రంగుల నాకర్షించునట్లు మఱికొన్ని పదార్థముల నద్ది నప్పుడు బట్టలు రంగులను తమ దరిఁ జేరకుండఁ జేయును. బట్టలకు రంగు లంటకుండఁ జేయు సామర్థ్యముగల పదార్థములకు "నిరోధములు" (resists or reserves) అని పేరు. నిరోధములను బట్టపై నద్ది యా బట్టకు రంగు వేసినయెడల నా యద్దిన చోట్లకుఁ దప్ప తక్కిన ప్రదేశము లన్నిటికిని రంగంటును. రంగులను గాని రంగు వేయుటకు సాధనములైన యుపాధులను గాని బట్టల కంటకుండఁ జేయుటకే నిరోధముల నుపయోగింతురు. ఇదివరలో వ్రాయఁబడిన వివర్ణ పద్ధతియు, నిరోధ పద్ధతియు నొకటేయని మొదట తోపవచ్చును. కాని యీ రెంటికి కొంచెము భేదమున్నది. వివర్ణ పద్ధతిలో బట్టలకు వేసిన రంగులను అద్దకుని యిష్టప్రకారము చ్చుటచ్చుట విడిపోవునట్లు చేయును. నిరోధ పద్ధతిలో నద్దకుని యిష్టము వచ్చిన చోట్ల బట్టలకు రంగు లంటకుండఁ జేయును.

కొన్ని రంగుల నద్దుటకు మాత్రము నిరోధ పద్ధతి నవలంబింతురు; మంజిష్ఠ, అలి జరీను ఎరుపు, కొన్ని క్షారపు రంగులు, నీలిమందు, అజో రంగులు, గంధకపు రంగులు. అని లీనుసలుపురంగుల నద్దుటకు సామాన్యముగ నిరోధముల నుపయోగించెదరు.

నిరోధములు నాలుగు విధములు. ఇందు కొవ్వుసంబంధములగు పదార్థములతోఁ జేసిన నిరోధములు మొదటి తరగతిలోనివి. మైనము, కొవ్వు, గుగ్గిలము, తుమ్మజిగురు, కొబ్బెర నూనెలో నగు పదార్థము లింపులోఁ గలియును. ఇవి ముఖ్యముగ పట్టు, ఉన్ని లింపులోఁ గలియును. ఇవి ముఖ్యముగ పట్టు, ఉన్ని యద్దకములయం దుపయోగింతురుగాని నూలుబట్టల యద్దకమునందు తరుచుగ వాడరు. వీనిని "తైల నిరోధములు" (Fatty resists) అన వచ్చును.

నీలి మందద్దుట యందు మైలతుత్తమును గాని, రాగి చిలుము (Verdigris) ను గాని నిరోధములుగ వాడెదరు. వీనిని బంకమన్నుతోను, తుమ్మ జిగురు

తోను నూరి యద్దెదరు. ఇవి యద్దినచోట్ల నీలి రంగంటక బట్ట తెల్లఁగ నుండును. అందుచేత వీనిని "శ్వేత నిరోధములు" (White resists) అందురు.

సవర్ణనిరోధములు (Coloured resists) అనునవి మూఁడవ తరగతిలోనివి. వీని నద్దుటవలన నాయా ప్రదేశముల నీలి రంగంటక పోవుటయే కాక యితరరంగు లంటుకునట్లు చేయవచ్చును. ఈ రీతిని నీలిగుడ్డమీఁద క్రోము పసుపును, మందారపు రంగును అద్దవచ్చును. నిరోధములను మరియొక రీతిని వాడుట కూడ కలదు. ఎరుపు వేయుటకు వాడెడి యుపాధులను నీలి యద్దకమునం దుపయోగించెడి నిరోధములతోఁ గలిపి యద్దిమ్ముందుగ నీలితొట్టిలో ముంచెదరు. అప్పుడు నీలి బట్టమీఁద తెల్లబొమ్మ లేర్పడును. తరువాత నట్టి గుడ్డ కెరుపు వేసిన యెడల నీలిబట్టమీఁద నెరుపు బొమ్మ లద్దకమగును. ఈ పద్ధతివలన పక్కా రంగులు గూడ వేయుటకు వీలగుటచేత నిది విస్తారముగ వాడుకలో నున్నది. ఇందుపయోగించెడివి శ్వేత నిరోధములు.

పటికకు అన్నభేదికి నిరోధములు:—

ఈ యుపాధుల నంటకుండఁ జేయుటకు రెండుమూఁడు పదార్థములు గలవు. సామాన్యముగ పటికకు "సోడియమ్ సిట్రేటు" ను (Sodium citrate—సోడా క్షారమును నిమ్మయుప్పుతోఁ గలుపునప్పు డేర్పడు లవణము) అన్నభేదికి నిమ్మయుప్పును చింతపండుపులుసును (tartaric acid) గలిపిన మిశ్రణమును నిరోధములుగ వాడెదరు. మొట్టమొదట బట్టలను ఈ నిరోధములతో నద్ది యెండిన తరువాత నుపాధులతో నద్దెదరు. తరువాత బట్టల కావిరిబట్టి, పేడలో నుడక వేసి యుతికినతరువాత రంగు వేయుదురు. నిరోధము లద్దినచోట్లమాత్రము తెలుపుగనుండి తక్కినప్రదేశముల రంగంటును. ఈ పద్ధతివలన సాదారంగు బట్టమీఁద తెల్లబొమ్మలుగాని, రంగుబొమ్మలమధ్యను తెల్లబొమ్మలుగాని యద్దకుని యిష్టానుసారముగ తెప్పింపవచ్చును, బట్ట నంతయు నుపాధులలో ముంచుటకు బదులుగ బొమ్మలు చెక్కిన పలకలతో నద్దిన యెడల రంగులు వేసినప్పుడా బొమ్మలే యేర్పడును. ఇట్లు వేర్వేఱు నిరోధములను దీసికొని యొకేపర్యాయము ఎరుపు, నలుపు, ధూపు, తెలుపు రంగులను బట్టల కద్దవచ్చును.

అలిజెరీను ఎరుపు, రోజాలకు నిరోధములు:—

ఈ రంగులకు "క్రోమియమ్ సిటేటును గాని, లేక సోడియమ్ సిట్రేటుతో దీనిని గలిపి కాని నిరోధములుగ వాడెదరు. మొట్టమొదట బట్టను నూనెతో తయారుచేసి యీదిగువ నిచ్చిన పాళ్లతో నిరోధ మిశ్రణమును సిద్ధముచేసి యద్దెదరు:—

20 పౌనులు జిగటమట్టి
1 గ్యాలను సోడియమ్ సిట్రేటు గలిపిన నీరు
1 ,, క్రోమియమ్ సిట్రేటు గలిపిన నీరు
1 ,, నీరు
5 ,, సీమజిగురు పాకము

వీనితో నద్దిన తరువాత బట్టల నెండనిచ్చి "అలిజరీను రోజా" (Olijarine Pink) రంగు నద్ది యెండిన తరువాత నావిరిబట్టెదరు. అటుపిమ్మట బట్టలను సబ్బులో నుడక వేసి యెండనిచ్చెదరు. నిరోధముల నద్దినచోట్లమాత్రము తెల్లఁగనుండి బట్ట కంతయు రోజారంగంటును.

"అజో రంగులకు" నిరోధమలు:—

ఇందుకు ముఖ్యముగ వాడఁబడు నిరోధకము 'స్టానస్ క్లోరైడ్' (Stannous chloride —తగరమును శంఖ ద్రావకములో కరిగించఁగా వచ్చిన లవణము). ఇందుకుఁగాను, ౫ గ్యాలనులు సెనిగాలు జిగురు నీరు, 80 పౌనులు స్టానస్ క్లోరైడ్, 5 పౌనులు చింతపండు పులుసును గలిపి బట్టపై నద్ది యెండిన తరువాత రంగుల నద్దెదరు. ఆరిన తరువాత బట్టలను సబ్బులో నుడక వేసి యెండ వేయుదురు.

ఈ రీతిని రంగులయొక్క తత్త్వములను బట్టి నిరోధములు మారుచుండును. ఇట్లు క్షారపు రంగులకు

గంధకపు రంగులకు నిరోధములు వేర్వేరుగ నుండును కాని యద్దెడు పద్ధతు లొకటియే. నిరోధముల పాళ్లు మాత్రము మారుచుండును. కాని నిరోధ పద్ధతి ప్రకారము నీలిమందు నద్దుట మిక్కిలి పురాతనముగ వాడుకలో నుండుటచేత దానిని గూర్చి యిచ్చట వ్రాసెదము.

నీలి మందునకు నిరోధములు:—విస్తారముగ ప్రాణవాయువును గలిగియున్న వస్తువులు (Oxidising agents) నీలి మందద్దకము నందు నిరోధములుగ పనిచేయును. వీనికి దోడుగ మరికొన్ని లవణములును (Salts), జిగుర్లను, క్రొవ్వు పదార్థములును, గంజి లోనగు పాకములును గలిపి యద్దెదరు.

తెలుపు నిలుచుటకు:—

15 పౌనులు మైదాపిండిని. 6 గ్యాలనుల నీటిలోఁ గలిపి, కాచి, చల్లారిన తరువాత,

18 పౌనులు మైలతుత్తపు పొడి,

2½ పౌనులు "కాపరునైట్రేటు" (Copper nitrate—రాగిని నైట్రేటు ద్రావకములోకరిగించినది)

1 పైంటు అలిజరీను నూనె, వీనిని పైనిఁ జెప్పిన మైదాపిండి జావతోఁ గలపవలెను.

పసుపు రంగు నిలుచుటకు:—

2¾ గ్యాలనులు సీమ జిగురు పాకము.

38 పౌనులు "లెడ్ సల్ఫేటు", (Lead sulphate—సీసమును గంధక ద్రావకమును గలియఁగా నేర్పడిన లవణము)

18 పౌనులు "జింక్ సల్ఫేటు" (Zinc sulphate—తుత్తినాగమును, గంధక ద్రావకముఁగలిసినది.)

22 పౌనులు, 'లెడ్ నైట్రేట్' (Lead nitrate—సీసము నైట్రేట్ ద్రావకముతోఁ గలిసినది.)

ఇచ్చట నిచ్చిన రెండుయోగముల ప్రకారము నిరోధములను తయారుచేసి బట్టపై వేర్వేరుగనద్ది, యెండిన తరువాత నీలిమందులో ముంచెదరు. నీలిమందునకు క్రొంచెము గంధక ద్రావకమ్మునుగూడ కలిపెదరు. నీలి యద్దిన తరువాత బట్టను "సోడియమ్ బైక్రోమేటు" (Bichromate of soda) గలిపిననీటిలో ముంచెదరు. అప్పుడు పసుపు నిరోధమునద్దినచోట్ల (రెండవయోగము) పసుపురంగును, మొదటి నిరోధము నద్దినచోట్ల తెలుపును, బట్టయంతయు నీలియును నిలిచియుండును.

అనిలీను నలుపురంగునకు నిరోధములు:—

ఈ నలుపునంటకుండఁ జేయుట కనేక నిరోధములు గలవు. ముఖ్యముగ సోడాక్షారము, సోడాపొడి, సోడియమ్ సల్ఫైటు, తుత్తనాగభస్మము (Zinc oxide) లోనగునవి వాడెదరు. నలుపుబట్టలమీఁద తెలుపునిలుచుటకు గాని లేక యితర రంగులు నిలుచుటకు గాని యీనిరోధములవాడెదరు. అనిలీను నలుపు దోహదపు రంగులలో నొకటని యిదివరలో వ్రాయఁబడినది. కలంకారీ యద్దకమునందు రంగునద్దిన తరువాతనైన నిరోధముల నద్దవచ్చును, లేదా తెల్లబట్టపై నిరోధముల ముందుగనద్ది తరువాత రంగు వేయవచ్చును. మొదట పద్ధతిలో రంగు నలుపవన్నె కుమారక పూర్వమే నిరోధముల నద్దవలెను. నలుపెక్కిన తరువాత నిరోధములనద్దినచో నద్దకము చెడిపోవును.

మొదటిపద్ధతి రంగు కషాయము తయారు చేయుట:—24 పౌనులు "అనిలీన్ హైడ్రోక్లోరైడ్" (aniline hydrochloride).

8⅓ పౌనులు సోడియమ్ క్లోరేటు.

4 పౌనులు పొటాసియమ్ ఫెరోసైనైడ్.

10 గ్యాలనులు నీరు.

ఇవి కలిపిన రంగు కసాయములో బట్టనుముంచి వేడిగాలిలో నెండవేయవలెను. ఎండిన తరువాత నిరోధముల నద్ది కొంచెము సేపు ఆవిరిపట్టి "పొటాసియమ్ బైక్రోమేటు" (Potassium bichromate) నీటిలో ముంచెదరు. తరువాత బట్టలను చక్కఁగ సబ్బునీటిలో జాడించి యెండవేయుదురు. ఆవిరిపట్టు నప్పుడు బట్టకు నలుపెక్కును. నిరోధములద్దినచోట్ల

మాత్రము నలుపంటదు. అనిలీను నలుపునకు నిర్రోధమును తయారుచేయుపద్ధతి రెండు విధములు. తెలుపు నిలుచుటకు:—

మొదటిభాగము:-

8 పౌనులు గంజి

8 ,, సీమజిగురు

30 ,, పొటాసియమ్ సల్ఫైటు (Potassium sulphite.)

15 ,, సోడా అసిటేటు.

10 ,, సోడియమ్ బైసల్ఫైటు.

8 గ్యాలనులునీరు.

వీనిని గలిపి మరగబెట్టవలెను.

రెండవభాగము:—

10 పౌనులు తుత్తనాగభస్మము.

$1\frac{1}{2}$ గ్యాలనులు మెగ్నీసియమ్ అసిటేటు నీరు.

$2\frac{1}{2}$ ,, డ్రాగనుజిగురు పాకము.

1 ,, గంజిపాకము.

అద్దకమునందు నాలుగుపాళ్లు మొదటిభాగములోనిది, ఆరుపాళ్లు రెండవభాగములోనిది, నాలుగుపాళ్లు గంజితోఁగలిపి రంగు వేసిన బట్టపైనద్దెదరు. అప్పుడు నల్లబట్టపై తెలుపద్దకమగును.

రెండవ పద్ధతి:—

ఈపద్ధతి ప్రకారము తెల్లబట్టపై ముందుగ నిరోధములనద్ది తరువాత రంగులో ముంచెదరు. నలుపుమీఁద పసుపు నద్దుటకు:—

40 పౌనులు క్రోముపసుపురంగు.

$3\frac{1}{2}$ గ్యాలనులు అల్బ్యూమినునీరు (4 పాళ్లు అల్బ్యూమిను, 6 పాళ్లునీరు).

$2\frac{1}{2}$ గ్యాలనులు డ్రాగను జిగురునీరు (గ్యాలనుకు 6 ఔన్సులచొప్పున).

6 పౌనులు సోడాపొడి.

1 గ్యాలను సోడియమ్ సిట్రేటు గలిపిన నీరు. వీనిని గలిపి తెల్లబట్టపైనద్ది యెండినతరువాత పైనిచెప్పిన రీతిని రంగు కషాయములో ముంచెదరు. అప్పుడు నలుపు మీఁద తెలుపద్దకమగును.

## అద్దిన బట్టలను సరిచేయుట

అద్దకము ముగిసిన తరువాత బట్టలను సాఫుచేసి మెరుగుఁబెట్టుటకు చేయవలసిన పనులు చాలగలవు. అద్దకానంతరపు పనులు బట్టలయొక్క తత్త్వమును బట్టియు వేసిన రంగులనుబట్టియు మారుచుండును. ఇందు ముఖ్యమైనవి యావిరిపట్టుట, ఆవిరిగదిలో నారనిచ్చుట, ఆవు పేడలో నుడకవేయుట, సిమసున్న పు నీటిలో నాన్చుట, నీటిలో జాడించుట, సబ్బు పెట్టుట, మాలిన్యములను పోఁగొట్టి మెరుగుఁబెట్టుట.

అన్ని విధములగు బట్టలకును ఆవిరిబట్టుట యవసరము. అజో రంగులతో నద్దిన బట్టలకుమాత్రము యవసరములేదు. పైనిచెప్పిన పనులన్నియు యంత్రసహాయమువలనఁ జేయఁబడును. ఆవిరిఁబట్టుటకు రెండు మూఁడు రకముల యంత్రములుగలవు. ఇందొకటి "చలువ సేయుట" లోను, "సాదాయద్దకము" క్రిందను వర్ణింపఁబడినది. సామాన్యముగ కొంచము సేపు ఆవిరిపట్టుట కొక యంత్రమును చాలసేపావిరి పట్టవలెనన్న మరియొక యంత్రమును వాడెదరు. సాధారణముగ నీ యంత్రములో బట్టల నొకగంట ముంచెదరు. కాని యెంతసేపుంచినను బట్టలు చెడిపోకుండుటకు నేర్పాటుగలదు.

**ఆవిరిగదిలో నెండించుట**:—ఇది యొక యెత్తైనగది. పైనిబట్టలు తగిలించుటకు కొయ్యతోఁ జేసిన వంకెలుండును. క్రిందిభాగమున కొంచె కొంచముగ నావిరిఁబాపుటకు గొట్టములుండును. ఈగదిలో పలివేడిమి శరీరము ఓర్చతగినంత యుండును. ఆవిరిఁబట్టినగుడ్డ లిట్టిగదులలో నారనిచ్చెదరు.

**ఆవుపేడలో నుడకవేయుట**:—ఇదివరలో సాదాయద్దకము క్రింద వర్ణింపఁబడినటువంటి తొట్లలో నీపనిజరుగును. వానిలో వలె నిచ్చటకూడ తొట్ల

యొక్క క్రిందిభాగమున బిగించియున్న గొట్టముల గుండ ఆవిరి ప్రవహింపఁజేసి బట్టల నుడకఁబెట్టెదరు.

**సీమసున్నములో నాన్పుట :—** ఇది ప్రతి విధమైన బట్టకు నక్కరలేదు. కరక్కాయ లుపాధులుగా వాడి యద్దిన బట్టలకు మాత్ర మీపని యవసరము. ఇందు,

1 పౌను "టార్టార్ ఎమెటిక్" (Tartur emetic- పొటాసుక్షారము, సౌవీరము, చింతపండు పులుసు గలిసినది).

1 పౌను సీమసున్నము.

8 గ్యాలనులు వేడినీరు.

వీనినిగలిపి తొట్లలోనుంచి బట్టలు ముడుతలు బడకుండ నందులో ముంచి తేల్చెదరు.

**మంచినీటిలో జాడించుట :—** ఇది యన్నిరకముల బట్టలకును జరగవలసిన ముఖ్యమైనపని. ఇది సాంతముగ జరుగనియెడల అద్దకమంతయు చెడిపోవును. పక్కారంగులు, అవి జరీను ఎరుపు, రోజా, అని లీనునలుపు లోనగు రంగులతో నద్దిన బట్టలను నిలువున మడతలువేసి యంత్ర సహాయమున జాడించవచ్చును. కాని తక్కిన రంగులతో నద్దిన బట్టలు ముడుతలు పడకుండ నిదివరలో వర్ణింపఁబడిన ప్రకారము రోలరుల సహాయమువలన జాడించెదరు. ఇందుకు వరుసగ కొన్ని తొట్లుండును. వీనికి క్రిందిభాగముననున్న గొట్టములద్వారా నీరు సప్లయికాఁగలదు. ఒకదానిలోనుండి మరియొక తొట్టిలోనికి నీరు ప్రవహించుటకు మార్గములుండును.

**సబ్బు పెట్టుట :—** మంచినీటిలో జాడించుట యెంత ముఖ్యమో సబ్బు పెట్టుటకూడ నంతముఖ్యము. ఇందువలన రంగులంటని తెల్లభాగములు శుభ్రమగును. రంగులకు కాంతి హెచ్చును. సామాన్యముగ బట్ట కొక విధమగు తళుకువచ్చును. సబ్బునురగ చిక్కఁగా నుండవలెనా, పల్చగా నుండుటమంచిదా, లేదా యెంత సేపు నాన్పవలెను, బట్టలు మడతలువేసి నాన్పవచ్చునా, యను విషయములు రంగులయొక్క స్వభావములను బట్టి యుండును. పైనిఁజెప్పిన పక్కారంగులకు చిక్కని నురగ కావలెను. చాలసేపు నానవచ్చును. బట్టలను నిలువునుచుట్టి తొట్లలో వేయవచ్చును. సున్నితములగు రంగులకు నురగ పల్చగా నుండవలెను. బట్ట లెక్కుడను ముడుతలు బడకుండ కొంచెముసేపు నాన్పవలెను. వీని కన్నిటికి వేర్వేరు యంత్రములు గలవు.

**మాలిన్యములను పోఁగొట్టుట :—** నీటిలో జాడించినను, సబ్బుపెట్టినను పోనిమాలిన్యము లిచ్చట పోవును. ఇందుకుఁగానుచలువసున్నము(Bleaching powder కొంచెము నీటిలోఁగలిపి బట్టలనందులో ముంచెదరు. అప్పుడు రంగులుకూడ వెలియవా యనవచ్చును. కొంచెము చలువసున్నముఁగలిపి క్షణమాత్రము బట్టలనందులో నుంచుటవలన అద్దినరంగులు పోవు. మాలిన్యములు గాఢముగనుండినచో చలువసున్న ప్రమాణము కొంచెము హెచ్చించెదరు. కావలసినంతసేపు మాత్రమీ సున్నపునీటిలోనుంచి యుత్తరక్షణముననే బట్టలను పైకిఁదీయుటకు యంత్రములు గలవు.

**మెరుగుఁబెట్టుట: -** ఈపని ప్రతివిధమైనబట్టకు నవసరము. ఇందు, బట్టలు మృదువుగనుండుటకును, కూరాకువలెనుండక బిగువుగ నుండుటకును తళుకు వచ్చుటకును అనేకపదార్థములవాడుక చేయుదురు. బట్టలుమృదువుగనుండుటకు, చమురువస్తువులు, మైనము, కొవ్వుపదార్థములు, కొన్నిరకముల సబ్బులు వాడెదరు. బట్టబిగువుగనుండుటకు గంజిపెట్టుదురు. గుడ్డకు నిగనిగవచ్చుటకు గంజిపాకములో కొవ్వుకొంచెము గలిపెదరు. గంజిపెట్టినతరువాత బట్టలను చక్కఁగ నిస్త్రీ వేయుదురు. ఇందుకు ప్రత్యేకముగ యంత్రములు గలవు. వీనితోనిస్త్రీచేసినబట్టల కొకవిధమగు మెరుగు వచ్చును. ఇస్త్రీయైనతరువాత బట్టలను కావలసిన పొడవునకు కత్తిరించి మడిచి యమ్మఁజూపెదరు.

## ఉన్ని, పట్టువస్త్రముల కలంకారీయద్దకము

సామాన్యముగ నూలుబట్టల యద్దకమునకును ఉన్ని బట్టల యద్దకమునకును భేదములేదు. నూలుకు వేసిన రంగులనే ఉన్నికు వేయుదురు. పద్ధతులలోఁగూడ మార్పులుండవు. కాని చలువరైన తరువాత ఉన్ని బట్టలను ప్రత్యేకముగ జాగ్రత్తతో తయారుచేసినఁగాని రంగులు పూర్తిగ నంటవు.

ఉన్ని బట్టలకు రంగులు చక్కఁగనంటుటకువానిని రెండువిధములు తయారుచేయుదురు. మొదటి పద్ధతి ప్రకారము బట్టలను చలువసున్నపు నీటిలోముంచి పిండినతరువాత గంధకద్రావకముగలిపిన నీటిలోముంచెదరు. అటుతరువాత ద్రావకమంతయు పోవునట్లు మంచి నీటిలోజాడించి యెండవేసెదరు. చలువసున్న మెక్కువైనయెడల ఉన్ని బిరుసెక్కునుగాన తగినంతయే తీసికొనవలెను.

రెండవ పద్ధతిలో ఉన్ని బట్టలను "సోడియమ్‌స్టానేటు" (Sodium stannate- వంగభస్మమును సోడాక్షారములో కరిగించఁగా వచ్చిన లవణము) గలిపిన నీటిలో ముంచి పిండిన తరువాత గంధక ద్రావకపు నీటిలో ముంచి మంచినీటిలోజాడించి యెండవేయుదురు.

ఉన్ని బట్టలపై ముఖ్యముగ ద్రావకము రంగులను క్షారపురంగులను అద్దుదురు. వీనిని కొంచెము వినీగరుతోను, నిమ్మపండ్లపులుసుతోను గలిపి జిగుర్లతో నూరి యద్దెదరు. క్షారపురంగుల నద్దినప్పుడు కొంచెముకరక్కాయ సారముగూడ కలిపెదరు. ఇతర రంగులు నూలద్దకమునందువలెనే యద్దెదరు.

ఉన్ని నద్దుట కుపయోగించిచెడి యంత్రములపై చిత్రించిన బొమ్మలు లోతుగ నుండవలెను. యంత్రము పైఁజుట్టిన కంబళి మెత్తఁగనుండి యద్దినతరువాత నిమ్మళముగ నారవేయవలెను. ఆరిన తరువాత బట్టలకావిరి పట్టెదరు. ఆవిరి యెక్కువ తక్కువలులేకుండ తగినంతయుంచినఁగాని రంగులు చెడిపోవును. ఆవిరియెక్కువైనచో రంగులుపల్చనగును. తక్కువైనయెడల రంగుల కాంతి తగ్గును. ఆవిరి పట్టినతరువాత బట్టలను చక్కఁగ నీటిలో జాడించి యెండవేసి తైల సంబంధములగు పాకములతో మెరుగుపెట్టెదరు. ఉన్ని యద్దకమునందు వివర్ణ పద్ధతిలో ద్రావకపు రంగుల నుపయోగింతురు.

కలంకారీయద్దకమునకై ఉన్నివలెపట్టును ప్రత్యేకముగ తయారుచేయ నక్కరలేదు. తక్కిన విషయములలో నీ రెంటికి భేదమేమియులేదు. ద్రావకపురంగులు క్షారపురంగులు ముఖ్యముగ నద్దఁబడును. పట్టద్దకము ముఖ్యముగ దుస్తులకేర్పడుటవలన పక్కారంగులనే వాడుకచేయుదురు. అలిజరీనురంగులు, సహపాధకపు రంగులు వాడినప్పుడు నూలుబట్టలు నుపయోగించిన పద్ధతులనే యవలంబింతురు.

వివర్ణపద్ధతియు, నిరోధపద్ధతియు పట్టుదకమునందు ముఖ్యముగ యోగ్యములు. ఈపద్ధతులు ఉన్ని యద్దకమునందువలెనే నుండును. నిరోధముల నద్దినతరువాత పట్టుబట్టలను రంగు కషాయములో నుడకబెట్టనక్కరలేదు. కషాయము చల్లఁగనున్నను రంగులనాకర్షించు శక్తి పట్టునకుఁగలదు. అద్దకమైన తరువాత బట్టలను మొదట చల్లనీటిలోను, తరువాత వేడినీటిలోను జాడించెదరు. ఆవిరిపట్టిన బట్టలను వేడినీటిలోనుతికి తరువాత సబ్బుపెట్టెదరు. ఇదివరలోఁ జెప్పిన ప్రకారము అద్దకమయిన బట్టలకు మెరుఁగుఁబెట్టుదురు.

## హిందువుల పద్ధతులు

మనదేశములో కలంకారీయద్దకము మిక్కిలి పురాతనమైన పరిశ్రమయనియు మనదేశమునుండియే పాశ్చాత్యులీ జ్ఞానమును సంపాదించిరనియు నిదివరలో వ్రాసియుంటిమి. వ్రాతమూలములగు దాఖలాలు లేకపోవుటచేత నీపరిశ్రమయొక్క యుత్పత్తికాలమును గాని పరిణామస్థితులుగాని యందాజాగాఁ జెప్పుటకు వీలగునుగాని తృప్తికరముగ నిర్ణయించుట కాధారములులేవు. దేశాంతరుల పురాతన గ్రంథములలో హిందువుల కలంకారీయద్దకము విషయమై ప్రశంసించియుండుట

చేతను, మెగాస్తనీసు, ప్లూటార్కుమన్నగు ప్రాచీన చరిత్రకారులు తమ గ్రంథములలో హిందువుల యద్దకపు పరిశ్రమ ఔన్నత్యమునుగూర్చి కొనియాడుటచేతను మన పరిశ్రమ మిక్కిలి పురాతనమైనదని చెప్పవచ్చును. క్రీ. శ. ఏడవశతాబ్దము మొదలు పదునేడవ శతాబ్దాంతరగమువఱకు విదేశయాత్రికు లనేకులు మనదేశమున సంచారము చేసియున్నారు. వారిలో పెక్కుండ్రు మనదేశమునందలి సాలీలనైపుణ్యతను అద్దకుల చాకచక్యమును మిక్కిలి కొనియాడుచు అద్దకపు బట్టలను మిక్కిలి సన్నవైన మల్లులను తమ దేశములకు మచ్చుగ దీసికొని పోయిరి.

అద్దకపుపరిశ్రమ కొన్నిజాతుల నే యాశ్రయించియుండుటచేత నూతినాభివృద్ధిఁజెందక సాంప్రదాయ పరంపరలుగ పురాతనపద్ధతు లే యిప్పటికిని వాడుకలో నున్నవి. కల్పితపురంగులు విజృంభించి స్వాభావికరంగులకు గంటుటచేతను, యంత్రసహాయముతో ననేకరెట్లు పని మిక్కిలి శీఘ్రకాలములోఁజేయుచున్న పాశ్చాత్యులతో చేతిపనివాండ్రు డీకొనలేకపోవుటచేతను మన దేశములోని యద్దకు లనేకులు తమవృత్తులను వదలివేయవలసినవారైరి. ఇంతియగాక తత్కాలమునకు కంటె కింపుగనుండు విదేశపు రంగుగుడ్డల తళుకుపై మోజుపడి మన నవనాగరికులకు దేశీయవస్తువులయం దనురాగము పూర్తిగనశించినది. ప్రజాసామాన్యము విద్యాధికుల నే యనుకరింపఁదొడంగిరి. భూస్వాముల పోషణముగూడ తగ్గిపోయినది. ఈ కారణములనుబట్టి మన దేశములోని యుత్తమజాతి యద్దకపు పరిశ్రమ కడచిన ముప్పదిసంవత్సరములలోఁ బూర్తిగ నశించినదని చెప్పవచ్చును. కావున నీ క్రింద వివరింపఁబోవు పద్ధతు లంతకు పూర్వము వాడుకలోనుండినవనియే గ్రహించునది. ఇప్పుడద్దకమువలన జీవించెడివారిసంఖ్య మనదేశములో బహుస్వల్పమైనను వారు చాలవఱకు మన పురాతన పద్ధతుల నే యాదరించుచున్నారని చెప్పవచ్చును.

వర్తకను మూలమున విదేశీయులతో సంపర్కము గలిగి యన్యభాషాపారిభాషికపదము లనేకములు మన దేశభాషలలోనికి వచ్చినవి. కలంకారీ యద్దకమునకు మనపూర్వు లే పదమును వాడెడివారో తెలియదు. అద్దకపు బట్టలకు "కలంకారీలు" "చీటీలు" "పాలంపూర్లు" అను మూఁడుపేర్లు మనదేశములో వాడుచున్నారు. ఈ మూఁడును అన్యభాషాపదములే. ఆంగ్లేయ వర్తకసంఘము మనదేశమునకు రాక పూర్వము పోర్చుగీసు వర్తకులును, డచ్చివర్తకులును మనదేశముతో వర్తకము చేయుచుండిరి. అప్పుడు మలయాళము లోని "కాలికట్టు" అను పట్టణము ఎగుమతి దిగుమతులు చేయుటకు ముఖ్యమైన రేవుపట్టణము నుండెను. అందుచేత మనదేశమునుండి యెగుమతి కాఁబడిన యద్దకపు బట్టలన్నియు పాశ్చాత్యులచే "క్యాలికోలు" (Calicos) అని పిలువఁబడుచుండెడివి. ఇప్పటికిని మనదేశమునం దద్దెడిగుడ్డలకు క్యాలికో లనియే పేరు. ఈ యద్దకము "క్యాలికో అద్దకము" (Calico-printing) అనఁబడును. దీనినుండి "కలంకారీ యద్దకము" వచ్చినది (క్యాలికో కారి—కాలికారి—కలంకారిగా మారి యుండవచ్చును). పాశ్చాత్యులు మనదేశమునకు రాకపూర్వము అరబ్బీలతోను, పారసీకులతోను, మన దేశపు వర్తకము సాగుచుండెడిది. మనదేశపు అద్దకపుబట్టలకు పారసీకులు "పాలంగ్ పోష్" అని పేరు పెట్టిరి. పాలంగ్ అను ఉర్దూపదమునకు మంచమని యర్థము. 'పోష్' అను పారసీక పదమునకు పోషణమని యర్థము. 'పాలంగ్ పోష్' అనఁగా మంచమును పుష్టిచేయునది (పల్యంక పోషణము); దుప్పటి యని తాత్పర్యము. "పాలంగ్ పోష్" అను పదము "పాలంపూర్" అను పదముగ దేశభాషలలో మారినది. రానురాను రంగు దుప్పట్లకేగాక ప్రతి యద్దకపు బట్టకును పాలంపూరను పేరు వాడఁబడుచుండెను. చాందినీలు, చిత్రాసనములు, జమ్ముఖానాలు, రుమాళ్లు, ధోవతులు, చీరెలు, తుదకు వివిధములగు వస్త్రములు గల చాపలు సయితము పాలంపూర్ల నే వ్యవహరింపఁబడుచున్నవి. మన దేశమునుండి తీసికొని పోయిన

పాలంపూర్లను అరబ్బీ పారసీవర్తకులు యూరపు దేశములకు ఎగుమతి చేసెడివారు. యూరపు దేశస్థులు పాలంపూర్లను "చింట్జు" (Chintz) అని పిలిచెడివారు. "చింట్జు" అను పదము మన భాషలో "చీటి" అను పదముగ మారినది. కావున పాలంపూర్లన్నను చీటీలన్నను కలంకారీ గుడ్డ లనియే యర్థము. పైని వ్రాసిన దానిని బట్టి కలంకారి యను పదము కంటె పాలంపూరును, చీటి యను పదమును పురాతనము లయినవని తెలుచున్నది.

వివిధవర్ణములుగల నేత బట్టలకును నిజమైన కలంకారీ బట్టలకును భేదముఁ జెప్పవలసియున్నది. నూలుకు రంగులు వేసి యా రంగుల నూలునే నేత యందుపయోగింతురు. తివాచీల రంగు లిట్లే యేర్పడును. కొన్ని రకముల పట్టుబట్టలు నూలుబట్టలుగూడ నిట్లు నేయుదురు. ఇట్లుగాక సాదా గుడ్డపై వివిధములగు రంగుల నద్దుదురు. ఇదియే కలంకారీ యద్దకము. కావున ప్రతి రంగుల బట్టయు కలంకారీ గుడ్డ కాదని గ్రహించునది.

మన దేశములో ప్రతి రాజధానిలోను కొద్దియో గొప్పయో కలంకారీ యద్దకము జరుగుచుండెడిది. వంగ దేశములోని ఢక్కా, సిరంపూరు మున్నగు పట్టణములలో నూలు గుడ్డలనేగాక పట్టుబట్టలకుఁగూడ కలంకారీ యద్దకము వేసెడివారు. పంజాబు కాశ్మీర రాజ్యములలో ఉన్ని యద్దకముండెడిది. సంయుక్త పరగణాలు, మధ్య పరగణాలు, బొంబై రాజధానిలోని బోరోచి, అహమ్మదాబాదు పట్టణములలోను, రాజపుత్ర స్థానములలోను, మున్నగు ప్రదేశములలో నీ పరిశ్రమవలన ననేకులు జీవించెడివారు. నిజాము రాష్ట్రములోని, హైదరాబాదు, ఓరంగల్లు, ఔరంగబాదు, నాందేడు మున్నగు పట్టణములలో నిప్పటికిని ఈ పరిశ్రమ గలదు. నిజాము రాజ్యములోని పైఠణ్ అను పట్టణము పూర్వకాలము నుండియు నద్దకపు బట్టలకు ప్రసిద్ధి. కాని యనాదినుండియు నూలు కలంకారీలను ఆంధ్రరాష్ట్రమే మిక్కిలి ప్రసిద్ధికెక్కియున్నది. బౌద్ధశకము నాటికే బందరు కలంకారీ బట్టలు జగద్విదితములైనవి. క్రీ॥ శ॥ మూఁడవ శతాబ్దము నాటి పెరిప్లసు (Periplus) అను చరిత్రకారుఁడు "మసాలియా మల్లులను" గూర్చి వ్రాసియున్నాఁడు. ఆతని తరువాత మార్కోపోలో (Marco Polo) యను విదేశ యాత్రికుఁడు వీనిని గురించి వ్రాయుచు నిట్లు కొనియాడి యున్నాఁడు. "ఈ రాజ్యములో (ఆంధ్రదేశములో) సాలీడు గూడువలె మిక్కిలి సున్నితములగు ఉల్లిపొర మల్లులు నేయుదురు. ప్రపంచములోని యే రాజాధిరాజులు వీనిని సగసావహించి ధరింపకుందురు?" ౧౮౮౬వ సంవత్సరములో లండను పట్టణమున బ్రిటిషు సామ్రాజ్య పరిశ్రామిక ప్రదర్శన మొకటి జరిగినది. ఆ ప్రదర్శనమునకు మన యాంధ్ర రాష్ట్రము నందలి బందరు, కాళహస్తి, నరసాపురము దగ్గిర పాలకొల్లు మున్నగు ప్రదేశములలో నద్దిన కలంకారి బట్టలను దొరతనము వారు పంపియుండిరి. ఆ సందర్భమున ఆరు గజముల చతురము గల బందరు పాలంపూరొకటి ౬౦ రూపాయలకును, భాగవత రామాయణములలోని బొమ్మల నద్ది రెండు గజముల చతురము గల కాళహస్తి చాందినీ యొకటి 3½ రూపాయలకును, పక్షులు, పిట్టలు, పూలు, కాయలు, లతలు మున్నగు చిత్రవిచిత్రములగు బొమ్మలనద్ది యుల్లిపొరవంటి బంగారు రేకుతో నంచుగట్టి రెండు గజముల చతురము గలిగిన పాలకొల్లు పాలంపూరొకటి (దుప్పటి) ౩౦౦ రూపాయలకును, మరియొకటి ౧౮౦ రూపాయలకును అమ్ముడు పోయినవి. ఈ గిరాకిని బట్టియైన మన యాంధ్రుల కలంకారీ యద్దకపు ప్రాశస్త్యమును కొంత యూహింపఁగలరు.

మన దేశములో కలంకారీ యద్దకులకు వేర్వేరు పేరులున్నవి. ఉత్తర హిందూస్థానములో వీరిని "ఛిపికారు" లందురు. అనఁగా అచ్చు వేసెడివారని యర్థము. ఆంధ్ర రాష్ట్రములో "జీనిగాల"ని యొక

తెగ గలదు. వీరు ముఖ్యముగ కొండపల్లెలోను, గుంటూరు, నెల్లూరు, కర్నూలు జిల్లాలలోను పని చేయుచున్నారు. వీరినే కర్నూలు జిల్లాలో "చిత్రకారు" లందరు. మట్టితోను, కొయ్యతోను చేసిన విగ్రహములకు బచ్చెన పోయుట, నాటకపు తెరలు మున్నగు వానిపై చిత్తరువులు వ్రాయుట వీరివృత్తి. చిరిచాపలు, తుంగచాపలు నేసి రంగులు వేయువారికి నెల్లూరు, గుంటూరు జిల్లాలలో "పిచ్చిగుంటవాండ్రని" పేరు. ఈవృత్తులన్నియు కలంకారీ యద్దకమునకు సంబంధించినవైనను, కట్టుకొనుట కుపయోగించెడి కలంకారీ బట్టలను వీరు తయారు చేయరు. ఆంధ్రదేశములో కలంకారీ యద్దకులు ముఖ్యముగ రంగురేజులలోనే ప్రస్తుతమందున్నారు. కాని కలంకారీ యద్దకమునం దారితేరిన బందరు మొదలగు పట్టణములలో నితర జాతులవారే ముఖ్యముగ నద్దెడివారు.

మన దేశమున నద్దెడి కలంకారీ బట్టలు రెండు విధములుగ విభజింపవచ్చును. చీరెలు, రుమాలలు, చాందినీలు తెరలు మొదలగు నిత్య కృత్యమున వాడుకలో నున్నవి యొక తరగతి. రథములను, విగ్రహములను అలంకరించుట కుపయోగించెడి వితానములును (Canopies) మహమ్మదీయులు నమాజు చేయునప్పుడు పరచెడి చిత్రాసనములును (జానమాజులు) రెండవ తరగతిలోనివి. ఈ బట్టలపై సామాన్యముగ దిమ్మలతో నద్దక చేతితోనే బొమ్మలను వ్రాయుదురు.

మన రాజధాని యందలి కృష్ణా జిల్లాలోని బందరు పాలకొల్లు (నర్సాపురంవద్ద) లోను, గోదావరి జిల్లాలో కాకినాడ దగ్గరనున్న గొల్లపాలెములోను, తంజావూరు జిల్లాలోని నాగూరు, కుంభకోణములలోను, మధుర జిల్లాలోని పేర్మగుడి, పాంబను పట్టణములలోను, సైదాపేట, కరుపూరు, కాళహస్తి, సేలము మొదలగు పట్టణములలోను కలంకారీయద్దకము గలదు. కాళహస్తి, సేలము, పాలకొల్లు, బందరు పట్టణములలో శ్రేష్ఠమైన వితానములను, జానమాజులను చేసెడివారు.

అనాదినుండి మన దేశములో కలంకారీ యద్దకమునందు నాలుగు పద్ధతులు వ్యాపకములోనున్నవి:—(1) బట్టలపై కుంచెలతో బొమ్మలను వ్రాయుట (2) దిమ్మలతో నద్దుట (3) కట్టద్దకము (4) అచ్చుకద్దకము. వీనిని గురించి సంక్షేపముగ క్రింద వ్రాయబడును.

౧. కుంచెలతో బొమ్మలను వ్రాయుట (Hand-Printing).—ఈ పద్ధతి దిమ్మలతో నద్దుట కంటె కష్టమైనది. అనుభవజ్ఞులు వ్రాసినప్పుడు బట్టలు అద్దిన వాటికంటె మిక్కిలి సుందరములుగ నుండును. దిమ్మలతో నద్దిన బట్టలకంటె కుంచెలతో వ్రాసిన బొమ్మలయందు పనితనము విశేషముగ నుండును. అందుచేత వీనిని తయారు చేయుటలో కాల మధికముగ పట్టును. బట్ట యొకటింటికి రెండుమూడు నెలలకు తక్కువ కాదు. కుంభకోణము, నాగూరు, కాళహస్తి, బందరు, పాలకొల్లు పట్టణములలో వితానములు మొదలగు పవిత్రమైన బట్టలు కుంచెలతో తయారు చేసెడివారు.

కుంచె యద్దకమునందు మల్లును మొట్టమొదట కరక్కాయ నీటిలో నాననిచ్చి తరువాత పాలలో నైదారు గంటల నేపుడికించి రెండు మూడు జాలారనిచ్చెదరు. తరువాత నిసుకపై నెండలో నారవేసి కరిగిన మైనముతో కుంచెచేత బొమ్మలను వ్రాసెదరు. మైన మ్మారిన తరువాత బట్టలను రంగు కషాయములో ముంచి రంగు చక్కగ బట్టకు పట్టిన తరువాత వేడినీటిలో ముంచి మైనమును తీసివేయుదురు. అప్పుడు నీలిమీఁద గాని యెరుపుమీఁదగాని తెలుపద్దకమగును. ఒక రంగుమీఁద మరియొక రంగును గూడ నీపద్ధతిని యద్దవచ్చును. అద్ద దలచిన బొమ్మలయొక్క యంచులను ముందుగ సిరాతో వ్రాసి యెరుపుండవలసిన చోట కుంచెలతో రంగునుపామి బట్ట నుడక వేయుదురు.

అప్పుడా యా ప్రదేశములలో నెరుపు గాఢముగ నంటును. తరువాత నెరుపుపై మైనముఁబూసి బట్టలకు నీలి వేయుదురు. నీలి యంటిన తరువాత వేడినీటితో మైనమును దీసివేసి బట్టను సాఫుచేయుదురు. కాళహస్తిలోఁ మైనముఁ రాయక యెరుపుతరువాత నీలి కూడ చేతితోనే వేయుదురు. ఈ పద్ధతి పాశ్చాత్యుల నిరోధపద్ధతికి సరియైనదని చదువరులు గ్రహించి యుందురు.

బందరు వితానములపై ముఖ్యముగ చెట్లు, పక్షులు, పిట్టలు, నెమళ్లు కూర్చుండినట్లు, ఎగురుచుండినట్లు చిత్రింపఁబడియుండును. చెట్ల మొదళ్ల దగ్గిర నది ప్రవహించునట్లును, అడవి మృగములు విహారము సేయునట్లును ప్రదర్శింపఁబడి యుండును. ఈ బట్టను తయారు చేయుటకు రమారమి మూఁడు నెలలుపట్టును.

కాళహస్తివితానములయందు తెలుపుమీఁద నీలి, పసుపురంగు లద్దెదరు. సామాన్యముగ భారత రామాయణకథలను వానిపై చిత్రించెదరు. పాలకొల్లు వితానములుగూడ నిట్లేయుండును. కాని కథలమధ్య ప్రకృతిసౌందర్యమును సూచించు వృక్షములు, నదులు మొదలగు వానిని చిత్రించెదరు.

ఎరుపుమీఁద పసుపు బందరులో నీ విధముగ నద్దెదరు. బట్టను మొట్టమొదట పసుపురంగులోముంచి యెండినతరువాత కరిగిన తేనె మైనముతో బొమ్మలను వ్రాయుదురు. వీ రుపయోగించెడికుంచె యుక్కతీగెలతోఁ జేయఁబడును. మిక్కిలి చిక్కనైన బొమ్మలను వ్రాయవలసినప్పుడు చిల్లులకాగితములఁగూడ నుపయోగింతురు. బొమ్మలు ముగిసిన తరువాత బట్టలను ఎఱ్ఱరంగులోముంచి వేడినీటితో మైనమును పోఁగొట్టెదరు. బందరు కలంకారీబట్టలపైఁజేసెడి నగిషీపని చాలవఱకు పారసీక సాంప్రదాయముల ననుసరించి యుండును. కాని కాళహస్తి, పాలకొల్లు, గొల్లపాలెము మున్నగు పట్టణములలోని యద్దకుల రూపకల్పనలు కేవలము హిందూసాంప్రదాయకములై యుండును.

౨. దిమ్మలద్దకము (Block printing) :— బందరు పాలంపూర్లు (నిత్యకృత్యముల నుపయోగించెడి కలంకారీబట్టలు) ముఖ్యముగ నీ పద్ధతిని తయారు చేయఁబడును. పాలంపూర్లలో రెండుమూఁడు రకములు గలవు. తెలుపుమీఁద నల్లనియంచులుగల యెఱ్ఱని బొమ్మలు. ఇవి పూర్తిగ దిమ్మలతో నద్దినవి. తెలుపు మీఁదగాని, రంగుబట్టమీఁదగాని వేర్వేఱు రంగు లద్దుట. ఇవి కొంతభాగము దిమ్మలతోను, కొంత భాగము కుంచెలతోను, అద్దఁబడును. కేవలము కుంచెలతోనద్దిన పాలంపూర్లుగూడఁ గలవు. ఆవుల చీరలును మామిడిపిందెచీరలును కేవలము దిమ్మలతో నద్దినవి.

ఈ యద్దకమున దిమ్మలుచేయుట ముఖ్యమైనపని. ఇవి మెత్తని కొయ్యతోఁ జేయఁబడును. ఇందుకు మనదేశములో పెద్దటేకు విస్తారముగ నుపయోగింతురు. అద్ద దలఁచిన బొమ్మలను మొట్టమొదట కాగితములను కత్తిరించి చేయుదురు. కాగితములతోఁ జేసిన యీబొమ్మలను దిమ్మలపైనంటించి వానిలోనికి చెక్కుదురు. బొమ్మలు లోతుగ చెక్కనిచోఁ నది యద్దకమునందు స్పష్టముగనుండును. సామాన్యముగ నొక యంగుళములోతు చెక్కుదురు. దిమ్మలపొడవు సాధారణముగ మూఁడు నాలుగంగుళములుండును. చిత్తరువు పెద్దదైనయెడల రెండు మూఁడు దిమ్మలనుచేర్చి యొకటిగా బిగించెదరు. వీని ఖరీదు తొమ్మిదిరూపాయిల వఱకుండును. విరామములేకుండ వాడినప్పటికిని దిమ్మలు మూఁడు సంవత్సరములుండును.

దిమ్మలతరువాత రంగులుతయారుచేయుట ముఖ్యమైనపని. ఎరుపు, నలుపు, పసుపు, పసరు, నీలి, ఊదా రంగులు విస్తారముగ వాడుకలో నున్నవి. సాదా యద్దకమునం దుపయోగించెడి మూలికలనే కలంకారీయద్దకమునకుఁగూడ నుపయోగింతురు. కాని పాళ్లు కొంచెము భేదముగనుండును. ఎరుపువేయుటకు చిరివేరు, నలుపునకు కరక్కాయలు, అన్నభేది, నీలికి నీలిమందు,

ఊదాను ఎరుపుమీఁద నలుపు, ఆకుపచ్చను పసుపు మీఁద నీలి— ఈ రీతిని సాధారాయద్దకమునందు వాడెడి రంగులనే కలంకారీ యద్దకమునకుఁగూడ నుపయోగింతురు.

అద్దకపు పద్ధతులు కొంచెమించు మించుగ మన దేశము నందంతట నొక్కటిగ నుండును. బట్టను ముందుగ గేదెపేడలోనాన్చి, నీరు చల్లుచు నేలమీఁద నాగవేయుదురు. తరువాత నా మురికి బట్ట నొకటి రెండు రోజులు కరక్కాయ నీటిలో నాననిచ్చెదరు. బొమ్మలయొక్క యంచులు నల్లఁగ నుండవలసినప్పుడు ఇనుపతుప్పు, బెల్లము, పులిసిన కల్లును మురఁగనిచ్చి యీ మిశ్రణము నొక పళ్లెములోనుంచి మెత్తని కంబళి ముక్క నందులో ముంచి యుంచెదరు. దిమ్మెల నీ కంబళిపై నొక్కి తరువాత బట్టపైనద్దెదరు. అప్పుడు తెలుపుమీఁద నల్లని యంచులుగల బొమ్మలద్దకమగును. తెలుపుమీఁద నెరుపు కావలె నన్నచో పైని చెప్పిన మిశ్రణమునకు బదులుగ పటిక నీటిలో దిమ్మలను ముంచి యథావిధిగ నద్దుదురు. ఆరిన తరువాత బట్టలను చిరివేరు, జాజియాకులు వేసి మరఁగఁబెట్టిన కషాయములో ముంచెదరు. అప్పుడు పటిక యంటిన చోట్ల యెరుపద్దకమగును. సాపు చేయుటకు అద్దకమైన బట్టలను సున్నము, చౌడు, సబ్బు గలిపిన నీటిలో నుడకవేయుదురు. ఇది మిక్కిలి పురాతనమైన పద్ధతి. పాశ్చాత్యులు కలంకారీ యద్దకమన నేమియో తెలియని కాలమునఁగూడ నీ పద్ధతియే మన దేశమున వాడుకలో నుండినది. ఏలయన ౧౭-వ శతాబ్దాంతమున, అనఁగా రమారమి ౨౦౦ సంవత్సరములనాఁడు "ఫాదర్ కార్డో" అను క్రైస్తవ మతాచార్యుఁడొకఁడు మన రాజధానిలోని కలంకారీ యద్దకపు పద్ధతి నిట్లు వర్ణించియున్నాఁడు. "ఒకమోస్తరుగ చలువచేసిన క్రొత్త గుడ్డలను అద్దకులు వారము పదిరోజులు కట్టుకొని మాపుదురు. మాసిన గుడ్డలను మేక పెంటతోఁగాని గొర్రె పెంటతోఁగాని నాన్చి నీటిలో జాడించి యెండవేసెదరు. తరువాత గేదె పాలలోను, కరక్కాయ నీటిలోను నాన్చి బట్టల నెండనిచ్చెదరు. సున్నని కొయ్యపలకపై బట్టలను నునుపుచేయుదురు. ఆనపైఁ జేసిన బట్టలపైని చిల్లిరేకులతోఁగాని, చిల్లులు పొడిచిన కాగితములతోఁగాని యుపాధుల నద్దెదరు. నలుపుగఁ జేయుటకు ఇనుపతుప్పును, పులిసినకల్లు, గంజి కలిపి యుడికించి బెట్టి తయారుచేసి యద్దెదరు. నీలియద్దుటకు బట్టను మేక పెంటలోగాని గొర్రెపెంటలోగాని నాన్చి మంచినీటిలో జాడించి యెండవేయుదురు. బట్టలపై బొమ్మలను ముందుగ జాగ్రతతోఁ గీచి బొమ్మలను తప్ప తక్కిన భాగములన్నియు కరఁగిన మైనముతోఁ గప్పివేయుదురు. తరువాత బట్టను నీలిరంగులోముంచి వేడి నీటితో మైనమును దీసివేసి బట్టలను చాకలిలో నుడకవేసి మంచినీటిలో జాడించి యెండవేయుదురు. అప్పుడు తెలుపుమీఁద నీలియద్దకమగును. అద్దిన గుడ్డలకు మెరుఁగుఁబెట్టుటకు బట్టలను తిరిగి పేడలో నుడకవేసి ఉతికి, జాడించి, తిరిగి గేదెపాలును కరక్కాయ రసమును గలిపిన మిశ్రణములో నాన్చి యెండవేయుదురు. ఎరుపువేయుటకు పటికయు, ఊదారంగునకు పటికతో అన్నభేదిఁగలిపియు నద్ది యెండినతరువాత నీటిలో నాననిచ్చి కొన్ని వేళ్లయొక్క కషాయములో నుడికింతురు. అద్దకమైన గుడ్డలను మేకపెంటతో నుడికించి సబ్బునీటిలో జాడించి యెండలో చలువఁజేయుదురు. అప్పుడు బట్టయొక్క తెల్లనిభాగములు సరియగును. తరువాత తెలుపుమీఁద పసుపును, నీలిమీఁద ఆకుపచ్చయు నద్దుదురు. ఇందునకు పటికయు, కరక్కాయలును, దానిమ్మతొక్కలును, పసుపును వాడుకచేయుదురు." ఈ యుత్తరము పారిసు పట్టణములోని "శాస్త్రీయ విద్యాపీఠమునకు" (Paris Academy of sciences) పంపఁబడినది. ఈ యుత్తరములో వర్ణించిన పద్ధతులకును నేఁడు మన దేశములోనున్న పద్ధతులకును భేదమేమియులేదని చదువరులు గ్రహింపఁగలరు.

యోగములు ?—మన దేశము నందలితటను పద్ధతు లొకటియే యైనను అద్దకమునం దుపయోగించెడి వస్తువులయొక్క ప్రాళ్లు ఊరూరను మారుచుండును. పద్ధతులు గ్రంథస్థములుగాక రహస్యములుగ నుండుటచేత నొండొరులకు తెలియక యద్దకులు వంశపరంపరగా వాడుచున్న పాళ్ళే వాడెదరు. అందుచేత తప్పొళ్ళలో నాయా ప్రదేశములయందు భేదము లుండును. అయినను మచ్చునకై కొన్ని యోగములీ క్రింద నీయఁబడును.

తెలుపుమీఁద నెరుపద్దుట :— మన రాజధానిలో నెరుపు వేయుటకు చిరివేరే వాడుక చేయుదురు. ఇందుకు,

1 సేరు గుగ్గిలము.

2 పలములు పటిక.

1 పలము లద్దుగ చెక్క.

1 పలము పసుపును పొడిచేసికలిపి 4 సేర్ల నీటిలో నానఁబెట్టి చక్కఁగఁ గలిపి వడపోయుదురు. ఈ సారమును దిమ్మలతో బట్టపై నద్ది యెండిన తరువాత బట్టను చిరివేరు కషాయములో నుడకవేయుదురు. అప్పుడు అద్దినచోట్ల నెరుపు రంగంటును.

ధూపుచాయ నద్దుటకు :—(ఎరుపు వాగుఁ గల నలుపు).

అర్ధసేరు చెరుకు పానకము.

1 చెటాకు ఇనుప తుప్పుపొడి.

1 చెటాకు అన్నభేది, వీనిని గలిపి 12 సేర్ల నీటిలో 12 రోజులు మురగఁబెట్టెదరు. మురిగిన తరువాత కొంచెము గుగ్గిలమును, నేతిని గలిపి వడపోయుదురు. వడపోసిన తరువాత నీ పాకమును దిమ్మలతో నద్దుదురు. ఎండిన తరువాత బట్టలను పైనిజెప్పిన ప్రకారము చిరువేరు కషాయములో నుడకవేసి రంగంటిన తరువాత మంచినీటిలో జాడించి యెండవేయుదురు.

ఉత్తర హిందూస్థానములో జమ్ముఖానాలు, పరజాలు మొదలగు ముతక బట్టలు కలంకారీ యద్దకముతో తయారుచేయు నలవాటు గలదు. ఇందు కొన్ని తరుణముల పైద్వారు గంగులుగూడ నద్దెదరు. ఐదారు రంగు లద్దవలసినప్పు డొకదాని తరువాత నొకటి యద్దెదరు. ఎరుపును నలుపును అద్దుటకు చిరివేరు, సూసె, సజ్జాకారము, కరక్కాయలు, తుమ్మజిగురు, అన్నభేది కావలసియుండును. ఒక తాను నద్దుటకు (14 గజములు పొడవు, 2 అడుగుల వెడల్పు):—

అర్ధసేరు సూసె

పావుసేరు సజ్జాకారము

మూఁడు శేర్ల నీటిలోఁ గలిపి నిక్కఁగఁ గలియఁబెట్టి తాను నందులో నానబెదరు. ఎండిన తరువాత, పావుసేరు కరక్కాయలను చితకఁగొట్టి మూఁడు సేర్లనీటిలో నాననిచ్చి తానునందులో ముంచి యారవేసెదరు.

పావుసేరు అన్నభేది, పావుసేరు తుమ్మజిగురు, సేరున్నర నీరును చిక్కఁగఁ గలిపి పాకము చేసి దిమ్మల నీ పాకములోముంచి పై ప్రకారము తయారైన తానుపై నద్దెదరు. తెల్లబట్టపై నల్లనిబొమ్మ లేర్పడును. ఎండిన తరువాత, అర్ధసేరు పటికను,మూఁడు సేర్ల నీటిలో కరిగించి నలుపద్దకమైన తాను నా నీటిలోముంచి యారవేయుదురు. ఆరిన తరువాత, సేరు చిరివేరు పది సేర్ల నీటిలోవైచి దిగ్గాచి తాను నీ కషాయములో ముంచెదరు. అద్దకమైన తరువాత తానును మంచినీటిలో జాడించి యెండవేయుదురు. ఇచ్చట నద్దకమైన యెరుపు నలుపులు రెండును పక్కారంగులు.

ఎరుపు, నలుపు, పసుపు, ఆకుపచ్చ, నీలి, తెలుపుగల యారురంగుల జమ్ముఖానాను తయారుచేయుటకు (ఒక తాను) :—

$\frac{1}{2}$ సేరుసూసె

$\frac{1}{4}$ సజ్జాకారమును గలిపి తానునందులో నానిచ్చి యెండినతరువాత పైనిఁజెప్పినపాళ్లతో ముందుగ నలుపు నద్దుదురు. తరువాత నెరుపునద్దుటకు,

$\frac{1}{4}$ సేరుపటిక,

4 చటాకులు తుమ్మజిగురు, 8 సేర్ల నీటిలోఁగలిపి దిమ్మల నీ పాకములో ముంచి యద్ది యెండినతరువాత పైని జెప్పిన ప్రకారము తయారుచేసిన చిరివేరు కషాయములోముంచి మంచినీటిలోజాడించి యెండవేయుదురు. అప్పటికి నలుపు,ఎరుపు పూర్తియగును. తక్కిన రంగులను వేర్వేరుగ తయారుచేసి దిమ్మల నారంగులలోముంచి విడివిడిగ నద్దెదరు. పసుపుతో పసుపును, నీలిమందుతో నీలిని, ఈ రెండు గలిపి యాకుపచ్చను అద్దెదరు, ఇందుకు $\frac{1}{2}$ సేరురంగు. $\frac{1}{4}$ సేరు తుమ్మజిగురు, 8 సేర్ల నీటినిగలిపి రంగును పక్వమునకుఁ దెచ్చెదరు. ఈ మైదురంగులలో నలుపు, ఎరుపు మాత్రము పక్కారంగులు. తక్కినవి వెలిసిపోవును. అందుచేత నీరంగులనే యద్దుదురుగాని వాని కషాయములనువండి తొనుల నందులోముంచరు. కలకత్తాదగ్గిర శిరాంపుర ము (Serampore) పట్టణములో పట్టుమీఁద కలంకారీ పనిజేయుదురు. బదామీరంగు (cream colour) విస్తారముగ వేసెదరు. ఇదిగాక మంజిష్ట(మదారుచెక్క) కిరిమించిపసుపు, రంగు పదార్థములకును, పటిక, అన్నభేది యుమొదలగును వాడుకచేయుదురు; పట్టద్దకమున నుపయోగించు దిమ్మలు చింతకొయ్యతోఁ జేయఁబడును. బదామీ రంగు వేయుటకు ధాతకీకుసుమము (అగ్నిజ్వాలయని దీనికి మరియొక పేరు; ఇది యెఱ్ఱగనుండు అడవి పూవు), పటిక, పసుపు, తుమ్మజిగురు, "లెడ్ అసిటేటు" (Lead acetate -సీసపు సంబంధమైన లవణము)ను పొడిచేసి నీటిలోఁ గలిపినయెడల మీగడవలె నిగనిగలాడు పదార్థ మేర్పడును. తుమ్మజిగురు నీరు కొయ్య తొట్లలోఁబోసి వానిపై కొయ్య చట్రముల నుంచెదరు. ఈ చట్రముల యడుగు భాగమున నూలు గుడ్డయని దానిపైని మెత్తని కంబళియు పరచెదరు. పైని తయారైన రంగునకు కంబళిపైఁబోసి కుంచెలతో సర్దెదరు. దిమ్మలను దీనిపై నొక్కి పట్టుబట్టలపై నద్దెదరు. దిమ్మలద్దకము నందు బట్టలు నలుచదరపు నేలపై నున్నగాని బొమ్మలు చక్కఁగ నద్దకము గావు. హెచ్చు తగ్గులున్న నేలపైఁ బఱచిన యెడల కొన్నిచోట్ల బొమ్మ లద్దుపడవు. అందునకై యద్దకము కావలసిన గుడ్డను నలుచదరపు పెట్టె పైఁ బరచి నాలుగు మూలలకుఁగుండుసూదులతో ముడుతలు లేకుండ బిగించిన తరువాత దిమ్మల నద్దెదరు. నూలు బట్టలకు నిదియే పద్ధతి. ఇట్లద్దిన పట్టుబట్టను నీటిలో జాడించి యెండిన తరువాత మంజిష్ట కషాయములో నుడకవేయుదురు. రంగు పట్టిన తరువాత మంచినీటిలో జాడించి యెండవేసినచో దిమ్మలతో నద్దిన చోట్ల బదామి రంగేర్పడును.

3 కట్లద్దకము (Tie and dye work):— ఇది మన దేశమునకు విశిష్టమయిన పద్ధతి. పాశ్చాత్యులలో నీ పద్ధతిలేదు. బట్టల కచ్చటచ్చట ముడులు వేసి తరువాత నద్దకము వేయుటచేత నీ పద్ధతికి "కట్లద్దకము"ను పేరు పెట్టఁబడినది. పాశ్చాత్యులు

ఎనిమిదిరంగుల నద్దు యంత్రము



7-వ పటము

ఎక్కువ వెలయిచ్చి కొనెడి "బందానా రుమాళ్లు" (Bandana kerchiefs) ఈ పద్ధతినే యద్దఁబడును. మన దేశములో ఉత్తర హిందూస్థానమున నీ పద్ధతి విశేషముగ వాడుకలో నున్నది. రాజపుత్రస్థా

నము, పంజాబు, సంయుక్త పరగణాలు, కోటాసంస్థానము మొదలగు ప్రదేశములలో నీ యద్దకము మిక్కిలి వ్యాప్తిఁజెందియున్నది. మన రాజధానిలో గుప్పకన్ను చీరెలు, చుక్కల చీరెలు, రవికెలు, రుమాళ్లు మాత్రమీ పద్ధతి ప్రకార మద్దెడివారు.

ఉత్తర హిందూస్థానమున నీ బట్టలకు మిక్కిలి విలువగలదు. ఈ పద్ధతి ప్రకార మద్దిన బట్టలకు (తలపాగాలు, రుమాళ్లు, కండువాలు మొదలగునవి) "చూనారీ"లని పేరు. అద్దిన రంగులను బట్టి "పక్కా చూనారీలు" "కచ్చాచూనారీ" లని రెండువిధములు. హిందువులపండుగల సమయమున దర్బారుతీర్చునప్పుడు మహారాజుగారికి పక్కాచూనారీలను నజరానాగా దీసికొని వెళ్ళుటయు, మహారాజావారు తాబేదారీలకు పండుగల సమయమున చూనారీలను

బందరులో నుపయోగించు అద్దకపుదిమ్మెలు



౪-వ పటము

బహుమతిచేయుటయు ననుశ్రుతమైన యాచారము. కోటాసంస్థానములో మొన్నటి వఱకునిట్లుండెడిది. దర్బారుసమయమున సామంతులు చూనారీలను తప్ప మరియొక తలపాగాను చుట్టకూడదను నిర్బంధము గూడ కోటాసంస్థానములో నుండెడిదట. ఇప్పుడు తగినంత యాదరణములేక యీ సంస్థానములోఁగూడ నీ పరిశ్రమ యరుదైనది.

కట్లద్దకము రెండుభాగములు: ముళ్ళువేయుట, రంగులద్దుట. సామాన్యముగ నద్దకులు ముళ్ళు వేయరు. ముళ్ళువేయుటకు ప్రత్యేకముగ ఆడ కూలీలుందురు.

వీరికిదియే వృత్తి. ౫౦౦ ముళ్లకు కాని మొదలుకొని రంపణాలవఱకుదొరకును. ముళ్లు వేయుట విసువుబుట్టెడి పనియైనను అలవాటుపడిన స్త్రీలు రోజుకెనిమిదణాల వఱకు సంపాదింతురు. ముళ్లు నూలుదారములతో వేయుదురు. ముళ్ళు వేసినగుడ్డకు రంగు వేసినప్పుడు కట్లుగట్టినచోట్లుమాత్రము తెల్లఁగనుండి తక్కినబట్టకంతయు రంగులంటును. ఇది రంగు బట్టమీఁద తెల్ల చుక్కలు వచ్చుటకు పద్ధతి.

రంగుచీరమీఁద తెల్లచుక్కలువచ్చుటకు తెల్లచీరమీఁద నాయాచోట్ల నూలుదారముతో ముడివేసి ముళ్లతోఁగూడ చీరకు రంగువేయుదురు. రంగారిన తరువాత ముడులు విప్పినయెడల నచ్చట రంగంటక తెల్లఁగనుండును. ముళ్లు సమానమైన దూరములో వేసినయెడల సాదాచుక్కల చీరె యగును. ఒక్కొక్కచోట మూఁడేసిగాని యైదేసిగాని కట్లు గుమిగూర్చి కట్టినచో మూఁడుచుక్కలచీరెగాని యైదుచుక్కల చీరగాని యద్దకమగును.

తెల్లచీరమీఁదగాని రంగుచీరమీఁదగాని వేఱొక రంగుగలచుక్కల నద్దవచ్చును. ఏ రంగులో చుక్కలుండవలెనో యారంగులో దారమునుముంచి తరువాత ముళ్లు వేయవలెను. ముళ్లారిన తరువాత బట్టకు వేయవలసినరంగు వేయవచ్చును. దారమునకు వేసినరంగు కట్లుగట్టినచోట్ల బట్టకంటును. చూనారీలను అద్దకపు బట్టలు విస్తారముగ నుత్తరహిందూస్థానములో తయారగునని పైని వ్రాయఁబడినది. ఇందునకు సామాన్యముగ ముతకబట్టల నుపయోగింతురు. పక్కా చూనారీలను (రంగు వెలియనివి) జేయుటకు బట్టను మొట్టమొదట శుభ్రముగ నుతికి 2 చటాకులు ఆముదము 2 చటాకులు సజ్జాకారమును గలిపిన చల్లనీటిలో రాత్రి పూట నానుచు పగలెండలో నారవేయుదురు. ఇట్లు పది పదియైదురోజులు నానుచు నార్చుచుందురు. తరువాత దానిని పారుడునీటిలో నుతికి గాలికి నెండనిచ్చెదరు. బట్ట యెండిన తరువాత బొమ్మలను (అద్ద తలచినవి) ఎఱ్ఱపెన్సిలుతోగాని సిరానున్నముతోగాని బట్టమీఁద వ్రాసి ముళ్లువేయుట కిచ్చెదరు. కట్లు కారీగరు ఈ గీతలమీఁదనే ముళ్లువేయుదురు. కట్లు ముగిసిన తరువాత పసుపద్దవలసిన భాగములు పసుపుఁ గలిపిన మజ్జిగలోను, ఆకుపచ్చ నద్దవలసిన భాగములను పసుపు, నీలిమందుఁ గలిపిననీటిలోను ముంచి యెండ లారినతరువాత నాయాభాగముల నచ్చటచ్చటనే ముళ్లువేయుదురు. తక్కిన భాగముల కెరుపు వేయుటకు:—

$1\frac{1}{4}$ సేరు చిరివేరు

2 చటాకులు పటికను పొడిచేసి నీటిలోఁ గలిపి మరఁగబెట్టెదరు. రంగుపాకమునకు వచ్చిన తరువాత దించి చల్లార్చెదరు.

8 పలములు చిరివేరు, 1 చటాకు పటికను మెత్తగ పొడిఁజేసి చల్లనీటిలో నెరుపువచ్చువఱకు నాననిచ్చి వడపోయుదురు. అప్పుడు మొదట మరఁగఁబెట్టి తయారుచేసిన కషాయమును దీనితోఁగలిపి బట్ట నామిశ్రణములో మూఁడురోజులూరనిచ్చి మంచినీటిలో జాడించి యెండవేయుదురు. అప్పటికి పసుపు,ఆకుపచ్చ,ఎరుపు రంగు లద్దకమగును. ఎరుపునకు బదులుగ నీలి యద్దవలెనన్న చిరివేరు కషాయమునకు మారు నీలిమందు పాకములో ముంచవలెను.

కట్లయొక్క సముదాయములనుబట్టి పక్కా చూనారిలకు పేర్లుగలుగుచున్నవి. ఒంటిచుక్క బట్టలకు (ఒక్కొక్కముడి) 'ఏక్బంది' యనియు, నాలుగు చుక్కల బట్టలకు 'చౌబంది' (నాలుగేసికట్లు) యనియు, ఏడుచుక్కలు బట్టలకు 'సాబంది' (ఏడేసికట్లు) యనియు పేర్లు. మనుష్యులు, మృగములు, ఈటెలు, బల్లెములు మొదలగు వేటసంబంధములగు పరికరముల బొమ్మలద్దినవానికి "షికారీచూనారీ" లని పేరు.

కచ్చాచూనారీలు చేయుటకు సన్నని మల్లు కావలెను. పద్ధతు లొక్కటియే యైనను సన్నబట్టపై పని చేయుటకు కొంత చాకచక్యముండవలెను. కచ్చా

Country Soap దేశవాళీసబ్బు; నాటుసబ్బు
Copperas అన్నభేది
Developed Colours దోహదపురంగులు
Deep shades ముదురుఛాయలు
Dhobys' earth సజ్జాకారము, చాకలిచౌడు
Direct dyes నిరుపాధికపురంగులు
Discharge style వివర్ణపద్ధతి
Discharges వివర్ణకములు
Dyeing అద్దకము
Dyer రంగురేజు, అద్దకుడు
Dyes రంగులు
Engraved plate printing చిత్రితపు అద్దకము
Fast dyes పక్కారంగులు
Fatty resists తైలనిరోధములు
Finished products తయారైన సరకులు
Fixing Agents బంధనములు
Fugitive dyes కచ్చారంగులు
Gum arabic గుమ్మబంక
Hand block printing దిమ్మలయద్దకము
Hanks లాడీలు, నూలుపిల్లు
Hydro-chloric acid శంఖద్రావకము
Indigenous dyes నాటురంగులు
Intermittent machine విరామయంత్రము
Kier (boiler) చాకిఖాన
Light shades లేచాయలు
Linens నారబట్టలు
Madder style మంజిష్టపద్ధతి
Mechanical theory విశ్రిణవాదము
Metallic oxides భస్మములు
Mineral dyes ఖనిజపురంగులు
Mineral Mordants ఖనిజోపాధులు
Mordant (or adjective dyes) సోపాధికపు రంగులు
Mordants ఉపాధులు
Mordant style ఉపాధిపద్ధతి
Mordanting కసటు వేయుట
Natural dyes స్వాభావికపు రంగులు
Paper pulp కాగితపుగుజ్జు
Pigment colours పూతరంగులు
Pigment style పూతపద్ధతి
Plain dyeing సాదాయద్దకము
Raw-material ముడిసరకు
Red liquor ఎఱుపుసారము
Resin గుగ్గిలము
Resists or reserves నిరోధములు
Resist or reserve style నిరోధపద్ధతి
Roller printing తిరుగుడు యంత్రముల యద్దకము
Simple colours వ్యష్టిరంగులు
Soda-ash సోడాపొడి
Steam colours ఆవిరిరంగులు
Steam style ఆవిరిపద్ధతి
Steam Blue ఆవిరినీలము
Steam green ఆవిరిపచ్చ
Steam red ఆవిరియెఱుపు
Steam yellow ఆవిరిపసుపు
Styles of printing అద్దకపు పద్ధతులు
Stencil printing చిల్లుల యద్దకము
Substantive dyes నిరుపాధికపు రంగులు
Sulphuric acid గంధక ద్రావకము
Thickeners జిగురులు
Tie and dye work కట్లద్దకము ; ముళ్ళద్దకము
Tinsel printing తళుకద్దకము
Unbleached clothes కోరాలు
Vegetable dyes మూలికలరంగులు
Vegetable mordants మూలికోపాధులు
Verdis రాగిచిలుము
White arsenic ఉల్లిపాషాణము
White resists వివర్ణనిరోధములు; శ్వేతనిరోధములు
Yarn నూలు

## గ్రంథావళి

అద్దకమును గుఱించి తెలుఁగులో గ్రంథములులేవు. ఇంగ్లీషులోఁ బెక్కులు గలవు. తెలుఁగు విజ్ఞాన సర్వస్వములో నింగ్లీషు గ్రంథముల నామము లిచ్చుటవలన విశేష ప్రయోజనము లేకపోయినను, ఇంగ్లీషువచ్చిన యాంధ్రు లెవ్వరైనను ఈ గ్రంథములలోఁ గొన్నిఁటినైనను చదివి, యింగ్లీషురాని రంగరేజులకుఁ జెప్పి, యీ విద్యయొక్క యభివ్యాప్తికిఁ గొంతవఱకైనను సాయముచేయుదురేమో యన్న యాశతో నీ వ్యాసమును వ్రాయుటయందు సంప్రతించిన పుస్తకములను ముఖ్యములనితోఁచిన మరికొన్ని గ్రంథముల నామముల నిచ్చట నిచ్చుచున్నాము:-

## BIBLIOGRAPHY


**Wagner.**—*Manual of Chemical Technology.*

**Thorpe.**—*Outlines of Industrial Chemistry.*

**Tapestry Studio.**—*Art of Dyeing.*

**Spons.**—*Workshop Receipts, Vols. 1 and 2.*

*Encyclopædia Britannica 11th Edition Vols. IV, VIII, and XXVI.*

*Journal of the Society of Dyers and Colourists December, 1913.*

**G. H. Hurst.**—*Silk dyeing, printing and finishing.*

*Bleaching, Dyeing and Calico-printing—Edited by Gardner.*

**Watt.**—*Commercial products of India.*

**M.' Cann.**—*Dyes and tans of Bengal.*

*Journal of Indian Art and Industry.*

**N. N. Bannerjee.**—*Dyes and Dyeing in Bengal.*

**Edwin Holder.**—*Dyes and Dyeing in the Madras Presidency.*

**Fawcett.**—*Dyes and Dyeing in the Bombay Presidency.*

**Edgar Thurston.** *The Cotton fabric industry of the Madras Presidency.*

**Upshon.**—*Vegetable Dyes and Dyeing.*

**Dr. A. Kumaraswamy.**—*Arts and Crafts of Southern India and Ceylon.*

**Birdwood.**—*The Industrial Arts of India.*
*Imperial Gazetteer of India Vol. III.*

**P. N. Bose.**—*Hindu civilisation under British rule.*

**S. H. Bilgrami.**—*History of H. H. The Nizam's Dominions Vol. I.*

**Rendal.**—*Dyeing of the Chinese.*

**Grace Calvert.** *Dyeing and Calico printing.*

**Bird.**—*The American Dyer's Companion.*

**J. J. Hummel.**—*Dyeing of textile fabrics.*

**Benedikt Knecht.**—*The Chemistry of the Coal tar Colours.*

**Napier.**—*Manual of Dyeing and dyeing receipts.*

**Mathews.** *Laboratory manual of Dyeing and textile Chemistry.*

**W. P. Dreaper.** *Lectures on the research chemist in the works with special reference to the textile industry.*

**W. Crookes.**—*Dyeing and Tissue printing.*

**A. Sansone.**—*Dyeing, comprising dyeing and bleaching of Wool, Silk, Cotton, Flax, Hemp, China grass &c.*

,, *Printing of Cotton Fabrics.*

**Saiyerd Mahommad Hodi.** *A Monograph on the Dyes and Dyeing on the North Western Provinces and Oudh.*

**F. A. Parnell.** *Dyeing and Calico printing.*

**L. Liotard.**—*Memorandum on Dyes of Indian Growth and Production.*


[ వే. వి.

**అద్దము:** అద్దమునకుఁ దెనుఁగులో 'గాజు' 'దర్పణము' అని రెండర్థములు కలవు. అందు నిప్పుడు దర్పణమను నర్థమందు వివరింపఁబడును. రెండవ అర్థము 'గాజు' శబ్దము క్రిందఁ జర్చింపఁబడును. ఏ వస్తువులో మన ప్రతి బింబము కానవచ్చునో దానిని అద్దమందురు. చలనము లేని నీటి యందుఁగూడ మన

ప్రతిబింబము కాన్పించును. కావున జలము మానవులకు దేవుఁడిచ్చిన మొదటి దర్పణము. ఈ విషయములో అట్టి నీటిని గూడ అద్దమనవచ్చును. మనము వాడు అద్దములు, లోహములతో గాని, గాజుతో గాని చేయఁబడును. కాని, గాజుతో చేయఁబడిన వాటినే సాధారణముగ అద్ద మందురు.

చరిత్ర:—గాజద్దములు చేయుటకు పూర్వము, లోహపుటద్దములను వాడెడివారు. గుండ్రని చిన్న లోహపు రేకులకు మెరుగిడి, పైభాగము కొంచెము కుంభాకారముగఁజేసి దానిని అద్దముగ వాడెడివారు. అట్టి రేకులయందు మన ప్రతిబింబము కొంచెము చిన్నదిగాను, స్వచ్ఛముగాను కనఁబడును. క్రీస్తు శతాబ్దమునకు పూర్వము, గాజు దర్పణములు అక్కడక్కడ తెలిసియున్నను, రేకుటద్దములు, పదిపండ్రెండవ శతాబ్దమువఱకు వాడుకలో నున్నవి. గాజు దర్పణములను చేయుటలో ఈజిప్టు దేశస్థులు ప్రాచీనులు. వారు చక్కఁగా చెక్కిన గాజు ముక్కలకు వెనుక భాగమున వంగలోహము నద్ది, దర్పణములుగ వాడెడివారు. ఇప్పటి రోజులలో గాజు దర్పణములనే సాధారణముగ వాడుదుము. లోహపుటద్దములను, శాస్త్రీయోపకరణములందును (Scientific instruments) ఇతర పనిముట్లలోను వాడుదుము.

పరిశ్రమ:—గాజు దర్పణములు చేయు విధము. క్రీ. శ. ౧౮౪౦-సంవత్సరమువఱకు వంగ పారదసమ్మేళనమును (Amalgam of tin and mercury) గాజు దర్పణములను చేయుట కుపయోగించెడివారు. అప్పటి నుంచి ముఖ్యముగ రజత లవణములనే (Silver salts) వాడుక చేయుచున్నారు.

వంగపారద సమ్మేళనముతో దర్పణములు చేయుట:—దర్పణముగా తయారుచేయు అద్దము కన్న కొంచెము పెద్దదిగానున్న పలుచటి వంగము (తగరము) రేకును దీసికొని ఒక చతురపు బల్లమీఁద పఱచుము. రేకులో ముడతలు లేకుండ చిన్నఁగఁజేసి, దానిపైని కొంచెము పాదరసమును (పారదమును) పైపైని త్వరలో పూయుము. అట్లు పూయుటవల్ల తేలిన మడ్డిని (Scum) తీసివేసి, దర్పణముగ చేయు అద్దమును తేల్చుటకు సరిపోవు పారదమును దానిపైని పోయుము (సుమారు $\frac{1}{4}$ అంగుళము మందము గలది సరిపోవును). ఇట్లు చేయు సమయములోనే అద్దమును గూడ అతి శుభ్రముగ కడుగునట్లు ఏర్పాటు చేసి, అద్దమును పాదరసముపై నుంచి కొంచెము ఇటు అటు జరుపుము. అద్దము క్రింది పాదరసము చాల పైకి వచ్చువరకు అద్దము పైని బరువు నుంచుము. అప్పుడు బల్లను కొంచెముగా కదిల్చిన మిగిలిన పాదరసముకూడ పైకి వచ్చివేయును. అద్దమును బరువు క్రింద ౨౪ గంటలుంచి, బహు జాగ్రత్తతో నెత్తి స్రవితము చేయబడిన నీటిలో (Distilled water) కడిగి, ఆరబెట్టిన, అది ఆరి గట్టిపడును. ఇట్లు బహు జాగ్రత్తతోఁ జేసిన వెండివలె మెరయు తెల్లని భాగము అద్దముపై ఏర్పడును. అట్టి అద్దమును, దర్పణముగ వాడవచ్చును. కాని ఈ ప్రకారముచేసిన దర్పణము చెమ్మ తగిలిన గాని, వేడి తగిలిన గాని కొంచెము కొంచెముగా చెడిపోవును. ఇదియే గాక, ఇటుల చేయునపుడు పాదరసపు ఆవిరి తగులుటవలన పనివాండ్రకతి ఘోరమైన ఆపదలు సంభవించుచుండును.

వెండి పూతతో దర్పణములను జేయుట:—౧౮౩౫ సంవత్సరములో 'వాన్ లీబిగ్' ఈ పద్ధతిని కనిపెట్టెను. అమ్మోనియా కలిపిన రజత నత్రిత ద్రావణమును (Ammoniacal solution of $AgNO_3$) ఆల్డిహైడుతో (Aldehyde) కలిపి, గాజు గొట్టములో వెచ్చ పెట్టఁగా, గొట్టము లోపలి భాగమంతయు వెండి పూత పూయఁబడెను. ఈ పద్ధతిని దర్పణములు చేయుటలో ౧౮౪౦ సం॥లో ఉపయోగించెను.

దర్పణము చేయు విధానము:—ఇందు పంచదార, రజత నత్రితమును ($AgNO_3$) విభజించు

(Reduce) గుణమును ఆధారముగ తీసికొనఁబడెను. ఇందుకు ఈ క్రింది వస్తువులను అందు చెప్పిన పరిమాణములతోఁ జేర్చి (Reducing solution) విభజన ద్రావణమును తయారు చేయవలెను.

౨౦౦ భాగముల జలము.

౨౦ ,, పంచదార.

౨౦ ,, ఆల్కహాల్ (Alcohol).

౧ ,, బజారు నత్రికామ్లము.

(Commercial pure H no.₃.)

ఈ క్రింది రీతిగ రజిత నత్రితద్రావణమును కూడ తయారు చేయవలెను:—రెండు భాగముల రజిత నత్రితమును ౨౦ భాగముల జలములో కలిపి దానికి స్ట్రాంగ్ అమోనియా అను ద్రావణమును కొంచెము కొంచెముగాఁజేర్పుము (ఎఱ్ఱబడు ద్రావణము రంగు లేనిదిగ మారువరకును చేర్పవలెను). దీనికి ౨౦ భాగముల జలములో $1\frac{1}{2}$ భాగములు అతి శుభ్రమైన పొటాసు, (Potash) కలుపుటచే వచ్చిన ద్రావణమును జేర్పుము. దీనికి పై అమ్మోనియా ద్రావణమును రంగు లేనిదిగ మారువఱకుఁ జేర్పుము. పిమ్మట ౧౬ భాగముల జలములో $\frac{1}{4}$ భాగము రజిత నత్రితము కలుపుటచే కలిగిన ద్రావణమును, పై ద్రావణము వట్టిగడ్డిరంగుకు మారువరకును జేర్చి దానిని, జలశోధన పత్రమున (Filter paper) వడపోయుము. అట్లు వడగట్టిన ద్రావణమును ఒక బుడ్డిలో భద్రపరుపుము. పై విభజన ద్రావణమునుగూడ ఇంకొక బుడ్డిలో పోసియుంచుము.

నత్రితలవణమునకు సగము పంచదారయుండునట్లు రెండు ద్రావణములలోను భాగములను దీసికొని, రెండింటిని కలిపి దానికి జలమునుజేర్చి యింకొక బుడ్డిలో నుంచుము. ఈ ద్రావణమును దర్పణముచేయుటకు ఉపయోగించవలెను.

దర్పణముగ తయారుచేయు అద్దమును (Glass piece) ఇటునటు ఊగు ఒక బల్లమీఁద (Rocking table) నిలిపి, దానిని నత్రికామ్లముతోను, పిమ్మట పొటాసుతోను కడపట పవిత్ర నీటితోను కడుగుము. కడిగిన అద్దముపైని, తయారుచేసిన ద్రావణమును కొంచెము కొంచెముగా పోయుచు బల్లను ఇటునటు కదుపుము. అట్లు పోయఁబడిన ద్రావణము మొదట ఎఱ్ఱబురదవలెపోయి పిదప మూఁడునాలుగు నిమిషములలో రంగులేనిదిగ మారుచు, ౫ నిమిషములలో అద్దముపైని వత్తుగ పూతయేర్పడును. అట్లే ద్రావణమును మరియొకసారిపోసి ఒకగంట యుంచుము. పిమ్మట దానిపై నీళ్ళను వంచివేసి, ఆల్కహాల్ (Alcohol) తో ౫ లేక ౬ సార్లుకడిగి గాలికి ఎండఁబెట్టవలెను. అట్లు ఎండిన దానిని షామోయి (Chamois) తోలుతో తుడిచి దర్పణముగ వాడవచ్చును.

ఇట్లుపూసిన వెండిపూత, ఎండతగిలినగాని, గంధకపొగ తగిలినగాని త్వరలో చెడిపోవును. అదియును గాక పూత పసుపు రంగుకుమారును. ఇట్లుగాకుండుటకై పారదక, శినిద ద్రావణముతో (dilute solution of mercury cyanide) ఆ పూతను తుడిచిన, తెల్లబడి బాగుగ నద్దుకొనును. అట్టిపూతరసాయనిక కారములకుగాని, రాపిడికిగాని చెడకుండుటకు, లక్కగాని (shellac) కోపల్ వార్నిష్ (copal varnish) గాని పైపూతపూసి, ఆరినపిదప, రెండు గంగసింధూరపు (lead paint) పూతలుగాని, విద్యుత్ ప్రవాహములవలన రాగి గిల్టుగాని వేయుదురు. అందుచేత నే మనము చూచు పెద్ద అద్దముల వెనుకభాగము ఎఱ్ఱగ నుండును.

ప్లాటినపు దర్పణములు చేయువిధము:— మనకు చవుకగా తీర్థములలోను, సంతలలోను దొరకు అద్దములు పై రీతిని విలువగల పదార్థములతో చేయఁబడవు. అట్టివి అరణాకు, అణాకుగూడ దొరకును. వాటి వెనుకభాగము విలువగల అద్దములకువలె ఎఱ్ఱగ నుండక, కొంచెము వెలవెలపోవు నల్లరంగుగా యుండును. అది ప్లాటినపుపూత. ఇట్టి చవుకదర్పణములు

ఎక్కుడు ఫ్రాన్సు (France) దేశములో చేయఁబడును. ఈ పూత మిక్కిలి పలుచగాను, గట్టిగాను ఉండునట్లు అద్దబడును.

సీస ఏకామ్లజనిదము (litharge) సీసపుబోరేటు (borate of lead) కలసిన ద్రావణమును (Essential oil of spike - ఎస్సిన్షల్ ఆయిల్ ఆఫ్ స్పైకు) లో కలిపి, అద్దమునకుపూసి దానిని అంచులపై (on edges) మఫుల్డు ఫర్నేసు (Muffled furnace) లో నుంచి, దానిలో ప్లాటినము కాల్చిన, అది అద్దమునకు బహు పలుచనిపూతగ ఏర్పడును. అట్టి అద్దమును దర్పణముక్రింద వాడవచ్చును. కాని అది చిరకాలముండక త్వరలో చెడిపోవును. ఇట్టి దర్పణములను బొమ్మలు చేయుటలోను, చవుక రకపు స్పెక్టేకిలుగాను ఉపయోగించుదురు.

పలువిధములైన దర్పణములు :—దర్పణములు సమతల దర్పణములనియు, వక్రదర్పణములనియు రెండు విధములు. వక్రదర్పణములు, పుటాకారదర్పణములనియు, కుంభాకార దర్పణములనియు తిరిగి రెండు విధములుగ నేర్పరుపబఁడినవి.

సమతల దర్పణములు :—సాధారణముగ మనము వాడు చూపుటద్దములు సమతల దర్పణములు. ఇవి శాస్త్రీయోప కరణములలో (Scientific instruments) కూడ ఉపయోగింతురు.

సమతల దర్పణముల మీది కిరణ పరావర్తనము :—మన ముఖము మీది కాంతి కిరణములు, అద్దముపై పరావర్తనము చెందుటవలన, అద్దములో మన బింబము కాన్పించును. ౧. సమతల దర్పణము్ను మీద కిరణము, పరావర్తనము చెందునపుడు, పతన కిరణము, పరావృత్త కిరణము, లంబముతో సమకోణములు చేయును. ౨. ఈ రెండు కిరణములును, లంబమును సమతలమునందుండును. అనఁగా ఒకటి యెత్తు ప్రదేశమునను, మరియొకటి తగ్గు ప్రదేశమునను యెన్నడును నుండవు. 3. పదార్థము దర్పణమునకెంత దూరమున నుండునో బింబముకూడ దర్పణము వెనుక నంతే దూరమున నుండును. పదార్థము అద్దము పై ప్రకు జరిగిన బింబముకూడ అద్దము పైప్రకు జరుగును. వెనుకకు జరిగిన అద్దముగూడ వెనుకకుఁ జరుగును. ౪. పదార్థముయొక్క కుడిభాగమున బింబము యొక్క ఎడమభాగముండును. ఎడమ భాగము పైపైన బింబము కుడి భాగముండును. ప్రతి బింబము మనకు కనబడుట తప్ప, అద్దములో నేమియులేదు. ఆ బింబమును తెరమీఁద చూపుటకు వీలులేదు. అట్టి బింబమును "మిథ్యాబింబ" మందురు. మనము తల యొక్క వెనుక భాగము చూచుకొన వలెనన్న, ఒక యద్దము వెనుకను, మరియొకటి ముందును ఇడుకొనుదుము. తల వెనుకభాగమునుండి కిరణములు వెనుకటి అద్దముపైఁబడి పరావర్తనము చెంది, ముందర అద్దముపైఁ బడి తిరిగి పరావర్తనము చెంది మన కంటియందు ప్రవేశించును అందుచే తల వెనుక భాగము మనము చూడఁగలము.

వక్ర దర్పణములు:—ఇవి సాధారణముగా తళతళ మెరయు లోహములతోఁ జేయఁబడును. గాజుతోఁగూడను చేయుదురు. వీటికి ఆకారమును బట్టి ఈ పేరు వచ్చినది. ఇవి ఎప్పుడును గోళముల భాగములై యుండును. గోళము యొక్క మధ్య వీటికి మధ్యమై యుండును. పరావర్తన ప్రదేశము పైభాగమైన కుంభాకార దర్పణములనియు, లోపలి భాగమైన పుటాకార దర్పణములనియు పేరు. పుటాకార దర్పణములే ఎక్కువగ వాడుకలో నున్నవి. పూతన దర్పణములు కొంచెము కుంభాకారముగ నుండెడివని చెప్పియున్నాము.

పుటాకార దర్పణముల మీది కిరణ పరావర్తనము :—ఇట్టి దర్పణములు వలయాకార పదార్థముల భాగము లగుటచే ప్రతి దానికిని వలయ

"మధ్యము" (మ) ఉండును. దర్పణామధ్య (ద) ను వలయ మధ్యముతో కలిపిన, గీచినగీత (దమ) "ముఖ్యా




క్షము" (Principal axis) అనబడును. (మ) కును, (ద) కును సగము దూరమున దర్పణముయొక్క "కేంద్రము" (focus) ఉండును. ముఖ్యాక్షముతో సమానాంతరముగా (parallel) పడు కిరణము లన్నియు కేంద్రముగుండ పోవును.

ఇట్టిదర్పణములవలన కలుగు బింబములు:—

౧. పదార్థమతిదూరమున నున్నప్పుడు దాని బింబము కేంద్రములో నుండును. కేంద్రములో పదార్థముండిన దాని బింబము మిక్కిలి దూరమున నుండును. అపుడు అద్దమంతయు వెలుతురుతో నిండినట్లు కనబడును. ౨. పదార్థము దర్పణముయొక్క 'మధ్యము' న కొంత దూరములో నున్నప్పుడు బింబము కేంద్రమునకు,




పప పదార్థము
బబ బింబము

మధ్యమునకు, మధ్యనుండును. ఈ బింబము చిన్నదిగాను, తలక్రిందుగను ఉండును. పదార్థము మధ్యమును సమీపించినకొలఁది, బింబము కేంద్రమునువిడి మధ్యమును సమీపించుచుండును. ౩. పదార్థము మధ్యము దగ్గఱనుండిన, బింబముకూడ మధ్యముయొద్దనే తలక్రిందుగను, సమానపొడవుగను ఉండును. ౪. పదార్థము 'కేంద్రము', 'మధ్యము' నకు మధ్యయుండిన, మధ్యమునకావల, తలక్రిందుగ పదార్థముకంటె పెద్దపరిమాణముగల బింబముండును. ఈ బింబములున్నచోట తెరయుంచిన అవియన్నియు, తెరమీఁద తలక్రిందుగ కాన్పించును. కనుక పైఁజెప్పిన బింబములన్నియు నిజమైన బింబములు. ౫. పదార్థము కేంద్రమునకు, దర్పణమునకు మధ్యనుండిన, బింబము అద్దమునకావల నిలువుగాను, (erect) పెద్దదిగాను కాన్పించును. ఇట్టి బింబము తెరమీఁద వేయఁబడదు; గనుక ఇది చూపు




పప పదార్థము
బబ బింబము

టద్దమునందలి బింబమువలె మిథ్యాబింబము. ఇట్టి అద్దములను ముఖమునకు దగ్గరగా పెట్టుకొని చూచుకొనిన వికృతములైన పెద్దబింబములు కాన్పించును. కనుక యిట్టి అద్దము లెన్నడును చూపుటద్దములక్రింద వాడరు.

కుంభాకార దర్పణములమీది కిరణపరావర్తనము:—పదార్థము అతిదూరముననున్న దర్పణముమీఁదఁబడు కిరణములు, వ్యాపక కిరణములు,

(Divergent rays) గా పోవును. కాని పదార్థము కొంచెము దూరములో నెక్కడున్నను, బింబము అద్ద




పప పదార్థము
బబ బింబము

మునకు వెనుకభాగమున చిన్నదిగాను, నిలువు (erect) గాను కాన్పించును. పదార్థము అద్దము దగ్గరకు వచ్చినకొలంది, బింబము పెద్దదియగుచు అద్దము వైపునకు వచ్చును. ఇట్టి అద్దములవలన కలుగు బింబము తలక్రిందుగ నుండనేరదు. అందుచేతనే పూర్వపు రేకుటద్దములు కొంచెము కుంభాకారముగ నుండెడివి.

ఉపయోగములు:—సాధారణముగా అద్దములను, ముఖ బింబములను జూచుకొనుటకు ఉపయోగింతురని అందరకును తెలిసిన సంగతియే. పెద్ద అద్దములను గొప్ప భవనముల నలంకరించుటలో ఉపయోగించెదరు. ప్రస్తుతము అట్లు ఉపయోగించు అద్దములన్నియు సమ తల దర్పణములు. వక్రదర్పణములనుముఖ్యముగా శాస్త్రీయోపకరణములలోను (Scientific instruments) ఇతర పని ముట్లలోను వాడుదురు. గోడ దీపములలోను, తొక్కుడు బండ్ల మోటారుబండ్ల దీపములలోను, వెనుక భాగమున వక్ర దర్పణము లుండుట మన మెరుగుదుము. ఇట్టివి, దీపముల వెనుకనుండి, దీప కిరణములను, చక్కగ ప్రతి ఫలింపఁజేసి, దాని కాంతిని ఎక్కువగజేయునట్లు కానఁబడును. అట్టి అద్దములు లేకపోయిన, దీపపు కాంతి అంత యెక్కువగా నుండదు. వాటి పని దీపపు కిరణములను అన్ని వైపులకు చెదరనీయక, వాటి మీద కడు కిరణము లన్నిటిని ఒక వైపునకు ప్రవర్తింపఁజేయుట. కనుకనే మోటారు బండ్ల దీపములకు ముందు పెద్ద కాంతి కనబడును. ప్రక్కలకు అంతగా నుండదు. అట్టి అద్దములను ఈ క్రింది ఉపకరణములలోను గూడ ఉపయోగించెదరు.

దూరదర్శిని (Telescope):—సముద్రముమీఁద పోవు ఓడలను, ఆకాశము నందుండు నక్షత్రములను, యుద్ధము నందుకొని, మరి ఎక్కువైనను, దూరముగనున్న వస్తువులను చూచుటకు, దీని నుపయోగించుదురు. ప్రస్తుతపు దూరదర్శినులందు కటకము (Lenses) లను ఉపయోగించుచున్నారు. కాని పూర్వము, నక్షత్రమండలమును పరిశోధించుటకు కటక దూరదర్శినిల కన్న, దర్పణ దూరదర్శినులను ఎక్కువుగా నుపయోగించెడివారు. అట్టి దూరదర్శిని నుపయోగించిన వారిలో న్యూటన్ (Newton) మొదటి వాఁడు.

'హెర్షల్' దూరదర్శిని:—దర్పణ దూరదర్శిని సహాయము చేత 'హెర్షల్' (Herschel) యు, వానితోబుట్టువయు, ప్రతి నక్షత్రమును పరిశోధించు నిధి బృందము నంతయు రెండు సారులు సమవింపఁ గలిగిరి. వారి యుపకరణమందు ఈ క్రింది విధముగ ఏర్పఁబడెను.




'అఅ' అనునది పుటాకార దర్పణము. 'మమ' అను గీత ముఖ్యాక్షముగునట్లు, దర్పణమును కొంచెము వంపుగా నుంచిరి. అట్లు వంపుగా నుంచుటవలన

దర్పణముయొక్క కేంద్రమునందు ఏర్పడు బింబము 'క' అను ద్వారము వద్ద చూచుటకు వీలగును. న్యూటన్ దూర దర్శినియందు సమతల దర్పణము మీఁద పరావర్తనముచే బింబముయొక్క కాంతి తగ్గును. బింబము కాంతి విహీనముగాకుండుటకు హెర్షల్ యీ పద్ధతిని అవలంబించెను. [చో. వెం. కృ.]

**అదావత్.** బొంబయిరాజధాని, తూర్పు ఖాందేశీజిల్లా, చోప్డాతాలూకాలోని గ్రామము. జనసంఖ్య రమారమి ఆఱువేలు. ఇందు పాడుబడ్డకోట యొకటి కలదు. గ్రామమున కుత్తరమున ౧౬౭౦ లో కట్టఁబడిన మసీదు ఒకటి కలదు. వాయువ్యదిక్కున మూఁడు మైళ్లదూరమున వేడినీళ్ళ జలలు కలవు.

**అద్రాస్ (అత్రాస్).** బొంబాయి రాజధాని, కైరాజిల్లాలో నొకమైదానము. ఇది 'ఆనంద్' అను తాలూకా గ్రామమునకును 'మహి' అను ఏటికిని నడుమనుండును. ఇటీవలి కాలమున నీయది మూఁడు యుద్ధములకు తావయ్యెను. మొదటి యుద్ధమున, సూరతు పట్టణములో ఢిల్లీశ్వరుని ప్రతినిధియైన 'రుస్తుమ్అలీ' అనువాఁడు 'పిలాజీగాయకవాడ్' అనువాని మోసముచే నిజాముల్ ముల్కునకు ప్రతినిధియైన ఆమిడ్ఖానునిచేఁ జంపఁబడియెను. (౧౭౨౩)

రెండవయుద్ధమున, ఇంగ్లీషువారిలోఁ గలిసిన రఘునాధరావును నానాఫడనవీసుపక్షపు మహారాష్ట్రవీరులోడించిరి. (౧౭౭౫ ఫిబ్రవరి).

మూఁడవయుద్ధమున ఇంగ్లీషువారు మిక్కిలి కష్టము మీఁద మహారాష్ట్రుల నోడించిరి (౧౭౭౫ మే ౧౮ తేది). ఇంగ్లీషువారు గెలిచినను వారికే మిక్కిలినష్టము వచ్చెనని ఒక ఆంగ్లేయుఁడే వ్రాసియున్నాఁడు.*

*"Victory was dearly bought. Of 15 British officers in the advanced division, seven were killed and four wounded. Eighty Europeans, a number of native officers, and 200 men, were killed or missing."—

*James Forbes.*

**అదితి.** ప్రాచేతసదక్షునికన్య. కశ్యప మహర్షి యొక్క పదుమువ్వురు భార్యలలో నొక్కతె. ద్వాదశాదిత్యులకుఁ దల్లి.

**అదిరాంపట్టణము.** ఈ పురము తంజావూరు జిల్లాలోని 'పట్టుకోట్టాయి' అను తాలూకాలోనున్నది. ఇదియొక ఓడరేవు. సింహళద్వీపముతో మంచి వర్తకము జరుగుచున్నది. జనసంఖ్య ౧౦౪౯౪. ఇక్కడ వర్తకము చేయువారలు మహమ్మదీయ మతస్థులగు లబ్బిలనఁబడు నొక తెగవారు. ఇక్కడ నొకఉప్పుఫ్యాక్టరీ గలదు. శివాలయ మొకటి యున్నది.

**అదిల్ఖాన్ II, ఫరూక్.** ఈతఁడు గుజరాత్ దేశస్థుఁడు. క్రీ. శ. ౧౪౫౦లో దావుద్ఖాన్ మరణానంతరమున ఈతఁడు ఖాందేశ పరగణాకు అధిపతి అయ్యెను. ఈతఁడు తన ముఖ్యపట్టణమగు టల్నార్ అను పురమును విడచి బుర్హాన్ పురమును తనకు రాజధానిగ జేసికొనెను. పదునెనిమిదిసంవత్సరముల కాలము ఖాందేశమును పాలించి ౧౫౦౨ లో మరణించెను. ఈతని యనంతరమున ఈతని అప్పరు మాఁడగు బహదూర్షా యాదేశమునకు పాలకుఁడయ్యెను.

**అద్రిక.** ఒక యప్సరస శాపముచే మత్స్య యోనిం జెందినప్పుడు, దీని యుదరమున మత్స్యరాజను పుత్రుఁడును, మత్స్యగంధియను పుత్రికయుఁ బుట్టిరి. [చూడు. 'ఉపరిచరవసువు']

**అదీసురుఁడు.** బంగాళదేశపు రాజు. చాల చదువుకొనినవాఁడు. ఇతఁడు పదియవశతాబ్దాంతమునందుండి నట్లగపడుచున్నది.

**అదృశ్యంతి.** మైత్రావరుణి వసిష్ఠుని పుత్రుఁడైన శక్తియను మహర్షియొక్క భార్య. పరాశర మహర్షి కిఁదల్లి.

# అద్వైతము.

అసంఖ్యాచిదచిద్వస్తుభరితంబైన యీ ప్రపంచమునకు మూలకారణములు పెక్కులు గలవని మానవజాతియొక్క బాల్యావస్థయందు నమ్మిరనను, జ్ఞానాభివృద్ధియై తత్త్వవిచారము హెచ్చిన కొలఁదిని, ఈయనంతమైన సృష్టికి మూలకారణ మొక్కటియే యనియు, నదుండియే ఇదియంతయు ననఁగా నసంఖ్యములయిన నామరూపములచేతను, వస్తుస్వరూపంబులచేతను, కర్తృభోక్తలచేతను, నిండియున్న యీవిశ్వమంతయుఁ బుట్టినదనియు, పండితులు నిశ్చయింపసాగిరి. 'ఏకంసత్ విప్రాబహుధావదన్తి' * (ఋగ్వే ౧౦-౮౨-౩) అను ఋగ్వేదమంత్రము, ప్రపంచోత్పత్తిని దెలిసికొనుటకు మానవబుద్ధిపడిన పాటుయొక్క పరమావధిని జూపును. ఇట్లు మూలకారణైకత్వము స్ఫురించినతోడనే, యాకారణముయొక్క స్వరూపమును గుఱించి తర్కములు ప్రారంభమాయెను. ఈకారణము జడమనికొందఱును 1, చైతన్యమని కొందఱును2, జడచైతన్యాత్మకమని కొందఱును3, నిర్గుణమని కొందఱును4, సగుణమని కొందఱును 5, కారణమగు బ్రహ్మకార్యమైన ప్రపంచముకంటె భిన్నముకాదని కొందఱును6, భిన్నమనికొందఱును7, భిన్నాభిన్నమని కొందఱును8, ప్రతిపాదింపఁదొడంగిరి.

ఇట్లు మనదేశమునందు అద్వైత మను పేరిటను, పాశ్చాత్య దేశములందు మోనిజమ్(Monism-ఏకత్వవాదము), ప్యాంథీజమ్ (Pantheism - ప్రపంచపరమాత్మైక్యమతము), అను పేరిటను మిక్కిలి పురాతన కాలమునుండి పెక్కుదర్శనములు వెలసినవి. హిందూదేశమునందు బుద్ధుఁడు, శంకరుఁడు, నీలకంఠుఁడు, రామానుజుఁడు, వల్లభుఁడు మొదలగు నాచార్యులును, పాశ్చాత్య దేశమునందు జనోఫేనస్, ప్లాటినస్, స్పైనోజా, హీగెల్, హేకెల్ మొదలైన తత్త్వవేత్తలనేకులును వేఱువేఱువిధములయిన అద్వైతసిద్ధాంతములను తమ బుద్ధిచాతుర్యములఁజూపుచుఁ బ్రతిపాదించిరి.

వానినన్నిఁటిని ఇచ్చటచర్చించుట యనావశ్యకము. ఆయా తత్త్వవేత్తలనుగుఱించి వ్రాయునప్పుడు వారి వారి దర్శనములు వర్ణింపఁబడును. ఈ వ్యాసమునందు హిందూదేశమందలి ముఖ్యములగుమూఁడువిధములయిన యద్వైతదర్శనములను, పాశ్చాత్య దేశమందలి రెండు యద్వైతదర్శనములనువర్ణింపఁదలఁచినారము. ఈదేశమునందు మిక్కిలి ప్రఖ్యాతి చెందినదియు, పరదేశీయులచేఁ బొగడ్తగన్నదియు, నధికప్రచారము గలదియు నైనది శాంకరాద్వైతము. అద్వైతమనిన సాధారణముగ దీనికే పేరు. దీనిని మనము కేవలాద్వైతమందము. రామానుజాచార్యులవారిచేఁ బ్రతిపాదింపఁబడినది కూడ అద్వైతమే; కాని దానియొక్క విశేషలక్షణమును బట్టి దానిని విశిష్టాద్వైత మందురు. వల్లభాచార్యుఁడు శంకరాచార్యుని మిక్కిలి ద్వేషించు వాఁడైనను, తనమతమునకు శుద్ధాద్వైతమనిపేరు పెట్టెను. కావున నిది మూఁడవయద్వైతము. హిందూదేశమందలి యీ మూఁడు అద్వైతదర్శనములును, క్రమముగ నిందు వర్ణింపఁబడును. పాశ్చాత్య పౌరస్త్యజ్ఞాన భాండారముల నొక్కచోటికిఁదెచ్చుట మాప్రతిజ్ఞ. కావున పాశ్చాత్యతత్త్వవేత్తలలో నద్వైత తత్త్వమును చక్కఁగను పూర్తిగను మీమాంసించిన ప్లోటినస్ స్పైనోజా లనఁబడుమహర్షులయొక్క సిద్ధాంతములను గూడ నీవ్యాసమునందుఁ బొందుపఱిచెదము.

౧ శంకరాచార్యుఁడు మళయాళ దేశజుఁడు. క్రీ.శ. ౭-వ శతాబ్దము వాఁడని కొందఱును ౮-వ శతాబ్దము వాఁడని మఱికొందఱును చెప్పుదురు. రామానుజా

---

* 'ఒకటిగానున్న దానిని పండితు లనేకవిధములఁ జెప్పుచున్నారు.

1 బౌద్ధులు, సాంఖ్యులు, హేకెల్ వంటి పాశ్చాత్యభౌతిక శాస్త్రజ్ఞులు. 2 వేదాంతులు మొదలైనవారు. 3 విశిష్టాద్వైతులు, స్పైనోజామతస్థులు మొదలగువారు. 4 శాంకరాద్వైతులు, స్పైనోజా మొదలగువారు. 5 విశిష్టాద్వైతులు మొదలగువారు. 6 శాంకరాదులు. 7 మధ్వాచార్యులు. 8 నింబార్కుఁడు.

చార్యుఁడు ద్రవిడదేశమందు క్రీ. శ. ౧౦౧౭ (శా. శ. ౯౩౮)సం॥మున జన్మించినవాఁడు. వల్లభాచార్యుఁ డాంధ్రుఁడు. ఆంధ్రుఁడైనను తన మతమును గుజరాతుఁ దేశమునందు స్థాపించెను. ఈతఁడు క్రీ.శ. ౧౪౭౯ మొదలు ౧౫౩౧వఱకు నున్నవాఁడు. ప్లోటినస్, ఈజిప్టు దేశమందు క్రీ. శ. ౨౦౪ లో జన్మించి రోముపట్టణమునకు ౨౪౩ లోఁబోయి తన తత్త్వ జ్ఞానమును లోకులకు బోధించుటకై ఒక పాఠశాలను స్థాపించెను. ౨౭౦ లోఁ గాలధర్మము నొందెను. స్పైనోజా, ఆమ్‌స్టర్‌డ్యాముపట్టణమందు క్రీ.శ.౧౬౩౨లో జన్మించి హేగ్‌పట్టణమున క్రీ. శ. ౧౬౭౭ లోఁ గీర్తిశేషుఁడయ్యెను. ఈతఁడు వైరాగ్యాతిశయముచే భూషితుఁడై మన పూర్వ ఋషులను బోలియుండెను.

ఈ తత్త్వవేత్తలచరిత్రాదులు సవిస్తరముగా వారివారి నామముల క్రింద వర్ణింపఁబడును. ఇచ్చట వారి తత్త్వసిద్ధాంతములను వర్ణించుటయే ప్రయోజనము కౌన వారి చరిత్రాంశములు వ్రాయఁబడక వారి దేశకాలముల మాత్రము చదువరుల జ్ఞాపకార్థమై సూచింపఁబడినవి.

ప్రస్తుతము మాకు శంకర రామానుజాదుల తత్త్వవిచారముతోఁ. బనికాని, మతమతాంతరులయొక్క, భస్మధారణము, ముద్రాధారణము మొదలయిన యాచార వ్యవహారములతోఁ బనిలేదు. కావున నిట్టి సంస్కార విశేషము లాయామతములు వర్ణించునప్పుడు చెప్పఁబడును. ఇచ్చట వదలివేయఁబడును.

[ము. సం.

## ౧. కేవలాద్వైతము

(శ్రీ శంకరాచార్య మతానుసారము)

ఇది ఈ హిందూదేశములోఁ బుట్టి ఇప్పుడు సర్వదేశములయందుఁ బ్రసిద్ధినిపొంది శ్లాఘింపఁబడుచున్న ఒక మతము పేరు. జీవాత్మ పరమాత్మలు వేఱువేఱనియు, బ్రహ్మము జగత్తు రెండును సత్యపదార్థములనియుఁ జెప్పునది ద్వైతము. అందునకు వ్యతిరేకముగాఁ జెప్పునది అద్వైతము. అద్వైతముయొక్క పరమ సిద్ధాన్తములను మూఁడు మాటలలో సంగ్రహించి చెప్పిరి. "బ్రహ్మసత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవ నాపరః":-అనఁగా బ్రహ్మ మొక్కటియే సత్యము; జగత్తు సర్వము మిథ్య; జీవుఁడు బ్రహ్మమె, బ్రహ్మము కంటె వేఱు గాఁడు. ఇది శ్రీశంకరాచార్యులవారు నిశ్చయించి స్థాపించిన మతము. ఇంతమాత్రముచే నది వారు క్రొత్తఁగాఁ గల్పించిన మతమని చెప్పఁగూడదు. ఈ హిందూదేశములో ప్రధానముగాఁ బ్రచారములో నున్న మతముల వారెల్లరు వేదములను ముఖ్యప్రమాణముగా గ్రహించినవారే. వారందఱు తమ మతసిద్ధాంతములకు శ్రుతి ప్రమాణములను జూపించుచు నందులకుదఁగిన యుక్తులను గూడఁ జేర్చి బోధించుదురుగాని, వేదమును వదలి కేవల యుక్తిని ఆధారముగాఁ జేసికొన్న వారుగారు. కాన అద్వైతమునకుఁగూడ శ్రుతియే ప్రధానమైన ప్రమాణము. వేదము లపౌరుషేయములు, స్వతఃప్రమాణము లని వారందఱును ఒప్పిన విషయము. అవి ప్రతిపాదించు విషయమును బట్టి ఆ వేదములను కర్మభాగము జ్ఞానభాగమని రెండు భాగములుగా విభజించిరి. సాధారణముగా మంత్ర బ్రాహ్మణములు కర్మను బ్రతిపాదించునవి. ఉపనిషత్తులు జ్ఞానమును బ్రతిపాదించునవి. ఉపనిషత్తులు వేద

ములయొక్క చివర భాగములు అగుటంజేసి వేదాన్తము లనికూడ నుడువఁబడెను. ఆవేదాంతములలోఁ బ్రతి పాదింపఁబడువిద్య జ్ఞాన విద్య యగుటవలన, ఆవిద్యకుఁగూడ వేదాన్తమని వ్యవహారము గలిగినది.

ఆయా మతాచార్యులు, శ్రుతులనేగాక వ్యాస సూత్రములను భగవద్గీతలను గూడఁ ప్రమాణముగా గ్రహించియుండిరి. సంవాదార్థమయి స్మృతి పురాణేతిహాస వచనములనుగూడ నుదాహరించుట గలదు. వ్యాసులవారు, ఉపనిషత్తులయొక్క అర్థ విచారము చేసి వానినన్నిటిని సమన్వయింపఁజేసి ఉపనిషన్మతము ఎట్టిదో ఆను పూర్వికగా నిరూపించుటకు బ్రహ్మసూత్రములను రచియించిరి. కాని అవి అత్యల్పాక్షరముగాను, అతిక్లిష్టముగాను ఉండుటచే వ్యాసులవారి తాత్పర్యము వానివలనఁగనిపెట్టుట దుర్ఘట మయినది. వానికంటెఁ బై యుపనిషత్తులు సుగమములు. అయినను 'అనంతా వై వేదాః' అనిచెప్పిన అనంత వేదములను క్రోడీకరించి వానిని విభాగముచేసి ఒకదారికిఁ దెచ్చి ఇప్పుడు వాడుకలోనున్న ప్రకారము ప్రవర్తింపఁజేసిన శ్రీ వేదవ్యాసులు పై యుపనిషత్సారమును నేవిధముగా గ్రహించిరో అవశ్యముగాఁ దెలిసికొనఁ దగినది. కాఁబట్టి 'శ్రుతులు ఏమిచెప్పినవి? వ్యాసులవారు, ఆశ్రుతులు ఏమిచెప్పినవని చెప్పిరి? సర్వజ్ఞుఁడు భగవంతుఁడు నయిన శ్రీకృష్ణ భగవానులు భగవద్గీతలద్వారమునలోకమున కేమి బోధించిరి?' అని ఈ దేశములోని మతాచార్యులందఱు విమర్శించిరి. నిజమునకు బ్రహ్మ ముఖమునుండి నిశ్శ్వాస రూపముగా వచ్చినవని చెప్పఁబడినట్టి, అతీంద్రియ జ్ఞానము గల ఋషులచే దృష్టములయియున్న, శ్రుతులకంటెఁ దత్త్వమును బోధించునవి ఏవి యుండును? అట్టి వ్యాసుల వారికంటె, ఆశ్రుతుల తాత్పర్యమును సరిగాఁ జెప్పఁగలవారెవ్వరు గలరు? శ్రీకృష్ణ పరమాత్మకంటె తత్త్వజ్ఞులు ఎవరు? కాన, అతీంద్రియ విషయమయిన ఆత్మ తత్త్వమును దెలిసికొనుటకు శ్రుతులను సూత్రములను గీతలను బ్రమాణముగా నంగీకరించుట న్యాయము.

ప్రస్థానత్రయము

కాని, విషయమతీంద్రియ మగుటవలన, ఆ శ్రుత్యాదులయొక్క తాత్పర్య నిర్ణయములో నాయా మత స్థాపకులకు, అభిప్రాయ భేదములు ఏర్పడి, వేలువేలు మతములు బయలు వెడలెను. వారిలో నొకరు శ్రీ శంకరాచార్యుల వారు. వారు నిర్ణయించిన మతమె అద్వైతము. దానిని శాంకర మతమనిగూడఁ జెప్పుదురు. శంకరాచార్యులవారు శ్రుతులు సూత్రములు గీతలు నన్నియు కేవలాద్వైతమును బోధించుచున్నవని అనేకోపపత్తులతో బహుధాఁ బ్రతిపాదించుచు, ఆ మూఁడు ప్రస్థానములకు భాష్యము రచియించిరి. వారు శ్రుత్య

అద్వైత గ్రంథకర్తలు

విరుద్ధమైన యుక్తులనుగూడ విశేషముగాఁ జూపిరి. విద్వదనుభవమును గూడ నొక ప్రమాణముగా నంగీకరించిరి. విద్వాంసులు అనఁగా తత్త్వజ్ఞులు. ఇవ్విధముగా, వారు అద్వైతమును గురించి సప్రమాణముగాను, సయుక్తికముగాను భాష్యములను,ఇంక ననేక స్వతంత్ర గ్రంథములను రచియించి యుండిరి. వారి తర్వాత, సురేశ్వరాచార్యులు, సర్వజ్ఞ ముని, వాచస్పతి మిశ్రలు, వివరణకారులు, విద్యారణ్యస్వాములు,మధుసూదనస్వాములు, అప్పయ్య దీక్షితులు, మొదలగువారు శంకర మతమును విశేషముగా బోధించుచు బహు గ్రంథములువ్రాసిరి. ఆగ్రంథకర్తలు,అద్వైత రహస్యమగు జీవబ్రహ్మైక్యమును శ్రోతల బుద్ధులకుఁ జక్కఁగా నెక్కునట్లు ఉపపాదించు టలో నొక్కొక రీతిని వెళ్లిరి. అందువల్ల కొన్ని యవాంతర విషయములలో, వారిలో తాత్పర్య భేదములు గనఁబడును.* అయినను, ఆరంభములో సంగ్రహముగాఁ జెప్పిన ప్రధాన సిద్ధాంతములలో నందఱు నొక్కటిగానే వెళ్ళిరి. ఎవ్వరయినను, అద్వైత మతమును నుపపాదించువారు ముఖ్యముగా శాంకర గ్రంథముల ననుసరించియే వెళ్ళవలసి యుండును.

* శాంకరాద్వైతులలోఁ గల మాత్ర మతభేదము లన్నియు అప్పయదీక్షితులచే రచియింపఁబడినసిద్ధాంత లేశ సంగ్రహమను గ్రంథమునందుఁ జక్కఁగ నీయఁ బడినవి.

(ము. సం.)

“బ్రహ్మసత్యం”.—బ్రహ్మము యొక్క టిదె సత్యము. బ్రహ్మ మనఁగా నేద్ది?

బ్రహ్మము జగత్తునకుఁ గారణము

“యతో వా ఇమాని భూతాని జాయంతే। యేన జాతాని జీవన్తి। యత్ప్రయంత్యభిసంవిశన్తి। తద్విజిజ్ఞాసస్వ। తద్బ్రహ్మేతి” (తైత్తి. ౩-౧-౧) అను శ్రుతిలోఁ జెప్పఁబడినది బ్రహ్మము. ఈ సర్వభూతములు — ఈ సర్వ ప్రపంచము — దేనిలో నుండి పుట్టినవో, దేనియం దున్నవో, తుదకు దేనియందు లయించుచున్నవో, అది బ్రహ్మమని చెప్పఁబడినది. సర్వ ప్రపంచమునకు నుత్పత్తి స్థితి లయకారణము బ్రహ్మము. ఈ లక్షణము వలన బ్రహ్మము స్వరూపమిట్టిదని తెలియుట లేదు; కాని శాఖా చంద్ర న్యాయముగా - ఆ కొమ్మమీఁదుగాఁ గనఁబడునది చంద్రుఁడని చెప్పినట్లు - జగత్తునకుఁ గారణము బ్రహ్మ మని చెప్పఁబడినది. ఈ చెప్పినలక్షణమును శాస్త్రజ్ఞులు తటస్థ లక్షణ మని వాడుదురు. స్వరూపమును గుఱించి ముందుఁ జెప్పెదము. పైఁజెప్పినత్రివిధకారణత్వమువలన, జగత్తునకు బ్రహ్మము ‘అభిన్న నిమిత్తోపాదాన కారణము’ అనఁగా నిమిత్త కారణము, ఉపాదాన కారణము నుభయము నయినది. లోకములో ఘటాదులకు కులాలాదులు - (కుమ్మరి మొదలగు) నిమిత్త కారణముగాను, మృదాదులు (మట్టిమున్నగునవి) ఉపాదాన కారణముగాను వేఱు వేఱుగా

నున్నవి. జగత్తునకు రెండు కారణములు బ్రహ్మమే. ఉత్పత్తికారణమని చెప్పుటచే నిమిత్త కారణత్వమును, లయకారణమని చెప్పుటచే నుపాదాన కారణత్వమును, రెండును బ్రహ్మమునకు సిద్ధించినవి.

మనకు ననుభవములోఁ గనఁబడు నీ స్థూల ప్రపంచము కార్యరూపమనియు, దీనికి, ఆదిని సూక్ష్మరూపమగు పరమ కారణము ఉండి తీరవలెననియు, అన్ని దేశములలోని భౌతిక శాస్త్రజ్ఞులు, తత్త్వశాస్త్రజ్ఞులు, ఒప్పి విమర్శించియున్నారు. వారిలోఁ గొందఱు ఉపాదాన కారణమును మాత్రమే విమర్శించిరి. మరి కొందఱు ఉభయ కారణములను విమర్శించిరి. తుదకు వారు జగత్కారణముల వేఱువేఱుగా నుడివిరి. సాంఖ్యులు ప్రధానమును, తార్కికులు అణువులను, ఆగమానుయాయులు హిరణ్యగర్భ తత్త్వమును, మరి కొందఱు కొన్నిటిని, పాశ్చాత్యులు కొన్ని తత్త్వములను,ఆదికారణముగా నిర్ణయించిరి. కాని వారెవ్వరును, అద్వైతులు వెళ్ళినంత దూరము వెళ్ళి విమర్శించినట్లు కనంబడదు. నానారూపములతో విజృంభితమయి ప్రతినియత దేశకాల నిమిత్త క్రియాఫలముల కాశ్రయమయి, అనేక కర్తృభోక్తృభూయిష్ఠమయియున్న ఈ విచిత్రప్రపంచమునకు, కేవల జడమయిన ప్రధానముగాని, పరమాణువులుగాని మరియొకటిగాని తగు కారణము కానేరదు. సర్వజ్ఞత్వసర్వశక్తిమత్త్వములుగల చేతన కారణమును ఒప్పి తీరవలె. అభావము పరమకారణమని శూన్యవాదులు చెప్పుమాట పాటింపులోనికి తేఁదగినది కాదు. "కథమసతస్సజ్జాయేత" (శూన్యములోనుంచి సత్పదార్థమెట్లుపుట్టును?) అను శ్రుతి అట్లుండఁగా, ప్రపంచము లేని కేవలశూన్యము అచింత్యము, అసంభావ్యము.

బ్రహ్మపదార్థము జగత్కారణమని పయిని జెప్పఁబడిన శ్రుతియేగాక, 'జన్మాద్యస్యయతః' * అను బ్రహ్మసూత్రమును, (౧.౧.౨) 'అహంకృత్స్నస్యజగతః ప్రభవః ప్రళయస్తథా'† (౭-౬) అను గీతావాక్యమును, ప్రమాణములు. బ్రహ్మము జగత్కారణమని సర్వోపనిషత్తులలోను జెప్పఁబడియున్నది. దానినే ఛాందోగ్యములో నొకచోట 'ఆకాశ' (౧-౯-౧), మని మరియొకచోట 'ప్రాణ'(౧-౧౧-౫) మని, బృహదారణ్యకములో 'అంతర్యామి' (౩-౭-౧)అని,ముండకములో 'భూతయోని' (౧-౧-౬)అని, మొదలగు వేఱువేఱు పేర్లతో నక్కడక్కడ వాడిరి. సర్వ జగత్తునకు నుత్పత్తి స్థితిలయ కారణమగునది నిత్యము, సర్వవ్యాపి, సర్వజ్ఞము, సర్వశక్తిమత్తు, సర్వాత్మకము నయియుండవలెను. ఈ ధర్మములతో శ్రుతులలోఁ జెప్పఁ

* ఈ ప్రపంచముయొక్క యుత్పత్తిస్థితిలయములు బ్రహ్మమువలనఁ గలిగినవి.

† నేను సమస్తజగత్తును బుట్టించువాఁడను, గిట్టించువాఁడను.

బడిన జగత్కారణము, అద్వైతులు ఒప్పిన బ్రహ్మముగాని సాంఖ్యులుచెప్పు ప్రధానము లేక అణ్వాదులును కానేరదు. ఈ సంగతినే బ్రహ్మసూత్రకారులుప్రథమాధ్యాయములో నిర్ణయించిరి. దానినే భాష్యకారులు భాష్యములో విపులముగఁ బ్రతిపాదించిరి.

కారణము నిమిత్తమని ఉపాదానమని రెండు విధములు. బ్రహ్మము రెండు విధముల కారణమని చెప్పితిమి.

భిన్న ప్రకృతులయిన జగత్తునకు బ్రహ్మమునకుఁ గల సంబంధము

మృత్సువర్ణాదులు ఘటకంకణాదులకు నుపాదానమయినట్లు బ్రహ్మము జగదుపాదానమంటిరిగదా! చేతనము, అత్యంత పరిశుద్ధమునయిన బ్రహ్మమునకును కేవలజడము, అత్యంతాపరిశుద్ధము, సుఖ దుఃఖ మోహాత్మకము, రాగద్వేష ప్రీతి పరితాపాది విశిష్టము, అయిన ప్రపంచమునకును, కార్యకారణ భావములోఁ బ్రకృతివికార భావ మెట్లు సంభవించును? ప్రకృతి ధర్మములు వికారమం దుండితీరవలయు. ఇక్కడ కార్యమగు ప్రపంచమునందుఁ గారణవిరుద్ధ ధర్మములు గనఁబడుచున్నవి. కాబట్టిబ్రహ్మ కారణవాదము సమంజసముకాదు. శాబ్దప్రమాణ మెంతయుండినను, లోకానుభవమునకు విరుద్ధమయినది విశ్వసనీయము గానేరదు. అని పూర్వపక్షులాక్షేపించిరి.

ఇందునకు సమాధానము. అత్యంత సారూప్య మున్నచోట ప్రకృతి వికారభావము ఉండనే యుండదు. ప్రకృతి వికారభావ మున్నచోట్ల కొన్నియంశములలో సారూప్య ముండి మరికొన్ని యంశములలో వైరూప్య ముండితీరవలయు! ప్రకృతములో బ్రహ్మమం దుండు సత్తాంశము జగత్తునం దనువర్తించుచున్నది. చైతన్యపారిశుద్ధ్యాదులు కారణగత విలక్షణాంశములు. అవి కార్యమునందు సంక్రమించలేదు. జాడ్యా పరిశుద్ధ్యాదులు కార్యభూత ప్రపంచముయొక్క విలక్షణాంశములు గానికారణములోనుండి వచ్చినవిగావు. కావున బ్రహ్మము జగత్కారణమనుటకు బాధ లేదు. ఇంతేగాదు.

ఉపాదాన కారణము పరిణామోపాదానము, వివర్తోపాదానము, అని రెండు విధములు. 'కారణ సమ సత్తాకమగు నన్యథాభావము పరిణామము.

ఉపాదాన కారణ భేదములు:
౧ పరిణామము
౨ వివర్తము

కారణవిషమ సత్తాకమగు నన్యథాభావమువివర్తము' అని యీ రెంటికిభేదము. ఎట్లనఁగా మృత్తుఘటముగాను క్షీరములు దధిగాను, మారుట పరిణామము. రజ్జువు సర్పముగాను, శుక్తి రజితముగాను మారుట(అనఁగాఁగనఁబడుటయె) వివర్తము. మృత్ క్షీరములెంత సత్యములో ఘటదధులు నంతసత్యములు. రజ్జుశుక్తులతోపాటు సర్ప రజితములు సత్యములుగావు. కాకపోయినను రజ్జుశుక్తులు కారణములని ఒప్పిరి. కాఁబట్టి ఘటమునకు మృత్తు, దధికి క్షీరములు పరి

ణామోపాదానము; సర్పమునకు రజ్జువు రజితమునకు శుక్తియు, వివర్తోపాదానమని వేఱువేఱు వ్యవహారము కలిగియున్నది. కారణ గుణములు కార్యమందు సంక్రమింప వలయు నను నియమము ('కారణగుణాః కార్యే సంక్రామంతి') పరిణామోపాదాన విషయము గాని, వివర్తోపాదాన విషయము గాదు. ఈ ప్రపంచ విషయములో బ్రహ్మమువివర్తోపాదానము, మాయ పరిణామో పాదానమని కొందఱు, బ్రహ్మము కారణమయినను నందులకు మాయ సహకారియని, లేక ద్వారకారణమని మఱికొందఱు, మాయయే ఉపాదాన కారణము; బ్రహ్మము తదధిష్ఠానముగాన నౌపచారికముగా నుపాదాన కారణమని ఇంకొకరు, ఇవ్విధముగా వేఱువేఱుగా కారణ నిరూపణమును జేసిరి. కారణ నిరూపణలో నీయభిప్రాయ భేదములు గలిగినను 'ఉన్న పదార్థము బ్రహ్మ మొక్కటి. ఈ ప్రపంచ మంతయు నెవ్విధముగా నయిననేమి దానియందు బయలు వెడలినది' అను సిద్ధాంతాంశమున నద్వైతులలో విప్రతిపత్తిలేదు. ప్రపంచగత జాడ్యాది దోషము లెట్లు వచ్చినవను శంకా నివృత్తికొఱకు, జగత్కారణములోనికి రాగ ద్వేష సుఖ దుఃఖాది సకలానర్థములకును, జాడ్యాది దోషములకును, ఆస్పదమగు మాయను నొక్కొక్క రొక్కొక విధముగఁ జేర్చి సమాధానము చెప్పిరి.

ఇందుమీఁద బ్రహ్మమెట్టిదనియడుగఁగా జగత్కారణమని చెప్పి, ఇప్పుడుదానిలోనికి మాయనుగూడఁ జొప్పించిరి. 'అసలు బ్రహ్మ పదార్థమెట్టిది? మాయ యనఁగా నేద్ది? ఆ రెంటికి సంబంధమేమి?' అని ప్రశ్నింప వచ్చును.

ఈ ప్రపంచకల్పనా ప్రారంభమునకుఁ బూర్వము 'ఏకమేవాద్వితీయ' మయి అనఁగా సజాతీయ విజాతీయ స్వగతభేద రహితమై (శుద్ధబ్రహ్మము) యున్న యొక్కవస్తువు బ్రహ్మ. అది నిర్గుణము, నిరవయవము, నిర్వికారము, నిష్క్రియము, నిర్విశేషము, అవ్యవహార్యము, కూటస్థము, దేశకాలవస్తు కృతపరిచ్ఛేదరహితము, అవాఙ్మనసగోచరము. ''నేతినేతి'' (ఇదికాదు ఇదికాదు) యని మాత్రము నిరూపించఁదగినది. ఈ ప్రపంచ మనృత జడదుఃఖాత్మకము; అట్లు కానిది యాబ్రహ్మము. అందుచే నది సచ్చిదానంద మనిరి. 'ఘటమున్నది', 'గృహమున్నది', 'ప్రపంచమున్నది' యని వ్యవహరింపఁబడు సర్వపదార్థముల యందను శ్రితంబగు సత్త (Existence) ఆ బ్రహ్మ సత్తకంటె ననతిరిక్తముగాన, బ్రహ్మము సద్రూపమనిరి. 'తమేవభాంత మను భాతిసర్వం' అను శ్రుతిచెప్పినట్లు, ఆ బ్రహ్మవస్తువు, తాను, స్వయంప్రకాశ మానమయి, సర్వజగత్తును సూర్యచంద్రాదులను సయితము ప్రకాశింపఁ జేయుచున్నది. కాన చిద్రూపమనిరి. సర్వ

విక్షేపనివృత్తికలిగినపుడుండు నిరతిశయసుఖానుభావము దానిదే; అందువలన దాని నానందరూపమనిరి. ఉన్నవస్తువు ఒక్కటె. అది సూదిమొనదూరునంత సందును విడువక సర్వత్ర నిండియున్నది. ఆవస్తువును గమనించుటలో నుండు రీతిభేదముల (Different Standpoints)వలన, సచ్చిదానందమని మూఁడు శబ్దములతో వ్యవహారము గలిగినదిగాని తత్త్వమున కావస్తువు మూఁడు భాగములు గాఁగాని, మూఁడవాంతర వస్తువులుగలిగి గాని లేదు. ఈచెప్పినది శుద్ధ బ్రహ్మము. ఇది సత్యము. అనఁగాత్రికాలాబాధ్యము. ఒకప్పుడుండి ఒకప్పుడు లేనిదిగాని, ఒకప్పుడులేక, మరియొకప్పు డుండునదిగాని కాదు.

మాయా స్వరూపము

అట్లు కూటస్థము నిర్వికారము అగు శుద్ధ బ్రహ్మము వలన జగదుత్పత్తి ఎట్లాయెను? ఇందుల కద్వైతులు మాయా సంబంధము వలన నయినదని నుడివిరి. ఆమాయకు, అజ్ఞానము, అవిద్య, అవ్యాకృతము, ప్రకృతి, బీజశక్తి, అవ్యక్తము, మొదలగుపేర్లు గలవు. అది, అందఱను మోహింపఁజేయునదిగాన మాయయనిరి. విద్యచే ననఁగాజ్ఞానముచే నివర్త్యముగాన నవిద్య, అజ్ఞానము, అనిరి. బహువిధముగా విజృంభితమయియున్న యీ వ్యాకృత ప్రపంచమునకుఁ బూర్వావస్థ గాన నవ్యాకృతమనిరి. వటవృక్షము వటబీజమందు సూక్ష్మ రూపముగా నిమిడియున్నట్లు, ఈ ప్రపంచము దానిలో సంస్కారరూపముగా నున్నదని బీజశక్తియనిరి. ఈ ప్రపంచము దాని వికారముగాన దానిని ప్రకృతియనిరి. అది, అతిసూక్ష్మము సదసద్విలక్షణముగాన నవ్యక్తమనిరి. ఈ శబ్దములవలననే మాయ యెట్టిదో తెలియఁబడును. జ్ఞానముచే దానికి నివృత్తికలదుగాన బ్రహ్మమువలె నది సత్పదార్థము కానేరదు. దానివలనఁ బ్రత్యక్షమగు ప్రపంచము బైలువెడలి యనుభవ విషయమగుచున్నదిగాన, కుందేటికొమ్మువలె, గగనకుసుమమువలె, అది కేవలాసత్పదార్థము నయితము కానేరదు. అందువలన మాయ, అనిర్వచనీయమగు ఒకభావ పదార్థమును గా నొప్పిరి. అదిముఖ్యముగాఁ గార్యానుమేయము. నిద్రలో మనశక్తులు మనలో లీనమయియున్నట్లు,జగదారంభమునకుఁ బూర్వము నిర్గుణబ్రహ్మమందు మాయ లీనమయియుండును. అట్టిమాయను నొప్పినందువలన బ్రహ్మముయొక్క శుద్ధత్వమునకుగాని,అద్వితీయత్వమునకుగాని భంగము కలుగనేరదు.

సత్యత్వము, వ్యావహారికము, పారమార్థికము, ప్రాతిభాసికము

అద్వైతులలోఁగొందఱు పారమార్థిక సత్యత్వము, వ్యావహారిక సత్యత్వము, ప్రాతిభాసికసత్యత్వము, అని మూఁడు విధముల సత్యత్వమును ఒప్పి, మొదటిదానికి బ్రహ్మమును, రెండవదాని కీప్రపంచమును, మూఁడవదానికిస్వప్నమును,రజ్జుసర్పమును, దృష్టాంతమిచ్చిరి. మరికొందఱు

రెండవదానిని మూఁడవదానిలోఁ జేర్చి, పారమార్థికము, ప్రాతిభాసికము, అని రెంటినే ఒప్పిరి. ఈ రెండవవారి సిద్ధాంతములో, జాగ్రత్స్వప్న ప్రపంచములకు భేదములేదు; రజ్జువునందు సర్పమువలె బ్రహ్మమందు ప్రపంచము భాసిల్లుచున్నది. ఇది మాయ వలనఁగలుగుచున్నది. శుద్ధబ్రహ్మ మిందున కధిష్ఠానముగాన బ్రహ్మము జగత్తునకు కారణమయినది. త్రివిధ సత్యత్వమును ఒప్పిన ఫక్కిలో ప్రపంచముయొక్క సృష్టిక్రమమెక్కువ ఆనుపూర్వికముగా సిద్ధించుచున్నది. ఎట్లనిన:—

ప్రపంచోత్పత్తి విధము

కూటస్థ బ్రహ్మమందు లీన మయియున్న మాయ ప్రపంచోత్పత్తి కలుగఁబోవునపుడు, లీనదశను వదలి, కదలిక పుట్టి కార్యోన్ముఖమగును. అంతట దానితోఁ గలసిన బ్రహ్మమున కీశ్వర భావమేర్పడును. కాఁబట్టి మాయావిశిష్ట చైతన్య మీశ్వరుఁడనియు, ఈశ్వరునకు మాయ యుపాధియనియుఁ జెప్పఁబడినది. సర్వజ్ఞుఁడు, సర్వశక్తిమంతుఁడు, సర్వనియంత, సర్వాంతర్యామి, అనఁబడువాఁడు ఈ ఈశ్వరుఁడు. ఈయనను శబల బ్రహ్మమనియు, మాయాశబలమనియు సగుణమనియుఁ గూడ వాడెదరు. ఈయనయే జగత్కారణము. ఇక్కడనుండి సృష్టి బయలుదేరుచున్నది. ఈశ్వరోపాధియగు మాయను వివక్ష సేయనియెడల, ఈశ్వరచైతన్యము బ్రహ్మచైతన్యమే. బ్రహ్మమేకంటె వేఱుగాదు. ఇదియే బ్రహ్మ జగత్కారణమని చెప్పిన తాత్పర్యము. ఇవ్విధముగా నీశ్వరుని బట్టి, శాఖాచంద్రన్యాయముగా నిర్గుణబ్రహ్మమును దెలిసికొన వలయునని, బ్రహ్మమునకు జగత్కారణత్వమును లక్షణముగాఁ జెప్పిరి.

పైని జెప్పఁబడిన మాయ సత్వరజస్తమోగుణాత్మకము. మాయయం దావరణశక్తి విక్షేప శక్తి యని రెండు శక్తులు గలవు. ఉన్న వస్తువు నావరించి కనఁబడనట్లు (లేనట్లు) సేయునది ఆవరణశక్తి. లేని వస్తువును నారోపించి యున్నట్లు చూపించునది విక్షేపశక్తి. సత్వగుణాధిక్యమున్నచోట, ఆవరణ శక్తి తన పనిని జూపఁజాలదు. ఈశ్వరోపాధియందు సత్వాధిక్య ముండుటచే, ఆయనకు స్వస్వరూపావరణము లేదు. అందువలన మాయ ఆయనకు లోఁబడియున్నది గాని ఆయన మాయకు లోఁబడియుండలేదు. ఈశ్వరుఁడు స్వవశమయియున్న విక్షేప శక్త్యాత్మక మాయతోఁ బ్రపంచమును క్రమముగా సృజించెను. అందులోని తమః ప్రధానభాగముతో ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథివి యను పంచభూతములను, ఆ వరుసను నొకదానిలోనుండి రెండవ దానిని సృజియించెను. వీనిని, అపంచీకృత సూక్ష్మభూతములని వాడుదురు. ఈ క్రమములోఁ బూర్వపూర్వమది చిద్విశిష్టమయి యుత్తరోత్తరమునకుఁ గారణమయినదని గ్రహింప వలయును. అనఁగా,

చిద్విశిష్ట తమః ప్రధాన విక్షేప శక్త్యాత్మక మాయలో నుండి,ఆకాశతత్త్వము,చిద్విశిష్టా కాశములోనుండి వాయుతత్త్వము, ఇవ్విధ ముగా పంచభూతసూక్ష్మములు పుట్టినవి. ఇవి బహువిరళావయవములు గలవగుటం జేసి సూక్ష్మభూతములనిరి. వానియొక్క సాత్త్వికాంశములలో నుండి వేఱు వేఱుగాఁ బయి వరుసక్రమమున శ్రోత్ర త్వక్ చక్షు జిహ్వాఘ్రాణము లనఁబడు పంచజ్ఞానేంద్రియ ములు పుట్టినవి. ఆ సాత్త్వికాంశములు గలిసిన సముదాయములోనుండి మనస్సు బుద్ధియుఁ బుట్టెను. అవ్విధముగాఁ బై పంచభూతముల రాజసాంశములలోనుండి, వేఱు వేఱుగా నావ రుసను వాక్పాణి పాదపాయూపస్థలను పంచ కర్మేంద్రియములును, అవి కలసిన సముదా యములోనుండి ప్రాణాపాన వ్యానోదాన సమానములను పంచప్రాణములునుబుట్టెను. అంతట పంచ జ్ఞానేంద్రియములు, పంచ కర్మేంద్రియములు, పంచ ప్రాణములు, మ నస్సు, బుద్ధి, ఈ పదునేడు గలిసి లింగశరీర ములు (సూక్ష్మ శరీరములనిగూడ పేరు),అయి నవి. ఈ ప్రకారముగా భూత సూక్ష్మము లలోఁ గొంతభాగము లింగశరీరము లాయె ను ; మఱికొంత భాగము పంచీకరణము ద్వారా స్థూలభూతములాయెను.

పైని జెప్పిన పంచసూక్ష్మ భూతములను ప్రతిదానిని రెండు సమభాగములుగాఁ జేసి, రెండవ సగభాగమును నాలుగు భాగములుగాఁ జేసి,ప్రతిభూతసూక్ష్మముయొక్క యీనాలుగు భాగములలో నొకొక్క దానిని, తదితర భూతసూక్ష్మముల యొ

పంచీకరణము

క్క యర్ధాంశలలోఁ జేర్చుచుఁబోవఁబంచస్థూలభూతము లేర్పడును వానిలోని యర్ధాంశముల పేర్లతో నవి పిలువఁబడును. ఇదిపంచీకరణము. ఇట్లు ప్రతి స్థూల భూతములలో సగమాపేరుగలసూక్ష్మ భూతమును, శేషించినదితక్కిననాలుగుసూక్ష్మ భూతములలోని యష్టమాంశములునయి యుండును. ఎట్లనఁగా.

స్థూలాకాశము $= \frac{1}{2}$ఆ $+ \frac{1}{8}$వా $+ \frac{1}{8}$అ $+ \frac{1}{8}$జ $+ \frac{1}{8}$పృ

స్థూలవాయువు $= \frac{1}{2}$వా $+ \frac{1}{8}$ఆ $+ \frac{1}{8}$అ $+ \frac{1}{8}$జ $+ \frac{1}{8}$పృ

ఈ పంచీకృత స్థూలభూతములతో టిచతుర్దశ భువనములును, జరాయుజాండజస్వేదజోద్భి జ్జములగు సర్వ ప్రాణులయొక్క స్థూలదేహ ములును, సకలస్థూల ప్రపంచమును, సృజి యింపఁబడెను.

ఈ ప్రకారముగా నీశ్వరుఁడు విక్షేపశక్త్యు పాధితో, నిఖిలజడ ప్రపంచమును సృజియిం చెను. సర్వత్ర నిండి

అధ్యారోపము

యున్నవస్తు(బ్రహ్మము) వొక్కటయి యుండఁగా దానివలన నింత చిత్ర విచిత్రముగానుండు ననేక భేదభిన్నమయి యున్న యీ ప్రపంచమెట్లుకలిగెనో యది ఇంతవఱకు నిరూపింపఁబడినది. దీనిని వేదాం తులు,అధ్యారోపమని చెప్పుదురు. ఈ అధ్యా

రోప జ్ఞానమువలన ప్రపంచ మంతయు నేక వస్తువులోనుండి వచ్చినదని ధృవపడును.

ఇంక నీప్రపంచమును, ఉత్పత్తి వ్యుత్క్రమముగ విమర్శించెదము. దీనిని 'అపవాదము' అని చెప్పుదురు.

అపవాదము

కార్యము (ఉపాదాన) కారణ స్వరూపము. పేరునకును, రూపమునకును, మాత్రము వేఱుగాని వస్తు వదియె. మృత్తికతోఁజేసిన ఘటము నిజమునకు మృత్తిక. సువర్ణముతోఁజేసిన కంకణము నిజమునకు సువర్ణము. ఘటము, కంకణ మనునవి వికార మాత్రములు; మృత్తిక,సువర్ణము, సత్యపదార్థములు. ఈ సంగతినే "వాచారంభణం వికారోనామధేయంమృత్తికేత్యేవసత్యం" (ఛాం.౬-౧-౪) అను శ్రుతి చెప్పుచున్నది. కాఁబట్టి యథార్థమునకు కార్యముకారణము కంటె పృథగ్వస్తువుకాదు. వికారనాశమే కార్యనాశము. అదిజరిగినపుడు కారణము పరిశిష్టమయి యుండును. కార్యము కారణములో లయించును. ఈ ప్రకార మీ ప్రపంచమును విమర్శించఁగా, వివిధముగా విభక్తమయి యనంతనామ రూపములతో ప్రతీయమానములగు చతుర్దశభువనములు, చతుర్విధ ప్రాణికోటి శరీరములు, నిఖిలస్థూల ప్రపంచము, దానికిఁ గారణమగు పంచీకృత పంచమహాభూతములకంటె వేఱుగావు. ఆ పంచమహాభూతములును, ఆప్రాణి కోట్ల యొక్క సూక్ష్మశరీరములును, దానికిఁ గారణమగు అపంచీకృతభూత సూక్ష్మముల కంటె వేఱుగావు. ఆ భూతసూక్ష్మములుసయితము, పృథివీతత్త్వము జలతత్త్వముకంటె,జలతత్త్వ మగ్నితత్త్వముకంటె, అగ్నితత్త్వము వాయుతత్త్వముకంటె వాయుతత్త్వమాకాశతత్త్వముకంటె,వేఱుగావు. ఆకాశము త్రిగుణాత్మకమయిన మాయకంటె వేఱుగాదు. ఆమాయయును, తదుపహిత చైతన్యమగు నీశ్వరచైతన్యమును, ఆ రెంటికి అధిష్ఠానమగు శుద్ధ చైతన్యముకంటె వేఱుగావు. ఇట్లువిమర్శించి చూడఁగాఁ బ్రపంచము నిజమునకుబ్రహ్మము కంటె వేఱుగాదని నిశ్చయమయినది.

ఇంతవఱకువివరించిన యధ్యారోపాపవాద ప్రక్రియలవలన బ్రహ్మతత్త్వము నిరూపితమయినది. "అధ్యారోపాపవాదాభ్యాం నిష్ప్రపంచం ప్రపంచ్యతే" అను న్యాయము సిద్ధించినది. ఎటుచూచినను ఉన్న వస్తువు బ్రహ్మము. వేఱొకటి తదతిరిక్తములేదు. బ్రహ్మము నెఱిఁగిన యెడలసర్వము తెలిసినట్లే. కాఁబట్టి "కస్మిన్నుభగవో విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతంభవతి" అనిచేసిన శౌనకప్రశ్నసమంజసము.ప్రపంచముబ్రహ్మముకంటె వేఱుగాలేదు. ఈమాటనే బ్రహ్మసత్తకంటె జగత్తునకు పృథక్సత్తలేదని శాస్త్రరీతిగాఁ జెప్పుదురు. రజ్జుసర్పభ్రాంతి కలిగినచోట రజ్జుకంటె వేఱుగా సర్పములేదు. లేకపోయినను నున్నట్లు ప్రతీతి కలుగుచున్నది; భయకంపాదులును బుట్టుచున్నవి. కాఁబట్టి యాసర్పమసత్యమయినను,

కుండేటి కొమ్మున్నవలెగా లేదు. ఈప్రపంచమునయిత మారజ్జుసర్పముల తోఁపాటయి యున్నది. కేవల సత్యముగాదు. శశవిషాణ ప్రాయమును గాదు. కాన నారంభములో నుదాహరించినసంగ్రహశ్లోకములోఁ జెప్పినట్లు " జగన్మిథ్యా " జగత్తుమిథ్య.

మిథ్యాత్వము ను శాస్త్రములో మూఁడు విధములుగా నిర్వచించిరి. (౧) ' సదసద్విలక్షణత్వంమిథ్యాత్వం'

జగన్మిథ్యాత్వము

దీని తాత్పర్యము పైని జెప్పఁబడినది.(౨)'జ్ఞానైకనివర్త్యత్వం మిథ్యాత్వం'.రజ్జుజ్ఞానమువలన సర్పభ్రాంతినివృత్తియయినట్లు,అధిష్ఠాన బ్రహ్మపరోక్షజ్ఞానమువలనఁ బ్రపంచభ్రాంతినివృత్తి కలుగును. అన్యథా కలుగదు.కాన జగత్తు జ్ఞానైక నివర్త్యమయిన మిథ్యావస్తువు. (౩) " ప్రతిపన్నోపాధౌ త్రైకాలికనిషేధ ప్రతియోగిత్వం మిథ్యాత్వం '. ఆరోపిత సర్పమున కధిష్ఠానముగా నొప్పిన రజ్జువునందాసర్పము త్రికాలములలోను లేదు. అట్లె బ్రహ్మమందుఁ బ్రపంచములేదు. ఇది తృతీయ లక్షణముయొక్క పర్యవసానము. మిథ్యాత్వ విచారము శాస్త్రచర్చయని ఇంతటితో విరమింపఁబడినది. ప్రపంచము సత్యముకాదు. మిథ్యయనుటకు " నేహనానాస్తికించన ", " విద్వాన్నామ రూపాద్విముక్తః", " బ్రహ్మతం పరాదాద్యోన్యత్రాత్మనో బ్రహ్మవేద " మొదలగు శ్రుతుల ప్రమాణము నయితముగలదు. ఈదృశ్యమగు ప్రపంచముప్రపంచరూపముగా నిజముగాదు. బ్రహ్మ రూపముగా నిజము. భేదమంతయు మిథ్య. 'ఏకమేవా ద్వితీయమ్' సత్యము.

మాయ మొదలు బ్రహ్మాండాంతముగల జడ ప్రపంచమంతయు మిథ్యయనియు బ్రహ్మము కంటె వేఱుగాదనియు, తదధిష్ఠానమగు బ్రహ్మముమాత్రము సత్యమనియుఁ జెప్పఁబడినది. ఈ చెప్పిన జడప్రపంచము లోనికిఁ జేరని పదార్థమొకటిమాత్రము తెలిసికొన వలసినది నిలిచి యున్నది. ఏదియనఁగా జీవాత్మ. జీవాత్మ ఎవ్వరు? ఎట్టిది?

ఇందునకు "జీవోబ్రహ్మైవ నాపరః" అని పై సంగ్రహ శ్లోకములో నుత్తరము జెప్పఁబడెను. జీవుఁడు బ్రహ్మము.

జీవుఁడు
సాక్షాద్బ్రహ్మమే

బ్రహ్మముకంటె నతిరిక్తుడు కాఁడు;బ్రహ్మమునకునజాతీయుఁడు కాఁడు. సాక్షాద్బ్రహ్మము. ఈజీవబ్రహ్మైక్యము స్వరూపైక్యముగానిఅన్యథా కాదు.ఇదియేతత్త్వమస్యాది మహావాక్యార్థము. ఇదియే యఖండైకబోధ. ఇదియే నిఖిల సంసారోచ్ఛేదియు, మోక్షదాయియు నగు తత్త్వజ్ఞానము. దీని నిమిత్తమే, ఋష్యాదు లందఱు కర్మయోగము, భక్తియోగము, మొదలగు సాధనములనుచిరకాలమనుష్ఠించి, ఆ జ్ఞాన మనుభవమునకుఁ దెచ్చుకొని కృతార్థులైయిరి. కాఁబట్టి వేదాన్త శాస్త్రమునకు విషయము జీవబ్రహ్మైక్యమని పెద్దలు చెప్పిరి.

జీవేశ్వరభేదము

ఈశ్వరునివలె జీవుఁడు నయితమాపాధికుఁడు. పరమార్థ దశయం దుభయులు బ్రహ్మము; అయినను, వ్యవహారదశయం దుభయులకు విశేష తారతమ్యము గలదు. ఈశ్వరుఁడు సర్వజ్ఞుఁడు, సర్వనియంత, సర్వవ్యాపి. జీవుఁడు కించిజ్జ్ఞుఁడు, నియమ్యుఁడు, పరిచ్ఛిన్నుఁడు. ఈశ్వరునియం దావరణశక్తికిఁ బ్రచారము లేదు. జీవునియందుఁ బూర్తిగాఁగలదు. ఈశ్వరుఁడు, ఇంత సృష్టి సేయుచున్నను, అకర్త; జీవుఁడు కర్త. ఈశ్వరుఁడు, ఉపాస్యుఁడు. జీవుఁడు, ఉపాసకుఁడు. ఈశ్వరుఁడు,సర్వప్రాణులకువారివారి కర్మానుసారముగ ఫలము నిచ్చువాఁడు. జీవుఁడా ఫలమును బొందువాఁడు; కాన మంచి ఫలమును గోరునేని, అవ్యాజమయిన భక్తితో నీశ్వరు నారాధించి వాని యనుగ్రహమునకు పాత్రుఁడయి యట్టి ఫలమును వానివలనఁ బొంది కృతార్థుఁడు కానయియున్నాఁడు. ఈశ్వరుఁడు మాయను లోఁబఱచికొని,ఆత్మారాముఁడయి స్వమహిమయం దెల్లప్పుడు నున్నాఁడు. జీవుఁడు తాను నిత్యుఁడు,నిర్వికారుఁడు, సచ్చిదానంద స్వరూపుఁడగు బ్రహ్మమనుసంగతిని దెలిసికొనక, మఱచి, మాయావశుఁడయి, దేహాభిమానియయి, తాను కర్త భోక్త సుఖి,దుఃఖి, యని భ్రాంతిలోఁ జిక్కుకొని, బహ్వనర్థ పూరితమయియున్న యీ సంసారములో నల్లాడుచున్నాఁడు. కొందఱు వ్యవహార పరమార్థ దశల భేదమును గనిపెట్టక, జీవేశ్వరుల కభేదమను నెడల, ఈశ్వరుఁడు, తనకుతానే యట్టి సంసారమును ఏల సృజించెనని యాక్షేపించుదురు.

మాయ, అవిద్య

ఈ జీవేశ్వరుల తారతమ్య ముపాధికృత్యము. కొందఱు అద్వైతులు ఈశ్వరోపాధిని మాయయని, జీవోపాధిని నవిద్యయని వేఱుగా వ్యవహరించుచు, ఆ మాయావిద్యలను నిరూపించుటలో భేదించిరి. మూలప్రకృతిమాయ, దానియొక్క విక్షేపావరణాశక్త్యుపేతాంశము అవిద్యయని ఒకరు; శుద్ధసత్వప్రధానమయిన మూల ప్రకృతి మాయ, మలిన సత్వ ప్రధానమయిన మూలప్రకృతి అవిద్యయని ఒకరు; విక్షేపశక్తిప్రధానమయిన మూల ప్రకృతిమాయ, ఆవరణశక్తి ప్రధానమయినది అవిద్యయని మఱియొకరు వక్కాణించిరి. సర్వజ్ఞముని, మాయావిద్యాభేదము చేయక, ఈశ్వరోపాధి అవిద్యయనియు జీవోపాధి అంతఃకరణమనియుఁ జెప్పిరి. ఈ పయిని జెప్పిన వారందఱు, శుద్ధచైతన్యము ఆయా యుపాధులయందుఁ బ్రతి బింబించినదనియు ఆ ప్రతి బింబములు జీవేశ్వరులని నిర్ణయించిరి. వివరణ కారులు, మూలాజ్ఞానములో భేదము జేయక,దానినే అవిద్యయని జీవోపాధినిగాఁ జెప్పి, దానిలో ప్రతిబింబించు చైతన్యము జీవుఁడని అందుకు బింబభూతమయినచైతన్యము ఈశ్వరుఁడని నిశ్చయించిరి,

ఇంతవఱకు ప్రతి బింబపక్షము వారల మత ములు జూపింపఁబడినవి. వాచస్పతి మిశ్రులు, అంతః కరణావచ్ఛిన్న చైతన్యమును జీవుఁడనీ, తదనవచ్ఛిన్న చైతన్యమును ఈశ్వరుఁడని నిర్ణ యించిరి. ఈ చెప్పిన మతభేదములుగాక, సమిష్టి అజ్ఞానము ఈశ్వరోపాధియని, వ్యష్టి అజ్ఞానములు జీవోపాధులనిగూడఁ జెప్పుట గలదు. ఏ పక్షమయినను జీవేశ్వరుల తార తమ్యము ఉపాధి కృతమనియు, జీవుఁడు నికృష్టోపాధికుఁడనియు సర్వసమ్మతము. ఈ శ్వరుని ఒప్పిన ఈ పక్షములుగాక, ఈశ్వరుఁ డని వేరులేడు, బ్రహ్మ మవిద్యవలన జీవభావ మును బొంది ఈ ప్రపంచమును ఈశ్వరుని సహా కల్పనచేసికొని సుఖదుఃఖ సంసారాను భవమును బొందుచున్నదను పక్షముగూడ నొకటి కలదు.

అద్వైతులలో, ఈ మొదలగు అప్రధా నాంశములలో మత భేదములుగలవు. వారికి అద్వితీయ బ్రహ్మాత్మైక్యము ప్రధానాంశము. దానిని స్థాపింపఁ గలందులకు, కల్పితభేదసిద్ధ మయిన అనేక అప్రధానాంశములన్ను ఎత్తి సమాధానములు, సమన్వయములు చెప్పుకొని రావలసియుండె. ఆ చెప్పుటలో, ఎవరికి శిష్యబుద్ధికి ఎట్లు చెప్పిన పట్టునని తోచెనో, వారుఅట్లు వెళ్ళిరి. వారువారు వెళ్ళిన ప్రక్రియలలో భేదములవలన, ఆ మత భేద ములేర్పడెను. కాని, ప్రధానాంశములో వారలకు విప్రపత్తిలేదు.

జీవేశ్వరులభేదము ఉపాధికృతమయినట్లు, జీవులలో పరస్పరభేదము నయితము ఉపాధి కృతము గాని వాస్తవ ముకాదు. జీవులందఱు లోని ఆత్మ వాస్తవ

*జీవపరస్పరభేద ముపాధికృతము*

మునకు పరమాత్మ స్వరూపమయినపుడు, పర మాత్మ ఒక్కఁడే అయినందున, జీవులభేదము ఉపాధి భేదమువలన కలిగినదని ఒప్పితీరవల యును. ఉపాధి భేదమువలన సుఖదుఃఖాను భము ఎవరిది వారికి వేఱువేఱు అయినది. మరియు నేజీవుఁడు నాతని ఉపాధి సంబంధ మును తీసివేయఁ గలుగునో ఆతఁడు ముక్తుఁ డగుటయు, తదితరులు యథాపూర్వముగా బద్ధులయి యుండుటయు సంభవించుచున్నది.

జీవునియొక్క ఉపాధి, అనఁగా శరీరము, స్థూల సూక్ష్మ కారణ భేదములచే త్రివిధ ముగను, అన్నమయ ప్రాణమయమనోమయ విజ్ఞాన మయా నంద

*స్థూలసూక్ష్మ కారణ శరీర ములు, పంచకోశములు*

మయ కోశములచే పంచకోశాత్మకముగను ఉన్నది. స్థూలశరీరమందఱకు తెలిసినదే. జననమరణములు దీనివి. మాతా పితృల యొక్క శుక్లశోణితములవలన స్థూలశరీరము ఉత్పత్తి నొందుచున్నది. తుదకు మరణము కలిగి నశించునది ఈస్థూలశరీరము. ఇదియె పంచకోశ విచారములో అన్నమయకోశ మనఁబడును. సూక్ష్మశరీరమనఁగా త్వక్చక్షు శ్శ్రోత్ర జిహ్వాఘ్రాణము లనఁబడు పంచ

జ్ఞానేంద్రియములును, వాక్పాణి పాదపాయూపస్థలనఁబడు పంచకర్మేంద్రియములును ప్రాణాపానవ్యానోదానసమానము లనఁబడు పంచప్రాణములును,బుద్ధి, మనస్సు, ఈపదియేడును గలసిన సముదాయము. దీనికి లింగశరీరమని గూడఁ బేరుగలదు. కోశవిచారములో దీనిని, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశములని మూఁడు కోశములుగా విభజించిరి. పంచ ప్రాణములు పంచ కర్మేంద్రియములు గలసిన సముదాయము ప్రాణమయకోశము. పంచజ్ఞానేంద్రియములు మనస్సుకలసిన సముదాయము మనోమయకోశము. పంచ జ్ఞానేంద్రియములు బుద్ధిగలసిన సముదాయము విజ్ఞానమయకోశము. క్షుత్పిపాసలు, మూఁగ, కుంటి, గ్రుడ్డి, చెవుడు, కర్తృత్వభోక్తృత్వములు, మొదలగునవి ఈ లింగశరీర ధర్మములు. జీవునకు లోకాంతర గమనాగమనములు, ఈసూక్ష్మోపాధితోఁ గలుగుచున్నవి. లింగశరీరమునకు స్థూలశరీరసంబంధము గలుగుట జన్మము. ఆ సంబంధము వదలిపోవుట మరణము. మనకు ప్రతి జన్మమునందు గలుగు సర్వానుభవములు వాసనారూపముగా, అనఁగా సంస్కారరూపముగా, ఈలింగ శరీరములో లీనమయి యుండి ఆయాజన్మములతో నాయాప్రారబ్ధానుసారముగా బయలు వెడలును.

ఇంకఁ గారణశరీరమును జెప్పెద. అవిద్య యని అజ్ఞానమని చెప్పిన దే కారణశరీరము. 'నేను అజ్ఞుఁడను', 'ఇది నాకుఁదెలియదు' అని దేనిని గుఱించి అయినను తెలియదను వ్యవహారమ్ము. ఈకారణోపాధితో సంబంధించినది. ఈ ఉపాధిని ఆనందమ్మయ కోశమనెదరు. ఈ మూఁడు శరీరములు జడములు.

కారణ శరీరము

జీవాత్మ ఈమూఁటికి విలక్షణుఁడు, చిత్స్వరూపుఁడు. కాని అవిద్యవలన నతనికి ఆభావము తెలియకుండ జేయఁబడి, జీవభావము కలుగఁజేయఁబడినది. విలక్షణ స్థితినుంచి తొలగి ఈ త్రివిధోపాధులతో తాదాత్మ్యాభిమానమును పొందుటయె జీవభావమును పొందుట. తాదాత్మ్యాభిమానమనఁగా, ఆయా శరీరమునె ఆత్మగా గ్రహించుట; తానని యనుకొనుట. అది ఎట్లనిన, కారణశరీర తాదాత్మ్యాభిమానముచే 'నేనజ్ఞుఁడను' అని లింగశరీరతాదాత్మ్యాభిమానముచే 'నేను కుంటివాఁడను,గ్రుడ్డివాఁడను,కర్తను,భోక్తను, నాకు క్షుత్పిపాసలు కలుగుచున్నవి' అని, స్థూలశరీరముతో తాదాత్మ్యాభిమానముచే 'నేను పురుషుఁడను, బ్రాహ్మణుఁడను, నేనుమృతినొందుదును, నాకు కుమారుఁడు గలిగెను' అని, మొదలగు వ్యవహారములు గలుగుచున్నవి. ఈతాదాత్మ్యాభిమానమును భంగ్యంతరముగాఁ గనుపరచెద. ప్రతిజీవునకు,జాగ్రత్ స్వప్నసుషుప్తులని అందఱకు తెలిసిన మూఁడవస్థలు గలవు. వానిలో సుషుప్త్యవస్థలో జీవుఁడు కారణశరీర మాత్రాభిమానిగా నుండును. ఏమియుఁ దెలియకుండుటయె అజ్ఞా

నానుభవము. జీవుఁడప్పుడు, ఆ యనుభవ మును మాత్రము గలిగియుండును. కారణ శరీరమాత్రాభిమానియై యుండు జీవునకు ప్రాజ్ఞుఁడని పేరు గలదు. ప్రాజ్ఞునకు స్థూల సూక్ష్మశరీరాభిమానము లేదు. స్వప్నమునందు జీవుఁడు, ఆ మెట్టుదిగి సూక్ష్మ శరీరతాదాత్మ్యాభిమానమును గూడ పొంది యుండును. ఈ యవస్థలో జీవునకు స్థూల శరీరాభిమానములేదు. తద్విలక్షణుఁడయి, వాసనామయ ప్రపంచానుభవమును గలిగి యుండును. స్వప్నావస్థలోని జీవునకు తైజసుఁడని పేరు. జాగ్రదవస్థలో, మూఁడవమెట్టుకు దిగి సాధారణముగా స్థూలశరీరతాదాత్మ్యాభిమానముతో వ్యవహరించును. అప్పుడతనికి విశ్వుఁడని పేరు. ఈ మూఁడవస్థలయందు జీవునకు నిజస్వరూపము అజ్ఞానముచే నావృతమయియుండును. ఇవిగాక, ఆయావరణమును తోసివేసి ఈ శరీరత్రయము కంటె తాను విలక్షణుఁడయి తత్సాక్షిగానుండు అవస్థ, తురీయావస్థయని పేరు గలది మరియొకటి గలదు. అది, దాని పనిచేసిన వానికి మాత్రము గోచరముగాని అందఱకు గోచరముగాదు.

జీవునకువలె ఈశ్వరునకు సయితము, ఉపాధిత్రయమును చెప్పిరి. మాయ కారణోపాధి. సర్వజీవులయొక్క లింగశరీరముల సముదాయము ఆయన లింగశరీరము. సర్వస్థూల ప్రపంచము ఆయన స్థూలశరీరము. మాయోపాధికునకు ఈశ్వరుఁడని, సమష్టి లింగశరీరోపాధికునకు హిరణ్యగర్భుఁడు, సూత్రాత్మ, అని, సమష్టిస్థూలోపాధికునకు విరాట్టు అని ఆయా యుపాధులతోఁ జేర్చిన ఈశ్వరునకు జీవునకువలె వేఱువేఱు పేర్లు గలవు. బహు వృక్షములుగలసి వనమని, బహుజలములు గలసి జలాశయమని ఏకత్వ వ్యవహారమున్నట్లు నిఖిల శరీరములును గలసి సమష్టి సూక్ష్మ శరీరమనియు, నిఖిలస్థూల వ్యక్తులుగలసి సమష్టిస్థూలశరీరమనియు చెప్పినట్లు జీవుని కారణోపాధి వ్యష్ట్యజ్ఞానమని ఈశ్వరుని కారణోపాధియగు మాయ నిఖిలవ్యష్ట్యజ్ఞానములయొక్క సమష్టియని వ్యవహారము సమంజసము. అజ్ఞానమునకు గూఁడ సమష్టివ్యష్టివ్యవహారమును, కొందఱు ఒప్పిరి. కాని, జీవునకువలె ఈశ్వరున కుపాధిత్రయము ఉండినను ఈశ్వరునకుమాయావరణము లేనిహేతువుచే, ఆయన సర్వదా దేహత్రయ విలక్షణుఁడు, నిర్వికారుఁడు, స్వరూపనిష్ఠుఁడు, అయి యుండును. ఈ చెప్పిన దేహత్రయమునకు విలక్షణమయి యుండు జీవేశ్వరుల చైతన్యము ఒక్కటి. అది బ్రహ్మచైతన్యము. ఆస్వరూప చైతన్యైక్యమును బుచ్చుకొని అద్వైతులు జీవేశ్వరులకు నభేదమును జెప్పిరి. సర్వప్రాణుల యొక్క స్థూల సూక్ష్మ శరీరములు పాంచభౌతికములు. అవిమిథ్య. అవిగాక యుండు ప్రత్యగాత్మబ్రహ్మముకంటె అనతిరిక్తము.

ఈజీవ బ్రహ్మైక్యమును ఉపనిషత్తులును బహుగా బోధించినవి. ఈవిషయము శాంకర సూత్ర భాష్యమందు విపులముగా నిరూపింపఁబడినది. ద్వైతులు విశిష్టాద్వైతులు జీవ బ్రహ్మైక్యమును బోధించు శ్రుతులకు వేఱువేఱుగా నర్థమును జూపుటకు యత్నించిరి; కాని నిష్పక్షపాతబుద్ధితో విమర్శించువారెల్లరు, ఆశ్రుతుల కద్వైతులు చెప్పిన సమన్వయమే సరియని కనిపెట్టుదురు. ఆప్రకారము మాక్సుముల్లరు, తీబా, గఫ్, డ్యూసెన్ మొదలగు పెక్కుమంది పాశ్చాత్యులుగూడ నుడివిరి.

శ్రుతిసమన్వయము

ఇంతవఱకు నాదియందుఁజెప్పిన సంగ్రహశ్లోకార్థమును వివరించుచు, ఈప్రపంచమునందున్న తత్త్వము అద్వైతబ్రహ్మమాత్రమనియు, ఆ బ్రహ్మమందు ఈ ప్రపంచమంతయు మరుమరీచికవలెను (ఎండమావులు) రజ్జుసర్పమువలెను భాసిల్లుచున్నదనియు నిరూపించితిమి. ఇఁక నీజ్ఞానము ఎట్లుపురుషార్థమగునో చెప్పవలసియున్నది. పురుషార్థమునకుఁగాని జ్ఞానము నిరర్థకముగదా!

అద్వైత జ్ఞానము పరమార్థము

దేహాతిరిక్తాత్మను ఒప్పినవారందఱు ఇహలోకస్థితి ఎంతగొప్పదయినను నిరసనీయమనియు, ఈ జన్మము మెండనర్థములతో నిండియున్నదనియు, సుఖము ఆభాస, దుఃఖము ఎక్కువగాన నీజన్మము గర్హ్యమనియు, జీవాత్మకీజన్మాంతమందుఁబొందఁదగినఉత్తమస్థితి మోక్షమనునది ఒక్కటి గలదనియు, వివేకులయినవారు ఐహికమును నిరసించి ఆమోక్షమును సంపాదింప వలయుననియు నిశ్చయించిరి. ఇది సర్వమతస్థులు చెప్పు విషయమే కాని 'ఈజన్మములో దోషమేది? సర్వదుఃఖములకును సర్వానర్థములకును గారణమేది? దానిని నివృత్తిజేసికొని మోక్ష పదవినిబొందు మార్గమెట్లు?' అను దానిలో మాత్రము వారు వేఱువేఱుగా వెళ్లిరి.

రోగముయొక్క తత్త్వమును(నిదానము) సరిగాదెలిసికొనక చేయు ఔషధసేవ ఆరోగ్యమును నిర్మూలము జేయఁజాలనట్లు మనము ఈజన్మములోనిసర్వానర్థమూలము ఏదియో సరిగాదెలిసికొనక, తన్నివృత్తికొఱకుఁ జేయు ప్రయత్నములు పూర్ణఫలమగు మోక్షము నియ్యఁజాలవు. ఈ సంసారరోగ నిర్ధారణలో మతాచార్యులు తలయొకరీతిని వెళ్లి, వేఱువేఱుగా తన్నివృత్తినిజెప్పిరి. శొంఠి, పిప్పళ్లు, మిరియాలు, మొదలగు అనుపానములు అన్నివైద్యములకు ఆవశ్యకమే. అట్లు సదాచరణము, సత్కర్మానుష్ఠానము మొదలగునవి అందఱునొప్పినవే. కాని రోగనిరూపణలోఁగలిగిన అభిప్రాయ భేదములవలన మోక్షసిద్ధికి తలయొక ఔషధమును(ఉపాయము)జెప్పిరి.వారిలో నద్వైత మతాచార్యులగు శ్రీ శంకరులువారు, సర్వానర్థహేతువు

అధ్యాసయని, దానికి అజ్ఞానము కారణమని ఆత్మయాథార్థ్య జ్ఞానమువలన నా అజ్ఞానము నశించి, అధ్యాసవదలి, మోక్షము సిద్ధించునని నిశ్చయించిరి.

అధ్యాస

అధ్యాస యనఁగా "అతస్మిన్ తద్బుద్ధిః" అది కానిదానియందు అదియను జ్ఞానము. "పరత్ర పరావభాసః" అనిగూడఁ జెప్పిరి. "ఒకదానియందు మరియొకటి తోఁచుట". రెండు లక్షణములు ఒక్కటే. ఒకప్పుడు త్రాఁడును జూచి పాము అని భ్రాంతి గలుగుచున్నది; ఒక్క దీపము రెండు దీపములుగాఁ గనఁబడుచున్నది; తగరపుముక్క వెండిగాను క్రొయ్య మొద్దు మనుష్యుఁడుగాను దోఁచుచున్నవి. ఇవన్నియు అధ్యాసకు దృష్టాంతములు. సర్పముకాని రజ్జువు యందు సర్పబుద్ధి, ఒకటిగానున్న దీపమునందు సద్వితీయత్వబుద్ధి, రజతముగానితగరమునందు రజతబుద్ధి,పురుషుఁడుగాని స్థాణువునందు పురుషబుద్ధి గలిగినవి. పైఁజెప్పినలక్షణములువీనియందుఁబట్టినందున, ఇవి అధ్యాసలు. అధ్యాసలో దేనియందు అన్యబుద్ధి పుట్టునో దానినిఅధిష్ఠాన మనెదరు. సర్పాధ్యాసకు రజ్జువు,రజతాధ్యాసకు తగరము అధిష్ఠానములు. ఈ చోట్ల అధిష్ఠాన జ్ఞానము సరిగా ఉన్నయెడల అధ్యాస పుట్టదు. త్రాడని సరిగా తెలిసి ఉన్నయెడల పామని తోఁచదు. కాఁబట్టి అధిష్ఠానవిషయ కాజ్ఞానము అధ్యాసకు కారణము. చూడఁబడునదిరజ్జువయినను దాని తత్త్వజ్ఞానములేక సర్పభ్రాంతి కలుగుచున్నది.ఇట్లు అధ్యాసఅజ్ఞానజన్యము. అయినను దానివలన సుఖదుఃఖాదులుగలుగుచున్నవి. సర్పాధ్యాస, పురుషాధ్యాసలవలన భయ కంపాదులు గలుగుచున్నవి. రజతాధ్యాసవలన, సంతోషము గలుగుచున్నది. ఈ సుఖదుఃఖములు, అధిష్ఠాన తత్త్వజ్ఞానము కలిగినతోడనే, భ్రాంతిజన్యములని తెలిసి, మరలి పోవుచున్నవి. ఇదేప్రకారము మనకు కలుగు సర్వదుఃఖములు, సర్వసుఖములు, అధ్యాస జన్యములు. ఆత్మకాని దేహేంద్రియాదులయందాత్మబుద్ధి,తద్ధర్మముల యందు ఆత్మధర్మబుద్ధి, దేహసంబంధులయిన పుత్రులు మిత్రులు, భార్య, ధనము, గృహము, మొదలగు వానియందాత్మీయబుద్ధి, అనునవి అధ్యాసకుఁ గొన్నియుదాహరణములు. ఆత్మ సచ్చిదానంద రూపము, సర్వసాక్షి, అసంగము, అకర్త, అభోక్త, నిత్యము, నిర్వికారము, సర్వప్రాణులయందును సర్వత్ర నిండియున్న ఒక్కపదార్థము. బుద్ధి,మనస్సు, ఇంద్రియములు, ప్రాణములు, దేహము, ఈమొదలు సర్వ ప్రపంచము అనాత్మ ; ఇది జడము, మిథ్య, దుఃఖాత్మకము.

ఆత్మానాత్మలకు అన్యోన్యాధ్యాస

ఇట్లు ఆత్మానాత్మల విచక్షణ లేకపోవుట వలన, ఆత్మానాత్మలకు అన్యోన్యాధ్యాస యేర్పడి, ఒక దాని ధర్మములు ఒకదానివిగా నను కొనఁబడి, సర్వవ్యవహారములు జరుగుచున్నవి. 'అహం

మిదం'—'ఇది(దేహాదులు)నేను'-'మమేదం' ''ఇది (దారాపుత్రాదులు)నాది'' అనియనుకొనుటవలన అన్నివ్యవహారములు అన్నిసుఖదుఃఖాద్యనుభవములు కలుగుచున్నవి. ఆత్మ ఇట్టిదని పయినిజెప్పినట్లు తెలిసినపిదప, దాని యందు అనాత్మయొక్కగాని అనాత్మధర్మములయిన కర్తృత్వాదుల యొక్కగాని అధ్యాసయుండదు. అదేప్రకారము, అనాత్మయగు అంతఃకరణాదు లిట్టివని ఆత్మకంటె వేఱుగా తెలిసినపుడు, వానియందు ఆత్మాధ్యాసగాని వానితో సంబంధించిన దారాపుత్ర గేహాదులయందు ఆత్మీయబుద్ధిగాని ఉండదు. కాన, తాను యథార్థమునకు అంతఃకరణాదులకంటె విలక్షణుఁడు, అసంగుఁడు, సాక్షి, సచ్చిదానందుఁడని తెలిసికొనినవానికి దేహ గేహ దారా పుత్రాదుల యొక్క ఉపచయాపచయముల (వృద్ధిక్షయములు) వలన సుఖదుఃఖములు కలుగనేరవు. లోకములో సాధారణముగా 'మన' యను అభిమానములేనిచోట కలుగుహానివృద్ధులు, దుఃఖమును సంతోషమునుగలుగజేయవు. అదేప్రకారము, ఆత్మవేఱు, అంతఃకరణాదులువేఱని, మరియు అంతఃకరణాదులసత్యములని, అనుభవమునకు దెచ్చుకొన్నవారికి, దేహాదులతో సంబంధించిన హానివృద్ధులు స్వప్నమునందలి హానివృద్ధులవలెను, పరుల హాని వృద్ధులవలెను, ఎవ్విధముగ నంటవు, బాధించవు. ఆ వివేచనలేకనే ఈసంసారములోఁ జిక్కుపడి, త్రాడునుద్రొక్కి పామునుద్రొక్కితినని భ్రాంతిపడిన వాఁడు తత్తరిల్లిపడి నురుగులు గ్రక్కునట్లు, అల్లలాడుచున్నాఁడు. దీనికంతకు పయినిజెప్పిన అధ్యాస కారణము. ఈ అధ్యాస నివృత్తమయినయెడల సర్వానర్థములు తొలగిపోవును; తిరిగి జన్మముండదు.

దాని నివృత్తి ఎట్లనఁగా:—

అధ్యాస నివృత్తి

ఆ త్రాడు త్రొక్కిన భ్రాంతునకు తెలిసిన వాఁడు ఆత్రాడునెత్తి వానికి చూపించి అది త్రాడేయని నిశ్చయజ్ఞానమును గలుగఁజేసిన యెడల, వాని భ్రాంతివదలి, భయకంపాదు లణగి స్వస్థతకలుగును. అంతకంటె దానికి వేఱు మణిమంత్రౌషధములు లేవు. అదే ప్రకారము 'బ్రహ్మసత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవనాపరః' అని ఎఱుగని సంసారి జీవునకు బ్రహ్మాభిన్న ప్రత్యగాత్మ జ్ఞానమువలన అజ్ఞానము నశించి, దేహాదులయందు అధ్యాస వదలి, సర్వానర్థనివృత్తి యగును. పునర్జన్మము తప్పును. మోక్షము సిద్ధించును. బ్రహ్మభావమే మోక్షము. అంతకంటె వేఱు గాదు. బ్రహ్మజ్ఞానమువలన జీవభావము వదలి బ్రహ్మభావము కలుగును. ఇదియే 'జ్ఞానాదేవతు కైవల్యం' (జ్ఞానమువలననే కైవల్యము కలుగును) అని చెప్పఁబడిన అద్వైత సిద్ధాంతము. ఇట్లు తత్త్వజ్ఞానము పరమపురుషార్థ సాధకము.

బ్రహ్మజ్ఞానము గలిగినపిదప, ప్రారబ్ధశేష మువలన ఈ దేహముండినను, ఉండవచ్చును.

జీవన్ముక్తి

కాని అట్టి జ్ఞాని యొక్కదశ విలక్షణము. ఆ దశను జీవన్ముక్తావస్థయని చెప్పెదరు. జీవన్ముక్తునకు ఈ ప్రపంచమందు సత్యత్వబుద్ధి యుండదు. త్రాడు అని తెలిసినపిమ్మట సర్పమువలె తిరిగితోచినను, త్రాడను నిశ్చయము తొలఁగిపోదు. భయకంపాదులు పుట్టవు. అట్లు జీవన్ముక్తునకు ప్రపంచభావము ఆభాసగా నుండినను 'సర్వంఖల్విదం బ్రహ్మ' (ఇదంతయు బ్రహ్మ సుమా) అను నిశ్చయ జ్ఞానానుభవముబోదు. తిరిగిదుఃఖము అంటదు. ప్రారబ్ధశేషానుభవమయిన పిదప దేహత్యాగ మగును. పునర్జన్మములేదు. బ్రహ్మముతో నైక్యమునుబొందును. ఇదియే ముక్తి.

మరణ కాలమునకు ప్రతి జీవునకును, ఏదోయొక ధ్యాస పుట్టును. ఏదోయొకదాని

జ్ఞాని యంత్యకాలస్థితి

మీఁదికి బుద్ధి పోయి తీరును. ఆ చరమబుద్ధి ననుసరించి పైజన్మము వచ్చుననిసిద్ధాంతము. 'యంయంవాపి స్మరన్భావం త్యజత్యన్తే కళేబరం। తంతమేవైతి కౌన్తేయ సదాతద్భావ భావితః' (భగీ. ౮-౬) అను గీతావాక్యము గలదు. కాఁబట్టి సద్గతులుగోరువారు, తుదకు సద్వృత్తు లుద్బుద్ధములు కాఁగలందులకు, ఈజన్మము పొడుగునను సచ్చింతన, సదనుష్ఠానము జేయుచుందురు. అభ్యాస పాటవము వలన నట్లు చివర కాలమునకుజరుగును. యోగ సిద్ధి గలవారికిఁ దప్ప, అన్యులచరమవృత్తులు స్వాధీనముగా బయలు వెడలవు. ఏదోయొక వాసన ప్రబలమయి, వెడలి, తదను కూలమయిన భావిజన్మము నందుకొనును. ఆ విధముగా పునర్జన్మమును దానితో సంబంధించిన సర్వానర్థములును గలుగును. ఇట్లు జన్మపరంపరయేబంధము. కాఁబట్టి ఏవాసనలును చరమకాలమున కుద్బుద్ధములు గానియెడల అట్టివానికి పునర్జన్మ ముండదు. బంధనివృత్తి యగును. ఇట్లు జీవన్ముక్తునకు జ్ఞానికి సంభవించును. జీవబ్రహ్మైక్యసాక్షాత్కారము గలిగిన పిదప, ప్రపంచాను సంధానము వదలి ఆత్మాను సంధానము నిలుచును. అనాత్మచింతలు మరలిపోవును. అందువలన సర్వవాసనలు నశించును. వాఁడు హేయోపాదేయరహితుఁడయిన బ్రహ్మమయియుండును. అంతఃకరణతో తాదాత్మ్యమువదలి తత్సాక్షియయి విలక్షణుఁడుగా నుండును. అట్టి దృఢాభ్యాసము వలన, లింగశరీరము శైథిల్యమును బొందును. అగ్ని సాన్నిధ్యము వలన దాహకత్వశక్తి గలిగిన అయః పిండమునకు ఆపిండమును అగ్నిని విడదీసిన పిదప ఆశక్తి బోయినట్లు, చిత్సంబంధము వలన గత్యాగతులు చేయఁగల లింగశరీరమునకు, హృదయ గ్రంథివిభేదమయి, అనఁగా ఆత్మాంతఃకరణాదులకు అన్యోన్యాధ్యాసవదలి, అవివిడి, ఆత్మ సాక్షిభావములో నిలిచిపోయినప్పుడు,

ఈ దేహములోనుండి ఉత్క్రమణచేసి గత్యాగతులు చేయఁగలశక్తి నశించును. అంతట రేణువును, రేణువును కలిపియుంచెడు జిగురు (cohesion) పోయిన మృత్పిండములోని రేణువులు దేనికది విడిరాలిపోవునట్లు, లింగశరీరావయవములగు అంతఃకరణాదులు సంక్షీభావమునువదలి విడిపోయి వానివానికారణములగు పంచభూతములలో లయించును. దీనినే "నతస్యప్రాణా ఉత్క్రామంతి అత్రైవ సమవనీయంతే" అను శ్రుతి చెప్పుచున్నది. ఇట్లు జ్ఞానికి పునర్జన్మము రాక మోక్షము లభించును.

బ్రహ్మానుభవము చిక్కనివానికి, లింగశరీరోత్క్రమణ మున్నది, పునర్జన్మముతప్పదు.

వేఱు వేఱు వారికి వేర్వేఱు లోకములు, గతులు

కాని ఆ జన్మములలో పూర్వకర్మానుసారముగా తారతమ్యములుగలవు. అట్టివారికి మూఁడు విధముల గతులు జెప్పఁబడినవి. శ్రుతిచోదితమయిన కొన్ని ఉపాసనలు చేసినవారు సూర్యమండలముద్వారా బ్రహ్మలోకమును బొందుదురు. వారలు తిరిగి వెనుకకు వచ్చుటలేదు. ఆ లోకములోనే, అక్కడజ్ఞానమును బొందినవారయి, ఆ లోకాధిపతియగు చతుర్ముఖబ్రహ్మతో సహా ముక్తిని బొందుదురు. ఈ బ్రహ్మలోకమునకువెళ్లు మార్గమునకు అర్చిరాది మార్గమనిపేరు. ఆయుపాసనలు గాక యాగాది కర్మలు జేసినవారు ధూమాది మార్గముల ద్వారా చంద్రలోక పర్యంతము వెళ్లి ఫలోన్ముఖమయియుండు సుకృతమునకు అనురూపంబగు సుఖమును ఆయా లోకములలో ననుభవించి, పిమ్మట తిరిగి ఈ లోకములో జన్మించుదురు. ఈ రెండు మార్గములను వెళ్లుటకు యోగ్యత సంపాదించనివారు "జాయస్వ మ్రియస్వ"— పుట్టను చావను తరగతిలోఁ జేరుదురు. పాపాధిక్యమువలన నరకానుభవముగూడ నుండును.

కాఁబట్టి అన్ని తరగతుల కంటె తిరిగి జన్మములేనిస్థితి సర్వోత్కృష్టము. అది జ్ఞానైకసాధ్యము.

పరోక్షజ్ఞానము అపరోక్షజ్ఞానము

ఆ జ్ఞానము అనఁగా బ్రహ్మజ్ఞానము రెండు విధములు. పరోక్షము, అపరోక్షము. గ్రంథములవలన, ఇతరులు చెప్పిన దానివలన 'జీవుఁడు బ్రహ్మమొకటిగాని వేఱుగాదు' అని తెలియవచ్చుచున్న జ్ఞానము పరోక్షజ్ఞానము. ఇదిగాక, అధ్యాసనువదలి, జీవభావమును విడచి, శరీరత్రయసాక్షియయి అఖండైకరసబ్రహ్మాత్మానుభవమును బొందినవాని యనుభవము అపరోక్ష జ్ఞానము. కేవల పరోక్ష జ్ఞానము బంధనివృత్తిని జేయఁజాలదు. మోక్షసిద్ధికి అపరోక్షజ్ఞాన మావశ్యకము. చీకటిలోఁ గూర్చుని దీపవార్త లెన్ని జెప్పినను తమోనివృత్తిగాదు. దీపము తెచ్చినపిదప యగును. అటువలె, పరోక్షాపరోక్ష జ్ఞానములయొక్క కార్యకారిత్వమును దెలిసి కొనవలయును.

పరోక్షజ్ఞాన మీజన్మమందు పూర్ణఫలము నీయఁజాలక పోయినను అద్వైతవాసనలను గలుగఁజేసి, ఉత్తర జన్మములయందు క్రమముగా అభివృద్ధిఁబొంది తత్త్వజ్ఞానోదయమునకు హేతువగును.

అట్లయిన నా యపరోక్ష జ్ఞానమెట్లు గలుగును? చిత్తశుద్ధి లేనివానికి ఆజ్ఞానముకలుగనేరదు.

అపరోక్ష జ్ఞానము కలుగు సాధనములు

అంతఃకరణయందు రజోగుణమును తమోగుణమును తగ్గించి, సత్త్వగుణమును వృద్ధిఁజేయుటయే చిత్తమును శుద్ధిజేయుట. ఫలాభిసంధినివదలి చేయు. సత్కర్మలవలన, యోగాభ్యాసము వలన, సత్త్వగుణము వృద్ధిపొందును. వేదోక్త కర్మలు, ఈశ్వరోపాసనలు, ధర్మాచరణములు మొదలగునవి కర్మలనఁబడును. వీనినన్నిటికి చిత్తశుద్ధి పరమప్రయోజనము. కర్మకాండమంతయు, ఇవ్విధముగా జ్ఞానోపయోగి. ఉపాసనల వలన చిత్తైకాగ్ర్యము కుదురును. ఇవన్నియు బహిరంగ సాధనములు. ఇవిగాక, సాధన చతుష్టయమనఁబడు అంతరంగసాధనములు గలవు. అవి, ఏవియనఁగా ౧ నిత్యానిత్య వస్తువివేకము, ౨ ఇహాముత్రార్థ ఫలభోగవైరాగ్యము, 3 శమాది షట్కసంపత్తు, ౪ ముముక్షుత్వము. ఆత్మ నిత్యము, తదతిరిక్త మంతయు అనిత్యము అని వివేచన గలుగవలెను. అందువలన, మనలను విశేషముగా మోహింపఁజేయునవన్నియు - స్వర్గాది పరలోక భోగములు సయితము-అనిత్యములని నిశ్చయము కుదిరి, వానినన్నిటియందు వైరాగ్యము గలుగును. మనస్సునకు నిర్వేదము కలుగును. అందువలన బుద్ధి విషయములమీఁదికి ప్రసరించుట మానివేయును. శమాది షట్కమనఁగా, శమము, దమము, ఉపరతి, తితిక్షా, సమాధానము, శ్రద్ధా. అంతరింద్రియనిగ్రహము శమము. బహిరింద్రియనిగ్రహము దమము. ఉపరతియనఁగా కొందఱు సన్న్యాసమనిచెప్పిరి. కొందఱు సర్వేంద్రియములు విషయముల మీఁదికి పోకుండ నాగిపోవుటయని చెప్పిరి. శీతోష్ణాదులనుసహించుటతితిక్ష. విషయములనుంచి పరావృత్తమయిన మనస్సును వేదాన్తశ్రవణాదులయందు నిలుపుట, సమాధానము. శాస్త్రమునందు,(గురువులు జెప్పు దానియందు) విశ్వాసము, శ్రద్ధ. జననమరణ ప్రవాహరూపమయి బహువిధ దుఃఖ సంకలితమయి, పయికి మేడిపండువలె నుండు ఈసంసారమును తప్పించుకొని మోక్షమునుపొందవలెనను ఇచ్ఛ ముముక్షుత్వము. ఈ జన్మమందు గాని పూర్వజన్మములయందుగాని క్రమముగా కర్మాదుల ననుష్ఠించి పైఁజెప్పిన సాధనచతుష్టయ సంపత్తిని సంపాదించిన పుణ్యాత్మునకు తత్త్వజ్ఞానము కరతలామలకప్రాయము. అతఁడే బ్రహ్మవిద్యకు ముఖ్యాధికారి.

అట్టివాఁడు తత్త్వజ్ఞానము కలిగి కృతార్థుఁడయియుండు గురుసన్నిధికిం జేరి, వినీతుఁడయి,

సాధన సంపత్తు కలవాఁడు బ్రహ్మవిద్యాధికారి

ప్రార్థించి, కావలెననిగురువువల్ల ఉపదేశ మును బొంది, గురూపదిష్టమార్గము నాశ్రయించి, తాను ప్రత్యగభిన్న సచ్చిదానంద సమరస బ్రహ్మమని తెలిసికొని, అనుభవమును బొంది, పునర్జన్మ రహితుఁడయి, బ్రహ్మకైవల్యమును బొందును. పైని జెప్పిన సాధనలన్నియు పూర్తిగా, ఏకజన్మలభ్యములు గాకపోవచ్చును. అనేక జన్మములమీఁద సమకూడినను తుదకు మోక్షరూప ఫలముండును. కాన ఒక్కొక్కజన్మములో వీలయినంతవఱకు సాధింపవలయును. "నహి కల్యాణ కృత్ కశ్చిత్ దుర్గతిం తాతగచ్ఛతి" (నాయనా! కల్యాణకరములయిన కర్మములఁ జేసిన వాఁడెప్పటికిని దుర్గతికింబోఁడు.) అను గీతావాక్యమును (౬.౪౦) ప్రమాణముగఁ జేసికొని, ప్రతి మనుజుఁడు ప్రవర్తింప వలయును.

పైఁజెప్పిన యధికారికి*"ఆత్మావారే ద్రష్టవ్యశ్శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యః" (బృహదారణ్యకోపనిషత్తు ౨-౪-౫.) అని, ఆత్మ సాక్షాత్కారార్థమయి శ్రవణాదులు చెప్పఁబడినవి. శ్రవణమనఁగా, ఉపక్రమోపసంహారాది నిబంధనలను,న్యాయములను అనుసరించి, ఉపనిషదర్థ విచారము జేయుట. ఆ విచారమువలన, ప్రత్యగభిన్నాద్వితీయ పరమాత్మయందు సర్వోపనిషత్తులకు తాత్పర్యమని స్పష్టపడఁగలదు. మనన మనఁగా, ఆ విచారమువలన తేలిన భావమును, యుక్తులతో సయుక్తము నిశ్చయించి, ఎల్లప్పుడు అనుచింతనము జేయుట. నిదిధ్యాసనమును రెండు విధములుగాఁ జెప్పిరి. నిదిధ్యాసనమనఁగా, శ్రవణ మనన పరిపాకము వలనఁగలుగు జ్ఞానమని కొందఱును ధ్యానమని మరికొందఱును నుడివిరి. జ్ఞానమనిన వారి అభిప్రాయములో బ్రహ్మ సాక్షాత్కారమునకు శ్రవణ మననములు జాలును; అనఁగా ధ్యానరూపమయిన యోగము అనావశ్యకము. రెండవవారి యభిప్రాయములో ధ్యాన మావశ్యకము. ధ్యానమనఁగా విజాతీయ మగు దేహాది ప్రత్యయములు మధ్యమధ్య రాకుండ, తైలధారవలెనుండు సజాతీయాద్వితీయపరమాత్మ ప్రత్యయ ప్రవాహము. ఇది సమాధిలోనికిఁ జేరును. నూటికి కోటికి ఒకరుగా నుండు ఉత్తమాధికారికి ధ్యాన మనావశ్యకమయినను, సామాన్యులందఱకు ధ్యానముగూడనవసరము. అనేక జన్మముల నుంచి విషయాభిముఖముగ పరుగెత్తు స్వభావ మేర్పడియున్న చిత్తవృత్తికి, యోగసాహాయ్యము ధ్యానములేనిది,ఆప్రవాహము కట్టుఁబడి, ఆత్మాభిముఖమగు స్వభావ మేర్పడఁ జాలదు.

సమాధి సవికల్పము, నిర్వికల్పము అని రెండు విధములు. సవికల్పములో, జ్ఞాతృ జ్ఞానాదిలయముగాకుండ, చిత్తవృత్తి అద్వితీ

* ఆత్మను వినవలెను, ఆలోచింపవలెను, ధ్యానింపవలెను.

యాత్మ వస్తువునందు తదాకారాకారిత మయి నిలిచి, యుం డును; ద్వైతభావము ఆభాసగ నుండినను, అద్వైత వస్తువు భాసిల్లును. నిర్వికల్ప సమాధియందు జ్ఞాతృజ్ఞానాది వికల్పములు సయితము లయము నొంది, అద్వితీయాత్మ వస్తువునందు తదాకారాకారితమయిన చిత్తవృత్తి పూర్తిగా లీనమయి కలసియుం డును. ఇది సుషుప్తిగాదు. సుషుప్తిలో అంతః కరణ వృత్తిలేదు. నిర్వికల్ప సమాధిలో నున్నది; ఆసమాధిలో చిత్తము; నివాత ప్రదేశమునందలి దీపమువలె, అఖండ చైతన్య మాత్రముగా నిలిచిపోవును. అద్వైత సచ్చిదానందాత్మానుభవము గలుగును.

సమాది సంకల్పము, నిర్వికల్పము

నిర్వికల్ప సమాధికి, యమ, నియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధారణాధ్యాన సమాధులని ఎనిమిది అంగములు గలవు. వీని విచారము "యోగము" క్రిందఁ జూడ వలయును.

శ్రవణమననజనిత జ్ఞానమువలనను సమాధ్యభ్యాసమువలనను అద్వితీయాత్మానుభవ ము దృఢమయి అపరోక్షజ్ఞానము గలిగి మోక్షముసిద్ధించును. సర్వకర్మలకు సర్వోపాసనలకు, సర్వసాధనములకు, మోక్ష మందు పరిసమాప్తి. ఆ మోక్షపదవి తుదకు ఆత్మజ్ఞానమువలన కలుగునదయినను ఆ జ్ఞానము కలుగుటకు తగుయోగ్యత వచ్చువఱకు అనేకమెట్లు ఎక్కవలసియున్నది. ఎమ్. ఏ. మొదలగు ఉత్తమపరీక్షలలో నుత్తీర్ణుఁడు కాఁగలందులకు కొన్ని నియతగ్రంథములు మాత్రము జదువవలసియున్నను ఆగ్రంథములు తెలిసికొను యోగ్యత వచ్చుటకు అనేక సంవత్సరములు పూర్వము విద్యాభ్యాస మవశ్యమయి యున్నది. అట్లు బ్రహ్మజ్ఞానమునకు సయితము బహుగా పూర్వప్రయత్నము లవశ్యకములు. ఆధునికులు కొందఱు, ఆత్మ పుణ్యాపాపములు లేనివాఁడు, అసంగుఁడు, సుఖదుఃఖములెవ్వియు నంటనివాఁడు, ఈ మొదలగు నాలుగు మాటలు విని యోచదివియో, అంతటితో తత్త్వజ్ఞానము కలిగినదని, కృతార్థులమని సంతోషించి, కర్మోపాసనాదులను నిరసించి వదలివేసి, యథేష్ఠముగాఁ బ్రవర్తించుచున్నారు. ఇది తప్పు. అద్వైతశాస్త్రమిట్లు చెప్పియుండలేదు. అందఱు మనుష్యు లేకరీతిగా ప్రజ్ఞావంతులుగారు. ఏకరీతిగా చిత్తశుద్ధి గలవారునుగారు. వారివారి అధికారములకు తగినతరగతులు మార్గములు వేఱువేఱుగాఁ జెప్పఁబడియున్నవి. కర్మ కధికారులు కొందఱు; భక్తికి కొందఱు; మంత్రోపాసనలకు మరి కొందఱు; ధర్మకార్యములకు కొందఱు; ఎందుకు కానివారు—"జాయస్వ మ్రియస్వ" తరగతిలోఁ జేరువారు కొందఱు, ఇట్లు గలరు.

జ్ఞానమునకు మెట్లు

లోకములో వైచిత్ర్యము (Diversity) మెండు. పూర్వ జన్మములనుంచి వచ్చుచున్న వాసనా భేదములవలన, సత్వరజస్తమోగుణములయొక్క పాళ్లలో వ్యత్యాసములవలన, అంతఃకరణలు నానావిధములు. బుద్ధులలో భేదములవలన కొందఱకు గణిత శాస్త్రమందును, కొందఱకు భాషలయందును, కొందఱకు శిల్పశాస్త్రమునందును, మరికొందఱకు భౌతిక శాస్త్రమునందును, ప్రవేశము హెచ్చుగానుండి వానిలో దేని నభ్యసించినను, సరియైన శిక్షపట్టఁబడినయెడల, తుదకందఱకు బుద్ధివికాస వైదుష్యములు (Culture) ఏకముగానుండునట్లు, పరమార్థకాములలో నయితము కొందఱకు కర్మలయందు, కొందఱకు భక్తియందు, మరికొందఱకు మంత్రోపాసనాదులయందు, ఇట్లు పలువిధముల అభిరుచిగలిగి, అవి వారలకు పట్టును. అధికార తారతమ్యమును రుచి తారతమ్యమును బుచ్చుకొని బహుమార్గములు జూపఁబడినవి. వానిలో దేనినిగాని నిరసింపఁగూడదు. ఏ యొక్కమార్గమునయినను భక్తివిశ్వాసములతో నవలంబించి దానికిఁ జెప్పినట్లు సక్రమముగా నభ్యసించినయెడల అది చెప్పినఫలము నియ్యకపోదు. దేనికయినను భక్తివిశ్వాసములు ప్రధానములు. ఏపేరుతోనైనను, అవ్యాజముగా భగవంతునియందు భక్తినిగలిగి పాటు పడువాఁడు తప్పక నెప్పటికయినను, అనఁగా నేజన్మమునకయినను, జ్ఞానమార్గమునకువచ్చిచేరి కృతార్థుఁడగును. ఇట్లు అద్వైతమునకు సర్వమతములు, సర్వసాధనములు, వివిధపూజలు, సమ్మతము. (జ౹౦ గా.)

అధికారుల తారతమ్యము

## అద్వైతగ్రంథావళి

[అద్వైతమునకు సంబంధించిన గ్రంథములు సంస్కృతమునందును, ఆంధ్రమునందును వేనవేలుగలవు. అట్టి గ్రంథముల నామములన్నియు నిచట నిచ్చుట మాయుద్దేశము కాదు. ఆయాసంప్రదాయములందు విశేషముగా వాడఁబడు గ్రంథములును, సంస్కృతాంధ్ర భాషలయందుఁ గొంతఁ బేరుం బ్రతిష్ఠఁగన్న గ్రంథములును, ఈ విషయము నభ్యసింపఁగోరువారి కుపయోగకరములుగనుండు గ్రంథములును మాత్ర మిందుఁ జేర్పఁబడును. ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, గీత మొదలగునవి ద్వైతాద్వైత విశిష్టాద్వైతాది మతముల వారందఱు నొప్పినవి గనుక వానిని ఏమతము క్రిందను ప్రత్యేకముగా నుదాహరింపలేదు. ఆయా మతములను గురించి విడిగా వ్రాయఁబడిన గ్రంథములే ఉదాహరింపఁబడును.]

### సంస్కృతము



| గ్రంథము | |
|---|---|
| మాండూక్యోపనిషద్ కారికలు | గౌడపాదాచార్యుఁడు |
| ఉత్తర గీతాభాష్యము | ,, |
| సూత్ర భాష్యము | శంకరాచార్యుఁడు |
| గీతాభాష్యము | ,, |
| అపరోక్షానుభూతి | ,, |
| ఉపనిషద్భాష్యము * | ,, |

* ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండ, మాండూక్య, తైత్తిరీయ, ఐతరేయ, ఛాందోగ్య, బృహదారణ్యకములనెడి పదియుపనిషత్తుల మీఁదను శంకరుని భాష్యములుగలవు. శ్వేతాశ్వతరోపనిషత్తుమీఁదఁగూడ నొకభాష్యము కలదు. కాని వానికర్తృత్వమును గురించి పండితులు భిన్నాభిప్రాయులు.

| గ్రంథము | కర్త |
|---|---|
| రత్నప్రభ (సూత్ర భాష్య టీక) | రామానందుఁడు |
| న్యాయనిర్ణయము (శీ. భా. టీ.) | ఆనందగిరి |
| కల్పలత (సూ. భా. టీ.) | మధుసూదన సరస్వతి |
| పంచపాదిక (సూ. భా. టీ.) | పద్మపాదాచార్యుఁడు |
| భామతి (సూ. భా. టీ.) | వాచస్పతి మిశ్రుఁడు |
| గీతాభాష్యవివేచనము | ఆనందగిరి |
| శంకరభాష్యమునకు టీక | శంకరానందుఁడు |
| ,, | మధుసూదనుఁడు |
| ,, | శ్రీధరుఁడు |
| తైత్తిరీయోపనిషద్ వార్తికము | సురేశ్వరాచార్యుఁడు |
| బృహదారణ్యకోపనిషద్వార్తికము | ,, |
| అద్వైతసిద్ధి | మధుసూదన సరస్వతి |
| ఖండన ఖండకాద్యము | శ్రీహర్ష మహాకవి |
| అద్వైత బ్రహ్మసిద్ధి | సదానందయతి |
| గౌడబ్రహ్మానందీయము | బ్రహ్మానందుఁడు |
| వేదాంత పరిభాష | ధర్మరాజాధ్వరి |
| సిద్ధాంత లేశ సంగ్రహము | అప్పయ్యదీక్షితులు |
| సిద్ధాంత బిందువు | మధుసూదన సరస్వతి |
| నైష్కర్మ్యసిద్ధి | సురేశ్వరాచార్యుఁడు |
| బ్రహ్మసిద్ధి | ,, |
| సంక్షేప శారీరకము | సర్వజ్ఞాత్మాచార్యులు |
| పంచదశి | విద్యారణ్యుఁడు |
| జీవన్ముక్తివివేకము | ,, |
| అనుభూతి ప్రకాశము | ,, |
| వేదాంతసారము | సదానందయోగి |
| వాసుదేవ మననము | వాసుదేవయతి |
| అద్వైతామృతము | జగన్నాథకవి |
| భేదధిక్కారము | నృసింహాశ్రమి |
| వేదాంత సిద్ధాంతముక్తావళి | ప్రకాశానందుఁడు |
| మహావాక్యదర్పణము | భారతీ తీర్థుఁడు |
| మహావాక్యరత్నావళి | ,, |
| ప్రబోధ చంద్రోదయము | కృష్ణ మిశ్రుఁడు |
| అద్వైతకల్పధేనువు | ఉమామహేశ్వరుఁడు |
| అద్వైత కౌస్తుభము | భట్టోజీదీక్షితుఁడు |
| ,, | మహాదేవ సరస్వతి |
| అద్వైతరత్న రక్షణము | మధుసూదన సరస్వతి |
| అద్వైత రత్నకోశము | అఖండానందుఁడు |

## అంధ్రము

| గ్రంథము | కర్త |
|---|---|
| శంకర సూత్ర భాష్యము | దివాన్ బహదుర్ జగన్నాథరావుగారు |
| శాంకరగీతాభాష్యము | బాలసుబ్రహ్మణ్యస్వామి |
| పంచదశి | ... |
| వాశిష్ట రామాయణము | మడికి సింగన్నకవి |
| ,, | వేంకటరంగన్నకవి |
| సీతారామాంజనేయము | పరశురామ పంతులు లింగమూర్తి |
| రాజయోగసారము | తరిగొండ వేంకమాంబ |
| వాసుదేవమననము | ... |
| కైవల్యనవనీతము | కనుపర్తి వేంకటరామ విద్యానందనాథులు |
| విచారచంద్రోదయము | జనార్దన చైతన్యస్వామి |
| విచారసాగరము | ఓ. వై. దొరస్వామయ్య |
| వృత్తిప్రభాకరము | వా. పట్టాభిరామయ్యశర్మ |
| ప్రబోధచంద్రోదయము | వడ్డాది సుబ్బరాయకవి, కం. విరేశలింగకవి |
| జ్ఞానవాసిష్టము | ముదిగొండ నాగలింగ శాస్త్రి |
| బ్రహ్మానంద ప్రకాశిక | పాప్పాక వేంకటరామయ్య |
| భగవద్గీతా భాష్యము (శంకర, రామానుజ, మధ్వాది భాష్యములకు తెలుగు) | చదలవాడ సుందరరామ శాస్త్రిగారు. |

## ౨. విశిష్టాద్వైతము *

(శ్రీ రామానుజాచార్యుల వారి మతానుసారము)

శ్రీమద్రామానుజాచార్యులవారి మతము కూడ అద్వైతమే కాని యది యొక విధమైన అద్వైతము. విశేషణ యుక్తమైన యద్వైతముగాన విశిష్టాద్వైత మనఁబడును. ఈ మతప్రకారము పరబ్రహ్మము విశేషణ యుక్తము. అనఁగా గుణములు కలది.

బ్రహ్మము సగుణము, నిర్గుణము కాదు

శంకరాచార్యులవారి మతానుసారము బ్రహ్మము నిర్గుణము, నిర్విశేషము, జ్ఞానరూపము. రామానుజాచార్యులవారి మతమున బ్రహ్మము, సగుణము, సవిశేషము, జ్ఞాత. శంకరుని బ్రహ్మము గుణరహితము. రామానుజుని బ్రహ్మము అనంతగుణకల్యాణయుక్తము. ఆతఁడే గరుడ వాహనుఁడు, లక్ష్మీపతి, శ్రీమహావిష్ణువు.

శంకరుని బ్రహ్మము స్త్రీ పున్నపుంసకము కాదు; రామానుజుని బ్రహ్మము మగవాఁడు.

ఏవస్తువైనను, జ్ఞానవిషయము కావలయునన్న సవిశేషము అనఁగా గుణయుక్తముగ (కొన్ని ధర్మములు కలదిగ) నుండవలయును. అట్లులేక గుణశూన్యమైన వస్తువును ఇంద్రియములుగాని మనస్సుగాని గ్రహించుటెట్లు? గుణశూన్యమైన వస్తువున్నదనిగూడ మనము తెలిసికొనఁజాలము. రూపగంధాది విరహితమైనందున నది ప్రత్యక్ష ప్రమాణమునకు లోఁబడదు. అనుమానాదికములు ప్రత్యక్షమునకు సంబన్ధించినవి గనుక వానికిని లోఁబడదు. ఇట్లు సర్వప్రమాణములును సవిశేషవస్తువులే విషయములుగ గలవిగనుక ప్రమాణశూన్యమైన నిర్గుణబ్రహ్మమున్నదని ఎవ్వరును చెప్పఁజాలరు.

నిర్గుణ బ్రహ్మము ప్రమాణసిద్ధముగాక పోయినను ఆత్మానుభవముచే నెఱుంగఁబడునని చెప్పెదరేమో. ఆత్మానుభవమైనను సవిశేషముగ నుండినఁ గాని అది జ్ఞానము కాఁజాలదు. నేనొకపదార్థము నెఱింగితి ననఁ నేమి యర్థము? దానిగుణధర్మముల నిదమిత్థమని తెలిసికొంటిననిగదా! గుణధర్మములు లేని బ్రహ్మము నెఱుంగుట యెట్లు? 'బ్రహ్మ మెఱింగితిని' అనిన తోడనే బ్రహ్మము సగుణమయ్యె!

భాష యంతయు సవిశేషకజ్ఞానమునే యిచ్చునుగాని నిర్విశేషజ్ఞానము నీయఁజాలదు.

* విశిష్టాద్వైతము రెండువిధములు. శైవ విశిష్టాద్వైతము, వైష్ణవ విశిష్టాద్వైతము. మొదటి దానికి శ్రీకంఠ శివాచార్యునిచే రచింపఁబడిన బ్రహ్మసూత్రభాష్యము ప్రమాణము. రెండవ దానికి రామానుజాచార్యకృత భాష్యాదులు ప్రమాణములు. శ్రీకంఠుఁడు శంకరాచార్యునకు సమకాలీనుండని శంకరదిగ్విజయము వలనఁ దెలియవచ్చుచున్నది. ఈరెండు విధముల విశిష్టాద్వైతములలో శ్రీరామానుజునిది విశేషవ్యాప్తిగలదియు, విశేషవాఙ్మయము గలదియు నగుటచే నిచ్చట నీయఁబడుచున్నది. ఈ రెంటికిని తత్త్వమందు భేదము లేదు. కాని పరబ్రహ్మము 'గ్రద్దనెక్కిన వాఁడా?' 'ఎద్దు నెక్కినవాఁడా?' యన్న విషయమునమాత్రము వీరుభయులును హోరాహోరిగఁ బోరాడుచుందురు.

## ౨. విశిష్టాద్వైతము *

(శ్రీ రామానుజాచార్యుల వారి మతానుసారము)

శ్రీమద్రామానుజాచార్యులవారి మతము కూడ అద్వైతమే కాని యది యొక విధమైన అద్వైతము. విశేషణ యుక్తమైన యద్వైతముగాన విశిష్టాద్వైత మనఁబడును. ఈ మతప్రకారము పరబ్రహ్మము విశేషణ యుక్తము. అనఁగా గుణములు కలది.

శంకరాచార్యులవారి మతానుసారము బ్రహ్మము నిర్గుణము, నిర్విశేషము, జ్ఞానరూపము. రామానుజాచార్యులవారి మతమున బ్రహ్మము, సగుణము, సవిశేషము, జ్ఞాత. శంకరుని బ్రహ్మము గుణరహితము. రామానుజుని బ్రహ్మము అనంతగుణకల్యాణయుక్తము. ఆతఁడే గరుడవాహనుఁడు, లక్ష్మీపతి, శ్రీమహావిష్ణువు.

బ్రహ్మము సగుణము, నిర్గుణము కాదు

శంకరుని బ్రహ్మము స్త్రీ పున్నపుంసకము కాదు; రామానుజుని బ్రహ్మము మగవాఁడు.

ఏవస్తువైనను, జ్ఞానవిషయము కావలయునన్న సవిశేషము అనఁగా గుణయుక్తముగ (కొన్నిధర్మములు కలదిగ) నుండవలయును. అట్లులేక గుణశూన్యమైన వస్తువును ఇంద్రియములుగాని మనస్సుగాని గ్రహించుటెట్లు? గుణశూన్యమైన వస్తువున్నదనిగూడ మనము తెలిసికొనఁజాలము. రూపగంధాది విరహితమైనందున నది ప్రత్యక్ష ప్రమాణమునకు లోఁబడదు. అనుమానాదికములు ప్రత్యక్షమునకు సంబంధించినవి గనుక వానికిని లోఁబడదు. ఇట్లు సర్వప్రమాణములును సవిశేషవస్తువులే విషయములుగ గలవిగనుక ప్రమాణశూన్యమైన నిర్గుణబ్రహ్మమున్నదని ఎవ్వరును చెప్పఁజాలరు.

నిర్గుణ బ్రహ్మము ప్రమాణసిద్ధముగాక పోయినను ఆత్మానుభవముచే నెఱుంగఁబడునని చెప్పెదరేమో. ఆత్మానుభవమైనను సవిశేషముగ నుండినఁ గాని అది జ్ఞానము కాఁజాలదు. నేనొకపదార్థము నెఱింగితి నననేమి యర్థము? దానిగుణధర్మముల నిదమిత్థమని తెలిసికొంటిననిగదా! గుణధర్మములు లేని బ్రహ్మము నెఱుంగుట యెట్లు? 'బ్రహ్మమెఱింగితిని' అనిన తోడనే బ్రహ్మము సగుణమయ్యె!

భాష యంతయు సవిశేషకజ్ఞానమునే ఇచ్చునుగాని నిర్విశేషజ్ఞానము నీయఁజాలదు.

* విశిష్టాద్వైతము రెండువిధములు. శైవ విశిష్టాద్వైతము, వైష్ణవ విశిష్టాద్వైతము. మొదటి దానికి శ్రీకంఠ శివాచార్యునిచే రచింపఁబడిన బ్రహ్మసూత్రభాష్యము ప్రమాణము. రెండవ దానికి రామానుజాచార్యకృత భాష్యాదులు ప్రమాణములు. శ్రీకంఠుఁడు శంకరాచార్యునకు సమకాలీనుండని శంకరదిగ్విజయమువలనఁ దెలియవచ్చుచున్నది. ఈరెండు విధముల విశిష్టాద్వైతములలో శ్రీరామానుజునిది విశేషవ్యాప్తిగలదియు, విశేష వాఙ్మయము గలదియు నగుటచే నిచ్చట నీయఁబడుచున్నది. ఈ రెంటికిని తత్త్వమందు భేదము లేదు. కాని పరబ్రహ్మము 'గ్రద్దనెక్కిన వాఁడా?' 'ఎద్దు నెక్కినవాఁడా?' యన్న విషయమునమాత్రము వీరుభయులును హోరాహోరిగఁ బోరాడుచుందురు.

ఇట్లు వ్యక్తిజ్ఞానముగాని, జాతిజ్ఞానముగాని, సవిశేషముగను, సధర్మముగను, ఉండును; నిర్విశేషముగను, విధర్మముగను ఉండవు.

*ప్రత్యక్షము సన్మాత్రము గ్రహింపదు*

వస్తువులయొక్క గుణ ధర్మములు మనకు ప్రత్యక్షమువలన బోధపడవనియు, వాని సత్తామాత్రముఅనఁగా ఉనికియే (Existence) మనము గ్రహించెదమనియు అద్వైతవాదులు చెప్పెదరుగాని దానిని గ్రహించుటకు వీలులేదు. ఏలయన వేఱువేఱు వస్తువుల గుణధర్మములను మనము గ్రహింపలేక వాని యస్తిత్వమునే గ్రహింపఁగల్గితిమేని అన్ని వస్తువులు మనకొక రీతిగనే కన్పడవలయును. ఇది ఘటము, ఇది పటము అను విభేదము తెలియరాఁగూడదు. అట్లుగాక మనకు ప్రత్యక్షమువలన అసంఖ్య వస్తువులయొక్క గుణధర్మ భేదములనుబట్టి వానిని వేఱువేఱుగ గ్రహించు శక్తి కలుగుచున్నది. 'ఘటమున్నది, పటమున్నది' అను జ్ఞానమునందు 'ఉన్నది' అను జ్ఞానమే సర్వమై, ఘటత్వ పటత్వ జ్ఞానమే లేనియెడల మనకు ఘటము, పటము ఒక్కటిగ కనుపడవలయును. అట్లు కనుపడక అవి భిన్నముగ గానవచ్చుననుట అందఱకుఁ దెలిసిన విషయమే. ఏదోగుణ ధర్మముచే పదార్థము ఇంద్రియముల నాకర్షింపనిచో దానియునికి మనస్సునకుఁ దెలియుటెట్లు?

*శ్రుతులు సగుణబ్రహ్మమునే ప్రతి పాదించును, నిర్గుణ బ్రహ్మమును ప్రతిపాదింపవు*

సగుణ బ్రహ్మమును ప్రతిపాదించుటయే వేదాంత వాక్యముల (ఉపనిషద్వాక్యముల) తాత్పర్యము. నిర్గుణ బ్రహ్మముయొక్క సత్తామాత్రజ్ఞానము మనకు కలిగిన యెడల నేమి ప్రయోజనము? బ్రహ్మేతర పదార్థములయొక్క గుణ దోషములు మనకు తెలియఁజాలవు. బ్రహ్మము మంగళ గుణముల నిధియనియు, సర్వదోష రహితమనియుఁ దెలుపుట శ్రుతుల యభిప్రాయము. అతని కేవిధమైన గుణములు లేవని తెలుపుట శ్రుతియొక్క తాత్పర్యముకాదు. పరబ్రహ్మమందు జగదుపాదానత్వము, జగన్నిమిత్తత్వము, సర్వజ్ఞత, సర్వశక్తియోగము సత్యసంకల్పత్వము, సర్వాధారత మొదలైన యసంఖ్య కల్యాణ గుణములున్నవని శ్రుతులు వేయినోళ్ల ఘోషించుచున్నవి. కొందఱు "నిర్గుణం, నిరంజనం, నిష్కలంకం, నిష్క్రియం, శాంతం" (శ్వేత. ౬-౧౯) మొదలైన శ్రుతుల గతియేమి యని అడుగవచ్చును. పైకి నిర్గుణ పరములుగా గనఁబడినను ఇట్టి వాక్యములు హేయమగు గుణములను బ్రహ్మమందు నిషేధించుచున్నవేగాని, పరమ మంగళ కరములైన గుణములను నిషేధించుచుండుటలేదు. నిర్గుణుఁడనఁగా గుణశూన్యుఁడని యర్థముకాదు. అమంగళ కరములైన గుణములు లేనివాఁడని యర్థము. ఇట్లు

నిర్గుణ, సగుణ పరములైన వాక్యములను సమన్వయింపఁగా బ్రహ్మము సగుణమేయని శ్రుతి తాత్పర్యము తెలుచున్నది. బ్రహ్మము శ్రుతికి మనస్సునకు గోచరము కాదని చెప్పెడి వాక్యములకు నర్థము, దానియందు నేగుణములు లేవనికాదు; ఉన్నగుణము లసంఖ్యములు, వాని ఆనంత్యమువలన మానవులకది తెలిసి కొనుటకు కష్టమైనదని యర్థము. బ్రహ్మముయొక్క గుణములన్నియు నాకుఁ దెలిసిన వనుకొను వాఁడజ్ఞుఁడు. బ్రహ్మము యొక్క గుణము లనంతములు, అన్నియు నాకుఁదెలియుట యసంభవము అని యనుకొనువాఁడు జ్ఞాని.

'తత్త్వమసి' (ఛాందో. ౬-౮-౭.) మొదలైన వాక్యముల కేమి యర్థమని ప్రతిపక్షులడుగవచ్చును. ఇది నిర్విశేషవస్త్వైక్యపరము కాదనియు, భేదశూన్యమైన ఏకత్వమును బోధించుట లేదనియు, ఇందు అనంతమంగళగుణాకరమైన బ్రహ్మమునకును, అజ్ఞానియైన జీవునకును, సామానాధికరణ్యము కలదనియు తాత్పర్యము. ఈవాక్యము పరమేశ్వరునకును, జీవులకునుగల విశేష్యవిశేషణ భావములను తెలుపునుగాని జీవబ్రహ్మైక్యము తెలుపదు. ఒకవస్తువును రెండు ప్రకారములుగా చెప్పుటయే సామానాధికరణ్యమనఁబడును. 'ఘటము నీలము' అను వాక్యమునందు, నీలత్వ విశేషణ యుక్తమును ఘటత్వ జాతి యుక్తమును అగు ఒక పదార్థమే రెండు రూపములుగ ప్రకటింపంబడినది. దీనినే సామానాధికరణ్యమందురు. ఈ వాక్యము నీలత్వమంతయు ఘటత్వమనిగాని, ఘటత్వ మంతయు నీలత్వమనిగాని, ఐక్యభావము బోధజేయుటలేదు. ఘటత్వము వేఱు; నీలత్వము వేఱు అని ఉన్నఁగాని ఈ సామానాధి కరణ్యవాక్యమే పొసఁగదు. విశేష్య విశేషణముల రెండింటికిని భేదము లేదనుకొన్న యెడల 'నీలోఘటః' అను వాక్యమెట్లు సిద్ధించును? అట్లే 'తత్త్వమసి' (అది నీవు అయియున్నావు) అను వాక్యమునందలి 'తత్' అను పదమునకు సమస్త కల్యాణ గుణాత్మకుఁడగు బ్రహ్మమనియు 'త్వం' పదమునకు జీవాత్మయనియు, 'అసి' పదమువలన బ్రహ్మము జీవాంతర్యామి యనునియు బోధపడుచున్నది. జీవజడాత్మకమగు బ్రహ్మాండము శరీరమనియు, బ్రహ్మము దానికాత్మయనియు, జీవ బ్రహ్మములకుఁ గల సంబంధమును ఈ వాక్యము తెలుపుచున్న దేగాని జీవబ్రహ్మముల ఐక్యమును తెలుపుచుండుటలేదు. ఇట్లే జీవబ్రహ్మ సామానాధికరణ్యవాచకములగు నితర వేదాంత వాక్యముల యర్థముగూడ విశేష్య విశేషణభావ సూచకముగ గ్రహింపవలయునేకాని తాదాత్మ్య పదములుగ గ్రహింపఁగూడదు.

'తత్త్వమసి' అను దాని కర్థము 'నీవు వాఁడవు అయియున్నావు' అని కాదు, 'నీవు వాని వాఁడవు అయియున్నావు' అని. ఆత్మ, (జీవాత్మయు పరమాత్మయు) జ్ఞానమే యని

యద్వైతులు చెప్పునది సరిగాదు. ఆత్మజ్ఞానవంతుఁడు, జ్ఞానము కలవాఁడు, జ్ఞాత, తెలిసికొనువాఁడు, జ్ఞానమును అనుభవించువాఁడు. సుఖదుఃఖములకు నొకపురుషుని

*ఆత్మ కేవలము జ్ఞానము కాదు, జ్ఞాత; తెలిసికొనువాఁడు*

ఆశ్రయమావశ్యకమైనట్లు, జ్ఞానమునకుఁగూడ జ్ఞాతయొకఁడు ఆధార ముండవలెను. అట్లుగాక స్వయం ప్రకాశమనునది ఆత్మయని చెప్పెడు పక్షమున స్వయంప్రకాశమానమగు దీపముకూడ ఆత్మకావలయును. జ్ఞానము జ్ఞాతకు గోచరమగు నన్నమాత్రమున జ్ఞాత జ్ఞానమే కాఁజాలఁడు. జ్ఞానమునకుఁగల ప్రకాశత దానికి జ్ఞాతను బట్టియే వచ్చినది. సుఖదుఃఖములవలెనే జ్ఞానము స్వాశ్రయమునకే (దేనిని అది ఆశ్రయించి యుండునో దానికే) ప్రకటమగును. ఇతరవస్తువునకు గోచరము కాదు. ఇట్టిది స్వతంత్రముగాక స్వాశ్రయైకతంత్రమనుట స్పష్టము. జ్ఞాతలేకుండ జ్ఞానము వేఱుగనుండదు.

బ్రహ్మము కారణమనియు, జగత్తుకార్యమనియుఁ జెప్పితిరి. ఈ జగత్తు బ్రహ్మముకంటె అన్యమా అనన్యమా? అన్యమని పూర్వపక్షము. కాని "వాచారమ్భణం వికారో నామధేయమ్మృత్తికేత్యేవ సత్యమ్" [ఛాందో.] మొదలయిన యసంఖ్యశ్రుతులవలన జెప్పఁబడినట్లు కార్యమగు జగత్తునకును, కారణమగు బ్రహ్మమునకును అభేదమే యని విశిష్టాద్వైతుల సిద్ధాంతము. కాని లోకమునందు కార్యకారణములకును, బ్రహ్మజగత్తులకును వస్తువిరోధము కలదు. వీరిగుణములును వేఱువేఱు. బ్రహ్మ సర్వమంగళ గుణములుకలవాఁడు, సర్వజ్ఞుఁడు. జగత్తు అట్టిదికాదు; జడము. ఒకటికారణము, మఱియొకటి కార్యము అయినయెడల రెండును ఒక విధముగ నుండనక్కఱలేదా? ఇట్లుభిన్నముగఁగానవచ్చునవి యొకటియేయని యెట్లు చెప్పవచ్చును? అని పూర్వ పక్షమురాఁగా

*జగత్తు బ్రహ్మముకంటె వేఱా? ఒకటేనా?*

సమాధానము: కార్య కారణములకు నభేదమే యైనను అవి యొక్కరూపముగ నుండవలయునన్న నియమములేదు. ముద్దవలెఁ బడియున్న మట్టికిని దానితోఁ జేయఁబడిన కుండకును రూపభేదమున్నను వస్తుభేదమున్నదా? లేదు. మన్నె కుండయయ్యెనని అందఱకుఁ దెలిసిన విషయమే. ఒక దేవదత్తుఁడె బాలత్వ యువత్వాద్యవస్థల యందు వేఱువేఱుగఁ గానవచ్చును. అప్పుడు బాలుఁడగు దేవదత్తుఁడు యువకుఁడగు దేవదత్తునకంటె భిన్నుఁడనిచెప్ప వచ్చునా? తంతువులన్నియు గలిసి పటాకారమగును. తంతురూపము, పటరూపము భిన్నముగఁ గానవచ్చినను అవి యొక్కటియనియే చెప్పవలెనుగాని భిన్నమనుటకువీలా? ప్రాణవాయువు ఒక్కటియైనను శరీరవృత్తి విశేషమునుబట్టి ప్రాణాపానాది భిన్నరూప కార్యముగఁ బరిణమిం

చును. అట్లే బ్రహ్మమునకు జగత్తునకు నభేద మని యెఱుంగునది. విరుద్ధ లక్షణములు గల మక్షికాదులవలన క్రిమ్యాదులు పుట్టు చున్నట్టు, అజ్ఞత్వము, అసుఖత్వముగల చిద చిన్మిశ్రమైన యీజగత్తు, తద్విలక్షణ లక్షణ ములుగల సర్వజ్ఞుఁడును ఆనందమయుఁడును అగు బ్రహ్మము వలనఁ బుట్టెనదనుటవలన విరోధమేమియులేదు. ఇట్లు కారణమగు నొక ద్రవ్యము కార్యావస్థను జెందునపుడు ఒక ప్పుడు కారణమునకు సలక్షణావస్థనుబొందును; ఒకప్పుడు విలక్షణావస్థను బొందును.

సరే. సూక్ష్మచిదచిద్వస్తుశరీరముగల బ్రహ్మము కారణావస్థయనియు, స్థూలచిద

బ్రహ్మమునకు దోషము అంటుకొనవు

చిద్వస్తు శరీరముగల బ్రహ్మము కార్యా వస్థయనియు, అందుచే కార్యకారణములకు అభేదమనియు చెప్పితిరి. అట్లయిన జగత్తునందుఁగల జడత్వము, జీవులుచేయు పాపపుణ్యాదులు, జీవుని అజ్ఞ త్వము మొదలయినగుణములన్నియు ఈశ్వరు నకుఁగూడ నున్నవని చెప్పవలెనుఅని కొం దఱు చెప్పవచ్చును. కాని యట్లుకాదు. మానవుఁడు బాలుఁడుగను, యువకుఁడుగను, అంధుఁడుగను ఉండును. ఆ లోపములన్నియు శరీరమునకేగాని యవియాత్మ నంటునా? అట్లే మనమనుభవించు జ్ఞానసుఖాదులు ఆత్మకే గాని శరీరము నంటవు. ఈవిధముననే చిద చిద్వస్తువులు శరీరముగాఁగల పరబ్రహ్మము నకు కార్యకారణోభయావస్థలున్నను, కర్మ కు లోఁబడుట, అజ్ఞత్వము మొదలయినవి బ్రహ్మశరీరమైన చిదచిద్వస్తుగతములు; సర్వ జ్ఞత్వము, పాపరహితత్వము మొదలైనవి అంతరాత్మయైన పరమాత్మ గతములు. ఇవి వానిని అంటవు. అవి వీనిని అంటవు. ఇదం తయు "యస్యపృథివీ శరీరం" (బృహ. 3.7.3) అన్న అంతర్యామి బ్రాహ్మణమునందున్నది.

గరుడవాహనుఁడైన నారాయణుఁడే పర

బ్రహ్మస్వరూపములు

బ్రహ్మము. చతుర్ముఖ బ్రహ్మ శివాదులు కారు. ఆ నారాయణుఁడు అయిదురూపముల తోనుండును. వీనికే యవస్థలనియుఁ బేరు:—

౧. పరరూపము:—ఇతఁడే పరబ్రహ్మము, పరవాసుదేవుఁడు, నారాయణుఁడు. ఇతఁడు ద్వారపాలకులచే రక్షితమగు వైకుంఠము నందు శేషశయ్యపైఁ గూర్చుండి యుండును. శ్రీభూనీళ లితనిని సేవించుచుందురు. ఈతఁడు శంఖచక్రగదాద్యాయుధములధరించి యుం డును. కౌస్తుభాదికములితని నగలు. ఇతని యందు అనంత కల్యాణ గుణములుకలవు. ఇతని సభయందు నిత్యముక్తులైన అనంత గరుడాదులు ఉందురు.*

* తత్ర పరో నామ త్రిపాద్విభూతౌ కుముదకుము దాక్ష పుండరీక వామన శంకుకర్ణ సర్వనేత్ర సుముఖ సుప్రతిష్ఠితాది భిర్దివ్యాయుధభూషణపరిజన పరిచ్ఛదా న్వితైర్దివ్యనగరపాలకైః పరిరక్షితే శ్రీమద్వైకుంఠాఖ్యే పురే చండప్రచండ భద్రసుభద్ర జయవిజయ ధాత్ర

అతనినిగుఱించి మాటలాడుటకుఁగూడ వీలు లేదనియు నతని భావముకాదు. ఈశ్వరుఁ డనంతుఁడు, అపరిచ్ఛిన్నుఁడు అనఁగా నాతని యందు అనంతగుణము లున్నవనియు, అతఁడు అపరిమితమైన పరిపూర్ణత్వమును కలవాఁడ నియు, అతఁడు భావపదార్థమనియు, స్థిర పదార్థమనియు, సత్తుల కన్నిటికి సత్తనియు స్పైనోజా యభిప్రాయమని కొందఱు చెప్పె దరు. ఇది రామానుజమతమునుపోలియున్నది.

ఈశ్వరుఁడు పరిచ్ఛిన్నుఁడగునన్న యా క్షేపము రాకుండ స్పైనోజా, ఈశ్వరునికి అనంతగుణములును, ఒక్కొక్క గుణమునకు అనంతత్వమును చెప్పియున్నాఁడు. ఇట్లు ఈశ్వరుఁడు వేలు వేలు గుణములచే పరిచ్ఛి న్నుఁడుగాఁడు. అట్లు పరిచ్ఛిన్నుఁడగునేని పురుషవిశేషుఁడగును. అనంత గుణములును, ఒక్కొక్క గుణ మనంతముగను తనయందుఁ గలిగియున్నవాఁడు సాంతుఁ డెట్లగును? పరి చ్ఛిన్నుఁ డెట్లగును? ఈశ్వరునియందలి యొ క్కొక్క గుణ మనంతమగుటచే నది యొక్కొక్క సృష్టియని చెప్పవలెను. అచేతనము జడప్రపం చము. ఇది యెంత విస్తీర్ణముకలదో, ఎట్ల నంతమో తెలిసికొనవలెనన్న రాత్రి ఆకా శము వంకఁజూచిన జాలును. చేతన సృష్టియు నిట్టిదే. దీని యనంతత్వ మెఱుఁగవలెనన్న సూక్ష్మదర్శినితో జలబిందువులోని సూక్ష్మ జీవులఁ జూచినఁ జాలును. మనకుఁ దెలిసిన యీ రెండుగుణములుగాక మఱి యసంఖ్య గుణము లీశ్వరునియందున్నందున, మనకు గోచరములుగాని యజ్ఞేయప్రపంచము లెన్ని యో యుండవచ్చును. ఆప్రపంచములు జడా త్మకములుకావు, చేతనాత్మకములుకావు!

ఇచ్చట మరియొక సంశయము కలుగ వచ్చును. ఈశ్వరునకు మనోవ్యాపారముకాని, ఇచ్ఛకాని లేదని స్పైనోజా చెప్పియున్నాఁడు. అట్లు చెప్పియు, నీశ్వరుని నాతఁ డపార జ్ఞానము (infinite intelligence) కలవానిగఁ జెప్పెను. ఈ రెండును ఎట్లు పొసగును? కాని యప్పటి క్రైస్తవ, యహూదీ తత్త్వవేత్తల యభిప్రాయానుసారము మానవ జ్ఞానమున కును, ఈశ్వరుని జ్ఞానమునకును భేదముకలదు. మనకు నొకానొక జ్ఞానము కలుగవలెనన్నఁ బూర్వము మనసులోఁ గొంత తర్కవితర్కము (discursive knowledge) కలిగి, యుక్తి వాదము జరపవలెను. అప్పుడు గాని యిద మిత్థమన్న జ్ఞానము కలుగదు. ఈశ్వరునకో స్వయంస్ఫూర్తిజ్ఞానము (intutive under-standing) కలదు. ఏవిధమైన తర్కములేకుండ గనే యీశ్వరునకు జ్ఞానము కలుగును. కనుక ఈ పూర్వసిద్ధాంతములనే గ్రహించి స్పైనోజా యీశ్వరునకు మనోవ్యాపార మును, ఇచ్ఛయు లేవని చెప్పెను. స్పైనోజా యొక్క సత్తు సృష్టియే, సృష్టికి వెలుపల నున్నది కాదు. సృష్టికిఁగూడ జ్ఞానముకలదు. కాని యది మనోవ్యాపారజనితము కాదు, స్వాభావికము. సాలీఁడు రేఖాగణిత జ్ఞానము

లేకుండఁగనే చక్కని గూడు అల్లును. గృహ నిర్మాణ విద్య నెఱుఁగకయే పక్ష్యాదులు గూళ్లను, తేనెటీగలు తేనెతెట్టెలను, నిర్మించును. ఇది నేర్చుకొనిన జ్ఞానముకాదు; స్వాభావిక జ్ఞానము. సృష్టికి నాలోచనకలదు; కాని తన కాలోచన కలదని సృష్టికిఁ దెలియదు. అది స్వభావసిద్ధము. ఇట్టి స్వాభావికజ్ఞానమే ఈశ్వరుని యందుండును. కావున మానవుల మనోవ్యాపారములతో దానిని పోల్చుటకు వీలులేదు. అందుచే స్పైనోజా యీశ్వరునకు మనోవ్యాపారము, ఇచ్ఛ లేదని చెప్పెనే గాని, అతని తాత్పర్య మీశ్వరుఁడు జ్ఞానవిహీనమైన జడమని కాదు.

ఈతత్త్వవేత్త చేతన జడపదార్థముల లోని భేదమును (వైరుధ్యమును), ఒకవిధముగఁ బోఁగొట్టెను. ఇతనికిఁ బూర్వముండిన తత్త్వవేత్తలకంటె నితనియం దిదియొక విశేషము. ఇతఁడు చెప్పునట్లు, చిదచిత్తులు రెండును ఒక్క సత్తుయొక్క విశేషణములు - విషయములు, విధేయములు - గాన, ఈ రెంటికిని సామానాధికరణ్యము (Consubstantiality) కలిగినది. ఇందుచే నిది జడవాదమును (materialism) కాదు, విజ్ఞానవాదమును (idealism) కాదు. ఈ రెండువాదములలోని దోషము లన్నియు లోపించి, వానిలోని మెరుగులు మాత్రమీ వాదమున నేకీభవించినవి. జడవాద మగుటకు జడమునుండియే చైతన్యము పుట్టినది. జడపదార్థముల కదలిక (Motion) వలన జీవము పుట్టినది అని అనవలెను. విజ్ఞాన వాదమగుటకు జడమంతయు విజ్ఞానోత్పన్న మనవలెను. ఇట్లు స్పైనోజా చెప్పి యుండలేదు. చిదచిత్తులను వేఱువేఱుగ నాతఁ డొప్పుకొనెను. కాని యీ రెండును సత్తు (ఈశ్వరుని) యందు నేకీభవించినందున వానికి నొకవిధమైన నైక్యమును, అభేదమును కలిగెను. ఇట్లు జడచేతనములకు నొకవిధమైన నైక్య ముండుటవలననే, మనుష్యాదుల మనస్సు, దేహము కలిసి పరస్పరాను కూలముగఁ బనిచేయుట తటస్థించుచున్నది. మనస్సు పొమ్మనగనే కాళ్లు నడుచును. శరీరమునకు దెబ్బతగలగనే మనసునకు వేదన బుట్టించును. చిదచిత్తులకు సామానాధికరణ్యము లేనిదే యిట్టి సంబంధ మెట్లు కలుగును? ఈశ్వరుఁ డీ రెండు విధములను ఒక నియమము ననుసరించియే ప్రవర్తించును.

ఇట్లీతత్త్వవేత్త, స్పష్టముగఁ గాకపోయినను కొంతవఱకునైనను, జడత్వ చైతన్యములను ధర్మముల భేదభావమును బాపి, చిదచిత్తులు వేరు కావు, జడవిరహిత చైతన్యమును, చైతన్యవిరహిత జడమును ఎచ్చటఁ గానరావు, ప్రతిపదార్థమును జడచేతనాత్మకము అని స్పష్టముగఁ బ్రతిపాదించునట్టి, తదుత్తర కాలీనులైన తత్త్వవేత్తలకుఁ బురోమార్గదర్శి యయ్యెను.

ఈ చిదచిత్తులను గుణములయందు వికారములు (Modes, modifications) కలిగి

యీ ప్రపంచ మంతయుఁ బుట్టుచున్నది.

వికారవాదము (Theory of modes)

జడతత్వముయొక్క వికారములు రెండు, చలనము(Motion) స్థిరత, (స్థాణుత్వము-Rest). చిత్తుయొక్క వికారములు రెండు జ్ఞానము, ఇచ్ఛ. ఇట్లు, స్థిరత్వమును అట్లుంచ, సత్తుయొక్క గుణములకుఁ గల చలనము, జ్ఞానము, ఇచ్ఛ అను మూఁడు వికారములు సమస్త ప్రపంచమును పుట్టించుచున్నవి. గుణములవలెనే తద్వికారములు కూడ నసంఖ్యములు,అపరిమితములు. చేతనాచేతన ప్రపంచమును వ్యాపించి యున్న గమన జ్ఞానేచ్ఛ లనఁబడువానికి నాదిలేదు, అంతము లేదు. అనంతములైన యిట్టి యొక్కొక వికారమునందు, సాంతములయిన వికారము లనంతము లుండును. చలనము అను వికారమనంతము. కాని అందుండి, శరీరము లనఁబడు అంతముగల వికారము లనంతములు పుట్టుచున్నది. జ్ఞానేచ్ఛ లనఁబడు చిద్వికారము లనంతవిధములై, అంతముగల (మానవుల) మనస్సులుగను, బుద్ధులుగను, ఇచ్ఛలుగను అసంఖ్య విధముల పరిణమించుచున్నవి. సాంత భౌతిక మనశ్శరీరములు, ఎల్లప్పుడును మారుచుండెడి వికారములు.

జీవాత్మ అనంత చిదాత్మకమైన (infinite (thought) పరమాత్మయొక్క వికారము. మానవదేహము కూడ అనంతజడాత్మకమైన పరమాత్మయొక్క వికారమే. చిదాత్మకసృష్టియు, జడాత్మకసృష్టియు, పరమాత్మయైన సత్తేసమానాధికరణముగఁ గల్గవి గనుక, జీవజడములు భిన్నములైనను, ప్రతిశరీరమునకును, అందలిజీవమునకును సంబంధముగలిగి, యవి యన్యోన్య వ్యాపారఫలములను పొందుచున్నవి. అందుచే, ఆత్మయనఁగా శరీరముయొక్క చిదాత్మక ప్రతిబింబమని (idea corporis) చెప్పవచ్చును. అట్లనుటచే జడమైన శరీరమునకు చైతన్యము కలుగునని కాదు. శరీరమెప్పుడును అస్మత్ప్రత్యయ గోచరమైన విషయమును గ్రహించు వాఁడు (Concious Subject) కానేరదు. శరీరము ఆత్మయొక్క విషయము (Subject) అగుననియు శరీరము లేనిదే మనోవ్యాపారము జరుగనేరదనియు తేలుచున్నది. ఆత్మ తన్నుదా నెఱుఁగదు, శరీరవ్యాపార సంబంధమున మాత్ర మెఱుంగును.

ఇంద్రియ జన్యమైన ప్రత్యక్షజ్ఞానము(Sensative) శరీరమునకు సంబంధించినది. ఇది మానవులకు, పశ్వాదులకు సామాన్యము. వీని శరీర రచనయొక్క యాధిక్యతనుబట్టి యిట్టి ప్రత్యక్షజ్ఞానము కలుగుచున్నది. పరిజ్ఞానము (Perception) ఆత్మవిషయము* (మనసునకు

* మనతత్త్వశాస్త్రమునందు ఆత్మకు, మనస్సునకు భేదముకలదు. మనసు ఆత్మయొక్క యొక యింద్రియము. కాని పాశ్చాత్య తత్త్వశాస్త్రమునందు, ఆత్మ (Soul) మనసు (Mind) సమానార్థకములు.

సంబంధించినది). ఒకానొక బహిర్విషయము వలన నింద్రియమునకు చలనము కలిగినపుడు మనసు తత్క్షణమే యాబహిర్విషయము యొక్క మానసిక ప్రతిబింబమును కల్పించుకొనును. ఇట్టి శారీరిక మానసిక వ్యాపారములు రెండును ఏకసమయావచ్ఛేదమునందు నెట్లు జరుగును? అను ప్రశ్నమునకు, జీవ జడములు - మనశ్శరీరములు - పైని వర్ణించినట్లు ఐక్యభావము కలవనుటయే ప్రత్యుత్తరము. మనశ్శరీరములు ఒకటి నొకటి యనుసరించి, కలిసి క్రమముగ నభివృద్ధిఁ జెందును. శరీరము అభివృద్ధిచెందిన కొలఁదిని మనసు అభివృద్ధిచెందును. మెదడెంత అభివృద్ధిచెందునో, పరిపూర్ణతఁ బొందునో, ఆరోగ్యముగ నుండునో, మనస్సంత అభివృద్ధిఁ జెందును, పరిపూర్ణతఁబొందును, ఆరోగ్యముగనుండును. ఇంద్రియములవలనఁగల్గు జ్ఞానము తొల్త అస్పష్టముగను,అనిశ్చయముగను ఉండును. వీనికిఁదగిన మానసిక ప్రతిబింబము లేర్పడి కల్పనా (Imagination) సామ్రాజ్యమునందు యవి భ్రమప్రమాదములకుఁ (అజ్ఞానమునకు) గారణమగును. వ్యక్తికి వేఱుగ జాతియున్నదనియు, శరీరములులేని భూతములుకలవనియు, సృష్టి నిర్మాణమంతయు బుద్ధిపూర్వకమనియు, మానవస్వరూపమును గుణాదులును ఈశ్వరునకు నుండునేనియు, కర్తకుఁ గ్రియా స్వాతంత్ర్యమున్నదనియుఁ జెప్పఁబడు అపసిద్ధాంతముల కన్నిటికిని ఈ కల్పనా సామ్రాజ్యమే కారణము.

వివేకము (reason) భ్రమాత్మక జ్ఞానమును గ్రహింపదు, ప్రమాత్మకజ్ఞానము (Adequate and perfect ideas) నే గ్రహించును. విషయమును (Object) దాని కారణమును సమ్యగ్విధమున గ్రహించును. సత్యము స్వతఃప్రమాణము; దానికి నదియే ప్రమాణము. సత్యమును గ్రహించినవానికి నది సత్యమని స్వయముగ స్ఫురించును. సత్యముయొక్క సత్యత్వము నిల్పుటకు వేఱుప్రమాణ మక్కరలేదు. అట్లయిన నారెండవ ప్రమాణమే సత్యమగును. వెలుతురు స్వతః ప్రకాశముగలదియై తానందఱకుఁ గనఁబడుటయేగాక చీఁకటియొక్క స్వభావమునుగూడఁ జూపునట్లు, సత్యము (ప్రమాత్మకజ్ఞానము) స్వప్రభవలన, సత్యమన నేదియో దానినేగాక యసత్యము (అజ్ఞానము, భ్రమ) యొక్కస్వభావమును గూడ తెలియఁజేయును.

కల్పన (ఊహ) పదార్థములకును మానవులకునుగల సంబంధమును మాత్రము విచారించును. వివేకమో ఆపదార్థములకును ప్రపంచమునకును వాని మూలకారణమునకును గల సంబంధమును తెలిసికొనును. కల్పన సర్వసృష్టికి మానవునే యధికారిగ నెంచును. మానవవ్యాపారములనే సృష్టిలోని యితరవస్తువులను కొలుచుటకు మానముగ నెంచును. వివేకమిట్టి అహంకారమును పరిత్యజించి దూరదృష్టి కలదియై శాశ్వతమైన సత్పదార్థమునకును ప్రపంచమునకును గల

సంబంధమును తెలిసికొనును. అన్ని పదార్థములకును పరమేశ్వరునకును గల సంబంధమును జూపును. అనంతమైన సత్తుయొక్క వికారములుగా గ్రహింపఁబడిన ఊహాలన్నియు (ideas) నిజమైనవి. కార్యకారణ సంబంధములేక అకస్మాత్తుగనే వ్యాపారమును జరుగనేరదని వివేకము గ్రహించును. నిజమైన కారణములను తెలిసికొనలేక అజ్ఞానులు ఒకానొక వ్యాపారము కారణము లేకుండగను అకస్మాత్తుగను, యదృచ్ఛగను, జరుగునని తలంచెదరు. కారణములేక కార్యములేదనునది సకలశాస్త్రములు గమనింపవలసిన మొదటి సిద్ధాంతము. ప్రపంచమందలి అసంఖ్యవ్యాపారములనుజూచి కల్పన భ్రమ జెందును. వివేకమో వానికి మూలకారణములు కనుఁగొని, వానినన్నిఁటిని నొక సూత్రమునందు గుచ్చును. అవన్నియుఁ బైకి భిన్నములుగ గానవచ్చినను పారమార్థికముగ నేకమేయని వివేకము చెప్పును.

ఈ మతమునందు ఇచ్ఛకు జ్ఞానమునకు నంతగా భేదములేదు. అనుకూల జ్ఞానము నుంచుకొనుటకును, ప్రతికూల జ్ఞానమును విడనాడుటకును గలిగెడి ప్రవృత్తి ఇచ్ఛయనఁబడును. ఇట్లు జ్ఞానమునకును ఇచ్ఛకును అభేదము కలదు గనుక ఒకటి యభివృద్ధి జెందిన మఱియొకటి అభివృద్ధిఁ జెందునని వేఱుగ జెప్ప నక్కఱలేదు. స్వల్ప జ్ఞానముతో స్వల్పేచ్ఛయు, ఉన్నతజ్ఞానముతో ఉన్నతేచ్ఛయు జతగా నుండును. ఇంద్రియజన్యజ్ఞానముతో సంబంధించిన కల్పనాజన్యజ్ఞానము స్వల్పమైనది. దానివలన పదార్థములయందు మనకు అనుకూల ప్రతికూల భావములుకలిగి, వాంఛ, ప్రేమ, ఆనందము, ద్వేషము, భయము, దుఃఖము మొదలైన వికారములు కలుగును. అనుకూల భావనకలవాని యందు ప్రేమయు, ప్రతికూలభావనకలవానియందు ద్వేషమును కలుగుచున్నది.

ఇఁక ఉన్నతజ్ఞాన సంబంధమైన ఇచ్ఛ లెటువంటివో చూతము. ఇచ్చట ఒకానొక వ్యాపారమువలన మనకు సుఖము కలుగునా, దుఃఖము కలుగునాయని విచారించి సుఖము కలుగునెడల దానిఁ గోరుటయు, దుఃఖము కలుగునెడల దానిని వదలుటయు తటస్థింపదు. సత్యమా, అసత్యమా అను ప్రశ్నయే ఇచ్చట ముఖ్యమైనది. ఉన్నతజ్ఞానము కలవారు సత్యమును గోరుటయు, అసత్యమును పరిత్యజించుటయు నంభవించును. ఇచ్ఛ యిట్టి యున్నతావస్థఁ జెందినంగాని లోకవ్యవహారము సుస్థిరంబుగ జరుగనేరదు.

మోక్షము మనోధర్మము. దానికిజ్ఞానమే సాధనము. ప్రపంచమును తెలిసికొనుటయే దానినుండి ముక్తిఁజెందుట. సర్వము నెరుంగుటయే పరిపూర్ణమోక్షముఁ జెందుట. మనోవికార మిట్టిదని తెలిసికొనినక్షణమునందే ఆ వికార మవికారముగా మారును. కావున జ్ఞానమునందే ముక్తిగల్గదు. భ్రమా

దికములు జ్ఞానమున కంతరాయకములుగ నున్నను, సతతప్రయత్నమును, అవిశ్రాంత శ్రద్ధయునున్నయెడల నిజమైన జ్ఞానము సంపాదింపవచ్చును. జ్ఞానమునందే ముక్తికలదు గనుక మన నీతిని కొలుచుటకును జ్ఞానమే సాధనము. అనఁగా, జ్ఞానాభివృద్ధికి అనుకూలమైనది నీతిప్రదమనియు, జ్ఞానాభివృద్ధికి ప్రతికూలమైనది అనీతిప్రదమనియుఁ జెప్పవచ్చును. జ్ఞానముయొక్క సామర్థ్యమే సద్గుణము. కొన్ని కార్యములను చేయింపఁగల్గిన మానవ బలమునకే సద్గుణమని పేరు. సద్గుణ సంపన్నుఁడు బలవంతుఁడుగను ధర్మరతుఁడుగను ఉండును. దుర్గుణసంపన్నుఁడు బలహీనుఁడుగను సోమరిగను ఉండును. ఇట్లాలోచించిన యెడల ద్వేషము, కోపము, మత్సరము, అను వానినే గాక భయము, ఆశ, దయ, పశ్చాత్తాపము అను మనో వికారములను గూడ దుర్గుణము లని చెప్పవలసి యున్నది. ఆశలో భయము, దీన భావము, దయ, దుఃఖము మొదలైన వన్నియునుండి మానవ సామర్థ్యమును తగ్గించును. పశ్చాత్తాపము రెండువిధముల చెడ్డది. పశ్చాత్తాపపడు వాఁడు దౌర్బల్యము కలవాఁడుగను, తన దౌర్బల్యము నెఱింగిన వాఁడుగను ఉండును. వివేకియై ప్రవర్తించువాఁడు, ఇట్టి మనో వికారముల కతీతుఁడై యుండును. వాఁడు ప్రపంచమందలి నిజమైనకార్యకారణములను సత్పదార్థ స్వభావమును ఎఱిఁగినవాఁడై ఏ వికారమునకు లోనుగాక, ఆత్మాభివృద్ధియు, లోకాభివృద్ధియు చేయుచుండును.

తత్త్వముఁ దెలిసికొనిన జ్ఞానికిఁ బ్రపంచమునందు హేయోపాదేయములు(విడువఁదగినవి.గ్రహింపఁదగినవి)ఉండవు. అన్నిటియందు నతనికి సమభావము కలుగును. సత్తును, దానియొక్క గుణధర్మములను ఎఱింగినవాఁడగుటచేనాతనికి ప్రపంచమందలి వ్యాపారములన్నియు నవశ్యముగ జరుగ వలసినవిగ నుండును. అట్లాతనికిఁ దోచుటచే నొకదానిని ద్వేషించుటకును కారణ ముండదు. ఇవన్నియు జరుగక తప్పని కార్యములన్న నిశ్చయ జ్ఞానము గలిగిన తత్త్వజ్ఞునకుభయ మన్నమాట యుండదు. ఆతనికి జ్ఞానము హెచ్చినకొలఁదిని ప్రపంచముమీఁదను, పరమేశ్వరుని మీఁదను నిరపేక్షప్రేమ(disinterested love)కలుగును. ఇట్టినిర్వ్యాజమైన యీశ్వరప్రేమకును, లోకములోని వేఱువేఱు మతముల యందలి యీశ్వరులమీఁది ప్రేమకును భేదము కలదు. ఈ యీశ్వరులు కొలఁదిగనో, గొప్పగనో మానవులను పోలియుందురు. కావున వారిని ప్రేమించుట నిర్వ్యాజము కాదు. ఏదో లాభమును కోరి, గొప్పవారికి భయపడినట్టు భయపడి, ప్రేమించుట సంభవించును. భయాదికములతోఁ జేరుకొనిన ప్రేమ నిరతిశయానందమును (The perfect blessedness) ఈయఁజాలదు. కావున పై నివర్ణింపఁబడిన సత్పదార్థమును ఈశ్వరుని ధ్యానించుటలో,

తత్వజ్ఞుఁడు, మఱియేవిధమైన విచారమునులేక పరిపూర్ణ చిత్తశాంతి, సమాధానము, వైరాగ్యము కలవాఁడై నిరతిశయానందమును బొందును.

అట్టిసమయమున, జీవాత్మకుఁబరమాత్మకు నదివఱకున్న భేదముపోయి, యిద్దఱికిని ఐక్యభావము కలుగును. విషయి విషయములు (Subject & objects) ఒక్కటియగును. జీవుఁడు ఈశ్వరుని ప్రేమించుట యనఁగా నీశ్వరుఁ డీశ్వరునిఁ బ్రేమించుటయే. జీవుఁ డీశ్వరుఁడేగనుక, శరీరపాతానంతరము జీవము నాశము జెందినట్లున్నను, ఈశ్వరాంశము శాశ్వతమే. ఆత్మ శాశ్వతమనుటవలన, ఈ శరీరమునందు నొక యాత్మ వేఱుగ నున్నదనియు, నది శాశ్వతమనియు నర్థముకాదు. జీవపదార్థము ఈశ్వరపదార్థమే కావున శాశ్వతమనియర్థము. తాను ఈశ్వరాంశమే యనియు, కావున తాను శాశ్వతమనియు తత్త్వజ్ఞునకుఁ దెలియుట వలన నాతఁడు మరణభీతిని విడనాడి, సంతోషస్వాంతుఁడై యుండును. [కొ. ల.

**అద్వైతానందుఁడు.** ఒక మహారాష్ట్ర పండితుఁడు. ఇతఁడు సన్న్యాసము పుచ్చుకొనిన తరువాత కాశీవాసము చేసెను. జను లాతని 'గురుస్వామి' యనుచుండిరి. ఇతఁడు 'బ్రహ్మవిద్యాభరణ' మను శాంకర వేదాంత గ్రంథమును, సదానందకృత 'వేదాంత సారము' పై టీకను సంస్కృతమునందు వ్రాసెను. మధ్వమునీశ్వరుఁడు, అమృతరాయఁడు అను మహారాష్ట్రకవు లీతని శిష్యులే. ఇతఁడు కాశీక్షేత్రమున శా. శ. ౧౬౮౦ పార్థివనామ సంవత్సరమున సమాధిస్థుఁడయ్యెను. [అర్వాచీనకోశము.

**అథచ్ఛాయుఁడు.** కశ్యపకులోత్పన్నుఁడైన యొకఋషి.

**అథశ్శిరస్సు.** లంచము తీసికొనువారికై యేర్పడిన నరకము.

## అధ్యాత్మరామాయణము.

ఇది బ్రహ్మాండ పురాణాంతర్గతము. శివుఁడు పార్వతికి బోధించిన ట్లిందు వర్ణింపఁబడినది. ఇందు వాల్మీకి రామాయణమునందు వలెనే సప్తకాండములుగలవు. గ్రంథమునందఱువది నాలుగధ్యాయములును, నాలుగువేల రెండు వందల పద్యములు నున్నవి. మొత్తము మీఁద కథయంతయు వాల్మీకి రామాయణములోనిదే యైనను కథాభాగ మచ్చటచ్చట విచ్చలవిడిగా మార్చఁబడియున్నది. వాల్మీకమునందు రామచరిత మంతయు మానవచరితముగ వర్ణింపఁబడినది. సామాన్య మానవునివలె రాముఁడు భార్యావియోగమునకై దుఃఖించును. కాని యీగ్రంథమునందు రాముఁడు పరబ్రహ్మ మనియు, సీత (ఆది మాయ) అవిద్య యనియు, రామచరిత్ర మంతయు లీలా నటనమనియుఁ జెప్పఁబడినది. ఇందు తత్త్వము అద్వైత

సిద్ధాంతముగను భక్తి శ్రీరామభక్తిగను నుపదేశింపఁబడినవి.

పరబ్రహ్మము దేవకార్యమునకై, అనఁగా రావణ సంహారమునకై, రామ రూపమున జన్మించి ఆత్మస్వరూపమును మఱచియుండఁగా నొకనాఁడు నారదుఁడువచ్చి 'నీవు రావణ వధార్థము జన్మించినావు. నీకు రేపు పట్టాభిషేకమైన యెడల ఆరాజ్యసౌఖ్యము లో మఱచెదవు.' అనిచెప్పఁగా నాతఁడు తెలివొంది దేవ కార్యమునకై అరణ్యమునకుఁ బోవ నిశ్చయించెను. దేవతలు రాముని పట్టాభిషేకమునకు భంగము గలిగింపవలయునని సరస్వతీ దేవిని కోరఁగా నామె మంథర యందుఁ బ్రవేశించి కైకకు దుర్బోధచేసెను.

సీతా రామలక్ష్మణు లరణ్యావాసములో నుండఁగా నిఁకముందు రావణుఁడు సీత నెత్తుకొనిపోవునని దివ్యదృష్టిచే రాముఁ డెఱింగి భార్యతో 'నీవిఁకడాగి మాయాసీత నిచ్చట నుంచుము' అనిచెప్పెను. అందుపై నిజ సీత అగ్నిలోదాగి మాయాసీతను బర్ణశాలలో నుంచెను. రావణుఁడువచ్చి యెత్తుకొనిపోయిన దీ మాయా సీతనే. రాముఁడు రావణాదులతో యుద్ధాదులుచేసినది ఈ సీతకొఱకే! యుద్ధమైనతరువాత ఈ మాయాసీత అగ్నిలోఁ బ్రవేశింపఁగా నిజసీత అగ్నిలోనుండి బయలు వెడలెను.

హిందువులలోఁ బెక్కుమంది గ్రంథమును నిత్యము పారాయణము చేయుచుందురు. ఉత్తర కాండములోని ఐదవ యధ్యాయమునకు రామగీత యనిపేరు. అందు రాముఁడు లక్ష్మణునకు అద్వైత వేదాంతమును, తత్త్వమసి యను సిద్ధాంతమును బోధించెను.

ఈ గ్రంథమును తెలుఁగులోనికి కాణాద పెద్దన సోమయాజియు దూర్వాసుల రామయార్యుఁడును వేఱ్వేర భాషాంతరీకరించిరి. శ్రీమతి గుండు అచ్చమాంబగారును ద్విపద కావ్యముగ దీనిని తెనిఁగించిరి.

**అధ్యాత్మలు.** ఇవి పదుమూఁడు విధములగు వాయువులు. ఇవి పిండాండమందును, బ్రహ్మాండమునందును ఉండును.

**అధ్యాత్మోపనిషత్తు.** శుక్ల యజుర్వేదాంతర్గతంబు. పరమేశ్వరుని వలన దీనిని అనపాంతరతముండను బురాణఋషి గ్రహించి పారంపర్య క్రమంబున లోకమునకుఁ బ్రసాదింప లోకము దీని బొందెనని యుపనిషదంతముననుండు గురుశిష్య పారంపర్య నిరూపణంబువలనఁ దెలియవచ్చుచున్నయది. సాధన చతుష్టయసంపన్నులగు సర్వకర్మసన్న్యాసులకు శాస్త్రముచే విధింపఁబడిన యాత్మతత్త్వోపదేశ మిందు సంక్షేపముగను బూర్ణముగను ముచ్చటింపఁబడి యుండుటచే నియ్యది బ్రహ్మవేత్తలచే నతిపవిత్రముగ నెన్నఁబడుచున్నయది. ఇందు గ్రంథబాహుళ్యములేక పోయినను సిద్ధాంతము లన్నియు సూత్రమునరిదలి ముత్తియములట్లు చక్కఁగ

నొకదాని వెంబడి నొకటి నిర్వచింపఁబడి. యుండుటచే నియ్యది సర్వోపనిషత్సార భూతంబుగఁ బరగుచున్నయది.

**అధికమాసము.** ఏచాంద్రమాసమునందు సంక్రాంతి యుండదో దానిని అధికమాస మనియెదరు. సాధారణముగ సంవత్సరమునకు మాసములు పండ్రెండు. కాని యొకప్పుడు పదుమూఁడవ మాసముఁ గూడ వచ్చుచుండును. దానినే యధిక మాసమందురు. అధికమాసపుస్వభావము, అదివచ్చుటకు కారణము కనుఁగొనవలెనన్న మొదట మనము మాసమన నేమియో తెలిసికొనవలెను.

మాసమనఁగా నెల, ముప్పది దినములు కలదియని మనము సాధారణముగ వ్యవహారమందు వాడుకొందుము. కాని పంచాంగము గుఱించు జ్యోతిశ్శాస్త్రజ్ఞులమతమున నాలుగు విధములైన మాసములు కలవు:- ౧ చాంద్రమాసము, ౨ సౌరమాసము, ౩ నాక్షత్రమాసము, ౪ సావన మాసము. మనకు నధికమాసమునుగురించి కావలసిన విషయము బోధపడుటకై మొదటి . రెండు మాసముల స్వభావము తెలిసినఁ జాలును. మిగిలిన రెండు మాసములను గుఱించి మాసశబ్దము క్రింద వ్రాయఁబడును.

చాంద్రమాసము

చంద్రుని గమనమును బట్టి యేర్పరచుకొనిన మాసము.చాంద్ర మాసము. అమావాస్యనుండి అమావాస్యవఱకు గాని పౌర్ణిమనుండి.పౌర్ణిమవఱకుగాని.గతించుకాలమునకు చాంద్రమాసమనిపేరు. అమావాస్యతో ముగిసెడి నెలకు అమాంత్య మాసమని పేరు. దీనినే ముఖ్యచాంద్రమాసమనియెదరు.శుద్ధప్రతిపద (పాడ్యమి) మొదలుకొని బహుళ అమావాస్యవఱకు నీమాసవ్యాప్తి. ఈచాంద్రమాసమే ఆంధ్ర దేశమందంతటను వాడుకలోనున్నది. కర్ణాట, మహారాష్ట్ర దేశములలోఁ గూడ దీనినే యుపయోగించెదరు. బహుళ ప్రతిపద(పాడ్యమి)మొదలుశుద్ధపౌర్ణిమవఱకు వ్యాపించియుండు మాసము గౌణ చాంద్ర మాస మనిపించుకొనును. ఇది కాశ్యాదికములైన యుత్తరదేశములలో ఇప్పుడు వ్యవహారమందున్నది. అమావాస్యయనఁగా సూర్యచంద్రాదులు కలిసి యొక యింటనున్న క్షణము. అప్పుడు వారికిద్దఱకుఁగల యంతరము ౦° అంశము (degree).అనఁగానిద్దఱకు నంతరమేమియు నుండదు.పౌర్ణిమ యనఁగా సూర్యచంద్రాదులకు ౧౮౦° అంశముల యంతరముండు క్షణము. ఎల్లప్పుడును చాంద్రమాస మొకేవిధముగ నుండదు. చంద్రసూర్యుల వేగమునుబట్టి యొకప్పు డది ౨౯ దినములు ౧౯ గంటలు ౩౦ నిమిషముల మితిగలిగి యుండును, మరియొకప్పు డది ౨౯ దినములు ౭ గంటలు ౨౦ నిమిషములు మాత్రము మితిగలిగి యుండును. మధ్యమ మానమున చాంద్రమాస పరిమితి ౨౯ దినములు ౧౨ గంటల ౪౪ నిమిషముల ౨.౮౩

సెకనులు. ఇట్టి నెలలు పండ్రెండైన నొక చాంద్ర సంవత్సరమగును. ఆర్యభట్టుని సిద్ధాంతాను సారముగ ఈ సంవత్సరపు పరిమితి ౩౫౪ దినములు ౮ గంటలు ౪౮ నిమిషములు ౩౪ సెకనులు.

సౌరమాసము

సూర్యుని గమనమును * బట్టి యేర్పరచుకొనినది సౌరమాసము. ఇది అరవదేశమందును బంగాళాదేశమందును వ్యవహారములోనున్నది. సూర్యుఁడు ఒక సంవత్సరములో పండ్రెండు రాసులు తిరిగివచ్చును. అతఁడొకరాసి తిరుగుటకు నెంతకాలము పట్టునో యంతకాలమునకు నొక సౌరమాస మని పేరు. సూర్యుఁడు ఒకరాసినుండి మరియొక రాసిలో ప్రవేశించుటను సంక్రాంతియందురు. ఒకసంక్రాంతి మొదలు మరియొక సంక్రాంతి వఱకుఁ గడచుకాలము సౌరమాసపరిమితి. మేషసంక్రాంతి యనఁగా సూర్యుఁడు మీనము నుండి మేషములోఁ బ్రవేశించు క్షణము. అప్పుడు ఫాల్గుణమాసము పూర్తియై చైత్రమాసము ప్రారంభమగును. వృషభసంక్రాంతితో చైత్రమాసము పూర్తియై వైశాఖమాసము ప్రారంభమగును. ఇట్లే ఇతర మాసములనుగుఱించి తెలిసికొనవలసినది. వీనికి మీనమాసము, మేషమాసము వృషభమాసము మొదలైనపేళ్లు కూడకలవు. వీని వివరమంతయు మాస శబ్దము క్రింద వ్రాయఁబడును. చంద్రునివలెనే సూర్యుఁడు కూడ ఎల్లప్పుడును సమానవేగముతో నడవఁడు. ఒకరాసియందు శీఘ్రముగను మరియొక రాసియందు మందముగను పోవును. అందువలన ఒక సౌరమాసము పొట్టిగను, ఇంకొకసౌరమాసము పొడువుగను ఉండును. ఒకపొట్టి సౌరమాసము ౨౯ దినములు ౭ గంటలు ౩౮ నిమిషములు కలదిగను, ఒకపొడవు సౌరమాసము ౩౧ దినములు ౧౫ గంటలు ౨౮ నిమిషములు కలదిగను ఉండుట తటస్థించును.

సౌరసంవత్సరము

పండ్రెండు సౌర మాసములయిన నొక సౌర సంవత్సరమగును. సూర్యుఁడొక రాసి నుండి బయలుదేరి మరల నారాసియొద్దకు వచ్చుటకు నెంతకాలము పట్టునో యదియొక సౌర సంవత్సరము. సూర్యునిబట్టి సంవత్సరమును లెక్కవేయుట సహజము. ఒకఋతువు పోయి మరల నాఋతువే వచ్చిన నొక యేడాదియగును. ఇట్టి సౌరసంవత్సరము ౩౬౫ దినములు ౬ గంటలు ౧౨ నిముసములు ౩౦ సెక

* నిజముగాఁ దిరుగునది మన భూమియే. మనియు సూర్యుఁడు తిరిగినట్లు కన్పఁబడుటభ్రమయనియుఁ జదువరులెఱిఁగియే యున్నారు. అయినను వ్యవహారమునందు సూర్యుఁడుతిరుగును, సూర్యుఁడీఇంటిలోఁ బ్రవేశించెను, ఆనక్షత్రములోఁ బ్రవేశించెను, అని వాడుకయున్నందున భాషా సౌకర్యార్థమై సూర్యునికి గమనము గలిగినటులే వ్రాయఁబడును. కాని సూర్యగమన మంతయు భూగమనమని జ్ఞప్తి యుంచుకొనవలెను.

సులు కలదియై యుండును. ఇది యార్యభట్టు లెక్క ప్రకారము వేయఁబడినది. క్రీస్తుశక మందలి సంవత్సరములు కూడ సౌరమాన మున నేర్పడినవే. వారి సంవత్సరము ౩౬౫ దినములు ౫ గంటలు ౪౮ నిముసములు ౯౫.౯౮ సెకనులకాలముగలది. కావున మన సౌరసంవత్సరమానమునగాని, ఇంగ్లీషు సౌర మానమున గాని సంవత్సరము లెక్క వేసి కొనుచుండిన, ఋతువులును, పండుగులును, క్రమముగ వచ్చిన తేదులకే వచ్చుచుండును.

నెలలు చంద్రునిబట్టియు, సంవత్సరములు సూర్యునిబట్టియు లెక్కించుకొనుట సకల మానవులకు సహజము. పూర్ణ చంద్రుఁడుతగ్గి మరల హెచ్చిపూర్ణ చంద్రుఁడగుటఁజూచి నెలయైనదనుకొనుట, వర్షాకాలము పోయి మరల వర్షాకాలము వచ్చిన సంవత్సర మయినదనుకొనుట స్వాభావికము. ఇట్లు మాసములు చాంద్రమానము గలవి, సంవత్సరములు సౌరమానము గలవి అయినవి. కాని పండ్రెండు చాంద్రమాస ములయిన నొక సౌరసంవత్సరము కాదు. రమారమి ౧౧ దినములు తక్కువయగును.

చాంద్రమాసములకును సౌర సంవత్సరమునకును లంకె

| | ది. | గం. | ని. | సె. |
|---|---|---|---|---|
| సౌర సంవత్సరము | ౩౬౫. | ౬. | ౧౨. | ౩౦ |
| ౧౨చాంద్రమాసములు | ౩౫౪. | ౮. | ౪౮. | ౩౪ |
| అధికము | ౧౦. | ౨౧. | ౨౩.౫౬ | |

. అనఁగా సౌర సంవత్సరము చాంద్రసంవత్సరమున కంటె రమారమి ౧౧ దినములు పెద్దది. ఆంధ్ర దేశమున వాడుకలో నున్నవి చైత్రాదికములు, చాంద్ర మాసములు. ఇట్టివి పండ్రెండైన సంవత్సరమగును. చైత్రశుద్ధ ప్రతిపదదినమున మనకు సంవత్సరాది పండుగవచ్చును. అరవదేశమున సౌర మాసములు వ్యవహరింతురు. వారికి సంక్రాంతులతో మాసములు ప్రారంభించును. మేష సంక్రాంతికి సంవత్సరాది పండుగు వచ్చును. ఒకానొక సంవత్సరమునందు అఱవ వారి సంవత్సరాది పండుగయు, మన సంవత్సరాది పండుగయు, (అనఁగా సౌరచాంద్ర మాన సంవత్సర ప్రారంభదినములు) ఒక్క దినముననే తటస్థించినవను కొనుము. మరు సటియేడు ఏమగును? రెండు పండుగులు ఒక్కసారే వచ్చునా? కావు. తెలుఁగువారి సంవత్సరాది పండుగ ౧౧ దినములు మొదలు వచ్చును, అరవవారిది తరవాత వచ్చును. మూఁడవయేట తెనుఁగువారి సంవత్సరాది పండుగు అఱవవారిదానికంటె ౨౨దినములు ముందుగ వచ్చును. ఇట్లు చాంద్ర సంవత్సరము సౌరసంవత్సరముకంటెఁ బ్రతియేట రమారమి ౧౧ దినములు వెనుకకు వెనుకకుఁ జరుగును. ఇంగ్లీషు సంవత్సరములుకూడ సౌరమాన మువియగుటచే నా తేదుల నాశ్రయించి యీ సంగతి యే యాలోచింతము. తెలుఁగు సంవత్సరాది పండుగ క్రీ. శ. ౧౯౧౩ లో ౭-వ

ఏప్రిల్ దినమునను ౧౯౧౪ లో ౨౭ వ మార్చి దినమునను, ౧౯౧౫ లో ౧౬-వ మార్చి దినమునను వచ్చినది. ఇట్లీ సంవత్సరాది పండుగును వెనుకకు వెనుకకుఁ బోనిచ్చినయెడల తురకల పీర్ల పండుగువలె మన పండుగులన్నియు నొకప్పుడు వర్షాకాల మందును నొకప్పుడు శీత కాలమందును నొకప్పు డెండ కాలమందును వచ్చియుండును! అట్లుగాకుండ చాంద్రమాన సంవత్సరాదిని, సౌరమాన సంవత్సరాది పండుగకు వీలయినంత సమీపమున నుంచవలయునని రమారమి మూఁడు సంవత్సరముల కొకసారి చాంద్రమాసములలో నొక అధిక మాసమేర్పర్చఁబడినది. అనఁగా ఆసంవత్సరమునకు పండ్రెండు నెలలుకావు; పదమూఁడు నెలలు!

## అధికమాస పట్టిక ౧

(శా. శ. ౧౭౧౬-౧౭౩౫; క్రీ. శ. ౧౭౯౪-౧౮౧౩)

| సంఖ్య | సంవత్సరము పేరు | శాలివాహన శకము | చాంద్రమాన సంవత్సరాది వచ్చిన ఇంగ్లీషు తేది | క్రీ. శ. | అధిక మాసములు |
|---|---|---|---|---|---|
| ౧ | జయ | ౧౭౧౬ | ౭ ఏప్రిల్ | ౧౭౯౪ | |
| ౨ | మన్మథ | ౧౭౧౭ | ౨౭ మార్చి | ౧౭౯౫ | |
| ౩ | దుర్ముఖి | ౧౭౧౮ | ౧౫ మార్చి | ౧౭౯౬ | అధిక జ్యేష్ఠము |
| ౪ | హేవిళంబి | ౧౭౧౯ | ౩ ఏప్రిల్ | ౧౭౯౭ | |
| ౫ | విళంబి | ౧౭౨౦ | ౨౩ మార్చి | ౧౭౯౮ | అధిక ఆశ్వీజము |
| ౬ | వికారి | ౧౭౨౧ | ౧౧ ఏప్రిల్ | ౧౭౯౯ | |
| ౭ | శార్వరి | ౧౭౨౨ | ౩౧ మార్చి | ౧౮౦౦ | |
| ౮ | ప్లవ | ౧౭౨౩ | ౨౧ మార్చి | ౧౮౦౧ | అధిక శ్రావణము |
| ౯ | శుభకృతు | ౧౭౨౪ | ౯ ఏప్రిల్ | ౧౮౦౨ | |
| ౧౦ | శోభకృతు | ౧౭౨౫ | ౩౦ మార్చి | ౧౮౦౩ | |
| ౧౧ | క్రోధి | ౧౭౨౬ | ౧౮ మార్చి | ౧౮౦౪ | అధిక జ్యేష్ఠము |
| ౧౨ | విశ్వావసు | ౧౭౨౭ | ౫ ఏప్రిల్ | ౧౮౦౫ | |
| ౧౩ | పరాభవ | ౧౭౨౮ | ౨౫ మార్చి | ౧౮౦౬ | |
| ౧౪ | ప్లవంగ | ౧౭౨౯ | ౧౫ మార్చి | ౧౮౦౭ | అధిక చైత్రము |
| ౧౫ | కీలక | ౧౭౩౦ | ౨ ఏప్రిల్ | ౧౮౦౮ | |
| ౧౬ | సౌమ్య | ౧౭౩౧ | ౨౨ మార్చి | ౧౮౦౯ | అధిక శ్రావణము |
| ౧౭ | సాధారణ | ౧౭౩౨ | ౧౦ ఏప్రిల్ | ౧౮౧౦ | |
| ౧౮ | విరోధికృతు | ౧౭౩౩ | ౩౧ మార్చి | ౧౮౧౧ | |
| ౧౯ | పరీధావి | ౧౭౩౪ | ౧౯ మార్చి | ౧౮౧౨ | అధిక ఆషాఢము |
| ౨౦ | ప్రమాదీచ | ౧౭౩౫ | ౭ ఏప్రిల్ | ౧౮౧౩ | |

మూఁడు సంవత్సరములల్లో నొకయధిక మాసమని పైని చెప్పినది మోటులెక్క.

గణనా విధానము

ఇంకను సూక్ష్మముగఁ బోయిన ౧౯ సౌర సంవత్సరములలో ౭ అధిక మాసములువచ్చును. అనఁగా ౨౨౮ సౌరమాసములు ౨౩౫ చాంద్రమాసములతో సమానము. ఈ రెంటి లోను కొంచెము హెచ్చుతక్కువగ ౬౯౩౯. ౭౫ దినములు (౬౯౩౯ దినములు ౪౫ గడియలు) కలవు. కావున సౌరచాంద్రమాన సంవత్సరములు ౧౯ సౌర సంవత్సరములలోఁ గలిసికొని పోవుచుండును. అనఁగా నొకానొక సంవత్సరమున (చాంద్రమాన) సంవత్సరాది, సౌరమాన ప్రకారము ఒక తేదికి వచ్చిన దనుకొనుఁడు. మరల నా తేదికి సంవత్సరాది వచ్చుటకు ౧౯ సంవత్సరములు పట్టును. ఈమధ్య సంవత్సరాది పండుగు అధికమాసముల ననుసరించి వెనుకకు, ముందు నకుఁ బోవుచుండును. ౧౯ సంవత్సరముల కాలములోపల ఈతిథి (చైత్ర శు ౧) ఎట్లెట్లు మారునో ప్రక్కపుటలోని పట్టికను జూచిన తెలియఁగలదు. ఇందు క్రీ.శ.౧౮౯౪ మొదలు ౧౯౧౩ వఱకు నే యే సంవత్సరమున నే యే యింగ్లీషు తేదిని సంవత్సరాది (చైత్రశు ౧) వచ్చినది చూపఁబడినది. ౧౮౯౪ లో ౭-వ ఏప్రిలు దినమున వచ్చినది, ౧౯ సంవత్సరములకు మరల ౧౯౧౩ లో ౭-వ ఏప్రిలుకు వచ్చినది. ఒకానొకప్పుడు తిథులగడియల హెచ్చుతగ్గులచే సంవత్సరాది, యొక తేది హెచ్చుగగాని, తక్కువగగాని రావచ్చును.

౧౯ సంవత్సరములలో ౭ అధిక మాసములు వచ్చునంటిరి, సరే. కాని యేయేట ఈమాసమే యధికమని యెట్లు? ఏదోయొక మాసమధికమని యనుకొనఁ గూడదా? యని కొందఱడుగవచ్చును.

అధిక మాసముల పేళ్లు

మాసములకు మనవారు సంక్రాంతులనుబట్టి పేళ్లుపెట్టి యున్నారని యిదివఱకె వ్రాసియున్నాము. ఏనెల లో మేష సంక్రాంతియగునో యది చైత్రము, ఏనెలలో వృషభ సంక్రాంతియగునో యది వైశాఖము. ఈ క్రిందిపట్టిక వలన సంక్రాంతులకును, చాంద్రమాన నామములకును గల సంబంధము తెలియఁగలదు.

| | | |
|---|---|---|
| మేష సంక్రాంతి | గలది | చైత్రము |
| వృషభ సంక్రాంతి | ,, | వైశాఖము |
| మిథున సంక్రాంతి | ,, | జ్యేష్ఠము |
| కర్కాటక సంక్రాంతి | ,, | ఆషాఢము |
| సింహసంక్రాంతి | ,, | శ్రావణము |
| కన్యా సంక్రాంతి | ,, | భాద్రపదము |
| తులా సంక్రాంతి | ,, | ఆశ్వీజము |
| వృశ్చిక సంక్రాంతి | ,, | కార్తికము |
| ధనుస్సంక్రాంతి | ,, | మార్గశిరము |
| మకర సంక్రాంతి | ,, | పుష్యము |
| కుంభ సంక్రాంతి | ,, | మాఘము |
| మీన సంక్రాంతి | ,, | ఫాల్గునము |

మేషసంక్రాంతిగలది చైత్రమాసమనఁగా నేమి? చైత్ర శుద్ధ ౧ లు మొదలు చైత్ర బ. ౩౦ ల వఱకు నెప్పుడైనను మేష సంక్రాంతి కావలెను; సూర్యుఁడు మీనములోనుండి మేషరాసిలోఁ బ్రవేశింపవలెను. ఇట్లే మిగిలిన నెలలను గుఱించి యెఱుఁగవలయును. ఇట్లు చాంద్రమాసముల పేళ్లేర్పడినను, ఒకానొక చాంద్ర మాసములో సంక్రాంతి లేక పోవచ్చును. అప్పుడా నెల కేమిపేరు? అదియే యధికమాసము. ఒకానొక చాంద్ర మాసమున సంక్రాంతియేల లేక పోవచ్చునని చదువరు లడుగవచ్చును. ఒక సంక్రాంతి యొద్దనుండి మఱియొక సంక్రాంతివఱకు గడుచుకాలము సౌరమాసముగదా? శుద్ధ ౧ మొదలు బహుళ ౩౦ వఱకు గడచుకాలము చాంద్రమాసము. ఈ సంగతి జ్ఞాపకముంచుకొనిన ఈ క్రింది సంగతులు బోధపడఁగలవు.

చాంద్రమాన చైత్రమున మేషసంక్రాంతి కావలెను గదా. మేష సంక్రాంతికిని వృషభ సంక్రాంతికిని నడుమ ౩౧ దినములు ౫౬ గడియల కాలము గడుచును. చైత్ర మాసము చివరచివర సూర్యుఁడు మేషమందుఁ బ్రవేశించినాఁడను కొనుము. ఈసంక్రాంతియైన మరునాఁడు (అనఁగా ఒక రోజు లేక ౬౦ గడియలైన తరువాత) చైత్ర బహుళ ౩౦ అయి, వైశాఖ శుద్ధ ౧ ప్రతిపద వచ్చిన దనుకొందము. చాంద్ర మాసమైన వైశాఖమునకు ౨౯ దినముల ౩౨ గడియలే వ్యాప్తి కలదు. అనఁగా నింత కాలములో మరల నొక యమావాస్యవచ్చును. శుద్ధ పాడ్యమి వచ్చును. కాని యింకను వృషభ సంక్రాంతి రాలేదు. కావున ఈ చాంద్ర మాసములో ఏ సంక్రాంతియు నుండదు. ఇది రెండు సంక్రాంతుల నడుమ పడిపోయినది. కావున నిది యధికమాసము. ఇది అధిక వైశాఖము. దీనిని వైశాఖమే యని యేల అనవలయునన్న, ఈనెల కాఁగానే వచ్చునెలలో వృషభ సంక్రాంతి యగును. కావున దానికి వైశాఖమని పేరుపెట్టుట సహజము గదా? దాని వెనుకది యిది కావున దీనిని అధికవైశాఖమనిరి. మొదట అధిక మాసము పాటించి తరువాత నిజ మాసము పాటింపవలయునన్న నియమము పెట్టుకొనినందున దీనిని అధిక వైశాఖమనిరి. కాని మొదట నిజమాసమును, తరువాత అధికమాసమును లెక్కవేయవలయునని యేర్పాటు చేసికొన్న యెడల నిదియే యధికచైత్రమై యుండును. దీనికిఁబూర్వము వచ్చినది నిజచైత్రమైయుండును. రెండు సంక్రాంతులకు నడుమనున్న సౌరమాసములు పెద్దవిగా ఉండుటయు, ఆ సంక్రాంతుల కే నడుమనున్న చాంద్రమాసములు చిన్నవగుటయు తటస్థించినపుడు ఇట్లు అధిక మాసము వచ్చును.

౧౯౧౬-వ సంవత్సరము ౩-వ ఏప్రిల్‌తో బూర్తియైన రాక్షసనామ సంవత్సరమునందు అధిక వైశాఖము వచ్చినది. అట్లెందుకు

వచ్చినదో చూచిన యెడల ఈ విషయ మింకను స్పష్టముకాఁగలదు. సూర్య సిద్ధాంత ప్రకారము, ౧౩-వ ఏప్రిల్ (౧౯౧౫) దినమున ౩౦ గడియలకు మేష సంక్రాంతి ప్రవేశ మైనది. అనఁగా సూర్యుఁడు మీనమునుండి మేషములోనికిఁ బ్రవేశించినాఁడు. ఆవేళ చైత్ర బ॥ ౧౪ మంగళవారము. ఈ తిథి సూర్యోదయాది ౨౦ గడియల ౩౦ విగడియల వఱకు నాదినమున నున్నది. ౧౪-వ ఏప్రిల్ (బుధవారము) దినమున ౨౩-౩౦ కి అమావాస్య గడియలు ముగిసి చైత్రమ్మాసము సమాప్తమైనది. క్రొత్తమాసము (వైశాఖము) ప్రారంభమైనది*. ఈ వైశాఖమాసము ౧౪-వ మే (శుక్రవారము) దినమున ౩-౩౦ కి ముగిసినది. అనఁగా అప్పటికి అమావాస్య గడియలు పూర్తి అయినవి. ఇట్లు చైత్రబహుళ అమావాస్య మొదలు ఈ అమావాస్య వఱకు సంక్రాంతిలేదు. సూర్యుఁడు ఒక్క రాసిలోనే (మేషమందే) యున్నాఁడు. ఆ దినమే (౧౪-వ మే) ౨౬ గడియలకు వృషభ సంక్రాంతి ప్రవేశమైనది. పాడ్యమి గడియలలో సంక్రాంతి పడ్డది. కావున ఆ నెల నిజవైశాఖము. దానికిఁ బూర్వపుదియు, సంక్రాంతిలేనిదియు నైన చాంద్రమాసము అధిక వైశాఖము. ఇట్లు రాక్షస నామ సంవత్సరమున, చైత్ర శుద్ధ ౧౪ నాఁడు (౧౩ ఏప్రిల్) మేష సంక్రాంతియు, నిజ వైశాఖ శుద్ధ ౧ నాఁడు (౧౪-మే) వృషభ సంక్రాంతియు సంభవించి, నడుమ గడిచిన ఒక చాంద్ర మాసమునందు, సంక్రాంతి లేనందున అధిక మాసము వచ్చినది.

ఇంకొక విశేషము. ౧౪-వ మే (శుక్రవారము) దినమున, అమావాస్య వచ్చినది, సంక్రాంతి వచ్చినది. కాని అమావాస్య గడియ లైపోయిన తరువాత, సంక్రాంతి వచ్చినది. కావున అధిక మాసమైనది. అట్లుగాక అమావాస్య గడియల లోపుగ సంక్రాంతి పడ్డయెడల నది నిజ వైశాఖమై యుండును. అధిక మాసము లేకపోవును. కావున అధిక మాసము నిర్ణయించుటలో అమావాస్య గడియలు విగడియలును, సంక్రాంతి గడియలు విగడియలును అతి సూక్ష్మముగ లెక్క వేయవలసియుండును.

మన దేశమందలి జ్యోతిష్కులు సాధారణముగ ౨౨౮ సౌర మాసములను ౨౮, ౩౪, ౩౫, ౨౮, ౩౪, ౩౪, ౩౫ నెలలుగ ఏడు భాగములుచేసి ఇన్నిన్ని నెలల తరువాత నొక్కొక్క అధిక మాసము వచ్చునని లెక్క వేయుచున్నారు. ౨౨౮ సౌర మాసము లనఁగా ౧౯ సంవత్సరములు. కాని ౨౨౮ సౌరమాసములకంటె ౨౩౫ చాంద్రమాస

* ౧౪-వ ఏప్రిల్ దినమున ౨౩ గడియలు, ౩౦ విగడియలు తరువాత అమావాస్య అయిపోయినను వ్యవహారమునకు ఆ దినమంతయు నమావాస్యయే. ఆ దినము చైత్ర మాసములోనిదే. గణితమునకు మాత్రము ఆ దినమున అధిక వైశాఖము ప్రారంభమగును.

ములు ౫ గంటల కాల మెక్కుడు. ఇట్లు ౪౫౬ సంవత్సరములలో ౫ తిథులు ఎక్కువ వచ్చును. కావున ౧౯ సంవత్సరములకు ౭ అధిక మాసము లన్న లెక్క కూడ వందల సంవత్సరములు గడవఁ గామారును. అందుచే నెప్పటికప్పుడు సిద్ధాంతములను దిద్దుకొనుచు లెక్క వేయువలయును.

సౌరచాంద్రమాసముల మితి (దినసంఖ్య) తెలుపుటకు నొక పట్టిక (౨) యీయఁ బడినది.* దీనివలన ఏయే సౌరమాస మేయే చాంద్ర మాసమునకు సంబంధించినదియు, ఒకటి కంటె మఱియొకటి యెంత పెద్దది యైనదియుఁ దెలియును. సౌరవత్సరము ప్రారంభమైన తరువాత నెంతకాలమునకు అమావాస్య (అనఁగా చాంద్రమాసము) వచ్చినయెడల ఏనెల యధికమాస మగు నో ౩-వ పట్టికవలనఁ దెలియును. (సౌర) మేషమాసము మితి ౩౦.౯౩౫౨౮ దినములు అనఁగా రమారమి ౩౦ దినములు, ౫౬ గడియలు, ౭ విగడియలు. ఆ మాసము జరుగుచుండఁగా వచ్చినట్టి (చాంద్ర) వైశాఖ మాసము మితి ౨౯.౫౩౦౫౮౯ దినములు. అనఁగా రమారమి ౨౯ దినములు ౩౧ గడియలు ౫౦ విగడియలు. ఈ రెంటికిని భేదము ౧.౪౦౪౬౯ దినములు. అనఁగా ౧ దినము ౨౪ గడియల ౧౭ విగడియలు. కావున (సౌర) మేషమాసము ప్రారంభమైనతరువాత (చాంద్ర) వైశాఖము ౧ దినము ౨౫ గడియల ౧౭ విగడియలకు లోపల ప్రారంభమాయెనా, ఆ చాంద్రమాసము నందు మరల సంక్రాంతిరాదు. అనఁగా వైశాఖ మాసము అయిపోయిన తరువాతఁగాని సూర్యుఁడు మేషమునుండి వృషభమునకు బోఁడు. కావున సంక్రాంతి లేనిది యగుటచే వైశాఖము అధికమాస మగును. సౌర మాసము ప్రవేశించిన తరువాత ౧ దినము ౨౫ గడియలు ౧౭ విగడియల కాలము తరువాత వైశాఖము ప్రవేశించెనా అది యధిక మాసము కానేరదు. వృషభమాసము పూర్తి యగువఱకు (సౌర) సంవత్సరాదినుండి ౬౨.౩౫౫౫ దినములు (మేషము ౩౦.౯౩౫౨౮ + వృషభము ౩౧.౪౨౦౨౮ అగును. చాంద్ర మాస జ్యేష్ఠము పూర్తి యగువఱకు ౫౯.౦౬౧౧౭ దినములు (వైశాఖము ౨౯.౫౩౦౫౯ + జ్యేష్ఠము ౨౯.౫౩౦౫౮) అగును. ఈ రెండు సంఖ్యలకును భేదము ౩.౨౯౪౩౮ దినములు. కావున సౌర సంవత్సరము ప్రారంభమైన తరువాత మొదటి అమావాస్య ౧.౪౦౪౬౬ దినముల తరువాతను ౩.౨౬౪౩౮ దినముల లోపలను వచ్చెనా ఆ యేడు జ్యేష్ఠము అధిక మాసమగును. లేనియెడల కాదు. ఇట్లే యితర మాసములను గుఱించి యెఱుఁగునది.

* ఈ పట్టికయు నితర పట్టికలును దివాన్ బహదరు స్వామికణ్ణు పిళ్లెగారి గ్రంథము ననుసరించి సిద్ధము చేయఁ బడినవి. కావున ప్రస్తుత లేఖకుఁడు వారి యెడ నెంతయుఁ గృతజ్ఞుఁడు.

సారాంశము, ఒక్క సౌరమాసములో (సంక్రాంతినుండి సంక్రాంతి వఱకు) రెండు అమావాస్యలు వచ్చినయెడల మొదటి యమావాస్యకును రెండవ అమావాస్యకును నడుమనున్న నెల యధికమాస మగును. అతి సూక్ష్మముగ లెక్కరావలెనని పట్టికలలో అయిదు స్థలముల వఱకు దశాంశాంకములు (Five places of decimal) ఈయఁబడినవి. ఈ దశాంశ సంఖ్యలు దినములో ఇన్నవభాగ మని తెల్పును. వీనిని ౬౦ తో హెచ్చించిన గడియలు వచ్చును. శేషమును ౬౦ తో హెచ్చించిన విగడియలు వచ్చును, ౨౪ తో హెచ్చించిన గంటలువచ్చును, శేషమును ౬౦ తో హెచ్చించిన మినిట్లు వచ్చును. ఈలెక్కలన్నియు సూర్య సిద్ధాంతము ననుసరించినవి.

౨,3 పట్టికలలో చైత్రమాసము మొదట వేయుటకు మారు చివరనేలవేయఁబడినదన్న సంశయము రావచ్చును. సౌర మీనమాసమునందు చాంద్రచైత్రమాసము * ప్రారంభమగును. అనఁగా సౌర సంవత్సరాంత మాసము జరుగుచుండఁగా చాంద్రసంవత్సరాది మాసము ప్రారంభ మగును. కావున మీన మాసముతోఁబాటు చైత్రమాసము వేయఁబడినది. అట్లే యే సౌర మాసము జరుగుచుండఁగా నేచాంద్రమాసము ప్రారంభమగునో యాచాంద్రమాస మా సౌరమాసముతోఁబాటు ఒక్కపంక్తిలోఁ జూపఁబడినది.

అధిక క్షయమాసముల స్థితియన్న 3-వ పట్టికనుబట్టి మధ్యమమానమునవచ్చు అధిక మాసములను లెక్కింపవచ్చును. స్పష్టమాన మునఁ గావలయునన్న సంస్కారముఁ జేసికొనవలెను. ౧౦-వ శతాబ్దమునకు పూర్వము మనజ్యోతిష్కులు మధ్యమ మానము ననుసరించియే అధికమాసములు లెక్కవేయుచుండిరి. కాని తరువాత స్పష్టమానముననే అధిక మాసములు లెక్కవేయఁ జొచ్చిరి. స్పష్టమానముతో వేసినలెక్క ప్రకారము కూడ నొకప్పుడు లెక్కతప్పును. అధికమాసముల లెక్కవేయు గణికుఁడు తన తారతమ్యాజ్ఞానమును ఉపయోగింపవలెను. కావుననే, భాస్కరాచార్యుఁడు తన సిద్ధాంత శిరోమణి యందు నిట్లువ్రాసియున్నాఁడు:-

స్పష్టోఽధిమాసః పతితోఽప్య లబ్ధో
యదాయదా వాఽపతితోఽపి లబ్ధః।
నైకైనిరైకైః క్రమశోఽధి మాసై
స్తద్వాదినౌఘః సుధియా ప్రసాధ్యః॥

స్పష్టమానపు లెక్క ప్రకారము అధిక మాసము వచ్చినను ఒకప్పుడు నిజముగా రాదు, ఒకప్పుడు లెక్కప్రకారము రాకపోయినను నిజముగా వచ్చును. కావున నధిక మాసముల సంఖ్యనుండి వీలు ప్రకారము ఒక్కటి యెక్కించిగాని, తగ్గించిగాని అహర్గణమును కనుఁగొనవలయును.

* సౌర మీనమాసమునందు చాంద్రచైత్రము ప్రారంభమగును, చాంద్ర చైత్రమునందు మేష సంక్రాంతి వచ్చును అని చదువరుల తెలిసికొనవలెను.

ఏచాంద్రమాసమునందు రెండు సంక్రాంతులు కలుగునో దానికి క్షయమాస మని పేరు. చాంద్ర

క్షయమాసము

మాసము పెద్దదియు, సౌరమాసము చిన్నదియు నైనప్పుడు, ఆ చాంద్ర మాసమునందు సూర్యుఁడు ఒకరాసి దాటి యింకొక రాసిలోనికిఁ బోయి మరల దానిఁదాటి మూఁడవ రాసిలోనికిఁ బోవును. ఇట్లు ఒక్క (చాంద్ర) మాసమునందు రెండు సంక్రాంతులు వచ్చును. కావున ఆ నెలకు రెండు పేళ్లు పెట్టవలసియుండును. అందుచే నొక్క నెలను అణఁచివేసెదరు. ఇట్లు క్షయ మాసము వచ్చిన సంవత్సరము ౧౧ నెలల సంవత్సరము కావలసినదే కాని, క్షయ మాసము వచ్చినయేడు తప్పక అధికమాసము వచ్చును. కావున ఆ సంవత్సరమునందు ౧౨ నెలలు పూర్తి యగును. క్షయ మాసములు మిక్కిలి అరుదు. ౧౦౦ సంవత్సరములలో నొక రెండు క్షయమాసములు మాత్రము వచ్చును. శా. శ. ౧౭౪౪ (క్రీ. శ. ౧౮౨౨-౨౩) లో పుష్యము క్షయ మాసము వచ్చెను. మరల శా. శ. ౧౮౮౬ (క్రీ. శ. ౧౯౬౩-౬౪) లోఁ గాని క్షయమాసము రాదు. ఎప్పుడు వచ్చినను క్షయమాసములు మార్గశిర, పుష్య మాఘ మాసములలోనే వచ్చును. ఎందుకనఁగా ఈచాంద్రమాసములకును ౨౯ దినముల వ్యాప్తిగల సౌర మాసములతో సంబంధము కలదు. ౧౯౧౫ మొదలు ౧౯౭౫ వఱకు వచ్చెడి యధిక క్షయ మాసముల పట్టిక (౪) చివర నీయఁబడినది.

(కో. ల)

## సౌరచాంద్ర మాసమితి పట్టిక ౨

| | సౌర మాసము | చాంద్ర మాసము | సౌర మాసమితి | చాంద్ర మాసమితి |
|---|---|---|---|---|
| ౧ | మేషము | వైశాఖము | ౩౦.౯౩౫౨౮ | ౨౯.౫౩౦౫౯ |
| ౨ | వృషభము | జ్యేష్ఠము | ౩౧.౪౨౦౨౮ | ౨౯.౫౩౦౫౮ |
| ౩ | మిథునము | ఆషాఢము | ౩౧.౬౪౪౭౨ | ౨౯.౫౩౦౫౯ |
| ౪ | కర్కాటకము | శ్రావణము | ౩౧.౪౭౫౨౮ | ౨౯.౫౩౦౫౯ |
| ౫ | సింహము | భాద్రపదము | ౩౧.౦౧౮౬౧ | ౨౯.౫౩౦౫౮ |
| ౬ | కన్య | ఆశ్వీజము | ౩౦.౪౪౧౩౮ | ౨౯.౫౩౦౬౦ |
| ౭ | తుల | కార్తికము | ౨౯.౮౯౩౩౩ | ౨౯.౫౩౦౫౮ |
| ౮ | వృశ్చికము | మార్గశిరము | ౨౯.౪౯౦౨౭ | ౨౯.౫౩౦౫౯ |
| ౯ | ధనుస్సు | పుష్యము | ౨౯.౩౧౭౭౭ | ౨౯.౫౩౦౫౯ |
| ౧౦ | మకరము | మాఘము | ౨౯.౪౪౮౦౫ | ౨౯.౫౩౦౫౯ |
| ౧౧ | కుంభము | ఫాల్గుణము | ౨౯.౮౨౦౨౭ | ౨౯.౫౩౦౫౯ |
| ౧౨ | మీనము | చైత్రము | ౩౦.౩౫౩౪౮ | ౨౯.౫౩౦౫౮ |

# అధిక క్షయమాసమితి పట్టిక ౩

| | సౌరమాసము | చాంద్రమాసము | సౌరమాసమితి | చాంద్రమాసమితి | సౌరసంవత్సరాది తరువాత ఎన్నిదినములకు అమావాస్య వచ్చిన అధికమాసమగును ? |
|---|---|---|---|---|---|
| | ౧ | ౨ | ౩ | ౪ | ౫ |
| ౧ | మేషము | వైశాఖము | ౩౦.౯౩౫౨౮ | ౨౯.౫౩౦౫౯ | * ౧.౪౦౪౬౯ ది పూర్వము |
| ౨ | వృషభము | జ్యేష్ఠము | ౬౨.౩౫౫౫౫ | ౫౯ ౦౬౧౧౭ | ౩.౨౯౪౩౮ ది ,, |
| ౩ | మిధునము | ఆషాఢము | ౯౪.౦౦౦౨౮ | ౮౮.౫౯౧౭౬ | ౫.౪౦౮౫౧ ది ,, |
| ౪ | కర్కాటకము | శ్రావణము | ౧౨౫.౪౭౫౫౫ | ౧౧౮ ౧౨౨౩౫ | ౭.౩౫౩౨౦ ది ,, |
| ౫ | సింహము | భాద్రపదము | ౧౫౬.౪౯౪౧౭ | ౧౪౭.౬౫౨౯౩ | ౮.౮౪౧౨౨ ది ,, |
| ౬ | కన్య | ఆశ్వీజము | ౧౮౬.౯౩౫౫౫ | ౧౭౭.౧౮౩౫౩ | ౯.౭౫౨౦౧ ది ,, |
| ౭ | తుల | కార్తీకము | ౨౧౬.౮౨౮౮౮ | ౨౦౬.౭౧౪౧౧ | ౧౦.౧౧౪౭౫ ది ,, |
| ౮ | వృశ్చికము | మార్గశిరము | ౨౪౬.౩౧౯౧౬ | ౨౩౬.౨౪౪౭౦ | †౧౦.౦౭౪౪౬ ది పరము<br>౧౦.౧౧౪౭౫ ది పూర్వము |
| ౯ | ధనుస్సు | పుష్యము | ౨౭౫.౬౩౬౯౪ | ౨౬౫.౭౭౫౨౯ | ౯.౮౬౧౬౪ ది పరము<br>౧౦.౧౧౪౭౫ ది పూర్వము |
| ౧౦ | మకరము | మాఘము | ౩౦౫.౦౮౪౯౯ | ౨౯౫.౩౦౫౮౮ | ౯.౭౭౯౧౦ ది పరము<br>౯.౮౬౧౬౪ ది పూర్వము |
| ౧౧ | కుంభము | ఫాల్గుణము | ౩౩౪.౯౦౫౨౭ | ౩౨౪.౮౩౬౪౭ | § ౯.౭౭౯౧౨ ది పరము<br>౧౦.౦౬౮౮౦ ది పూర్వము |
| ౧౨ | మీనము | చైత్రము | ౩౬౫.౨౫౮౭౫ | ౩౫౪.౩౬౭౦౫ | ౧౦.౦౬౮౮౦ ది పరము<br>౧౦.౮౯౧౭౦ ది పూర్వము |

* సౌరసంవత్సరము ప్రారంభమైన తరువాత మొదటి అమావాస్య ఈక్రింద నుదాహరించిన దినములకు పూర్వము వచ్చినయెడల ౨-వ ఇంట్లో జూపఁబడిన చాంద్రమాసము ఆసంవత్సరము అధికమాసమగును.

† ఉదాహరించినట్లు కొన్ని దినములకు పూర్వమును, కొన్ని దినములకు పరముగను వచ్చినయెడల ౨-వ యింట్లో జూపఁబడిన చాంద్రమాస మాసంవత్సరము అధికమాసమగును.

§ సౌరసంవత్సరము ప్రారంభమైన తరువాత మొదటి అమావాస్య ఈ క్రింద నుదాహరించిన దినములకు పూర్వము వచ్చినయెడల ౨-వ ఇంట్లో జూపఁబడిన చాంద్రమాసము ఆసంవత్సరము అధికమాసమగును.

అఱువది సంవత్సరముల

# అధిక క్షయ మాస పట్టిక ౪

(౧౯౧౫ - ౧౯౭౫)

| | సంవత్సరము పేరు | ఏ నెల అధికము | శాలివాహన శకము | క్రీస్తు శకము | అధికమాస మెప్పుడు ప్రారంభమై, ఎప్పుడు ముగియును? |
|---|---|---|---|---|---|
| ౧ | రాక్షస | వైశాఖము | ౧౮౩౭ | ౧౯౧౫ | ౧౫ ఏప్రిల్—౧౪ మే |
| ౨ | పింగళ | భాద్రపదము | ౧౮౩౯ | ౧౯౧౭ | ౧౮ ఆగష్టు—౧౬ సెప్టెంబరు |
| ౩ | రౌద్ర | శ్రావణము | ౧౮౪౨ | ౧౯౨౦ | ౧౬ జులై—౧౪ ఆగష్టు |
| ౪ | రుధిరోద్గారి | జ్యేష్ఠము | ౧౮౪౫ | ౧౯౨౩ | ౧౬ మే—౧౪ జూన్ |
| ౫ | అక్షయ | చైత్రము | ౧౮౪౮ | ౧౯౨౬ | ౧౫ మార్చి—౧౨ ఏప్రిల్ |
| ౬ | విభవ | శ్రావణము | ౧౮౫౦ | ౧౯౨౮ | ౧౮ జులై—౧౫ ఆగష్టు |
| ౭ | ప్రజోత్పత్తి | ఆషాఢము | ౧౮౫౩ | ౧౯౩౧ | ౧౭ జూన్—౧౫ జులై |
| ౮ | భావ | వైశాఖము | ౧౮౫౬ | ౧౯౩౪ | ౧౩ ఏప్రిల్—౧౩ మే |
| ౯ | ధాత | భాద్రపదము | ౧౮౫౮ | ౧౯౩౬ | ౧౮ ఆగష్టు—౧౫ సెప్టెంబరు |
| ౧౦ | ప్రమాది | శ్రావణము | ౧౮౬౧ | ౧౯౩౯ | ౧౭ జులై—౧౫ ఆగష్టు |
| ౧౧ | చిత్రభాను | జ్యేష్ఠము | ౧౮౬౪ | ౧౯౪౨ | ౧౬ మే—౧౩ జూన్ |
| ౧౨ | పార్థివ | చైత్రము | ౧౮౬౭ | ౧౯౪౫ | ౧౫ మార్చి—౧౨ ఏప్రిల్ |
| ౧౩ | సర్వజిత్తు | శ్రావణము | ౧౮౬౯ | ౧౯౪౭ | ౧౯ జులై—౧౬ ఆగష్టు |
| ౧౪ | వికృతి | ఆషాఢము | ౧౮౭౨ | ౧౯౫౦ | ౧౬ జూన్—౧౫ జులై |
| ౧౫ | విజయ | వైశాఖము | ౧౮౭౫ | ౧౯౫౩ | ౧౪ ఏప్రిల్—౧౩ మే |
| ౧౬ | మన్మథ | భాద్రపదము | ౧౮౭౭ | ౧౯౫౫ | ౧౮ ఆగష్టు—౧౬ సెప్టెంబరు |
| ౧౭ | విళంబి | శ్రావణము | ౧౮౮౦ | ౧౯౫౮ | ౧౭ జులై—౧౫ ఆగష్టు |
| ౧౮ | ప్లవ | జ్యేష్ఠము | ౧౮౮౩ | ౧౯౬౧ | ౧౫ మే—౧౩ జూన్ |
| ౧౯ | శోభకృతు* | ఆశ్వీజము | ౧౮౮౫ | ౧౯౬౩ | ౧౮ సెప్టెంబరు—౧౭ అక్టోబరు |
| ౨౦ | క్రోధి | చైత్రము | ౧౮౮౬ | ౧౯౬౪ | ౧౫ మార్చి—౧౨ ఏప్రిల్ |
| ౨౧ | పరాభవ | శ్రావణము | ౧౮౮౮ | ౧౯౬౬ | ౧౯ జులై—౧౬ ఆగష్టు |
| ౨౨ | సౌమ్య | ఆషాఢము | ౧౮౯౧ | ౧౯౬౯ | ౧౫ జూన్—౧౪ జులై |
| ౨౩ | పరీధావి | వైశాఖము | ౧౮౯౪ | ౧౯౭౨ | ౧౪ ఏప్రిల్—౧౩ మే |
| ౨౪ | ఆనంద | భాద్రపదము | ౧౮౯౬ | ౧౯౭౪ | ౧౮ ఆగష్టు—౧౬ సెప్టెంబరు |

* ఈ సంవత్సరము పుష్యము క్షయమాసము. క్షయమాసమువచ్చిన సంవత్సరము అధికమాసముకూడా తప్పకవచ్చును. కావున ఈయేడు అధికమాసముకూడ వచ్చినది.

**అధికారి.** మళయాళ్ల దేశమునందు గ్రామ మునసబు 'అధికారి' యనఁబడును. అగముడ యనులు, బడగలు, అను జాతి వారిలోఁ గొందఱ కధికారులను పేరుగలదు. ఓఢ్ర జాతివారిలో కొన్ని గ్రామాధికారుల కును, దక్షిణ కనరా జిల్లాలో 'స్థానిక' అను శాఖ వారికిని ఈ నామము కలదు.

**అధిరాజరాజు.** ఇతఁడు చోళదేశపు రాజు. క్రీ. శ. ౧౦౭౦ లో మరణము నందిన వీరరాజేంద్రుని కుమారుఁడు. రాజ్యమునందంతఃకలహములు పెక్కులుండినందున తండ్రిపోయినవెంటనే ఈ తనికిని రాజ్యము స్వాధీనమైనదికాదు. విఖ్యాతుఁడగు విక్రమాదిత్య చాళుక్యుఁడీతని బావమఱఁది. అతని సాయమువలన 'అధిరాజరాజు' క్రీ. శ. ౧౦౭౨ సంవత్సరమున చోళరాజ్యమును వశపఱచుకొనెను. కాని యాతఁడు ప్రజానురంజకుఁడు గాక ప్రజలచే ద్వేషింపఁబడి ౧౦౭౪లోఁ జంపఁబడెను.

ఈతనికే 'అధిరాజేంద్ర చోళుఁడు-అధిరాజరాజేంద్ర పరకేసరివర్మ' అను బిరుదులుండెను. ఈతనితో చోడవంశ మంతరించెనని చెప్పవచ్చును. వేంగిదేశపు రాజయిన రాజేంద్రుఁడను నామాంతరము గల ప్రథమ కుళోత్తుంగుఁడు అధి రాజేంద్రుని తరువాత చోళదేశమునకు రాజై చోళుఁడన్న పేరు పెట్టుకొనియెను.

**అధిరాజ్య దేశము.** భారతవర్షీయ దేశము. ఇది దక్షిణ మత్స్య దేశమునకు దక్షిణమునందుండెను. పాండవుల కాలమున నిచ్చట దంతవక్త్రుఁడు రాజ్యము చేయుచుండెను. (భార సభా. అ. ౩౧.)

**అధివంగము.** గౌతమ వనమునకు సమీపము నందున్న భారత వర్షీయ తీర్థము.

**అధిష్ఠాన పురము.** చేదిదేశమునకు ముఖ్య పట్టణము.

**అధృష్య.** భారత వర్షమందలినది. (భార. భీష్మ, అ. ౯.)

**అన్.** అన్ అనునది దక్షిణ బర్మాలోని క్యాక్ప్యూ జిల్లాలోని యొకపట్టణ ప్రాంతమునకు పేరు. వైశాల్యము ౨౭౬౧ చతురపుమైళ్లు. జనసంఖ్య ౨౭౬౩. అడవి భాగము విశేషము, వ్యవసాయము తక్కువ. రాఁబడి రూ. ౩౧౦౦౦ లు. ముఖ్యపట్టణము అన్ అనునది. అక్కడ ౮౨౬జనులుగలరు.

**అనంగ.** భారతవర్షీయనది. (భార. భీష్మ. అ. ౯.)

**అనంగపాలుఁడు.** ఢిల్లీ రాజు. తువర వంశములోఁ జివరవాఁడు. ఈతని కాలములోనే యాతని రాజధానికి 'ఢిల్లీ'యని పేరుగలిగెను. ఇతనికి పుత్రసంతానములేదు. ఇద్దఱు కుమార్తెలుండిరి. అందు కమలాదేవియను నామెను అజమీరు రాజయిన

సోమేశ్వరునకిచ్చెను. ఈమె కుమారుఁడే తరువాత ఢిల్లీశ్వరుఁడైన పృథ్వీరాజు. రెండవ కుమార్తెయగు విమలాదేవిని కనోజ్ రాజైన విజయపాలునకిచ్చి యుండిరి. ఈమెయే జయచంద్రునితల్లి. అనంగపాలుఁడు ముసలివాఁడై బదరికాశ్రమమునకుఁ బోవునపుడు తనఢిల్లీ రాజ్యమును దౌహిత్రుఁడగు పృథ్వీరాజున కిచ్చెను.

**అనంగభాగి.** ఒక బ్రహ్మర్షి. (చూడు 'భృగువు')

**అనంగభీమదేవుఁడు.** ఇతఁడు ఓరిస్సా దేశమునకు రాజు. క్రీ. శ. ౧౧౭౪ లో రాజ్యమునకు వచ్చెను. ఇప్పుడు జగన్నాథమునందుఁగల దేవాలయ మీతఁడు కట్టించెను. ఇతనిరాజ్య విస్తారమెక్కువగనుండెను. ఉత్తరమున బంగాళమువైపు భాగీరథీనది, దక్షిణమున గోదావరినది, పశ్చిమమున శోణపురపు అరణ్యము, తూర్పున సముద్రము - ఇవి యీతని రాజ్యముయొక్క యెల్లలు. ఇందు వలన నితఁడు గొప్ప రాజ్యమును పరిపాలించెనని చెప్పవలసియున్నది. వచ్చెడి యాదాయములో మూఁడవవంతు తనవ్యంత వ్యయమునకై తీసికొని, మిగిలినది యతఁడు సెలవుచేయుచుండెను. ఇతఁడు పెక్కుధర్మ కార్యములను చేసెను. అఱువది దేవాలయములను, పది పెద్దనదులపై సేతువులను నిర్మించెను. ౪౦ కూపములఁ ద్రవ్వించెను. నూటయేబది రెండు నదీఘట్టములఁ గట్టించెను. ౪౫౦ గ్రామములఁ గట్టించెను, దశలక్ష పుష్కరిణులఁ ద్రవ్వించెను. ఇట్టి ధర్మాత్ముఁడైన యీరాజు కొన్ని కారణములచేఁ గొందఱు బ్రాహ్మణులఁ జంపించెను. ఆపాపముపోవుటకై యాతఁడు తపస్సుచేయఁగా జగన్నాథుఁడు దేవాలయముకట్టించుమని స్వప్నమందుఁ జెప్పెను. ౧౧౯౮ లో నీ దేవాలయము పూర్తియయ్యెను. [వి. కో.

ఇతనికే లాడదేవుఁడని నామాంతరము. కల్యాణమల్లుఁడను కవిచేనితఁడు 'అనంగరంగ' మను కామశాస్త్ర విషయక గ్రంథమును వ్రాయించెను. [అ. కో.

**అనంగుఁడు.** ౧ శివునిచే భస్మము చేయఁబడిన తరువాత మన్మథునకు వచ్చిన పేరు. (చూడు మన్మథుఁడు)

౨. రామ సేనలోని యొక వానరుఁడు.

**అనంతకవి(చిత్రకవి).** ఇతఁడు పెమ్మసాని చినతిమ్మరాజున కాశ్రితుఁడు. పదునేడవ శతాబ్దపు మొదటి యర్ధమున నున్నవాఁడు. ఆరువేల నియోగి బ్రాహ్మణుఁడు. చిత్రకవి పెద్దనార్యుని పుత్రుఁడు. భారద్వాజగోత్రుఁడు. ఇందుమతీ పరిణయమను ప్రబంధమును రచించెను. హరిశ్చంద్ర నలోపాఖ్యానమునకును విష్ణుచిత్తీయమునకును టీక వ్రాసినవాఁడు. ఆంజనేయోపాసకుఁడు.

**అనంతఛందస్సు.** చూడు అనంతామాత్యుఁడు.

**అనంతపురము** మైసూరు రాజ్యమునందలి యొక పల్లె. షిమోగాజిల్లాలోని సాగర్ తాలూకాలోనిది. షిమోగాకు ౪౯ మైళ్ళమీఁదనుండును. జ న స ం ఖ్య 322. అంధాసురుఁడన్న రాజుచే నెనిమిదవ శతాబ్దమునందు నీగ్రామము కట్టింపఁబడియె. పదునొకండవ శతాబ్దమునందు నిది చాళుక్యుల స్వాధీనము నందుండెను. ఇది 'సహస్రి విషయము' (మండలము)లోనిది. ౧౧౮౨ లో నిది ౧౨౦౦ బ్రాహ్మణులకు నగ్రహారముగ నీయఁబడెను. ౧౧౯౯ లో నిది, రాజధానిగఁ జెప్పఁబడెను. పదునేడవ శతాబ్దమునందు, కేలడిరాజయిన వేంకటప్ప నాయకుఁడీగ్రామమునందు శివాచార మఠము నుస్థాపించెను. చంపక సరసు అను చెరువు త్రవ్వించెను. గ్రామముపేరు 'అనందపుర' మని మార్చెను. అదియే తరువాత అనంతపురముగ మారెను. హైదరు టిప్పూకాలమున నీగ్రామముపై వారిదాడులు పెక్కుసార్లువచ్చెను. ౧౮౩౦ లోని తిరుగుబాటు కాలమున నీగ్రామము దోపిడికి లోనయ్యెను.

**అనంతపురము** (గ్రామము). అనంతపురము జిల్లాకు ముఖ్యపట్టణము. ఇది చెన్నపట్టణమునకు వాయవ్యమూలగ ౨౧౬ మైళ్లమీఁదనున్నది. చెన్నపురి దక్షిణ మహారాష్ట్ర ఇనుపదారి మార్గముయొక్క గుంటకల్ బెంగుళూర్లు శాఖమీఁద నొకస్టేషన్. ౧౯౧౧లో నిచ్చట ౧౦౮౦౭ జనులుండిరి. ఈ జిల్లాలోనున్న మునిసిపాలిటీ యిది యొకటియే.

ఈ గ్రామమును 'చిక్కప్ప ఉడయర్' అనువాఁడు కట్టించెనని చెప్పుదురు. ఈతఁడు విజయనగర రాజయిన

చరిత్ర

ప్రథమ బుక్క రాయలకు (౧౩౫౩-౧౩౭౯) మంత్రిగ నుండెను. ఈ ఉడయర్ ఒకపెద్ద చెరువు కట్టించి, దానికి రెండు అలుగులనుండి ఎక్కువైన నీరుపోవుటకు రెండు కత్వాలును, వానికిసమీపమున రెండు గ్రామములును కట్టించెను. అందునొక గ్రామమునకు రాజుపేరిట బుక్కరాయ సముద్రము అని పేరుపెట్టి, రెండవదానికిఁ దన భార్యయైన అనంతమ్మపేరిట అనంతసాగరమని పేరు పెట్టెను. ఆపేరే అనంతపురమని మారెను.

విజయ నగరమందు రామరాజు ప్రభుత్వము చేయుసమయమున, హండెవంశజుఁడైన హనుమప్ప నాయుఁడనువాఁడు ఆతనియొద్ద నొక నాయకుఁడు గానుండి, తిరుగుబాటు చేసిన సలకము తిమ్మప్పను, ఓడించెను. మరియొక యుద్ధములో నైజామును ఓడించెను. * అందుమీఁద రామరాజు సంతసించి హనుమప్పకు నందేల, బుక్కరాయ సముద్రము, ధర్మవరము, కనికట్లు, అనంతపురము, బళ్ళారి,

* 'అనంతపురము కైఫీయతు' అను పుస్తకమందు ఈతఁడు నైజామును ఓడించి, చెఱపట్టి తెచ్చి రామరాజునకుఁగానుకగా నిచ్చెనని యున్నది.

కారోడు అను గ్రామములను, పెక్కువదవులును ఇచ్చెను. హనుమప్ప కుమారుఁడు ఇమ్మడి హంపనాయుఁడు, ఆతని కుమారుఁడు మలకప్పనాయుఁడు. మలకప్ప తాళికోట యుద్ధములోఁ బోరాడినవాఁడు. విజయనగర రాజుల ప్రభ తగ్గిన తరువాత నీతఁడు గోలకొండ నవాబునకు సామంతుఁడై అనంతపురమునకుఁ జుట్టుపట్టుననుండు ప్రాంతమును జాగీరుగ సంపాదించెను. నవాబునకు ౮౫౭౭౨ కాంతిరాయ వరహాలు (రమారమి రు. ౧౩౦౦౦౦) కప్పము కట్టుచుండెను. ఈతనికి సంవత్సరమునకు రు. ౧౩౪౩౧౬ భూమిశిస్తుక్రింద వచ్చుచుండెను.

ఈ మలకప్ప నాయుఁడు బుక్కరాయసముద్రమున నివసించుచు నొక్కనాఁ డనంతసాగరమునకుఁబోఁగా ఎల్లారెడ్డియను వాఁడు తనిని తనయింటికిఁ దాంబూలమునకుఁ బిలిచెను. మలకప్ప వానియంటికిఁబోయి, తాంబూలము తీసికొని, యాతని సంతానాభివృద్ధిఁజూచి సంతసించి, యదివఱకుఁ దనకు పురుషసంతానము లేనందున, ఎల్లారెడ్డియున్నతావునతాను నివసించినఁ దనకుఁ గుమాళ్ళు కల్గుదురని తలంచి, యతనినడిగి యాస్థలముఁ దీసికొని యచ్చట రాజమందిరము కట్టించి తాను నివాసముగనుండఁ జొచ్చెను. అప్పటినుండి యాగ్రామమునకు హండే అనంతపురమ్మన్న పేరువచ్చెను.

మలకప్పకు సిద్ధరామమ్మయను భార్యవలన నల్గురు పుత్రులుపుట్టిరి; దేవప్ప, చిన్నరామప్ప, లింగప్ప, హంపనాయుఁడు. మలకప్ప తన పుత్రులలో దేవప్పకు నంద్యాల, చిన్నరామప్పకు బళ్లారి కరుగోడు, లింగప్పకు కడప కనికల్లు, హంపనాయునకు అనంతపురము, బుక్కసాగరము, బుక్కపట్నము, ధర్మవరము ఇచ్చెను. హంపనాయుఁడు ౧౬౧౯ మొదలు ౧౬౩౧ వఱకును, అతని కుమారుఁడు సిద్దప్పనాయుఁడు ౧౬౫౯ వఱకును, ఈతని కుమారుఁడగు పవడప్ప ౧౬౭౧ వఱకును రాజ్యముచేసిరి. ఈతని ప్రభుత్వ కాలమున రాయదుర్గము పాళేగారు ఈతని రాజ్యముపై దండెత్తివచ్చి కొంతవశపఱుచుకొని ధర్మవరములో తనసైన్యమును కొంత ఠాణాగా నుంచిపోయెను. పవడప్ప పోయిన తరువాత ఆతని కుమారుఁడైన సిద్దప్ప బాలుఁడగుటచేఁ గొంతకాలమువఱకు పవడప్ప భార్యయైన రామక్క రాజ్యపాలనముచేసెను. ఈమె కాలమందే యీదేశము ఔరంగజేబు స్వాధీనమాయెను. ఆతఁడు వీరికప్పము తగ్గించి ౧౧౨౦౦ వరహాలుచేసి, వీరు చక్రవర్తి యుపయోగార్థమై ౧౨౦౦ పదాతులను, ౧౫౦ మంది గుఱ్ఱపు రౌతులను ఎప్పుడును ఉంచవలెనని యేర్పాటుచేసెను. సిద్దప్ప ౧౬౯౬ లో మృతుఁడయ్యె.

సిద్దప్ప కొడుకు ప్రసన్ననాయుఁడు. ఈతని కాలమువఱకు ఈ ప్రాంతము కడప నవాబు

స్వాధీనమైనది. రాయదుర్గము పాళెగారును వంచుటలో నీతఁడు కడప నవాబునకు తోడయ్యెను. అందుకు నవాబు ప్రసన్నుఁడై, ఈతఁడు నవాబు నుపయోగార్థమై సైన్య మంచవలసిన యావశ్యకత లేకుండఁజేసెను. ఈతని యుంపుడుకత్తెయైన వసంతమ్మ యీతనిని ౧౭౨౦ లోఁ బొడిచి చంపెను.

ప్రసన్నప్పకుఁ గుమాళ్లు లేనందున నతని తమ్ముఁడైన పవడప్పనాయఁడు రాజయ్యెను. ఈతఁడు కడప నవాబునకు కప్పము కట్టుట మానివేసినందున, నాతఁడు సైన్యమంపఁగా దానిని ఓడించెను. ఈతని రాజ్యకాలము ౧౭౨౦-౧౭౩౭.

పవడప్పకొడుకు సిద్దప్ప స్వేచ్ఛాచారుఁడై అప్పులపాలయ్యెను. ఆతఁడు మూఁడేండ్లు (౧౭౩౭-౧౭౪౦) రాజ్యము చేసిన తరువాత, నాతని యధికారులు తిరుగఁబడి, యాతని పెత్తండ్రియైన ప్రసన్నప్పకు నుంపుడు కత్తె యందుఁబుట్టిన రామప్ప యనువానిని రాజ్యముపైఁ గూర్చుండఁబెట్టిరి. సిద్దప్ప తాడిమఱ్ఱి పాళెగాని సాయముతో మరల తనరాజ్యమును సంపాదింపయత్నించెను. కాని రామప్ప మరాఠావారికి శరణుబోయి గుత్తి మురార్ రావును తోడుతెచ్చుకొనెను. అనంతపురమును స్వాధీనపఱుచుకొని సిద్దప్పను చెఱఁ బెట్టెను.

రామప్ప ౧౭౪౦ మొదలు ౧౭౭౩ వఱకు రాజ్యముచేసెను. ఈతని కాలమునందు మరాఠావారు వీరి కప్పమును తగ్గించి రు. ౧౫౦౦౦ చేసిరి. ఇదిగాక రామప్ప మురార్ రావునకు రు॥ ౫౦౦౦లు కప్పము కట్టుచుండెను. పూర్వము రాయదుర్గమువారు స్వాధీనపఱచుకొనిన తమరాజ్యములోనిభాగమును మరల సంపాదింపవలెనని ధర్మవరము నొద్దనున్న కనుముక్కలమీఁదికి దండుపోయెను గాని యోడి తిరిగివచ్చెను (౧౭౪౦). మరుసటి సంవత్సరము రాయదుర్గమువారు ఈతని రాజ్యముమీఁదికి దండువచ్చి బుక్కపట్టణమును ముట్టడించిరి. కాని రామప్ప వారిని ఓడించిపంపెను. మరుసటిసంవత్సరము కూడ వారు మరలవచ్చి యోడిపోయిరి.

చెఱలో నుంచఁబడిన సిద్దప్ప మృతినొందెను, ఆతనిభార్య తనకు బంధువుఁడైన బళ్లారి పాళెగారునొద్దకుఁ బారిపోయెను. అచ్చట నామె సలహానునుసరించి, యా పాళెగారుఁడు రామప్ప కుమారుఁడైన సిద్దిరామప్పను పెంచుకొనెను. ఒకప్పుడు బళ్లారి పాళెగారుఁడు కుమారుని పెంచుకొనిన తరువాత మిత్రత్వము నటించుచు రామప్పను చూచుటకై అనంతపురమునకు గొప్ప సిబ్బందితో వచ్చెను. అనంతపురముకోట చిన్నదియగుటచే రామప్ప తన సిబ్బందిని మఱియొక చోటకిఁబంపి చుట్టముల సిబ్బందికిఁ దనకోట లోనుండుటకు తావిచ్చెను. బళ్లారి పాళెగారుఁడిట్లు తన సిబ్బందితో అనంతపురము కోటలోనుండి, యొకదినము రామప్పనుచంపి

కోటను, చాలరాజ్యమును స్వాధీనపఱుచుకొనెను. తానుపెంచుకొనిన సిద్దప్పను చెఱఁబెట్టెను. సిద్దప్పచెఱసాలమీఁదియధికారులను వశపఱుచుకొని, అందుండి పారిపోయి, తన బావమఱఁదియైన బసప్పతోఁగూడ మురార్ రావుకడకుఁ బోయెను. బసప్పసాహసముగల శూరుఁడు. మురార్ రావు వద్దనుండి కొంత సైన్యముఁదీసికొని, కొంతసైన్యమును తాను కూర్చుకొని బుక్కరాయసముద్రమును ముట్టడించెను. కాని బళ్లారినుండి పెద్దసైన్యము వచ్చి బసప్ప సైన్యమును వెడలఁగొట్టెను. అంత నాతఁడధైర్యపడక, కడప నవాబును ఆశ్రయించి సైన్యముందెచ్చి బుక్కరాయసముద్రమును, అనంతపురమును స్వాధీనపఱుచుకొని, సిద్దప్పనురావించి పట్టాభిషిక్తునిజేసెను (౧౭౫౩).

౧౭౫౭ లో మురార్ రావు అనంతపురమును ముట్టడించెను. కొంతకాలమువఱకు లోనివారు పోరాడిరి. కాని విధిలేక మరాఠా వానికి రు. ౫౦,౦౦౦ దండుగనిచ్చి, గ్రామము పాడుగాకుండ దక్కించుకొనిరి. ఇది వఱకు జరిగిన పోరాటములవలనను, ఈ దండుగవలనను సిద్దప్ప మిక్కిలి బీదవాఁడయ్యె. అందుచే బసప్ప దోపిడికివెడలి తాడిపత్రి, యెల్లుట్ల, రొద్దము మొదలైనస్థలములను కొల్లఁగొట్టెను.

౧౭౭౨ బుక్కపట్నము చెరువు తెగఁగా దానిని అపుటకు యత్నించి, ఆపరిశ్రమవలన బసప్ప కీర్తిశేషుఁడయ్యెను. ౧౭౭౫ లో హైదరు గుత్తి, బళ్లారి జయించి అనంతపుర ప్రాంతమునకును స్వామి అయ్యెను. అతఁడు అనంతపురమువారి కప్పము హెచ్చించి రు. ౬౯౦౦ లు చేసెను. ఇంత కప్పము కట్టుశక్తి ఈ సంస్థానాధీశ్వరులకు లేనందున బాకీపడఁజొచ్చిరి. అందుమీఁద హైదర్ కొందఱు భటులఁబంపి, సిద్ధరామప్పను చెఱఁబెట్టించి, సంస్థానమును వశపఱుచుకొనెను. కొన్నిదినములవఱకు సిద్ధరామప్పకు నెలకు ముప్పదివరహాలచొప్పున భరణమిచ్చిరి. తరువాత దానిని గూడఁజాలించిరి. ఈతనియిద్దఱుకొడుకులును హైదర్ సైన్యములోఁ జేరి యందు మృతులైరి. మూఁడవవాఁడగు సిద్దప్పనాయుని శ్రీరంగపట్టణమునకుఁ బంపిరి. ఇట్టిదుఃఖముల భరింపలేక ౧౭౮౨ లో సిద్ధరామప్ప చెరలోనే మరణముఁ బొందెను.

తరువాత హండె వంశము వారెవరును లేకుండఁ జంపవలసినదని టిప్పూ సుల్తానుఁడు ఆజ్ఞయిచ్చినందున, ఈవంశమువారి నందఱిని ఆతని యధికారులు ఉరితీసి అనంతపురమునందే చంపిరి. కాని సిద్దప్ప మాత్రము తప్పించుకొని పోయెను. అనుకూలకాలము వచ్చువఱకు నాతఁడు కాలహస్తి సంస్థానమునందు డాగియుండెను. టిప్పూ చనిపోయిన తరువాత నాతఁడు ౧౭౯౯ లో అనంతపురమును స్వాధీనపఱుచుకొనెను. ఈ భాగము శ్రీరంగపట్టణయుద్ధానంతరమున నిజాముకు

నీయఁబడినందున సిద్దప్పవారి కృతజ్ఞుఁడయ్యె. ఆ ప్రభుత్వము వారీతనికి సిద్దరామపురము జాగీరుగనిచ్చిరి. ఇంగ్లీషువారి స్వాధీనమైన తరువాత మనోరో ఈతనికి పెన్‌షన్ ఇప్పించెను. ఈతఁడు ౧౮౦౧ లో మరణము నొందెను. ఈతని వంశజులకు ౧౮౬౦ వఱకు ఈ యుపకారవేతనము ముట్టుచుండెను.

౧౮౦౦ లో దత్తమండలములు కంపెనీ వారి క్రిందికిరాఁగా, ఆ ప్రదేశమునంతకును మనోరో అనువానిని కలెక్టరుగా నియమించిరి. అతఁడు అనంతపురమునందే తనకచ్చేరియేర్పఱచుకొనెను. ౧౮౨౨ లో కలెక్టరు కచేరీ బళ్లారికి దీసికొనిపోయిరి. ౧౮౨౩ లో మరల ఆ కచ్చేరి అనంతపురమునకుఁ దేఁబడెను. ౧౮౪౦ లో కలెక్టరు కచేరి బళ్లారికిమార్చి, అనంతపురములో సబ్ కలెక్టరు ఉండఁ జొచ్చెను. ౧౮౬౯ లో ఈకచ్చేరికూడగుత్తికిఁ బోయెను. ౧౮౮౨ లో అనంతపురము స్వతంత్రముగ జిల్లా ఆయెను. అప్పుడిచ్చటికి మరల కలెక్టరు కచ్చేరి వచ్చెను.

ఈ గ్రామవిశేషములలో రాబర్‌ట్ సన్ స్క్వాయర్ ముఖ్యమైనది. దీనిచుట్టు ప్రక్కన డెప్యూటీ కలెక్టరుకచేరి, తహసీలుదారు కచేరి, సబ్ మ్యాజిస్ట్రేటుకచేరి, సబ్ రిజిస్ట్రారుకచేరి, మూఁడుపాఠశాలలును, మునిసిపల్ ఆస్‌పత్రి, మఠి వేఱుమందిరములును గలవు. అనంతపురములో కలెక్టరుపనిచేసి ౧౮౩౮ లో నచ్చటనే మరణమొందిన రాబర్‌ట్ సన్ అనువానిపేర ఈచౌకము (Square) కట్టఁబడినది. అతఁడు బ్రతికియుండఁగనే ఈ చౌకమునుఏర్పఱచి నడుమనున్న కోటకందకమును పూడ్పించి, నడుమ మండపమును కట్టించి చుట్టునున్న చెట్లు తనచేతితో వేసెను. దీనికుత్తరమున ప్రాతకోటయుండెను. దాని బురుజుల శేషములును, కందకపు పల్లములును ఇప్పటికిఁ గానవచ్చును. ఈ ప్రాతకోటయుండిన ప్రదేశముననే యిప్పుడు జుబిలీ పార్కనెడి ఉద్యానమున్నది. దీనికి నుద్యానమని పేరున్నను ఇది యిప్పుడు సంతకునుపయోగపడు స్థలముగ మాత్రమున్నది. గ్రామము చిన్నది, స్వచ్ఛముగ నుండును, మూఁడు నాలుగు మంచి వీథులు కలవు. (కొ. ల.)

**అనంతపురము** (జిల్లా). చెన్నరాజధానిలోనియొక తెలుఁగు జిల్లా. దత్తమండలము లనఁబడు జిల్లాలకు నడమనుండును. దీనికుత్తరమునబళ్ళారికర్నూల్ జిల్లాలును, పడమరబళ్లారి జిల్లా, మైసూరు సంస్థానమును, దక్షిణమున మైసూరు సంస్థానమును, తూర్పున కడపజిల్లాయును కలవు. పూర్వము బళ్ళారిజిల్లాలోనే యనంతపురము కూడ కలిసియుండెను. ౧౮౮౨-వ సంవత్సరములో అనంతపురము జిల్లాను వేఱుచేసిరి. దీని వైశాల్యము ౬౭౧౮ చదరపుమైళ్ళు. ఇందు పూర్వమెనిమిది తాలూకాలే యుండెనుకాని ఇపుడు నూతనముగా కదిరియను తాలూకాను గలుపుట వలన తొమ్మిదయినవి.

అనంతపురము జిల్లా సమప్రదేశముకలది కాదు, ఉన్నతప్రదేశము. ఇది మైసూరు దేశమునకు సంబంధించిన ఉన్నత ప్రదేశము (Mysore plateau) యొక్క చివరభాగము.

నిమ్నోన్నతములు

దక్షిణమువైపు, ఉన్నతముగను, పోనుబోను ఉత్తరము వైపు పల్లముగను నుండును. దక్షిణము వైపుప్రదేశము, ౨౨౦౦ అడుగుల ఎత్తుననున్నది. పోనుబోను నుత్తరమువైపు తగ్గి గుత్తియొద్ద ౧౦౦౦ అడుగుల ఎత్తుగను, ఈశాన్యమున 'తాడిపత్రి' యొద్ద ౯౦౦ అడుగుల ఎత్తుగను నుండును*. జిల్లాయొక్క తూర్పు భాగము కడపవైపు గుట్టలతో నిండియున్నది. ఎఱ్ఱకొండలను గుట్టలు అటువైపు సరిహద్దునకు నుత్తరమున నుండును. ఈ శాన్యభాగము కొంత పొడవయిన పర్వత కందరములతో నిండియున్నదైనను సమ ప్రదేశముగ నుండి ఫలవంతమైన రేగడి భూమిగానున్నది. ఈ భాగమును గుత్తితాలూకాలోని పశ్చిమ భాగమునుదప్ప జిల్లాయొక్క మిగిలినభాగమంతయు, మిట్టపల్లములగు ఎఱ్ఱమట్టి ప్రదేశమైనందున వ్యవసాయమున కనుకూలముగా లేదు. ఈజిల్లాలోనియున్ని తాలూకాలకంటె 'మడకసి' మిక్కిలి ఫలవంతమైనది. నీటి వసతియు నెక్కువగాఁ గలదు. తాడిపత్రి, తాలూకాలో 'ముచికోట' గుట్టలుకలవు. ఇతర భాగములలోనల్లని'మంగలకత్తిరాయి' గుట్టలుగుట్టలుగా నున్నది. పాలసముద్రము, పెనుగొండవైపు,గుట్టలు విశేషముగాఁగలవు. ఈ గుట్టలలోఁ గొన్ని ౩౯౧ అడుగుల వఱకెత్తుండును.

ఈ జిల్లాలో మిక్కిలి యున్నతము లగు పర్వతములు లేవు.

కొండలు

గుట్టలు మాత్రము ఉన్నవి. గుత్తితాలూకా యందు గుట్టలధికము. ౧౦౦౦ అడుగులు మొదలు ౩౦౦ అడుగుల వఱకు నెత్తుగల కొండలు ఈ జిల్లాలో ముప్పదికంటె నెక్కుడుగలవు. ఇందు ముఖ్యమయినవి మూఁడు కొండలు.

౧ ఈశ్వరమల్లె: ఇది కదిరి తాలూకాలో నున్నది. ౩౧౬౯ అడుగుల ఎత్తుకలది.

౨ మల్లప్పకొండ: ఇది పెనుగొండతాలూకా బుక్కపట్టణమునకు కొంచెము ఈశాన్యమూలగా మూఁడుమైళ్ళ మీఁద నున్నది. ౩౦౮౮ అడుగుల యెత్తుకలది.

౩ పెనుగొండ: పెనుగొండ గ్రామమునకు దక్షిణమున అరమైలుదూరమున నున్నది. ౩౦౮౮ అడుగుల యెత్తు. దీనిమీఁద ఖిల్లా యనఁబడు పురాతన కట్టడములును, శిలాశాసనములును బెక్కులుకలవు.

పెదకొండలు గాక చిన్నచిన్న గుట్టలును

కనుమలు

కనుములును, ఈజిల్లాలోఁ బెక్కులు కలవు. నేలమట్టముమీఁద ౨౫ మొదలు ౧౭౦ అడు

* ఒకానొక ప్రదేశము వేయి అడుగుల ఎత్తున నున్నదియనఁగా నది సముద్రపు మట్టమునుండి అంత యెత్తున నున్నదని యర్థము.

గులవఱకు నెత్తుగనుండు గుట్టలు డెబ్బదికిఁ బైనికలవు. ఇవిరెండు-మైళ్లు మొదలు పదునెనిమిది మైళ్ళవఱకుఁ బొడువుండును. ఇవి యీ జిల్లాయొక్క యుత్తరభాగమున కంటె దక్షిణభాగమున నెక్కువగనున్నవి. ఇచ్చటి కనుమలలో ముచ్చుకోట 'కనుమ' ముఖ్యమైనది. ఇది అనంతపురము తాడిపత్రి తాలూకాల సరిహద్దులలో నున్నది. అనంతపురము నుండి యీశాన్యముగా బుక్కరాయి సముద్రము నాయినపల్లిమీఁదుగా తాడిపత్రికిఁ బోవు బండిబాట యీకనుమలలోనుండి పోవును. ఈకనుమపొడువు ఉత్తరదక్షిణముగ ౧౭ మైళ్లు, వెడల్పు ౫ మైళ్లు. ఇచ్చట దొంగలభయ మెక్కువగ నుండును. కల్యాణదుర్గము ధర్మవరము తాలూకాలలో జిన్న కనుమ లయిదారుకలవు. కదిరితాలూకాలో దోర్నాలకనుమ, బొంతలపల్లికనుమ, తుమ్మలమల మున్నగు భయంకరములయిన కనుమలు కలవు.

గనులు

వజ్రకరూరు అను గ్రామ సమీపమున భూమిపై భాగముననే యెప్పుడైనను వజ్రములు దొరకుచుండును. అవియెచ్చటి నుండి పుట్టునో తెలియలేదు. ధర్మవరము తాలూకాలో రామగిరియొద్ద బంగారు గని యొకటి తొమ్మిది యేండ్లక్రింద మారిసన్ అను పాశ్చాత్త్యునిచేఁ గనిపెట్టఁబడియె. కాని యది లాభప్రదమైనదికాదు. ఇటీవల చెన్నబావి జబ్బట్లు, మధ్యజబ్బట్లు అనఁబడు మూఁడుగనులు కనిపెట్టఁబడినవి. వీని వలన లాభ మెక్కువగానున్నది. ఇండ్లకుపయోగపడు రాళ్ళుఅచ్చట దొరకును. తాడిపత్రి తాలూకాలో నీరాయలచెరువు నొద్ద బలపపురాయి దొరకును. వానితో పాత్రలు చేయుదురు.

నదులు

ఈ జిల్లాలోఁ బ్రవహించునదులలో పెన్న ముఖ్యమైనది. ఇది మైసూరు రాజ్యమునందుఁ బుట్టి హిందూపురము తాలూకాలోని వియగుచౌలూరు, రోడాయను రెండుగ్రామములయొద్ద, రెండుపాయలుగా ఈ జల్లాలో ప్రవేశించును. ఈశాఖలు రెండునుపరిగియను గ్రామమున నీశాన్యమున రెండుమైళ్ల దూరములోఁదిరిగి నొకటిగాఁజేరి రొద్దము; నూతిమడుగు గ్రామములమీఁదుఁగా సూటిగ నుత్తరముదిక్కు ౮౦ మైళ్ళు ప్రవహించి, ఉడిపి (పెన్నహోబిలము) యొద్ద సర్రున తూర్పునకుఁదిరిగి కొప్పలకొండ, పామిడి, బండెలదిన్నె, చిన్నపొప్పూరు గ్రామములనంటి, రమారమి ౫౦ మైళ్ళు ప్రవహించి, వంగనూరు గ్రామమునకు నుత్తరమున నొక మైలుదూరములో కడపజిల్లాలోఁ బ్రవేశించును. ఈజిల్లాలో ఈనది ౧౩౦-౧౪౦ మైళ్ళు ప్రదేశమున పారును. పామిడి గ్రామమునకు దక్షిణముగాఁ బారెడు ఈనదికి నడుమ నొక శివాలయము-గోపురశోభితము-గట్టఁబడినది.

చిత్రావతి:-ఇది పెన్నకు నుపనది. మైసూరు రాజ్యమునఁబుట్టి ఆగ్నేయదిక్కున ఈజిల్లాలో బ్రవేశించి, హిందూపురము, పెనుగొండ, ధర్మవరము, తాడిపత్రి తాలూకాలలోనుండి ౯౨ మైళ్ళు ప్రవహించి కడప జిల్లాలోఁబ్రవేశించును.

మద్దిలేరు:-ఇది చిత్రావతికి నుపనది. కదిరి తాలుకాలోని నున్నంపల్లి మహమ్మదాబాదు గ్రామముల సమీపమునఁ బుట్టెడి చిన్నవాగు లొక్కటిగాఁజేరి యీ యేర గును. నున్నంపల్లెకు నీశాన్యముగ ౧౫ మైళ్లు ప్రవహించి యుత్తరముగఁదిరిగి, కదిరి ధర్మవరము తాలూకాల సరిహద్దులలో చిత్రావతిలోఁ జేరుచున్నది. ఈ యేరు మొత్తము మీఁద ౫౨ మైళ్ళు పొడవు.

ఈజిల్లాలో ౧౬౨ చెరువులు కలవు. వానిలో బుక్కపట్టణము చెరువు, ధర్మవరము చెరువు, సింగనమల చెరువు అనునవి ముఖ్యమైనవి.

చెరువులు

మొదటి రెండును చిత్రావతినదికి నడ్డ కట్టవేసి నిర్మింపఁబడుటచే వానికి నీటివసతి విశేషముగ నుండును. ఈ రెండు చెరువులు మిక్కిలి పురాతనకాలమున దొడ్డవడియారు చిక్కవడియారు లనఁబడు ఇద్దఱు అన్నదమ్ములచే నిర్మింపఁబడినది.

మొత్తముమీఁద నీజిల్లాలో వర్షములు తక్కువ. నైరృతి దిక్కునుండి వచ్చెడి (పడమటి) మేఘవాయువు (Monsoon) గాని, ఈశాన్యమునుండి వచ్చెడి (తూర్పు) మేఘ వాయువుగాని ఈ ప్రాంతమునకు నెక్కుడుగ మేఘములను దీసికొని రాదు.

వర్షములు

అందుచే వర్షములు క్రమము తప్పకుండగాఁబడవు. నైరృతి వాయువు (పడమటిగాలి) తొలకరి వానలను జూన్ నెలలోనిచ్చి జూలై, ఆగస్టు, సెప్టెంబరు నెలవఱకు వర్షము గురిపించును. ఈశాన్యపు వాయువు (North-east monsoon) అక్టోబరులో మంచివర్షము నిచ్చును. కాని ఆ తరువాత మరల మృగశిర (జూన్) వచ్చు వఱకువర్షములుండవు. ముప్పదినాలుగేండ్లలో (౧౮౭౦-౧౯౦౩) గురిసిన వాన లెక్కవేసి యావరేజి(సరాసరి)చూడగాసంవత్సరమునకు ఈజిల్లాలో ౨౩ అడుగుల (దుక్కుల) వర్షము కురియునని తేలినది. ఇంత తక్కువ వర్షము చెన్నరాజధానిలోనిమఱియే జిల్లాలోను కురియదు. సెప్టెంబరు అక్టోబరు నెలలలో నెక్కువ వర్షము కురియును. ౧౮౫౧ లోను ౧౮౭౯ లోను పెద్ద తుపానులువచ్చి, చెరువులకు, పంటలకు నష్టము కలుగఁజేసినవి.

చెన్నరాజధానిలోని యితర జిల్లాలకంటె నీజిల్లాలో నెండలు మెండని చెప్పవలెను. అందుచేతనే యిది మిక్కిలి ఘోరారోగ్యకరమైన జిల్లాకూడనైనదని చెప్పవచ్చును.

ఎండలు

ఎండకాలము మార్చిలోఁబ్రారంభించును; మృగశిరాప్రవేశముతో జూన్‌లో నెండలు తగ్గును.

అప్పుడచ్చట కాలమానస్థితి యితర పెక్కు జిల్లాలకంటె మనోహరముగ నుండును. జిల్లాలోని యుత్తరము వైపుభాగమునకంటె దక్షిణపు వైపుభాగము ఎక్కుడు చల్లగనుండును.

ఈ జిల్లాలో ౫౧౬ చదరపుమైళ్ళ యరణ్యముకలదు. బళ్లారి, కడపలోని పశ్చిమ తాలూకాలవలెనే

అడవులు

యిచ్చటియరణ్యములలోఁగూడ పెద్దచెట్లు పెరుగవు. ముచుకొండ రేంజిలోను ఉత్తరపువైపు కొండలలోను పెనుకొండ హిందూపురము తాలూకాలలోను రిజర్వుఅరణ్యముకలదు. ఈ యరణ్యములలో కొద్దిగా వెదురు, టేకు పెరుగును. ఏపెచెట్లువిశేషముగ నభివృద్ధిచెందును. అనంతపురమునందు డిస్ట్రిక్టు ఫారెస్టు కచేరి కలదు. తాడిపత్రి, పామిడి, బుక్కపట్నము, మడకశిర, కల్యాణ దుర్గము, ఈ తావులలో రేంజి ఆఫీసరులుందురు.

ఈ జిల్లా మొదట ఏడు తాలూకాలుగా విభజింపఁబడియుండెను. ఈమధ్య ధర్మవరము తాలూకా రెండుగా

విభాగములు

విభజింపఁబడుట చేతను, కడపజిల్లాలోని కదిరి తాలూకా క్రొత్తగా నిందుఁ జేరుటవలనను, ఇప్పుడిందు తొమ్మిది తాలూకాలుగలవు. ఈ తొమ్మిది తాలూకాలును నాలుగు సబ్ డివిజనులుగా నేర్పర్పఁ బడినవి:—

| సబ్ డివిజన్ | తాలూకాలు |
|---|---|
| ౧. గుత్తి | ౧. గుత్తి<br>౨. తాడిపత్రి. |
| ౨. అనంతపురము | ౩. అనంతపురము.<br>౪. కల్యాణదుర్గము. |
| ౩. ధర్మవరము | ౫. ధర్మవరము.<br>౬. కదిరి. |
| ౪. పెనుకొండ | ౭. పెనుగొండ.<br>౮. హిందూపురము<br>౯. మడకశిర |

కలెక్టరు జిల్లా అధికారిగానుండును. సబ్ డివిజనుకు అధికారిగా, సీమలో సివిల్ సర్వీస్ ప్యాసైన వాఁడుగాని,

ప్రభుత్వము

డిప్యూటీ కలెక్టరుగాని ఉందురు. తాలూకాకు నొక తహసీలుదారుఁడుండఁగా గుత్తి, తాడిపత్రి, అనంతపురము, పెనుగొండ,అను తావులనొక్కొక్క సబ్ మ్యాజిస్ట్రేటును, యాధికి, ఉర్వకొండను చోట్ల డిప్యూటీ తహసీలుదారులును ఉన్నారు. రిజిస్ట్రేషన్, ఆబ్కారి,పబ్లిక్ వర్క్సు (ఇంజనీరింగు) విషయమై యీ జిల్లా బళ్లారి జిల్లాలోనిదిగనే యెంచఁబడును.

సివిల్ వ్యాజ్యెములు పరిష్కరించుటకై గుత్తిలోనుపెనుకొండలోనుమునసబ్ కోర్టులు కలవు. ఈజిల్లాకు వేఱుగ జిల్లాకోర్టులేదు. గుత్తి మునసబ్ కోర్టు మీఁద కడప జిల్లాకోర్టునకును, పెనుగొండ మునసబ్ కోర్టు మీఁద బళ్లారి జిల్లా కోర్టునకును అపీళ్లు ఉండును. సెషన్ కేసులు బళ్లారి సెషన్స్ కోర్టు ఎదుట

విచారింపఁబడును. గుత్తి, తాడిపత్రి తాలూకాలలోని గ్రామాదులలో కక్షలు(పార్టీలు) ఎక్కువుగ నున్నందున ఛోరీ, బందిపోటు, ఖూనీ నేరము లంత అరుదుకావు. పెనుగొండ తాలూకాలోని పూర్వభాగమునందు నేరములు చేయువారు కలరు. మొత్తముమీఁద నీ జిల్లాలో నేరమంత యధికమని చెప్పుటకు వీలులేదు. చెన్నరాజధానిలో కోర్టుల యెదటికి వచ్చెడిక్రిమినల్ కేసులలో నూటికి ౨.౧౭ మాత్రమీజిల్లానుండి వచ్చును. కొరచులు,ఎరుకలవాండ్రు, ఒడ్డెలు అనుజాతివారు ముఖ్యముగా నేరములను చేయుచుందురు.

పోలీసు డిస్ట్రిక్టుసూపరింటెండెంటు అనంతపురములో నుండును. జిల్లాలో మొత్తము మీద ౪౧ పోలీసు స్టేషనులను, ౫ ఔటు పోస్టులుకలవు. ౬౪ గురు ఆఫీసర్లును, ౭౭౪ గురు బంట్రోతులును, ఈజిల్లా సంరక్షణ నిమిత్తమై యేర్పాటు చేయఁబడినారు. ఆఫీసర్లలో ౯ మంది ఇన్స్పెక్టర్లును, ౫౧ మంది సబ్ ఇన్స్పెక్టర్లును కలరు. ఈ జిల్లా లో ౧౦౨౭ మందికి నొక పోలీసు జవానుచొప్పున నున్నారు. ఈ జిల్లాలో జైలులేదు. ఇచ్చటి ఖైదీలను బళ్ళారి జైలుకుఁబంపెదరు. ప్రతి తాలూకాకు నొక సబ్‌జైలుకలదు. అన్నిటిలోను కలిసి ౧౧౪ ఖైదీలకంటె నెక్కుడుండఁజాలరు.

తెలుఁగు దేశమునందలి యితర జిల్లాలలోఁ గాన్పించినట్లు, ఈ జిల్లాలోఁగూడ మిక్కిలి పురాతన కాలము నాటి వి యని చెప్పఁదగు రాతితో చుట్టు సమర్చఁబడిన దిబ్బలు విశేషము కలవు. కల్యాణదుర్గము తాలూకాలోని ముదిగల్లు, దేవతులబెట్ట, అనంతపురము తాలూకాలోని మాల్యవంతము, హిందుపురము తాలూకాలోని కొండాపురము, పూలేకు అను గ్రామములయొద్ద నిట్టివి పెక్కులుకలవు.

జిల్లా చరిత్రము

గుహలలోఁ గాపురముండెడు మిక్కిలి పురాతనకాలపు వారిచే గుట్టలలో తొల్వఁబడిన తావులుకూడ గుత్తి తాలూకాలో ననేకములు కలవు. కొండలలో మొదట లోయలుచేసి, ప్రక్క భాగములను నునుపుచేయవలయునన్న యుద్దేశముతో, గుంపులు గుంపులుగ జనముకూర్చుండి వానిని అరగఁదీయుచుండిరని యూహించుటకుఁ దగిన నిదర్శనములున్నవి. ఇవన్నియుఁ జరిత్రకాలమునకుఁ బూర్వపు సంగతులు. అప్పటి జనులెవరో కనుఁగొనుటకు సాధనములు లేవు. వీరియాయుధము లన్నియు శిలామయములు. వీరు శిలాయుగము వారనిచెప్పవచ్చును.

ఈ కాలము తరువాత చరిత్రకాలము వఱకు నీ ప్రదేశమును గుఱించిన చరిత్ర మేమియుఁదెలియదు. ఏడవ శతాబ్దమందలి యొక శాసనము మడకశిర తాలూకాలోని రత్నగిరియను గ్రామము 'నలవాది విషయము'లోనిదియని చెప్పుచున్నది.* ఇదిచాళుక్య

* 1. Bombay gazetteer - i. Pt. II. 363.

విక్రమాదిత్యునిచే (క్రీ. శ. ౬౫౫-౬౮౦). వేయఁబడిన శాసనము. కావున నాకాలమందు నీదేశము ఆరాజుచేఁ బాలింపఁబడుచుండెనని మన మూహింప వచ్చును. ఈ చాళుక్యులు 'నలు' లను, అనఁగా ఆదేశపు రాజులను సంహరించిరని యీ శాసనము వలననే తెలియుచున్నది.

మడకశిర తాలూకాలోని హేమావతిలోఁ బెక్కు పురాతన శాసనము లున్నవి. వీనిలో గొన్నిఁటిని బట్టి చూడ ౮-వ శతాబ్దము మొదలు ౧౦-వ శతాబ్దము వఱకు 'నొలంబ వాదిద్వాత్రింశత్ సహస్ర' మనఁబడు దేశముగ నుండెననియు, నచ్చట నొలంబులను వారు రాజ్యము చేయుచుండిరనియుఁ దెలియుచున్నది. ద్వాత్రింశత్ సహస్ర విషయమనఁగా ముప్పది రెండు వేల గ్రామములు గల జిల్లా యని అర్థము. గుత్తి కూడ నొలంబ వాది దేశములోనిదే. నొలంబులు పల్లవశాఖలోనివారు. రాష్ట్రకూటులకు లోఁబడినవారు. ౮-వ శతాబ్దము మొదలు ౧౦-వ శతాబ్దము వఱకు రాజ్యమేలిరి. వీరిని గాంగులును, గాంగులను చోళులును జయించిరి. చోళులలోని వాఁడగు మొదటి రాజరాజు (౯౮౫ లో రాజ్యమునకు వచ్చినవాఁడు) నొలంబ వాదిని గెల్చినట్లు వ్రాసికొనియెను. కులోత్తుంగ చోళదేవుని శాసనము కూడ నొకటి హేమావతిలోఁ గలదు.

తరువాత పశ్చిమ చాళుక్యులు ఈ ప్రాంతమునకు రాజులయినట్టున్నారు. ఆఱవ విక్రమాదిత్యుని (౧౦౭౬-౧౧౨౬) శాసనములు గుత్తి దుర్గముమీఁదనున్నవి. చాళుక్యులను హోయసలబల్లాలులును, వారిని దేవగిరి యాదవులును గెలిచిరి. రెండవ వీరబళ్ళాలుని (౧౧౯౧-౧౨౧౨) శాసన మొకటి హేమావతిలో నున్నది. మైసూరు రాజ్యమందలి హరిహర గ్రామమున నున్న యొక శాసనములో ఈ రాజు గుత్తిని పట్టుకొనినట్టున్నది. దేవగిరిసింగణ రాజు(౧౨౧౦-౧౨౪౭) గుత్తిని స్వాధీన పరచుకొన్నట్టు కానవచ్చెడిని.*

పదునాల్గవ శతాబ్దమధ్యమున నిది విజయనగరరాజ్యమునందుఁ గలిసియుండెను. పెనుగొండ గుత్తిదుర్గములు విజయనగరరాజుల యాక్రమణలోనుండుటయేగాక, యవి శత్రుదుర్జయములని ఖ్యాతివడసియుండెను. ౧౫౬౫ లో జరిగిన తాలికోట పరాజయమునకుఁ దరువాత సదాశివరాయడును తిరుమలరాయడును విజయనగరమును విడిచి పెనుగొండ దుర్గముమీఁదికి తన రాజధానిని మార్చిరి. దానిమీఁదికి దండెత్తివచ్చిన తురుష్కులనెన్నియో పర్యాయములు పరాభవించిరి. వసుచరిత్రములోని యీక్రిందిపద్య మాంధ్రులెఱింగినదియే :-

చ. తిరుమలరాయశేఖరుని ధీరచమూభటరాజియాజిభీ
కరయవనేశ్వరప్రహితఖానబలంబులఁ జక్కు సేయని
ర్ధరబెనుగొండకొండలు మదద్విపచర్మకపాలమాలికా
పరికరభూషితంబులై బల్విడిఁ గాన్చె గిరీశభావముల్.

* 1 Bombay Gazetteer. i, Pt II. 505.

బలహీనులయిన విజయనగరము రాజులు తరువాతఁ గొంతకాలమునకుఁ దమ రాజధానిని పెనుగొండనుండి చంద్రగిరికిమార్చిరి. గుత్తియుఁ గాలక్రమమున తురుష్కుల స్వాధీనమయ్యెను. వారియొద్దనుండి మురార్ రావను మహారాష్ట్రవీరుఁడు గుత్తిని స్వాధీన పఱుచుకొనెను. ఈకాలమునందు దేశమంతయు నరాజకమై, యొక్కరాజులేక, యెవరికెంతభాగము చిక్కిన వారంత భాగమునకు నధిపతులగుచు, పెక్కుపాళెగారులు దేశమును ఏలుచుండిరి. ఏలుచుండి రనుటకంటె దోచుకొనుచుండిరనుట మేలు. ఇట్టి వారిలో అనంతపురము హండెవారు కొంత ప్రముఖులుగ నుండిరి. ఈ పాళెగార్లు వీలయినప్పుడు స్వతంత్రులయి వీలుకానప్పుడు పైవారికి లోఁబడి మెలగుచుండిరి. హైదరల్లీ ప్రబలుఁడైనపుడు ఈ భాగమును సులభముగ స్వాధీన పఱుచుకొనెను. ఒక్క గుత్తిదుర్గము మాత్రము చాలకాలము వశముకాలేదు. చివరకు కోటలోఁ ద్రాగుటకు నీరులేనందున ౧౭౭౫ లో వశమయ్యెను.

మహారాష్ట్రులు, నైజాము, ఇంగ్లీషువారు కలిసి ౧౭౯౨లో టిప్పూసుల్తానును ఓడించినపుడు, ఇప్పటి అనంతపురము జిల్లాయొక్క ఈశాన్యభాగమైన యప్పటి తాడిపత్రి, తాడమర్రితాలూకాలు నైజామున కీయఁబడెను. టిప్పు చనిపోయిన తరువాత ౧౭౯౯ లో ఆతని రాజ్యమును ఇంగ్లీషు నైజాము మొదలగువారు పంచుకొనునపుడు, ఈజిల్లాయొక్క మిగిలిన భాగమంతయు నైజామునకుఁబోయెను. ఈ రెండుతహనామాల (treaties) ననుసరించి నైజామునకు వచ్చిన రాజ్యమంతయు, నతఁడు ౧౮౦౦ లో నింగ్లీషువారికి దత్తముచేసెను. అవియే దత్తమండలములు (Ceded districts). నైజాము సంరక్షణ నిమిత్తమై యింగ్లీషు వారుంచవలసిన సైన్యము కర్చుక్రింద ఈమండలములు శాశ్వతముగ నింగ్లీషువారి కీయఁబడెను. అప్పు డనంతపురముగూడ బ్రిటిషు ప్రభుత్వమునఁ జేరెను.

మొదట దత్తమండలముల కన్నిటికి నొక్కఁడె కలెక్టరుండెను. మొదటి కలెక్టరు మేజర్ మన్రో (ఇతఁడే తరువాత సర్ పదవిని బొందెను). తరువాత దత్తమండలము రెండు జిల్లాలుగ విభజింపఁబడెను. అందు బళ్లారి జిల్లాలో నిప్పటి అనంతపురముండెను. బళ్లారి జిల్లా పెద్దది అయినందున ౧౮౮౨ లో దానిని రెండు జిల్లాలుగ విభజించి, ఒకదానికి బళ్లారి అనియు, రెండవ దానికి అనంతపుర మనియు పేర్లు పెట్టిరి. కదిరితాలూకా యిటీవల-కడపజిల్లాలోనిది - ఇందుఁ జేర్పఁబడినది.

ఈ జిల్లాలోఁ బురాతన చరిత్రసూచకములు గుత్తి పెనుగొండకోటలు. తాడిపత్రి యొద్ద పెన్నయొద్దనున్న దేవాలయము, లేపాక్షి హేమావతి దేవాలయములు, చెక్కడముపనులచే సుశోభితములు. పల్లవులకాలమునాటి శాసనములు, హేమావతి దేవా

లయములోనున్నవి. ఈ జిల్లాలోని శాసనములలో నివి మిక్కిలి పురాతనములు.

ఈ జిల్లాలో నూలుబట్టలు, పట్టుబట్టలు నేయుదురు. సాధారణముగ రైతులు కట్టుకొను ముతకబట్టలును

కళలు, విద్యలు, వర్తకము

స్త్రీలు కట్టుకొనురంగుచీరెలు ఎక్కువగ నేయఁబడును. పట్టునేత ముఖ్యముగ తాడిపత్రి, ధర్మవరము, ఉరవకొండ యను స్థలములందు జరుగును. పామిడి, గుట్టూరు అను గ్రామములలో చేతితో నద్దఁబడిన చీటీబట్టలు, కలంకారియద్దకపుదుప్పట్లు మొదలయినవి తయారు చేయఁబడును. ఇట్టి సరకు లెక్కువగ రంగూను కెగుమతియగును. కల్యాణదుర్గ, మడకశిర తాలూకాలలో ఉన్ని కంబళ్లు నేయఁబడును.

తిమ్మన్ చెర్ల, గుంటకల్, తాడిపత్రి యీ మూఁడుచోట్లను ప్రత్తి యేకి మూటలుకట్టు, ప్రత్తి ఫ్యాక్టరీలు కలవు. ఇవి చాలకాలము నుండి యున్నవి. వీనిలో ఆవిరితోఁ బనిచేయఁబడును. ధర్మవరము తాలూకాలోని న్యామద్దల గ్రామమునందు ముతకకాగితము చేయుదురు. క్షారమయమైన మట్టితోఁ బూర్వమీ జిల్లాలో గాజులు చేయుచుండిరి. కాని యిప్పుడావృత్తి చచ్చిపోయినది.

ఉత్తరపు తాలూకాలనుండి ప్రత్తియు, దక్షిణమునుండి బియ్యము, బెల్లము, తంగెడుచెక్క యెగుమతులగును. ఉప్పు, పరదేశపుబట్టలు, పరదేశపునూలు, పశువులు ఈ జిల్లాకు దిగుమతియగును. వర్తకమునకు హిందూపురము ముఖ్యస్థలముగ నుండెను. కాని యిటీవల ప్లేగువలన నచ్చటి వర్తకము తగ్గినది. వారము వారము చేరెడి సంతలవలన నీ జిల్లాలోని యంతరంగవర్తకము జరుగుచుండును. ఈ సంతలు లోకల్ బోర్డువారి అధీనమందుండును. ముఖ్యమైన సంతలు హిందూపురము, తాడిపత్రి, యాదికి అను స్థలముల జరుగును.

ఈ జిల్లాలో బండిబాటలు, రోడ్లు వలయునన్ని కలవని చెప్పవచ్చును. కంకరు వేయఁబడిన పక్కారోడ్లు ౨౫౧ మైళ్లును, సాధారణపురోడ్లు ౫౦౮ మైళ్లును వ్యాపించి యున్నవి. బెంగుళూరు

బాటలు, రోడ్లు

నుండి సికింద్రాబాదుకు బోవురోడ్డు ముఖ్యమైనది. ఇది దక్షిణదిక్కున కొడికొండయొద్ద అనంతపురము జిల్లాలోనికిఁ బ్రవేశించి, ఉత్తర దిక్కుగఁబోయి గుత్తియొద్ద జిల్లా వెలువడును. ఇవిగాక జిల్లాలో నొకచోటినుండి మఱియొక చోటికిఁ బోవుటకు పెక్కుబాటలు కలవు. రైలుమార్గము లేని తాలూకాలలో నీబాటలను జనులు విశేషముగ నుపయోగించెదరు. జిల్లా బీదదియైనందున లోకల్ బోర్డు వారికి నెక్కువ ఆదాయములేదు. అందుచే బాటల మరమ్మతు విశేషముగ జరుగదు.

ఈ జిల్లాకు రైలు సౌకర్య మెక్కువగా నున్నది. చెన్నపట్టణమునుండి వాడికిఁబోవు

రైలు, ఈశాన్యపుదిక్కుగా, నీజిల్లాలోఁ బ్రవేశించి గుత్తి తాలూకా

రైలుమార్గము

లోని గుంతకల్ జంక్షన్‌కు జేరును. అచ్చటినుండి నైజాము రాజ్యమందలి రాయచూరుకుఁ బోవును. ఈ రైలు ౧౮౬౮-౧౮౭౦ సంవత్సరముల మధ్యకాలమునఁ బ్రారంభింపఁబడినది. గుంటకల్లునుండి సదరన్ మరాఠా రైలు (ఇప్పుడు ఎమ్. ఎస్. ఎం.ఆర్) మూఁడుశాఖలుగ మూఁడుచోట్లకుఁ బోవును. ఒకటి బళ్లారికి, ఒకటి బెజవాడకు, ఒకటి బెంగుళూరునకు. బెంగళూరుకుఁబోవు రైలుత్రోవ ఉత్తరమునుండి దక్షిణమువఱకు జిల్లాపొడుగున నున్నదని చెప్పవచ్చును. మఱియొకశాఖ గుంతకల్లునుండి గదక్‌కుఁ బోవుచున్నది.

ఈ జిల్లాలో ౧౮౯౧ జనాభా లెక్క ప్రకారము ౮౬౨౬౪౦ జనమును, ౧౯౦౧-వ సంవత్సరపుజనాభా లెక్క

జనసంఖ్య

ప్రకారము ౯౩౩౭౫౭ మంది జనమును, ౧౯౧౧-వ సంవత్సరపు లెక్క ప్రకారము ౯౬౩౨౨౩ జనమును ఉండిరి. అనఁగానీపదిసంవత్సరములలో నూటికి ౩.౨ చొప్పున జనము వృద్ధియైనది. ౧౯౦౧-వ సంవత్సరమునకుఁ బూర్వపు పది సంవత్సరములలో (౧౮౯౧-౧౯౦౧) నూటికి ౮.౨ చొప్పున జనమువృద్ధియై యుండెను. ౧౯౧౧-వ జనాభా సమయమున ౪౯౪౨౩౨ మగవాండ్రును ౪౬౮౯౯౧ ఆడువాండ్రును ఉండిరి. తాలుకాల ప్రకారము జనసంఖ్య ఈక్రిందనీయఁబడినది.

| | |
|---|---|
| ౧ అనంతపురము | ౧౦౬౧౩౧ |
| ౨ ధర్మవరము | ౮౯౮౪౮ |
| ౩ గుత్తి | ౧౪౯౧౩౯ |
| ౪ హిందూపురము | ౯౭౩౧౪ |
| ౫ కదిరి | ౧౪౭౪౦౨ |
| ౬ కల్యాణదుర్గము | ౮౩౧౩౫ |
| ౭ మడకశిర | ౮౨౧౨౧ |
| ౮ పెనుగొండ | ౯౩౮౬౦ |
| ౯ తాడిపత్రి | ౧౧౪౨౭౩ |
| మొత్తము | ౯౬౩౨౨౩ |

తాలూకా వారిగా విస్తీర్ణము:—

| | చదరపుమైళ్లు. |
|---|---|
| ౧ అనంతపురము | ౯౨౫ |
| ౨ ధర్మవరము | ౭౩౨ |
| ౩ గుత్తి | ౮౯౬ |
| ౪ హిందూపురము | ౪౨౮ |
| ౫ కదిరి | ౧౧౫౮ |
| ౬ కల్యాణదుర్గము | ౮౧౭ |
| ౭ మడకశిర | ౪౪౩ |
| ౮ పెనుగొండ | ౬౭౮ |
| ౯ తాడిపత్రి | ౬౪౧ |
| మొత్తము | ౬౭౧౮ |

పల్లెలు, పట్టణములు, ఇండ్లు:-

| | పట్టణము. | పల్లెలు. | ఇండ్లు. |
|---|---|---|---|
| ౧ అనంతపురము | ౧ | ౧౦౯ | ౨౧౦౦౭ |
| ౨ ధర్మవరము | ౧ | ౬౨ | ౧౭౮౧౨ |
| ౩ గుత్తి | ౩ | ౧౩౦ | ౨౭౫౧౯ |
| ౪ హిందూపురము | ౧ | ౭౭ | ౧౯౬౬౯ |
| ౫ కదిరి | ౧ | ౧౩౯ | ౩౦౬౬౨ |
| ౬ కల్యాణదుర్గము | ౧ | ౭౨ | ౧౫౨౭౨ |
| ౭ మడకశిర | ౧ | ౫౭ | ౧౬౪౫౮ |

| | | | |
|---|---|---|---|
| ౮ పెనుగొండ | ౨ | ౯౪ | ౧౯౭౧౧ |
| ౯ తాడిపత్రి | ౨ | ౯౩ | ౨౧౯౫౮ |
| | ౧౩ | ౮౩౩ | ౧౯౦౦౬౮ |

ఒక చదరపుమైలుకు జన సంఖ్య:—

| | |
|---|---|
| ౧ అనంతపురము | ౧౧౫ |
| ౨ ధర్మవరము | ౧౨౩ |
| ౩ గుత్తి | ౧౬౬ |
| ౪ హిందూపురము | ౨౨౭ |
| ౫ కదరి | ౧౨౭ |
| ౬ కల్యాణదుర్గము | ౧౦౨ |
| ౭ మడకశిర | ౧౮౫ |
| ౮ పెనుకొండ | ౧౩౮ |
| ౯ తాడిపత్రి | ౧౭౮ |
| జిల్లామీఁద సరాసరినొకచదరపుమైలుకు | ౧౪౩ |

ఈ జిల్లాలో, నెక్కుడు జనసంఖ్యగల పట్టణములు లేవు. అనంతపుర పట్టణమందు ౮౪౫౭ (౧౯౧౧) జనులు గలరు. జనులలో ౧౦౦ మందికి ౯౧ రు హిందువులుగను, ౮ మంది తురకలుగను ఉందురు. మతముల ననుసరించి జనసంఖ్య యీ క్రింద ఈయఁబడినది.

| | |
|---|---|
| హిందువులు | ౮౭౬౪౭౧ |
| మహమ్మదీయులు | ౮౦౦౪౮ |
| అనిమిష్టులు | ౨౫౯౯ |
| కిరస్తానులు | ౩౬౩౬ |
| జైనులు | ౪౩౬ |
| బౌద్ధులు | ౨ |
| పారసీవారు | ౨౨ |
| యహూదులు (జ్యూ) | ౯ |
| మొత్తము | ౯౬౩౨౨౩ |

ఈ జిల్లాలో ముఖ్యమైనది తెలుఁగుభాష. నూటికి తొంబదిమంది కంటె నెక్కువగాఁ దెనుఁగు మాట్లాడువారుందురు. కన్నడ దేశమును తగిలియున్న భాగమందు కన్నడము కొంచె మధికముగనుండును. కన్నడము మాట్లాడువారునూటికి ౧౦ కంటె నెక్కుడుండరు. ఈజిల్లాలోని జనులను భాషననుసరించి యిట్లు విభజింపవచ్చును.

| | |
|---|---|
| తెలుఁగువారు | ౭౮౨౩౩౨ |
| కన్నడము వారు | ౯౧౮౦౪ |
| హిందూస్థాని మాట్లాడువారు | ౫౯౬౨౩ |
| లంబాడీలు | ౧౨౦౫౭ |
| మరాటీలు | ౭౨౩౮ |
| ఎరుకలభాష | ౩౮౪౯ |

జనులయొక్క జాతి ననుసరించి యీ క్రిందఁ జన సంఖ్య యీయఁబడినది. అందు ముఖ్యమైన జాతులు మాత్రము ఉదాహరింపఁబడినవి. ఈక్రింది పట్టికను బట్టి చూచినయెడల నందఱి కంటెఁ దెనుఁగుకాపువారి సంఖ్య యెక్కువగ నున్నట్లు కానవచ్చును. కాపువారనఁగా వ్యవసాయమే జీవనముగఁ గల రెడ్డి వార్నని యర్థము. సంఖ్యలో రెండవ నెంబరు మాదిగ వాండ్రది. కన్నడ వారిలో కురబ జాతివారి సంఖ్య యితరుల కంటె నధికముగ నున్నది. కురబలు మేకల మందలఁ గాయుదురు, బొచ్చు గొంగళ్లు నేయుదురు. ౧౯౧౧-వ సంవత్సరపు జనాభాసమయమున ఈజిల్లాలో ౧౯౦౦౦ బోయిజాతివాండ్రున్నట్టు చూపఁబడినది. ౧౯౦౧ లో వాండ్ర సంఖ్య

౬౧౮౪౯. పది సంవత్సరములలో బోయిల సంఖ్య యంత తగ్గుటకుఁ గారణ మేమో సెన్సస్ రిపోర్టు వారెచ్చటను చర్చించి యుండలేదు. బ్రాహ్మణులు ౧౭౬౬౩మాత్ర మున్నారు.

జాతివారి జనసంఖ్య:

తెలుఁగువారు

| | |
|---|---|
| ఈడిగ | ౯౭౪౩ |
| ఉప్పర | ౧౨౯౬౦ |
| ఒడ్డె | ౩౮౧౫౪ |
| కమ్మ | ౪౩౦౫౬ |
| కాపు | ౧౪౩౯౧౦ |
| కుమ్మర | ౭౧౯౨ |
| కోమటి | ౨౩౭౪౬ |
| కంసాల | ౯౨౯౫ |
| గొల్ల | ౫౨౧౩౩ |
| చాకలి | ౧౯౭౫౫ |
| దేవాంగ | ౭౫౧౮ |
| బలిజ | ౫౯౩౮౯ |
| పెస్తా | ౮౪౭౩ |
| బోయి | ౬౧౮౪౯ |
| బ్రాహ్మణ | ౧౧౬౯౨ |
| మాదిగ | ౧౦౨౪౪౨ |
| మాల | ౨౫౭౧౧ |
| మంగల | ౧౩౦౯౮ |
| సాతె | ౧౧౪౮౧ |

కన్నడవారు

| | |
|---|---|
| కురబ | ౬౧౨౭౧ |
| లింగాయత | ౧౦౬౭౫ |
| బ్రాహ్మణ | ౫౯౭౧ |

ఈ జిల్లా విద్యా విషయమై మిక్కిలి శోచనీయ స్థితిలోనున్నది. ౧౯౦౧-వ సంవత్సరము నందు నూటికి ౪ గురు చదివిన వారుండిరి. ౧౯౧౧ లో నూటికి ౪.౬ గురు చదివినవారయి నారు.

విద్యాభివృద్ధి

ఇట్లు చదివిన వారిసంఖ్య కొంచెము హెచ్చినను మొత్తము మీఁద సమాధాన కరముగ లేదు. ఇంగ్లండు మొదలయిన దేశములలో చదివిన వారు నూటికి ౯౦ - ౯౯ మందియుందురు! ఈ జిల్లా జనసంఖ్య ౯౬౩౨౨౩; అందులో ౪౫౬౨౬ మందిచదువుకొన్న వారు. వీరిలో ౪౩౧౩౫ మంది పురుషులు; ౨౪౯౧ మంది స్త్రీలు. వీరుచదువుకొన్న వారనఁగా విద్వాంసులని యర్థముకాదు. ఇందు ఓనమాలు వచ్చినవారుకూడఁ జేర్పఁబడినారు. చదువుకొన్న వారనఁగా సాక్షరులు. వీరిలో ౨౬౯౦ పురుషులును ౨౪౬ స్త్రీలును ఇంగ్లీషు చదివినవారు.

చదువుకొన్న వారి వివరము

| | పురుషులు | స్త్రీలు | మొత్తము |
|---|---|---|---|
| హిందువులు | ౩౭౨౫౭ | ౧౮౪౨ | ౩౯౦౯౯ |
| ముసల్మానులు | ౪౯౦౩ | ౨౫౯ | ౫౧౬౨ |
| క్రైస్తవులు | ౭౭౨ | ౩౮౩ | ౧౧౫౫ |
| ఇతరులు | ౨౦౩ | ౭ | ౨౧౦ |
| | ౪౩౧౩౫ | ౨౪౯౧ | ౪౫౬౨౬ |

(తాలూకువారి) విద్య

| | |
|---|---|
| అనంతపురము | ౪౨౭౪ |
| ధర్మవరము | ౩౮౮౨ |
| గుత్తి | ౮౫౬౨ |
| హిందూపురము | ౪౭౭౭ |

| | |
|---|---|
| కదిరి | ౫౩౦౭ |
| కల్యాణదుర్గము | ౩౫౧౨ |
| మడకశిర | ౩౮౯౨ |
| పెనుగొండ | ౪౧౯౨ |
| తాడిపత్రి | ౭౨౯౧ |
| | ౪౫౬౨౬ |

తాలూకాలలో గుత్తియందుఁ గొంచెము విద్యాభివృద్ధి యెక్కువగ నున్నదని చెప్పవలెను. కల్యాణదుర్గమన్నిటి కంటె వెనుకఁబడియున్నది.

౧౯౧౫-వ సంవత్సరమునందు ఈజిల్లాలో ౮౩౯ పాఠశాలలుండెను. వానిలో ౨౫౮౫౭ మంది విద్యార్థులు చదువుచుండిరి. ఈ పాఠశాలలలో మగపిల్లల కొఱకు ప్రాథమిక (Elementary) పాఠశాలలు ౭౯౮, రెండవతరగతి (Secondary) పాఠశాలలు ౪, ఆడపిల్లల కొఱకు ప్రాథమిక పాఠశాలలు ౭౦, యూరోపియనులకొఱకు ౩, బోధనాభ్యాసపాఠశాలలు ౪ ఉండెను.

విద్యార్థుల వివరము.

| | |
|---|---|
| (i) హైందవులు | |
| ౧ మగవారు (ప్రాథమిక పాఠశాలలలో) | ౨౨౭౮౬ |
| రెండవతరగతి పాఠశాలలో | ౮౧౪ |
| ౨ ఆడవారు (ప్రాథమిక పాఠశాలలలో) | ౨౦౪౩ |
| (ii) యూరోపియనులు | ౧౦౪ |
| (iii) బోధనాభ్యాసశాలలలో | ౧౧౦ |
| | ౨౫౮౫౭ |

పైని ఉదాహరించిన యంకెలలో హైందవుల క్రింద మహమ్మదీయ విద్యార్థులు ౩౬౫౯ మంది మగపిల్లవాండ్రును, ౯౮౦ మంది ఆడుపిల్లలును ఉన్నారు. ఈజిల్లాలో హిందువులకంటెఁ దురుష్కబాలులే యెక్కువగాఁ జదువుకొనుచున్నారని చెప్పవలెను. చదువుకొనఁ దగినయీడుగల పిల్లవాండ్ర సంఖ్యలోనుండి నూటికి ౫౯ కంటె నెక్కుడు మహమ్మదీయ బాలకులు చదువుకొనుచుండుటమిక్కిలిసంతోషకరమైనవిషయము. ౧౯౧౧-వ సంవత్సరము జనాభాలెక్క ననుసరించి చూడఁగా ఈ జిల్లాయందు ౧౦౦౦౦ జనులలో చదువుకొన్న హిందూపురుషులు ౮౨౯, హిందూస్త్రీలు ౪౩, మహమ్మదీయ పురుషులు ౯౩౯, మహమ్మదీయ స్త్రీలు ౬౭, క్రైస్తవ పురుషులు ౩౯౮౭, క్రైస్తవ స్త్రీలు ౨౨౫౨!

౧౯౧౬-వ సంవత్సరపు జులై నెలనుండి దొరతనమువారు అనంత పురమునందు రెండవ తరగతికాలేజి పెట్టించినారు. ఇది క్రమ క్రమముగ మొదటి తరగతి కాలేజిగా మార్చఁబడును.

వ్యవసాయము

జిల్లాయొక్క యుత్తర భాగమునందుఁ దప్ప మిగిలిన భాగము నందంతటను భూమి మిక్కిలి బీదది, ఫలవంతముకాదు. ఉత్తర తాలూకాలలోని రేగడి భూమియు నంత శ్రేష్ఠమైనదికాదు. ఈ జిల్లాలో పెద్దఆనకట్టలు గాని, ఏటికాల్వలుగాని లేవు. అందుచేత మాగాణి పైర్లు, తోటపైర్లు చెరువు లాధారమునను, బావు లాధారమునను చేయు

దురు: ఈ జిల్లాలో నిరువదివేలవఱకు బావులు గలవు. మిక్కిలి బెట్టకాలములో బావు లంతఁగా నుపయోగపడవు. మెరకపైర్లలో కొఱ్ఱ, జొన్న, రాగి, ముఖ్యమైనవి. కొద్ది భూమిచేసి, ఎక్కువ పైరును వెలగల పైరును పండించుటకు బదులుగా రైతులు ఎక్కువ భూమిదున్ని, కొద్ది పైరులను, బీద పైరులను పండించెదరు.

౧౮౭౧—౭౨ లో ౧౦౭౬౦౦౦ ఎకరములభూమి రైతాధీనము నందుండెను. ౧౮౭౬-౭౮వ సంవత్సరమున వచ్చిన కరువు వలన పెక్కుమంది రైతులు భూములను విడుదలపెట్టిరి. ౧౮౮౧-౨ లో ౮౯౯౦౦౦ ఎకరముల భూమిమాత్రమే రైతాధీనము నందుండెను. తరువాత క్రమ క్రమముగా విడుదల పెట్టిన భూములను రైతులు సాగు చేయఁజొచ్చిరి. ఇట్లు పదియేండ్లు గడచిన తదుపరి ౧౦౭౮౦౦౦ ఎకరముల భూమి కరువు రాక పూర్వముసకన్న నెక్కువగానే రైతాధీనమయ్యెను. ఇప్పటికిని పెక్కు బీడు భూములు ఏటేటను సాగుచేయఁబడుచున్నవి.

ఈమండలమున పచ్చిక బయళ్ళుమెండుగా లేకుండుటచే, ఇచ్చటబుట్టు పశువులంత శ్రేష్ఠములైనవి కాకున్నవి. అందువల్ల నెల్లూరి ప్రాంతపు బలిష్ఠములైన కోడెలనుమంచి వెలకుగొని, తీసికొని వచ్చుచుందురు. ఉన్ని కొరకీ మండలమునందు గొఱ్ఱెలు మేకలెక్కువగాఁ బెంపఁబడుచున్నవి. ఈ ఉన్నితో అనేకగ్రామములందు రత్నకంబళ్లునేయుదురు. ఒక్కొక గొఱ్ఱె వత్సరమునకు ౪ పౌండ్ల ఉన్నీ ఇచ్చుచుండును.

ఈ జిల్లా యందు వర్షము మిక్కిలి స్వల్పముగుట వలన కరువులు

కరువులు

సర్వ సాధారణముగా వచ్చుచుండును. వెనుకటి శతాబ్దములో మొట్టమొదట ౧౮౦౩ సంవత్సరమున కరువు వచ్చెను. అటు తరువాత ౧౮౨౪లో కరువు వచ్చు సూచనలు కనుపడఁగా గవర్నమెంటు వారు సహాయపడి కరువురాకుండఁ జేసిరి. అప్పటినుండియు కరువువచ్చినప్పుడెల్ల గవర్నమెంటువారు తగు సహాయము నుజేయుచున్నారు. ఈ కరువులు వర్షములేమియు లేక పోవుటవల్ల పైరులు మాడిపోయినందుచేఁ గలుగు చున్నవి. ఇవి ౧౮౩౩, ౧౮౩౮, ౧౮౪౫, ౧౮౬౬, ౧౮౭౬—౮, ౧౮౯౨, ౧౮౯౬, సంవత్సరములలో వచ్చినవి. ౧౮౭౬—౮ కరువులో ౧౩౭౨౩౪౭ జనులు క్షామదేవత పాలఁబడకుండ కాపాడఁబడిరి.

విజయనగరము వారి క్రిందనున్నపుడు ఈ జిల్లాలోఁజేరిన వ్యవసాయపు భూములకు నెట్టి

భూమితరములు

తరములుండెనో, భూము లెట్లు అమరకము చేయఁబడుచుండెనో కనుఁగొనుటకు నాధారములేదు. అప్పుడు శిస్తు ధాన్యరూపకముగ సంగోరుపాలు, శిస్తుక్రిందఁ దీసికొనుచుండిరని మాత్రమే తెలియుచున్నది. గోల

కొండవారి ప్రభుత్వకాలమున కామాలుపద్ధతి ననుసరించి భూమిశిస్తు వసూలుచేయుచుండిరి. కామాల్‌పద్ధతి ప్రకారముగూడ సంగోరు పాలు ధాన్యము ప్రభుత్వమువారికిఁ బోవును. కాని యిది జమీన్‌దారుల,పాళెగార్ల ద్వారా వసూ లగుచుండెను. మహారాష్ట్రుల క్రింద నున్న భాగమునందలి భూముల కేపద్ధతి ననుసరించి శిస్తుకట్టుచుండిరో తెలియదు. హైదరల్లి శిస్తులు శాశ్వతముగ నిర్ణయము చేసెను. కాని యినాములు మొదలయినవి జప్తుచేసి శిస్తు ఎక్కించ యత్నించెను. వాని కుమారుఁడైన టిప్పు సుల్తాన్ శిస్తులుపెంచ యత్నించెను. కాని శిస్తులు క్రమముగ వసూలుచేసి కొనఁగలిగిన వాఁడు కాఁడు. నైజాముకు ఈ భాగము ౧౭౯౨ లో స్వాధీన పడినప్పుడు భూమి మీఁది ఆదాయము తగ్గెను. ౧౭౯౨-౯౩ సంవత్సరములలోగొప్ప కరువువచ్చెను. అందువలన శిస్తులు తగ్గిపోయెను.

ఈ జిల్లా కంపెనీవారికి స్వాధీనపడిన తరువాత భూములు అమరకము చేయుపద్ధతి మారినది. జమీన్‌దారుల ద్వారా శిస్తులు వసూలు చేయుటకు మారుగా, రైతులతో స్వయముగా దొరతనమువారు కొల్లు కుదుర్చుకొని, శిస్తు తామే వసూలుచేయఁజొచ్చిరి. ఈ అమరకపు పద్ధతిని రైతువారి పద్ధతి యని యెదరు. ఇదిమేజర్ మన్‌రోచేసినయేర్పాటు. గ్రామ మునసబు కరణములకు నిందువలనఁ బూర్వమున్న లాభము తగ్గినందున వారివలన శిస్తువసూలుకుఁ గొంతభంగము మొదటగలిగెను. కాని తరువాత వారును క్రమముగఁ బనిచేయఁదొడగిరి. ౧౮౦౨-౧౮౦౬ కాలములో భూములను కొల్పించి, భూములను దర్జావారిగ విభజించి, మన్రో తరముల నిర్ణయించెను. తరువాత ఇండియా గవర్నమెంటువారు, రైతువారి పద్ధతిని తీసివేసి, మొదట మూఁడేండ్లకు, తరువాత పదేండ్లకు, గ్రామాదులు ఇజారాపద్ధతి మీఁదనిచ్చిరి. ఇందువలన లాభము కలిగినది కాదు. కావున ఇజారా పద్ధతి మాని వేసి ౧౮౧౮లో మరల రైతువారిపద్ధతిని ప్రారంభించిరి.

మన్రోచే నిర్ణయింపఁబడిన రేట్లు ఎక్కువ యనియు వానిని తగ్గింప వలసినదనియు ౧౮౨౦ లో దొరతనమువారి కాజ్ఞాపించిరి. కాని ౧౮౨౧ వఱకు ఆరేట్లు తగ్గింపఁబడినవి కావు. అట్లు తగ్గింపఁబడిన రేట్లుకూడ ఎక్కువ యని ౧౮౫౯ లో వానిని నింకను తగ్గించిరి. ఇట్లు రేట్లు తగ్గిన తరువాత జిల్లా కొంచెము బాగు పడఁజొచ్చెను. కాని ౧౮౭౬-౭వ సంవత్సరపు కరువు వచ్చి జిల్లానంతను మాడ్చి రైతులను బీదవారిని చేసెను. మరల ౧౮౭౯లో సర్వే ప్రారంభమై ౧౮౯౭ లోఁ బూర్తి అయ్యెను. కొత్త అమరకము ౧౮౯౦ లో ప్రారంభమై ౧౮౯౭ లో ముగిసెను. ఈ జిల్లామీఁద భూమిశిస్తుమాత్రము

పదునారు లక్షలకు మించియు, పదునేడు లక్షలకు తగ్గియు నుండును. ఇందు జమీన్ దారీలు లేవు. ఇనాంగ్రామములు ౮౮౬ కలవు. ౯౦౦-కి౧౬ యకరములు ఇనాంభూమి గలదు. ఈ జిల్లాలోని రేట్లు మొత్తము మీఁద (ఆవరేజి) పల్లము య ౧-కి రు. ౪-౬-౮(ఎక్కువ రు. ౯-౦-౦, తక్కువ రు. ౧-౦-౦) మెరక య ౧-కి ౦-౧౧-౯ (ఎక్కువ రు. ౨-౮-౦; తక్కువ ౦-౨-౦).

ఈ జిల్లా కంతకును అనంతపురము మాత్రము మునిసిపాలిటి గానున్నది. డిస్ట్రిక్టు బోర్డును, డివిజను కొక్కటిచొప్పున నాలుగు లోకల్ తాలుకాబోర్డులునుగలవు, పంద్రెండు యూనియనులు కలవు. (కో. ల.)

స్థానిక స్వపరిపాలనము

**అనంత పురము** (తాలూకా). ఈ పేరుగల జిల్లాలోని యొక తాలూకా. ఇది జిల్లాకు నడుమనుండును. విస్తీర్ణము ౯౨౫ చదరపు మైళ్లు. జనసంఖ్య ౧౯౦౧ లో ౧౦౮౭౩౧; ౧౯౧౧ లో ౧౦౬౧౩౧. ఈ తాలూకాలో మొత్తము ౧౦౮ గ్రామములు కలవు. భూమిశిస్తు ౧౯౦౩-౪ లోఁ రు. ౧౯౦,౦౦౦ లుండెను. ఈ తాలూకాలోని భూమి మిట్టపల్లములు కలిగియుండును. బీడదైనందున ఫలవంతము కాదు. అందుచే పచ్చనిచెట్లు తక్కువగఁ గానవచ్చును. ఉత్తరమున నచ్చటచ్చట నల్లరేగడి భూమికొద్దిగఁ గలదు. ఈ తాలూకాకు ఉత్తరమున పెన్నయు, తూర్పున చిత్రావతీ నదియుఁ గలవు. కాని వీనివలన ఈ తాలూకాకు నేమియుఁ బ్రయోజనములేదు. పల్లపు వ్యవసాయ మంతయు వర్షాధారమునే నమ్మియుండవలసియున్నది. అనంతపుర గ్రామసమీపమున నున్న చెరువు క్రీ. శ. ౧౩౬౪ లో విజయ నగరరాజుల మంత్రియైన చిక్కప్ప ఉడయర్ అను నాతఁడు కట్టించెను.

**అనంతఫంది.** ఒక మహారాష్ట్ర కవి. ఇతఁడు శా. శ. ౧౬౬౬ లో జన్మించి ౧౭౪౧ లోఁ గీర్తిశేషుఁడయ్యెను. నరక్ జిల్లాలోని సంగమనేర్ గ్రామ నివాసి. మొదట నితఁడు శృంగారాతి రేకముగల 'లావిణీ' లనఁబడు వృత్తములలోఁ బద్యములఁ జెప్పుచు మగపిల్లల వెంటఁదీసికొని వారిని ఆడించుచు జీవనముచేయు చుండెను. కాని యొకసారి అహల్యాబాయి సంగమనేరుకు వెళ్లినప్పు డామె యీతనిని బిలిపించి బ్రాహ్మణునకిది తగదనిచెప్పఁగా నామార్గము విడిచి యితఁడు భక్తిపరమైన కవిత్వముఁ జెప్పుచు హరికథలుచెప్పఁదొడఁగెను. ఇతనిచే రచింపఁబడిన చాటువులు పెక్కులుగలవు. కావ్యములలో మాత్రము మాధవగ్రంథమను నది యొక్కటున్నది. ఇందు రెండవ మాధవరావు పేశ్వామేడమీఁదినుంచి దూకినప్పటి నుండి రెండవ బాజీరావు రాజ్యాభిషేకము జరుగువఱకు వర్ణింపఁబడినది. రెండవ బాజీరావు, కవికి జరిగిన నిజ వర్తమానము, ఉత్తర

ములు వ్రాసి, తెలిపి, యీ చరిత్ర వ్రాయించెను. ఇతనికి శ్రీపత్. ఫందీయను నామాంతరముగల సవాయి ఫందీయను కుమారుఁడుండెను. అతఁడును కవియే.

**అనంత భట్టు.** శివాజీ గురువైన రామదాసస్వామి సమకాలికుఁడు. సాధుపురుషుఁడు. రామదాసస్వామియొక్క పంచాయతనములో నొక్కఁడు.

**అనంత భూపాలుఁడు** (మట్ల). విజయనగర సామ్రాజ్యపు వైభవము తగ్గిన పిదప పదునాఱవ శతాబ్దాంతమున నామమాత్రులయిన రాయలయొక్క భూములయందు సర్వస్వతంత్రులుగనో కొంత స్వతంత్రులుగనో అచ్చటచ్చట రాజ్యభారము నిర్వహింపఁజొచ్చిన వారిలో నీమట్లవంశ మొకటియై కన్పించుచున్నది. వీరిలో నొక్కండగు వరదరాజు శ్రీకృష్ణదేవరాయల యల్లుఁడు. మట్ల వంశము వారు ఆంధ్రచోడులుగఁ గన్పట్టుచున్నారు. సూర్యవంశజులు, వీరి మూలపురుషుఁడు తిమ్మప్రభుఁడు. చాటు పద్యములనుబట్టి చూచినను అనంతభూపాలకృత కకుత్స్థవిజయమును, అవతారికా పద్యములు మాత్రమే గల నడిపింటి - వేంకట కవికృత అభిషిక్త రాఘవమును ఈ రెంటినిబట్టి చూచినను, మట్ల వంశోద్భవులు విద్యాప్రియులును రణప్రియులును నయి కన్పట్టుచున్నారు. అందు అనంత భూపాలుఁడు పెనుగొండకడ మల్కబలముల సాధించినట్లును గుఱ్ఱము కొండను స్వాధీన పఱచుకొనినట్లును సిద్ధవట దుర్గము నాక్రమించుకొని నట్లును రాయలచే 'సురమాయి' బిరుదమందినట్లును తెలియవచ్చుచున్నది. మట్ల, పెనుకొండ, సిద్ధవటము, గుఱ్ఱముకొండ ఇవెల్లయు ఒండొంటికి అనతిదూరమున నుండుటంజేసి మట్లప్రభువులు విజయనగరాధీశులకు సామంతులయిన స్వల్ప సంస్థానాధిపతులని,నిర్ణయింపవలసి యున్నది. మట్ల కడప జిల్లా రాయచోటి తాలూకాలో నున్నది. అచ్చట నుండి యుద్ధవీరుఁడుగ్గను కావ్యకర్తగను బ్రఖ్యాతిగాంచిన ఈ అనంత భూపాలుఁడు ఎల్లధరారమణునకును రంగమాంబకును బుత్రుఁడు, తిరుమల శ్రీశైలాచార్య శిష్యుఁడు. పదునాఱవ శతాబ్దపు నుత్తరార్థమునను పదునేడవ శతాబ్దాదిని నుండిన వాఁడు. పైని చెప్పఁబడినరీతిని ఇతఁడు కాకుత్స్థ విజయమను గ్రంథమునురచించెను.

**అనంత దేవుఁడు.** ౧. ఇతఁడు సంస్కృతమును నందు 'సిద్ధాంత తత్త్వం' స్మృతి కౌస్తుభం 'సంస్కార కౌస్తుభం' మొదలయిన గ్రంథములను రచించెను. సిద్ధాంత తత్త్వమనునది వేదాంత గ్రంథము. ఇతఁడు కూర్మాచల దేశాధిపతియైన బాజబహాదుర్ బంద్ వద్ద నాశ్రితుఁడగ నుండెను. ఈరాజు ౧౬౩౮ మొదలు ౧౬౭౮ వఱకుండెను. ఈ గ్రంథ కర్త తండ్రి ఆపదేవుఁడు; ఆపదేవి

(న్యాయ ప్రకాశః) అను పూర్వ మీమాంస సంబంధమైన యుద్గ్రంథమునకుఁ గర్త.

౨. భాస్కరాచార్యుని వంశములోని వాఁడు. ఇతఁడు బ్రహ్మగుప్తుని సిద్ధాంత మండల ఛందశ్చిత్యుత్తర మను యధ్యాయముమీఁదను, బృహజ్జాతకము మీఁదను టీక వ్రాసినవాఁడు.

౩. కాశ్మీర దేశపు రాజు. ఇతఁడు క్రీ. శ. ౧౦౨౮ మొదలు ౧౦౬౩ వఱకు ముప్పదయిదు సంవత్సరములు రాజ్యమేలెను. ఇతఁడు సంగ్రామ రాజు (౧౦౦౩-౧౦౨౮) యొక్క చిన్న కుమారుఁడు. ఇతని యన్న హరిహర రాజు ౨౨ దినములు రాజ్యము చేసి గతించిన తోడనే ఇతని తల్లి దుర్మార్గ వృత్తిగల శ్రీలేఖ రాజ్యము నాక్రమించుటకుఁ బ్రయత్నించెను. కాని రాజభటులీత నినే రాజ్యముపైఁ గూర్చుండఁబెట్టిరి. ఇతని పినతండ్రి కుమారుఁడగు విగ్రహ రాజీతని మీఁదికి దండెత్తి వచ్చెనుగాని గత ప్రాణుఁ డయ్యెను. ఇతని రాజ్య ప్రారంభదశయందు శాహివంశజు లయిన రుద్రపాల దిడ్డపాలు లను వారు రాజునకుఁ బ్రియులై మిక్కిలి బలవంతులైరి. రుద్రపాలుఁడు ఇందు చంద్రుఁ డను జాలంధరరాజుయొక్క పెద్ద బిడ్డను బెండ్లి చేసికొనెను. అనంత దేవుఁడా ఇందు చంద్రునియొక్క చిన్న కూతురగు సూర్య మతిని బరిణయమాడెను. ఊవరు లనువారు రాజుపైఁ దిరుగఁ బడిరి. కంపనాధిపతియగు త్రిభువనుఁడు వారికి నాయకుఁడుగ నుండెను. అనంతుఁడు యుద్ధమునకుఁ బోయి శౌర్యమును జూపి స్వయముగ త్రిభువనుని జంపెను. అట్లే అచల మంగలుఁడను రాజు ఏడుగురు మ్లేచ్ఛ భూపాలురతోఁగలిసి ఎత్తిరాఁగా రుద్రపాలుని సాహాయ్యంబున అనంతుఁడు వారి నోడించెను. రుద్రపాల దొడ్డపాలురు మరణము నొందిన పిదప అనంతుఁడు తన భార్యయైన సూర్యమతి సాహాయ్యమున రాజ్యము చేయుచుండెను. ఈమె మిక్కిలి ధర్మాత్మురాలు. పెక్కు దేవాలయములు గట్టించి దానములు చేసెను.

రాజు మాత్రము గుఱ్ఱము మొదలయిన వాని యందెక్కువ యాసక్తిగల వాఁడై ధన మెక్కువగాఁ గొల్లబెట్టుటవలన అప్పుల పాలాయెను. డల్లకుఁడను నర్మ సచివుఁడు రాజాను గ్రహమును సంపాదించి ప్రజలను దోచుకొను చుండెను. పద్మరాజను పరదేశీయుఁడు, తమలపాకు లమ్మువాఁడు, రాజున కెంతయో అప్పుపెట్టి, అతనిసింహాసనములను గుదువ బెట్టికొనెను. అపుడు సూర్యమతి తనయొద్ద నున్న ధనము నొసంగి రాజును ఋణవిముక్తుని జేసెను. అప్పటి నుండియు రాజ్య, భారమంతయు భార్య సూర్యమతియే వహించెను. అనంత దేవుఁడు పేరునకు మాత్రము రాజుగా నుండెను. ఆమె ప్రభుత్వ

మున 'హలధరుఁ'డను వాఁడు ముఖ్యమంత్రిగ నుండెను. ఇతఁడు మిక్కిలి జాగరూకతతో రాజ్యభారమును నడపెను. ఆ కాలమున అనంతదేవుఁడు శాల, కంపాది దేశముల జయించెను. ఉరశ, వల్లాపుర, దేశాధిపతులపై దండువెడలఁబోయెనుగాని పరాజితుఁడై తిరిగివచ్చెను. అనంతదేవుఁడు మన స్థైర్యము లేని వాఁడగుటచే సూర్యమతి యనుమతిని నాతఁడు ౧౦౬౩ లో రాజ్యమును తన కుమారుఁడైన కలశున కిచ్చివేసెను. కాని కలశునకును, అనంత దేవునకును పడనందున రాజు మరల రాజ్యభారము వహించుటకు ప్రయత్నించెను. తుద కీతఁడు క్రీ. శ. ౧౦౮౧ లో కుటుంబ కలహమునకు విసివి ఆత్మహత్య గావించుకొనెను.

**అనంత దైవజ్ఞుఁడు.** జ్యోతిష శాస్త్రవేత్త. మహారాష్ట్రుఁడు. విఖ్యాతుఁడైన గణేశ దైవజ్ఞుని తమ్ముడు. ఇతఁడు శా. శ. ౧౪౭౬ జయనామ సంవత్సరమున వరాహమిహరకృత 'లఘు జాతకము' పై టీకవ్రాసెను. అది ఉత్పల కృతమైన వ్యాఖ్యకంటె లఘుతరమైనదనియు, సులభమైనదనియు నీతని యభిప్రాయము.

**అనంతనార్యుఁడు.** తాళవలింగ కవి కుమారుఁడు. గాథేయోపాఖ్యానమను ఏకాశ్వాసకావ్యమును వ్రాసెను. కృష్ణ భూపాలున కంకిత మొనర్చెను. ఈ కృష్ణ భూపాలుఁడు చిన్న ప్రభునకును కామాంబకును బుత్రుఁడు.

**అనంతవర్మ** (చోడగంగ). కళింగ దేశమును పాలించిన తూర్పు గంగ వంశపు రాజులలో మిక్కిలి ఖ్యాతి చెందినవాఁడు. క్రీ. శ. ౧౦౭౬ మొదలు ౧౧౪౭ వఱకు రాజ్యముచేసెను. మిక్కిలి జయ శీలుఁడై తనరాజ్యము గంగ మొదలు గోదావరి వఱకు వ్యాపించునట్లు చేసెను. ఇతఁడు జగన్నాథ దేవాలయమును గట్టించెను.

**అనంత విజయము.** యుధిష్ఠిరుని శంఖము.

**అనంత వ్రతము.** ఒక వ్రతము. భాద్ర పదశుద్ధ చతుర్దశినాఁడు వచ్చును. అనంత పద్మనాభుఁడనుపేర విష్ణువు ఉపాసింపఁబడును.

**అనంత శయనము.** ఇది ట్రావెంకూరు సంస్థానమునకు ముఖ్య పట్టణము. దీనినే తిరు అనంతపుర మనియెదరు. ప్రస్తుత వ్యవహార నామము త్రివెంద్రము. ఈ పట్టణపు వైశాల్యము రమారమి పది చతురపు మైళ్ళు. జనసంఖ్య రమారమి అఱువదివేలు. ఇచ్చట మహారాజులుంగారును, బ్రిటిషు రెసిడెంటును ఉందురు. పట్టణము సముద్రము నొద్దనుండి రెండుమైళ్ల దూరమున నుండును. ఇందు నొక భవ్యమైన దుర్గము గలదు. దాని చుట్టునుండుప్రాకారము వేయి గజముల

పొడవును (తూర్పు పడమరలు) ఎనిమిదిపందల వెడల్పును (ఉత్తర దక్షిణములు) ఉండును. పట్టణము కోటకు లోపలను వెలుపల నున్నను కోటలోని భాగమే ముఖ్యమైనది. అందు రాజభవనము, రాణుల మందిరములు, అనంత పద్మనాభుని విఖ్యాత దేవాలయము గలవు.

అనంత పద్మనాభుని దేవాలయము వలననే ఈ పట్టణమునకు విశేష ఖ్యాతికలిగినది. హిందువులచే నిది యొక మహత్తర క్షేత్రముగా పరిగణింపఁబడు చున్నది. భరత ఖండమునందలి యన్ని దేశముల నుండియు యాత్రికు లెల్లపుడు గుంపులుఁ గుంపులుగా వచ్చుచుందురు. ఇచ్చట శ్రీ మహావిష్ణువు 'అనంతుఁ'డను నాగముపై పవ్వళించియుండును. ఈ క్షేత్రము మిక్కిలి పురాతనమని చెప్పెదరు. దీని యుత్పత్తిని గుఱించి పెక్కు గాథలుకలవు. అందిది యొకటి :—

'విల్వ మంగళమ్ స్వామియార్' అను నొక స్వామి మలబారు దేశమందు పెక్కు దేవాలయములను కట్టించెనట. అతఁడు కనులు మూసికొని ధ్యానము చేయునపు డొక చిన్న బాలుఁడు వచ్చి, అతని సాలిగ్రామమును తీసివేసి, పూలసెగఁజల్లి ఇతర పూజా ద్రవ్యములను చెల్లాచెదరుచేసి, పెక్కు విధముల నతనిని చిక్కుపఱచు చుండెను. ఆతఁడు కనులు తెఱచిన తోడనే మాయా శిశు వదృశ్య మగుచుండెను. ఒకదిన మా స్వామికి మిక్కిలి కోపమువచ్చి కన్నులు మూసికొని యుండియే తన చేతితో నాపిల్లవానిని త్రోసివేసెను. అంత వాఁడదృశ్యుఁడై నీ వెన్వని త్రోసివేసితివో వాఁడు నీ యిష్టదేవత. ఇఁక నీకతఁడు 'అనంతన్ కడ్' అను స్థలమునందు మాత్రము కానవచ్చును, అని చెప్పెను. అంత స్వామి కన్నులు తెఱచి, తానా పిల్ల వాని నిజ స్వరూపమును తెలిసి కొనఁజాల నందులకు చింతిల్లెను. అతఁడు 'అనంతన్ కడ్' స్థలము నెన్నడు వినియుండ లేదు. అతఁడా స్థలమును గనుకొనుటకై పోఁగాఁ బోఁగా నొక్కచోట నేడ్చుచున్న తన కుమారుని భయపెట్టుటకై "నీ విట్లేడ్చిన యెడల నిన్ను 'అనంతన్ కడ్' లో వేసెదను" అను మాట వినవచ్చెను. అంత నాతఁడు, ప్రాణము లేచి వచ్చినట్లయి, ఆ స్త్రీని బ్రార్థించి, ఆ స్థలమును గనుఁగొని అచ్చటికి వెళ్ళఁగా అది శేషునిపైఁ బవ్వళించి యున్న విష్ణుమూర్తి అతనికిం గానుపించెను. ఆమూర్తి 'తిరువళ్ళం' మొదలు 'తిరుప్పపూర్' వఱకు వ్యాపించి తిరు అనంతపురములో దాని నడిమి భాగముండెను. ఇంత పెద్ద మూర్తికి పూజచేయుటగాని, గుడి గట్టుటగాని భక్తులకు సాధ్యము గానందున 'చిన్నవాఁడవు' గమ్మని యా స్వామి ప్రార్థించెను. అంత నా మూర్తి చిన్నవాఁడయ్యెను. ఆ దేశపు రాజు దానికి గుడి కట్టించెను.

ప్రస్తుతము గానవచ్చెడి దేవాలయము మిక్కిలి పురాతన మైనదిగాదు! దేవాలయ

ములోని కొన్ని చక్కని భాగములును, ఎదుటనుండు గోపురములును, మార్తాండ వర్మ (క్రీ. శ. ౧౭౨౯—౧౭౫౮) అను రాజు కాలమునఁ గట్టఁబడినది.

ఈ దేవాలయమునకు భూములమీఁద సంవత్సరమునకు రు. ౭౫౦౦౦ లు వరుంబడి వచ్చును. ఈ దేవాలయముయొక్క వ్యవహారములను జూచుటకై 'ఎట్టరయోగము' అను సంఘము గలదు. ఎట్టరయోగ మనఁగా ఎనిమిదిన్నరమంది కూడిక. ఎనిమిది మంది బ్రాహ్మణులును మహారాజుగారును గలిసి ఈ సంఘమగును. మహారాజుగారికి సగము 'ఓటు' మాత్రమేగలదు. దేవాలయమునకు సంబంధించి 'అగ్రశాల' అను నొక గొప్ప సత్రముగలదు. అందు బ్రాహ్మణుల కెడతెగకుండ సంతర్పణములు జరుగుచుండును. ఈ దేవున కుత్సవములు విశేషముగా జరుగుచుండును.

కోట కుత్తరమున నొక మైలుదూరమున రాజ మార్గము ప్రక్క హజూరుకచ్చేరి యనఁబడు మందిరములు గలవు. అందు దివాన్ కచ్చేరియు, హైకోర్టును, ఇతర కచ్చేరులును గలవు. అవి మిక్కిలి చక్కని కట్టడములు. వీని కుత్తరమున బాలికాబాలకులకై విడివిడిగా నిర్మింపఁబడిన ఉన్నత పాఠశాలలును, 'విక్టోరియా జూబిలీ హాలు' ఇండస్ట్రియల్ స్కూలు ఆఫ్ ఆర్టుస్, సార్వజనిక పుస్తక భాండాగారమును, సైన్య శిబిరమును (Military Cantonment) గలవు. ఇంక నుత్తరమునకుం బోయిన నేపియరు మ్యూజియము(చిత్రవస్తుప్రదర్శనాలయము) కలదు. అది సార్వజనీనోద్యానంబునందు నెల కొల్పఁబడినది. మళయాళవాస్తుశాస్త్ర సిద్ధాంతముల ననుసరించి మనోహరముగ కట్టఁబడినది. దీనికి సమీపమునందే నక్షత్రశాల (Observatory) గలదు. అది సముద్రముపైన నూట తొంబది అడుగుల యెత్తున నున్నది. దక్షిణ దిక్కునందుఁ దప్ప తక్కిన దిశలయందెల్లను ఏఁబది మొదలు రెండు వందలఅడుగుల యెత్తుననుండు గుట్టలమీఁద నుండు గృహములును, ఎల్లకాలమును నవనవలాడుచు పచ్చిగనుండు పొలముల సౌందర్యమును, ప్రకృతి శోభను వెదజల్లుచున్నవి.

అనంత శయనము వర్తకమునకు ప్రఖ్యాతి చెందినదికాదు. అది చిన్న రేవు స్థలము. అచ్చటికి వచ్చెడి పడవలు స్వల్పము. అవియైనను, తీర సమీపమునకు రాఁజాలవు. సముద్రమున దూరముగా నిల్వవలయును.

## అనంత సాగరము.

నెల్లూరు జిల్లా ఆత్మకూరు తాలూకాలోని యొక గ్రామము. ఇక్కడ ఒకమనీదును గొప్పతటాకమును దర్శనీయములు. ఈ చెఱువునకు అనంత సాగరమని పేరు. దీనింబట్టియే గ్రామ నామము. దీనిపైనుండు శిలా శాసనమును బట్టి దీనిని శ్రీ కృష్ణదేవ మహారాయల కాలమున క్రీ. శ. ౧౫౨౨ లో 'రాయసము

కొండ నరసు అనునతఁడు తన తలిదండ్రు లయిన తిమ్మనరసు సాయయమ్మల జ్ఞాపకార్థము ఈ చెఱువును త్రవ్వించినట్లు కాన వచ్చుచున్నది.

**అనంతానందుఁడు:** వైష్ణవ మతమును స్థాపించిన రామానందుని పండ్రెండు శిష్యులలో నొక్కఁడు.

**అనంతామాత్యుఁడు:** అనంతచ్ఛందస్సని తెలుఁగునఁ బేరుగన్న ఛందోగ్రంథమునకుఁ గర్త. ఈ గ్రంథము గాక యీతఁడు భోజరాజీయమను కావ్యమును, రసార్ణవమనఁబడు సాహిత్య శాస్త్రమును రచించెను.

ఈ కవి తనవంశమును భోజ రాజీయము నందు సవిస్తరముగ వర్ణించినాఁడు. దానిని అనుసరించి యాతని వంశవృక్షము క్రింద నీయఁబడుచున్నది:—

ఈతని ముత్తాతయగు బయ్యన్న తిక్కన సోమయాజితో సమకాలికుఁడు. సోమయాజి యాతనిని మెచ్చి 'భవ్యభారతి' యన్న బిరు దిచ్చెను. కవితల్లి యైనమల్లమాంబిక, గొప్ప వారింటి యాడఁబడుచువలెఁ గానవచ్చెడిని. ఆమెతండ్రి యొక దండనాయకుఁడని కవియే వ్రాసియున్నాఁడు. కవితండ్రి తిక్కన్న భూవసతియు, నుద్యోగమును గలిగి సుఖజీవనము చేయుచుండెను. వీరిది కౌండిన్య గోత్రము. వైష్ణవులు వీరికి గురువులుగ నుండిరి. ఈ

అనంతుని వంశవృక్షము



కవికి గోవిందచక్రవర్తి గురువు. ఈతఁడా ర్వేల సంతతివాఁడు. ఫీరార్గు రన్నదమ్ములై నందునఁ గవి చమత్కారముగ నీ క్రింది పద్యము చెప్పెను:—

క. ఈయార్వురనొక్కొక్కఁడు
వేయిండ్లకు మొదలు గాఁగ వెలయుదురని గా
దే యాఱువేల పేరిడి
రీయన్వయమునకు నేప్పు మెఱిఁగిన పెద్దల్ [౧.౪౫.

ఆఱువేల నియోగులను గుఱించిన యుల్లేఖము గల వాక్యమిదియే ఆంధ్రవాఙ్మయమునందు మొదటిది. తెలుఁగు బ్రాహ్మణులలో ఆఱువేలశాఖ రమారమి తిక్కనకాలమువఱకే యేర్పడియుండెనని యిందువలన తెలియుచున్నది. పై సంగతులన్నియు భోజరాజీయ మందలి అవతారిక ననుసరించి వ్రాయఁబడినవి.

ఇఁక నీతని నివాసస్థానమెద్దియని మనము విచారింపవలసియున్నది. ఇందునగుఱించి భోజరాజీయమందలి యీ క్రింది పద్యము మనకు నాధారము:—

సీ. విలసితంబగు కృష్ణవేణామలాపహా
రిణిభీమరథినాఁ ధరిత్రియందుఁ
దనరు నదీత్రయాంతర్వేది యగుపావ
నక్షేత్రమున శోభనముల కెల్ల
ధరనివాసంబగు పెరుమగూరి పురంబు
నందు విద్వజ్జనానందమైన
జీవనస్థితిచేతఁ జెన్నొందు వంశక
ర్తృత్వసంపత్తిఁ బ్రభుత్వమొంది
నెమ్మి ప్రత్యక్ష పరమపదమ్మనంగ
నొప్పు శ్రీకాకుళంబున కొడయఁడైన

* యంధ్రవల్లభ హారిసేవనలరుచుండుఁ,
బెక్కుభంగుల ముమ్మడి తిక్కవిభుఁడు!

ఈ పద్యమునుబట్టి చూడ నీకవియొక్క తండ్రి కృష్ణవేణా, భీమరథీ, మలాపహా యనఁబడు నదులు కలిసిన యంతర్వేదిలోనుండెనని-అట్టిస్థల మాతని స్వస్థానమని - తెలియుచున్నది. అట్టిస్థలమెద్ది? కృష్ణవేణాయనఁగ కృష్ణ, భీమరథీయనఁగభీమ, మలాపహాయనఁగ మలప్రభా నదులనుట స్పష్టము. కృష్ణానదియు, మలప్రభానదియు నైజామురాజ్యమునకుఁ బశ్చిమ సరిహద్దునొద్ద బొంబాయి రాజధానిలోఁ గలిసినవి. ఇది యిప్పుడు కన్నడదేశము. కృష్ణయు భీమయు నైజామురాష్ట్రమునందు రాయచూర్ పట్టణమునకుఁ బశ్చిమమునఁ బదారుమైళ్ళమీఁదఁ గలిసినవి. ఇది తెలుఁగు దేశమని చెప్పవచ్చును. కావున

* 'ఆంధ్రవల్లభ హారిసేవ నలరుచుండు' అనఁగా నీతఁడు ఆంధ్రరాయునివద్ద నుద్యోగిగానుండె నని కొందఱర్థము చేసికొనియున్నారు. కాని యది పొరఁబాటు. 'ఆంధ్రవల్లభహారి' యనఁగా నాంధ్రవిష్ణువు; శ్రీకాకుళములోని దేవుఁడు. అతనిసేవచేయుట యనఁగా నతనిని భక్తితో భజించుట. ఏగ్రామమునందే దేవుఁడుండునో ఆదేవుని ఆగ్రామాధిపతిగాఁ జెప్పుట భక్తుల యాచారము గానున్నది. ఇట్లే యీకవియొక్క 'రసార్ణవ'మందలి "శ్రీనిండల ధ్రువపట్టణాధిపునకిచ్చెం భక్తిపూర్వంబుఁగాఁ" అన్న చరణముఁ జూచి కొందఱీ గ్రంథమును ధ్రువపట్టణపు రాజునకిచ్చెనని భ్రమపడుచున్నారు. అచ్చటను ధ్రువపట్టణాధిపుఁడనఁగా ధ్రువపట్టణపు దేవుఁడని యర్థము. ఈకవి తన గ్రంథమేదియు నరాంకితము చేయలేదు.

ఈకవియొక్క నివాసస్థలము నైజాము రాజ్యమునందుండెనని మన మూహింపవచ్చును. శ్రీకాకుళపు (ఆంధ్ర) విష్ణువు (దేవుఁడు) వీరికిఁ గులదైవము కావచ్చును.

ఈకవి 'రసాభరణము' నందుఁ దనకాల మిట్లు వ్రాసికొనియున్నాఁడు:—

శా. "బాణాంభోధిశశాంకవర్షముల్ బఱతుశక
జ్యాతేందులై యొప్ప న
య్యానందాబ్దమునందు మాఘమునఁ గృ
ష్ణైకాదశీ భౌమ యు
క్తానామామృతవేళ నీకృతి యనం
తాఖ్యుండు సమ్యగ్గ్ర స
శ్రీనిండం ధ్రువపట్టణాధిపున కి
చ్చెన్ భక్తిపూర్వంబుగన్."

శా. శ. ౧౩౫౬ ఆనందనామ సంవత్సర మాఘ బహుళ ౧౧ మంగళవారమనఁగా క్రీ. శ. ౧౪౩౫ జనవరి ౨౫-వ తేది యగును. కావున నీకవి పదునైదవ శతాబ్దమధ్యము నం దున్నవాఁడని నిశ్చయింప వచ్చును.

ఈ కవిచే రచింపఁబడిన మూఁడు గ్రంథములును దేవాంకితములు గనుక నింతకంటె విశేషము లేవియు మనమీకవిని గుఱించి తెలిసికొనుటకు వీలులేదు. ఇఁక నేతద్రచిత గ్రంథమును గుఱించి విచారింతము.

భోజరాజీయము రచించిన తరువాత ఛందస్సు రచించినట్లు, ఛందస్సుయొక్క నాల్గవ యాశ్వాసమునందుఁ గవి భోజరాజీయమును బేర్కొనుటవలనఁ దెలియుచున్నది. భోజరాజీయ మేడాశ్వాసములు గల మంచి ప్రబంధము. అహోబల నృసింహస్వామి కంకితము. ఇందు భోజరాజును గుఱించిన వింతగ్గును కథలు పెక్కుండఁగలవు. ఈ కావ్యమును ౧౯౦౪-లో శ్రీ వీరేశలింగముగారు ముద్రించినారు. వారు దాని పీఠికలో నీ ప్రబంధమును గుఱించి యిట్లు వ్రాసియున్నారు:-

"ఈతని కవిత్వము సలక్షణమునై యాయా స్థలభాగములందును మనోహరముగ నుండును. కవిత్వము మాత్రమేగాక భోజరాజీయము నందలి కథలును మిక్కిలి యింపుగానుండును. కవిత్రయమువారి ప్రయోగములకంటె భిన్నములైన ప్రయోగములీ భోజరాజీయమునందుఁ గొన్ని కానవచ్చుచున్నను మొత్తముమీఁద నిందలి కవిత్వము నిర్దుష్టమునై శ్లాఘ్యముగ నున్నది."

ఈ కవికిఁ దిక్కన సోమయాజిని యనుకరింపవలెనన్న యభిలాష మెండుగ నున్నట్లు ఈ కావ్యమువలనఁ గానవచ్చుచున్నది. ఒక్క యుదాహరణ మిచ్చెదము. నిర్వచనోత్తర రామాయణమునందుఁ దిక్కన తాను కావ్యము వ్రాయుటకు నిట్లు కారణము వ్రాసెను.

సీ. సకలలోకప్రదీపకుఁ డగుపద్మిని
మిత్రువంశమున జనింప ననియుఁ
జూచిన మగలైనఁ జొక్కుదునట్టి సౌం
దర్య సంపద పొంపు దాల్చె ననియు

జనహృదయానంద జనకమై నెగడిన
నగుగతికల్గ నృపతియొఁడనియు
మాఘసభయందుఁ బొటికి మిగులుశౌర్యత్యాగ
విఖ్యాతకీర్తుల వెలసెననియు
తే. వివిధవిద్యాపరిశ్రమ వేది యనియు
సకలబహుమానవిరచనా శాలి యనియు
సుక్రీతిశ్రీగుఁ డగు మన్న సునుమనృపతి
శుభగుఁ గాపాడుమటకు సము త్సకుఁడ నైతి.

ఈ సీసపద్యమును జూచి యీ యనంత కవి తాను కావ్యము వ్రాయుటకుఁ గారణములు చెప్పఁదలఁచి యిట్లు వ్రాసెను:—

సీ. నాతిసంబయ్యుఁ బురాతన కృతులట్లు
సంతత శ్రావ్యమై జగగునని యు
నాదిరాజ సమానుఁడగు భోజనరపతి
చరిత మీ కవితా ప్రసంగమనియు
నిందుఁ జెప్పెడి కథలన్నియు నొలి బ్ర
శస్త ధర్మోపదేశంబు లనియు
సకల జగన్నాథుఁడగు నహోబిలనాథుఁ
డీ పుణ్యకృతికి నధీశుఁడనియుఁ
గీ. బృథివి నల్ల జనులు ప్రియభక్తి యుక్తిఁ జా
టెంగుగనియు నాయుడెల్లి యేను
జగను సౌఖ్యమైన భవదాబ్ధి ముఖ్యంబు
నమ్మఁబడసి యధిక నిష్ఠతోడ. [౧. ౭౮

రసార్ణవమను నది నాలు గాశ్వాసముల యలంకార గ్రంథము. మొదటి యాశ్వాసము నందు నవరస స్థాయీభావాదులును, రెండవ యాశ్వాసమునందు రతిగుణ విభావానుభావాదులును, మూఁడవ యాశ్వాసము నందు శృంగార రస ప్రకరణమును, నాల్గవ యాశ్వాసమునందు నాయక నాయికా ప్రకరణమును వర్ణింపఁబడియున్నవి. మాకు దొరికిన ప్రతిలోఁ గృత్యాద్యాది పద్యములులేవు. ఈ కృతియు విష్ణుమూర్తికి సర్పింపఁబడినది.

అనంతుఁడు గొప్ప లాక్షణికుఁడు. అనంతుని ఛందస్సు తెలుఁగు బాసయందు బహు కాలము నుండియుఁ బేరుగన్న గ్రంథము. లక్షణ వేత్త లందఱును దానిని గౌరవముగఁ బేర్కొని, యందుండి యెన్నియో లక్ష్యములను లక్షణములను ఉదాహరించి యున్నారు. కాని యిప్పుడీ గ్రంథము సంపూర్ణముగ దొరుకుటలేదు. దీనిని పూర్తిగ సంపాదించి యచ్చొత్తించినవారులేరు. రెండు ఆశ్వాసముల గ్రంథము ప్రాచ్య లిఖిత పుస్తకభాండాగారమునందున్నది. రెండవ, మూఁడవ, నాల్గవ ఆశ్వాసముల యసంపూర్తి ప్రతియొక్కటి మ-రా-శ్రీ మానవల్లి రామకృష్ణ కవి గారి వలన మాకు దొరకినది.

భీమన కృత మనఁబడు కవిజనాశ్రయమును విడిచినయెడల, తెలుఁగున నిదియే మిక్కిలి పురాతన ఛందో గ్రంథమని చెప్పవలెను.

ఇందలి ప్రథమాశ్వాసములో "గద్య పద్యాది కావ్యలక్షణంబును, గురు లఘు నిర్ణయంబును, గణనిరూపణంబును, ప్రాస యతి విశేషంబులును, పరిగణ సంజ్ఞయుం" గలవు. రెండవదానిలో "నుభయ భాషా నిరూపణంబులును, గద్యవచనంబుల విధంబును, షడ్వింశతి చ్ఛందో నామంబులును, తదుద్భవంబులగు సమవృత్తంబులును, వృత్త

విశ్రమంబులగు నర్ధసమవృత్తంబులును, ఛందః ప్రోక్తంబగు మాలావృత్తంబులును, దదుద్భవంబులగు దండకంబులును" నిరూపింపఁబడినవి. మూఁడవదానిలో "జాతిలక్షణ లక్షితంబులును, జాతుకావ్య పరిమాణంబులును,ఉదాహరణంబులును, షట్ ప్రత్యయంబులును, సప్తమ ప్రత్యయంబైన సమవృత్తంబుల వెరసుల నెఱుఁగు తెరఁగును" కలవు. నాల్గవదానిలో "వర్జంబులగు దశ దోషంబుల నేర్పఱుచుటయును,నందు దోషరహితంబులైన యాదరణీయంబులగు పట్లఁజేర్చుటయును సంధి సమాసంబులును" కలవు. ఇట్లీగ్రంథమునందుఁ గొంత వ్యాకరణ విషయము కూడఁగలదు.

ఈ గ్రంథమునకు మేము చూచిన ప్రతులలో 'ఛందోవర్ణ' మన్న పేరున్నది. అది లేఖకప్రమాదమేమో, 'ఛందోఽర్ణవ' మన్నది నిజమైన నామధేయమో యని సంశయము కలుగుచున్నది.

**అనంతి.** శతరూపకు నామాంతరము.

**అనంతుఁడు.** ౧. కామధేనువను జ్యోతిష గ్రంథముపై టీకవ్రాసినవాఁడు. 'జాతక పద్ధతి'యనునొక గ్రంథమీతనిది గలదు. గార్గ్యగోత్రుఁడు. గోదావరి తీరముననున్న ధర్మపురి నివాసుఁడు. కావున, ఆంధ్రుఁడు. తండ్రిపేరు చింతామణి. కుమారులు శ్రీకంఠుఁడు, రాముఁడు. వీరును జ్యోతిష శాస్త్రమునందుఁ బేరొందిన వారు, గ్రంథకర్తలు.

౨. అంతములేనివాఁడు, పరమాత్మ.

౩. కశ్యప కద్రూసంతతియగు నాగులలో నొకఁడు.

౪. శేషునకు ఈపేరు గలదు.

౫. జైనులయిరువది నలుగురు తీర్థంకరులలో పదునాల్గవవాఁడు.

**అనంద తాలూకా.** ఈ తాలూకా బొంబాయి రాజధానిలోని ఖేరా జిల్లా మధ్యగలదు. వైశాల్యము ౨౪౪ చతురపు మైళ్ళు. జనసంఖ్య ౧౪౩౩౦౫. రాబడి ఐదులక్షలు. జలవసతి తక్కువ.

**అనందపట్టణము.** ఇది అనంద తాలూకాకు ముఖ్య పట్టణము. జనసంఖ్య ౧౦౦౧౦. ఇక్కడ క్రైస్తవ మత సంఘములు కలవు.

**అనందపాలుఁడు.** లాహోరు దేశపురాజు. గజినీ మహమ్మూదుతో హోరాహోరిగఁ బోరాడిన వీరాగ్రేసరుఁడు. ఇతఁడు బ్రాహ్మణ వంశజుఁడని ఫెరిస్తా వ్రాసియున్నాఁడు కాని 'పాల్' అను ఉప పదము వలన ఇతఁడు రాజపుత్రుఁడని తోఁచుచున్నది. ఇతనితండ్రి పేరుజయపాలుఁడు. జయపాలుఁడు మహమ్మూదుతోఁ బోరి ఓడిపోయి క్రీ. శ. ౧౦౦౨ లో నగ్ని ప్రవేశించెను. అంత అనంద పాలుఁడు రాజ్యమునకు వచ్చెను. మహమ్మూదు ౧౦౦౫ లో ముల్తాను మీఁదికి దాడివెడలి నప్పుడు, అనందపాలుఁ డాతని

సైన్యమును తనరాజ్యములో నుండి పోనియ్యక అడ్డగించి నందున పెషావరు గుట్టలలో వారికి ఘోరమైన పోరుజరిగి అనందపాలుఁడోడి కాశ్మీరమునకు పారిపోయెను. ౧౦౦౮-వ సంవత్సరము నందు మహమ్మూద్ అయిదవసారి హిందూదేశము మీఁదికి దండువెడలివచ్చెను. ముల్తాను దండయాత్ర సమయమున అనందపాలుఁడు తనను మిక్కిలి యగౌరవ పఱచినందున వానిని శిక్షించుటకై మహమ్మూదు నిశ్చయించెను. ఈ సమాచారము తెలిసికొని తురకల నీదేశము నుండి వెడలఁగొట్టుటకు గట్టి ప్రయత్నము చేయ నిశ్చయించి, అనంద పాలుఁడు హిందూరాజుల కందఱకు మతాభిమానముగల వారందఱు యుద్ధమునకు వచ్చునట్లు చేయుటకై తనదూతల నంపెను. ఉజ్జయిని, వాలియర్, కళింజర్, కనౌజీ, ఢిల్లి, అజమీర్ దేశాధి పతులు తమతమ సైన్యంబుతోవచ్చి అనందపాలునితోఁ గలిసికొనిరి. హిందువుల సైన్యము మిక్కిలి గొప్పదిగనుండెను. అనందపాలుఁడే వీనికంతకు సైన్యాధిపతి యయ్యెను. హిందూ సైనికులు, 'గక్కురీ' లనఁబడు అనమాన శౌర్యముగల క్షత్రియులు దినదినము వచ్చి హిందూ సైన్యమునఁ జేరుచుండిరి. తమ మతధ్వంసకులగు తురుష్కుల నెదిరించుటకై హిందూ స్త్రీలు దూరదేశముల నుండి యసంఖ్య ధనమును బంపి యెంతో సాహాయ్యము చేసిరి. బీదస్త్రీలు గూడ, దూదిని యేకియు మఱియన్యవిధమైన కూలిని జేసియుఁ గడించి సొమ్మును బంపుచుండిరి.

ఈతడవ హిందువులు మిక్కిలి పట్టుదలతో నున్నవారని తెలిసికొని మహమ్మూదు తన శిఖరమునుజుట్టు కందకములఁ ద్రవ్వించి, హిందువు లకస్మాత్తుగఁ దనమీఁదఁబడకుండ నేర్పాటుచేసి, ఆఱువేల ధనుర్ధరులను కందకమువద్దకు రప్పించి హిందువులపై బాణముల గురిపించి యుద్ధము ప్రారంభించెను. కందకములను లక్ష్యముచేయక ముప్పదివేల గక్కురీ హిందూ వీరులు రెండు వైపులనుండి మహమ్మూదు సైన్యములోఁ బ్రవేశించి, తమ బల్లెములతోను, ఇతరాయుధముల తోను, శత్రువుల యశ్వసైన్యమును చెండాడిరి. కొన్ని నిముషములలో మూఁడునాలుగు వేల తురుష్క సైనికులను వారిగుఱ్ఱములతో యమపురి కంపిరి. వారి శౌర్యోద్రేకమును జూచి భయపడి, మహమ్మూదు నాటికియుద్ధమును జాలింపఁ దలంచెను. కాని ఇంతలో అనంద పాలుఁడెక్కిన యేనుగు బెదరి తిరిగి పారిపోఁజొచ్చెను. అది తమ పరాభవముగాఁ దలఁచి హిందూ సైనికులందఱు చెల్లాచెదరై పారిపోయిరి. మహమ్మదీయులంత వారి వెంటఁదగిలి ౮౦౦౦ వేలమందినిజంపిరి. అనంద పాలుఁడు ౧౦౧౨ లో మృతుఁడైనట్లు కానవచ్చుచున్నది. పైన వ్రాసిన వర్ణనమంతయు ఫెరిస్తా యను తురుష్క చరిత్రకారుని గ్రంథము ననుసరించి వ్రాయఁబడినది. దీనిని

ఈ రాజధానిలో 1913-14 సం॥ అడవి నేరములు తెలియగల పట్టి

| గత 1912-13 సం॥ నిల్వయున్న కేసుల మొత్తం. | ఈ సంవత్సరపు క్రొత్త కేసులు. | | | | | | శిక్షలు | | విడుదల | | మొత్తము. | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | అడవులను కాల్చుట | అనుమతి లేక నరకుట, దొంగిలించుట | నియమించబడిన అడవులందు అక్రమముగా ప్రవేశించుట | ఇతర నేరములు. | క్రొత్త కేసుల మొత్తము. | మొత్తము | కేసులు. | నేరస్థులు. | విడుదలైన కేసులు. | విడుదలైనవారి సంఖ్య. | కేసులు. | నేరములు రుజువైనవారి సంఖ్య. | సంవత్సరాంతమందున్న నిల్వ కేసులు. |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 |
| 5238 | 1180 | 20070 | 9083 | 1480 | 31177 | 35104 | 27099 | 50618 | 485 | 1709 | 27584 *1780 | 61327 *2929 | 5740 |

* డిస్ట్రిక్టు ఫారెస్టు ఆఫీసరు లేక రివిన్యూ డివిజనల్ ఆఫీసరు వుత్తరవు ననుసరించి తీసివేసియున్న కేసులు.

కంచెలుగాని పొట్టిగోడలుగాని పెట్టుటయు క్తము. కడపజిల్లాలో కొన్ని అడవుల చుట్టును ఈప్రకారము గోడ పెట్టుటవలన ప్రజలకును అడవికినిగూడ యెక్కువ సదుపాయము గలిగినట్లు కనపడుచున్నది. జనసంఖ్య లేని చోట్ల నెట్టిసరిహద్దు గుత్తులను పెట్టుకొనినను రిజర్వు అడవులకును, అన్‌రిసర్వు అడవులకును మధ్య కాలిదారియైనను యుండుట యుక్తము. ఫక్తు డిమార్‌కేషన్ అనగా సరిహద్దులను నేర్పఱుచుటకుగాను, ౧౯౧౧ వ సంవత్సరపులెక్కల ప్రకారము సంవత్సరమునకు 2,31,514 లక్షలరూపాయిలు ఖర్చు అగుచున్నదని తెలియుచున్నది.

మొట్టమొదట హిందూదేశము నందలి అడవులయొక్క కొలతల పటములు అంతగా సరిగా లేకపోయినను ౧౮౯౯ వ సంవత్సరమునందు సర్‌వే డిపార్టుమెంటువారి క్రింది కీపని వచ్చినప్పటినుండి సర్వవిధములను చక్కని పటములు దొరకగలవు.

అడవులు వృద్ధిచేయు పనులు, విధములు.

ఒక అడవిని వృద్ధిచేయవలెననిన చాల కాలము పట్టును. ఫారెస్టు డిపార్టుమెంటు వారు రిజర్వు ఫారెస్టులలో ఏయే భాగములనువృద్ధిచేయ తలచుకొనెదరో ఆయడవులలో రాగల ౨౦ మొదల ౮౦ సంవత్సరములవరకు ఏప్రకారము పనిచేయవలెనో

మొదటనే ఎస్టిమేటులను, ప్లానులను తయారుచేయుదురు. అందు వృద్ధి పట్టుచ డల చిన అడవియొక్క వైశాల్యము, వృక్షజాతుల యొక్క స్వభావము, పూర్వపు వృద్ధియి యములు, ముందు చేయవలెవు మార్పులు మొదలగునవన్నియు తెలియజేయు లెక్కలు తయారుచేయుదురు. అడవిలోనుండి వచ్చు ఫలసాయము ఏయేచోట్ల ఖర్చగునో ఏయేమార్గముల జేరవేయకొని పోవలెనో ఒక్కొక్క సంవత్సరమునకు ఎంతలాభము వచ్చునో విత్తనములుచల్లుట లేతమొక్కలు నాటుట అధికమైనచోట్ల కొన్ని చెట్లను కొట్టి వేయుట శుభ్రపరచుట అగ్నినుండియు పశువులనుండియు కాపాడుట రోడ్లు వంతెనలు ఇండ్లు మొదలగునవి కట్టుట ఇవన్నియురాగల ౨౦ సంవత్సరములకు కావలసినపనులయొక్క తబిసీలంతయు వివరముగా తయారుచేయబడును. అప్పుడు సర్కారువారి అనుమతి పొంది ఫారెస్టుడిపార్టుమెంటువారు పనికి ప్రారంభింతురు. ఒక్కొకఅడవిలో ౨౦ లేక ౪౦ సంవత్సరములుగడచినతరువాత ఈపద్ధతులన్నింటిని మార్చుకొనిపూర్ణముగా క్రొత్త పద్ధతుల నవలంబింపవలసివచ్చును. ఈప్రకారము ౧౯౧౧ వ సంవత్సరములో సర్కారు అధీనములోనుండు ౨౪౩ వేలచదరపుమైళ్లను రిజర్వు అడవిలో ౫౩ వేల చదరపుమైళ్లను మాత్రము సరియైన ప్లానులతో పని జరుగుచున్నది.

ఒకానొక అడవియొక్క విలువ దానియందుండు కలప మొదలగు ఫలసాయముయొక్క హెచ్చుతగ్గులకు బట్టియుండునని చెప్పుటకు వీలులేదు. ఏలయనగ సముద్ర తీరమునగాని, నదీ తీరమునగాని, రయిలురోడ్డు సమీపమునగాని, ఉన్న అడవులలోని ఫలసాయమునకు హెచ్చువెల వచ్చుటయు, ఎక్కడనో కొండలమీద నుండు అడవుల యందలి ఫలసాయము బొత్తిగ విలువలేకుండ నశించుపోవుటయు మనమందఱ మెరిగినదే. కాబట్టి లాభముకొఱకై అడవులను పెంచువారు ఏయేమార్గముల అడవి ఫలసాయము విక్రయస్థానమునకు జేరునో ముఖ్యముగ యోచించుకొనవలెను. ఒక్కొక్క అడవియొక్క అంతర్భాగములో నుండు ఫలసాయము బయటికి చేరుటకుగాను రోడ్లు, ట్రాము వేలు, చిన్న చిన్న రయిలు వేలు మొదలగుమార్గములు ఏర్పరచవలెను. సహజముగా ఎగుడుదిగుడుగ నుండుకొండల మీదనుండి బరువైన ద్రవ్యాకులను క్రిందికి దింపుటకు తగిన రహదారీలను నిర్మించుటకు అధికవ్యయమగును. కట్టెకరీదుకంటె కూలిహెచ్చయినయెడల ప్రయోజనమేమి? సహజముగ ఇట్టి చోటులందుండు నదీ ప్రవాహములను వర్షకాలములో నుపయోగించుకొనుచు నీటిమీద సులభముగకలపను విక్రయస్థానమునకు జేర్పవచ్చును. అడవులలో పనిచేయు ఉద్యోగస్థులకును పనివారలకును వ్యాధిరాకుండ కాపాడుట మిక్కిలి కష్టము. దోమల బాధ, చలి జ్వరములు

రహదారీలు, ఇండ్లు.

నీరు లేమి, నివసించుటకు నివాసస్థానము లేమియు, పనివారలకు మిక్కిలి కష్టము కలిగించును. పనివారలు లేనిచోట్ల అడవి యొక్క విలువయు మిక్కిలి తగ్గిపోవును. కాబట్టి తగుస్థలములయందు ఆయాతరగతుల పనివాండ్రకు తగిన ఇండ్లు అక్కడక్కడ కట్టవలయును. మన రాజధానియందలి అడవులలోని రహదారులకును ఇండ్లకును గతసంవత్సరపు లెక్కల ప్రకారము ౩౦౭,౩౨౭ రూపాయలు ఖర్చయినవి.

అడవుల అభివృద్ధికి నాలుగు విధములైన శత్రువులుగలరు.

శత్రు సంహారము.

౧. మానవులు
౨. పశువులు
౩. అగ్ని
౪. వ్యాధిపుట్టించు పురుగులు.

౧౮౬౫ వ సంవత్సరములో ఫారెస్టు ఆక్టు పుట్టినది మొదలు అడవిలోని సొత్తును చుట్టుపక్కలుండు వారలు అడవికి నష్టము కలుగునట్లు జేసి ఎత్తుకొనిపోకుండ సర్కారు వారు అనేక ప్రయత్నములు చేయుచున్నారు.

మానవులు.

కాని మొదటి నుండియు అడవులు ప్రజలయుపయోగార్థమే పెంచుచున్నామనియు ప్రజలకు ఒత్తుడు కలుగజేయు శాసనములను కఠినముగ నుపయోగించుట తమకు ఇష్టము లేదనియు ఇంపీరియల్ గవర్నమెంటు వారు తమ అభిప్రాయమును తెలిపియున్నారు. అనేకచోట్ల అడవులలోని ఫలసాయమును అడవిజనులు అనాదినుండియు అనుభవించుచున్నారు. వారనుభవించగా మిగిలిన ఫలసాయమును అడవినుండి బయటికి తీసికొనిపోవునప్పుడు ఏదోయొక విధమున హిందూరాజులకు గాని మహమ్మదీయ సుల్తానులకు గాని ప్రజలు కప్పములు కట్టుచుండిరని చెప్పుటకు అనేక నిదర్శనములు కలవు. కాబట్టి రాజులకు పన్నుగట్టుటయు అడవులు తామనుభవించుటయు పూర్వకాలపు హిందూదేశపు ప్రజలకు తెలియనిదికాదు. కాని ప్రజాసంఖ్య హెచ్చయి అడవులు శిథిలమయినచోట్ల ఆయా అడవులనెట్లు వృద్ధిచేసికొనవలయునో తెలిసికొనుటకు తగిన విద్య ప్రజలకు లేకపోవుటచేత క్రొత్తఅడవులు వృద్ధిగాక ఉన్న అడవులు నశించుచు వచ్చెను. ఇట్టి చెరుపులను మాన్పుటకై యేర్పడిన ఫారెస్టు డిపార్టుమెంటు వారు చిరకాలమునుండి అనుభవించుచుండిన ప్రజలను అడవులదరికి రావద్దని తరిమినచో వారికెంత కష్టముగా నుండును. ఎంతో ఇష్టములేక చేసినను సర్కారువారు ప్రజలకు వేయు శిక్షలు ప్రతిసంవత్సరము హెచ్చుచున్నవి. 1914 వ సం॥ ఈ రాజధానిలో 17,175 మంది మీద నేరములు మోపబడి, అందు ౧౦౦టిలో 90 మందికి శిక్షల్లాయెను. ఇవిగాక ఫారెస్టు డిపార్టుమెంటు వారే నేరస్థులగు ప్రజలతో రాజీపడి వారివద్ద తాము విధించిన జరిమానాలును 44,152 మందివద్ద వసూలుచేసిరి. ప్రజలు చేసిరని

చెప్పిన నేరములలో ౨౦ వేలమంది అక్రమముగ చెట్ల ఫలసాయమును తీసికొని పోయిరనియు, ౯ వేలమంది అక్రమముగ పశువులను మేపిరనియు, ౨ వేలమంది అక్రమముగ నిప్పు మొదలగువానిచే అడవులకు హానిగలిగించిరనియు తెలియుచున్నది. ప్రత్యేకముగ మద్రాసు రాజధానిలో గడచిన సంవత్సరమునందు ౩౫౫, ౧౦౮ కేసులలో ౫౯౯, ౬౧౪ మందిని శిక్షించిరనియు ౧౭౦౯ మందిని నేరస్థులు కారని విడుదల చేసిరనియు తెలియుచున్నది. దీనినిబట్టి ఫారెస్టు డిపార్టుమెంటును ఎంతవృద్ధి చేసినను నేరములును శిక్షలును హెచ్చుచునే యున్నవని చెప్పవచ్చును.

పశువులవలని యుపద్రవమునుండి అడవులనుకాపాడుట అంతగాకష్టమైనదికాదనిచెప్పవచ్చును. ఏలయన నిజమైన అడవులలో జనసంఖ్య తక్కువగ నున్నట్లే పశువులును తక్కువగనే యుండును. ఇదిగాక గడ్డిమేయు పశువులు ఎంత తిరిగినను అడవులకు అంతగా అపకారము చేయవు. మేకలుతప్ప ఇతర జంతువు లేవియును అడవిచెట్లను సామాన్యముగ తినవు. వాటికి కావలసినంత మేత నేలమీద నున్నప్పుడు పశువులను అడవులలో స్వేచ్ఛగ విడచినను అడవికినష్టము లేదు. అయినను పశువులను అడవులలో విడుచు విషయములో ముఖ్యముగ కొన్ని అంశములను గమనింపవలెను.

౨ పశువులు.

(౧) చెట్లు మిక్కిలి దట్టముగ నల్లుకొని సంవత్సరము పొడుగునను నీడబారియుండు నేలమీదగడ్డి అంతగా పెరుగదు. కావున ఈ అడవులు పశువుల మేతకంతగ నుపయోగకరముగావు.

(౨) చెట్లు తక్కువగనుండి నేల సార్వవంతమైన అడవులలో గడ్డి చక్కగ పెరుగును. కరువుసంవత్సరములలో ఈ అడవులలోనిగడ్డి యొక్క విలువ పశువులకింతంతయని చెప్పనలవికాదు. ఇట్టిఅడవులలో కొంత వరకు పశువులు తిరిగినను అడవికి నష్టము కలుగదు. కాని మేత కొంచెముగనుండి మితిలేకుండ పశువులను విడిచినయెడల అడవులు పాడగుననుటకు సందేహము లేదు. కాబట్టి ఇట్టి అడవులలో గడ్డిపెరుగు నిమిత్తమై కొన్నిదినములు కొంత భాగమును మూయుచు, గడ్డి పెరిగిన తరువాత మఱికొన్ని దినములు తెఱచుచు అడవి అధికారులు తెలివితో పనిచేసిన యెడల అడవికి నష్టము రాకుండ పశువులకు మిక్కిలి ఉపకారము చేయవచ్చును.

(౩) అడవులలో సామాన్యముగ మేకలను మేయనియ్యకూడదు. లేత అడవులలో పెద్ద మేకలమందలను విడచినయెడల అతి శీఘ్రమున అడవిని నాశనముచేయ గలవు. ౧౯౧౧వ సంవత్సరములో సర్కారువారి కిందనున్న అడవిలో ౯,౪౪౫ చదరపుమైళ్లు పశువులు మేయకుండగను ౨౧,౩౦౨ చదరపుమైళ్లు మేకలు మేయకుండగను మూసివేసి యున్నారు. ఆ సంవత్సరమున హిందూ దేశపు అడవులలో ౯౮,౪౨,౧౨౩ పశు

బట్టి చూడ నెల్లప్పుడొక్క మహమ్మూదు గెలిచినట్లును, అనందపాలుఁ డోడినట్లును, గానవచ్చుచున్నది. కాని యిట్లనుకొనుటకు వీలులేదు. ఎందుకన, మహమ్మూదుయొక్క ఆస్థానపండితుఁడైన 'అబూర్ హాన్ అల్ బిరూనీ' అనువాఁడు 'తారీఖు లీ హింద్' అనుచరిత్రగ్రంథమునం దనందపాలుని వంశ చరిత్ర వ్రాయుచు నిట్లని యున్నాఁడు:—

"ఈ రాజులు మిక్కిలి రాజ్యమును గల వారయ్యును, ఉత్తమ సుగుణ భూషితులుగను, ఆడితప్పని వారుగను, తమకంటెఁ దక్కువ వారియెడ ననుగ్రహము గలవారుగను నుండిరి. అమీర్ మహమ్మూదునకు వైరకాలమునందనందపాలుఁడు వ్రాసిన యీ యుత్తర మెంతయుఁ గొనియాడఁదగియున్నది. 'నీ రాజ్యము మీఁదికి తురకలు (Turks) దండెత్తి వచ్చిరనియు, ఖురాసాన్ ప్రదేశమందంతటను నిండిరనియు విన్నాఁడను. వలయు నెడ ౫౦౦౦ గుఱ్ఱములతోను, ౧౦౦౦ సైనికులతోను, ౧౦౦ ఏనుగులతోను, నీకు సాయము చేయుటకు వచ్చెదను. లేదా నీ కిష్టమున్న యెడల సైనిఁ జేర్కొన్నదానికంటె రెట్టింపు సైన్యములనిచ్చి నాకుమారుని బంపెదను. నీ యనుగ్రహమునకై నేనిట్లు వ్రాయ లేదు. నేను నిన్నుఁ బూర్తిగఁ బరాభవించినను, అట్టి గౌరవము నాకుఁ దప్ప నితరులకుఁ గలుగఁగూడదని నా యుద్దేశము"*

* *Elliot's History of India as told by its own Historians.* Vol. II. pp 12; 44.

ఈ యుత్తర మనందపా[...] ప్రకటింపఁబడినది కాదు. [...]రిచేఁ బ్రకటింపఁబడినది. [...]మనుటకు సందేహము లేదు. మహమ్మూదును పరాభ[...]చును, అతనిచేత నే[...] సంభవించనేని 'నేను నిన్నుఁ[...]నని అతఁడు మహమ్మూద[...] యెట్లు తటస్థించును? కావు[...] నిజచరిత్రను చరిత్రకారు[...] వలసియున్నది.

అనందపుర్ ([...]
బంగాళా రాజధానిలోని ఒ[...]లోఁబడిన సంస్థానములలో[...] కియోంఝూరులో నున్న[...] వైతరిణీనదియొడ్డునఁ గలద[...] ౨౯౮౭౭.

అనందపుర్ (పంజ[...]
[...]యూర్ప్యారు జిల్లాలోని [...]లోని యొక పట్టణము. జన[...] సీక్కుగురువగు తేగ్‌బహ[...]మును నిర్మించెను. ప[...] గోవిందసింగు ఔరంగ[...]

* కొందఱు చరిత్రకారు లీ[...] వాడి యున్నారు. అది పొ[...] ఆనందపాలయి నప్పటికిని చ[...] 'అనందపాల్' అనియే వ్రాసినం[...]రణమే గ్రహించినాము.

స్సైన్యముల నిక్కడనుండియె యెదిరించెను. ఈస్థానము సీక్కులకు పుణ్యక్షేత్రము.

**అనందపుర్.** (సంస్థానము). ఇది బొంబాయి రాజధానియందలి కాఠెవాడ్ పరగణాలలోని యొకచిన్నసంస్థానము.

**అనకాపల్లి** (గ్రామము). ఇది అనకాపల్లి తాలూకాయొక్క ముఖ్యపట్టణము. ఈ పట్టణము విశాఖపట్టణమునకు ౨౦ మైళ్ల దూరమున శారదాయనునదిమీఁదనున్నది. ఇచ్చటికి చుట్టుపట్టు పల్లెలనుండి వరి, చెఱుకు గడ మొదలగు పంటలు విరివిగా వచ్చు చుండుటచేత మంచివర్తక స్థానముగానున్నది. ఇచ్చటినుండి బెల్లము వరిధాన్యము ఎక్కువగా ఎగుమతి చేయఁబడుచున్నవి. ఈపట్టణము ౧౮౭౮-వ సంవత్సరమునస్థాపింపఁబడిన ఒక మ్యునిసిపలు సంఘముచే పాలింపఁబడుచున్నది. ఈపట్టణముయొక్క ఆదాయమును ఖర్చులును రమారమి ౨౫౦౦౦రూపాయలు. ఈ ఆదాయమంతయు ఇంటి పన్ను గేటు పన్నుల మూలమున వచ్చుచున్నది. రాజకీయోద్యోగస్థులందఱును ఇచ్చటనే వాసము చేయుచుందురు. తూర్పుతీరపు ఇనుపదారి ఈ పట్టణముమీఁదుగఁ బోవుచున్నది.

**అనకాపల్లి** (తాలూకా). ఈ తాలూకా చెన్నపురి రాజధానిలో నున్న విశాఖపట్టణము జిల్లాకు ఆగ్నేయ దిక్కున ఉ. ౧౭°౪౯'-౧౭°౫౫', తూ ౮౨°౫౭'-౮౩°.౧౫' మధ్యనున్నది. దీని విస్తీర్ణము ౪౯౭ చదరపుమైళ్లు. ఇందలి జనసంఖ్య ౧౬౫౪౭౮. ఈతాలుకాలో ౧౮౩ గ్రామము లున్నవి. అనకాపల్లి ఈతాలూకా యొక్క ముఖ్య పట్టణము. ఈతాలూకా రమారమి ౧౨౨౦౦౦ రూపాయిలు చెల్లుచున్నది. ఈ తాలూకాయొక్క ఉత్తరభాగము మంచినీటి వసతిగలదియును, సారవంతమైనదియు నగుటచేత వరి, చెఱుకుగడ మొదలగు పంటలచ్చట పండును. సముద్ర తీరమున నున్న భూమి ఇసుకనేలయైనందున మంచి పైరు లచ్చట పండవు. ఇది ఒక జమీందారీ తాలూకా. ఈ జమీందారీ కొన్నిభాగములుగ విభజింపఁబడి యున్నది. ఇవి గోడేవారికిని, కాశింకోట వారికిని, విజయనగరము, చీపురుపల్లి ఎస్టేటు ధార్లకును చెంది యున్నవి. పూర్వము కాశింకోట శ్రీకాకుళము సర్కారు యొక్క ఫౌజుదారీ అయియుండెను.

**అనక్రియన్.** గ్రీకుకవి. క్రీ.పూ. ౫౬౦ ప్రాంతమున ఆశియామైనరులో జన్మించెను. విఖ్యాతుఁడగు సైరస్ ౫౪౫ లో ఏసియాలో గ్రీకువారిక్రిందనున్న పట్టణములను ముట్టడించినపుడు, అచ్చటినుండి 'త్రేసు' పట్టణమునకుఁ బారిపోయెను. అచ్చటినుండి శామాస్‌నకుఁబోయి 'పాలిక్రేటిస్' అను

రాజుచే గౌరవింపఁబడి యాతని యాస్థాన కవిగా నుండెను. ఆరాజు కాలముచేసిన తరువాత ఏథెన్సు పట్టణమున నధికారిగానుండి 'హిప్పార్కస్' అనువాని యాశ్రయమున నుండెను. వాఁడును చనిపోయిన తరువాత నీతఁడు తన జన్మభూమియైన టయాసునకు తిరిగివచ్చెను. ఇతఁడు ౮౫ సంవత్సరములు బ్రతికియుండెనని చెప్పెదరు.

ఇతఁడు కొన్ని దేవతాస్తుతులను రచించెను. పచ్చిశృంగారముగల భావగీతములు కొన్ని యీతని పేర నంగలవు. కాని కొందఱుపండితులని యాతనివికావని తలంచెదరు.

**అనఘ**: శాకద్వీపమునందలి నది.

**అనఘుఁడు**: ౧. ఒక గంధర్వుఁడు. ౨. ఒకరాజర్షి.

**అనచార్సిస్**: సిరియన్ తత్త్వవేత్త. క్రీ. పూ. ౬౦౦ ప్రాంతమున నున్నవాఁడు. గ్రీసురాజధానియైన ఏథెన్సునకువెళ్లి సోలన్ వలన గ్రీకుజ్ఞానమంతయు నేర్చుకొనెను. ఆ దేశమునందు సప్తర్షులుగా (Seven Sages) నెంచఁబడినవారిలో నొక్కఁడు. తన దేశమునకుఁ దిరిగివచ్చి తానునేర్చిన విద్యలన్నియుఁ దన దేశస్థులకు నేర్పెను. ఇతఁడు యజ్ఞము చేయుచుండఁగా నతనితోడఁ బుట్టినవాఁ డీతనిని చంపెను.

**అనధ్యాయము**: చేయఁదగని కాలము. బడి విడుపు. పూర్వకాలపు వీధి బ మాస్యకును, అమావాస్యకును చుండిరి. అట్టి దినములు నే అనధ్యాయము లనిరి. ఎప్పుడెప లకు సెలవు లీయవలసిన దన్న స్మృతికారులు మిక్కిలి సూ నియమములను జేసిరి. అన్న మొదట వేదాధ్యయన మని వేదము నెప్పుడు పఠింపవలయు పఠింపఁగూడదు,అన్న చర్చలో లన్నియుఁ బుట్టినవి. అవియే ములను బోధించు పాఠశ నుపయోగించినవి.

అనధ్యాయములు రెండు ములు, నైమిత్తికములు. నిశ్చి ప్పుడును ఆయా కాలములంద నవి నిత్యములు; అమా మాస్యా, చతుర్దశీ మొదలై వాస్యా గురుంహాస్తి శిష్యాంః (అమావాస్యరోజు అధ్యయన గురువు చచ్చును. చతుర్దశి యనము చేసినయెడల శిష్యు అన్న వాక్యము సుప్రసిద్ధవ మనఁగా తప్పక వచ్చునదికా, ణముచే నొకప్పుడువచ్చును,

ఉరుములు మెరుపులతో గొప్ప వర్షము పడ్డ నాఁడు అనాధ్యాయము, పాఠశాలకు సేవగైన పెద్దలు వచ్చినప్పుడు అనధ్యాయము. 'శిష్టాగమనా దనాధ్యాయః' (పెద్దలు వచ్చినందున నాట విడుపు) అన్న వాక్యము సంస్కృత పండితు లెఱింగినదియే.

ఏవి యనధ్యాయ దినములన్న సంగతిని గుఱించి వేఱువేఱు స్మృతికారులు వేఱువేఱు విధముగ వ్రాసియున్నారు. వాని నన్నిటిని అనధ్యాయములుగా నెంచినయెడల నధ్యయన దినములకంటె ననధ్యాయ దినములే యెక్కువయగును. మనుస్మృతిని అనుసరించి యీ క్రింద ననధ్యాయ దినముల పట్టిక నిచ్చుచున్నాము :-

అనధ్యాయకాలములు

వర్షాకాలమునందు పగలు, గాలి దుమారము వచ్చినయెడలను రాత్రిగాలి వీచినయెడలను (౧౦౨); ఉరుము, మెరుపు కలిసిన వర్షము వచ్చినప్పుడు, ఎక్కువగ నుల్కాపాతము జరిగి నప్పుడు, మరల మరుదినము ఆ కాలమువఱకు (౧౦౩); అకాలముగ మేఘములు వచ్చినప్పుడు (౧౦౪); అంతరిక్షమున ధ్వని అయినప్పుడు, భూకంపమయినప్పుడు, ఆకాశమండలి గ్రహాదులకు పరివేషము కలిగినప్పుడు, మరునాఁడు మరల నా కాలము వఱకు (౧౦౫); మంచుపట్టినప్పుడు, రెండు సంధ్యాసమయములు, అమావాస్య, చతుర్దశి, పౌర్ణమాస్య, అష్టమి (౧౧౩); అమావాస్య గురువును చంపును, చతుర్దశి శిష్యునిఁ జంపును, అష్టమీపౌర్ణమాస్యలు విద్యను నాశముఁ జేయును; కావున ఆ దినములలోఁ జదువుట మానివేయవలయును. (౧౧౪); దుమ్ముతోఁ గలిసి వర్షము కురిసిననాఁడును, ఆకాశమెఱ్ఱగానున్ననాఁడును, నక్కలు కుక్కలు కూయునప్పుడును, గాడిదలఱచునప్పుడును, (౧౧౫); గ్రామములోనికి దొంగలు వచ్చినప్పుడును, గ్రామమునకు అగ్నిభయము కల్గినప్పుడును (౧౧౮); ఉపాకర్మ సమయమందును, ఉత్సర్గసమయమందును మూఁడు దినములు, అష్టకములకును, ఋతువుల అంతమునందును మూఁడుపూటలు అనధ్యాయము (౧౧౯); చుట్టమువచ్చినప్పుడు ఆతని సెలవుపుచ్చుకొని అధ్యయనము చెప్పవలెను (౧౨౨); గురుశిష్యుల నడుమనుండి పశువు, కప్ప, పిల్లి, కుక్క, పాము, ముంగిస, ఎలుక పోయినయెడల నొకపగలు రాత్రి అనధ్యాయము. [మనుస్మృతి ౪-వ అధ్యాయము

**అనన్యదాసుఁడు:** హిందీ కవి. అక్బరు సమకాలికుఁడు. బికానీరు సంస్థాన కాపురస్థుఁడు. కాయస్థ కులీనుఁడు. భగవద్భక్తుఁడు. ఇతనికాలమునందు బికానీరు

రాజ్యమును రాయసింహుఁడను రాజు పాలించుచుండెను. అతని తమ్ముఁడగు పృథ్వీరాజు ఒకసారి వైరాగ్యవశుఁడై ప్రపంచమును విడిచెదననఁగా నీకవి యతనికి సంసారమున్నందుండియే పరమార్థము సాధింపవలెనని బోధించెను.

**అనపోతనాయుఁడు.** వేంకటగిరి సంస్థానాధీశ్వరుల పూర్వులలో నొక్కఁడు. సింగమనాయని పెద్దకుమారుఁడు. ఇతఁడు క్రీ. శ. ౧౩౭౩ మొదలు ౧౩౮౦ వఱకుఁ బ్రతికియున్నట్టు కానవచ్చుచున్నది. ఇతని రాజధాని రాచకొండ. ఇది నైజాము రాజ్యమందలి నల్లగొండ జిల్లాలో హైదరాబాదునకుఁ దూర్పుగ ౩౨ మైళ్లమీఁద నున్నది. ఈతఁడు జల్లిపల్లెకోటను ముట్టడించి యందున్న చళుక్య వంశపు రాజులను, వారికి సాయముగ వచ్చిన పెక్కు రెడ్లవారిని గెలిచెననియు, ఇనుకుర్తి కోటను ముట్టడించి యందలి రాచవారిని గెలిచెననియు 'వెలుగోటి వారి చరిత్ర' మను గ్రంథమువలనఁ దెలియుచున్నది.

ఈ యనపోతనాయఁడు ఓరుగల్లు, గోలకొండ భువనగిరి మొదలయిన దుర్గములను గెలిచెననియు, ఇప్పటి నైజాము రాజ్యములోనున్న తెలుఁగు జిల్లాలన్నియు నాతని స్వాధీనమందుండెననియు, ఆతఁడు స్వతంత్రుఁడై రాజ్య పరిపాలనము చేసెననియు, ధరణికోట సమీపమున అనపోతరెడ్డి, అనవేమారెడ్డి అను రెడ్డి రాజులతో ననేక యుద్ధములు జరుపుచు వచ్చెననియు, ఈతఁడును ఈతని తమ్ముఁడును ధరణికోటలో రెడ్లవా
చేయుచుండఁగా, తురుష్క
ఖాని పై దండెత్తివచ్చిరని
రనియు, అనపోత నాయు
వర్తికడకు రాయబారుల
రాజ్యముమీఁదికి దండెత్తి
ననియు, ఆ సంగతి తెలిసి
నయిన మహమ్మదుషా వీరి
వచ్చెననియు, అనపోత
గోలకొండ యిచ్చి సంధి చే
ఘుల చరిత్రము, ౩-వ భాగ
బడినది.* కాని యిందుల
నాధారములు చూపఁ
యింకను శోధింపవలసిన వి

**అనపోతారెడ్డి.**
లము నందలి కొండవీటిలో
రెడ్డి రాజులలో రెండవవా
ములో నొక్కఁడైన యెఱ్ఱా
హరివంశమును కృతినొంది
మారెడ్డి (క్రీ. శ. ౧౩౨౦-
తండ్రి. తండ్రితరువాత నీత
వచ్చెను. ఈతని తరువాత ర
మారెడ్డి (౧౩౬౨-౧౩౮౦)
కుమారగిరి రెడ్డి (౧౩౮౦-
కుమారుఁడు. రాజమహేంద్ర
ముచేసిన కాటయ వేమా

* పుట ౨౦-౫౩.

నల్లుఁడు, మేనల్లుఁడు. శాసనములను బట్టి చూడఁగా ఈతఁడు ౧౩౫౦ మొదలు ౧౩౬౧ వఱకుఁ బండ్రెండు సంవత్సరములు రాజ్యము చేసినట్లు కానవచ్చుచున్నది.*

ప్రోలయ వేమ హరివంశమును కృతి నొందువఱకు నీతఁడు పెద్దవాఁడై సైన్యాధిపతిగఁ దండ్రికిఁ దోడగుచుండెనని హరివంశమందలి యీ క్రింది పద్యమువలనఁ గానవచ్చుచున్నది:-

శా. వేమక్ష్మాధిపు సార్వభౌము ప్రియపుత్రుఁడు దయా
　　విభ్రాజి యవ్యాజతే
　　జోమార్తాండుఁడు కీర్తనీయ సుగుణ
　　స్తోమంబులం దేమియుక్
　　గ్రామున్మూర్తికి లోచ్చుగాక సరియై
　　రాజిల్లె రాజార్చితుం
　　డామహ్యాయణుఁ డెందుఁ బోతయచమూ
　　హర్త్రేశ రుండిమ్మహిక్

ఈ యనపోతారెడ్డి కృష్ణా నదియొడ్డున అమరావతి సమీపమునందు 'కేసరా'జను వానితోఁ బోరాడి యాతనిని ఓడించినట్లును, ఆతని యా స్థానమందు వెన్నెలగంటివారను కవులుండినట్టును, వారిచే నతఁడు కృతులందినట్లును వెన్నెల కంటి సూరన్నచే రచింపఁబడిన విష్ణుపురాణము నందలి యీ క్రింది పద్యమువలనఁ దెలియుచున్నది :-

ఉ. ఈ నిఖిలంబు మెచ్చ నమ
　　రేశ్వర దేవుఁడు చూడఁగృష్ణ తీ
　　ణీనదిసాక్షిగా ననికి
　　నిల్చిన రావుతుఁ గేసభూవిభుం
　　గానకుఁ దోలి వెన్నడిచి
　　కాచిన వేమయి యన్నపోత భూ
　　జానికి సత్ప్రబంధము
　　లొసంగిన వెన్నెలగంటి వారిలోక్

ఈతనియొద్ద వేమన అనువాఁడు మంత్రిగనున్నట్లు అమరావతిలోని యొక శాసనమువలనఁ దెలియుచున్నది. ఈ మంత్రి తండ్రి పేరు మల్లినాథుఁడు. ఈతఁడు ధాన్యావతి (ధరణికోట, అమరావతి)లోని అమరేశ్వరుని మరలఁ బ్రతిష్ఠించెను. ఇది ౧౩౬౧ లోని శాసనము. *

ఈతని రాజ్యకాలమందు దేశాంతరములనుండియు, ద్వీపాంతరములనుండియు వర్తకులీతని రాజ్యమునకు వచ్చుచున్నట్లును ఎగుమతి దిగుమతి వ్యాపార మెక్కువగ జరుగుచున్నట్లును కానవచ్చుచున్నది. బాపట్ల తాలూకాలో మోటుపల్లి యను రేవు గ్రామము కలదు. అది కాకతీయులకాలము నుండియు సముద్ర వర్తకమునకుఁ బేరొందిన రేవు.§ అచ్చట వీరభద్రస్వామి దేవాలయపు మండపమందలి నొక్క స్తంభముమీఁద అన

*కొండవీటిరెడ్ల ప్రభుత్వకాలమింకను నిశ్చయముగ నిర్ణయము కాలేదు. రెండుమూఁడు సంవత్సరములు హెచ్చుతగ్గుగ తేలినదనవచ్చును. ఇంకను క్రొత్తక్రొత్త శాసనములు వెలువడిన కొలఁదిని ఈ హెచ్చుతగ్గులు సరి కాఁగలవు.

*Local Records in the Madras Manuscript Library Vol. 38. p. 28 and vide No 258 of the Madras Epigraphical Collection for 1897.

§ No. 600 Madras Epigraphical Collection for 1909.

పోతారెడ్డి శాసనమొకటి, శా. శ. ౧౨౮౦ (క్రీ. శ. ౧౩౫౮) లో వేయించినదికలదు.* అది సంస్కృతము, తెలుఁగు, అఱవము అను మూఁడు భాషలలోనున్నది. అఱవవర్తకులు పెక్కుమంది అఱవదేశము నుండియు, సింహళదేశమునుండియు వచ్చుచున్నందున శాసనము అఱవభాషయందుఁగూడ వ్రాయఁబడినదని తోఁచుచున్నది. అంతకుఁ బూర్వము వర్తకులకుఁగల యిబ్బందులును ఈరాజు తొలఁగించి వర్తకము అప్రతిబద్ధముగ జరుగునట్లు చేసెను. మోటుపల్లిలోఁ గాపురముండు బరదేశీయులగు వర్తకులు, దూరదూరపు దేశములతోను, ద్వీపములతోను వర్తకము చేయువారు అనేకులుండిరి. ఈరాజునకుఁ బూర్వము ఇట్టివర్తకులకు నిష్టము వచ్చినప్పుడు, మోటుపల్లికివచ్చుటకును, ఇష్టమువచ్చినప్పుడు అచ్చటినుండి వెడలుటకును వీలులేకయుండెను. అధికారులసెలవు పుచ్చుకొని గాని ఆగ్రామమునకు వారువచ్చుటకు, అచ్చటి నుండివెడలుటకు వీలులేదు. ఈ వర్తకులు

*Nos. 601 and 602 of the Madras Epigraphical Collection for, 1909.

ఇందు 601 అఱవశాసనము, 602 తెలుగుశాసనము. తెలుఁగుశాసనమునకంటె నఱవశాసనమునందు సుంకముల వివరమధికముఁగఁగలదు. మోటుపల్లెలోని అఱవశాసనము, తెలుగు శాసనముల నకళ్లు పంపినందులకు దొరతనమువారి శాసనశోధన శాఖను సభ్యతులగు బ్రహ్మశ్రీ రావుసాహెబు హెచ్. కృష్ణశాస్త్రిగారికి కృతజ్ఞుఁడను. ము. సం.

అపుత్రిక దండమను పన్ను చె
డెను. ఈ యిబ్బందులను తీసి
రెడ్డి యీద్వీపాంతర వ్యాపా
విహారమేర్పర్చెను. క్రొత్త
వచ్చువారికి నుండుటకు నివేశ
వ్యవసాయమునకు భూమియు
ఈశాసనాను సారముగ వర్త
ననుసరించి రావచ్చును, పో
నిష్టమున్నవానికి నిష్టమున్న
కులనమ్మవచ్చును. సరుకులు
మునకుఁ గొంపోవచ్చును.
దొరతనమువారియుద్యోగస్థుల
గూడదు. ఇట్లు ఈరాజు పద
మునందు నొక విధమైన అప్ర
తత్త్వమును (Principle of
స్థాపించెనని చెప్పవచ్చును. అ
కులను బాధపెట్టి సుంకములె
కుండ సుంకము తీసికొనవలసి
యింతకంటె నెక్కుడు తీసి
యుఁ జెప్పఁబడియున్నది. ఇట్లు
తెలుఁగుదేశము ద్వారు ద్వీ
నవ్యాహతముగ వర్తకము
యు, నితర దేశములనుండివచ్చ
గూడ నన్యాయము జరుగఁగ
నియమములను అప్పటి రాజు
రనియు స్పష్టముగఁ దెలియుచ
నము రాజునాజ్ఞచే నాతని
సోమ తంత్రీశ్వరునిచే వేయఁ

అనపోతారెడ్డికి దొడ్డాంబిక యను తోఁ బుట్టువుండెను. ఆమెను కాటయరెడ్డికిచ్చిరి. వారిరువురికిఁ బుట్టినవాఁడు కాటయవేమ. ఈతనికే అనపోతారెడ్డి తనకూతురైన మల్లాంబికనిచ్చెను.* ఇతనికిఁ గుమారగిరిరెడ్డియను కుమారుఁడుండెను.

"అనపోతానాయని తమ్ముఁడైన మాదానాయుఁడు దన్నాలకోటయొద్ద నవేమారెడ్డి బంధువైన యనపోతారెడ్డితో యుద్ధముచేసి యతనిఁ దఱిమి జయమునుబొందెను" అని వెలుగోటివారి చరిత్రలోనున్నది కాని, దీనికి నచ్చటనేమియు నాధారముచూపఁబడలేదు.

సంస్కృత శాసనములందు తెలుగు శాసనములందును ఈతనిపేరు అనవోత్త, అన్నవోత, అంనవోత అనివచ్చునేగాని 'అనపోత' అని ఉండదు.

## అనముగుర్తి రంగయ్య.

నందవరీకనియోగి బ్రాహ్మణుఁడు. తిమ్మయామాత్యునకుఁ బుత్రుఁడు. యాదవగిరిమాహాత్మ్యమును రచించి రావూరివేంగామాత్యునకంకితము చేసెను.

## అనమసముద్రముపేట.

నెల్లూరుజిల్లా ఆత్మకూరు తాలూకాలోని యొకపల్లె. ఇచ్చట ఖాజా రహిముతుల్లా సాహెబ్ అనువానిచేఁ౬౦ సంవత్సరములకు ముున్ను కట్టింపఁబడిన సుప్రసిద్ధమగు మసీదు కలదు. ఈ మసీదునకు ౮ గ్రామముల ఇనాము కలదు. ఇచ్చట జ్యూలై మాసమున పెద్ద ఉరుసు (ఉత్సవము) జరుగును.

## అనమిత్రుఁడు. ౧ (సూ. వం.)

నిఘ్నుని పుత్రుఁడు.

౨ (చం. వం.) యదుకులోత్పన్నుఁడైన వృష్ణియొక్క యిద్దఱు పుత్రులలో రెండవవాఁడు. నిమ్న, శిని, వృష్ణి యనువారతని పుత్రులు.

## అనరణ్యుఁడు. (సూ. వం.)

ఇక్ష్వాకు వంశజుఁడగు పురుకుత్సుని మనుమఁడు. త్రసదస్యుని రెండవ కుమారుఁడు. ఇతనికి హర్యశ్వుఁడు, బృహదశ్వుఁడు అను ఇద్దఱు పుత్రులు కలరు. ఇతఁడు అయోధ్యలో రాజ్యము చేయుచుండఁగా లంకాధిపతియైన రావణుఁడు దిగ్విజయార్థమైవచ్చి యీతనిని ఓడించెను. యుద్ధమునందుఁ గూలి యీతఁడు ప్రాణములు విడుచుచు 'నావంశమునందు జన్మించినవానిచేతనే నీవును నీవంశమును నాశముఁజెందుదురు గాత' మని శాపమొసఁగెను [వా. రా. ఉత్తర. స. ౧౯.

౨. (సూ. వం.) ఇక్ష్వాకు కులోత్పన్నుఁడైన ఋతుపర్ణుని పౌత్రుఁడగు సర్వకాముని (సర్వకర్ముని) యిద్దఱ పుత్రులలోఁ బెద్దవాఁడు. కొడుకు నిఘ్నుఁడు.

*తొత్తరమూడి శాసనము. (Epigrahi Indica vol. IV, P 328.

**అనర్ఘరాఘవము.** మురారి యను కవిచే రచింపఁబడిన సంస్కృత నాటకము. సంస్కృత వాఙ్మయమునందు కాళిదాస భవభూతులకుఁ గల గౌరవము ఈ కవికి లేక పోయినను, ఈతఁడు రెండవ తరగతి కవులలో నొకఁడుగఁ బరిగణింపఁబడునని చెప్పవచ్చును. ఇతనిది మౌద్గల్యగోత్రము. భట్ట శ్రీవర్ధమానుఁడను మహాకవి యీతని తండ్రి, తంతుమతి ఈయనతల్లి. ఈ సంగతు లీతని నాటకమునందలి ప్రస్తావనలోఁ జెప్పఁబడి యున్నవి.* ఈతనిది యేదేశమో తెలియదు. కాని కావ్యమాలలో నీ నాటకమును అచ్చువేసినవారు 'దీనికి కాశ్మీరమునందు నెక్కుడు ప్రచారము కల' దని వ్రాసినారు. అందుచే నీకవి యా దేశమువాఁడే మోయని కొందఱ అనుకొనిరి. కాని నాకుఁ జూడ నీకవి యాంధ్రదేశమువాఁడేమో యని సంశయము తోఁచుచున్నది. ఎందుకనఁగా, ఈ నాటకమునందు ఏడవయంకములో, శ్రీరామాదులు రావణసంహారానంతరము పుష్పకవిమానమెక్కి అయోధ్యకు వెళ్లుచుండఁగాఁ గ్రిందఁ గానవచ్చిన కొన్ని దేశములను, పట్టణములను, క్షేత్రములను వర్ణించునట్టి సందర్భమునఁ గవి

* "అస్తిమౌద్గల్య గోత్రసంభవస్య మహాకవేర్భట్ట శ్రీవర్ధమాన తనూజన్మనస్తన్తుమతీనన్దనస్య మురారేః కృతి రభినవ మనర్ఘరాఘవం నామ నాటకమ్."

ఆంధ్రదేశమందలి భీమేశ్వరుని
యున్నాఁడు:—

విభీషణః:-(దక్షిణతో దర్శ
ప్రణమ్యోత్తమయి మస్థి) వి
సప్తగోదావరీహారకలాపైక నా
వాన్భీమేశ్వరః

అర్థము:—విభీషణుఁడు:—
వైపుచూపి) దేవా! ఆంధ్రదే
యేడు గోదావరు లను హా
లకు నొక్క నాయకమణియ
వంతుఁడైన భీమేశ్వరునకుఁ
చేయుఁడి.

దీని తరువాత,యీవిభీష
పద్యమును, శ్రీరాముని నో
ములును భీమేశ్వరుని స్తుతి
వానితో మనకుఁబనిలేదు.
యఁబడిన 'అస్థివిషయము' '
'భీమేశ్వరుఁడు' అను పదములు
దేశమునందు విశేష ఖ్యాతి
క్షేత్రమును (ద్రాక్షా రామమ
యుఁజూడ నీ కవి యాంధ్రుఁడ
మందలి యభిమానము చేత
ముగా భీమేశ్వరునకు శ్రీరాము
పెట్టించె ననియు నూహింప

కాని ఈ కవి ప్రకరణము
రునకుఁ బూర్వము మహారాష్ట్ర
విదర్భలోని కుండినపురమును
ద్రావిడ దేశమందలి

వర్ణించియున్నాఁడు. కావున 'ఈ కవి ఆయాదేశముల వాఁడని కూడఁ జెప్పవలసి యుండును' అని కొందఱాక్షేపింపవచ్చును. కాని అట్లనుట సరికాదు. కుండినపురము, కాంచీనగరము భరతఖండఖ్యాతిగల పట్టణములు. కవి యెచ్చటివాఁడైనను ఆపట్టణనామములను ఎఱిఁగియుండును. ద్రాక్షారామము అట్టి భరతఖండఖ్యాతిగల క్షేత్రము కాదు. దానికి తెలుఁగు దేశమందుమాత్రము ఖ్యాతిగలదు. ఆఖ్యాతికిని రెండు మూఁడు జిల్లాలకంటె నెక్కుడు వ్యాప్తిలేదు. తెలుఁగు వాఁడైనఁగాని సాధారణముగ నీ క్షేత్రమును ఎఱిఁగియుండఁడు. ఒకవేళ నెవరివలననైన విన్నను, కాంచీపట్టణమందలి మీనకేతనునితో సమానముగ నీభీమేశ్వరుని నాటకమునందుఁ బేర్కొనవలయుననియాతని కేల బుద్ధిపుట్టును ?

ఈ కవికాలము నిశ్చయముగఁ దెలియదు. కొందఱీతఁడు తొమ్మిదవ శతాబ్దమునకుఁ బూర్వుఁడనిరి*. కొందఱీతఁడు అర్వాచీనుఁడని తలంచుచున్నారు. కవి కాలనిర్ణయమును గుఱించి 'మురారి' శబ్దముక్రిందనవిస్తరముగఁ జర్చింపఁబడును.

'అనర్ఘరాఘవ' మను నాటకమునందు రామాయణీయకథ సంక్షేపముగఁ గలదు. అనర్ఘమనఁగా అమూల్యము, పూజ్యము, దుర్లభము. పూజ్యుఁడైన రాఘవుని కథ కలదిగనుక అనర్ఘరాఘవమయ్యె. విశ్వామిత్రుఁడువచ్చి రాముని దీసికొనిపోవు కథాప్రసంగము మొదలు, శ్రీరాముని పట్టాభిషేకమువఱకుఁగల శ్రీరామకథ యేడంకములలో ఈ నాటకమునందు వర్ణింపఁబడినది. కథ పెద్దదియు, నాటకము చిన్నదియు నగుటచే, పెక్కుకథా విశేషములు రంగము మీఁదఁ జూపుటకువీలులేక, విష్కంభకాదులలోఁ బాత్రలచేఁ జెప్పింపఁబడినవి. ప్రథమాంకమునందు, విశ్వామిత్రుఁడు దశరథుని యొద్దకు వచ్చుట, రామలక్ష్మణులను గొనిపోవుట, ద్వితీయాంకమునందు రామలక్ష్మణులు విశ్వామిత్ర యజ్ఞమును రక్షించి రాక్షసులను శిక్షించుట, తృతీయాంకమునందు రాముఁడు శివధనుస్సును ద్రుంచుట, చతుర్థాంకమునందు పరశురాముని సత్వము హరించుట, పంచమాంకమునందు వాలివధ, సుగ్రీవాభిషేకము, షష్ఠాంకమునందు రావణునివధ, సప్తమాంకమునందు శ్రీరామాదులు పుష్పకవిమానమునెక్కి అయోధ్యకు వెళ్ళుచు క్రిందఁగానవచ్చు పట్టణాదుల వర్ణించుట, పట్టాభిషేకమును, వర్ణింపఁబడినవి. ఇందు రామవనవాసాదులు, సీతాహరణము మొదలయిన రామాయణీయ ముఖ్యప్రసంగముల సంవిధానకము (Plot) ఈ ప్రకారము కూర్పఁబడినది:-

* కావ్యమాలా, అనర్ఘరాఘవమ్, ౧-వ పుటక్రింది టిప్పణి చూఁడుము.

సీరధ్వజజనకుని యింటఁ బెరుగుచున్న అయోనిజయగు సీతను తనకిమ్మని యడుగుటకు రావణుఁడు తనపురోహితుఁడైన శౌష్కలుని జనకునియొద్దకుఁ బంపును. ఆతఁడు విఫలమనోరథుఁడగును. అంత సీతను హరించుట యెట్లన్న యాలోచన రావణుని మాతామహుఁడును, మంత్రియునగు మాల్యవంతునకుఁగలిగి, రాముని మిథిలలోగాని, అయోధ్యలోగాని ఓడించి సీతను దెచ్చుట యసంభవముగాన, సీతా రాము లరణ్యమునకు వచ్చినప్పుడు అచ్చట రాముని మోసపుచ్చి సీతను అపహరింపవచ్చునని యతఁడు నిశ్చయించెను.

ఇంతకుఁ బూర్వమే సుగ్రీవుని సాహాయ్యార్థమై శ్రీరాముని నరణ్యమునకు రప్పించుటకుగాను సంపాతి శబరిని పంపెనని యాతఁడు వినియుండెను. శబరి వెళ్ళి కైకదాసియగు మందర శరీరమునఁ బ్రవేశించి దానిచే కైకేయికి దుర్బోధచేయించెను. అందుమీఁద రాము నరణ్యమున కంపుఁడనియు, భరతునికి రాజ్యముగట్టుఁడనియు కైక దశరథుని వరము లడిగెను. ఇట్లు సీతా రామ లక్ష్మణు లరణ్యమునకు వెళ్ళుట సంభవించినది.

ఈనాటకమున ప్రథమాంకము నందలి దశరథ విశ్వామిత్ర సంభాషణంబును, చతుర్థాంకమునందలి శ్రీరామ పరశురామ సంవాదంబును, సప్తమాంకమందలి నానా దేశాది వర్ణనలును రమ్యముగనున్నవి. ఈ నాటక

మును కీర్తిశేషులయిన ఆకుం
శాస్త్రులుగా రాంధ్రీకరించి

అనర్వ. వృత్రాసుర
నొక్కఁడు. [భా

అనల. ౧ రోహిణీ
కన్యలలో రెండవది. ఈ
కన్యకలదు.

౨. మాల్యవంతుఁడను
సుందరియను భార్యయందుఁ
విశ్వావసు రాక్షసుని భా
కుంభీనసి. [వా. రా

అనలుఁడు. ౧ ఒక
అష్ట వసువులు). ఇతనికిఁ గు
శాఖ, విశాఖ, నైగమేయ
ఈ మన్వంతరము నందితఁడు
నకు నధిపతి. [చూ.

౨ రాక్షసుఁడు. మా
ణుని నలుగురు మంత్రులలో

౩. కుశుని వంశజుఁడగు ని
కొడుకు.

అనలుఁడు. దేవత
నలువది తొమ్మండ్రుగురు.
వాఁడు అభిమానుఁడు.
మానశుచులను ముగ్గురు కొ
కొడుకులు నలువది యైదుగుఁ

అనవద్య. కశ్యపు
కును బుట్టిన యప్సరసలలో

**అనవేమారెడ్డి.** కొండ వీటిలోఁ బ్రభుత్వము చేసిన రెడ్డి రాజులలో మూఁడవ వాఁడు. ప్రోలయ రెడ్డి యొక్క రెండవకుమారుఁడు, అనపోతా రెడ్డికిఁ దమ్ముఁడు. ఈతనికి అన వేమ, అన్న వేమఅను రెండు పేళ్లునుకలవు. శాసనములను బట్టి చూడఁగా నీతఁడు అన పోతా రెడ్డి తరువాత రాజ్యమునకు వచ్చి క్రీ.శ. ౧౩౬౨ మొదలు ౧౩౮౦ వఱకును రాజ్యము చేసినట్లు కానవచ్చుచున్నది. ఈతఁడే రాజధానిని కొండవీటికి మార్చినట్లు కనఁబడుచున్నది. ఈతని తండ్రియైన ప్రోలయ వేమకు 'అన్నమవేమ' యన్న పేరున్నందునను, ఈ వంశమునందుఁ బెక్కు 'వేమ'లున్నందునను పెక్కుచరిత్రకారులు ఈతండ్రి కుమారులలో విభేదము చేయలేకయు, నితర 'వేమ'లకు వీరికి భేదము చేయలేకయు నొకరిని మఱి యొకరినిగాఁదలఁచి కాలపురుష విపర్యాసములఁ జేసిరి. ఇట్టి భ్రమపోయి యీవంశమందలి రాజులపేళ్లు తెల్లమగుటకై శాసనములను, కావ్యములను అనుసరించి యీ క్రింద వీరి వంశ వృక్షము నిచ్చుచున్నాము.

## కొండ వీటి రెడ్ల వంశవృక్షము

ప్రోలయ—అన్నమ్మ




సూచన:—ఈ వంశవృక్షమునందు ప్రభుత్వము చేసిన రాజులకు ౧, ౨, ౩ మొదలయిన అంకెలు వేయఁబడినవి.

ఈ వంశవృక్షమును బట్టిచూడ మొట్ట మొదట కొండవీటిలో రాజ్యము చేసినరెడ్డి అన్నమ్మపోలయలకుఁ గుమారుఁడైన వేమారెడ్డి. ఇతఁడన్నమ్మ కుమారుఁడైనందున హరివంశము మొదటి పద్యమునందే యీతనిని ఎఱ్ఱాప్రగడ 'అన్నమ వేమ' యనియెను. ఇంతేకాని యీతఁడు అనవేముఁడుకాఁడు. ఇతనినిగుర్తుగొలకు సాధారణముగ ప్రోలయ వేమ యందురు. ఈతని కిద్దఱు కుమారులు అనపోత, అనవేమ. వీరు క్రమముగ కొండవీటి రాజ్యమును బాలించిరి.

ఎఱ్ఱాప్రగ్గడ హరివంశమ్ము వ్రాసి ప్రోలయ వేమారెడ్డి కంకితము చేసినకాలమందు అనవేమారెడ్డి పుట్టినట్టు కనఁబడదు. లేదా మిక్కిలి పసివాఁడుగనైనను ఉండవలెను. ఎందుకన నెఱ్ఱాప్రగడ ప్రోలయ వేముని పెద్ద కుమారుఁడైన అనపోతని వర్ణించి, అనవేముని పేర్కొనక, యీతని పెత్తండ్రి కుమారుఁడైన కోమటిని వర్ణించియున్నాఁడు.

ఆంధ్ర నైషధమును కృతినొందినమామిడి సింగన్నకుఁ దండ్రియైన మామిడి పెద్దన్న అనవేమారెడ్డికి మంత్రిగనున్నట్టు ఆంధ్రనైషధమునందలి ఈక్రింది పద్యమువలనఁ దెలియుచున్నది.

మ. అనతారాతి వసుంధరారమణ స
ప్తాంగాపహారక్రియా
ఘనసంరంభ విజృంభమాణ పటుదోః
ఖడ్గాద్వితీయార్జునం
డనవేమాధిపరాజ్యభార భరః
వ్యాపార దక్షుండు
ద్దన మంత్రీశుఁడు మామిడః
తన్మాత్రుఁడే చెప్పఁ

అనవేమారెడ్డి పేరు తె నందు విశేషముగ, నితర రె నెక్కుడుగఁ గీర్తింపఁబడును. ఉత్తరమున సింహాచ దక్షిణమున కంచివఱకును, ద్రిము వఱకును పశ్చిమమ వఱకును వ్యాపించినట్టు కాన వరి జిల్లాయందలి కోనసీమ రులో నీతని శాసన మొక శా. శ. ౧౨౯౬ (క్రీ. శ. తన చెల్లెలైన వేమసానియొ యీతఁడుబ్రాహ్మణునకు న గోదావరి జిల్లా అమలాపుర లోని వనపల్లిలో అనవేము శాసనము దొరికినది.* అది (క్రీ. శ. ౧౩౭౪-౭౫) లోనిది డను మంత్రివరునకు నగ్రహా యిమ్మడీంద్రుఁ డప్పటి కాల వ్యవహారములలో నారితేరిన చున్నాఁడు. 'రాజులకు చేయుటయందు మిత్రుఁడు' పొగడ్తగనియె. శ్రీశైలవ

* Epigraphia Indica Vol. III
III p. 59. ఇది ౧౨౩౦ లోని శాస
కృష్ణ దీక్షితుల వారి యభిప్రాం

ముని శిలాశాసన మొకటికలదు.* దానిని బట్టిచూడ నతఁడు శ్రీశైలమునందు 'వీర శిరోమండపము' తన పినతండ్రియైన అన్నయ రెడ్డి గౌరవమునకై కట్టించినట్టును, రాజ మహేంద్రాది స్థలదుర్గముల ననేకములఁ బట్టుకున్నట్టును, ఈతనిది వెల్లిచేరిగోత్రమై నట్టును, తెలియుచున్నది. ఈశాసనము శా. శ. ౧౨౯౯ (క్రీ. శ. ౧౩౭౭-౭౮) లోనిది. ఈ శాసనము వ్రాసినవాఁడు బాలసరస్వతి. ఈతఁడు తూర్పుసముద్రమున కంతకును స్వభువైనట్టు కూడ నిందు వ్రాయఁబడినది. ఇందువలన నితనికాలమందు సముద్ర వర్తకము మెండుగ నుండెనని మన మూహింపవచ్చును. ఈతని శాసనములలో 'వసంతరాయ' 'తురికానహాయి' 'జగనొబ్బ గండ' మొదలయిన బిరుదులు ఈతనికున్నట్లు వ్రాయఁబడినది.

ఏ శాసనము వలనఁగాని, ఏ గ్రంథము వలనఁగాని యీతనికిఁ బుత్త్రుఁడున్నట్టు కానరాదు. కాని శ్రీనాథుఁ డీతనికి నొక పౌత్త్రి (పుత్త్రిని కూఁతురు) ఉన్నట్టును, ఆమెను అల్లాడరెడ్డి (కాశీఖండమును కృతినొందిన వీరభద్రా రెడ్డియొక్క తండ్రి) పెండ్లాడినట్టును కాశీ ఖండమందలి యీ క్రింది పద్యములోఁ జెప్పియున్నాఁడు.

మ. అనవేమక్షితిపాల పౌత్త్రియగు వే
మాంబామహాదేవికిన్
ఘనుఁడయ్యల్లడభూమిపాలునకు సం
గ్రామస్థలీగాండివుల్
తనయుల్ వేమవిభుండు వీరవసుధా
ధ్యక్షుండు దొడ్డప్రభుం
డును నన్నయ్యయు బాహువిక్రమకళా
టోపప్రతాపోద్ధతుల్.

దీనినిబట్టి చూడ అనవేమారెడ్డికి నొక కుమారుఁడుండెననియు, ఆ కుమారునకొక బిడ్డ యుండెననియు మన మూహింపవలెను. కాని యీ పద్యమునందలి 'పౌత్త్రి' పదము 'పొరబాటు, దౌహిత్త్రుఁడని కవి తాత్పర్యము' అని చెప్పుచు నందులకు శ్రీచిలుకూరి వీరభద్రరావుగా రిట్లు వ్రాసియున్నారు. "ఈ పై పద్యమునందలి పౌత్త్రియను శబ్దమునకు దౌహిత్త్రి (పుత్త్ర్యాః పుత్త్రి) యని యర్థము గ్రహింపవలయును. అల్లాడ దొడ్డ భూపాలున కంకితము గావింపఁబడిన శివలీలా విలాసమునఁ గొమ్మనామాత్యకవి యల్లాడరెడ్డి నిట్లని వర్ణించెను.

"మ. భరితశ్రీనిధి యన్నమ్మ హీరమణుఁడౌ
స్వర్ణాజోశభక్తక్షితీ
శ్వరగమాముండగు భీమలింగమనుజే
శశ్రేష్ఠు సత్పుత్త్రి భా
స్వర కారుణ్య దశాజనావన విధా
సంధాత్రి వేమాంబికన్
వరియించెంబతిభక్తిగౌరవదృఢ
వ్యాపారనిత్యాంబికన్."

* Epigraphical Reports. 1914—15. p. 115.

"మఱియుం గోరుమిల్లి శాసనమున (౧౪౩౪)

"శచీవ శక్రస్య శివేవ శంభోః
సద్దేవ సా షద్మవిలోచనస్య
వేమాంబికా చోళకులేందుభీమ
భూపాత్మజా భూస్సహిళోస్య జాయా"*

"అని భక్తీశ్వరచోళ నృపాలుఁపుత్రుండగు భీమభూపాలుని పుత్రియగు వేమాంబికను వివాహముఁ జేసికొనియె ననిచెప్పఁబడి యుండుటచేత భీమరాజుఅనవేమ క్షితినాథుని యల్లుఁడని యర్థముచేసికొనక తప్పదు."†

అనవేమారెడ్డి కాలములో శ్రీనాథుఁడున్నట్లును, ఒకసారి యాతని సభకుఁబోయి యీక్రింది పద్యముతో నాతనిఁబొగడినట్లును పరంపరాగతమైన వదంతికలదు.

అనవేమ మహీపాల స్వస్త్యస్తుతవబాహవే
ఆహవే రిపుదోర్దండ చంద్రమండలరాహవే!

అర్థము:- ఓ అనవేమభూపా! యుద్ధమునందు శత్రువులనెడు చంద్రమండలమునకు రాహువైనట్టినీ బాహువునకుశుభమగుఁగాక.

శ్రీనాథుఁడు కుమారగిరి కా నున్నట్టు హరవిలాసమువలన స్పష్ట వేమారెడ్డి తరువాతనే కుమారగిరి నకువచ్చి నందున శ్రీనాథుఁడు కాలమునందు నుండినను నుండవచు యున్నట్టు నిదర్శనము లేవియులే పగిడ యాతని తండ్రికాలమం వాఁడు; శ్రీనాథుఁడీతని కుమారు కుమారుని) కాలమువాఁడు. కా వరుల నిద్దఱిని ఈతఁడుచూచి గౌరవించి యుండవచ్చును. అయి వంశము వ్రాయుకాలమువఱకు నిత లేదుగనుక యాతని ప్రభుత్వకాలః నెఱ్ఱనబ్రతికియుండకపో వచ్చును; చిన్నవాఁడుగ నుండవచ్చును. నెఱ్ఱన శ్రీనాథుఁడు పుట్టిన గిట్టిన ములు స్పష్టముగఁదెలియువఱకు ని చెప్పనేరము.

ఈతని తరువాత నెంతయో నకుఁబుట్టిన వెన్నెలకంటి సూరన పురాణమున నీతని గుఱించి c పద్యముప్రాయుట చూడ దెన మందు నితనిఖ్యాతి కొన్ని వంద

* పై శ్లోకము అల్లాడ పొడ్డారెడ్డి శాసనమందుఁగూడ నున్నది. Epigraphia Indica Vol. V. p. 53.

† ఆంధ్రుల చరిత్రము 3-వ భాగము, ౨౬3-వ పుట. శివలీలావిలాసమింకను అచ్చు పడలేదు. దాని జీర్ణమైన ప్రతియొకటి శ్రీ మానవల్లి రామకృష్ణకవి గారి యొద్ద వీరభద్రరావుగారు చూచినారఁట. కోరిమిల్లి శాసన మెచ్చటను ప్రకటింపఁబడలేదు. ప్రాచ్యలిఖితపుస్తక భాండాగారమునందు ౧౯-౬-౨౬ గుర్తుగల సంపుటము నందు 3౧౯-వ పుటలోనున్నది. దీనినే 'Elliots collection' అనిఅందురు. దీనినేదొరతనమువారిశాసనాధ్యక్షులు వేమవరము శాసనములు (Vemavaram Plates) అనివ్రాసి యున్నారు. Epigraphical Reports 1900 pars 63 & 64.

ఆంధ్ర నైషధము నంకితమందిన గన్న అనవేమారెడ్డిమంత్రియని శ్రీయు రామయ్యగారు వ్రాసియున్నారు (Epi. XI. p. 315, foot-note.). కాని యిది నైషధముచివరనున్న వచనమునుబట్టి మా కైదకోమటి వేమునియొక్క మంత్రియను

వలెకు నెక్కుడుగా నున్నట్లు మన మూహింప వలసియున్నది.

క. తనబ్రతుకు భూమిసురలకుఁ
దనబిరుదులు పంటవంశధరణీశులకున్
దనవయము భూమిప్రజలకు
ననవేమనయిచ్చెఁ గీర్తివిభవుండగుచున్ [౧-వఱ.

**అనసూయ.** కర్దమఋషికి దేవహూతివలనఁ బుట్టిన తొమ్మిదిమందికన్యలలో నొక్కతె. అత్రిఋషికిఁబత్ని. ఈమె విఖ్యాత పతివ్రత, మహాతపస్విని. ఒకసారి దశవర్షాత్మకమైన యనావృష్టికల్గి కఠినమైన కఱవు రాఁగా నీమె తనతపోబలంబుచే కందమూల ఫలంబులను, ఉదకంబును నిర్మించి పెక్కు ప్రాణులను రక్షించెను. మాండవ్యఋషిని శూలముమీఁద నెక్కింప నొకపతివ్రత చీకటిలో నాశూలముఁదాక యా ఋషిబాధకు సహింపక 'తెల్లవారఁగనే నీవు విధవవగుదు' వని శాపించెను. అట్లయిన నెప్పటికిఁ దెల్లవారకయేయుండుఁగాక యని యాపతివ్రత ప్రతిశాపంబిచ్చె. ఇట్లు సూర్యోదయములేమిచేఁ జరాచర సృష్టికిఁ గీడుమూఁడ దేవతలందఱు నాపతివ్రతాతిలకముయొక్క స్నేహితురాలగు అనసూయయొద్దకుఁబోయి శరణనె నామె తన సామర్థ్యంబుచే సూర్యుఁడు దయించునట్లును, తన స్నేహితురాలికి వైధవ్యంబు రాకుండఁగను జేసెను. ఈ శబ్దమునకు 'అనుసూయ' అనురూపాంతరము గూడఁగలదు. [వా. రా. అ. స. ౧౧౭.

వనవాసకాలమ్మున సీతారామలక్ష్మణులు అత్రిమహర్షి యాశ్రమమునకుఁ బోయిరి. అప్పుడు అనసూయ సీతను మిక్కిలి ప్రేమతో నాదరించి, స్త్రీధర్మముల నేకముల నుపదేశించి, సౌమాంగల్యమునకు లోపము రాకుండునట్లు అంగరాగ మాల్యవస్త్రాభరణముల నిచ్చెను.

**అనసూయుఁడు.** ఒక బ్రహ్మర్షి. (చూ. ౨ కశ్యపుఁడు.)

**అనస్టేషియసు.** ౧ (క్రీ.శ. ౪౩౦-౫౧౮)ఒకరోమనుచక్రవర్తి. ఇతఁడు మొదట 'జీనో' రాజ్యముచేయునపుడాతని కొలువులో నొకయుద్యోగిగ నుండెను. అతఁడు మరణించిన పిదప నాతని భార్యయగు అరియడిను సాహాయ్యమున అనస్టేషియసు చక్రవర్తియయ్యెను. పిదప అరియడి నాతనిఁ బెండ్లి చేసికొనియె.

ఇతఁడు ప్రజానురంజకుఁడై పాలనము చేసెను. కాని, పారసీకుల తోడి యుద్ధమునను హూణులు స్లావులు అనువారివలనను దేశక్షేమమున కప్పుడప్పుడు భంగము కలుగుచువచ్చెను. ఈరాజు క్రీ. శ. ౫౧౮ లో మరణించెను.

౨. ఇతఁడొక రోమనుచక్రవర్తి. మొదలు నాతఁడు 'ఫిలిప్పికస్' అనుచక్రవర్తికిఁబ్రధానిగ నుండెనుకాని, ప్రజలే క్రీ. శ. ౭౧౩ లో. ఫిలిప్పికస్నురాజ్యభ్రష్టునిగాఁ జేసిఅనస్టేషియస్ను

చక్రవర్తిగ నెన్నుకొనిరి. ఇతఁడు సేనల నిర్మించి, ఎక్కువ కట్టుబాటులోనుంచెను. ఆపీసికియా రాష్ట్ర నావికులీతని నిబంధనలు సైపలేక తిరుగఁబడి 'తియడోసియస్' (౭౧౫) అనువానిని చక్రవర్తిగ నెన్నుకొనిరి. రాజధానియైన కానిస్టాంటునోపలును తియడోషియసు ముట్టడించి అనస్టేషియస్‌ను రాజ్యమునుండి దఱిమివేసెను. క్రీ. శ. ౭౧౬ లో "ఘన లోనిక" కుఁబోయి సన్న్యాసియయ్యె. కాని సం॥ ౭౨౧ లో, తియడోషియసు తరువాత రాజ్యమునకువచ్చిన 'లియో' పై తిరుగఁబడెను. కాని తుదకాతనిచే హతుఁడయ్యెను.

3. ఈపేరుగల వారు నలుగురు రోముపట్టణమున 'పోపు' అధికారమును వహించిరి. 'పోపు' అనఁగా క్రైస్తవుల జగద్గురువు. మొదటివాఁడు క్రీ.శ. ౩౭౮ మొదలు ౪౦౧ వఱకును, రెండవవాఁడు ౪౧౬ మొదలు ౪౧౮ వఱకును, మూఁడవవాఁడు ౯౧౧ మొదలు ౯౧౩ వఱకును, నాల్గవవాఁడు ౧౧౫౩ మొదలు ౧౧౫౪ వఱకును 'పోపు' సింహాసనమును అధిష్టించిరి.

**అనాగరికసంఘము.** మానవజాతి యీ భూమిపైఁబుట్టి యెన్నియుగము లయినదో యెవ్వరును జెప్పలేరు. ఇప్పుడు కొన్నికొన్ని దేశములలోని జనులు నాగరికత జెందినవారై పట్టణములు, మేడలు, విద్యలు, కళలు, గ్రంథములు కలవారై శోభించుచున్నారు. కాని యీ నాగరిక[illegible] మానవజాతికిఁ గ్రమక్రమముగ[illegible] గాని యొక్కసారి వచ్చినదికాదు మానవసంఘమునకును, ఇతర పశు[illegible]క్షును అంతగ భేదముండియుండ[illegible] మానవులు నగ్నులుగను, గుహ[illegible] పొదలలోగాని వసించువారుగను, మూలాదులను పచ్చిమాంసమును[illegible] గను ఉండియుందురు. అట్టివారు[illegible] ముగ నిప్పుడు మనమున్న నాగరి[illegible]టకు నెన్ని లక్షలసంవత్సరములు ఎయే మెట్లు ఎక్కుచు వారింత[illegible] రో నిశ్చయముగఁ జెప్పఁజాలముగ[illegible] డీభూమిమీఁద నింకను అనాగరికు[illegible] ఆరణ్యకజాతులయొక్క యాచార[illegible] ములనుబట్టి కొంతవఱకు మనమ[illegible] జనుల పూర్వవృత్తాంతమును [illegible] వచ్చును.

అనాగరికజాతు లిప్పుడు [illegible] మీఁదఁ బెక్కులుకలవు. వారిలోఁ[illegible] ఇచ్చటఁ బేర్కొనిమెద :-మన య[illegible] మందు కోయలు, చెంచులు, ఎఱుక[illegible] దాసరులు, లంబాడీలును, హింద[illegible] దలి యితరప్రాంతములలోని య[illegible] దును పర్వతములందును సంచరించ[illegible] ఖోండు (కోదు), సవర, జాంగు [illegible] లైనవారు, అండమానునందలి వాసులు, సింహళమందలి వెడ్డలు,

దేశమందలి గుహానివాసులు, ఆక్కలనఁబడు వారు, ఉత్తరఅమెరికా యందలి కొల్యారెడోలు, దక్షిణ అమెరికాలోని బ్రేజిల్ వాసులు, గ్రీసులండులోని ఎస్కిమోలు అను వారు, బోర్నియాలోని డైకులు, ఆస్ట్రేలియా దేశమందలి యాదిమ వాసులు. వీరు గాక యచ్చటచ్చట విడిద్వీపములలోను, ఖండాంతరమునందలి యరణ్యాదికములలోను పెక్కుమంది అనాగరికజనులు గలరు. వీరందఱును ఒక్కతరగతి వారుకారు. ఒకరు తోళ్లుకట్టుకొనువారుగనున్న మఱియొకరు ఆకులు కట్టుకొనువారుగను, మూఁడవవారు బట్టవిడిచి తిరుగువారుగను ఉందురు. ఒక్కొకరియందు నాగరీకతాభావ మొక్కొకవిధముగఁ గానవచ్చుచుండును. ఈ జాతుల యాచారవ్యవహారములన్నియు నాయాశబ్దములక్రింద-వారి పేళ్లు వచ్చినప్పుడు - విరివిగ వ్రాయఁబడును. నాగరీకతగల సంఘమువారికిని ఈ అనాగరిక జనుల సంఘమునకును గలముఖ్యభేదములెవ్వియో వానిలోఁ గొన్నిఁటి నిచ్చట సంగ్రహముగ వ్రాయుదుము.

ఆహారము

మానవునకు దినమును తప్పక కావలయునది యాహారము. ఇందున గుఱించి యొకానొక సంఘముయొక్క యాచారమును మనమెఱింగితిమేని యా సంఘమెంత నాగరిక స్థితిలోనున్నది మనము చెప్పఁగలము. మొట్టమొదట మానవుఁడు పశువులవలెనే, అరణ్యామందుఁ దమంతటఁ బుట్టు శాఖాదులను భక్షించియుండవలెను. గడ్డి మొదలైనవాని కంటె పండ్లు, కందమూలములు, మానవ శరీరమునకు నెక్కువ పోషకములు గనుక వానిని చెట్లమీఁదినుండి కోసికొనియు, భూమిలోనుండి త్రవ్వియుఁ దీసికొనియుండును. దీనికి 'పశుదశ' యని పేరుపెట్టవచ్చును. ఈ దశలోనే యదృచ్ఛగా దొరికిన పశువులమాంసమును తినుచుండవచ్చును. మిక్కిలి నికృష్టమైన యీదశకంటెఁ గొంచెము పైకివచ్చిన వారు వేటాడి మృగములఁజంపి భక్షింతురు. దీనిని మనము 'మృగయాదశ' యందము. పూర్వపుదశకంటె నిందుఁ గొంచెము నాగరీకత కావలయును. వేటాడుటకు విల్లు, అంబు మొదలైనసాధనము లుండవలయును. ఈ సాధనములఁ జేయుట నేర్చుకొనిన పిదపఁ గాని మానవునకు 'మృగయాదశ' రానేరదు. కందమూలాదులనేమి, మాంసమేమి మొదట పచ్చిగనే భక్షింపఁబడును. ఎందుకనఁగా మానవజాతికి నిప్పు శైశవావస్థయందు లభించినది కాదు. కొంచెము నాగరికత హెచ్చిన తరువాతఁగాని నిప్పును బుట్టించు నుపాయములు వారు కనుఁగొనలేక పోయిరి. నిప్పు వశమైన తరువాతఁగూడ భక్ష్యపదార్థములను అందుఁ గాల్చి తినుచువచ్చిరి. వంటకములఁ జేయు పద్ధతి కొంచెము హెచ్చుతగ్గుగ అనాగరీక స్థితి వదలిన తరువాతనే మానవునకుఁ దెలిసినదని చెప్పవచ్చును. కందమూలములనేమి,

మాంసమునేమి కొంచెము హెచ్చుతగ్గుగ నన్నాగరికులందఱును పచ్చిగనో, కొంచెము కాల్చియో భక్షింతురు. పక్వముచేయువిద్య వారంతగ్గ నెఱుంగరని చెప్పినఁ జెప్పవచ్చును. ఈ 'దశ' తరువాతఁ గొంతకాలమునకు 'గోపాలదశ' మానవజాతికిఁ బ్రాప్తించును. కందమూలఫలములుగాని, వేటవలనవచ్చెడి మాంసముగాని తమకువలయునంతయు వలసినప్పుడు దొరకక పోవచ్చును. వానిని ఎక్కువగ సంగ్రహముచేసి యుంచుటకు వీలు లేదు. కావున మానవుఁడు అరణ్యమునందలి కొన్ని పశువులను, అనఁగా మేకలు ఆవులు గేదెలు మొదలైన వానిని, వశపఱుచుకొని పెంపఁబ్రారంభించెను. ఇందువలన నాతనికిఁ గావలయునెడఁ గావలసినంత మాంసాహారము దొరుకుటయేగాక, వాని పాలుపెరుగు మొదలైన రుచికర పదార్థములుగూడ తినుటకు దొరుకును. ఇట్లు గోపాలదశకు వచ్చినవారు కొంత నాగరీకులని చెప్పవలెను. ఇట్టి స్థితికి రాని జాతు లిప్పటికిని ఈ భూమి మీఁదఁ బెక్కులు కలవు. మన దేశమందలి కోయ చెంచు జాతుల వారింకను గోపాలకదశను వహింపలేదనియే చెప్పవలెను. ఆసాము దేశమునకుఁ దూర్పున పర్వతప్రాంతమందు మప్మి జాతివారుకలరు. వారు ఆవులు,ఎద్దులు మొదలైన వానినెక్కువగాఁ బెంచెదరు. అవి అరణ్యములో స్వేచ్ఛగాఁ దిరుగుచుండును. వీరు వీనితో వ్యవసాయముచేయరు. పండుగదినమున నొక దానిఁజంపి తిందురు. భార్య ... వీనిని ధనముగ నుపయోగించె... లకదశనుపొంది దానివలన మిక్కి... సంపాదించిన వారు లంబాడీలు. మొదలైన పశువులను విశేష... వాహనములుగ నుపయోగింతుఁ... నకు నుపయోగింపరు. గోపాల... వాతిది 'కృషికదశ', అనఁగా వ... చేసి ధాన్యము పండించునట్టి స్థి... నొకవిత్తువేసి నూఱువిత్తులు... విద్య మానవుఁడు సాధించిన గొప్పది. ఆదిమదశలో మానవు... తిరుగుచుండు స్థలములలో స్వా... బెరుగు గడ్డిధాన్యములే కోసికొ... వలెను. తరువాతఁ గొన్నివిత్తులు బడి వర్షాకాలమవి చెట్లయి ఫలిం... మానవుఁడు మొదట భూమిమీ... చల్లి వచ్చినపంటను అనుభవిం... భూమి దున్నుటగాని పాటు... యెఱుఁగఁడు. కోయలు మొదలై... జాతులవారు, భూమిని ఎక్కువగా విత్తనములు చల్లి వచ్చినపంటను ...తురు. క్రమముగఁ బశువులచే ... మొదలైన వ్యవసాయపద్ధతులను ...రీకతాభివృద్ధిఁ జేసికొనిరి.

కొందఱు అనాగరిక జాతుల... మాంసమును తినియెదరు. ఇట్ల... మాంసమును తిను మా...

మిక్కిలి తక్కువమైనను, పూర్వముండెను; ఇప్పుడును ఉన్నవి. నరమాంసాశనులైన రాక్షసులు మనపురాణాదికములలో వర్ణింపఁబడియున్నారు. ఆ(వాత యిట్టి యారణ్యక అనాగరిక జనులను గుఱించియే వ్రాయఁబడి యుండును. అట్టి జాతులిప్పుడు నశించి యుండును. మిక్కిలి పురాతనకాలమందు ఫ్రాన్సు దేశమందును నిట్టి జనులుండిరనుటకు నిదర్శనము లున్నవి. క్యాస్పియన్ సముద్రమునకు నీశాన్యమున దీవులలోఁ దిరుగుచున్న సిథియన్ మ్యాసగేటియను జను లిట్టివారని హిరోడోటస్ మొదలయిన పురాతన లేఖకుల వ్రాతలవలనఁ దెలియుచున్నది. ప్రస్తుతకాలమందు ఆఫ్రికా ఖండముయొక్క పశ్చిమ, మధ్యభాగము లందును, న్యూగైనా, ఫిజీ, ఆస్ట్రేలియా, నూజీలండు, పాలినేషియన్ దీవులు, సుమాత్ర, దక్షిణ అమెరికా మొదలయిన దేశములందున్ను మాంసభక్షకజాతులు చాల కలవు. వీరిలోఁ గొందఱు క్రమక్రమముగ నీరాక్షసాచారమును విడుచుచున్నారు. కాని సుమాత్రలోని బట్టాలనువారును, ఈస్టు ఇండియన్ దీవులలోనివారును, దక్షిణ అమెరికాలోని పూర్వనివాసులును ఈ పురాతనాచారమును విడువలేదు. ఈ మాంసభక్షకులు సాధారణముగ శత్రువులను జంపి భక్షింతురు. తమ సంఘము వారిని తినరు. హిందూదేశమునందు మనుష్యభక్షకులైన యనాగరికు లున్నట్టు కానరాదు. అఘోరపంథమువారు* పీనుఁగులను భక్షించుచుండిరి. కాని యది మతసిద్ధాంతమును బట్టి వచ్చిన భక్షణకాని యనాగరికత వలన వచ్చినది కాదు.

నరమాంస భక్షణము

సిగ్గువలనఁ గాపాడుకొనుటకు శరీరమునకు దుస్తులు కావలెను. కాని 'సిగ్గు' అను మనోవికారము మానవజాతికిఁ గొంత నాగరికత వచ్చినతరువాత నుద్భవించినది. మొదట శరీరమును చలివలనఁ గాపాడుకొనుటకు దానిని దేనితోనైనఁ గప్పవలసి వచ్చెను. అందుచే నెండ లధికముగ నుండుచోట నారణ్యక జనులు నగ్నులుగ నుండుటయు, చలి యెక్కువగనున్నచోట వారు దుస్తులను ధరించుటయు తటస్థించును. కేవలము నగ్నావస్థ యందుండు జాతులుకూడఁ గలవా యని నూఱు రూపాయలను మించినదుస్తుల ధరించు మన మనుకొనవచ్చును. కాని వస్త్రవిహీనులుగ నుండు అనాగరికులు భూమిమీఁద నిప్పుడును పెక్కులుకలరు. అరణ్యమధ్యమున నుండు కోయవాండ్రు నగ్నులుగ నుండుదురు. ఎవరినైనఁ జూడవచ్చునప్పుడు ఆకులుచుట్టుకొని వత్తురు. ఫ్యూజీదేశజులు, ఆస్ట్రేలియా దేశజులు సాధారణముగ నేమియుఁ గట్టుకొనకయే తిరుగుచుందురు. చలి

దుస్తులు

* చూఁడు. ఆంధ్రవిజ్ఞాన సర్వస్వము ౧-వ సంపుటము 'అఘోర పంథము' అను శబ్దము.

పుట్టినప్పుడు కూర్చ మేమైనను చుట్టుకొం దురు. ఇప్పుడు నాగరిక జనుల సంపర్కము వలనఁ గొన్ని జాతులవారు వస్త్రధారణము నేర్చినను బట్టవిడిచి తిరుగు నాచారము వారి లోఁ బూర్తిగఁబోలేదు. ఆఫ్రికాఖండములో భూ మధ్య రేఖాప్రాంతము (Equatorial Africa) నందున్న అషిరులను (Ashiras) జనులలోను, అమెరికాయొక్క మధ్యభాగము

నందున్న చయ్‌ములు (Ch వారిలోను, వివాహమైన స్త్రీ ణము చేసినను, అవివాహి చీరకట్టఁ గూడదన్న నియమ యెక్కువగనుండె దుస్తులు పశువుల చర్మములను వస్త్రప దరు. ఇంగ్లండు దేశమునంద దిమవాసులు మృగములతో

1-వ పటము



అనాగరిక జాతులు

చుండిరి. మన పూర్వపు ఋషులుకూడ (అనాగరికులు గాకపోయినను) మృగాజినము లు ధరించుచుండినట్లు మనము చదువుచు న్నాము. చెట్ల బెరడులు గూడ కట్టుకొను అనాగరికులు కలరు. నూలు వస్త్రములు

నాగరికత దశలో వెలిసినవి దశలోనివి కావు. బట్టలనే బూర్ణము, వ్యవసాయము, దారము వడుకుట మొదలయి వచ్చియుండవలెను.

మోటు జాతులయొక్క మోటుతన

అలంకరణము

మును నాగరికజాతుల యొక్క నాగరికతయు అలంకారముల వలననే గొంత తెలియును. నగ్నస్థితిలో నున్నప్పుడు శరీరమునకు రంగు వేసికొని దాని చక్కదనమును హెచ్చింప వలయునన్న కోర్కెపుట్టుట సహజము. కావున పెక్కు అనాగరిక జనులు శరీరమునకు

2-వ పటము



పచ్చలుపొడిపించుకొనిన ఆరణ్యకుఁడు

రంగు వేసికొనియెదరు. ఆఫ్రికా దేశమందును, అమెరికా దేశమందును, మూల నివాసులైన ఆరణ్యక జాతులవారు తమ శరీరమును వేలువేలు చిత్తరువులతో నలంక

రించు కొనియెదరు. కొందఱు శరీరము యొక్క యొక భాగమందును, మఱియొకరు ఇంకొక్క భాగమందును, ఇంకొక జాతివారు శరీరమంతయు ఎఱ్ఱని, పచ్చని రంగుల చిత్తరువుల వ్రాయుకొందురు. ఈ చిత్తరువులు చెట్లు, తీగెలు, చెక్కడములు, గళ్లు, మృగములు మొదలైనవిగనుండును. ఇది చిత్రవిద్యయొక్క ప్రథమావస్థయని చెప్పవచ్చును. కొన్ని దేశములలో శరీరమున పచ్చలు పొడిపించుకొని సింగారించుకొనియెదరు. మన దేశమునందును పచ్చలు పొడిపించుకొను నాచారము కలదు. ఈపని సాధారణముగ ఎఱుకలవాండ్రు చేయుదురు. మైలనేశియా, పాలినేశియా, న్యూజిలండు మొదలయిన దేశాంతరము లందలి మోటువారు చేతుల్ల నిండను, కాళ్లనిండను, ముఖమంతయు, శరీరమంతయుం బచ్చలు పొడిపించుకొందురు! బట్టలు కట్టు నాచారము హెచ్చినకొలందిని శరీరమునకు రంగు వేసికొనుట, పచ్చలు పొడిపించుకొనుట యన్న యాచారము తగ్గును.

శరీరమునకు నలంకారము తగిలించుకొనుటకు శరీరమునందుం జిల్లులు చేయుట అనాగరిక జనులయొక్క పెద్ద విశేషము. చెవులకు, ముక్కుకు చిల్లులు చేయుట సహజమె కదా! కొందఱు క్రింది పెదిమకుం జిల్లిచేసి, దానిని క్రమముగం బెంచి, నోటితో సమానమైనంతదిచేసి, దానికి నగలు పెట్టుదురు.

బ్రెజిల్, దక్షిణ అమెరికా, ... దేశము లందలి మోటుజాతు... రమున్నది. అచ్చట పిల్లలకు త... మన పిల్లలకు చెవులు కుట్టించి... కుట్టించి క్రమముగం బెంచెదర... బుగ్గలోం జిల్లిచేసికొని నగ ధ...

౩-వ పటము



మోటుగా ముక్కునగ ధరి...

వీరి నగలును మిక్కిలి మో... కొందఱు చక్కందనమున్నకై ... చెదరు. ఆడవాండ్రు ధరించు... కలతోను, సముద్రమునందలి... చములతోను, చేయంబడియుం... దేశమునందు లంబాడీ స్త్రీలు... నగలు మనము చూచుచున్నా... అనాగరిక జనులలో నింతకంటె... టుగ నుండునని తెలిసికొన వ...

మానవులు పశుదశయందున్న కాలమునం గొంతవఱకు స్త్రీ పురుష సంబంధములు కూడ పశువులవలెనే యే నియమమును లేక స్వేచ్ఛగా జరిగియుండును. కాని యంత పశుదశయందున్న జాతులిప్పుడు కానరావు. కొంతకాలమునకుం గొన్ని నియమము లేర్పడినవి. మొదటినుండియు స్త్రీలను పురుషులు ధానిసలుగ, తమ యుపయోగమునకై పుట్టిన సొత్తువలె చూచుచున్నందున, కొందఱు పురుషులకుం గొందఱు స్త్రీలకు నియతసంబంధము కలిగెను. ఇదియే వివాహవిధి. ఇది అనేకవిధములుగ నున్నది. ఒక స్త్రీకి నొక పురుషుండన్న నియమము మొదటినుండి యునున్నదికాదు. ఒక్కపురుషునకుం బెక్కు స్త్రీలును, ఒక్కస్త్రీకిం బెక్కు మగలును, ఉండు నాచారములు అనేక అనాగరిక జనులలో నున్నవి. బహుపతిత్వము (Polyandry) నాగరికజాతులవారమైన మనకు నెంత యసహ్యాకరముగనున్నను భూలోకమునందు నీయాచార మనాది సిద్ధముగనున్న జాతులు కలవు. సింహళమునందును, తిబ్బెటునందును, నీలగిరి పర్వతమునందును ఈ యాచారముగల జాతు లున్నవి. ఇట్టి యాచారమున్నచోట సాధారణముగ నొక్క స్త్రీకినున్న పెక్కు మగలు అన్నదమ్ములుగ నుండుదురు. అనఁగా పంచపాండవులవలె నన్నదమ్ము లందఱును ఒక్క స్త్రీకి పెనిమిటులుగ నుందురు. నీలగిరి పర్వతముమీఁద 'తోడ' లను మోటుజాతి వారున్నారు. అన్నదమ్ములలో నొక్కఁడు వివాహమాడిన స్త్రీ యందఱు తోడఁబుట్టిన వారికిని పెండ్లామగును. ఒకపెండ్లాముగల వారందఱు సాధారణముగ అన్నదమ్ములైనను ఒకప్పుడు వా రొక్కకుటుంబములోని వారుగను, అరుదుగ భిన్నకుటుంబములోని వారుగనుగూడ నుందురు. ఇట్టిస్త్రీకిం బుట్టిన పిల్లలకుం దండ్రి యెవఁడని నిశ్చయముగఁ దెలియుటకై యాస్త్రీ గర్భముతో నున్నప్పుడు ఏడవనెలలో నొకయుత్సవము చేసెదరు. అప్పుడు దానిమగలలో నొక్కఁడు దానిచేతికి నొక చిన్నవిల్లును అంబును ఇచ్చును. అట్లిచ్చిన వాఁడప్పుడుపుట్టు శిశువునకుం దండ్రి. మగలందఱు నన్నదమ్ములైనప్పుడు పెద్దన్నయే సాధారణముగ విల్లు నంబునిచ్చును.

ఎఱుకలవాండ్లలోంగూడ నొకవిధమైన బహుపతిత్వము కలదు. ఎఱుకలసానిమగఁడు దొంగతనముచేసి కైదుకుంబోయిన యెడల నా కాలమందు నది మఱియొకనితోం గాపురముండవచ్చును. తిరిగి మగఁడురాఁగానే యది వానిఁజేరును.

కొన్నిజాతులలో వివాహము చేసికొనిన స్త్రీ పెనిమిటి సెలవు లేక యన్యపురుషుని బొందుటతప్పుగా నెంచినను, భర్తయనుజ్ఞవడసి యట్లుచేయుటగాని, అవివాహిత స్త్రీలు తమ కిచ్చవచ్చినట్లు ప్రవర్తించుటగాని తప్పుగా నెంచరు. న్యూజీలాండులోను, ఉత్తర అరా

క్యానులోను, ఉత్తర అమెరికా, మధ్యఅమెరికా దేశములందుండు మోటుజాతులవారు కన్య స్వేచ్ఛగాఁ దిరుగుట తప్పుగా నెంచరు. అట్లు అవివాహితయైన కన్య యెవరితోను సంబంధములేకుండ నుండెనేని యది రూపసి కాదని బ్రెజిల్ దేశజు లనుకొనియెదరు. మెలనేసియా దేశమందలి జనులు తమయింటికి వచ్చిన చుట్టములయొద్దకుఁ దమ భార్యలఁ బంపుదురు.

మోటుజాతులలోఁ గొందఱు తమ తెగవారిని వివాహమాడుదురు. కొందఱు వేఱు తెగవారినిగాని వివాహమాడరు. మొదట వేరుతెగలనుండి యాడువారిని ఎత్తుకొనివచ్చి బలవంతముగ వివాహమాడుచుండిరి. దీనినే మనవారు రాక్షస వివాహమన్నిరి. ఇట్టి యాచారమింకను అనాగరిక జనులలోఁ బెక్కుచోట్లనున్నది. ఈ తెగవారు ఆ తెగవారితోనే సంబంధ బాంధవ్యముచేసి కొనవచ్చునని యున్నచోట నీతెగలోని యీతరము పురుషులందఱికి ఆతెగలోని యీ తరమునందలి స్త్రీలందఱును పెండ్లాలుగనుందురు. అనఁగా ఈ తెగలోని యిష్టమువచ్చిన మగవాఁడు ఆతెగలోని యిష్టమువచ్చినంతమంది స్త్రీలను పెండ్లి చేసికొనవచ్చును. ఇట్టి యాచారము ఆస్ట్రేలియా జనులలో నున్నది. సుమాత్రాద్వీపమునందుఁ గొంతకాలము క్రిందట జగర్, అంబెల్ అనక్, సెమనడో అను మూఁడువిధములయిన వివాహములుండెను. మొదటిదానిలో

పురుషుఁడు స్త్రీనికొనును, రెం
పురుషుని గొనును, మూఁడ
పురుషు లిద్దఱును సమాన
యుందురు. మొదటివివాహప
నందునుకలదుగాన దానినివర్ణి
రెండవదానిలో, పిల్లతండ్రి
చ్చును. వాఁడప్పటినుండియ
బము వాఁడె యగును. వాని
తయు వాని మామగారికే చె
మామగారి కుటుంబము వ
యొకవిధమైన యిల్లఁటము.
కిద్దఱికిని సమానమైన హక్కు
మందు, ఇద్దఱి సంపాదనయు,
ఱికి సమానముగవచ్చును. భ
ఱునువిడిపోవలయునన్న సొత్తు
బంచుకొందురు. ఇట్లు అనా
వివాహపద్ధతులు పెక్కులుగఁ
శరీర సౌఖ్యముకొఱకు, పనిప
కొన్న వివాహములేగాని
పేమయనునది కానరాదు.
ముగ దాసిగ, పనికత్తెగ, భ
దరు. కావున నాగరికవివాహ
రిక వివాహములకు సాత్వి
నదియే భేదము.

చెట్టునీడ, పొదలచాటు
నివాస స్థలములు న్యాకున
ములు.
పెద్ద గృహములు. మొద

గృహ నిర్మాణ మెఱుఁగఁడు. మొదలచ్చా
టున నింకను రెండు మండలు పెట్టుకొనియు,
గుహలలోను కాపురముండు మిక్కిలి నికృష్ట
జాతులవారిప్పటికిఁ బెక్కులు కలరు. ఈ స్థితి
నుండి లంబాడి గుడిసెల వఱకు వచ్చుటకు
మానవజాతి కెన్ని యో యుగములు పట్టి
యుండును. వడ్రంగమువిద్య సాధ్యమగువఱకు
మానవులు ఆరణ్యక స్థితిలోనుండి యీవలకి
వచ్చిరి. ఇండ్లు అనుటకు వీలులేనట్టి మిక్కిలి
చిన్నవియైన కప్పులను నిర్మించుకొని కాపుర
ముండు మోటు జాతులవారు మన దేశమునం
దింకను ఉన్నారు. ఎరుకలవాండ్లు, తోడ జాతి
వాండ్ల గుడిసెలను జూచినఁగాని వాని దారి
ద్ర్యావస్థ బోధపడనేరదు. ఇండ్లే కట్టుటకు
చేతఁగా నప్పుడు పట్టణాదులు నాగరిక జాతి
వారికుండ నేరవనివేఱుగఁజెప్ప నక్కరలేదు.
మిక్కిలి యనాగరికావస్థలోనున్న యారణ్యకు
లొక్కచోట పట్టుమని పదియేండ్లుండరు.
ఎచ్చట వారికి భోజనపదార్థములు దొరుకు
చుండునో యచ్చటికిఁబోయి కొన్ని దినము
లుండి మఱియొకచోటికిఁ బోవుచుందురు.
కావున శాశ్వతమైన పల్లె నిర్మించుకొన వల
సిన యావశ్యకత వాండ్రకు లేదు. దొమ్మరి
గూడెములు, ఎఱుకల గూడెములు తెలుఁగు
దేశము వారికిఁ దెలిసినవియే. ఈ గూడెము
లొకప్పుడీ గ్రామము వెలుపలను, మఱి
యొకప్పుడింకొక గ్రామము వెలుపలను గాన
వచ్చుచుండును.

మతముగూడఁ గ్రమముగ నభివృద్ధియైన
దియే. అనాగరిక జనులకును, నాగరిక జను
లకును దుస్థులను
మతము
గుఱించి యెంత భేద
ముండునో మతమును గుఱించియు నంత
భేదముండును. మిక్కిలి పశుదశలోనున్న
కొన్ని జాతులవారికి మత కల్పనలే లేవని
కొందఱు వ్రాసియున్నారు. కాని యందును
గుఱించి గ్రంథకారులు భిన్నాభిప్రాయులై
యున్నారు. పశుదశను విడిచి కొంచెము
పైకివచ్చినవారిలో, రూపములేని కొన్ని క్షుద్ర
దేవతలు తమకుఁ గీడుచేయుననియు, వానిని
సంతోషపెట్టి యాకీడునుతప్పించుకొనవలయు
ననియు, చచ్చిపోయిన తమ పూర్వులు దయ్య
ములై తిరుగుచుండెదరనియుఁ గల్పనలు కల
వని మనకుఁ గానవచ్చుచున్నది. తనకు సంభ
వించెడి యాపదలన్నియు స్వాభావికముగ
వచ్చుట లేదనియు, ఏదో దేవతయొక్క
ప్రభావమువలన వచ్చుచున్నవనియు, ఆరణ్య
కుఁడనుకొనును. అందులకై జ్వరమున కొక
దేవత, దగ్గునకొక దేవత యున్నదని కల్పించు
కొనును. అట్లే వృక్షమున కొక దేవత, గుట్ట
కొక దేవత, వాన కొక దేవత, ఉరముకొక
దేవత కలదని తలంచును. ఇట్లు చెడ్డగాఁ గాన
వచ్చు వానికిని, గొప్పగఁ గానవచ్చు వానికిని
ప్రతిగ నొక్కొక దేవతపుట్టును. మానవుఁడు
తనయందున్న గుణములన్నియు ఈ దేవత
లందు నారోపించును. ఆ దేవతలను సంతోష

పెట్టవలెను, వానికి మాంసము పెట్టవలెను, కల్లు పోయ్యవలెను. పోఁగాఁబోఁగా నివియే ముత్తేలమ్మ పోలేరమ్మలుగాను, జాతరలుగను మారినవి. ఇట్లు మొదట చెడుదేవతలు పుట్టెదరు. తరువాత మంచి దేవతలు పుట్టెదరు. వీరు వారు కలిసి యధికమైన తోడనే వీరంద ఱుండుటకు నొకతావు కావలసివచ్చును. అదియే తరువాత స్వర్గమగును. ఈలాగు మిక్కిలి స్వల్పమునుండి మతకల్పనలు ప్రవృద్ధమగుచుండును. ఏకేశ్వర కల్పన యెన్నియో యుగముల తరువాతఁగాని పుట్టదు. అనాగరిక సంఘము వారు సాధారణముగ దేవతలని గుట్టలను చెట్లను మృగములను పూజించుచుందురు. ప్రయోగములు మొదలయిన వాని నమ్ముదురు. మానవులు పులులుగను, వేఱు మృగములుగను మంత్రబలము వలన మాఱుదురని తలంతురు.

ఇప్పుడు భూమిమీఁద నున్న యనాగరిక జాతులు కొన్ని బుద్ధివిషయమై మిక్కిలి నీచావస్థలోనున్నవని చెప్పవలసియున్నది. వీరి బుద్ధి

బుద్ధి వికాసము

వైభవము వీరి భాష వలననే తెలియఁగల్గదు. కంటికిఁగాన వచ్చెడి పెక్కు పదార్థములకుఁ బేళ్ళున్నను, కనులకుఁ గానరాని జాతివాచక భావవాచక పదములకుఁ గొందఱి భాషల యందుఁ బేళ్ళేలేవు. మఱే భాషలో ఎఱ్ఱ నల్ల మొదలయిన రంగులకుఁ బదములున్నవి కాని 'రంగు' నకుఁ బదము లేదు. ట్యాస్ మేని యన్ భాషలో వేఱు వేఱు చెట్లకి[illegible] గాని 'చెట్టు' నకుఁ బేరులేదు. ' [illegible] కాఠిన్యము, వేడిమి, చల్లదన[illegible] యిన యర్థముల పదములులేవు[illegible] రెన్ని యంకెలవఱకు లెక్కపెట్ట[illegible] కొన్న వారియనాగరికత యొ[illegible] మనకుఁ దెలియఁగలదు. ఈక్వి[illegible] వారు పదికంటె నెక్కుడు లె[illegible] క్రాఫర్డు అను శోధకుఁడు ఆస్ట్రే[illegible] మండలి ముప్పదిమోటు జాతు[illegible] లను శోధించి, అందెవరికిని 'న[illegible] నెక్కువ లెక్కబెట్టుట చేతకాదని[illegible] కేప్ యార్కర్ ననువారు [illegible] నెక్కుడు లెక్కల నెఱుఁగరు. [illegible] వలసి వచ్చినప్పుడు 'రెండు నొక[illegible] అనవలసి వచ్చినప్పుడు 'రెండు [illegible] యందురు! కావున నిట్టి వారి [illegible] వికాసముఁ జెందక బాల్యావస్థ[illegible] చెప్పవలెను.

మాటలాడు భాషయొక్కయు[illegible] నంకెలయొక్కయు స్థితి యిట్లు[illegible] జాతులవారిలో వ్రాతలేదనియు [illegible] లేవనియు వేఱుగఁ జెప్పవలెనా[illegible] పోయినను, కొంచెము అధికుల జాతులవారు తమ యుద్దేశము[illegible] ద్వార కొంతవఱకుఁ దెల్పెదరు.

స్త్రీ పురుష సాంగత్యమువ[illegible] మేర్పడును. పూర్వము కుటుం[illegible]

ప్రధానములు. పిదప క్రమముగఁ బురుష ప్రధానము లయ్యెను. స్త్రీ ప్రధాన కుటుంబములనఁగా నాకుటుంబములోని జను లొకానొక స్త్రీకిని దమకును గల బంధుత్వమువల్లన గలిసి యుందురు. వారసత్వము మొదలైన వన్నియు స్త్రీ ని ననుసరించి వచ్చును. మానవుల యాదిమదశలోను, వివాహబంధనములు దృఢముకానపుడును సంతానము యొక్క తండ్రి యెవఁడయినది నిశ్చయముగాఁ దెలియదు. తల్లి మాత్రము తెలియును. కావునఁ బిల్లలను పోషించుభారము తల్లి మీఁదను, ఆమెబంధువుల మీఁదను పడును. మలె ఆర్చిపెలగో దేశమందలి వారు మిక్కిలి కనిష్ఠావస్థలో నున్నారు. ఒక పురుషుఁడు ఒక స్త్రీ యరణ్యమునకుఁ బోయి పొదలలోఁ గాపుర ముందురు. పిల్లలు పుట్టిన తరువాత పిల్లలు కొంచెము పెద్దవారగువఱకును వారు కలిసి యొక చెట్టుక్రింద నుందురు. చెట్టుకు ఒక విధమైన ఉయ్యెల వ్రేలాడగట్టి పిల్లలను దానిలో నుంచెదరు. రాత్రి పులులు మొదలైనవి రాకుండ నిప్పుముట్టించి యుంచెదరు. పిల్లవాఁడు కొంచెము పెద్దవాఁడైన తరువాత తండ్రి యిష్టము వచ్చిన చోటికిఁ బోవును. తల్లి పిల్లలను పెంచును. అండమాను, ఆస్ట్రేలియా దీవులలోను ఇట్లే పిల్లలను తల్లి, మేనమామ పెంచుదురు. ఉత్తర అమెరికా దేశమందును ఇట్టి యాచారమే కలదు. హిందూ దేశమందలి నాయరు జాతివారిలోని స్త్రీ ప్రధానమైన కుటుంబ పద్ధతియే అమల్లులో నున్నది. అచ్చటి కుమారనకు తండ్రి యింటిపేరు రాదు. తండ్రి సొత్తు రాదు. మేనమామ యింటిపేరు వచ్చును. మేనమామసొత్తు వచ్చును. ఇట్టి కుటుంబమును తార్వడ్ అందురు.

కుటుంబము

వివాహబంధనములు దృఢమైన జాతులలో పురుషప్రధాన కుటుంబము లేర్పడినవి. వీనిలోఁ బురుషునిబట్టి కుటుంబమేర్పడును, దాయభాగము వచ్చును. ఇట్టివియే మన కుటుంబములు.

సంఘమనఁగాఁ గొన్ని కుటుంబములు స్వసంరక్షణార్థమై కలిసియుండుట. మిక్కిలి ప్రారంభావస్థ యందు నేకుటుంబమునకు నా కుటుంబమే విడివిడిగానుండి స్వేచ్ఛాచారము జేయును. సింహళమునందలి వెడ్డలనంబడు జాతి వారెవరికివారు వేఱువేఱుగ నుందురు. అమెరికా దేశమందలి 'ట్యాన్ మేనియనులు' అను జాతివారిలోని వేఱువేఱు కుటుంబములు యుద్ధసమయమునఁ గలిసి యొక నాయకుని నేర్పఱుచుకొని, వాని యాజ్ఞలో నున్నను, ఆ పనియైనతోడనే యే కుటుంబమున కా కుటుంబము స్వతంత్రమై పోవును. కాని మఱియొకజాతివారు ప్రక్కనఁజేరి శత్రువులుగానున్నప్పుడు స్వసంరక్షణార్థమై యీ చిన్న కుటుంబములన్నియుఁ జేరి యొక సంఘ

సంఘము

ముకావలసివచ్చును. ఇట్లుకూడి యొక్కనిఅధి
పతిగనేర్పరచుకొని వానియాజ్ఞలో మెలఁగు
దురు. ఇట్లు సంఘముగా నేర్పడువారు సా
ధారణముగ నొక్క తెగవారై యుందురు.
ఇట్టి సంఘములోఁ బెద్దపెద్ద కుటుంబములుం
డును. ఆకుటుంబములకు నధిపతి తండ్రి. ఆతని
కుమారులు, మనుమలు, మొదలయినవారంద
ఱును అతని యాజ్ఞలో నుండవలయును. ఆ
కుటుంబమునకు నాతఁడొక విధమైనరాజు.

అనాగరిక స్థితిలోనుండువారుగూడ తమ
స్వాతంత్ర్యమును కాపాడుకొని పరుల స్వాతం
త్ర్యమునకు భంగము రాకుండ ప్రవర్తింపఁ
గలరనుటకు ఖురాసానులోని తిరుగుచుం
డెడి కొన్ని మోటు జాతులు నిదర్శనము.
వీరిలో నిప్పటికిని ఒక రాజుగాని ప్రభుత్వము
గాని గానరాదు. అందఱును సమానులు
గనే యుందురు. వీరి సంఘములు చిన్న
చిన్నవి. కొన్ని ముప్పది కుటుంబముల
కంటె నెక్కుడుండవు. ఒక్కొక సంఘము
నకు నొక్క ముసలివాఁడు నేతగా నుండును.
అతఁడు సలహా చెప్పువాఁడుగను, తగాదాలు
వచ్చినప్పుడు తీర్చువాఁడుగను ఉండునేకాని
యధికారిగ నుండఁడు. ఇతనికిఁ గొంత జీత
మిచ్చెదరు. ఇతఁడు పూర్వాచారమును
ఉల్లంఘింపఁడు. 'మాకు నధికారులు లేరు.
మాకు నధికారులతోఁ బనిలేదు.' అని ఖురా
సానులందురు. పరులను బాధపెట్టి వారిమీఁది
కేము చేయవలయునన్న ప్రవృత్తి వీరికి
లేదు. ఇతరుల స్వాతంత్ర్యవ
డును భంగము కలిగింపరు.
తగ్గినకొలఁదిని మానవ జా
దక్కువజాతుల వారిని వశపఱ
బానిసలుగ నుంచుకొని,
తాము సుఖపడవలయునన్న

ఈసంఘములు మొదట ని
ముగనుండునవి కావు. తమ క
వులకు మేత మెచ్చుటదొరుకు
బోవుచుండెను. ఉత్తరదేశవ
దూ దేశమునకు వచ్చిన వ
యార్యులును ఇట్టివారే.
లంబాడీలును, అప్పుడప్పుడు
తిరుగుచు, చిన్నకత్తులు మొద
దెనుఁగు దేశమునకు వచ్చుచుం
వంటి మూకలును ఇటువంటి
కాలముగడిచిన తరువాత ఇట్టి
రమునుమాని యొకానొక ప్ర
తముగ వసతిచేయును. అప్ప
నాజనులపేరు వచ్చును. కళింగ
ద్రావిడులు మొదలయిన
పుట్టిరి. వారుసంచారముచేయ
నిలిచిపోయిన దేశములకు
ఆంధ్రదేశము, ద్రవిడదేశ
వచ్చెను. సంస్కృతమునందు
జనులనామములే వాడెదరు.
మద్రకులు అనఁగా మద్రదేశ
అనఁగా కళింగదేశము, ఆంధ్

ఆంధ్రదేశము అని యర్థము. ఈవిధముగ నారణ్యమునందుఁ దిరుగు వారిలో నుండి గొప్పసంఘములును, గ్రామములును, పట్టణములును, దేశములును పుట్టుచున్నవి. దీని వివరమంతయు 'సంఘమును' గుఱించి వ్రాయునప్పుడు తెలుపఁబడును. అనాగరిక సంఘమును గురించి యింకను తెలిసికొనఁ గోరువారు 'ఆదిమమానవులు', 'ఆరణ్యములు' అను వ్యాసములఁ జూచునది. [కో. ల.

**అనాగ్జగోరస్.** (క్రీ. పూ ౫౦౦-౪౨౮) గ్రీకుతత్త్వవేత్త. ఇతఁ డాసియా మైనరులోని క్లేజోమేనె యను పట్టణమునందు క్రీ. పూ. ౫౦౦-వ సంవత్సర ప్రాంతమున జన్మించెను. ౪౬౪-౪౬౨ ప్రాంతమున నితఁడు గ్రీసుదేశపు రాజధానియగు అథెన్సు పట్టణమునకుఁ బోయి, ముప్పది సంవత్సరముల వఱకును అచ్చటనేయుండి తన విద్యామహిమచే మిక్కిలి కీర్తివడసెను. పెరికల్సు, యురిపైడ్సు అను పండితు లితని శిష్యులు. సాక్రెటీసుకూడ నితని శిష్యుఁడని కొందఱ యభిప్రాయము. జ్యోతిషశాస్త్రమందును, గణితశాస్త్రమందును ఇతఁడు మిక్కిలి విఖ్యాతి చెందుటయేగాక తత్త్వవిచార శీలుఁడనియు, సదాచారసంపన్నుఁడనియు మిగులఁ బూజ్యత వడసెను. వాడుకలోనున్న మతముల నపహసించెనన్న యపరాధము మోపి యాతనిపై నొక యభియోగము తెచ్చిరి. కాని యితని శిష్యుఁడైన పెరికల్సుయొక్క వక్తృత్వమహిమచే నితఁడు నిర్దోషియని విడువఁబడెను. అథెన్సులోనుండుట మంచిదికాదని యాతఁడు క్రీ. పూ. ౪౩౪-౪౩౩ ప్రాంతమున ల్యాంప్స్యాకసుకుఁ బోయెను. అచ్చటనే యితఁడు క్రీ. పూ. ౪౨౮ ప్రాంతమునఁ గీర్తిశేషుఁడయ్యెను.

ఇతని సిద్ధాంతానుసారముగాఁ బ్రపంచమందలి భూతసంఖ్య నాలుగుగాని, అయిదుగాని కాదు. అది యసంఖ్యము. నాలుగైదు భూతములలోనుండి యసంఖ్యవస్తుజాల ముత్పన్నమైనదనుట యసంగతము. ఇవన్నియు ననాదులనవచ్చును. మొదట నివన్నియు నొకదానితో నొకటికలిసి వేఱు వేఱుగ గుర్తించుటకు వీలులేకుండఁగ నుండెను. కాని గతి (Motion) రూపమైన చైతన్య మందుఁ బ్రవేశించి, వీని నన్నిటిని విడఁదీసి సృష్టియొక్క యభివృద్ధికిఁ గారణమయ్యెను. ఏ వస్తువును నశింపదు. 'చావు' అనఁగా ఒకచోట నంతవఱకుఁ గూడియున్న వస్తువులు వేఱగుట. పుట్టుకయనఁగా నంతవఱకు వేఱుగనున్న వస్తువులు కలియుట.

**అనాదిశైవమతము.** శివుఁడు గుణవికల్పుఁడుగాఁడని తెలిసికొని విభూతి, రుద్రాక్షలు, గురులింగవేషమును ధరించి అర్చించినచో ఆత్మ పరాత్పరునియందే బద్ధమై, మోక్షము కలుగునని ఈ మతసిద్ధాంతము.

**అనాధృష్యుఁడు.** ధృతరాష్ట్రుని యొక్క నూర్గురు పుత్రులలో నొక్కఁడు.

**అనాయువు.** మాఱుపేరు అనుగ. తండ్రి దక్షప్రజాపతి. మగఁడు కశ్యపుఁడు.

**అనార్యులు:** ఆర్యులు కానివారు. హిమాలయమునకును వింధ్యపర్వతమునకును నడుమనున్న ప్రదేశ మార్యావర్తమనియు నందుండు వారార్యులనియు, తదితరు లనార్యులనియుఁ జెప్పఁబడుచుండిరి. హిందూదేశము నందు నార్యులరాకకు పూర్వముండు మూల నివాసులను ఆర్యులు అనార్యులనుచుండిరి. ఇటీవల పారసీక పాశ్చాత్త్యులనేకులును ఆర్య శాఖవారే యనియు సిద్ధాంతీకరింపఁబడినది. గనుక, ఈ ఆర్యశాఖల్లోఁ జేరనివారిని ఇప్పటి పాశ్చాత్త్యులు అనార్యు లనియెదరు. ఆర్యులెవరు, 'అనార్యులెవరు అన్న విషయము నవిస్తరముగ 'ఆర్యులు' అన్న శబ్దమునొద్ద వివరింపఁబడును.

**అనాహడ్గడతహస్సీల్** (లేక బర్నాలా). ఇది పటియాల సంస్థానమునందలి అనాహడ్గడ నిజామతులోని ఒక తాలూకా. ఈ తాలూకా వైశాల్యము ౩౪౬ చదరపు మైళ్లు. ఇందలి జనసంఖ్య ౧౦౫౯౮౯. ఇందు అనాహడ్గడము (జనసంఖ్య, ౬౯౦౫), హాడియాయా (౫౪౧౪) ఛాదరు (౭౭౧౦) అను గ్రామములును, ౮౬ పల్లెలును గలవు. ఈ తాలూకా ౧౮౦౦౦౦ రూపా చున్నది.

**అనాహడ్గడ** పంజాబునందున్న పాటియాల నందలి ఒక జిల్లా. దీని వైశా చదరపుమైళ్లు. ఇందలి జనసం ఇందు గోవిందగడము, భాదరు హాడియాయా అను నాలుగు గ్రా ౪౫౪ పల్లెలున్నవి. ఈ జిల్లా లేక అనాహడ్గడ మనునది మ ఈజిల్లా ౭౨౦,౦౦౦రూపాయిలు

**అనిగేరు.** గోదావరిజి ఏజన్సీ డివిజనులోని ఒకపల్లె. జన రు. ౮౦ లు క్విట్రెంటు చెల్లిం గ్రామముల ముఠాకు నిది ముఖ్య ముఠాదారు పూర్వపు జగదంగీ వంశజుఁడు. ౧౮౪౭ లో జగద దారుఁడు తిరుగఁబడి మన్నబు కొనెను. అతని కుమారుఁడ సమయమున తన యావచ్ఛ గవర్నమెంటువారికి సాయముచే వినియోగించినందున అతని ప్రభుత్వమువారి ముఠాను డచ్చ తీసి ఈతని కిచ్చిరి.

**అనితల్లి.** కాటయ గూతురు. కాశీఖండమును కృ భద్రారెడ్డికి భార్య. ఈమె తల్లి

బిక. ఈమె తండ్రియైన కాటయవేమారెడ్డి కొండవీటి యనపోతారెడ్డికి (౧౩౫౭-౧౩౬౨) అల్లుఁడు, మేనల్లుఁడు. కుమారగిరిరెడ్డికిఁ (౧౩౮౦-౧౪౦౦) చెల్లెల పెనిమిటి, మంత్రి. కుమారగిరి కాటయవేమునకు రాజమహేంద్రవరము రాజ్యమిచ్చెను.* కాటయవేముని తరువాత నాతని పుత్రుఁడైన కుమారగిరి రాజమహేంద్రమునకు రాజయ్యెను. ఆతని తరువాత నాతని చెల్లెలైన అనతల్లిని, ఆమె మామగారైన అల్లాడరెడ్డి శత్రురాజులను ఓడించి రాజ్యముపైఁ గూర్చుండఁబెట్టెను. ఈమె మామగారైన అల్లాడరెడ్డియు, బావగారైన వేమారెడ్డియు, భర్తయైన వీరభద్రారెడ్డియు ఈమెకుఁగాను రాజమహేంద్రవర రాజ్యము చేయుచున్నట్లు గానవచ్చుచున్నది. ఈమె శా. శ. ౧౩౪౫ (క్రీ. శ. ౧౪౨౩) లో నొక బ్రాహ్మణునకుఁ గెలువచేఱువను గ్రామము దానమిచ్చుచు నొక తామ్రశాసనము వ్రాయించెను. అది యీ మధ్య బయిటఁబడినది.† దానివలనఁ బైసంగతులు వెల్లడి యగుచున్నవి. దానము తీసికొనిన బ్రాహ్మణుఁడు కళానాథభట్టు కుమారుఁడైన పరహితాచార్యుఁడు. ఇతఁడు వైద్యశాస్త్రమునందు మిక్కిలి ప్రవీణుఁడు. ఈమె ఆ సంవత్సరముననే దేవబ్రాహ్మణుల యగ్రహారముల మీఁది పన్ను తీసివేసినదని యీ శాసనమునందే వ్రాయఁబడి యున్నది. శ్రీనాథుఁడు కాశీఖండమునందు ఈ అనితల్లిని ఇట్లు వర్ణించియున్నాఁడు:—

మ. మనుతుల్యుండగుఁ గాటభూవరుని వే
మక్ష్మాతలాధీశు నం
దనఁ బాణిగ్రహణంబుచేసి ప్రియమొం
దన్ వీరభద్రేశ్వరుం
డనితల్లి న్వినతామతల్లి నుదయా
స్త్రాద్రీంద్ర సీమావనీ
ఘనసామ్రాజ్య సమర్థ సుప్రథిత సా
క్షాదిందిరా దేవతన్.

ఈ పేరునకు 'అనతల్లి' 'అన్నతల్లి' యను మాఱురూపములు కలవు.

## అనియాది గణపతిదేవుఁడు.

నియోగి బ్రాహ్మణుఁడు. మూలనామాత్యుని పుత్రుఁడు. శివయోగసారమను వేదాంత గ్రంథమును రచించెను. ఇందు పూర్వోత్తర భాగములు కలిసి యెనిమిది యాశ్వాసములు గలవు. ఈకవికాలము తెలియదు. ఇన్నూఱు సంవత్సరములకు ముందునున్నవాఁడని వీరేశలింగముగారు వ్రాసియున్నారు.

## అనిరుద్ధుఁడు.

౧ కల్పాదియందు బ్రహ్మను పుట్టించుటకై నారాయణుఁడెత్తిన యవతారము.

---

* Epigraphia Indica Vol. IV. p. 318.

† ఈ శాసనమును కాకినాడ వాస్తవ్యులగు శ్రీ దుగ్గిరాల సూర్యప్రకాశరావుగారు క్రొత్తగా, కాకినాడ తాలూకాలోని ఆర్యవట గ్రామమునందున్న శ్రీ కాశీనాథ భట్ల సుబ్రహ్మణ్యముగారి యొద్దనుండి సంపాదించి, ఆంధ్రభారతి, ౩-వ సంపుటము, ౩౪౫ పుటలోఁ బ్రకటించిరి. అది పిదప ఆంధ్ర పరిషద్ పత్రిక, ౨-వ సంపుటము, ౯౩-వ పుటలో శాసనముయొక్క పటముతోఁగూడఁ బ్రకటింపఁబడినది. ఈ శాసనము వలనఁ జరిత్రకారులకు నూతన విషయము లనేకములు తెలిసినవి.

౨. (చం. వం.) యాదవకులజుఁడు. శ్రీ కృష్ణుని కుమారుఁడైన ప్రద్యుమ్ననకును, రుక్మి కూఁతుఁరైన రుక్మవతికిని కుమారుఁడు. ఇతఁడు నాగాయుతబలుఁడు, మహారథుఁడు. రుక్మిరాజు పౌత్రియైన రోచన యీతనిభార్య. ఈ వివాహకాలమందు ఘోరమైనపోరు జరిగెను (చూ. 'రోచన'). ఈమెవలన నితనికి వజ్రుఁడను పుత్రుఁడు పుట్టెను (భాగ. ౧౦.౯౦). బాణాసురునికన్య ఉష యను నామె యీతని ద్వితీయభార్య. ఈమెను గుఱించి యాదవులకును బాణాసురునకును పోరుజరిగెను. (చూఁడు ఉష).

**అనిర్దేశ్యము.** యజ్ఞసంబంధమైన యొక అగ్ని పేరు.

**అనిలుఁడు.** ౧. అష్టవసువులలో నొక్కఁడు. ఈ మన్వంతరమునందు వాయవ్య దిక్కునకునధిపతి. ఈశబ్దమునకు అనీలుఁడను రూపము గూడఁగలదు.

౨. శ్రీ కృష్ణునకు మిత్రవిందవలనఁ గలిగిన పుత్రులలో నొక్కఁడు.

**అనీకుఁడు.** (చం. వం.) యాదవుఁడు, వసుదేవుని తమ్ముఁడు.

**అనీహుఁడు.** (సూ. వం.) శ్రీరాముని వంశమునందుఁ బుట్టిన దేహీనీకుని పుత్రుఁడు. నామాంతరము అహీనకుఁడు. ......పుత్రుఁడు, సహస్రాశ్వుఁడు.

**అనుకరణము.** ఒక
కొనుట యనుకరణమనఁబడ
ణము ముఖ్యముగ రెండువిధ
కరణము, వ్యాపారానుకరణ
కరణ మనఁగా నొకరు పలికి
వ్యాపారానుకరణమనిన
చేయుట. అనుకరణము మ
మనియు, బుద్ధిపూర్వకమనియ
ములు. పిల్లవాఁడు తల్లిదండ్రు
మరలఁజెప్పఁబోవుట స్వాభా
ఇట్టిది చిలుక గోరింకలవంటి
గొంతవఱకుఁ గలదు. సంగీత
వులవారి ధ్వనివలె ధ్వనిచేయ
బుద్ధిపూర్వకము. శబ్దానుక
వ్యాపారానుకరణమునందును
స్వాభావిక ప్రవృత్తికలదు. న
శిశువునకు అనుకరణ ప్రవృ
డార్విన్ అను శాస్త్రిజ్ఞుఁడు
స్వాభావిక ప్రవృత్తియే మా
విద్యలు నేర్చుకొనుటకు మొ
నది. పిల్లవానికిఁ జదువుచెప్ప
వికమైన అనుకరణ ప్రవృత్తిని
దానిని క్రమముగ నుపయో
పిల్లవానికి శీఘ్రముగను,
భాషయు విద్యలును పట్టుపఁ
మైన యుచ్చారణచేయలేని
నేర్చుకొనిన పిల్లల యుచ్చార
పరిశుద్ధములుగఁ జేయుట వే

యందఱకు విదితమే. సంగీత విద్యయం దును, వక్తృత్వకళయందును శబ్దానుకరణ ప్రవృత్తి యెక్కువగ నుపయోగపడును. కొంద ఱితరపురుషుల మాటలను, పశు పక్ష్యాదికముల ధ్వనులను కూడ ననుకరించె దరు. వ్యాపారానుకరణ ప్రవృత్తి భరత శాస్త్రాభ్యాసమునకు మూలాధారము. నాట కములో రసపోషణ చేయుటకై రెండు విధ ములయిన అనుకరణములును గావలయును. పాత్రోచితమైన భాషయు, నటనయు నుండ వలయును. గ్రంథాదులలో వచ్చు జాతీ యము లన్నియు ననుకరణములే. వ్యాపార ప్రవృత్తియే మానవుని స్వభావమును, ఆచర ణను నిశ్చయ పఱచును. మంచి సహవా సము కలవారు మంచి వారగుటయుఁ జెడ్డ సహవాసము గలవారు చెడ్డవారగుటయు సర్వసాధారణము. పైని రెండు విధము లయిన యను కరణములు చెప్పినప్పటికి నన్య విధములు లేకపోలేదు. స్వరూపానుకర ణమే చిత్రవిద్య. ఆకు పటమును జూచి నిజ మైన ఆకనియు, మానవుని పటముఁ జూచి నిజమైన మానవుఁడనియు భ్రమగల్గుగు నట్లు చేయుటయే చిత్రకారుని యుద్దేశము.

అనుకరణప్రియత్వ మానవులయందే గాక పక్ష్యాదులకుఁ గూడ నుండును. చిలుక మొద లైనవి మనము చెప్పిన మాటలు మరలఁ జెప్పును. కోతులు మానవ కృతుల నను కరించును. కొన్ని పురుగులు, శత్రువుల నుండి తప్పించుకొనుటకై, తాముండు గడ్డి యొక్క రంగునుగాని, మఱి బలవత్తరములైన పురుగుల రూపమును గాని అనుకరించును.

**అనుక్రమణికలు.** అనఁగా విష యసూచికలు. ముఖ్యముగ వేదములయొక్క విషయ సూచికలకు అనుక్రమణికా నామము చెల్లుచున్నది. సంస్కృతభాషలో, అను క్రమణికలన్నగా వేదానుక్రమణిక లనియే యర్థము. సంహితాభాగములందు క్రొత్త మంత్రములు చేరకుండగను,ఉండినవి లోపింప కుండగను ఉండు నిమిత్తమై అనుక్రమణిక లేర్పడినవి. వానిలో మంత్రమండలి ప్రథమ శబ్దము ఋషి దేవత చంధస్సు మొదలగువాని పేళ్లు, మంత్రసంఖ్య జెప్పఁబడును.

వేదములయొక్క వేఱువేఱు శాఖలకు వేఱువేఱు అనుక్రమణిక లేర్పఱుపఁబడినవి. సాయణాచార్యుని కాలమునందుఁ బెక్కు అనుక్రమణిక లున్నట్లు కానవచ్చుచున్నది. అప్పుడున్న యనుక్రమణిక లిప్పుడు లోపించి నవి. ఋగ్వేదమునకు ౭ అనుక్రమణికలు గలవు. అందు నైదు, శౌనకప్రణీతములు, ఒకటి కాత్యాయనరచితము. మిగిలిన దానికి గర్తయెవఁడో తెలియదు.

బృహద్దేవతానుక్రమణి అనునది శౌనక రచితము. అందు. యాస్కుఁడు పేర్కొనఁ బడినందున నది యాస్కునితరువాత వ్రాయఁ బడెనని యూహింపవచ్చును. యజుర్వే

దమునకు మూఁడు అనుక్రమణులు కలవు. ఆత్రేయ శాఖకొకటి, చారాయణీయ శాఖకొకటి, మాధ్యందినశాఖకొకటి.

ఆత్రేయానుక్రమణిలోఁజూడఁ మొదట దానిని వైశంపాయనుఁడు యాస్కునకును, యాస్కుఁడు తిత్తిరి ఋషికిని, తిత్తిరి ఉఖునకును చెప్పినట్లున్నది. సామవేదమునకు రెండు అనుక్రమణికలుగలవు. మొదటిది నైగేయానామృత్వార్షము, రెండవది నైగేయానామృత్వు దైవతము. శౌషోక్తమైన యనుక్రమణి యొకటి గలదు. అది మిక్కిలి పురాతనమైనది గాదని పండితుల యభిప్రాయము. అథర్వవేదమునకుఁ గేవల మొక యనుక్రమణి గలదు. దానికి బృహత్సర్వానుక్రమణి యని పేరు.

**అనుగీత.** వేదాంత విషయమైన గ్రంథము. భారతమునందు నశ్వమేధపర్వమున నున్నది. ఇందు ౩౬ అధ్యాయములు కలవు. అర్జునుఁడు భగవద్గీతలోని బోధమరిచి తిని, మరలఁజెప్పుమనికోరఁగా శ్రీకృష్ణుఁడు చెప్పెను. బ్రహ్మగీతయు నిందే యిమిడి యున్నది.

**అనుఁడు.** (చం. వం.) నహుష పుత్రుఁడైన యయాతిరాజునకు శర్మిష్ఠవలనఁ బుట్టిన ముగ్గురు పుత్రులలోఁ బెద్దవాఁడు. యదువువలెనే యీతఁడును తండ్రియొక్క ముసలితనముఁ దీసికొనుటకు నొప్పుకొనని నందున ముఖ్యరాజ్యాధి కారముఁ బోఁగొట్టు

కొని యుత్తర దిక్కున ను
నధిపతియయ్యెను. (మత్స్య
పుత్రులు సభానర, చక్షు,

౨. (చం. వం.) య
యొక్క జ్యామఘు వంశాంత
మందలి కురువంశ రాజు పు
రుఁడు పురుహోత్రుఁడు.

౩. (చం. వం.) యాద
తర్గతమైన అంధక కులమ
రోముఁడను రాజునకుఁ బు
పుత్రుఁడు అంధకుఁడు.

**అనుప దేవుఁడు.**
యాదవుఁడు, దేవకుని కొడు

౨. (చం. వం.) యా
రుని రెండవ కొడుకు.

**అనుపావృత్తము**
దేశము. (భార. భీష్మ. అ.

**అను బ్రాహ్మణము**
సదృశ గ్రంథములు. సా
ములకును యాజ్ఞవల్క్యాది
బ్రాహ్మణ సదృశగ్రంథము
బ్రాహ్మణము అనిపేరు.

**అనుభవ సారము**
సోమనాథ కవి కృతము. శై
భక్తి యుత్కర్షయే ఇందు వ

**అనుభూతిస్వరూపాచార్యుఁడు:**
సారస్వత వ్యాకరణమును రచించిన యతఁడని వాడుక. ఇతనిగూర్చి యొకకథగలదు. రాజసభ మధ్యమున నీతఁ డొక నాఁడు అపశబ్దప్రయోగము చేయ దానికి నాధారము చూపు మన నింటికిఁ బోయి సరస్వతి నారాధించెను. ఆమె ప్రసన్నురాలై యొక వ్యాకరణము నిచ్చెను.

ఈతఁడు సారస్వతవ్యాకరణము వ్రాయలేదనియు దానిమీఁద 'ప్రక్రియ' మాత్రము వ్రాసెననియు నీతఁడు క్రీ. శ. ౧౨౫౦ కిఁ దరువాతను ౧౪౫౦ కిఁ దరువాతను ఉండెననియుఁ దజ్ఞుల యభిప్రాయము.*

**అనుభూతిప్రకాశిక.** ఈ గ్రంథము సకలామ్నాయ కోవిదుండగు విద్యారణ్యమునీశ్వర విరచితము. బ్రహ్మజిజ్ఞాసువునకు నుపనిషదర్థజ్ఞానము నిస్సందియముగ సంభవడుటకై యీ గ్రంథ ముపదేశింపఁబడియె.

వేదచతుష్టయ శిరోవతంసంబులగు నైతరేయ తైత్తిరీయ చాంధోగ్య ముండకోపనిషత్తాత్పర్యంబుల నధ్యాయ సప్తకంబుచేఁ బ్రిప్రథమంబున నిరూపించి పిమ్మటఁ బదుమూఁడధ్యాయంబులచే వేదచతుష్టయాంతర్గతంబగు నుపనిషద్ద్వాదశ తాత్పర్యంబును వ్యక్తీకరించె. ఈ విషయము విద్యారణ్యులచే ననుభూతి ప్రకాశికయొక్క యెనిమిదవ యధ్యాయమునందలి మొదటి రెండు శ్లోకములచే వివరింపఁబడియున్నది:-

"ఐతరేయే తైత్తిరీయే ఛాందోగ్యేఽథర్వణేచయత్
తత్త్వంచతుర్వేదవిద్యాప్రకాశే తత్సమీరితమ్
అనుభూతిప్రకాశేఽథ కాషీతక్యాదినామసు
చతుర్వేదాంగశాఖాసు యత్తత్త్వం తదుదీర్యతే॥"

ఇట్టులీగ్రంథ మిరువది యధ్యాయంబులఁ గల్గి మృదుమధురశైలితోనొప్పు రెండువేల యెనిమిదివందలమైదుయనుష్టుప్పు శ్లోకములతో నతిశయిల్లుచున్నయది. ఇరువదియధ్యాయంబులచేఁ జతుర్వేదాంతర్గతంబగు నిరువది ప్రకరణంబుల తాత్పర్యము వివరింపఁబడుచున్నను బ్రతియధ్యాయమును సంక్షేపంబుగనో విపులంబుగనో యద్వైతతత్త్వమునే ప్రతిపాదింపుచున్నయది. ప్రకరణ వైచిత్ర్యము శిష్యవైచిత్ర్యమును ననుసరించి యున్నది గాని తత్త్వవైచిత్ర్యమువలన నెంతమాత్రమును గలుగలేదు. నాలుగవ వేదమందలి యిరువది ప్రకరణంబులు నత్యంత భిన్నంబులుగా నుండినను బర్యవసానమున నద్వైతతత్త్వమునే ప్రతిపాదించుటచే నిరువదియధ్యాయంబులును బర్యవసానంబున నొక్కయంశంబగు నద్వైత తత్త్వమును బ్రకటింపుచు సర్వోపనిషత్సామరస్యంబును సకలవేదసామరస్యంబును వేయివిధంబుల సిద్ధాంతీకరింపుచున్నయవి.

మొదటి యధ్యాయంబున నైతరేయ ద్వితీయారణ్యకంబును, రెండవ యధ్యాయం

*Systems of Sanskrit Grammar by Belwelkar, p. 96.

బును. తైత్తిరీయాంతర్గతంబగు బ్రహ్మా
వల్లియు, మూఁడు నాలుగైదవ యధ్యాయం
బులచే, గ్రమంబుగ ఛాందోగ్యంబు నందలి
యుద్ధాలక సనత్కుమార ప్రజాపతి యుప
దేశంబులును, ఆరేడవ యధ్యాయంబులచే
ముండకము నందలియాంగిర పిప్పలాదోప
దేశంబులును, ఎనిమిది తొమ్మిదవ యధ్యా
యంబులచే ఋగ్వేద కౌషీతకి శాఖయందలి
యింద్రాజాత శత్రూపదేశంబులును, పది
యవ యధ్యాయంబున మైత్రాయణ్యుపని
షత్తునందలి శాకాయన్యోపదేశంబును, పదు
నొకండవ యధ్యాయంబున కఠవల్లి యందలి
యమోపదేశంబును, పన్నెండవ యధ్యా
యంబున శ్వేతాశ్వతరోపనిషత్తును, పదు
మూఁడవ యధ్యాయము మొదలు పదునెని
మిదియవ యధ్యాయము వఱకునుంగల
యాఱధ్యాయంబుల యందును గ్రమంబుఁగ
బృహదారణ్యకాంతర్గతంబులగు మూఁడవ
యధ్యాయ నాల్గవ బ్రాహ్మణంబు, నాలవ
యధ్యాయము నందలి యజాతశత్రుబాలాకి
సంవాదము, యాజ్ఞవల్క్య మైత్రేయ
సంవాదము, అథర్వణోపదేశంబగు మధు
విద్యలును, ఐదవ యధ్యాయంబు నందలి
యాజ్ఞవల్క్య శ్వేలాదుల వాదకథయు,
నాఱవ యధ్యాయమందలి యాజ్ఞవల్క్య
జనక సంవాదంబును, పందొమ్మిదవ యధ్యా
యంబున సామవేద తలవకార శాఖయును;
ఇరువదియవ యధ్యాయంబున నథర్వణోత్తర
తాపినియును బూర్ణముగ
యవ్వాని తాత్పర్యము సుస్థ
లముగను, నిస్సంశయంబుగన
గను సిద్ధాంతీకరింపఁబడినది.

**అనుమతి.** ౧ అంగి
కర్దమ కన్య శ్రద్ధకును బుట్టిన
లలోఁ జిన్నది.

౨. ద్వాదశాదిత్యులలో
వాని భార్య.

౩. శాల్మలి ద్వీపమునంద
నది.

౪. ఒక బ్రహ్మర్షి (చూ.

**అనుముకొండ**
చూడు ఓరుగల్లు.

**అనాస.** ఇది ఏకదళ
జేరిన యొకానొక కుటుంబము
చినది. ఈ మొక్క యొక్క
బమునకు సంబంధించినవి వ
గానరావు. అనాస మొక్కయ
నుండి పెరుగుచున్నది కాదు
ఖండమును గనుఁగొనిన పిదప
పా, ఆఫ్రికా, ఆసియా ఖండ
పడెను.

అనాస మిగుల రుచివంతవ
కరమును నగు ఫలజాతులలోఁ
ఫలము ప్రప్రథమమున ౧౫౧

ములో గాన్‌కేటి హార్నాండజ్ (Goncat Hernandez) అను వానిద్వారా ఐరోపా దేశమునకును, ౧౫౯౪-వ సంవత్సరములో పోర్చుగీసు వారిద్వారా బంగాళమునకును గొంపోఁబడినది. అమెరికా నుండియే తేఁబడిన బంగాళా దుంపలవలె నియ్యది ప్రారంభమునఁగూడ హేయముగఁ జూడఁబడక శీఘ్రకాలములో దేశమంతటను వాడుకలోనికి వచ్చినది. భరత ఖండమున గల నానావిధ దేశభాషలలోఁ గూడ నంతఁగా భేదములేక యొకే సామాన్య నామముతోఁ జెప్పఁబడుట కిదియే కారణము.

అనాస మొక్కయొక్క ప్రకాండము మిక్కిలి చిన్నది. ఆకులొకదాని మొదలులో నొకటి యిమిడి గుబురుగను, వానిలోపల నీ రెక్కువగా నుండుటచే దట్టముగను ఉండును. వృంతము ప్రకాండము చివరనున్నది. పుష్పములు, మిథునములు, సరాళము, పుష్పకోశము, ౩. దళవలయము, ౩. కింజల్కములు, ౬. అండకోశములు చేటికలు కలిసి కండ గలిగిన యొక మిశ్రమ ఫలమగును, గింజలుండవు. పండులో మధ్య త్రొయ్యవలె నున్నది వృంతము. ఇది పైకివచ్చి తిరిగి ఆకులు వేయును. ఈ తలను బాతియే తిరిగి మొక్కలన్ను బెంచెదరు.

పంటలో కొంచెము భేదముండినను సాధారణముగ నన్ని భూములును అనాస పంట కర్హము లే. కాని గరువ నేలలు మంచివి. రెండు పాళ్ళు బంకమన్ను ఒకపాలు ఇసుక గలిగిన భూములును భూమి మిక్కిలి యనుకూలము లని కొందఱ అనుభవజ్ఞుల యభిప్రాయము. సింహాచలమునందు చలువ కొండల చరియలందు, నేల నంతరములుగఁ జేసి వీనిని విశేషముగ సాగుచేయుచున్నారు.

ఈ వ్యవసాయము చేయు భూమిచుట్టును, కంచగా కిత్తి నారచెట్లు వేయుటవలన ఈ తోటలకు చెఱుపు గలుగ కుండుటయేగాక కిత్తనార వలన నెంతయో లాభముగలదు. భూమిని చక్కఁగ దున్ని మధ్యమధ్య రెండడుగుల వెడల్పున గోతులు త్రవ్వి మంచి యెరువువేసి అందు మొక్కలను బాతిపెట్టవలయును. అనాస మొక్కలును నాటుటకు సాధారణముగా శ్రావణ మాసము మంచి సమయము. అపుడే కాపు పూర్తియగుట వలన పిల్కలు విశేషముగ లభించును. మొక్కల మొదటగాని, కాయలమీఁదగాని కాయలమీఁద క్రిందనుగాని పుట్టు పిల్కలను గోసి నాటిన యెడల మొక్కలగును. ప్రతి అనాసపండునకును నెత్తిమీఁద నొకపిలకయు, కాడచివర అనఁగా కాయ మొదట పది పండ్రెండు పిలకలును ఉండును. ఒక్కొక్క పిలకనే ప్రత్యేకముగా పాతింపవలెను. అనాసచెట్లు తేమ యున్నంత మాత్రముననే పెరుగు స్వభావము గలవిగాన నీ రెక్కువ లేకుండునట్లు జాగ్రత్తగాఁ జూడవలెను.

శేల యెంత సారవంతముగా నున్న నంత పెద్దపండ్లు కాఁగలవు. చీకిన గుఱ్ఱపు యెరువు పరిశస్తము. ప్రతిసంవత్సరమును ఎరువు వేయు చుండుట మంచిది. ఎముకల పొడి గలుపు టయు నాచారముగా నున్నది. ఎరువు వేసిన తరువాత నీరు తఱుచుగఁ గట్టవలెను.

ఈ తోటలకు ఎలుకల బాధ తప్ప మరియే తెగుళ్ళ బాధయు నున్నట్టులేదు. సామాన్య ముగా ఈ వర్షకాలమున పాతిన మీాదటి వేసవికాలమునకు కోతకు సిద్ధమగును. అనఁగా నిదిరెండేండ్ల పంట. కాపు పట్టిన తరువాత నొకేచోట ౕ, ౪ సంవత్సరముల కంటె నెక్కువకాల ముంచినయెడల కాయలు చిన్నవయి పోవును.

అనాస పండ్ల నెగుమతి చేయునపుడు దూరము విశేషముగా నున్నయెడల పండ్ల రసమును తయారుచేసి పంపనగును. పై పెచ్చును గింజలను తీసివేసి, యంత్ర సాహా య్యమునగాని మఱియే విధముగానైనగాని రసమును పిండి, సుమారు ౧౮౦ డిగ్రీలు ఫారన్‌హీటు వేడి యెక్కువఱకు కాచి ఫ్లా నలు గుడ్డతో వడపోయవలెను. ఈ రస మును సీసాల కెక్కించి, ఏ దేశమున కయి నను పంపవచ్చును.

అనాసపండ్ల రసమును బంచదారలోఁ గలిపి త్రాగిన నిస్త్రాణను బోఁగొట్టును; కాని విస్తారము త్రాగినచో మూత్రవ్యా ధులకుఁ గారణ మగునందురు. పచ్చికాయల రసమును, ఆకుల రసమును జేయును. శ్లేష్మవ్యాధిగల వ నియమప్రకారము కొంత ఈ పుచ్చుకొనిన యారోగ్యవం

నీడను పండిన పండ్లు విక్రయమున కనుకూలము ఎండనఁ బండినవి మిక్కిలి లండను పట్టణమునకు విస్తారవ కొవరీ ద్వీపముల నుండి ఎగు కాని పిల్లట్టు, అస్సాము అనా లయినవి. అన్నిటి కన్నను మాటిస అను రకము మిక్కి నది.

అనాస పండ్లలో 'క్యూ' సుప్రసిద్ధమైన జాతి. కాయ డును. సింహళ దేశమున నీ ౨౪ పౌనులు తూగినదఁట. ఈ యాకులకు మొదట కక్కులు ౪, ౫ ఏండ్లు ఈ దేశమున టికి, అవి బయలు దేరును.

తక్కిన చెట్లవలె ఈ అనా ముగా పోవు భాగమేదియు లే క్కల ఆకులనుండి మంచి నా నార గట్టిగను, సున్నగను, నుండునుగాని ఆకులనుండి న కష్టము; వానిని ౧౪ దిన నానినిచ్చి యటుపైన నార అది సులభ సాధ్యంబయ్యెనా

క్కువ వాడుకలో నుండి యుండును. ౧౮౩౯ సంవత్సరములో మిస్ డేవి యను నామె డక్కా నేతగాండ్రను బోధించి ఈ నారతో మిక్కిలి రమ్యమగు వస్త్రముల నేయించి వ్యవసాయ సంఘము వారి యొద్ద నుండి బహుమతి పొందెను. ఈ నారను నూలు పట్టులలోఁగూడ కలిపినేయవచ్చును. ఇది నీటిలోఁ జీకిపోకుండ చిరకాల ముండుటచే నొక్కొక్కప్పుడు, చేపలు పట్టుకొనుటకు గాలముల తాళ్లు దానితో నేయుచుందురు. నారతో మంచి బట్టల నేయుదురు. మొట్టమొదట ఈ నార విస్తారముగా పడమటి సముద్ర తీరమునుండియు, బంగాళా నుండియు నెగుమతి యగుచుండెను. కాని దూదివర్తక మెక్కువయిన తరువాత, ఈ నార ఎగుమతితగ్గి ధోవతిగా మారుట నిలిచి పోయినది.

ఒక యకరము భూమిలో ౨౦౦౦౦ చెట్లు పట్టును. చెట్టున కొక పండువంతున ఇరువదివేల పండ్లవలన సుమారు రు ౩౧౨ లు రాబడిగలదు. నారవలన రు ౫౦౦లు రాఁగలదట. మొత్తము మీఁద యకరమునకు ఎనిమిది వందల రూపాయల ఫలితము కనుపడుచున్నది.

## అనుమానము

(హిందూ తర్కశాస్త్రము ననుసరించి)

మన నైయాయికులచే నంగీకరింపఁబడిన నాలుగు ప్రమాణములలో నిది రెండవది. ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, శబ్దము అనునవి నాలుగు ప్రమాణములు. ప్రమయనఁగా యథార్థానుభవము, నిజమైన జ్ఞానము. ప్రమకుఁ గారణము ప్రమాణము. అనఁగా నే సాధనంబులవలన మనకు యథార్థజ్ఞానము కలుగునో, వానికిఁ బ్రమాణము లని పేరు. అనుమాన మనునది సాధనము. అందువలనఁ గలుగు జ్ఞానమును 'అనుమితి' యందురు.

అనుమాన స్వభావము

మనము దూరమందున్న యొకానొక పర్వతముమీఁద, పొగలేవఁగాఁ జూచి యా పర్వతమునందు నగ్ని కలదని యూహించుచున్నాము. ఇట్టి జ్ఞానమునకు 'అనుమితి' యని పేరు. ఇందుఁ బర్వతమునకుఁ బక్షమనియు, ధూమమునకు 'హేతువు' లేక 'లింగ' మనియు, అగ్నికి 'సాధ్య' మనియు సంజ్ఞలు. ఇందుఁ బ్రత్యక్షమైన ధూమముచే నప్రత్యక్షమైన యగ్ని సాధింపఁబడినది. కావున నే వాత్స్యాయనుఁడు 'ప్రత్యక్షముచే నప్రత్యక్ష వస్తువుయొక్క సంబంధమును సాధించుట అనుమానము' అని తన వార్తికములోఁ జెప్పియున్నాఁడు.*

ఇచ్చటి యనుమానమునకు, 'హేతువు' (లేక లింగము) అనఁబడు ధూమము కారణ

*'ప్రత్యక్షేణా ప్రత్యక్షస్యసంబుధస్య ప్రతిపత్తిః' చూఁడు గౌతమ సూత్రము ౧,౧,౩ మీఁది వాత్స్యాయన వృత్తి.

్రైనను, ధూమమునకును అగ్నికిని గల సంబంధముయొక్క జ్ఞానమే ముఖ్య కారణమని చెప్పవలసి యున్నది. ఎచ్చటెచ్చట ధూమముండునో యచ్చటచ్చట నగ్ని యుండు నన్న జ్ఞానమేది గలదో యది యనుమానమునకు హేతువు. ఈ జ్ఞానమునకే వ్యాప్తిజ్ఞానమని పేరు. ధూమమునకును, అగ్నికిని గల సంబంధమునకు వ్యాప్తి యని పేరు.

పైని చెప్పిన దానిని చూడఁగా 'వ్యాప్తి' యనునది అనుమాన ప్రకరణమునందు ముఖ్యమైన విషయమని చదు

వ్యాప్తి

వరులకుఁ దోఁచియుండును. కావున అందున గుఱించి కొంచెము విశదముగ వివరింతము.

ధూమ మున్నచోట నెల్ల అగ్ని యుండునా యుండదా యని మొదటివానికి సంశయము కలదో వానికి ధూమజ్ఞానముచేత నగ్నిజ్ఞానము కలుగనేరదు. అట్లు సంశయములేక ధూమాగ్నులకుఁగల సంబంధము నిశ్చయముగాఁ దెలిసినవానికి ధూమజ్ఞానముచే నగ్నిజ్ఞానము తప్పక కలుగును. అందువలన వ్యాప్తినిశ్చయమే యనుమితికిఁ గారణమని మనము చెప్పవచ్చును. ఈ వ్యాప్తిజ్ఞానము సాహచర్యజ్ఞానముచేఁ గలుగుచున్నది. కావుననే 'నియత సాహచర్యమే వ్యాప్తి' యని చెప్పఁబడినది. వంటయింటిలోను, ఇతర స్థలములందును మరల మరల ధూమాగ్నుల సాహచర్యము జూచుటచేత ధూమము వ్యాప్యమనియు,

అగ్ని వ్యాపకమనియు జ్ఞాన
న్నది. అనఁగాఁ వ్యాపక మెంం
మునకంటె నెక్కుడు ప్రదేశ
కొని యుండును. ధూమము వ
అగ్ని యుండును. కాని అగ్ని య
ధూమ ముండదు. అందువలన
ప్రదేశము లెక్కుడు, ధూమ
ములు తక్కువ. కావున ధూ
ము, అగ్ని వ్యాపకము. ఇది
విధముగఁ జెప్పవచ్చును.
మైనది వ్యాప్య మనఁబడును.
కము వ్యాపక మనఁబడును.
ధూమ ముండదు. కాని
అగ్ని యుండును. ఎట్లనఁగా
కడ్డీయందు నగ్ని కలదు. కా
లేదు. కావున ధూమము
నందు,అగ్ని (వ్యాపకము) యొక
న్నది. కాని అగ్నియందు ధూ
వ్యాప్తి లేదు. ఒకప్పుడు వ్యా
లకు సమాన వ్యాప్తి యుండవ
మాఱుగా 'పచ్చికట్టెల య
వ్యాపక మనుకొందము. అప్పు
యగ్ని' యున్నచోట నెల్ల
టయు, ధూమ మున్నచోట
కట్టెల నిప్పుండుటయుఁ దట
ఈ రెండును ఒకదాని కొకటి
వ్యాప్యము అని చెప్పవచ్చును.

అవినాభావరూప సంబంధము వ్యాప్తి యని మఱియొక లక్షణము కలదు. ఏదిలేక యేదియుండదో దానికి రెండవదానితో అవినాభావసంబంధ ముండునని చెప్పెదరు. అగ్ని లేక ధూమ ముండదు. కావున అగ్నియొక్క యవినాభావసంబంధము ధూమమునం దున్నది. అగ్నియందు ధూమముయొక్క యవినాభావసంబంధము లేదు. అగ్ని లేని ధూమ ముండదు గాని ధూమములేని యగ్ని యుండవచ్చును. ధూమ ముండినం గాని యగ్ని యుండదన్న నియమము లేదు. కావున అగ్ని వ్యాపక మనియు, ధూమము వ్యాప్యమనియుం దెలిసికొనవలెను.

అగ్నికిని, ధూమమునకును గల యీ వ్యాప్తిజ్ఞానము జనులకు నెట్లు కలుగును?

వ్యాప్తిజ్ఞానమెట్లుకలిగినది

పైని ఒకచోట సూచించినట్లు నిత్యానుభవమే దీనికి ముఖ్యకారణము. వంటయింట్లో, యజ్ఞశాలలో, మఱి యితరస్థలములలోను పొగ యున్నచోట నెల్ల యగ్నిని చూచి నందున ఈ జ్ఞానము కల్గును. కాని తొంబది తొమ్మిది సారులు చూచినను నూఱవ సారి అట్లే జరుగునని యెట్లు? అందుకు అవ్యభిచారజ్ఞానముం ఉండవలయును. నియమమునకు భంగము కలుగుట వ్యభిచార మనిపించుకొనును. ౯౯ సారులు ధూమమున్నచోట్ల నగ్ని కనిపించియు నొక్కచోట అగ్నిలేని యెడల నది వ్యభిచార మగును. కావున నట్టి వ్యభిచారాభావము వ్యాప్తిం నిశ్చయమునకు సహకారి యగును. ఇట్లు, వ్యాప్తి జ్ఞానమునకు సాహచర్య జ్ఞానము, వ్యభిచార జ్ఞానరాహిత్యము ఆవశ్యకములు.

వ్యాప్తియొక్క వైశాల్యమును సంకుచితముచేయు దానిని ఉపాధి యందురు.

ఉపాధి

అగ్నియున్నచోట్ల నెల్ల ధూమ ముండును అన్నవాక్యము నిజమైనది కాదు. అందలి 'యగ్ని' యను పదమునకు ఆర్ద్రేంధన సంయోగము (పచ్చికట్టెలకూడిక) అన్నమాట తగిలించినయెడల నది సరియగును. ఈ 'ఆర్ద్రేంధన సంయోగ' మనునది 'ఉపాధి' యనంబడు. 'ఉప సమీపవర్తిని ఆదధాతి సంక్రామయతి స్వీయం ధర్మ మిత్యుపాధిః' అని ఉదయనాచార్యులు చెప్పియున్నాఁడు. తన యొద్ద నున్న వస్తువునకుం దన వర్ణమిచ్చునది యుపాధి. ఎఱ్ఱపువ్వము తన సమీప మందున్న స్ఫటికమునకుం దన వర్ణమిచ్చును. అట్లే యాకార విహీనమైన యాకాశమునకు ఘటమను ఉపాధి తన యాకారము నొసంగుచున్నది. ఇట్లే యగ్నివలన ధూమమును పుట్టించు నుపాధి 'ఆర్ద్రేంధన సంయోగము' అనంగాం బచ్చికట్టెలు నిప్పును తగిలియుండుట. కావున నడుమ నుపాధి యుండుటచే నెచ్చటెచ్చట నగ్ని యుండునో యచ్చటచ్చట ధూమ ముండు నన్న వ్యాప్తికి వ్యభిచారము సంభవించినది. పొడికట్టెలు

గల యగ్ని 'యున్నపుడు పొగయుండదు. కాలిన యినుపగుండులోనున్న యగ్నికిఁగూడ ధూమముండదు. కావున నగ్నికి ధూమమునకు అవినాభావసంబంధము కలుగ వలె నన్న 'అగ్ని' యను పదమునకు 'తడికట్టెలు గల' యన్న విశేషణము చేర్చవలెను. ఇదియే యుపాధి. ఈ ఆర్ద్రేంధన సంయోగము అగ్నికి వ్యాపకము కాదు. ధూమమునకు వ్యాపకము. అనఁగా నుపాధి ధూమముకంటె నెక్కుడు వ్యాప్తి కలదిని, అగ్నికంటెఁ దక్కువ వ్యాప్తి కలదిని అయియున్నది. ధూమవ్యాప్తికిని అగ్నివ్యాప్తికిని గలభేదమును ఉపాధి సూచించును. 'పర్వతము మీఁద ధూమ మున్నది. అగ్ని యుండుటచే' నన్న సిద్ధాంతము చెప్పినతోడనే 'ఆర్ద్రేంధన సంయోగ' మను ఉపాధి యడ్డమువచ్చి యా సిద్ధాంత మపసిద్ధాంతమని చెప్పును.

అనుమాన విభాగములు

గౌతమాచార్యుల వారనుమానము మూఁడు విధములని చెప్పియున్నారు(న్యాయ సూత్రము ౧.౧.౫). (౧) పూర్వవత్. (౨) శేషవత్. (౩) సామాన్యతో దృష్టములు. 'పూర్వవ దనుమాన' మనఁగా కారణముఁ జూచి కార్యము నూహించుట. దీనినే 'కారణ లింగక' మనవచ్చును. కారణమే లింగముగాఁ (హేతువుగా) గలది యని యర్థము. ఇందు కుదాహరణము మేఘములఁ జూచి వర్షము కురియునని యూహించుట.

'శేషవదనుమాన' మనఁగా
జూచి కారణము ను ఊ
కార్యలింగకము. ఇందుఁ
ము (హేతువు). ఏటికి వరద
వర్షము కురిసెనని యూహిం
నుదాహరణము. పై రెండు
మానములు గాని యనుమ
మాన్యతో దృష్టానుమాన'
అనఁగాఁ గారణమునుబట్టి కా
కార్యమునుబట్టి కారణమును
మానములందు నూహింపఁబ
మానము లన్నియు సామాన్య
లని చెప్పవలసి యున్నది. రె
నియతసాహచర్య ముండుట
నొక వస్తువునుజూచి రెండవ
చుట సామాన్యతో దృ
యభిప్రాయము. పృథ్వీత్వ
వత్త్వమును ఊహించుట, తో
ఊహచేయుట ఇందుకు నుదా

అనుమానము స్వార్థాను
పరార్థానుమానమన్నియు
లుగా మర్గల విభజింపఁబడినది
మానమువలన మానవుఁడు
దలి సంశయమును బాపు
జ్ఞానాత్మకము. పరార్థాను
మానవుఁడు పరుల సంశయ
ట్టును. ఇది శబ్దాత్మకము. కా
మానము మొదటిది. పరా

రెండవది. తన మనసుకు సంశయనివృత్తి కలిగినఁగాని యితరులకు సమాధానము చెప్పుట యెట్లు?

స్వార్థానుమానక్రమ మెట్లనిన, నొకానొకఁడు పర్వతముమీఁద ధూమమును చూచును. తరువాత నెచ్చట ధూమముండునో యచ్చట నగ్నియుండు నన్న వ్యాప్తిని స్మరించును. పిదప ఈ వ్యాప్తిస్మరణమును తనకుఁ బ్రత్యక్షముగఁ దెలిసిన పక్షధర్మతా జ్ఞానముతోఁ (అనఁగాఁ బర్వతము ధూమవంత మన్న జ్ఞానముతోఁ) గలపఁగా, పర్వతము అగ్నివ్యాప్యముగాఁగల ధూమమును గలదియను జ్ఞానము కలుగుచున్నది. ఈ జ్ఞానమునకే యీ శాస్త్రమునందు పరామర్శ మనియు, లింగ పరామర్శమనియుఁ బేళ్లు. దీనినే తృతీయ లింగపరామర్శ మందురు. ఎందుకనఁగా ఈ లింగ(హేతు-ధూమ) జ్ఞానము మూఁడుసారు లయినఁగాని పరామర్శము పూర్తికాదు. మొదట మహానసాదులయందు ధూమాగ్నుల సాహచర్యముఁజూచుట, రెండవసారి పర్వతము మీఁద ధూమమును జూచుట, మూఁడవసారి వ్యాప్తిజ్ఞానస్మరణము ననుసరించి యీ ధూమ మగ్నివ్యాప్యమన్న జ్ఞానముగలుగుట. ఇట్లు లింగ (హేతు) జ్ఞానము మూఁడు విధములఁ గలిగినేఁ గాని పరామర్శము కలుగదు. ఈ పరామర్శమే స్వార్థానుమితి యని కొందఱి యభిప్రాయము. కొందఱమతమున హేతుజ్ఞానమునకే అనుమాన మనిపేరు, వ్యాప్తియొక్క స్మృతియే య్యనుమాన మని కొందఱి మతము. కొందఱు పరామర్శమును కరణమందురు. కొందఱు వ్యాపార మందురు. ఇట్లు నైయాయికులు భిన్నాభిప్రాయులై నను, అందఱును పరామర్శమును ఒప్పుకొని యున్నారు. పరామర్శము లేక యనుమితి కలుగ నేరదని యందఱి మతము.

పరార్థానుమాన మితరుల సంశయములఁ బాపుటకు నుపయోగపడును. ఇది పంచావయవాత్మకము.

పంచావయవములు

పంచావయవాత్మకమైన పరార్థానుమానమునకు 'న్యాయ' మనిపేరు. దీనిని బట్టియే యీ శాస్త్రమునకంతకును న్యాయ శాస్త్రమని పేరువచ్చెను. స్వార్థానుమానమందు నెవని మనసులో వానికిఁ గలుగునట్టి పక్షధర్మతాజ్ఞానము (పర్వత మగ్ని మంత మన్న జ్ఞానము) కొన్ని వాక్యములచేఁ బరుల మనసునందుఁ బుట్టునట్లు చేయుట 'న్యాయ' మనిపించుకొనును. పర్వతము అగ్నిమంత మని పరులను ఒప్పించుటకు ఈ క్రింది యైదు వాక్యములను ఉపయోగించెదరు:-

పంచావయవములు

౧ పర్వతము అగ్నిమంతము (ప్రతిజ్ఞ)

౨ ధూమవత్త్వముచే (హేతువు)

3 ఏదియేది ధూమవంతమో యదియది అగ్నిమంతము, వంటయింటిలోను వలె (ఉదాహరణము)

౪ అట్లే యిది (ఉపనయమము)

౫ కావున పర్వతమగ్ని మంతము (నిగమనము)

ఇందు మొదటిది 'ప్రతిజ్ఞ'. ఇందీవిషయము ప్రతిపాదింపఁబడును అని యిది తెల్పును. వక్త తాను స్థాపింపఁబోయెడి సిద్ధాంతమును ఇందు మూలకముగా ముందు చెప్పును. మొదటిది యైన ప్రతిజ్ఞతో చివరదియగు 'నిగమనము' సరిపోవలెను. అట్లు కానియెడల నది ప్రతిజ్ఞా భంగమనిపించుకొనును. రెండవది 'హేతువు'. ఈ వాక్యమునందు లింగము చెప్పఁబడును. లింగము హేతువు అనునవి సమానార్థకము లయినను వానియందుఁ గొంచ మర్థభేదము కలదు. లింగ మనఁగా గుర్తు. ఇచ్చట హేతువు అను పదమును సాధారణముగా లింగప్రతిపాదక వాక్యమన్న యర్థమునందు నుపయోగించెదరు. మూఁడవది యుదాహరణము. ఇందు లింగమునకును (ధూమమునకును) సాధ్యమునకును (అగ్నికిని) గల సంబంధము (వ్యాప్యవ్యాపకభావము) తెల్పి వ్యాప్తిజ్ఞానము కలుగఁజేయును. ఇంతియ గాక వ్యాప్తిజ్ఞానమునకుఁ గారణమైన యనేకోదాహరణములలో నుండి యొక్కదానిఁ జెప్పి వ్యాప్తిజ్ఞానమును దృఢపఱుచును. నాల్గవది 'ఉపనయము'. మూఁడవ వాక్యమందలి వ్యాప్తి యిచ్చటఁగూడఁ జెల్లునని యిది తెల్పును. అయిదవది నిగమనము. పైనా ... వాక్యముల నొక్కచోటఁ జేర్చి తీసిన నిగమనవాక్యము. ఈ పంచా

వయవాత్మకమైన అనుమాన ఫలితము.

చక్కఁగ విచారించి చూ వాక్యములలో మూఁడే ముఖ తెలియఁగలదు. 'ప్రతిజ్ఞా' 'ని క్కటియే కావున నాలుగు వా నవి. వానిలోను 'ఉపనయ' వాక్యము విశేషోపయోగక కావున మిగిలినవి మూఁడు వ

నైయాయికులు పంచావ అంగీకరించినను మీమాంస హేతూదాహరణములను ము ములనే యొప్పుకొనిరి. వేదాం మూఁడవయవములుగాని, చి యవములుగాని చాలు ననిఁ ఉదాహరణోపనయముల పాశ్చాత్యన్యాయశాస్త్రమునం మునకు నవయవములు మూఁ

అనుమానమునకు ముఖ్యా మును గుఱించి చెప్పవలసియు

మునే
లింగము
రని యిఁ
బడినది. లింగము మూఁడు

* "అవయవాశ్చ త్రయ ఏవ దాహరణరూపా ఉదాహరణో పావా నతు పంచ, అవయవత్రయేణైవ యో రుపదర్శన సంభవేనాధికావయ త్వాత్" [వేదాంతపరిభాషా కలక

(౧) అన్వయవ్యతిరేకి, (౨) కేవలాన్వయి, (౩) కేవలవ్యతిరేకి. అన్వయ వ్యాప్తియు, వ్యతిరేకవ్యాప్తియుఁగలది అన్వయ వ్యతిరేకి. హేతువునకు (ధూమమునకు) ను సాధ్యమునకును (అగ్నికిని) గల వ్యాప్తి అన్వయవ్యాప్తి. వాని అభావములకుఁ గల వ్యాప్తి వ్యతిరేక వ్యాప్తి. ధూమ మున్నచోట నెల్ల యగ్ని యుండును, వంటయింటిలోవలె ననునది అన్వయవ్యాప్తికిని, ఎచ్చట నగ్నిలేదో యచ్చట ధూమము లేదు, కొలనువలె నన్నది వ్యతిరేకవ్యాప్తికిని ఉదాహరణములు. ఇందలి రెండవ యుదాహరణములో, అగ్న్యభావమునకును, ధూమాభావమునకును వ్యాప్తి కలదు. అన్వయవ్యాప్తియందలి వ్యాప్యవ్యాపకములు వ్యతిరేక వ్యాప్తియందు మారి వ్యాపకవ్యాప్యము లగును. అన్వయవ్యాప్తిలో ధూమము వ్యాప్యము, అగ్ని వ్యాపకము. వ్యతిరేకవ్యాప్తిలో అగ్న్యభావము వ్యాప్యము, ధూమాభావము వ్యాపకము. ఇది యీ ప్రక్క పటమువలన స్పష్టపడఁగలదు.

అ ఆ ఇ ఈ యను పెద్ద చతుష్కోణము అగ్నికంటె నధిక వ్యాప్తిగల ద్రవ్య మనుకొనుఁడు. అంతకంటెఁజిన్నది ఆ క చ ట యను చతుష్కోణము అగ్నిని సూచించు ప్రదేశ మనుకొనుఁడు. దిన్నిఁటికంటెఁ జిన్నదియగు ఆ గ జ డ యను చతుష్కోణము ధూమవ్యాప్తిని సూచించును. మహానస యజ్ఞశాలాదులందులోనివి. ధూమమున్నచోటనెల్ల అగ్ని యుండుటచే ఈ చతుష్కోణమునందుఁ గూడ అగ్ని వ్యాప్తి యున్నదనియే యెంచవలెను. కావున ఆ క చ ట యను చతుష్కోణమునుండి ఆ గ జ డ చతుష్కోణమును తీయఁగా మిగిలిన క జ ట యను గోముఖప్రదేశము (Gnomon)




ధూమము లేనట్టియు, అగ్ని యున్నట్టియు, తప్తాయఃపిండాదులను జూపును. అగ్ని యున్న చోట నెల్ల ధూమ ముండునన్న వ్యాప్తిని చెరుచునట్టి ఆర్ద్రేంధన సంయోగ మను ఉపాధి యీ క జ ట యను ప్రదేశము వలననే సూచిత మగును. అ చ ఇ అను గోముఖ ప్రదేశము ధూమాభావము అగ్న్యభావము కలిసియుండు స్థలమును సూచించును. ఇది విపక్ష దృష్టాంతప్రదేశము; ఎచ్చట అగ్న్యభావమో అచ్చట ధూమాభావము అన్న వ్యతిరేకవ్యాప్తిని బోధించును. ఈ పటమునందు, నగ్ని ప్రదేశమగు చతుష్కోణము (ఆకచట) ధూమప్రదేశమగు చతు

షోడ్యణము (ఆగజడ) కంటెఁ బెద్దదిగాన అగ్ని వ్యాపకమనియు ధూమము వ్యాప్యమనియు, ధూమ్మాభావ సూచకమైన అజఇ అసు ప్రదేశము, 'అగ్న్యభావ' సూచకమైన అచఇ అను ప్రదేశముకంటె పెద్దది గనుక ధూమా భావము వ్యాపకమనియు అగ్న్య భావము వ్యాప్య మనియు స్పష్టపడఁగలదు. కావున నెచ్చటెచ్చట నగ్న్యభావమో అచ్చటచట్ల ధూమాభావము, కొలనువలె నున్నది వ్యతి రేక వ్యాప్తికి నుదాహరణము. ఇట్లు ధూమ మున్నచోట నగ్నియుండును. ఇందు కుదా హరణము మహానసము. అగ్న్యభావ మున్నచోట ధూమాభావ ముండును. అని అన్వయ వ్యతిరేకములచేఁ జెప్పునది 'అన్వ యవ్యతిరేకి లింగము' (హేతువు). కేవలా న్వయిలింగమునందు భావరూపోదాహరణమే యుండును గాని వ్యతిరేకోదాహరణ ముం డదు. ఉదాహరణము: ఘటము అభిధేయము (పేర్కొనఁదగినది), ప్రమేయత్వ మున్నందున, పటమువలె. ఇందు లింగము (హేతువు) ప్రమే యత్వము. ప్రమేయత్వమెచ్చటెచ్చట నుండు నో అచ్చటచ్చట నభిధేయత్వముండును. ఇం దుకు దృష్టాంతముపటము. ఇందు ప్రమేయత్వ మున్నది, అభిధేయత్వ మున్నది. కాని దీనికి వ్యతిరేకోదాహరణ ముండదు. ఎందుకన నట్టి వ్యతిరేక వాక్యము 'ఎచ్చటెచ్చట అభి ధేయత్వముండదో యచ్చటచ్చట ప్రమే యత్వ ముండదు' అనునది కావలెను. కాని

యన్ని పదార్థములకును అభి ప్రమేయత్వమును సామాన్య వాక్యమునకు నర్థము లేదు. మైన 'యభిధేయత్వము' సర్వ న్యమై యున్నది. దానికి అ లేదు. 'కేవల వ్యతిరేకి లి వ్యతిరేక దృష్టాంతమే యుం యదృష్టాంత ముండదు. యితర ద్రవ్యములకంటె వత్వ ముండుటచే, ఇతర నేది భేఱు కాదో యది గంధ జలమువలె, ఇది (యనఁగాభ (గంధవంతము కానిది) కా బృథ్వి యితర ద్రవ్యములకం చ్చట నేది గంధవంతమో య ములకంటె వేఱైనది యని రణము చెప్పుటకు వీలులేదు గంధవత్వము పృథ్వియందుఁ లేదు. ఇందు పక్షమునకు మునకు (ఇతర ద్రవ్యములకం భేదములేదు. అనఁగా సమా వ్యతిరేక దృష్టాంతమ్ములు పె

పైని వర్ణింపఁబడిన ము లలో 'అన్వయ వ్యతిరేకి' య ముఖ్యమైన దనియు, నిత్యవ్య నుపయోగపడునది యనియు 'కేవల వ్యతిరేకి' యనునవి ఉ కలోనివి కావనియు చదువరు

గలరు. మీమాంసకులును, వేదాంతులును వ్యతిరేకానుమానమును ఒప్పుకొనరు. వారు 'అర్థాపత్తి' యను అయిదవ ప్రమాణమును ఒప్పుకొని వ్యతిరేకానుమానమును పాటింపరైరి.

పర్వతము అగ్నిమంత మన్న వాక్యమందు అగ్ని 'సాధ్య' మనియు, పర్వతము 'పక్ష' మనియుఁ జదువరు లెఱుంగుదురు. దేనియందు సాధ్య మున్నది లేనిది సంశయముగా నుండి చర్చింపఁబడుచున్నదో యది 'పక్ష' మనఁబడును.

పక్షము, సపక్షము, విపక్షము

సాధ్యము (సాధింపవలసినఅగ్ని)ఇదివఱకే దేనియందునున్నదని నిశ్చయముగఁ దెలియునో యది 'సపక్షము'. మహానసము (వంటయిల్లు) ఇందుకు దృష్టాంతము. దేనియందు 'సాధ్యము' లేదని మనకు నిశ్చయముగాఁ దెలియునో యది విపక్షము. కొలను ఇందుకు నుదాహరణము. ఇందు సాధ్యమైన అగ్ని లేదని మన మెఱుఁగుదుము.

హేతువు వాదమునం దుపయోగపడవలయునన్న, నది యీక్రింది యైదు నియమములకు లోఁబడి

సద్ధేతువు

యుండవలయును. అప్పు డది సద్ధేతు వనిపించుకొనును. లేనియెడల హేత్వాభాసములకుఁ గారణమగును. (౧) హేతువు (లింగము) పక్షమునందు నుండవలెను. (౨) సపక్షమం దుండవలెను. (౩)విపక్షమునందుండఁగూడదు. (౪) అబాధితవిషయముగ నుండవలయును. అనఁగాఁ దీనిని హించిన హేతువుచే నిది ఖండితముకాఁగూడదు. (౫) అసత్ప్రతిపక్షముగ నుండవలెను. అనఁగా సాధ్యాభావమును స్థాపించెడు సమానబలముగల హేతువు ఉండఁగూడదు.

అన్వయవ్యతిరేకి లింగమునందు నీయైదు నియమములును పాటింపఁబడును. కేవలాన్వయి కేవలవ్యతిరేకములయందు వానిస్వభావమునుబట్టి యొక్కొక నియమము తగ్గును. న్యాయబిందువను గ్రంథమునందు మొదటి మూఁడు నియమములే యంగీకరింపఁబడినవి.

హేత్వాభాసములనఁగా దుష్టహేతువులని యర్థము. వాదవివాదము చేయునప్పుడు

హేత్వాభాసములు

వాదిప్రతివాదులొకిరిని నొకరు మోసపుచ్చుటకై యసత్యములైన హేతువులను గల్పించి నిజమైన హేతువులవలెనే యుపయోగించెదరు. అట్టి హేతుదోషములను ఎఱిఁగియున్నఁగాని ప్రతివాదియొక్క వాదదౌర్బల్యమును కనుఁగొనుటకు వీలులేదు. మన వాదమందును ఇట్టిదోషములు రాకుండుటకు హేత్వాభాసజ్ఞాన మావశ్యకము.

హేత్వాభాసము లైదు:- ౧ సవ్యభిచారము, ౨ విరుద్ధము, ౩ సత్ప్రతిపక్షము ౪ అసిద్ధము ౫ బాధితము.

దీనినే ముక్తావలీకారుఁడు అనైకాంతిక మన్నాఁడు. ఈ హేత్వాభాసము మూఁడు విధ ములు; సాధారణము

సవ్యభిచారము

అసాధారణము; అను పసంహారి. సాధారణసవ్యభిచార మనఁబడు హేత్వాభాసమందు హేతువు సపక్షదృష్టాంత మందును, విపక్షదృష్టాంతమందును కాను పించును. సపక్షమం దుండుట క్రమమేగాని విపక్షమందును ఉండుటవలన ఈదోషము సంభవించినది. అనఁగా హేతువు సాధ్య మందును, సాధ్యాభావమందును ఉండును. ఇందుకు నుదాహరణము: పర్వతము ధూమ వంతము; అగ్నివలన, అనెడి అనుమానము హేత్వాభాసము. ఎందుకు? ఇందలి హేతువు (లింగము) అగ్ని. ఇది మహానసాదుల వంటి ధూమమున్నచోట్లను, అయోగోలక మువంటి ధూమాభావమున్నచోట్లను కాను పించును. అనఁగా ధూమమున్న చోటను అగ్నియుండును, ధూమము లేని చోటను అగ్నియుండును. కావున నిది తప్పు. అసా ధారణ మను దోషమునందు హేతువు సప క్షమునందును కానరాదు, విపక్షమునందును గానరాదు. విపక్షమునందుఁ గానరాక పో వుట క్రమమేగాని సపక్షమందును లేకపోవుట వలన ఈదోషము సంభవించును. ఉ. శబ్దము నిత్యము, శబ్దత్వమువలన. ఇందు 'శబ్దత్వ' హేతువు. 'శబ్దత్వ'ము శబ్దమాత్రవృత్తి నందెన నిత్యములయందు లేదు, అనిత్య

ములయందు లేదు, కావున ఈ తప్పు. సాధ్యముండుచోట నుం అసాధారణ మని దీనిలక్షణ నిత్యుఁడు, మనుష్యత్వము వ నిత్యత్వముండుచోట మనుష్య గనుక. అనుపసంహారి దోషము దృష్టాంత ముండదు, వ్యతి ముండదు. ఇందుచే నిఁట అన్వ ముండదు, వ్యతిరేక వ్యా ఉ. సర్వము అనిత్యము; వలన. ఇందలి పక్షము 'సర్వ' అందు జ్ఞానవిషయమైన స మిమిడియున్నందున సపక్ష మ ముగగాని మఱియొక దృష్టా చుట యెట్లు? ఇందు సా యత్యంతాభావము అప్రసిద్ధ

సాధ్యాభావ వ్యాప్తమైన

విరుద్ధము

విరుద్ధ మనిపేరు. ఉ శబ్దము కత్వవ కృతక బడుట) హేతువు. కాని యి యొక్క యభావమైన అనిత్ ప్తము. కృతకత్వము అనిత్య తువుగాని నిత్యత్వమునకుఁ ప్రతిజ్ఞకంటె విరుద్ధమైనదిగా మని పేరు వచ్చెను. చెరు జలమువలన, అనునది యిందు హారణము.

సాధ్యాభావమును సాధించునట్టి, వేఱు హేతు వెందుండునో దానికి సత్ప్రతిపక్షమని పేరు. ఉ. శబ్దము నిత్యము ; శ్రావణత్వమువలన (వినఁబడుగుణ ముండుటవలన), శబ్దత్వమువలె. శబ్దము అనిత్యము, కార్యత్వమువలన, ఘటమువలె. ఇందు సాధ్యము నిత్యత్వము. దానియభావ మనిత్యత్వము. నిత్యత్వమును సాధించుట కొక హేతువును, తదభావమును (అనిత్యత్వమును) సాధించుటకు మఱియొక హేతువును చెప్పఁబడి యుండుటచేత నిది సత్ప్రతిపక్ష మనఁబడు హేత్వాభాసము.

సత్ప్రతి పక్షము

ఇది నాల్గవ హేత్వాభాసము. ఇది మూఁడు విధములు:ఆశ్రయాసిద్ధము,స్వరూపాసిద్ధము, వ్యాప్యత్వాసిద్ధము. ఉ. గగనారవిందము సువాసనగలది. అరవిందత్వము వలన ; సరోజారవిందమువలె, అనునది ఆశ్రయాసిద్ధమునకు నుదాహరణము. ఇందు గగనారవిందము (ఆకాశకమలము) ఆశ్రయము (పక్షము). ఇదియెచ్చటను లేదు. ఇచ్చట పక్షతావచ్ఛేదక ధర్మము గగనీయత్వము గాని అరవిందత్వము గాదు. ఇట్లసంభవమైన వస్తువును పక్షముగాఁ గైకొన్నందున ఈ యనుమానము తప్పు. కాంచనమయ పర్వతము అగ్నిమంతము, ధూమమువలన, అన్నదియు నిందుకు నింకొక యుదాహరణము, పక్షతావచ్ఛేదకధర్మము (ఇచ్చట కాంచనమయత్వము) పక్షమునందు లేకపోవుటయే యీదోషలక్షణము. స్వరూపాసిద్ధ మను హేత్వాభాసమునందు హేతువు పక్షమునందుండదు. ఉ. కొలను అగ్నిమంతము, ధూమమువలన. ఇందు ధూమము హేతువు. కొలను పక్షము. కొలనులో ధూమముండదు. కావున హేతువు తప్పు. కుందేలు ఆవు, కొమ్ములున్నందున, ఘటము పృథ్వి, పటత్వమువలన అనునట్టి యుదాహరణము లిట్టివియే. ఉపాధి సహితమైన హేతువును ఉపాధి లేకుండఁగఁ జెప్పుట వ్యాప్యత్వాసిద్ధదోషము. ఉ. పర్వతము ధూమవంతము; అగ్నిమంతమగుటచే నన్నచోట 'ఆర్ద్రేంధన సంయోగాగ్ని' మంతమగుటచే నని యుండవలెను. అట్లు ఆర్ద్రేంధన సంయోగమును చెప్పినవాఁడు కాఁడు కావున దోషము. ఇంకొక యుదాహరణము. పర్వతము అగ్నిమంతము, కాంచనమయ ధూమమువలన. ఇది హేత్వాభాసము. ఎందుకన హేతువు ఉపాధిసహితము. ధూమము అగ్నివ్యాప్యమే; కాని కాంచనమయ ధూమము మాత్రము అగ్నివ్యాప్యము కాదు. 'కాంచనమయత్వ' మను నుపాధిచే నదివేఱయ్యె. ఈ హేత్వాభాసములో సాధ్యాప్రసిద్ధి, సాధనాప్రసిద్ధి ఇత్యాదిభేదము లనేకములు కలవు.

ఆసిద్ధము

ఏ హేతువుయొక్క సాధ్యాభావము వేఱు బలవత్తరమైన ప్రమాణముచే నిశ్చితమైనదో

యది. బాధిత హేత్వాభాసము. అగ్ని చల్లగ నుండును, ద్రవత్వము వలన అనుచో అనుష్ణత్వము (చల్లదనము) సాధ్యము. దాని యభావము ఉష్ణత్వము; దానిని స్పర్శముచేఁ బ్రత్యక్షముగ మన మెఱుఁగుదుము. కావున నగ్ని చల్లనిది యన్న మాటకు బాధ కలిగెను. పక్షమునందు నుండవలసిన సాధ్యము యొక్క యభావము మొదలయినవి బాధిత మనఁబడునని ముక్తావలీకారుని మతము.

బాధితము

పైని హేత్వాభాసములు నవీనమతానుసారముగ న్యాయసిద్ధాంత ముక్తావలీకారుని ననుసరించి యీయఁబడినవి. గౌతమ సూత్రానుసారము హేత్వాభాసములు నిగ్రహస్థానములలోనివియే యని వర్ణింపఁబడినవి. అచ్చట హేత్వాభాసములు అయిదు చెప్పఁబడినవి: (౧) సవ్యభిచార (౨) విరుద్ధ (3) ప్రకరణ సమ (౪) సాధ్యసమ (౫) అతీత కాలము లనఁబడునవి. సవ్యభిచార విమరుద్ధములను గుఱించి యిదివఱకుఁ జెప్పియున్నాము. ఏ సిద్ధాంతమును సాధింపవలయునో దానినే హేతువుగఁ దీసికొనుట ప్రకరణసమ దోషము.

ప్రకరణ సమము

శబ్దము అనిత్యము
నిత్యత్వము లేదు కనుక

'అనిత్య' మనగా 'నిత్యత్వములేనిది'; కావున నిందు నొక్కమాటయే భిన్నరూపముగఁ జెప్పఁబడి యున్నది. దీనినే పా యితులు పెటిషియొప్రిన్సిపిఅ principii) అందురు.

సాధ్యమునకునై యీయఁ కూడ ముగా ( సినదిగా) నున్న యెడల సాధ్య వచ్చును.

సాధ్యసమము

నీడ యొక ద్రవ్యము (ప్రతి
దానికి చలన మున్నదిగనుక (

ఇచ్చట నీడ యొక ద్రవ్య యెట్లు సిద్ధాంతము కావలయు దట నీడకు చలన మున్నదని కావలెను. నీడకు చలన ము అందఱును ఒప్పుకొనునదికా ప్రకాశాభావము. ఏద్రవ్యము ప్రకాశమును అడ్డగించునో యొక్క చలనమే నీడయొక కొందఱిచే భ్రమింపఁబడును.

కాలమును లెక్క లో చెప్పఁ కాలాతీ భాస మనఁబడును.

కాలాతీతము

శబ్దము నిత్యము
సంయోగజముగనుక, రంగు

ఇందు నీయఁబడిన హేతు ఘటదీపసంయోగమువలన రంగు మనకుఁ గానవచ్చు

ఆరంగు అంతకుఁ (ఘటదీపసంయోగమునకుఁ) బూర్వముండెను, తర్వాతఁగూడ నుండును. అట్లే ఢక్కకు (నగారాకు) దండమునకు సంయోగము గలిగినప్పుడు ధ్వని పుట్టు చున్నది. కావున నది పై యుదాహరణము ననుసరించి అంతకుఁ బూర్వ ముండెననియు, తర్వాత నుండుననియు, కావున నిత్యమనియుఁ జెప్పవలెను అని వాదియొక్క తాత్పర్యము. కాని యిది కాలాతీత హేత్వాభాసము. ఎందుకన ఈరెండు సంయోగములును వేఱు వేఱు. దీపఘటసంయోగకాలముననే రంగు జ్ఞానము జనించును. కాని ఢక్కాదండ సంయోగకాలముననే శబ్దము పుట్టదు, సంయోగమైన రెండవ క్షణమునఁ బుట్టును. కావున రంగునకు, శబ్దమునకు సంయోగ జననమందుఁ బోలికలేదు.

దీని తరువాత ఛలమను దోషమును చెప్పి నాఁడు. అదెట్లనిన.

అర్థాంతరము కల్పించుకొని వాదమును అడ్డగించుట ఛల మనుపించుకొనును. ఇది మూఁడు విధములు.

ఛలము

ఒకపదమునకు రెండర్థము లున్నప్పుడు వక్తయొక్క యుద్దేశము నకు భిన్నమైన యర్థమును గ్రహించుట వాక్ఛలము. 'ఈ పిల్లవాఁడు నవకంబళుఁడు' అన్నవాక్యము నందు 'నవకంబళుఁడు' అనఁగా క్రొత్తకంబళికలవాఁ డని వక్తయొక్క యుద్దేశము. ప్రతివాది ఆ పదమునకు తొమ్మిది కంబళ్లు కలవాఁడని యపార్థము చేసిన నది వాక్ఛలమగును. విశేషవ్యక్తిని గుఱించి చెప్పఁబడిన యర్థమును జాతిని గుఱించి చెప్పి నట్టుగా భావించి యపార్థముచేయుట సామాన్య ఛలము. 'ఈ బ్రాహ్మణుఁడు విద్వాంసుఁడు' అని యొక బ్రాహ్మణుని గుఱించి చెప్పఁగా, బ్రాహ్మణత్వముయొక్క యవచ్ఛేదకధర్మము విద్వత్తయని చెప్పినట్లుగ నర్థముగ్రహించి, విద్వాంసులుకాని బ్రాహ్మణులు లేరా? విద్వాంసులైన అబ్రాహ్మణులు లేరా? యని వాదించుట సామాన్య ఛలమునకు నుదాహరణము. పదమునకు శక్యార్థము గ్రహింపక లక్ష్యార్థము వివక్షితమైనప్పుడు దాని వాచ్యార్థమును గాని, వాచ్యార్థము వివక్షితమైనప్పుడు లక్ష్యార్థమును గాని గ్రహించుట ఉపచారచ్ఛల మనఁబడును. 'మంచె లరచుచున్నవి', అనగా మంచెమీఁది జనులు అరచుచున్నారు, అని, 'పాగాలు పోవుచున్నవి', అనఁగా పాగాపెట్టుకున్నవారు పోవుచున్నారని యర్థము. ఇట్లర్థముచేయక మంచెలే అరచుచున్నవనియు, పాగాలేనడుచు చున్నవనియు అర్థము. చేసిన యెడల నీదోషము పట్టును.

వాదవివాదమునందు మననైయాయికులు నిగ్రహస్థానములను కొన్నిఁటిని చెప్పియున్నారు.

నిగ్రహస్థానములు ౨౨

నిగ్రహస్థానములనగా ప్రతివాది వాదమునందు నక్రమము చేయఁ బ్రారంభిం

చినప్పుడు, ద్దానిని జూపి వానికి నగౌరవము కలుగఁజేసి వాదములో నాతఁడోడెనని వాదమును నిల్పివేయుట. ఇట్టి నిగ్రహస్థానము లిరువది రెండు చెప్పఁబడియున్నవి. వానిని కొద్దికొద్దిగా వర్ణించెదను.

సాధింపవలసిన సిద్ధాంతము ప్రతిజ్ఞ. దానిని సాధింపలేక ప్రదివాది యొక్క సిద్ధాంతమును అంగీకరించుట ప్రతిజ్ఞాహాని. ఒకఁడు మొదట ఈ క్రిందివిధముగ తర్కించును.

౧ ప్రతిజ్ఞాహాని

శబ్దము అనిత్యము
అది ఇంద్రియ గోచరముగనుక, ఏది ఇంద్రియగోచరమో యది అనిత్యము, ఘటము వలె
శబ్దము ఇంద్రియ గోచరము
కావున శబ్దము అనిత్యము.

ప్రతివాది వచ్చి ఘటత్వాది 'జాతి' ఇంద్రియ గోచరమైనను నిత్యము, అట్లే శబ్దము ఇంద్రియగోచరమైనను నిత్యమేల కాగూడదు? అని ఖండింపగా బదులుచెప్పలేక యిట్లనును.

ఏది ఇంద్రియగోచరమో యది నిత్యము
ఘటమువలె
శబ్ద మింద్రియ గోచరము
కావున శబ్దము నిత్యము

ఇట్లు తన స్వదృష్టాంతమైన ఘటమునందు అన్య దృష్టాంతమైన ఘటత్వముయొక్క లక్షణ మెప్పుకొని స్వసిద్ధాంతమును వదలుకొన్నందున నిది ప్రతిజ్ఞాహాని.

ఇట్లు పక్షము, హేతువు, సాధ్యము ఈ మూటిలో దేనిని వదిలినను ప్రతిజ్ఞాహాని కావచ్చును.

శబ్దము అనిత్యము
కృతకత్వము (చేయఁబడుట) వ

అనినతోడనే, ప్రతిపక్షి, శబ్ద
కత్వములేదని యాక్షేపింపగ
'ఘట' మేపక్ష మనుకొనుఁ
నీదోషము ప్రాప్తించును. ఇ
ములను విడుచుటనుగుఱించి

౨ ప్రతిజ్ఞాంతరము

తాను సాధింపవలసిన
న
మారు
జ్ఞాంతరము.

పర్వతము అగ్ని కలది
సువాసనగల నల్లని ధూమ వ

ఇందు హేతువు (ధూవ
(సువాసనగల నల్లని యను)
వ్యర్థమని ఆక్షేపింపగా

పర్వతము కృష్ణ చందనయుత మై
సువాసనగల నల్లని ధూమ ముం

అని చెప్పగా నీ దో
మొదట ప్రతిజ్ఞ 'పర్వత మ
నది, ఇప్పుడు రుజువు జేసిన
కృష్ణచందనయుతమైన అగ్నిక
ప్రతిజ్ఞమారుటచే నిది ప్రతిజ్ఞా

3 ప్రతిజ్ఞా విరోధము

ప్రతిజ్ఞకును, హేతువునకు
న్న ప్పు
విరోధ

ద్రవ్యము గుణముకంటె వేఱు ప
రూపాదికంటె వేఱుకాదు గాన

ఈ యుదాహరణమునందు, రూపాదికములు గుణములే కావున, వానికిం జెంద్రవ్యము వేఱు కాదని చెప్పుట ప్రతిజ్ఞకు సాధకము కాదు.

తన ప్రతిజ్ఞకు నడ్డురాగా నది తనప్రతిజ్ఞ కాదనుట. శబ్దము అని

౪ ప్రతిజ్ఞాసన్యాసము

త్యమని రుజువు చేయలేక పోయినపుడు "ఎవఁడన్నాఁడయా శబ్దమనిత్యమని?" అని తప్పించుకొనుట ప్రతిజ్ఞాసన్యాసము.

అవిశేషహేతువునకు నడ్డు కలుగగా విశేష హేతువును ప్రతిపాదించుట.

౫ హేత్వంతరము

శబ్ద మనిత్యము
ఇంద్రియగోచరము గనుక

ఇందుమీద "కేవలము ఇంద్రియ గోచరత్వము వలననే యేపదార్థమైను అనిత్యము కాఁజాలదు. 'సామాన్య' మనుపదార్థ మింద్రియ గోచరమైనను నిత్యమె." అని యాక్షేపము రాగా, 'ఇంద్రియ గోచరము గనుక' అను హేతువునకు 'సామాన్యత్వముగల ఇంద్రియ గోచరత్వము' అని అర్థము చెప్పిన ఈ దోషము సిద్ధించును.

మూల విషయమును విడిచి యన్యవిషయ ప్రసంగముఁ దెచ్చుట యర్థాంతరము:

౬ అర్థాంతరము

శబ్దము నిత్యము
అస్పర్శత్వమువలన

అని చెప్పగా దీనికిఁ బూర్వపక్షము వచ్చి హేతువు సరియైనది కాదని యాక్షేపింపగా, దానికి సమాధానము చెప్పుటకు మారుగా "హేతుపదము 'హిని' ధాతువునకు 'తుని' ప్రత్యయము తగిలియైన కృదంతపదము, పదమనగా సుబ్తిజంతము" అని సంబంధములేని మాటలు చెప్పఁ దొడగుట.

అర్థములేని వర్ణక్రమమును వాదమునందు నుపయోగించిన ఈ దోషమగును.

౭ నిరర్థకము

శబ్దము నిత్యము
కచటతపత్వమువలన

అర్థముగాని వాక్యమును వాదమునందు నుపయోగించుట. వాదములో గెలువలేక

౮ అవిజ్ఞాతార్థము

కొందఱు అర్థములేని పదమును, భిన్నార్థపదములను, అర్థము కానట్లు త్వరగాగాని, మెల్లగాగాని యుచ్చరించెదరు. అట్టిసమయమున, ఆమాటలు మూడు సారులు ఉచ్చరించినను, సభవారికిని ప్రతివాదికిని అర్థముకాని యెడల నవి నిగ్రహస్థానము లగును.

అన్వయదోషమువలన ఒక శబ్దమునకును మఱియొక శబ్దమునకును సంబంధము లేకుండ నుచ్చరింపఁబడు వాక్య మిట్టిది. వాదములో జయింపలేక యొకానొకఁ డిట్లు హేతువును చెప్పును:—

౯ అపార్థకములు

'పది దానిమ్మపండ్లు, ఆఱు అప్పచ్చులు, భిక్షాపాత్ర,' ఇత్యాది అసంబధ వాక్యము.

చినప్పుడు, దానిని జూపి వానికి నగౌరవము కలుగఁజేసి వాదములో నోతఁడోడెనని వాదమును నిల్పివేయుట. ఇట్టి నిగ్రహస్థానము లిరువది రెండు చెప్పఁబడియున్నవి. వానిని కొద్ది కొద్దిగా వర్ణించెదను.

**౧ ప్రతిజ్ఞాహాని**

సాధింపవలసిన సిద్ధాంతము ప్రతిజ్ఞ. దానిని సాధింపలేక ప్రదివాది యొక్క సిద్ధాంతమును అంగీకరించుట ప్రతిజ్ఞాహాని. ఒకడు మొదట ఈ క్రిందివిధముగ తర్కించును.

శబ్దము అనిత్యము
అది ఇంద్రియ గోచరముగనుక, ఏది ఇంద్రియగోచరమో యది అనిత్యము, ఘటము వలె
శబ్దము ఇంద్రియ గోచరము
కావున శబ్దము అనిత్యము.

ప్రతివాది వచ్చి ఘటత్వాది 'జాతి' ఇంద్రియ గోచరమైనను నిత్యము, అట్లే శబ్దము ఇంద్రియగోచరమైనను నిత్యమేల కాగూడదు? అని ఖండింపగా బదులుచెప్పలేక యిట్లనును.

ఏది ఇంద్రియగోచరమో యది నిత్యము ఘటమువలె
శబ్ద మింద్రియ గోచరము
కావున శబ్దము నిత్యము

ఇట్లు తన స్వదృష్టాంతమైన ఘటమునందు అన్య దృష్టాంతమైన ఘటత్వముయొక్క లక్షణ మెప్పుకొని స్వసిద్ధాంతమును వదలుకొన్నందున నిది ప్రతిజ్ఞాహాని.

ఇట్లు పక్షము, హేతువు, సాధ్యము ఈ మూటిలో దేనిని వదిలినను ప్రతిజ్ఞాహాని కావచ్చును.

శబ్దము అనిత్యము
కృతకత్వము (చేయఁబడుట) వలన

అనినతోడనే, ప్రతిపక్షి, శబ్దమునందు కృతకత్వములేదని యాక్షేపింపగా "పోనిండు, 'ఘట' మేపక్ష మనుకొనుఁడు" అన్నచో నీదోషము ప్రాప్తించును. ఇట్లే హేతుసాధ్యములను విడుచుటనుగుఱించి తెలియఁగునది.

**౨ ప్రతిజ్ఞాంతరము**

తాను సాధింపవలసిన సిద్ధాంతమునకు నష్టరాగా అందు మార్పు చేయుట ప్రతిజ్ఞాంతరము.

పర్వతము అగ్ని కలది
సువాసనగల నల్లని ధూమ ముండుటచే

ఇందు హేతువు (ధూమము) యొక్క (సువాసనగల నల్లని యను) విశేషణము వ్యర్థమని ఆక్షేపింపగా

పర్వతము కృష్ణ చందనయుతమైన యగ్నికలది
సువాసనగల నల్లని ధూమ ముండుటచే

అని చెప్పగా నీ దోషము వచ్చును. మొదట ప్రతిజ్ఞ 'పర్వత మగ్నిగలది' అనునది, ఇప్పుడు రుజువు జేసినది 'పర్వతము కృష్ణచందనయుతమైన అగ్నికలది'యని. ఇట్లు ప్రతిజ్ఞమారుటచే నిది ప్రతిజ్ఞాంతరము.

**3 ప్రతిజ్ఞా విరోధము**

ప్రతిజ్ఞకును, హేతువునకును విరోధ మున్నప్పుడు ప్రతిజ్ఞా విరోధమగును. ఉదా.

ద్రవ్యము గుణముకంటే వేఱు పదార్థము,
రూపాదికంటె వేఱుకాదు గాన

ఈ యుదాహరణమునందు, రూపాదికములు గుణములే కావున, వానికంటె ద్రవ్యము వేఱు కాదని చెప్పుట ప్రతిజ్ఞకు సాధకము కాదు.

౪ ప్రతిజ్ఞాసన్న్యాసము

తన ప్రతిజ్ఞకు నష్టమురాగా నది తనప్రతిజ్ఞ కాదనుట. శబ్దము అనిత్యమని ఋజువు చేయలేక పోయినపుడు "ఎవఁడన్నాఁడయా శబ్ద మనిత్యమని?" అని తప్పించుకొనుట ప్రతిజ్ఞాసన్న్యాసము.

౫ హేత్వంతరము

అవిశేష హేతువునకు నష్టము కలుగగా విశేష హేతువును ప్రతిపాదించుట.

శబ్ద మనిత్యము
ఇంద్రియగోచరము గనుక

ఇందుమీఁద "కేవలము ఇంద్రియ గోచరత్వము వలననే యే పదార్థమైనను అనిత్యము కాఁజాలదు. 'సామాన్య' మనుపదార్థ మింద్రియ గోచరమైనను నిత్యమే." అని యాక్షేపము రాఁగా, 'ఇంద్రియ గోచరము గనుక' అను హేతువునకు 'సామాన్యత్వముగల ఇంద్రియ గోచరత్వము' అని అర్థము చెప్పిన ఈ దోషము సిద్ధించును.

౬ అర్థాంతరము

మూల విషయమును విడిచి యన్యవిషయ ప్రసంగముఁ దెచ్చుట యర్థాంతరము:

శబ్దము నిత్యము
అస్పర్శత్వమువలన

అని చెప్పగా దీనికిఁ బూర్వపక్షము వచ్చి హేతువు పరిశుద్ధమైనది కాదని యాక్షేపింపగా, దానికి సమాధానము చెప్పుటకు మారుగా "హేతుపదము 'హిను' ధాతువునకు 'తుని' ప్రత్యయము తగిలినయైన కృదంతపదము, పద మనగా సుబ్ తిఙంతము" అని సంబంధములేని మాటలు చెప్పఁ దొడఁగుట.

౭ నిరర్థకము

అర్థములేని వర్ణక్రమమును వాదమునందు నుపయోగించిన ఈ దోషమగును.

శబ్దము నిత్యము
కచటతపత్వమువలన

౮ అవిజ్ఞాతార్థము

అర్థముకాని వాక్యమును వాదమునందు నుపయోగించుట. వాదములో గెలువలేక కొందఱు, అర్థములేని పదమును, భిన్నార్థపదములను, అర్థము కానట్లు త్వరగాగాని, మెల్లగాగాని యుచ్చరించెదరు. అట్టి సమయమున, ఆమాటలు మూఁడు సారులు ఉచ్చరించినను, సభవారికిని ప్రతివాదికిని అర్థము కాని యెడల నవి నిగ్రహస్థానము లగును.

౯ అపార్థకములు

అన్వయదోషమువలన ఒక శబ్దమునకును మఱియొక శబ్దమునకును సంబంధము లేకుండ నుచ్చరింపఁబడు వాక్య మిట్టిది. వాదములో జయింపలేక యొకానొకఁ డిట్లు హేతువును చెప్పును:—

'పది దానిమ్మపండ్లు, ఆఱు అప్పచ్చులు, భిక్షాపాత్ర,' ఇత్యాది అసంబద్ధ వాక్యము.

**౧౦ అప్రాప్తకాలము**

అవయవవిపర్యాసమువలనఁ గలిగెడి వచనము అప్రాప్తకాలము.

న్యాయమునకు నైదు అవయవములున్నవని చెప్పియున్నాము. వాని క్రమము, ప్రతిజ్ఞ, హేతువు, ఉదాహరణము, ఉపనయము, నిగమనము. ఈ క్రమముతప్పి మొదటఁ జెప్పవలసినది తర్వాతఁ తరువాత జెప్పవలసినది మొదటఁ జెప్పుటవలన ఈ దోషము కలుగును.

**౧౧ న్యూనము**

న్యాయముయొక్క అయిదు అవయవములోఁ గొన్ని లోపించినేని ఈదోషము పట్టును.

**౧౨ అధికము**

పెక్కు హేతువులుగాని, పెక్కు ఉదాహరణములుగాని ఉన్నయెడల ఈ దోషమగును. ఉదాహరణము:

పర్వతము అగ్నిమంతము
ధూమ మున్నది గనుక
వెలుతు రున్నది గనుక
కొలిమివలె

చెప్పినది మరలఁజెప్పుట పునరుక్తము (౧౩).

**౧౪ అననుభాషణము**

వాది, సభవారు వినుచుండగఁ దనప్రశ్న మూఁడు సారులు చెప్పినను ప్రతివాది బదులు చెప్పనియెడల నది అననుభాషణ నిగ్రహస్థాన మనఁబడును.

**౧౫ అజ్ఞానము**

మనము చెప్పినదానిని ప్రతివాది అర్థము చేసికొనలేక పోయినయది యజ్ఞాన మనెడు నిగ్రహస్థాన మగును. సభవారి యెదుట మూఁడుసారులు చెప్పఁగాఁగూడ ప్రతివాది యర్థము చేసికొనఁడేని యాతఁడోడిపోయినటులే యెంచవలెను.

**౧౬ అప్రతిభ**

బదులు చెప్ప లేక పోవుట.

**౧౭ విక్షేపము**

వేఱు కార్య మున్నది, మరల వచ్చెదనని తప్పించుకొని పోవుట విక్షేపము.

**౧౮ అనుజ్ఞ**

తనవాదమందు నొక దోష మున్నదని యొప్పుకొనుచుఁ బ్రతివాదివాదమందుఁగూడ నాదోషమును ఆరోపించుట అనుజ్ఞ యనిపించుకొనును. 'నీవు దొంగవు' అని ప్రతివాది ఆక్షేపించిన యెడల, 'నేను దొంగను కాను' అని రుజువుచేసి కొనుటకు మారుగ 'నీవుకూడ దొంగవే' యనుట యీదోషమున కుదాహరణము.

**౧౯ పర్యనుయోజ్యోపేక్షణము**

నిగ్రహింపఁదగిన ప్రసంగము వచ్చినప్పుడు వాదమునందు నిగ్రహింపక యూరకుండుట యీదోషము.

**౨౦ నిరనుయోజ్యానుయోగము**

నిగ్రహస్థానము కానిదానిని నిగ్రహించుట నిరనుయోజ్యానుయోగము.

సంయోగ హేత్వాభాసమునకు నిది తలక్రిందు. మొదట నొక్కొక్కపదమునకు నరిదలి యన్ని వ్యక్తుల సమూహమని యర్థముచెప్పి పిదప నాపద మొక్కొక వ్యక్తిసంబంధించినదని యర్థముచేయుటవలన నీ దోషము సంభవించును.

౪ విభాగ హేత్వాభాసము
Fallacy of Division

మాటలాడు వారి యుచ్చారణ భేదమును బట్టి వాక్యము నకు వేఱువేఱు అర్థముప్రాప్తించును. అట్లొకప్పుడొకయర్థము మఱి యొకప్పుడు మఱియొకయర్థము చేసినయెడల ఈదోషము సంభవించును. 'పెద్దలతోడ నబద్ధమాడఁగూడదు,'అన్న వాక్యమునందలి 'పెద్దలతోడ' అను పదమును ఒత్తి యుచ్చరించిన యెడల దానికి 'పెద్దలు కాని వారితో నబద్ధమాడవచ్చు' నని తాత్పర్యము కావచ్చును.

౫ కాకు హేత్వాభాసము
Fallacy of accent

కావ్యాదుల యందు నతిశయోక్త్యాదులకుఁ జెప్పఁబడు హేతువులలో ననేకములు హేత్వాభాసములు.

౬. అలంకారిక హేత్వాభాసములు
Fallacies of figure of speech

వస్తు హేత్వాభాసములు (Material fallacies) ఏడువిధములు:-

(౧)ఉపాధిసహిత హేత్వాభాసము (The fallacy of accident).

(౨)ఉపాధిరహిత హేత్వాభాసము (The Converse fallacy of accident).

ఈ రెండు హేత్వాభాసములును సంబంధముకలవిగాన కలిపిచెప్పఁబడును. మొదటి దానిలో సామాన్య నియమమునుండి విశేష నియమము సంబంధములేని యుపాధితోఁ గూడసాధింపఁబడును. రెండవదానిలో దానికి వ్యతిరేకముగ వ్యాపారము జరుగును.

ఉదాహరణము :

నిన్నఁదెచ్చిన వస్తువులన్ని నేఁడు తిన్నావు
నిన్న పచ్చికూరలు తెచ్చినావు
కావున నేడుపచ్చికూరలు తిన్నావు.

ఈ యుదాహరణమునందు 'పచ్చి' యను నుపాధి నిమిత్త మాత్రము. దానితో తర్కమునకు సంబంధములేదు. హేతువాక్యము లోని 'తెచ్చిన వస్తువులన్నియు' అనుటలో 'పచ్చివి' యన్న యర్థములేదు.

ప్రతిమానవుఁడును తనమతమును అభివృద్ధిచేయ వలెను.
మాజిస్ట్రేటు మానవుఁడు.
కావున మాజిస్ట్రేటు తన అధికారము నుపయోగించి తనమతమును అభివృద్ధిచేయ వలెను.

అను నది హేత్వాభాసము. మాజిస్ట్రేటు మనుష్యుఁడైనను న్యాయము చేయుటకు నొకయధికారము ఉపాధిగాఁ గలవాఁడు. ఆ యుపాధిసహితుని, ఉపాధిరహితునిగా నెంచఁగూడదు.

అన్యునిఁ గత్తితోఁ గోసినవానిని శిక్షింపవలెను
డాక్టరు అన్యునిఁగత్తితోఁ గోయును
కావున డాక్టరును శిక్షింపవలెను.

అను నదియు నిట్టి హేత్వాభాసమే.

ప్రతిజ్ఞతో (తాను రుజువు చేయఁబోవు దానితో) సంబంధములేని హేతువులను చెప్పుటవలన ఈ దోషము సంభవించును. ఇట్టి దోషము పెద్ద పెద్ద వాదవివాదములలో, వాది ప్రతివాదులు దీర్ఘకాలము వాదించి, తుదకు తాము దేనిని గుఱించి వాదించుచున్నామో దానిని మఱచియో, తప్పించియో, మఱియొక దానిని ప్రతిపాదించునపుడు సంభవించును. బలము లేని దావాలో వాదించు ప్లీడర్లకు నిది యాధారము. "మంచి కేసు కాని యెడల నెదటి ప్లీడరును తిట్టు" అని యింగ్లీషులో సామెత కలదు. అది దీనికుదాహరణము. వాదములో గెలువలేక ప్రతిపక్షుని, వాని తండ్రిని తిట్టుట యీ హేత్వాభాసము యొక్క యుదాహరణమే.

**(3) అసంబద్ధహేత్వాభాసము.**
Irrolevaht conclusion

రుజువు చేయవలసిన సిద్ధాంతమునే హేతువుగా గ్రహించుట. మొదటి దానికి రెండవది హేతువుగఁ జెప్పి, మరల రెండవదానికి మొదటిది హేతువుగఁ జెప్పినను ఈ దోషమగును. 'ఆత్మ శాశ్వతము, వినాశములేనిదగుటచే' అన్నది యిందు కుదాహరణము. వినాశము చెందక పోవుటయు, శాశ్వతముగ నుండుటయును సమానార్థకములు. కావున తాను రుజువు చేయవలసిన మాటయే మొదట గ్రహించినాఁడు.

**(౪) అన్యోన్యాశ్రయహేత్వాభాసము**
Petitio Principii

ఇట్లు పర్యాయపదములను ప్రయోగించి సిద్ధాంతములను స్థాపింపఁ జూచువారందఱును ఈ దోషమునకుఁ బాత్రులు. "ఈపని నేను చేయఁగూడదు. ఎందుకు? అది తప్పు గనుక. అది తప్పని నీ కెట్లు తెలియును? అది చేయఁగూడదని నేనెఱుంగుదును గనుక అది తప్పు"; "శ్రీ మహావిష్ణువు అందఱు దేవతలకంటెఁ గొప్పవాఁడు. ఎందుకు? విష్ణు పురాణమునందుఁ జెప్పఁబడినది గనుక. అందునట్లేల చెప్పఁబడియున్నది? శ్రీమహావిష్ణువు గొప్పవాఁడు గనుక" అన్న వాదములు పరస్పరాశ్రయ దోషదూషితములు. ఈ దోషమునకు సిద్ధసాధనము అనియుఁ బేరు పెట్టవచ్చును.

హేతువాక్యములకును సిద్ధాంతవాక్యములకును ఏవిధమైన సంబంధమును లేనప్పుడు ఈ దోషము సిద్ధించును.

**(౫) అసిద్ధహేత్వాభాసము**
The fallacy of the consequent

ఆంధ్రదేశము గొప్పది
చంద్రగుప్తుఁడు గొప్పచక్రవర్తి
కావున చంద్రగుప్తుఁడు ఆంధ్రుఁడు

ఈ దోషము పైరూపముగ నున్న త్వరగా గనుఁగొనవచ్చును కాని యీ క్రిందిరూపముననున్న కనుఁగొనుట కష్టము.

ప్రతివాఁడు సుఖముగోరును
సజ్జనులు సుఖులుగనుందురు
కావున ప్రతివాఁడు సజ్జనుఁడు.

తగిన హేతువులు లేనిదే యొక కార్యమునకు నొకవస్తువు కాని, వ్యాపారముగాని హేతు

వనియెంచుట. తోకచుక్కలు భూమిమీఁద శుభా శుభములకుఁ గారణ మనుకొనుటయు తుమ్ములు, కార్యవిఘ్న సూచకము లనుకొనుటయు దీనికి నుదాహరణములు.

౬ హేత్వ విపర్యాస హేత్వాభాసము
The fallacy of the false cause

కొన్ని ప్రశ్నలు కలిపి యొక్క ప్రశ్నగా నడిగినఁ గొన్ని సమయములయందు బ్రత్యుత్తర మిచ్చుటకు వీలుగ నుండదు. 'నీవు నీ తల్లిని కొట్టుట మాని తినావా?' అను ప్రశ్నకు 'అవును' అని జవాబు చెప్పినను, 'లేదు' అని చెప్పినను విపరీతార్థము నిచ్చును. 'అవును' అనఁగా నిదివఱకు కొట్టుచుంటినని యర్థము. 'లేదు' అనిన ఇదివఱకు కొట్టుచుంటిని, ఇంకను కొట్టుచున్నాను అని అర్థము. తెలివి గలవాఁడయినగాని ఈ మర్మము కనుఁగొని 'నేను ఎన్నడును మా యమ్మను కొట్టలేదు' అని జవాబు చెప్పఁజాలఁడు. సాక్షులను క్రాసు-ఎగ్జామిన్ చేయునప్పుడు వకీళ్లు ఇట్టి ప్రశ్నలువేయుచు, 'అగును, లేదు' అని జవాబు చెప్పుమని బెదరించు చుందురు. అట్లు జవాబు చెప్ప నక్కరలేదు.

౭ అనేక ప్రశ్న హేత్వాభాసములు
Fallacy of many questions

ఇంతవఱకు వ్యాప్తిసాధకాను మానము (Deductive reasoning) నుగుఱించి చెప్పితిమి. వ్యాప్తిసాధ్యానుమానము (Inductive reasoning)నుగుఱించియుఁ బాశ్చాత్యన్యాయశాస్త్రమందలి యితర విశేషములను గుఱించియు 'తర్కము' 'న్యాయము' అనుశబ్దముల యొద్ద వ్రాయఁబడును. [కో. ల.

# పారిభాషిక పదములు

వ్యాప్తిసాధకానుమానమును గుఱించిన పారిభాషిక పదముల నీక్రిందనిచ్చెదము. ఈపట్టిక తర్కశాస్త్రసంబంధమైన పాశ్చాత్యపౌరస్త్య గ్రంథములను పెక్కింటినిచూచి సమకూర్పఁబడినది. నాగరీప్రచారిణీసభవారి శాస్త్రీయపదపారిజాతమును, (Glossory of Scientific Terms), ప్రొఫెసర్ రానడేగారి ఇరువదవ శతాబ్దాంగ్ల మహారాష్ట్ర కోశమును (Pro. Ranade's Twentieth Century English Marathi Dictionary)కూడ నుపయోగించినాము. కొన్ని యింగ్లీషుపదములకు రెండుమూఁడు పర్యాయపదము లీయఁబడినవి. అట్టియెడ నీయనుమాన వ్యాసమునందు నుపయోగింపఁబడినపదము మొదటను, మిగిలిన పర్యాయపదములు తరువాతను వ్రాయఁబడినవి.

Affirmative భావ, విధాయక, అస్తిత్వబోధక.

,, proposition భావవాక్యము,

Between the horns of the dilemma వికల్పజాల బంధమునందు, ఉభయసంకటములో, ఉభయతః పాశారజ్జువు

Casuist ధర్మశాస్త్రి, తర్కప్రవణుఁడు

Categorical proposition నిశ్చయార్థకవాక్యము

Conclusion సిద్ధాంతము, నిగమనము

Concomitance సాహచర్యము, సహభావము

Concomitant

absence వ్యతిరేకవ్యాప్తి

presence అన్వయవ్యాప్తి

Connotation ధర్మార్థము, గుణసూచకము, జాత్యర్థము, సామాన్యాభిధానము

Connotative గుణబోధకము, జాతివిశిష్టవ్యక్తిబోధకము

Contradiction పరస్పరవైరము
Contradictory పరస్పరవిరోధి
Contraposition రూపపదపరివర్తనము, నిషేధవ్యవస్థాపనము
Contrariety వైరము, వైపరీత్యము
Contrary వైర, విపరీత
Converse పదపరివర్తిత
Conversion పదపరివర్తనము, ఉద్దేశ్యవిధేయ పరివర్తనము
Copula సంయోజకపదము, (ఉద్దేశ్యవిధేయ) సంయోజకము
Deceptive reasoning ఛలము
Deduction నిగమనానుమానము
Deductive Logic వ్యాప్తిసాధకానుమానము, నిగమనవిద్య
Defective syllogism దుష్టానుమానము
Denotation సంఖ్యార్థము, వ్యక్త్యర్థము, విశేషాభిధానము
Destructive dilemma నిషేధాత్మకవికల్పము
Destructive Sorites నిషేధాత్మకన్యాయ శృంఖల
Dialectics తర్కశాస్త్రము
Dictum de Omni et Nullo యద్వర్గేతదేకస్మిన్
Differentia వ్యావర్తకము
Dilemma వికల్పజాలము
Disjunctive వైకల్పికము
Distribution of terms పదములకువ్యాప్తి
Exceptive proposition అపవాదకప్రతిజ్ఞ
Exclusive proposition నిరాసకప్రతిజ్ఞ
Extensive syllogism విస్తారకానుమానము
Fallacious reasoning తర్కాభాస, దుష్టతర్కము,
Fallacies హేత్వాభాసములు, నిగ్రహస్థానములు
Logical తర్క హే.
Semi Logical అర్ధతర్క హే.; మిశ్ర హే.
Material వస్తు హే., వాస్తవ హే., వ్యాపార్థాభాసము,
Amphiboly వాక్యార్థసంశయ హే. సందిగ్ధార్థత, ద్వ్యర్థకథ
Accent కాకు హే.
Four terms పదచతుష్టయ హే.
Undistributed middle అవ్యాప్య హే.
Illicit Major అక్రమసాధ్యవ్యాప్తి హే.
Illicit Minor అక్రమపక్షవ్యాప్తి హే.
Negative premises అభావ హే.
Equivocation పదార్థసంశయ హే.
Ambiguous terms వాక్ఛలము.
Composition సంయోగ హే.
Division విభాగ హే.
Figure of speech అలంకార హే.
Accident ఉపాధిసహిత హే., సోపాధిక హే.
Petitio Principii అన్యోన్యాశ్రయ హే., సిద్ధసాధ్యము, ప్రకరణసమము.
Complex Question అనేక ప్రశ్న హే.
Irrelevant conclusion అసంబద్ధ హే.
Consequent అసిద్ధ హే.
False cause హేతువిపర్యాస హే.
Figure (త్రిపాది) శ్రేణులు, అనుమానవాక్యప్రకారము
Hypothetical proposition సాపేక్షవాక్యము
Immediate inference సాక్షాదనుమానము, అవ్యవహితానుమానము
Induction వ్యాప్తిసాధ్యానుమానము, వ్యాప్తిగ్రహ, ఆగమన (అనుమానము.)
Inductive Logic వ్యాప్తివాదము, వ్యాప్తి సాధ్యానుమానము
Inference తర్కము, అనుమానము

Law of న్యాయము, సూత్రము

Identity ఏకార్థక న్యాయము, తాదాత్మ్యన్యా.

Contradiction పరస్పరవైరుధ్యన్యాయము

Excluded middle తృతీయపక్షాభావన్యాయము, మధ్యమ నిరాసన్యాయము

Logic తర్కశాస్త్రము, న్యాయశాస్త్రము, ఆన్వీక్షికీ

Logician తార్కికుఁడు, నైయాయికుఁడు

Major premise ముఖ్యహేతువాక్యము, ఉదాహరణము, వ్యాప్తివాక్యము, అనుగమవాక్యము, వ్యాపకపూర్వావయవము

Major term సాధ్యము, వ్యాపకపదము

Mediate inference అనుమానము

Middle term లింగము, హేతుపదము, మధ్యపదము

Minor premise గౌణహేతువాక్యము, హేతువాక్యము, ఉపనయము, వ్యాప్యపూర్వావయవము

Minor term పక్షము, వ్యాప్యపదము

Moods తర్కములు

Negation అభావము, నిషేధము, ప్రతిషేధము

Negative అభావ (పదము, వాక్యము)

Obversion రూపపరివర్తనము, ప్రతివర్తనము, వ్యాప్యవ్యాపకవిరుద్ధప్రతిషేధము

Opposite side విపక్షము

Opposite term విరోధిపదము

Opposition వైరము, విరోధము, విపక్షత, ప్రతియోగము

Opposition of Proposition వాక్యవిరోధము

Particular proposition ఏకదేశికవాక్యము

Predicate విధేయము

Predication విధానము

Premise హేతువాక్యము, స్వీకృతవాక్యము

Proposition వాక్యము

Quality of a proposition వాక్యరూపము, స్వరూపము, గుణము

Quantity of a proposition వాక్యవ్యాప్తి

Ratiocination తర్కము, అనుమానము

Sorites న్యాయావలి

Sub-altern ఆభాస వైరి

Sub-alternation అభాసవైరము

Sub-contrariety కించిద్వైరము

Subject కర్తృపదము

Syllogism న్యాయము, త్రిపాది, తర్కము, అనుమానవాక్యము, త్ర్యవయవి

Term పదము

Universal proposition సార్వదేశిక, సర్వవ్యాపి, సర్వగత, సార్వలౌకిక (వాక్యము)

**అనుము.** (Dolichos Lablab):-ఇది చిక్కుటకుటుంబములోఁ జేరిన యొకజాతి మొక్క. మొదటఁ గొంతవఱకు గుబ్బగ నెదిగి పిమ్మట తీగగసాగును. ఆకులు చిక్కుడాకుల వలెనే 3 ఉపదళములు గలిగి యుండును. కాయలును గొంచె మించు మించు చిక్కుడు కాయలనే బోలియుండును.

అనుము ఇండియాదేశమందంతటను సాగుచేయఁబడుచున్నది. అనేకచోట్ల వన్యస్థితియందునుగానవచ్చుచున్నది. హిమాలయములపై నేడువేల యడుగులు ఎత్తువఱకు నిది పెరుగుచున్నది. ఇండియాదేశమే యీ మొక్కకు ఆదిస్థానమని యూహింపఁబడుచున్నది. మూఁడువేల సంవత్సరములకుఁ బూర్వమే జనులు దీని నెఱిఁగి సాగుచేయుచుండినట్లు చరిత్రకారు లూహించుచున్నారు. ఇండియానుండియే యిది చీనా ఈజిప్టు

పర్సియా మొదలగు దేశములను వ్యాపించి యుండును.

ఇండియా దేశమున దీనిసాగు మధ్యమ, పశ్చిమ దక్షిణభాగములందు మెండు. ఉత్తర హిందూస్థానమునఁ దక్కువ. చెన్నపురి రాజధానిలో బళ్లారి, కడప, కోయంబత్తూరు, సేలము, దక్షిణార్కాడు, తంజావూరుజిల్లాలీసస్యము సాగుచేయఁబడు ప్రదేశములలో ముఖ్యములు.

అనుములోఁ బెక్కురకములు గలవు. గింజల వర్ణమునుబట్టి వీనిని తెలుపు ఎరుపు నలుపు తరగతులుగ విభాగించవచ్చును. బొంబాయిరాజధానిలోను కొన్నియితర ప్రదేశములందును తోఁటపైరుగ సాగుచేయఁబడు రకములును మెట్టసస్యముగ సాగుచేయఁబడు రకములును వేర్వేఱుగ పరిగణింపఁబడుచున్నవి.

అనుము తొలకరిలో చోడి, కంది, ఆముదములు మొదలగు సస్యములలోఁ గలిపి సాగుచేయుటవాడుక. సెప్టెంబరు, అక్టోబరు నెలలలో పునాస పంటకోతలకు పిమ్మట దీనిని సాగుచేయుటయుఁ గలదు. ధుంపవరి నేల్లలలో వరి కోసిన పిమ్మట జనవరినెలలో దీనిని సాగుచేయుదురు.

అనుమునకు బంకగరుములును, గరుములును అనుకూలములు. నేలను ౩, ౪ చాళ్లదున్ని నాగటిచాలులో విత్తులను అడుగున కొక్కటి చొప్పునవేసి కప్పవలెను. ప్రత్యేకమ్ము జిల్లునెడల ఎకరమునకు ౧౬-౨౦ సేర్ల విత్తులు పట్టును. ౫, ౬ నెలలలో పంటపూర్తియగును. సామాన్యముగ ౪౦-౬౦ కుంచములు యానుములునొ ౧ బండిబొత్తును అగును.

అనుపచేని కొకవిధమగుపేను తరుచు పట్టుచుండును. గొంగళి పురుగులును ఒక్కొకప్పుడు నష్టమును గలిగించుచుండును. ఇతర పయరసస్యములకు వలెనే దీనికిని పూతకాలమున మబ్బులును తేమగాలియుఁ బ్రతికూలము. అనుములు మనుష్యులకును పశువులకునుగూడ ఆహారముగ నుపయోగించును. సాతాళించిన యానుములు చాలచోట్ల అంగళ్లలోవిక్రయింపఁబడుచుండును. పచ్చికాయలలోని గింజలు కూరలలో నుపయోగింతురు. అనుపగుగ్గిళ్లు పశువులకు మంచిదాణా. అనుపబొత్తు పశువులకుఁ బ్రియము.

అనుముల యొక్కయు, అనుపబొత్తుయొక్కయు పృథక్కరణ మీక్రింద వివరింపఁబడును.

| | అనుములు | అనుపబొత్తు |
|---|---|---|
| తేమ | ౯.౫౯ | ౯.౯౨ |
| ఆల్బుమినములు | ౨౧.౩౫ | ౧౩.౮౭ |
| కర్బనోజ్జనితములు | ౫౭.౨౩ | ౪౩.౦౩ |
| చమురు | ౧.౨౫ | ౩.౭౨ |
| నారపదార్థము | ౬.౫౭ | ౧౬.౧౭ |
| బూడిద | ౪.౦౧ | ౧౩.౭౦ |

అనుము పశువుల మేతకొఱకుఁ బ్రత్యేకముగ బెంచఁదగిన సస్యములలోనొకటి. పచ్చిమేరు

వునకును దీనిరొట్ట ప్రశస్తము. ఇందు నూటికి ౦.౭౪ పాలు నత్రజనియు ౪.౧౬ పాలు స్ఫురత్వంచామ్ల జనిదమును ౦.౪౬ పాలు పోటాషును గలవని లెక్క వేయఁబడెను.

అనుములు నలుగగొట్టి నీటిలో నాన వేసిన యెడల నొక్కొకప్పుడు ఉదజనయని కామ్లము (Hydocyanic acid) అను విషద్రవ్యము జనించునని డాక్టరు వెదరుగారు కనుఁగొనిరి.

[గో. జో.

**అనుయాయి.** ధృతరాష్ట్రుని నూర్గురు పుత్రులలో నొక్కఁడు.

**అనురాధపురము.** సింహళ ద్వీపమందలి యొక పురాతనపట్టణము, బౌద్ధక్షేత్రము. పూర్వమిది మహావైభవ మనుభవించిన పట్టణమైనను ప్రస్తుతము విధ్వంసమై జీర్ణస్థితి యందున్నది. మొత్తముమీఁద ౧౪౦౦ సంవత్సరముల వఱకును సింహళమునకు ముఖ్యపట్టణముగ నుండెను.

'గౌతమబుద్ధుఁడు నిర్యాణమునందిన సంవత్సరముననే విజయ నేనుఁడను వాఁడార్యావర్తమునుండి బయలుదేరి సింహళమునకు వెళ్ళి, యచ్చట రాజయ్యెను' అని సింహళ చరిత్రమును దెలుపు మహావంశమువలనఁ దెలియుచున్నది. ఈతఁడే యాదేశమునందు బౌద్ధమతమును వ్యాపింపఁజేసెను.

ఇతని కనురాధుఁడను తమ్ముఁడు గలఁడు. ఆతఁడు క్రీ. పూ. ౬-వ శతాబ్దమున 'అనురాధపురమ్మును' ప్రతిష్ఠించెను. ఇది మొదట నొకచిన్నపల్లె. క్రీ. పూ. ౪౩౭ ప్రాంతమున పాండుకాభయుఁడను రాజు సింహళము నేలుచుండెను. ఆతఁడనూరాధ పట్టణమును బెంచి పెక్కు మేడలను, ఉద్యాన వనములను నిర్మించి, మహాపట్టణముగ మార్చి, తనరాజధానిం జేసికొనియెను గావున నిది అథమపక్షమున రెండువేల నాలుగువందల సంవత్సరముల పురాతనపట్టణము. దీనిచుట్టుకొలత ముప్పదిరెండు క్రోశములు.

ఈ రాజు జయవాపియను గొప్పతటాకమును నిర్మించెను. దానినే రాజుపేర అభయవాపియనియుఁ జెప్పుచుండిరి. ఈ తటాకమిప్పటికిని గొంత వఱకుఁ గానవచ్చును. ఇప్పుడు గానవచ్చుదాని కొల్త రెండుమైళ్లు. దీని యొద్దుననే రాజు నూతన పట్టణమును గట్టించెను. దీనికినాలుగు సివార్లును, సమాధిస్థలమును, వేటవాండ్రు మొదలగు వారికి నేఱుపల్లెయు, దేవాలయములును, జైనులు ఆజీవికులు మొదలైన మతమతాంతరులకునై మఠములును, వేఱువేఱుగ నిర్మించెను. పట్టణమున కుత్తరమున గామినీతటాకముఁ ద్రవ్వించెను. ఇప్పుడు దానిని విలాన్ తటాకమందురు.

ఈ పట్టణముయొక్క వైభవమును, శోభను, కీర్తిని పెంపుచేసినవాఁడు తిస్సరాజు. ఈతఁడు క్రీ.పూ. 3 వ శతాబ్దమధ్యమున నుండెను. కావున నితఁడు అశోకమహారాజుతో సమకాలికుఁడు. ఈ యిద్దఱురాజు లొకరి

నొక రెన్నడును జూచుకొనక పోయినను, మిక్కిలి స్నేహముగలవారై బౌద్ధమతాభివృద్ధిఁ జేసిరి. తిష్యుఁడు బౌద్ధమతము నవలంబించి బౌద్ధులకు వంద్యమగు బోధివృక్షమును ఈగ్రామమునందుఁ బాతించిదానిచుట్టు మహావిహారమును నిర్మించెను. గయలోని వటవృక్షముయొక్క కొమ్మనొకదానిని అశోకుఁడు తిష్యునకుఁ బంపెనట. దానినేయాతఁడు బోధివృక్షముగఁ బాతించెను. ఇట్లు రమారమి ౨౨౦౦ సంవత్సరముల క్రిందఁ బాతఁబడిన వృక్షమిప్పటికిని జీవించియున్నది. ఈ వృక్షమచ్చటఁ బాతఁబడినప్పటినుండియు నాస్థలము బౌద్ధులకు పుణ్యక్షేత్రమయ్యెను.

ఈ బోధివృక్షము యొక్క పీఠస్థానమునకు మహావిహారమనిపేరు. ఈ విహారమునందు రెండుమహా భవనములు కలవు. అవి మిక్కిలి మనోహరములుగ కట్టఁబడినవి. ఈ వృక్షమును జూచుటకై దూరదూర దేశములనుండి బౌద్ధులు వచ్చుచుండిరి. క్రీ. శ. ౩౯౯ లో 'ఫాహియాన్' అను చీనాపరివ్రాజకుఁడీవృక్షమును సందర్శించెను. ఈ వృక్షముక్రింద నైదుగురు బుద్ధులు సిద్ధించిరని యాదేశపువారు చెప్పెదరు.

ఈ మహావిహారమునకుఁ గొంతదూరము స్తూపాకారమైన యొకచైత్యముగలదు. ఇందు బుద్ధదేవుని అస్థులు సమాధి గావింపఁబడినవని చెప్పెదరు. ఈ చైత్యమును క్రీ. పూ. ౩౦౭-వ సంవత్సరమునఁ దేవప్రియ తిష్యుఁడను రాజు నిర్మించెను. ఈ రాజుపై బుద్ధదేవునకు నెక్కుడు కృపయుండుటచే బుద్ధదేవుని కుడిపైపు అస్థివచ్చి ఈ రాజుమకుటముపై నిల్చెనట. అతఁడు దానిని భక్తిపూర్వకముగ స్వీకరించి దానిపై నీ చైత్యమును నిర్మించెనట. ఇట్లే ఇచ్చట మఱికొన్ని పురాతన నిర్మాణములు గలవు.

ఈ రాజీ పట్టణమునందుఁ బదిగ్రోత్తమందిరములను బౌద్ధమతాభివృద్ధికై కట్టించి పట్టణము శోభ హెచ్చించెను. ఇవన్నియు నిప్పుడు జీర్ణములై పోయినను, ఆమందిరములలోని కొన్నిశిలాభాగములు మాత్రము తమపూర్వ వైభవమును వెల్లడిచేయుచున్నవి. బౌద్ధకాలపు శిల్పకళా కౌశలమును జూపునట్టి ముఖ్యస్థలములలో నిదియొకటి. ఇచ్చట ధూపారామము, మునివిహారము అనుకట్టడము లింకను గానవచ్చును. రాజకీయోద్యోగమునుండి సన్యసించిన వారుండుటకునై మునివిహారము నిర్మింపఁబడియె.

తిస్సరాజు మరణానంతరము కొద్దికాలమునకే తమిళులు (అఱవవారు) ఈ పట్టణమును స్వాధీనపరచుకొనిరి. కాని యొకశతాబ్దానంతరము, వారియొద్దనుండి దుష్టగామిని అభయుఁడను వాఁడీపట్టణమును స్వాధీనపరచుకొనెను. ఇతఁడే పట్టణమున నూతన మందిరముల నిర్మించెను. అందు కంచురాజమందిరమన్నది మిక్కిలి విఖ్యాతి వడసెను. ఇయ్యది సమచతుష్కోణాకారమైన యరుగుమీఁద వేయి

రాతి స్తంభములు నిలిపి వానిపైఁగట్టఁబడి
నది. ఈచతుష్కోణముయొక్క యొక్కొక్క
భుజము ౧౫౦ అడుగులు పొడవుండెను.
ఈ స్తంభములు నిప్పటికిని చూడవచ్చును.
ఈ స్తంభములమీఁద చతుష్కోణాకారముగఁ
గ్రిందిదానికంటెఁబైది చిన్నదిగ నుండునట్లు
తొమ్మిది యంతస్తుల మేడఁగట్టఁ బడియె!
ఈ మేడక్రిందినుండి పైవఱకు ౧౫౦ అడుగు
లెత్తుండెను, ఈభవనమంతయుఁ గొయ్యతోఁ
జేయఁబడియె. చివరయంతస్తుమీఁదఁ గం
చుతోఁ జేయఁబడిన పెంకులు కప్పఁబడియుం
డెను. దీనికంతకును ముప్పదికోట్లు రూపా
యలు వ్యయమయ్యెనని మహావంశమునందుఁ
జెప్పఁబడినది (౨౭.) !

ఈ రాజే వేయికోట్లరూపాయలు వెచ్చించి
'హేమావతి' (బంగారముతోఁ జేయఁబడిన)
దాగోబను మందిరమును నిర్మించెనఁట. కాని
యిది యీరాజుకాలములోఁ బూర్తికాలేదు.
ఈ బంగారు దాగోబము, దానిరచన, శోభ
మొదలయిన వానిని విపులముగ మహావంశ
మను కావ్యమునందు నైదు సర్గములలో
(౨౮-౩౨) వర్ణించియున్నాఁడు.

క్రీ. పూ. ౧౦౯ లో తమిళులు మరల
నీపట్టణమును పట్టుకొనిరి. క్రీ. పూ. ౮౯వ
సంవత్సరమునందు సింహళ దేశజుఁడైన వత్త
గామిని అనువాఁడు ఈపట్టణమును తమిళుల
యొద్దనుండి తీసికొనెను. ఈతఁడు తన విజయ
సూచకముగ అభయగిరిదాగోబమను మందిర
మును కట్టించెను.

తరువాత కాలమునను రాజులును, మం
త్రులును, ఇతర శ్రీమంతులును ఈ పట్టణము
నందు గొప్పగొప్ప మందిరములను కట్టించిరి.
క్రీ. శ. ౪వ శతాబ్దమునందుఁ గట్టఁబడిన జేత
వనాశ్రమము అనునది యింకను కొంతవఱకు
మంచిస్థితియందున్నది.

విద్యా పీఠము

అయిదవ శతాబ్దప్రారంభమునందు ఫాహి
యాను అను చీనాపరివ్రాజకుఁడు ఇచ్చట
విద్యాభ్యాసమునకై రెండు సంవత్సరములు
(౪౧౧-౪౧౨) ఉండెను. ఆతని కాలమందు
నిచ్చటఁ గొప్ప విద్యాపీఠ మొకటి కలదు.
ఉత్తర దేశమందు 'నాలంద' విద్యాపీఠము
నకు నెట్టి ఖ్యాతికలదో యట్టి ఖ్యాతియే
దక్షిణమున 'అనురాధపుర' విద్యాపీఠమున
కుండెను. సామాన్యజనులకై, ధర్మశాస్త్రము
జ్యోతిషము, నీటిపారుదల (చెరువులు నిర్మిం
చుట, కాలవలు త్రవ్వుట మొదలైనవిద్య)
కవిత్వము; సాహిత్యము అను విషయములు
నేర్పుచుండిరి. భిక్షువులకు (సన్యాసులు) పాలీ
భాషలోని బౌద్ధ వేదములును, వానిమీఁది
దేశభాషా భాష్యములును గురుశిష్యపరంప
రగ బోధింపఁబడు చుండెను. పాలిభాషయు,
వ్యాకరణమును వారిమత సంబంధమైన
యోగ శాస్త్రము, నీతిశాస్త్రము, తత్త్వశా
స్త్రము, మీమాంసా శాస్త్రము, భిక్షువులు
నేర్చుకొను విషయములలో ముఖ్యమైనవి.

ఇట్లు ఘనతఁజెందిన విద్యా పీఠమునకు నానా దేశములనుండి విద్యార్థులు వచ్చుచుండిరి. గయనుండి బుద్ధఘోషుఁడను వాఁడు వెళ్లి మతసంబంధమైన తత్త్వములను నేర్చికొని వచ్చెను.

బుద్ధఘోషుఁ డిచ్చట నుండిన కాలమున,

నీటియేర్పాటు

ఈ పట్టణమునకు నీటి యిబ్బంది లేకుండఁ జేయుటకై ధాతుసేనుఁడనురాజు క్రీ. శ. ౪౫౦ లో, పట్టణమునకు నేఁబదిమైళ్లమీఁద 'కాలవాపి' యనునొక గొప్పతటాకమును నిర్మించెను. ౧౪ మైళ్లు పొడుగుగల దాని కట్ట యిప్పటికిని ఆ యరణ్య ప్రాంతమునఁ గానవచ్చును. అప్పుడు దానిచుట్టు కొలత ౫౦ మైళ్లఁట. అందుండి పట్టణమునకు వచ్చిన కాల్వ లిప్పటికిని కొన్నిమంచి స్థితియందున్నవి. మానవులచే నిర్మింపఁబడిన తటాకములలో నాకాలమందు నింతకంటెఁ బెద్దది లేదని చెప్పవచ్చును. ఇదియే యనురాధపురమున జరిగిన గొప్పవైభవ కార్యము. ఇఁక మీఁద నీపట్టణ వైభవము తగ్గఁజొచ్చె.

ఇటఁ దరువాత రాజ్యమునకై పెక్కువంశముల వారు పోరాడుచు, నొకప్పుడు వీరును, మఱియొకప్పుడు వారును విజయులగుచు వచ్చిరి. ఓడినవారు తమిళుల సాయముఁదీసికొనుచుండినందునఁ గ్రమముగఁ ద్రమిళులా దేశమునఁ బ్రవేశించి దాని దోచుకొనఁజొచ్చిరి. క్రీ. శ. ౨౧౦ లో నీపట్టణము విడిచి, పుల స్తిపురమను దానిని సింహళమునకు రాజధానిఁ జేసిరి. ౧౧-వ శతాబ్దమునందు దీనిని రాజధానిఁ జేయఁబ్రయత్నము జరిగెనుగాని అది సఫలమైనది కాదు. క్రీ. శ. ౧౩౦౦ల ప్రాంతమున నిదిబొత్తిగఁ బాడుపడి పోయినట్టు కానవచ్చుచున్నది. చుట్టుపట్టు ౫౦ మైళ్ల వఱకు నరణ్యము పెరిగినది. ఇప్పుడు బోధివృక్షముచుట్టునున్న బౌద్ధభిక్షువుల రెండు మూఁడు గుడిసెలు తప్ప మఱే యిల్లును లేదు.

ఇటీవల నీప్రాంతమునుండి రోడ్లు, రైలు పడ్డందున నిచ్చటఁ గొందఱు దొరతనము వారి యుద్యోగస్థులు బంగళాలు కట్టుకొని వాసముచేయుచున్నారు. శిథిలమైన కట్టడములను దొరతనమువారు ఇంకను చెడి పోకుండ రక్షణచేయుచున్నారు.

**అనురాధ.** సోముని యిరువది యేడ్గురు భార్యలలో నొక్కతె. ౧ నక్షత్రము. [చూఁడు నక్షత్రములు.]

**అనుల.** ౧ సింహళదేశపురాజైన మహానాగుని భార్య. మహానాగుఁ డశోకచక్రవర్తికి సమకాలీనుఁడని చెప్పుదురు. సింహళమున బౌద్ధధర్మమును వ్యాపింపఁ జేయుటకు నీమె పాటుపడెను. ఈమెకు బౌద్ధమతజ్ఞాన మధికముగ నుండెను. ఈమె ఆడబిడ్డపేరు సంఘమిత్ర. ఈమెకు బౌద్ధమతమునందుఁగల విశేష జ్ఞానమునుబట్టి సంఘమిత్ర యీమెను 'ఆచార్య' యని పిలుచుచుండెను.

౨. సింహళపతియైన కోరాంగరాజుభార్య. దురాచరణము కలది. తనపతియగు కోరాంగుని, పుత్రుఁడగు తిష్యుని, నలుగురు ఉపపతులను విషముపెట్టి చంపెను. ఈమె రాజ్యము చేయుచుండఁగ నీమె మరదికుమారుఁడైన కాలకర్ణతిష్యుఁడనువాఁడు తిరుగబడి యీమెను చంపి రాజయ్యెను (క్రీ. పూ. ౧౫౧.)

**అనులు.** వేదకాలమందు పరుష్ణినదీ తటముననున్న జనులకు పేరు.

**అనులోమ** (ప్రతిలోమవివాహములు) ఎక్కువజాతి పురుషులు తక్కువజాతి స్త్రీలను వివాహమాడిన నది అనులోమవివాహ మనిపించుకొనును. బ్రాహ్మణుఁడు క్షత్రియ వైశ్యా శూద్రస్త్రీలను, క్షత్రియుఁడు వైశ్య శూద్ర స్త్రీలను, వైశ్యుఁడు శూద్రస్త్రీని వివాహ మాడిన అనులోమ వివాహమగును. దీనికి విరోధశబ్దము ప్రతిలోమ వివాహమను నది. తక్కువ జాతిపురుషులు ఎక్కువజాతి స్త్రీలను పెండ్లిచేసికొనుట ప్రతిలోమము. హిందూ ధర్మశాస్త్రమతమున ప్రతిలోమ వివాహములు ఎల్లప్పుడునుగర్హితములు. అనులోమ వివాహములు పూర్వ యుగముల యందుఁ జెల్లినవి. కాని కలియుగమునందు నవియు నిషిద్ధములే. ఇప్పుడమలులోనున్న ఆచారము ప్రకారమును కోర్టువారిచే నొప్పుకొనఁబడిన హిందూ లా ప్రకారమును అనులోమ ప్రతిలోమ వివాహము లన్నియు నిషిద్ధములే. ఆచారము ననుసరించి యేజాతివా రాజాతిలోనే వివాహముచేసికొన వలెను. అట్లు చేసికొనక మఱియొక జాతితో సంబంధము కలుగఁజేసి కొన్నయెడల నావివాహముచెల్లదు. అనఁగా వ్యవహారము కోర్టుకు వచ్చినప్పుడు, కోర్టువారట్టి వివాహిత స్త్రీని దాసిగను, దాని సంతతిని దాసీ పుత్రులు గను భావించెదరు.

ఇట్లుసామాన్యముగ అనులోమ ప్రతిలోమ వివాహములిప్పుడు లేక పోయినను, ఒకవిధమైన యనులోమ పద్ధతి యిప్పటికిని హిందూ దేశము నందున్నది. బంగాళా దేశమునందు బ్రాహ్మణులలో కులీనులు, దేశీయులు మొదలయిన భేదములు కలవు. వారిలో కులీనులు అందఱికంటె నెక్కువ వారమని చెప్పుకొనియెదరు. వీరు తమకంటెఁ దక్కువ వారగు బ్రాహ్మణుల యింటి ఆడుపిల్లలను చేసికొందురు. తమ ఆడుపిల్లలను వారికీయరు. అట్లే మనదేశమందు మధ్వలు, లింగధారులయిన ఆరాధ్యులు, తామితర బ్రాహ్మణుల కంటె నెక్కువవారమని కాఁబోలు,స్మార్త బ్రాహ్మణులయింటి యాడపడుచులనువివాహమాడెదరు కాని తమ యాడపడుచులను స్మార్తులకీయరు. కావున నిది వారివారి స్వాతిశయభావము వలన నేర్పడిన యొకవిధమైన అనులోమ వివాహవిధానము!

వేఱువేఱు జాతులవారిలో నిచ్చి పుచ్చుకొనుట నిషిద్ధమైనను, ఒక్కజాతిలోనే పెక్కు

శాఖలున్నచోట, సాధారణముగ నేశాఖవా రాశాఖలోనే సంబంధములు చేసికొన్నను, ఆవశ్యకతనుబట్టి యొక శాఖవారు మఱియొక శాఖవారితో సంబంధ బాంధవ్యము చేసికొను నాచారము హిందూ దేశమంతటను గలదు. బ్రాహ్మణులలో ఋగ్వేదులకు యజుర్వేదులకు సంబంధము లవిచ్ఛిన్నముగ దేశమందంతటను (ఆంధ్రదేశమునందుఁగూడ) జరుగుచున్నవి. వెలనాటి వారికి తెలగాణ్యులకుఁగూడ పెక్కుచోట్ల ఆక్షేపణము లేకుండ వివాహములగుచున్నవి. మహారాష్ట్ర బ్రాహ్మణులకును, ఆంధ్రవైదిక బ్రాహ్మణులకును చాందా నాగపురమువైపున బంధుత్వము కలియుచున్నది. సప్తగోదావర్యంతర్గతమైన ముంగొండ అగ్రహారమునుండి వెడలి పోయిన వేఁగినాటి యాంధ్రబ్రాహ్మణుల పెక్కుకుటుంబములు కాశీలోను, మధ్యపరగణాలోని బ్రహ్మణియను గ్రామమందును నివసించియున్నారు. వీరందఱును మహారాష్ట్రులతో సంబంధముచేసికొనుచు, చాలభాగ మాంధ్రము మరచి, మహారాష్ట్ర వేషభాషలతో సంచరించుచున్నారు. కాశిలో విద్వత్ సింహమని ఖ్యాతిఁగాంచి కొలఁదికాలముక్రిందనే కీర్తిశేషులైన మహామహోపాధ్యాయ గంగాధర శాస్త్రిగారిట్టి యాంధ్రులే. మన దేశమునందు ఆఱువేల నియోగులకు, ప్రాకనాటి నియోగులకు, మధ్వలకు గోలకొండ వ్యాపారులకు, ఆరాధ్యులకు నచ్చటచ్చట, అప్పుడప్పుడు బాంధవ్యము కలియుచునే యున్నది. నియోగివైదికులకంతగఁ గలియుటలేదు గాని, అట్టిసంబంధములును శాస్త్రగాలేవని చెప్పుటకు వీలులేదు. అట్లే రాజులు, వెలమలు, కమ్మలు, రెడ్లు, తెలగాలు, మొదలయినజాతులలోని యుపశాఖలలో నప్పుడప్పుడు వివాహములు జరుగుచునే యున్నవి. కావున, నుపశాఖలలో వివాహములు జరుగుటకు నాచారముయొక్క యభ్యంతరమేమియు లేదు; ధర్మశాస్త్రము యొక్క యభ్యంతర మెన్నడును లేదు.* ఆయా యుపశాఖలవారికిఁగల స్వాతిశయభావమే యిందుకు విఘ్నకారి. ఒక కేసులో క్రైస్తవమతమునుండి హిందువుగా మాఱిన శూద్రస్త్రీని ఒకశూద్రుఁడు పెండ్లియాడఁగా నదిక్రమమైన వివాహమని కోర్టువారు తీర్మానించిరి.‡

మన్వాదిస్మృతికారులు వేఱువేఱు జాతుల స్త్రీ పురుషులకు అనులోమపద్ధతి ప్రకారమును, ప్రతిలోమపద్ధతి ప్రకారమును కలిగిన సంతానము ఏ జాతివారగుదురో తెలియుటకై జాబితాలిచ్చినారు. కాని అందఱి జాబితాలొక విధముగ లేవు. ముఖ్యముగ మనుస్మృతి ననుసరించి యొక అనులోమ విలోమ జాతులపట్టిక యీక్రింద నీయఁబడుచున్నది. ఇందునగుఱించి యింకను తెలిసి

* Pandaiya Telaver v. Puli Telaver 1 Mad. 478.

† Ramamani Ammal v. Kulanthai 14 Moo. I A. 346.

‡ Muthuswami Mudaliar v. Masilamani, I. L. R. 33 Mad. 342.

కొనఁ గోరువారు మనుస్మృతి ౧౦-వ అధ్యాయము చూడనగును.

### అనులోమ జాతులు

| | | |
|---|---|---|
| బ్రాహ్మణ | క్షత్రియ | మూర్ధాభిషిక్త |
| ,, | వైశ్య | అంబష్ట |
| ,, | శూద్ర | నిషాద (వీనిని పారశవుఁడని కూడ నందురు) |
| క్షత్రియ | వైశ్య | మహిష్య |
| క్షత్రియ | శూద్ర | ఉగ్ర |
| వైశ్య | శూద్ర | కరణ. |

### ప్రతిలోమ జాతులు

| | | |
|---|---|---|
| క్షత్రియ | బ్రాహ్మణ | సూత |
| వైశ్య | బ్రాహ్మణ | వైదేహ |
| శూద్ర | బ్రాహ్మణ | చండాల |
| వైశ్య | క్షత్రియ | మాగధ |
| శూద్ర | క్షత్రియ | క్షత్రి |
| శూద్ర | వైశ్య | ఆయోగవ |

### మిశ్ర జాతులు

| | | |
|---|---|---|
| బ్రాహ్మణ | ఉగ్ర | ఆవృత |
| ,, | ఆయోగవ | ధిగ్వన |
| నిషాద | శూద్ర | పుక్కస |
| శూద్ర | నిషాద | కుక్కుటక |
| క్షత్రి | ఉగ్ర | శ్వపాక |
| విదేహక | అంబష్ట | వేణ |
| దస్యు | ఆయోగవ | సైరంధ్ర |
| వైదేహ | ,, | మైత్రేయక |
| నిషాద | ఆయోగవ | మార్గవ, దాస, కైవర్త |
| ,, | వైదేహ | కారావర |
| వైదేహ | కారావర | అంధ్ర |
| ,, | నిషాద | మేద |
| చండాల | వైదేహ | పాండుసోపాక |
| నిషాద | ,, | అహిండిక |
| చండాల | పుక్కస | సోపాక |
| ,, | నిషాద | అంత్యావసాయి |

అనులోమ వివాహమువలనఁ గల్గిన సంతతికి నొక విశేషమైన హక్కు గలదు. బ్రాహ్మణునకును శూద్రస్త్రీకిని పుట్టినవాఁడు ఏడు తరములలో బ్రాహ్మణుఁడగును అని మనువు ౧౦-వ అధ్యాయమునందు చెప్పియున్నాఁడు.* అనఁగా బ్రాహ్మణునకు శూద్రకుఁ బుట్టిన స్త్రీ మరల బ్రాహ్మణునే వివాహమాడి, కూఁతుఁ గనును. ఆకూఁతురుగూడ మరల బ్రాహ్మణునే పెండ్లియాడి సంతానము వడయును. ఇట్లేడు తరములవఱకు జరిగినయెడల నేడవతరము నందుఁబుట్టువాఁడు బ్రాహ్మణుఁడగును. ఇట్లే బ్రాహ్మణునకు వైశ్యస్త్రీయందుఁ బుట్టువాఁడు

---

* శూద్రాయాం బ్రాహ్మణాజ్జాతః శ్రేయసాచేత్ ప్రజాయతే
అశ్రేయాన్ శ్రేయసీంజాతిం గచ్ఛత్యా సప్తమాద్యుగాత్. ౬౪
శూద్రో బ్రాహ్మణతామేతి బ్రాహ్మణశ్చైతి శూద్రతామ్
క్షత్రియాజ్జాతమేవంతు విద్యాద్వైశ్యాత్తథైవచ. ౬౫.

అర్థము:- శూద్రస్త్రీకి బ్రాహ్మణునివలన బుట్టిన స్త్రీ బ్రాహ్మణునకే మరల సంతతిక్కన్నయెడల నేడవ తరమున నాసంతతి శ్రేష్ఠమైన జాతినిబొందును ౬౪.

అంబష్ఠుఁడు. వీఁడు అయిదు తరములలో బ్రాహ్మణుఁడగు. ఇట్లు శూద్రుఁడు బ్రాహ్మణుఁడగును, బ్రాహ్మణుఁడు శూద్రత్వమును జెందును. ఇట్లే క్షత్రియునకు వైశ్యునకుఁ బుట్టినవారిని గుఱించి యెఱుఁగునది.*

**అనువాదము.** నైయాయికులు వేదవాక్యములను మూఁడు విధములుగ విభజించిరి. విధివాక్యము, అర్థవాదవాక్యము, అనువాద వాక్యములు ('విధ్యర్థవాదానువాద వచన వినియోగాత్' గౌతమ. ౨. ౧. ౬౩). విధియనఁగా విధాయకమని (విధిర్విధాయకః ౨.౧.౬౪.) గౌతమాచార్యులవారు న్యాయ సూత్రమునందుఁ జెప్పినారు. ఇట్లు చేయవలసినది యని యాజ్ఞాపించునది విధి. 'స్వారాజ్య కామో వాజపేయేన యజేత' (స్వర్గము కోఱువాఁడు వాజపేయ యజ్ఞమును జేయవలసినది) అనునది విధి వాక్యము. ఒకానొక కార్యమును స్తుతించి, లేక నిందించి, భయము కలిగించి, పూర్వ చరిత వర్ణించి బోధించునట్టి వాక్యము అర్థ వాద వాక్యమనఁబడును.† 'పాపకారీ పాపో భవతి' (పాపముచేయువాఁడు పాపమైపోవును) అనునది అర్థవాదము. ఇందు నాజ్ఞ స్పష్టముగా నుండదు. విధి వాక్యముచేఁ జెప్పఁబడిన దానిని మరలఁ జెప్పుట అనువాదమనఁబడును.* అనువాదము రెండు విధములు: శబ్దానువాదము, అర్థానువాదము. ఇదివఱకుఁ జెప్పఁబడిన మాటల మరలఁ జెప్పుట శబ్దానువాదము. ఇదివఱకుఁ దెలిసిన విషయమునే మరల నన్యపదములతోఁ జెప్పుట అర్థానువాదము. 'అనువాదే రచనానామ్' (౨. ౪. ౩) అను పాణినీయ సూత్రముమీఁద టీక వ్రాయుచుఁ గాశికాకారుఁడు 'ప్రమాణాంతరావగతస్యార్థస్య శబ్దేన సంకీర్తన మాత్రమను వాదః' అని వ్రాసియున్నాఁడు. వేఱు ప్రమాణముచే సిద్ధించిన యర్థమును (సంగతిని) శబ్దముచేఁ జెప్పుటమాత్రము అనువాద మనఁబడును. 'అగ్నిర్హిమస్య భేషజం' (అగ్ని చలికిమందు) అనునది యనువాదము. ఏల? ప్రత్యక్ష ప్రమాణముచే నీ సంగతి మన మెఱుఁగుదుము. ఆ జ్ఞానమును ఈవాక్య మనువాదించినది.

అనువాదము మరల మూఁడువిధములు. భూతార్థానువాదము, స్తుత్యర్థానువాదము, గుణానువాదము. 'సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్' (ఓసౌమ్యా! మొదట సత్తేఉండెను) అనునది మొదటి దానికుదాహరణము. 'వాయుర్వై క్షేపిష్ఠా దేవతా' (వాయువు క్షేపిష్ఠ

---

* ఇంకను విశదముగుటకునై చూడుమాండలిక సంపాదిత, యాజ్ఞవల్క్య, స్మృతి, పుట ౧౭౩.

† 'స్తుతిర్నిందా పరకృతిః పురాకల్ప ఇతి (అర్థవాదః)' [గౌత. ౨. ౧. ౬౫.

* 'విధివిహితస్యానువచనమనువాదః' [గౌత. ౨. ౧. ౬౬.

మైన దేవతస్తుమః) యన్నది స్తుత్యర్థానువాదము. 'దధ్నా జుహోతి' (పెరుగుతో హోమముచేయును) అను నది గుణానువాదము.

వేదమును నమ్మని బౌద్ధాది పూర్వపక్షులు వేదమునందు నుండు అనువాద వాక్యములు పిష్టపేషణన్యాయమునఁ బడిన రుక్తమ్ములు గనుక వేదమునకు గౌరవహాని కలుగుచున్నదియని యాక్షేపించిరి. అందులకు గౌతమాచార్యులవారు "అనువాదములు పునరుక్తములుకావు. అవేశబ్దములు మరల వచ్చినను వానికి నర్థభేదముండును. వ్యవహారమునందు మొదట 'గచ్ఛ'(పో)అని మరల 'గచ్ఛ,గచ్ఛ' (పో పో) అని దానినే అనువాదించినప్పటికి రెండవతడవ నుచ్చరించిన 'గచ్ఛగచ్ఛ' పదములకుశీఘ్రముగాపొమ్మనియర్థమగుచున్నది. అట్లే వైదికములగు అనువాదములకును విధివాక్యములకంటె భిన్నార్థముండును. కావున నవి పునరుక్తములు కావు.* అని గౌతముఁడు చెప్పియున్నాఁడు.

దీనిమీఁద వాత్స్యాయనుఁ డిట్లు భాష్యము వ్రాసినాఁడు. "విహితమైన యర్థమును మరల నేల చెప్పవలెనన్న అధికారార్థము (చెప్పఁబోవు విషయమిదియని తెలియుటకు), విహితమైన దానిని నిందించుటకుగాని, స్తుతించుటకుగాని, విధిశేషముగ గాని చెప్పఁబడును. విహితార్థమునకుఁదరువాత వచ్చినది కూడ ననువాదమగును... లోకమునందును అనువాదము కలదు. 'వండువండు' అని చెప్పుట కలదు. అందుకుఁ ద్వరగ వండుమనిగాని, దయచేసివండు మనిగాని (అధ్యేషణ), తప్పక వండుమనిగాని (అవధారణ) అర్థమగును.*

పై నివర్ణింపఁ బడిన మూఁడు విధములైన వాక్యములలో విధివాక్యములే ప్రమాణములుగాని మిగిలిన రెండువిధములైన వాక్యములు ప్రమాణములు కావని కొందఱు పూర్వపక్షముచేసెదరు. అందున గుఱించి 'అర్థవాదము' అనుశబ్దముఁ జూచునది.

**అనువిందుఁడు.** ౧. విందుని తమ్ముఁడు. వసుదేవుని తోఁబుట్టువగు రాజాధిదేవికిని, ఆమె పెనిమిటి యవంతిరాజు జయసేనునకును పుట్టినవాఁడు. శ్రీకృష్ణునకు మేనత్త కుమారుఁడు. భారతయుద్ధమునందు దుర్యోధనపక్షమునఁ బోరాడి అర్జునుని చేఁ జచ్చెను.

[భార. ద్రోణ. అ. (౬౬).

౨. కేకయరాజుయొక్క యిద్దఱు పుత్రులలో నొక్కఁడు. వీని అన్న విందుఁడు. భారతయుద్ధమునందుఁ బాండవపక్షపాతియై యుండె.

* 'శీఘ్రతరగమనోప దేశవదభ్యాసాన్నా విశేషః'

[గౌత. ౨. ౧. ౬౭.

* "కిమర్థం పునర్విహితమనూద్యతే । అధికారార్థమ్ విహితమధికృత్య స్తుతిర్నిన్దా విధిశేషో వాఽభిధీయతే। విహితానన్తరార్థోఽపిచానువాదో భవతి।... లోకేపి చానువాదః । పచతు పచతు భవానిత్యభ్యాసః। క్షిప్రం పచ్యతామితివా । అంగ! పచ్యతామిత్యధ్యేషణార్థమ్। పచ్యతామేవేతి వాఽవధారణార్థమ్."

౩. ధృతరాష్ట్రుని నూర్గురు పుత్రులలో నొకఁడు.

౪. చూడు 'విందానువిందులు.'

**అనుశాల్వుఁడు.** శోభ పతియైన శాల్వుని తమ్ముఁడు. శాల్వునిఁ గృష్ణుఁడు చంప నీతఁడు కృష్ణుని నెట్లయినఁ జంపనిశ్చయించెను. ధర్మజుఁడశ్వమేధముఁ జేయునపు యమునఁ గృష్ణుఁడు కుటుంబ సహితముగ హస్తినాపురమునకు రాఁగా నీతఁడు సేనా సమేతుఁడై వచ్చి హస్తినాపుర పార్శ్వమున దాగియుండెను. ఒక నాఁడు కృష్ణుఁడును, పాండవులును అశ్వమును పరిక్షించుచున్న వారని విని యీతఁడచ్చటికి నెవరికిఁ దెలియకుండవచ్చి క్షణములో నశ్వమును తీసికొని పాఱిపోయెను. భీముఁడు, సైన్యముతో వానిఁ దరిమికొని చనిరి. ప్రద్యుమ్నుఁడు వృషకేతుఁడు వానిఁబట్టి తెచ్చెదమని ప్రతిజ్ఞఁజేసి పోయిరి. ప్రద్యుమ్నుఁడోడె. వృషకేతుఁడు అనుశాల్వునినోడించి, బంధించి కృష్ణునొద్దకుఁ దెచ్చె. వాఁడు కృష్ణునకు శరణుజొచ్చి, అశ్వమేధమునకు సాయముచేయుటకు నంగీకరించి స్వనగరమునకుఁబోయె. (జైమినీఅశ్వమేధము అ. ౧౨-౧౪.)

**అనుష్ణా.** భారత వర్షీయనది.

(భార. భీష్మ. అ. ౯.)

**అనుసూయ.** చూడు 'అనసూయ.'

**అనుహ్లాదుఁడు.** హిరణ్యకశిపునకు కయాధూయను భార్యయందుఁబుట్టిన నల్గురు పుత్రులలో నొకఁడు. భా. ర్య సూర్మి. బాష్కలుఁడు, మహిషుఁడు అనువారు పుత్రులు.

**అనూదరుఁడు.** ధృతరాష్ట్రుని నూర్గురు పుత్రులలో నొకఁడు.

**అనూపగడము.** రాజపుతానాలోని బికానీరు సంస్థానమందలి యొక పట్టణము. సంస్థానాధీశ్వరుఁడగు అనూపసింగు పేర ౧౬౭౮ సంవత్సరములోఁ గట్టఁబడినకోట గలదు. ఇది బికానీరు పట్టణమునకు ౮౨ మైళ్ల దూరములోనున్నది. డెబ్బదన్యుదు గ్రామములకిది ముఖ్యపట్టణము. ఇందలి జనసంఖ్య ౧౧౧౭. అచ్చటి జనులు ముఖ్యముగా 'రాట్' జాతివారు. ఈ ప్రాంతమున నీరు తక్కువగానున్నను కోతగడ్డి చక్కఁగ పెరుగును. సోడా ఉప్పు తయారుచేయుటకు కావలసిన 'సజ్జ, లానా' అను చెట్లిచ్చట విశేషముగాఁ బెరుగును.

**అనూపషహార్** (తాలూకా). యునైటెడ్ ప్రావిన్సెస్సులోని 'బులందర్ షహార్' అను జిల్లాలో గంగనొడ్డుననున్న నొక తాలూకా. ఇందు 'అనూపషహార్; అహార్, దిబాయి, అను మూఁడు పరగణాలు గలవు. దీని విస్తీర్ణము ౪౪౪. చదరపు మైళ్లు. ఈ తాలూకాలో ౩౭౮ పల్లెలును ౪ పట్టణము

లును గలవు. దీనిమధ్యనుండి ఉత్తరదక్షిణముగ 'ఛోడునది' పారుచున్నది.

ఈ తాలూకాలో జహాంగీరాబాద్, డిబాయి, అనూపషహర్ అను నవి పెద్ద పట్టణములు. రివెన్యూఆదాయము రు. ౪౯౯౦౦౦ లు సెస్సులు రు. ౮౦౦౦౦ లు.

## అనూపషహర్ (పట్టణము).

ఈ అనూపషహర్ తాలూకాకు ముఖ్యపట్టణము. బులందషహర్ పట్టణమున కిరువది మైళ్ల దూరముననున్నది. జనసంఖ్య ౭౬౦౧. ఇది చరిత్ర సంబంధమున ప్రాముఖ్యము చెందిన పట్టణము. జహాంగీరు ప్రభుత్వకాలమున బర్గూజర్ రాజయిన 'అనూప్‌రాయి' అనువాడు తనపేరిట నీపట్టణమును నిర్మించెను. ఢిల్లీనుండి రోహిల్‌ఖండు వెళ్లువారిచ్చటనే గంగానదిని దాటవలయును. కావున నట్టిరేవును స్వాధీనమునందుంచుకొనవలయునన్న ప్రభుత్వమువారికి పదునెనిమిదవ శతాబ్దమున నీపట్టణము ముఖ్యమైయుండెను.

మహారాష్ట్రులకు పరమశత్రువయిన అహమ్మద్‌షాదుర్రాణియనువాఁడు ౧౭౪౭-వ సంవత్సరమ్మునం దీ పట్టణమ్మును స్కంధావారమ్ము (Contonment) గా నేర్పఱచెను. తురుష్కులందఱునేకమై, పానిపత్ క్షేత్రమున ౧౭౬౧ లో మహారాష్ట్రుల నోడించిరి. ఆ యుద్ధప్రియత్నములనెల్ల నీపట్టణముననే చేయఁబడెను. మహారాష్ట్రులు రోహిల్‌ఖండు మీఁదికి ధాడివెడలఁగా వారిని నెదిరించునిమిత్తమై జౌద్‌వజీరుతోఁగూడి బ్రిటిష్‌వారు ౧౭౭3-వ సంవత్సరమున నీ పట్టణమ్మును దమ సైన్యములకు నివాసస్థానముగా నేర్పఱచిరి. అప్పటినుండి ౧౮౦౬ వఱకు బ్రిటీషుసైన్యము లచ్చటనే యుండెను. ఆవల మీరటునకు మార్చబడినవి. ౧౮౫౭ సంవత్సరపు సిపాయి తిరుగుబాటు కాలమునందు రోహిల్‌ఖండ మందలి విప్లవకారు లీరేవును దాటకుండ జాటువారడ్డపడిరి. పూర్వము గంగానదిమీఁద జరుగు వ్యాపారమునకు నీపట్టణము ఉత్తరపరిమితిగా నుండెను. ఈస్టుఇండియా కంపెనీవారిచ్చట నొకగిడ్డంగిని స్థాపించియుండిరి. ఇపుడు వర్తకమంతగా సాగుటలేదు. శర్కర, కలప, వెదురు వ్యాపారము మాత్రము విరివిగా సాగుచున్నది. స్వల్పముగా చుట్టుపట్ల గ్రామములకుఁ గావలసిన బట్టలు, శాలువలు, జోళ్ళు మొదలగునవి ఇచ్చట తయారుచేయఁబడుచున్నవి.

## అనూపదేశము.

భారత వర్షీయ దేశము. రాజధాని మాహిష్మతి. ఇచ్చట సహస్రార్జునుఁడు రాజ్యమ్ము చేయుచుండెను. పాండవుల కాలమున నిచ్చట నీలరాజు రాజ్యము చేయుచుండెను. ఇతఁడు భారత యుద్ధమునందు పాండవులకై పోరాడిచచ్చెను.

## అనేకల్ తాలూకా.

మైసూరు జిల్లాలో నున్నది. విస్తీర్ణము, నూటతొంబది చదరపు మైళ్లు. ఈ తాలూకాలో 3 పట్టణ

ములును ౨౦౨ పల్లెలును గలవు. దాని పడమటి భాగము రాతిమయముగ నుండును.

## అనెకల్ పట్టణము:

ఆ తాలూకాలోని ముఖ్యపట్టణము. ౧౭-వ శతాబ్దములో బిజాపూరు రాజులు 'హాస్కోటి'నుండి సుగతూరువంశము వారిని తరుమగా, ఆవంశములోనొకఁడే పట్టణమును గట్టెను. తరువాతి శతాబ్దములో నది మైసూరునకు సామంత రాజ్యమయ్యెను. ౧౭౬౦ సం॥లో హైదరాలి దానిని మైసూరులోఁ గలిపివేసె. ౧౮౭౦ సం॥ నుండి మునిసిపాలిటి యేర్పడినది.

## అనేకవర్ణసమీకరణము.

భాస్కరాచార్యులవారు బీజగణితమునందు దేనికి అనేకవర్ణసమీకరణమని పేరుపెట్టిరో దానిని పాశ్చాత్యబీజగణిత శాస్త్రమునందు సైమల్ టేనిఅస్ ఈక్వేషన్ (Simultaneous equation) అందురు. దీనికి సమకాలిక సమీకరణమని యర్థము. ఏకవర్ణ సమీకరణమునందుఁ దెలియని వర్ణ మొక్కటియే యుండును. అనేకవర్ణసమీకరణమునందుఁ దెలియని వర్ణములు పెక్కులుండును. వాని వెలలు మనము కనుఁగొనవలయును.

౧-వ ఉదాహరణము:-

రెండుసంఖ్యలు కలవు. వానిలో జిన్నసంఖ్యను పెద్దసంఖ్యలోఁ గలిపిన ౫౪ వచ్చును; చిన్నసంఖ్యను పెద్దదానిలోనుండి తీసివేసిన ౧౨ వచ్చును. ఆ సంఖ్యలెవ్వి?

న్యాసము:- తెలిసికొనవలసిన సంఖ్యలలో పెద్దది క అనియు చిన్నది చ అనియు అనుకొందము. కావున ఈ క్రింది సమీకరణములు* ఏర్పడుచున్నవి:-

$$క + చ = ౫౪ \qquad (౧)$$

$$క - చ = ౧౨ \qquad (౨)$$

ఈ రెండు సమీకరణములను కలిపిన యెడల ఈ క్రింది రీతిగా క యొక్క వెల తెలియుచున్నది:-

$$౨క = ౬౬ \qquad (3)$$

$$\therefore క = 33$$

ఇట్లు మనకు క యొక్క వెల, యనఁగాఁ బెద్ద సంఖ్యవెల తెలిసినది. ఈ వెల క కు బదులుగా ౧-వ సమీకరణము నందు గాని, రెండవ సమీకరణమందుగాని, ఉంచిన చ యొక్క వెల తేలగలదు.

$$క + చ = ౫౪ \quad (క = 33)$$

$$\therefore 33 + చ = ౫౪$$

$$\therefore చ = ౫౪ - 33 = ౨౧$$

ఇది మిక్కిలి సులభమైన సమీకరణము. అన్ని సమీకరణములు ఇంత సులభముగ విప్పబడవు. ఈ క్రింది సమీకరణముఁ జూడుఁడు.

౨-వ ఉదాహరణము:-

$$౫ చ = ౨౩ - ౨ క$$

$$\therefore చ = \frac{౨౩ - ౨ క}{౫} \qquad (౧)$$

---

*ఈసమీకరణములను చదువు విధము:- ౧-వ సమీకరణము, క, అధికము చ, సమానము ౫౪; ౨-వ సమీకరణము, క హీనము చ సమానము ౧౨.

ఈసమీకరణమందు క యొక్క వెల మారినకొలఁదిని చ వెల మారుచుండును. క = ౧ అయిన యెడల

చ = (౨౩—౨)/౫ = ౨౧/౫

క = - ౨ అయినయెడల

చ = (౨౩+౪)/౫ = ౨౭/౫

ఇట్లే క వెలమారిన కొలఁదిని చ వెల మారును. కాని, యీక్రింది సజాతీయమైన యింకొక సమీకరణము,

౩ క + ౪ చ = ౨౪

మనకుఁ జిక్కినేని ధానినిబట్టి మనమీ క్రింది సమీకరణమును ఏర్పాటు చేసికొనవచ్చును.

చ = (౨౪-౩ క)/౪ (౨)

౧-వ సమీకరణమునకును, ఈ ౨-వ సమీకరణమునకును సరిపోవునట్టి వెలలు క చ లకు మనము తెలిసికొనవలెను. ౧-వ సమీకరణమందుఁ జూపఁబడిన చ యొక్క వెలయు ౨-వ సమీకరణమందుఁ జూపఁబడిన చ యొక్క వెలయు నొకటితో నొకటి సమానములై యుండవలెను.

∴ (౨౩—౨క)/౫ = (౨౪—౩ క)/౪

గుణించుటచే, ౯౨—౮ క = ౧౨౦—౧౫ క

∴ ౭ క = ౨౮

∴ క = ౪

క యొక్క యీవెల ౧-వ సమీకరణమునందు ఉంచగా నిట్లువచ్చును:-

∴ చ = (౨౩—౨క)/౫ = (౨౩—౮)/౫ = ౧౫/౫ = ౩

∴ క = ౪

చ = ౩

క కు ౪, చ కు ౩ వెలయున్న యెడలనే పై రెండు సమీకరణములు నిజమగును. లేని యెడల కావు.

అనేకవర్ణసమీకరణములను విచ్చునప్పుడు, కొన్నియుక్తులచే నితర వర్ణములను తొలఁగించి (Eliminate) ఒక్క వర్ణముమాత్రము నిలుచునట్లుచేసికొనవలెను. అప్పుడది యేకవర్ణ సమీకరణమగును. దానిచే నొక్క వర్ణముయొక్క వెల కనుఁగొనవచ్చును. పిదప నితరవర్ణము వెల తెలియుట సులభము.

౩-వ ఉదాహరణము :

ఈ క్రింది సమీకరణములను విచ్చుఁడు:-

౩ క + ౭ చ = ౨౭ (౧)

౫ క + ౨ చ = ౧౬ (౨)

ఈ సమీకరణములలోనుండి క అను వర్ణమును తొలఁగింప యత్నించెదము. అది యెట్లు? ౧-వ సమీకరణమును ౫తోను, ౨-వ సమీకరణమును ౩తోను హెచ్చించిన నీక్రింది సమీకరణములు వచ్చును:-

౧౫ క + ౩౫ చ = ౧౩౫ (౩)

౧౫ క + ౬ చ = ౪౮ (౪)

ఈ రెండు సమీకరణములందును క వర్ణములు సమానము (౧౫ క) అయినవి. కావున ౪-వ సమీకరణమును ౩-వ సమీకరణము నుండి తీసివేసిన నిట్లువచ్చును:-

$౯ చ = ౨౭$

$∴ చ = \frac{౨౭}{౯} = 3$

ఈ వచ్చిన చ యొక్క వెల ౧-వ సమీకరణమునందు భర్తీచేసిన క వెల రాఁగలదు:-

$3 క + ౭ చ = ౨౭$

$∴ 3 క + ౨౧ = ౨౭$

$∴ 3 క = ౬$

$∴ క = ౨.$

ఇట్లు ఈలెక్కయొక్క యుత్తరము క = ౨, చ = 3.

రెండు అజ్ఞాతవర్ణములలో నొకదాని వెల తెలిసిన తరువాత, రెండవదాని వెల కనుఁగొనుటకై రెండుసమీకరణములలో దేనినితీసికొని అందు తెలిసిన వర్ణమువెల భర్తీచేసినను, రెండవ వర్ణమువెల తెలియును. ఒకానొకసమీకరణమునే తీసికొనవలెనని లేదు. పై లెక్కలో మనము ౧-వ సమీకరణముఁదీసికొని దానిలో చ వెలభర్తీ చేసితిమి. అట్లుచేయక ౨-వ సమీకరణముఁదీసికొని యందు చ వెలభర్తీ చేసినను క వెలవచ్చియుండును:-

$౫ క + ౨ చ = ౧౬$

$∴ ౫ క + ౬ = ౧౬$

$∴ ౫ క = ౧౦$

$∴ క = ౨$

౪-వ ఉదాహరణము:

ఈ క్రింది సమీకరణముల విచ్చుము :-

$౭ క + ౨ చ = ౪౭$ (౧)

$౫ క — ౪ చ = ౧$ (౨)

ఈ లెక్కలో చ ను తొలఁగించుట సులభము. ౧-వ సమీకరణమును ౨ చే హెచ్చించిన ఈ క్రింది సమీకరణమేర్పడ్డును:-

$౧౪ క + ౪ చ = ౯౪$ (3)

ఇందులో ౨-వ సమీకరణమును కలిపిన చ యెగిరిపోయి, యీ క్రింది విధమున క వెల వచ్చును :-

$౧౯ క = ౯౫$

$∴ క = \frac{౯౫}{౧౯} = ౫$

ఇచ్చట ౨-వ సమీకరణమందలి-౪ చ ఋణము (— ఋణ చిహ్నాంకితము) ; 3-వ సమీకరణమందలి ౪ చ ధనము (Positive) కావున ఈ రెంటిని కలపమంటిమి. ఈ రెంటిని కలిపిన సంకలనము సున్నయై చ వర్ణ మెగిరి పోవును. ఈ రెండు సమీకరణముల లోను 'ర చ' అను వర్ణము ధనముగగాని, ఋణముగగాని ఉన్నయెడల నది యెగిరిపోవుటకు నా సమీకరణములలో నొకదానినుండి మఱియొకదానిని తీసివేయవలయును.

౫-వ ఉదాహరణము:

ఈ క్రింది సమీకరణముల విచ్చుఁడు:-

$౨ క = ౫ చ + ౧$ (౧)

$౨౪ — ౭ క = 3 చ$ (౨)

౧-వ సమీకరణమువలన క వెల యిట్లు వచ్చుచున్నది.

$క = \frac{౫ చ + ౧}{౨}$ (3)

ఇట్లువచ్చిన క యొక్క వెల ౨-వ సమీకరణమునందు మనము భర్తీచేసిన యెడల క లోపించును:-

౨౪ - ౭/౨(౫ చ + ౧) = ౩ చ

∴ ౪౮ - ౩౫ చ - ౭ = ౬ చ

∴ ౪౧ = ౪౧ చ

∴ చ = ౧

ఇట్లు వచ్చిన చ వెల ౧-వ సమీకరణమందు భర్తీచేసినయెడల క వెల రాగలదు:-

౨ క = ౫ చ + ౧

∴ ౨ క = ౫ + ౧ = ౬

∴ క = ౩

పైని చెప్పిన మార్గములను బుద్ధి సూక్ష్మతతో అవసరముకొలఁదిని ఉపయోగించిన ననేకవర్ణ సమీకరణ బీజములను (తెలియని వర్ణముల వెలలను) కనుఁగొనవచ్చును. ఒక్కొక సమయమందు గణితసంబంధమైన జ్ఞానమును చక్కఁగ నుపయోగించిన యెడల లెక్క సులభముగవచ్చును.

౬-వ ఉదాహరణము

ఈ క్రింది సమీకరణము విప్పుము:-

౨౮ క - ౨౩ చ = ౨౨ (౧)

౬౩ క - ౫౫ చ = ౧౭ (౨)

ఇందుండి క ను తీసివేయవలయును. మనకు నొక మోటుపద్ధతి తెలియును. ౧-వ సమీకరణము నందలి క యొక్క గుణక సంఖ్య (Coefficient) ౨౮, ౨-వ సమీకరణము నందలి క గుణక సంఖ్య ౬౩, కావున ౧-వ సమీకరణమును ౬౩ చేతను, ౨-వ సమీకరణమును ౨౮ చేతను హెచ్చించిన సమాన గుణకములుగల క వర్ణము రెండు సమీకరణములలోను ఏర్పడును:-

౧౭౬౪ క - ౧౪౪౯ చ = ౧౩౮౬ (3)

౧౭౬౪ క - ౧౫౪౦ చ = ౪౭౬ (౪)

౩-వ సమీకరణమునుండి ౪-వ సమీకరణముఁ దీసివేసిన క వర్ణము లోపించి యిట్లు వచ్చును:-

౯౧ చ = ౯౧౦

∴ చ = ౯౧౦/౯౧ = ౧౦

ఇట్లు లెక్కవచ్చినను అంకెలు పెద్దపెద్దవిగా పెరిగి లెక్కచేయుటకుఁ గొంచెమిబ్బంది కల్గినది. అట్లుగాక ౧-వ సమీకరణ మందలి క వర్ణగుణకము ౨౮, ౨-వ సమీకరణ మందలి క వర్ణగుణక సంఖ్య ౬౩, ఈ రెంటికిని అపవర్త్యము, లేక కనిష్ఠ సామాన్య గుణిజము (L. C. M.) ౨౫౨. ఈ సంఖ్యను ౨౮తో భాగించిన ౯ వచ్చును. ౬౩ తో భాగించిన ౪ వచ్చును. కావున ౧-వ సమీకరణమును ౯ తోను, ౨-వ సమీకరణమును ౪ తోను హెచ్చవేసిన యెడల నీక్రింది సమీకరణములు వచ్చును:-

౨౫౨ క - ౨౦౭ చ = ౧౯౮ (౫)

౨౫౨ క - ౨౨౦ చ = ౬౮ (౬)

౫-వ సమీకరణమునుండి ౬-వ సమీకరణమును తీసివేయఁగా నిట్లువచ్చును:-

౧౩ చ = ౧౩౦

∴ చ = ౧౦

దీనిని పట్టి క వెల కనుఁగొనవచ్చును.

౭-వ ఉదాహరణము:

ఈ క్రింది సమీకరణములను విచ్చుము:-

$$\frac{౮}{క} - \frac{౯}{చ} = ౧ \qquad (౧)$$

$$\frac{౧౦}{క} + \frac{౬}{చ} = ౭ \qquad (౨)$$

న్యాసము:-౧-వ సమీకరణమును ౨ చేతను ౨-వ సమీకరణమును 3 చేతను హెచ్చించిన

$$\frac{౧౬}{క} - \frac{౧౮}{చ} = ౨ \qquad (3)$$

$$\frac{3౦}{క} + \frac{౧౮}{చ} = ౨౧ \qquad (౪)$$

(3), (౪) ఈ రెంటిని కల్పఁగా

$$\frac{౪౬}{క} = ౨3$$

$$\therefore ౪౬ = ౨3 క$$

$$\therefore క = ౨$$

౧-వ సమీకరణమునందు క వెలను భర్తీ చేయఁగా వచ్చునది.

$$చ = 3.$$

భిన్నాంకములు వచ్చినప్పుడు దానికిఁ దగు రీతి లెక్కనుమార్చి సమీకరణములను విచ్చవలెను.

రెండు అజ్ఞాతవర్ణముల వెల కనుఁగొనుటకు రెండు సమీకరణము లుండవలయునని యిదివఱకుఁ జదువరులు చూచియున్నారు. మూఁడు అజ్ఞాతవర్ణములను కనుఁగొనుటకై మూఁడు సమీకరణములు కావలెను. మూఁడు వర్ణముల సమీకరణములను విచ్చునప్పుడు, మొదట మూఁడింటిలో రెండు సమీకరణములఁ దీసికొని వానిలోనుండి యొక వర్ణమును తొలఁగింపవలయును. తరువాత మూఁడింటిలోనుండి మఱి రెండు సమీకరణములం దీసికొని వాని నుండి యా వర్ణమునే తొలఁగింపవలయును. ఇట్లు రెండు అజ్ఞాతవర్ణములుగల రెండు సమీకరణము లేర్పడును. వానిని పైని చెప్పిన రీతిగా విచ్చి, ఆ రెండు వర్ణముల వెలలు కనుఁగొనవలెను. పిదప మూలసమస్యలోని యొక సమీకరణములో ఈ రెండు వర్ణముల వెలలను భర్తీచేసి మూఁడవ వర్ణముయొక్క వెల కనుఁగొనవలెను.

౮-వ ఉదాహరణము:

ఈ క్రింది సమీకరణములను విచ్చుము :-

$$౭ క + ౫ చ - ౭ ట = -౮^{*} \qquad (౧)$$

$$౪ క + ౨ చ - 3 ట = ౦ \qquad (౨)$$

$$౫ క - ౪ చ + ౪ ట = 3౫ \qquad (3)$$

న్యాసము:-ఇందుండి మొదలు క ను విడఁదీయుదము. (౨) ను ౫ తో హెచ్చింపఁగా వచ్చినది.

$$౨౦ క + ౧౦ చ - ౧౫ ట = ౦ \qquad (౪)$$

(౧) ని ౨ తో హెచ్చింపఁగా వచ్చినది :-

$$౧౪ క + ౧౦ చ - ౧౪ ట = -౧౬ \qquad (౫)$$

(౪) లోనుండి (౫) తీసివేయఁగా వచ్చినది :-

$$౬ క - ట = ౧౬ \qquad (౬)$$

(౨)ని ౨ తో హెచ్చవేయఁగా వచ్చినది :-

$$౮ క + ౪ చ - ౬ ట = ౦ \qquad (౭)$$

(3), (౭) కలపఁగా వచ్చినది.

$$౧3 క - ౨ ట = 3౫ \qquad (౮)$$

* ఋణసంఖ్యములను చదువునప్పుడు ఋణము ౮, ఋణము క అని చదువవలెను.

(౬)ను ౨తో హెచ్చవేయఁగా వచ్చినది:

౧౨ క − ౨ ట = ౩౨ (౯)

(౮) లోనుండి (౯) తీసివేయఁగా

క = ౩

(౪) లో క వెలభర్తీ చేయఁగా వచ్చినది.

ట = ౨

(౨) లో క ట ల వెలలు భర్తీచేయఁగా వచ్చినది.

చ = ౩,

ఇఁకఁగొన్ని లౌకికోపయోగములైన యుదాహరణములిచ్చి యీప్రకరణము ముగించెదము.

౯-వ ఉదాహరణము.

ఒక గొల్లవాఁడు పశువులఁగొనుటకు సంతకుఁబోయెను. అచ్చటర గొఱ్ఱెలకు ౭ ఆవులకు రు ౧౩౧-౦-౦ లును, ౫ గొఱ్ఱెలకు ౩ ఆవులకు రు ౬౬-౦-౦ లును, ఖరీదు చెప్పిరి. ఒక్కఆవు ఖరీదెంత? ఒక్కగొఱ్ఱె ఖరీదెంత?

న్యాసము:- ఒక్కొక్క గొఱ్ఱె ఖరీదు క రూపాయి లనుకొందము. ఒక్కొక్క ఆవు ఖరీదు చ రూపాయలను కొందము. లెక్కను బట్టి యీ క్రింది సమీకరణము లేర్పడుచున్నవి :-

౪ క + ౭ చ = ౧౩౧ (౧)

౫ క + ౩ చ = ౬౬ (౨)

(౧) టిని ౫ తోను, (౨) ను ౪ తోను హెచ్చవేయుము:-

౨౦ క + ౩౫ చ = ౬౫౫ (౩)

౨౦ క + ౧౨ చ = ౨౬౪ (౪)

(౩) లోనుండి (౪) తీసివేయఁగా

౨౩ చ = ౩౯౧

∴ చ = ౧౭ రూపాయలు

చ యొక్క యీ వెలను (౨) లో భర్తీ చేయఁగా

౫ క + ౫౧ = ౬౬

∴ ౫ క = ౬౬ − ౫౧ = ౧౫

∴ క = ౩ రూపాయిలు

కావున ఉత్తరము, ఒక్కొక గొఱ్ఱెవెల రు ౩-౦-౦, ఒక్కొక్క ఆవువెల రు ౧౭-౦-౦.

౧౦-వ ఉదాహరణము.

ఇద్దఱు స్నేహితులు కలరు. వారిలో నొక్కఁడు రెండవవానితో ననును:- 'మిత్రమా! నీవు నాకు నూఱు రూపాయ లిచ్చితివేని, నీయొద్ద మిగిలిన ధనముకంటె నాయొద్ద రెట్టింపు ధనముండును.' అందుపై రెండవవాఁడు మొదటివానితో 'నీవునాకు పదిరూపాయిలిచ్చితివేని నీవద్ద నిలిచియుండు ధనముకంటె నావద్ద నాఱురెట్లధనముండును' అని అనెను. మొదటి వానియొద్ద నెంత ధనమున్నది? రెండవ వానియొద్ద నెంత ధన మున్నది? (భాస్కరాచార్యుఁడు) *

న్యాసము:- మొదటివానియొద్ద క సంఖ్య రూపాయిలును, రెండవ వానియొద్ద చ సంఖ్య

---

* భాస్కరాచార్యులవారీ యుదాహరణమును ఏకవర్ణసమీకరణ ప్రకరణమునందును, అనేకవర్ణసమీకరణ ప్రకరణమందును ఇచ్చియున్నారు. కాని మన మిచ్చట అనేకవర్ణసమీకరణము గిలదిగనే ఈ లెక్క చేయుదము.

రూపాయిలును మొదట ఉన్నవన్ను కొందము. ఇఁక రెండవవాఁడు మొదటివానికి ౧౦౦ రూపాయిలిచ్చివేసిన మొదటి వానియొద్ద (క+౧౦౦) రూపాయిలును, రెండవ వానియొద్ద (చ-౧౦౦) రూపాయిలును ఉండును. కావున లెక్కయొక్క మొదటిభాగము ననుసరించి అనఁగా మొదటివాఁడు చెప్పిన మాట ననుసరించి యీ క్రింది సమీకరణ మేర్పడుచున్నది.

క + ౧౦౦ = ౨ (చ-౧౦౦) = ౨చ-౨౦౦ (౧)

మొదటివాఁడు రెండవ వానికి పదిరూపాయిలిచ్చిన యెడల మొదటివానియొద్ద (క-౧౦) రూపాయిలుండును. రెండవ వాని యొద్ద (చ+౧౦) రూపాయిలుండును. కావున రెండవవాఁడు చెప్పినమాట ననుసరించి యీ క్రింది సమీకరణ మేర్పడుచున్నది:-

చ + ౧౦ = ౬ (క-౧౦) = ౬క - ౬౦ (౨)

(౧), (౨) సమీకరణములయొక్క రెండు పక్షములను (Sides) అనుకూలముగా మార్చఁగా నీక్రింది రెండు సమీకరణము లేర్పడుచున్నవి.

౨ చ - క = ౩౦౦ (౩)

౬ క - చ = ౭౦ (౪)

ఇందు (౪) ను ౨ తో హెచ్చవేయుము:-

౧౨ క - ౨ చ = ౧౪౦ (౫)

(౩), (౫) సమీకరణములను కలుపఁగా

౧౧ క = ౪౪౦

∴ క = ౪౦ రూపాయిలు

క యొక్క విల (౩) లో భర్తీచేయఁగా చ విలువచ్చును:-

౨ చ - ౪౦ = ౩౦౦

∴ ౨ చ = ౩౪౦

∴ చ = ౧౭౦ రూపాయిలు

ఉత్తరము-మొదటివాని వద్ద రు. ౪౦-౦-౦ లును, రెండవ వానివద్ద రు. ౧౭౦-౦-౦లును ఉండెను. [కో. ల.

**అనేనా.** (సూ. వం.) ఇక్ష్వాకు ప్రపౌత్రుఁడు. వికుక్షినామాంతరముగల శశాదుని పౌత్రుఁడు, కకుత్స్థుని పుత్రుఁడు. ఇతనికి సుయోధన, కాకుత్స్థ నామములు గూడఁ గలవు. పుత్రుని పేరు పృథుఁడు.

౨. (చం. వం.) పురూరవుని పౌత్రుఁడు. ఆయురాజు నైదుగురుపుత్రులలోఁ గనిష్ఠుఁడు. కుమారుని పేరు శుద్ధుఁడు. తమ్ముఁడు నహుషుఁడు.

**అనేనుఁడు.** ౧ ఇక్ష్వాకురాజు ప్రపౌత్రుఁడు. వికుక్షిరాజు పౌత్రుఁడు. కకుత్స్థరాజు పుత్రుఁడు. వీనికి సుయోధనుఁడు కాకుత్స్థుఁడు అను నామాంతరములు గలవు. వీని కొమార్తె పేరు ప్రథాపు.

౨ సోమవంశము పురూరవుని పౌత్రుఁడు. ఆయురాజుయొక్క అయిదుగురు కొడుకులలో కనిష్ఠుఁడు. వీని మారుపేరు శిద్ధుఁడు.

**అనైమలే కొండలు.** పర్వతపఙ్క్తి, పశ్చిమ కనుమలలోని యొకభాగము. అనై

మలె అనుశబ్దమునకు ఏనుఁగుల కొండలని యర్థము. ఈ కొండలు కోయంబత్తూరు జిల్లాయొక్క దక్షిణభాగమందును, ట్రావన్ కూరు సంస్థానమునందును ఉన్నవి. ఇవి దాదాపు నూఱు చదరపుమైళ్ళను ఆక్రమించి యున్నవి. ఇవి రెండు వరుసలుగ నుండును. ఇందలి యెత్తువరుసలో అనైముడి, అక్క, తంగాచి (చెల్లెలు) అను మూఁడు శిఖరములు కలవు. ఇచ్చటి కాలమానస్థితి నీలగిరి కొండలమీఁదివలెనే యుండును.

ఎత్తు తక్కువగనున్న రెండవవరుస గుట్టల మీఁద నరణ్యమెక్కువగ నున్నది. ఇందు మిక్కిలి చక్కని టేకుకలపయున్న ప్రదేశములనేకములు కలవు. ఇచ్చట యొక టేకు చెట్టు ౧౨౮ అడుగులు ఎత్తును, ౨౩ అడుగుల లావును (పరిఘయు) గలిగియుండెను! ఈవృక్షమునుండి వేళ్లుపోఁగా ౫౦౦ మొనలు ౬౦౦ ల ఘన అడుగుల కల్పవచ్చినది! అరణ్యములోఁ జెట్లుకొట్టిన తరువాత నచ్చటినుండి కొంతవఱకు నాచెట్లును ఏనుఁగులు లాగుకొనివచ్చును. అచ్చటినుండి కొంతదూరము వఱకు ఎడ్లలాగునట్టి ట్రాంవే బండ్లమీఁద నీకల్పతీసికొని పోఁబడును. అచ్చట నాకల్పను తాళ్ళకుఁగట్టి క్రిందికి విడిచెదరు. ఇట్లు తాళ్ళకుఁగట్టి ౧౦౦౦ అడుగుల లోతుకుఁ జెట్లకుఁ జెట్లు పంపఁబడును. అచ్చట యంత్రముతోఁ గోయునట్టి రంపముగలదు. దానిలో నీచెట్లను వలయునంత చిన్నవిగాఁ గోసి ప్రపంచము మీఁదికి అమ్మకమునకై పంపెదరు. సుమారు ౨౦౦౦ ఎకరముల ప్రదేశమునందు నిటీవల కాఫీతోటలుకూడ వేయుచున్నారు.

ఈ యరణ్యములలో పెద్దపులులు, చిఱుతపులులు, లేళ్లు, దుప్పులు, మనుబోతు సాధారణముగా నుండును. ఏనుఁగులును విశేషముగ గలవు.

ఈ కొండలమీఁద, కాదనులు, ముడువనులు, పులయనులు, మలసరులు అను అరణ్యకజాతుల వారుందురు. అరణ్యమునందుఁ బుట్టునట్టి ఏలకులు, పేము, మైనము, తేనె అమ్ముకొని వీరు జీవనముచేయుదురు.

**అనైముడి.** మదరాసు రాజధానిలో తిరువాన్కూరు సంస్థానములో నీశాన్యముగా నున్నది. పడమటి కనుమలలో అనామలై కొండలయొక్క నొక్క యున్నతమైన శిఖరము. ఇయ్యది దక్షిణ హిందుదేశములో నెత్తైన శిఖరమై, సముద్రమట్టమునకు ౮౮౩౭ అడుగులు ఎత్తుగానున్నది. దానినెక్కుటకు అన్నివైపులు వీలులేక పోయినప్పటికి ఉత్తరమునుండి యెక్కవచ్చును. అంతకంటె సులభముగా తూర్పు వైపున్ననుండి యెక్కవచ్చును. ఆశిఖరపు పైభాగమునుంచి చూచిన పక్షమున కోయంబుత్తూరు, మధుర, మళయాళముల యొక్కయు, తిరువాన్కూరు, కొచిన్ సంస్థానములయొక్కయు ప్రదర్శనము బహుబాగుగా నుండును. ఆశిఖరముపైనుంచి,

అడవులు,కొండలక్రిందుగాపడమటిసముద్రము కన్నులపండువుగా కన్పట్టును. ఉత్తరపువైపు అనామలై పర్వతములను ఈశాన్యపువైపు కోయంబుత్తూరు పల్లపుభూములును, నీలగిరి యున్నత్త ప్రదేశములును, అంచనాద్ కనుమయును, దక్షిణపువైపు పర్ మేడ్ ఆవల యున్న ఏలకుల (కొడ్మామ్) కొండలును, ఆగ్నేయపువైపున చోడినాయకనూరుకనుమ కొద్దిగాను కనఁబడును. అనైముడిచుట్టును అనేకశిఖరములు కలవు. ఒక్కొక్క శిఖరమునకు మధ్య ౩౦౦౦ లేక ౨౦౦౦ అడుగుల కనుమలున్నవి. ఈ కొండల యొక్క విస్తీర్ణము ౧౦౦ చదురపుమైళ్లు. ఈ కొండల యొక్కముప్పాతిక ప్రదేశము గడ్డితోనింపబడి యున్నది. వీటికి క్రింద అడవులు కలవు. ఇక్కడ కాఫి, తేయాకు పైరులు వేయక ముందు ఆ భూమియంతయు పికారు కుపయోగపడుచుండెను.

అనౌపమ్య. బాణాసురుని భార్య.

అన్నంభట్టు. సుప్రసిద్ధుఁడైన యాంధ్రనైయాయికుఁడు. హిందూదేశమునందు నంతటను న్యాయశాస్త్ర మభ్యసింపఁగోరువారితని తర్కసంగ్రహమును మొదట నభ్యసించెదరు. ఇతఁడు న్యాయ మీమాంసా వేదాంత వ్యాకరణములను విషయములపై గ్రంథములను వ్రాసెను:-

(౧) న్యాయగ్రంథములు :-

౧. తర్కసంగ్రహః, ౨. తర్కసంగ్రహదీపికా, ౩. తర్కభాషాతత్త్వబోధినీ ౪. ఆలోకసిద్ధాంజనరి (ఇది జయదేవుని 'ఆలోక' మనుతత్త్వచింతామణి టీకకుఁడీక). ౫. సుబుద్ధిమనోహరం (ఇది రఘునాథ శిరోమణియొక్క దీధితి మీఁద టీక.)

(౨) మీమాంసా గ్రంథములు :-

౧. రాణకోజ్జీవనీ (సుధాసారః; సోమనాథుని రాణకముపై టీక) ౨. తంత్రవార్తికటీక.

(౩) వేదాంత గ్రంథములు :-

౧. మితాక్షరా (బ్రహ్మ సూత్రములపై వృత్తి, ౨. తత్త్వవివేచనం.

(౪) వ్యాకరణ గ్రంథములు :-

౧. వ్యాకరణ మితాక్షరా, ౨. భాష్యప్రదీపోద్యోతనమ్, (కయ్యటుని ప్రదీపముమీఁద టీక).

పైగ్రంథముల పట్టికవలననే యీతనికిఁగల సకలవిద్యా పాండిత్యాతిశయము వెల్లడి కాఁగలదు. ఇదివఱకు నీతని తర్కసంగ్రహదీపికలు మాత్రము సకల జనవిదితములు. కొన్ని సంవత్సరములకుఁ గ్రింద వ్యాకరణ మితాక్షరను కాశీ సంస్కృత గ్రంథమాల (Benares Sanskrit series) లో శ్రీభట్టనాథస్వామి వారచ్చువేయించినారు. మిగిలినగ్రంథముల యొక్క వ్రాతప్రతులిటీవల సంపాదించి చెన్నపురి దొరతనమువారు తమప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమునం దుంచినారు.

ఈతని గ్రంథములలోని యుపోద్ఘాతములును, పరంపరాగతే లోకవార్తలును చూడఁగా నీతనిది గొప్పపండితవంశమని తోఁచుచున్నది. ఈతని ముత్తాత లోకనాథభట్టు ద్వాదశాహేజ్యుఁడన్న బిరుదముగలవాఁడు, మంత్ర భాష్యమును, కృష్ణాభ్యుదయమను కావ్యమును రచించెను. తాత మల్లుభట్టు; అగ్నిహోత్రభట్టన్న బిరుదాంకితము కలవాఁడు; ఆలోకస్ఫూర్తియన్న న్యాయగ్రంథమును, తత్త్వవివేచనమన్న వేదాంత గ్రంథమును, మహాభాష్య టీకయను వ్యాకరణ గ్రంథమును రచించెను. తండ్రి తిరుమలభట్టు. సర్వతోముఖయాజి బిరుదాంకితుఁడు. సంధ్యావందన భాష్యము రచించెను. వీరికిమూల పురుషుఁడు రాఘవసోమయాజి. అన్నంభట్టునకు మహామహోపధ్యాయ బిరుదును, అద్వైత విద్యాచార్యుఁడన్న బిరుదునూ ఉండెను. ఈతనికి అన్నయుండెనని 'అత్రాస్మదగ్రచరణాః' యన్న ఆలోకసిద్ధాంజన వాక్యమువలనఁ దెలియుచున్నది.

అన్నంభట్టు గుంటూరుమండల మందలి గరికపాటి నివాసియనియు, కొండవీటిలోని పాఠశాలలోఁ బండ్రెండేండ్లు చదువుకొనెననియు, తరువాత తాను ఒకపాఠశాలస్థాపించి విద్యార్థులకుఁ దర్కశాస్త్రము నేర్పుచుండెననియు, తనకున్న దానితో సంతుష్టిఁ జెందియున్నడును, ఎచ్చటికిని వెళ్లి యేరాజును ఆశ్రయింప లేదనియు, ౫౫ సంవత్సరములు వయస్సు వచ్చిన తరువాత శ్రీశైలమునకుఁ బోయెననియుఁ దర్కమునందు మొదట సంగ్రహము, తరువాత దీపిక, పిదప ముక్తావలి చివర గదాధరి చెప్పు సాంప్రదాయము నితఁడే యేర్పతిచెననియు, ఈతఁడు శా. శ. ౧౫-వ శతాబ్దమున నున్నవాఁడనియు అర్వాచీన కోశకారుఁడు వ్రాసియున్నాఁడు. ఇందు కాతఁడేమియు నాధారమీయక పోయినను అన్నంభట్టు క్రీ. శ. ౧౬౦౦ - ౧౭౦౦ లకు నడుమ కాలముననున్నవాఁడని మనముసాధారణముగ నూహింపవచ్చును. ఇతఁడు ప్రక్రియాకౌముదీకారునకుఁ దరువాతివాఁడు, సిద్ధాంత కౌముదీకారునకుఁ బూర్వపువాఁడు.

'కాశీగమన మాత్రేణానాన్నంభట్టాయితే ద్విజః' కాశికిఁబోయినంత మాత్రమున సబ్రాహ్మణుఁడు అన్నంభట్టుకాఁడు అన్న వచనము ఉదాహరించి కొందఱితఁడు కాశికిఁ బోయి యచ్చటఁ బండితుల గెలిచి బిరుదావళులఁ బొందెనని చెప్పుదురు.

**అన్నదానపట్టి.** ఇది సేలంజిల్లా సేలంతాలూకాలోని యొక చిన్న జమీందారి. దొరతనమువారికిఁ జెల్లింపవలసిన పేష్కష్ రూ 3౭౯ లు. ఈ ముఖ్య స్థలము అన్నదానపట్టియను పల్లె. ఇది సేలమునకు పశ్చిమమున క్రోశడు దూరమున నుండును. ఇందు ౭3 ఇండ్లును, 3౦౭ జనులును కలరు. ప్రస్తుతకాలమందు నిచ్చట శ్రీయుత షడగోప మొదలియారుగారు

శ్రీయుత రాజమాణిక్య మొదలియారుగారు జమీన్‌దారులుగ నున్నారు.

అన్నదేవ చోళుఁడు. భద్రేశ్వరుఁడను నామాంతరముగల కామరాజు యొక్క కుమారుఁడు. ఈతని తల్లి అన్నమాంబ. అన్నదేవుని భార్య యిరుగాంబిక. ఈమె సూర్యవంశజుఁడైన పిన్నుండి అనువానికిఁ దోఁడఁబుట్టినది. వీరిద్దరికిని వీరభద్రుఁడు కొడుకు. అన్నదేవుఁడు మహమ్మదీయులకు సఖుఁడు. ఈతఁడు కర్ణాటరాజు సైన్యములను ఓడించెను. జగ్గవాగు మొదలైన స్థలముల నాక్రమించెను. ఈతఁడు అత్తిల యొద్ద దక్షిణదేశపు రాజులతో యుద్ధము చేసి, తనకు శరణుఁజొచ్చిన పదివేలమందినిఁ గాపాడెను. గోదావరీతీరమున కాకరపర్తి యొద్ద తనబావమఱదియైన పిన్నుండి సాయమున నీతఁడు కన్నడరాజును మఱి యితర రాజులను చంపెను. తనస్నేహితుని రక్షించెను. తనకు శరణుజొచ్చిన కాటయవేముని కుటుంబమును యశఃకాముఁడై రక్షించెను. ఈతని రాజ్యమందు ముమ్మిడి పోలవరమను గ్రామము వైభవ దశయందుండెను. ఇదియె యితనిరాజధాని క్రాఁబోలు. ఇతఁడు బ్రాహ్మణులకు బంగారపు కొమ్ములుతో వేలకొలఁది గోవుల దానము చేసెను. ద్రాక్షారామ భీమేశునకు సువర్ణగోపురము కట్టించెను. ఈతఁడు పధునైదవ శతాబ్దమధ్యమునం దున్నట్టును రాజమహేంద్రవర ప్రాంతమున కొంతకాలము రాజ్యము చేసినట్టును కానవచ్చుచున్నది. గంగ (గోదావరి) యొడ్డున శిన్నసాని సంగమునొద్దనున్న ఉత్తమగండ చోడాన్నదేవవరమను గ్రామమును బ్రాహ్మణులకు దానము చేసెను.*

అన్నపూర్ణ. పార్వతీదేవి యొక్క యొక రూపము. ప్రపంచమునకు నాహార మొసంగు దేవత. అన్నపూర్ణాదేవియొక్క యాలయము కాశీలోఁ గలదు. కాశికి నధిపతియైన విశ్వేశ్వరుని భార్య. ఆదిభిక్షువైన శివునకు భిక్షపెట్టుటకునై యీమె యీ రూపముధరించె నందురు. అన్నపూర్ణ విగ్రహమునకు నొకచేతులో పల్లెమును గంటెయు నుండును. ఈమెవర్ణము రక్తము (ఎరుపు). చైత్ర శుద్ధ అష్టమి ఈమె పూజాదినము. పూర్వపు రోమకులుగూడ 'అన్నపెరెనా' యను నొకదేవతను పూజించుచుండిరి. అది యన్నమిచ్చు దేవతయె. ఆమెపూజయు చైత్ర మాసమునసే చేయుదురు. విశ్వకోశము.

---

* ఇది వఱకు నీతనిని గుఱించిగాని, యితని వంశమునుగుఱించిగాని, చరిత్రకారులకు నేమియుఁ దెలియదు. క్రొత్తగానతని తామ్రశాసన మొకటి రాజమహేంద్రవర చిత్రవస్తు ప్రదర్శనాలయమునందున్నదని కనుఁగొనఁబడినది. దానిని గుఱించి Epigraphical Reports (Southren circle) 1912, Para 67 లో వ్రాయఁబడినది. అదియే యీచరిత్రకాధారము.

**అన్నప్రాశనము.** గృహ్యసంస్కార విశేషము. శిశువునకు మొట్టమొదట నన్నము తినిపించుట. మగపిల్లవానికి నాఱవ మాసమునందుగాని, యెనిమిదవ మాసమందుగాని ఆఁడుపిల్లకు నైదవమాసమందుగాని యేడవమాసమందుగాని, ఈ సంస్కారము చేయవలయునని ధర్మశాస్త్రము. మన యాంధ్రదేశమందును ఈ యాచారమే కలదు. శిశువునకు నన్నప్రాశనము మేనమామ చేయును.

**అన్నభేది.** (పాశ్చాత్య శాస్త్రము ననుసరించి) నూతనముగ తయారు చేసిన అన్నభేది నిర్మలమై కొంచెము నీలవర్ణ మిశ్రమైన ఆకుపచ్చని స్ఫటికపు ముక్కలవలె ప్రకాశవంతమై యుండును. గాలి జొరిన కొలఁది పొడియై ఆకుపచ్చనివర్ణము కొంచెము గోధుమ వర్ణమునకు మారును. కొంచెము సిరా రుచియుండును. ఒకవిధమైన వాసన స్వల్పముగ నుండును.

స్వరూపము

ఇందు ఇనుము, గంధకము, ప్రాణవాయువు (ఆక్సిజన్) అను మూలపదార్థములు గలవు. ఇందుప్రాణవాయువు హెచ్చుగ చేరినకొలఁది ఆకుపచ్చరంగు గౌర (గోధుమ) వర్ణముగా మారును. ఒక యణువు అన్నభేదిలో ఇనుముయొక్క పరమాణువు యొకటియును, గంధకపు పరమాణువు ఒకటియు, ప్రాణవాయువుయొక్క పరమాణువులు నాలుగును ఉండును. ఇవిగాక సాధారణముగా నిందు నీటియణువు లేడుండును. తూనికవేసిచూడఁగా ౧౦౦. పాళ్ళ అన్నభేదిలో ఇనుము ౨౧.౧౫, గంధకము ౧౧.౦౫౧, ప్రాణవాయువు ౨౩.౦౨, నీళ్ళు ౪౫.౮౨ పాళ్ళు ఉండును. నీళ్ళు ద్రవరూపకముగా నుండక అన్నభేది స్ఫటికీకరణములలోఁ గలుగు ఘనరూపములుగానుండును. దీనికి రసాయన శాస్త్రమందు 'లోహ గంధకితము' (Ferrous Sulphate) అనిపేరు; లోగఅ$_4$ (Fe $SO_4$) అని రాసాయనిక సంకేతము. ఇందు ౭ ఉ$_2$, అ (7 $H_2$ O) అనఁగా నీటియొక్క యేడు అణువులుకలిసి యుండును.

ఇందుండుద్రవ్యములు

౧. వైద్యులు, ఇనుమును ఏయేవ్యాధుల చికిత్సల కుపయోగింతురో ఆవ్యాధులయందు అన్నభేదిని సాధారణముగ నుపయోగింపవచ్చును. రక్తపుష్టి లేనివారికి రక్తస్రావమును నిలుపుటకును ఇది సహకారియగును. కాని యినుముతో మిశ్రమమై తయారగు కొన్ని పదార్థములు సులభముగ జీర్ణమగునవిగను, మఱికొన్ని యట్లుగాక జీర్ణకోశమునకు నానాటికి శ్రమకలిగించునవిగను ఉన్నవి. కాబట్టి, వైద్యుఁడు రోగియొక్క బలమును బట్టియు, వ్యాధిబలమును బట్టియు అన్నభేదినిగాని, ఇనుముతో మిశ్రమమైన ఇతర పదా

గుణములు

ర్థములనుగాని ఉపయోగించ వచ్చును. ఇను ముగలమ్మందును సేవించునప్పుడు మలబద్ధక మధికమై మలము నల్లనగును. కొందఱకు తలనొప్పి, కడుపునొప్పి, అజీర్ణము మొదలగు గుణము లినుమును సేవించుటచే కలుగును.

అన్నభేది మోతాదు:- ౧ మొదలు ౫ గురి గింజల వఱకు, గుక్కెడు నీళ్ళతో చేర్చి ఇయ్య వచ్చును. కాల్చిపొడిచేసి మాత్రగట్టిగూడ నియ్యవచ్చును. తక్కిన వివరములకు 'ఇనుము' అను శీర్షికక్రింద జూడనగును.

౨. దుర్మాంసము పెరిగివచ్చు పుండ్లపై అన్నభేది రాచినయెడల కోత గుణము గలదు. నీళ్ళలో గలిపి పుండును గడిగిన యెడల కోతగుణమంతగా నుండదు. మొండి పుండ్లు శీఘ్రముగ మానును.

౩. అన్నభేదియందు సూక్ష్మజీవులునశింప జేయు గుణముగలదు. ఒకపాలు అన్నభేదిని ఆఱు పాళ్ళ నీళ్ళతో జేర్చి జలదారులను, పాయిఖానాలను, కడుగవచ్చును. ఒక మాన వుడు విసర్జించు మలమును శుద్ధిచేయుటకు రమారమి రెండు తులముల అన్నభేదిపట్టును. కలరా మొదలగు వ్యాధులుగల దినములలో ఇతరపదార్థములు లేనిచో అన్నభేదిని సూక్ష్మ జీవుల నాశనార్థమై ఉపయోగించ వచ్చును.

౪. పశువులకు గూడ రక్తపుష్టికొఱకును నెత్తురు విరేచనములకును, రక్తప్రవాహమును ఆపుటకును ఇయ్యవచ్చును. పశువుల పుండ్లకు మంచిమందు; కాని అధికముగ నుపయో గించిన కోతకోయును. కొబ్బెరి నూనెతో చేర్చి వాడవచ్చును. గుఱ్ఱమునకు ౩౦ మొ దలు ౬౦ గురిగింజల మోతాదును, పశువు లకు సగమును, మేకలకు గొఱ్ఱెలకు నాల్గవ వంతును, కుక్కలకు ౧ మొదలు ౧౦ గురి గింజ లెత్తువఱకును లోపలకు వాడవచ్చును.

ఇతరోపయోగములు.

౧. కరక్కాయ నీళ్ళతో చేర్చి సిరాచేయు టకు అన్నభేది ఉపయోగించును (చూడు 'సిరా').

౨. నెరసిన వెండ్రుకలకు రంగువేసి కొను టకు మఱికొన్ని పదార్థములతో దీనినిగలిపి ఉపయోగింతురు (చూడు 'వెండ్రుకలు').

౩. కప్పు మొదలగు పండ్ల పొడుల లో వాడుదురు. చిగుళ్ళలో నెత్తురు తగ్గించును కాని నల్లనిరంగు నిచ్చును (చూడుము 'పన్ను').

౪. రంగులు వేయుటలో అన్నభేది ఉప యోగింతురు (చూడు 'అద్దకము').

తయారుచేయువిధము

సన్నని ఇనుపతీగె ఒకతులమును, గంధక ద్రావకము ఒకతులమును, వాననీరు ౫ తులము లును ఒక సీసాలోవేసి పెట్టినయెడల కొంత సేపటికి అన్నభేది తయారయి నీటిలో కరిగి యుండును. అమ్మకమునకు అన్నభేదిని తయారు చేయునప్పుడు పైరైట్ (Pyrite) అను ఖనిజ పదార్థమును గాలికిఆర్చి ఇనుముపొడియునీరును జేర్చి కొంత కాలముంచి దానినెండబెట్టగా

అన్నభేది తయారగును. సాధారణముగా దీనిని బజారులో అమ్ముదురు. [ఆ: ల. (ఆయుర్వేద శాస్త్రము ననుసరించి)

దీనిని సంస్కృత భాషలో కాసీసమందురు. రసరత్నసముచ్చయము నందును, తదితరములగు రస

ఉపరసము, ఖనిజము

తంత్రముల యందును నీయన్నభేదిని ఉపరసములలో చేర్చుటచే రసవార్తికాచార్యులందరు దీనిని ఖనిజముగా వ్యవహరించినటులు దెలియుచున్నది. అయినను పూర్వులీ యన్నభేదిని ఇనుముతో గూడిన మిశ్రద్రవ్యము (Compound) గా పరిగణించిరనుట కాధారము లేవియు లేవని ఉదయ చంద్రదత్తుగారు తమ "హిందూ మెటీరియా మెడికా" యను గ్రంథమందు వక్కాణించియున్నారు. ఖనిజముగా పరిగణించిన ఈకాసీసమును కొందరు గ్రంథకర్తలు తమతమ గ్రంథములయందు వాలుకాకాసీస మనియు, పుష్పకాసీస మనియు రెండు విధములుగలదానినిగా పేర్కొనిరి. మరికొందరు ధాతుకాసీస మనియు, పుష్పకాసీస మనియు విభజించిరి. రస తంత్రములయందెచ్చటజూచినను రెండువిధములగు కాసీసములనే జెప్పియుండుటచే నిందు వాలుకా కాసీసమునకు ధాతుకాసీసమను నామాంతరముండి యుండవచ్చునని తోచుచున్నది. వైద్యవిశారదులందరు దీనినే అన్నభేదియను పేరున వ్యవహరించి చికిత్సలయందు తరుచుగ నుపయోగించుచున్నారు. దరదము (ఇంగిలీకము) సస్యకము (మైలతుత్తము) మొదలగునవి ఇప్పుడు రసాయనసమ్మేళనముచే తయారుచేయబడి, ఇంగ్లండు, హాలెండు మొదలగు దేశములనుండి మనకెగుమతి చేయబడు ద్రవ్యములను గురించి ప్రాచీన రసతంత్రజ్ఞులు వానియుత్పత్తి విధానమును, అవి దొరకు ప్రదేశములను చక్కగ నిర్దేశించుటచేతను, మట్టి యిసుక మొదలగు మలిన పదార్థములతో గూడియుండినవగుటచే శుద్ధి చేయక నుపయోగింప రాదని విధించుటచేతను, తాంత్రిక మహాయుగమునం దీయన్నభేదిగూడ గనులయందు దొరకుచుండెడిదేమోయని యూహింపనగు.

ఉదయచంద్రదత్తుగారు తమ హిందూ మెటీరియా మెడికాయందు ధాతు కాసీసము ఆకుపచ్చని రంగుగలదిగను, పుష్పకాసీసము

కాసీస స్వరూపము

కొంచెముపసుపురంగు గలదిగను ఉండునని చెప్పియున్నారు. ఇందుకు నిదర్శనముగ

శ్లో॥ "కాసీసం ధాతుకాసీసం పాంశు కాసీసమిత్యపి,
తదేవ కించిత్పీతంతు పుష్పకాసీస ముచ్యతే"

అను శ్లోకమువలన ఆయుర్వేద ప్రకాశమను గ్రంథములో శ్రీమదుపాధ్యాయ మాధవులు పుష్పకాసీసము కొంచెముపచ్చని వర్ణముతో గూడి యుండునని నిరూపించియున్నారు. ఇప్పుడీ కాలమందుగూడ ఈ రెండు విధములయిన వర్ణములుగల అన్న

భేదిని జూచుచున్నాము. ఈరెంటిలో పుష్ప కాసీసము మిగులశ్రేష్ఠమయినదని వాగ్భటాచార్యులు మొదలగు నాయుర్వేద శాస్త్రజ్ఞులు "పుష్పాదికాసీసమతిప్రశస్తం" ఇత్యాది వాక్యములచే సూచించియున్నవారు. ఇందు వాలుకా కాసీసము క్షార విశిష్టమనియు, అమ్లరస విశిష్టమనియు, పుష్ప కాసీసము కషాయామ్లరస విశిష్టమనియు, వీర్యమునందు రెండును ఉష్ణవీర్య విశిష్టములే యనియుగూడ వర్ణించిరి. మరియు అన్నభేది శ్విత్రము (బొల్లి) నేత్రరోగము, శ్లేష్మరోగము, వాతరోగము, అజీర్ణము, అర్శోరోగము, క్షయరోగము, పాండువు, ప్లీహరోగము, గుల్మరోగము, మూత్రకృచ్ఛ్రము వీనిని బోకడచును. వ్రణమును శుద్ధిపరచి మాన్పును. "విషఘ్నం" అని చెప్పుటచే కృత్రిమవిషమునకు విరుగుడుగా నుపయోగించునని తోచుచున్నది. "ముఖకేశ రంజనకరం" "పటర్ణం జనకం పరం" అని రసప్రకాశ సుధాకరమందు అన్నభేదియొక్క గుణకథనము గానబడుచుండుటచే దీనిలేపనక్రియచే ముఖమునకు కాంతియు, కేశములకు కృష్ణవర్ణము గలుగునని తోచుచున్నది. ఇది వస్త్రములకు రంగువేయుట కుపయోగ్యపడునట్లు గూడ తోచుచున్నది. అయితే దీని స్వతంత్రోపయోగమెచ్చటను జెప్పియుండునట్లుతోచదు. ఇతర ద్రవ్యములతో సమ్మేళనజేసి యుపయోగింపనగును.

దీనిని శుద్ధిచేయక నుపయోగింపరాదు. అట్లుపయోగించిన చర్మిపుట్టుట జూచుచునే యున్నారము. శోధనావిధానము లనేకములనేక రీతులుగా జెప్పియున్నను సర్వసాధారణముగా, 'శ్లో॥ భృంగరాజరసేస్విన్నం నిర్మలంహిప్రజాయతే' అను శాస్త్ర మర్యాద నతిక్రమింపక దీనిని వైద్యావతంసులందఱు శుద్ధిచేసియేవాడుచున్నారు. అనగా గుంటగలగరయొక్క పసరుతో దీనిని డోలాయంత్రమున వండి(స్వేదనచేసి)నచో, శుద్ధియగును. మరికొందరు గుంటగలగర్ల రసముతో ౮-౧౦ పర్యాయములు ఖల్వముననూరి యుపయోగించుటయు గలదు. దీనికి మారణవిధాన మెచ్చటను గ్రంథస్థము కానరాదు. కాని వ్యవహారమునందు లఘుపుటంబులిడి దీనిని సిందూరింపజేసి వాడుట కలదు. ఇట్లు లఘుపుటములచే తయారుజేయబడిన అన్నభేదిసిందూరము శుద్ధిచేయబడిన అన్నభేదికంటె దోషరహితమును గుణాధిక్యతగలదిగను నగుచున్నది. శుద్ధిచేసిన యన్నభేదిని నిమ్మకాయరసము, వేపచెక్క రసము, కుక్కపొగాకు రసము, వీనిలో దేనిచేనయిన చక్కగనూరి బిళ్లలుగాజేసి, నీడలోనెండించి ఆబిళ్లలను మూకుటిలో బోసి పైన మరియొక మూకుడును మూసి సంధిబంధనముజేసి ద్రవ్యపరిమాణము ననుసరించి ౧౦ మొదలు ౧౦౦ వరకు పిడకలతో పుటంబిడవలయును.

అనంతరము సాంగశీతలముగ దీసి చూచి నచో నందలి యన్నభేది యెఱ్ఱగ సిందూరించి కుంకుమవలె నగును.

కాశీసిందూరము

అద్దానిని సర్వరోగములయందును నుపయోగింపనగు. ఆంధ్రదేశీయులగు వైద్యవరులందరీ రీతిగనే కాసీససిందూరమును తయారు జేయుచుందురు. మరియు దాక్షిణాత్యవైద్యులు కొందఱు కాసీసమునకు సమముగ సురాష్ట్రారమును (Nitre) కలిపి పైజెప్పిన రసములలో నేదయిన నొకదానితో నూరి పుటమిడుటయు గలదు. ఈ విధానముగా తయారు చేసిన సిందూరము నెక్కువ గుణవంతమని వారి యాశయము. కాసీససిందూరముగాని, శుద్ధకాసీసముగాని ప్రధానముగాగల యోగములను గొన్నిటిని మాత్రము నిందుదాహరించెదను.

(౧) శ్లో॥ కాసీసంభస్మ కాంతస్య

చోభయం సమభాగికమ్,

వరావిడంగ సంయుక్తం

ఘృతక్షౌద్ర ప్లుతం ప్రగే,

భక్షితం హంతి వేగేన

పాండుయక్ష్మాణమేవచ,

ప్లీహం గుల్మం గుదేఖాలం

మూత్రకృచ్ఛ్రాణ్యశేషతః.

ఇతిరసప్రకాశసుధాకరే

అర్థము. అన్నభేది, కాంతభస్మము, సైంధవలవణము, వాయువిడంగములు, వీనిని సమభాగములుగ చూర్ణించి నెయ్యి తేనె వీనియందు గలిపి సేవించినచో, పాండువు, క్షయ, ప్లీహము, గుల్మము మొదలగు రోగములు శాంతించును. అగ్ని దీప్తికలుగును.

(౨) కాసీసం రోచనాతుల్యం

హరితాలం రసాంజనమ్,

అమ్లపిష్టః ప్రలేపోయం,

వృషకచ్ఛ్వాహిపూతయోః.

ఇతిచక్రదత్తః.

అర్థము. అన్నభేది, గోరోచనము, తాళకము, రసాంజనము, వీనిని కాంజికముతో నూరి లేపనము చేసినచో వృషణకచ్ఛ్వ, అహిపూతము మొదలగు చర్మరోగములు శాంతించును.

(3) సువర్ణ పుష్పకాసీసం

విడంగాని మనశ్శిలా

రోచనా సైంధవం చైవ

లేపనాచ్ఛ్విత్ర నాశనమ్.

ఇతిశార్ఙ్గధరసంహితాయాం.

అర్థము. హసపుజాజి, అన్నభేది, వాయువిడంగములు, మణిశిల, గోరోచనము, సైంధవలవణము, వీనిని సమానముగ గ్రహించి నూరి లేపనము జేసిన శ్విత్రమను కుష్ఠువు నశించును.

(౪) కాసీసం దధినాయుచ

హిక్కాఘ్నా మధు సంయుతా.

ఇతిచక్రదత్తః.

అర్థము. అన్నభేదిని వెలగగుజ్జును సమముగ కలిపి తేనెతో సేవించిన ఎక్కిళ్ళు శాంతించును.

ఇట్లు కాసీసము ప్రధానముగాగల యోగములనేకములు గ్రంథస్థములు గానబడు చున్నవి. [గం. దూ.

అన్నమదేవుఁడు ఓరుగంటి రెండవ ప్రతాపరుద్రుని తమ్ముఁడు. ప్రతాపరుద్రుని తండ్రిపేరు మహాదేవుఁడు, తల్లి పేరు ఉమ్మక్క. కావున నితని తల్లి దండ్రులును వారే యని మనమెంచ నవకాశముండును.

ఉమ్మక్క రుద్రమ్మదేవి కూఁతురు. ప్రతాపరుద్రుఁడు దిగ్విజయయాత్ర వెడలి పదునైదు సంవత్సరములు తిరుగుచుండెననియు, ఆకాలమున నితఁడు ఓరుగంటిలోఁ బరిపాలనము చేసెననియు, తురుష్కులు రాజ్యము మీఁదికి దండెత్తి వచ్చినప్పుడు ఈతఁడు సైన్యాధిపుఁడుగనుండి వారిని ననేకపర్యాయము లోడించెననియు, చివరకుఁ బ్రతాపరుద్రుఁడు పట్టువడినకాలమున నితఁడే రాజ్యముచేసెననియు, ప్రతాపరుద్రుఁడు చెఱనుండి వెడలివచ్చిన తరువాత తాను రాజ్యము చేయనొల్లక యీతనికిఁ బట్టము గట్టెననియు, ప్రతాపరుద్రుఁడు పరలోకగతుఁడైన తరువాత నితఁడు ఈశాన్యభాగంబునకై వింధ్యప్రాంతము వైపు వెడలిపోయెననియు 'ఏకశిలానగర వృత్తాంతము' * నందు వ్రాయఁబడినది. ప్రతాపరుద్రుఁడు చెరలోనుండు కాలమున నీతఁడు ప్రభుత్వము చేయుచుండఁగా విద్యానాథకవికృత ప్రతాపరుద్రీయము పూర్తి అయినదఁట. అప్పుడు కవి ప్రతాపరుద్రుని యొద్దకుఁ బోఁగా నాతఁడు తన యుంగరమిచ్చి యాతనిని తనతమ్ముని యొద్దకుఁ బంపెనఁట. అన్నమదేవుఁ డాతనికి గొప్ప బహుమానమిచ్చుటయేగాక ఓరుగంటిలో నొకగొప్పపాఠశాలఁ బెట్టించి విద్యానాథుని దానికి నాచార్యునిఁ జేసెనఁట. ఈసమాచారము 'కవిచరిత్ర' 'మనుమహారాష్ట్ర' గ్రంథము నందుఁ గలదని అర్వాచీన కోశకారుఁడు వ్రాసినాఁడు.* ఈ యన్నమదేవుఁడు ఓరుగంటినుండి వెడలిపోయి బస్తరురాజ్యమును స్థాపించెను. బస్తరు సంస్థానమును నైజామువంటి స్వాతంత్ర్యప్రభుత్వము. ఇది మధ్యపరగణాలలోనున్నది. దీనికి తూర్పున మన రాజధానిలోని జయపురము జమీందారియు, దక్షిణమున గోదావరిజిల్లాలోని భద్రాచలము తాలూకాయును అంటుకొని యున్నవి. అచ్చటిరాజులు ఈ అన్నమదేవుని తమ మూలపురుషునిగాఁ జెప్పుకొనియెదరు‡. అన్నమదేవుఁడు ఓరుగంటినుండి బయలుదేరినప్పుడు ఆతని కులదేవతయైన మాణిక్యదేవి యాతనికొక ఖడ్గమిచ్చెనఁట. అది యిప్పటికిని ఆరాజులయొద్ద నున్నదఁట.[1] ఇతఁడు వచ్చునప్పు డాతనివెంట నొకబంటు నీళ్లు తెచ్చువాఁడు వచ్చెనఁట. వానివంశజులిప్పుడు బస్తరు సంస్థానమున ఫుట్‌కేల్ జమీందారికి నధిపతులుగ నున్నారు.[2] బస్తరు సంస్థానమందు కోసా

* ఇది వ్రాతప్రతి. ఇటీవలివారిచే (బహుశః మెకంజి గుమాస్తాచే) వ్రాయఁబడినది, చెన్నపురి ఓరియంటల్ మ్యానుస్క్రిప్టు లైబ్రరిలో నున్నది.

* 'అర్వాచీనకోశ' మనునది, చరిత్రాత్మక కోశము. మరాటీభాషలో నున్నది. కర్త రఘునాథ భాస్కర గోడ్బోలె. ఇందున్న యంశములన్నియు కావలి వెంకటరామస్వామిగారు ౧౮౨౯ లో కలకత్తాలోఁ బ్రకటించిన 'Dekkan Poets' అను గ్రంథమునందుఁ గూడఁ గలవు.

‡ Imperial Gazetteer of India, Bastur.

1. *Central Provinces Gazetteers, Chhattisgarh Feudatory States*, p. 36. 2. *Ibid*, p. 51.

యాలను జాతివారు కలరు. వారిపూర్వులు ఓరగంటినుండి యన్నమదేవునితో వచ్చినారఁట.[3] అన్నమదేవుఁడు విక్రమ సంవత్సరము ౧౩౮౧ వ సంవత్సరమున నఁగా క్రీ. శ. ౧౩౨౪ లోఁగాలము చేసెనఁట.[4] బస్తరు ఓరుగంటికి మిక్కిలి దూరముగా లేదు. ఈశాన్యమునందు రమారమి రెండువందల మైళ్లదూరమున నుండును.

ఇప్పటి బస్తరురాజులు ప్రతాపరుద్రుని తమ్ముఁడైన అన్నమదేవుని సంతతి వారని చూపుటకు నాసంస్థానమందలి దంతేశ్వరి దేవాలయములో నొకశాసనము కలదు. అది బస్తరురాజుల పూర్వుఁడైన దిక్పాల దేవునిచే వ్రాయింపఁబడినది. ఇందలి సంవత్సరము విక్రమశకము ౧౭౬౦, అనఁగా క్రీ. శ. ౧౭౦౩. దిక్పాలదేవుఁడన్నమదేవునుండి పదియవపురుషుఁడు. అన్నమదేవుని కుమారుఁడు హమీరదేవుఁడు.* కాని శాసనమును సంపాదితము (Edit) చేసిన శ్రీయుత హీరాలాలుగారిందు రెండు అసందర్భములఁ జూపినారు. ఒకదానికి వారే సమాధానము చెప్పినారు. రెండవదానికిఁ జెప్పలేదు. మొదటి యసందర్భము. ఈశాసనమునందు అన్నమదేవుఁడు చంద్రవంశజుఁడుగాఁ జెప్పఁబడినాఁడు. కాని గణపతిదేవుని ఏకామ్రినాథ శాసనమునందు (Indian Antiquary vol. XXI, p. 200.) కాకతీయులు సూర్య వంశజులని చెప్పియున్నది. కాని యిదియొక యసందర్భముకాదు. ప్రతాపరుద్రుఁడు మొదట కాకతీయవంశమువాఁడు కాఁడు. దత్తతవలన కాకతీయుఁడయ్యెను. మొదట ప్రతాపరుద్రుఁడును అన్నమదేవుఁడును చంద్రవంశమునందుఁబుట్టి యుందురు. దత్తత పోయినందున ప్రతాపరుద్రుఁడు సూర్యవంశుఁడై యుండవచ్చును. అదియుఁగాక చంద్రసూర్య వంశములు మూలమునందెట్లు పుట్టినను, ఇటీవలిరాజులనుగుఱించి యవి కవికల్పనలేయని చెప్పవలెను. ఎవరికి నిష్టమువచ్చినట్లు వారు తమ వంశము సూర్యవంశమనియు, చంద్రవంశమనియు వ్రాయుచువచ్చిరి.

రెండవ యసందర్భము: అన్నమదేవుఁడు ౧౩౨౩ లోనున్నవాఁడు. ఇది ప్రతాపరుద్రుని జెఱపట్టుకొని పోయిన కాలము. అన్నమదేవుని వంశమందలి పదియవ పురుషుఁడు పైశాసనము వేయించినవాఁడు ౧౭౦౩ లో నుండెను. అనఁగా ౩౮౦ సంవత్సరములలో ౧౦ తరములు గడిచినవని అనుకొనవలెను. తర మొకటింటికి రమారమి ౩౮ సంవత్సరములు పడినవి. కాని సాధారణముగ తర మొకటింటికి ౩౦ ఏండ్లకంటె నెక్కుడుకాలము లెక్క వేయుటకు వీలులేదు. కావున ప్రతాపరుద్రుని తరువాత రమారమి నూటేండ్లకు మఱియొక ప్రతాపరుద్రుఁడు, ఉండవచ్చుననియు ఆతఁడు యుద్ధమునందుఁ దురష్కులచేఁ జచ్చియుండవచ్చుననియు శ్రీయుత హీరా

3. *Chhattisgarh Feudatory States* 46. 4. *Ibid* p. 37.

* Epi. Indica. vol. IX. p. 165.

లాలుగారు వ్రాసిరి, కాని తదమున్నకు నలుబది సంవత్సరము లంతగా నేక్కువ కాలము కాదని మా తాత్పర్యము.

**అన్నము**. చూడుడు ఆహారము.

**అన్నయ రెడ్డి**. ఓరుగంటి రెండవ ప్రతాప రుద్రుని కాలమునందు సామంత రాజుగ నిప్పటి కృష్ణామండలములోని మునగాల జమీందారిప్రదేశమును పాలించుచున్న రెడ్డిరాజు. మునగాల జమీందార్ల పూర్వుఁడై యుండును. మునగాల జమీంద్వారీలోని తాడువాయ గ్రామమందు శిథిలమైన మల్లిఖార్జునుని దేవాలయములో నీరాజుచే వేయించఁబడిన శిలాశాసనములు రెండుకలవు. ఒకటి క్రీ. శ. ౧౩౦౦ లో నిది, రెండవది క్రీ. శ. ౧౩౦౬ లోనిది.* ప్రతాపరుద్రుఁడు రాజ్యము చేయుచుండగనే - కాకతీయ రాజ్యవైభవము పట్టపగలంటి సూర్యుని పగిది వెలుంగుచుండగనే - రెడ్లు రాజ్యము లేలుచున్నట్టు చెప్పెడి పురాతన శాసనమిదియే. రెడ్లప్రభుత్వమును సూచించునట్టి శాసన మింతకంటెఁ బూర్వపుది లేదు.

**అన్నయ్య** (తెనాలి). ఈకవి సుదక్షిణా పరిణయమను నాంధ్ర కావ్యమును రచించెను. ఈకవి యింటిపేరు, తెనాలివారనియు, నీతని తండ్రిపేరు రామయయనియు నీతని కావ్యమందలి కృత్యాది పద్యములవలన నేట పడుచున్నది.

విఖ్యాతిఁ జెందినట్టియుఁ, బాండురంగ మాహాత్మ్యమును రచించినట్టియు, తెనాలి రామకృష్ణునకు నీతఁడు తమ్ముఁడు. ఈసంగతి

కవివంశము

యాతని యగ్ర్నమనుమఁడగు, తెనాలి రామభద్ర కవిచేరచింపఁబడిన ఇందుమతీ కల్యాణ* మనెడు కావ్యమందలి యీ క్రింది పద్యములవలన స్పష్టపడఁగలదు:-

ఉ. మామకనవ్యకావ్యము స
 మంచితమాధురి సాధురీతిగా
 యామకృతి ప్రబంధ రచ
 నాయతపాక చతుర్విధైక వా
 గ్ధామమహిమోజ్జ్వలాఢ్యకవి
 తాఘనతామహు మత్పితామహుఁ
 రామయరామ కృష్ణకవి
 రాజుఁదలంచి నుతించి మ్రొక్కెదన్

గీ. తదనుసంభవమణిని సుదక్షిణాప
 రిణయముఖకావ్య రచనాధురీణు నంధ్ర
 కవికదంబములోనఁ బ్రఖ్యాతిఁగన్న
 యన్నపకవీంద్రు ధీసాంద్రునభినుతింతు.

కవిస్తుతిలో నిట్లువ్రాసి, కృతిపతి తనను గూర్చి యిట్లు చెప్పినట్టు లీకవి వ్రాసి యున్నాఁడు:-

* Sewell's Antiquities Vol p. 43. Kistna District Manual.

* ఈకావ్య మచ్చుపడలేదు. శ్రీయుత మానవల్లి రామకృష్ణకవి గారియొద్ద నున్నది. వీరు వ్రాయించిన ప్రతి యొకటి మాకిచ్చినారు. కృతజ్ఞులము. కావ్యమంతగా నెక్కుడు యోగ్యతకలది కాదు.

సీ. ప్రేషి మీపెదతాత పాండురంగాది స-
త్కృతులు సేసెను రామకృష్ణసుకవి
అనుజుండన్నప్ప మీపినతాత రచియించెఁ
బరఁగ సుదక్షిణాపరిణయంబు
మీతాత శ్రీగిరి చాతురీఖ్యాతి
శ్రీశైలమాహాత్మ్యకృతి యొనర్చెఁ
గడిమి మీతండ్రి యిమ్మడి రామకృష్ణాఖ్యుఁ
డనకీర్తిగనె సంస్కృతాంధ్రములను
దొరలనిపించె మీయన్న వీరరాఘ
వాఖ్యకవి సర్వకవితామహత్త్వమునను
నిన్ను సూచానఘంతాను నెన్నఁదరమె
పార్జ్ఞహృదయాబ్జరవి రామభద్రసుకవి.

పై పద్యములను బట్టిచూడ తెనాలిరామ పండితునకు రామకృష్ణుఁడు, శ్రీగిరి, అన్నప్ప (అన్నయ) అనుముగ్గురు పుత్రులుండిరనియు వారుముగ్గురుఁను కవులనియు, వారిలో మొదటివాఁడు పాండురంగమాహాత్మ్యాదికృతులును, రెండవవాఁడు శ్రీశైల మాహాత్మ్యమును; మూఁడవ వాఁడు సుదక్షిణాపరిణయమును రచించెనని తెలియుచున్నది. రామకృష్ణుని తండ్రిపేరు 'రామయ' యైనట్టు పాండురంగ మాహాత్మ్యములోని 'రామయరామకృష్ణ' యనుప్రయోగమువలన స్పష్టము.

తెనాలి రామ కృష్ణుఁడు ప్రథమశాఖా నియోగి, యనఁగా శుక్లయజుర్వేదీయ యాజ్ఞవల్క్యశాఖవాఁడనియు, కౌండిన్య గోత్రుఁడనియు 'లక్ష్మమ్మ' కుమారుఁడనియు, పాండురంగమహాత్మ్య మందలి కృత్యాది పద్యములవలనఁ దెలియుచున్నది. కావున నాతని తమ్ముఁడైన అన్నయ్యకుఁ గూడ నావిశేషణములు చెల్లునని మనమెంచుకొన వచ్చును. కాని యిద్దరి గురువులు (ముద్రాగురువులు) వేఱువేఱు. రామకృష్ణుఁడు తనగురువునిట్లు వర్ణించినాడు:-

క॥ వాక్కాంతా శ్రయభట్టరు
చిక్కాచార్యుల మహాత్ము శ్రీగురుమూర్తిన్
నిక్కపుభక్తి భజించెద
నిక్కావ్య కళాకలాప మీడేరుటకున్.
[పాండు. ౧.

అన్నయ్య తన గురువును గుఱించి యిట్లు చెప్పియున్నాఁడు:-

క॥ కంధాళభావనార్యుల
నందను శ్రీరంగ గురుని నతబుధరక్షా
మందారంబు నుతింతును
మందారమరందబిందుమధురాగభటిన్. [౧. ౭.

ఇట్లీ కవికి మతసంబంధమైన గురువు వైష్ణవుఁడయినను, తనను గుఱించి యీతఁడు 'హరపదాంభోజ సౌముఖ్యుఁడ' ననియు (౧. ౧౪), ఆశ్వాసాంతగద్యమునందు 'సహజశైవాచారసంపన్న శ్రీమదన్నయ నామధేయ' యనియు వ్రాసికొనుటయు వింతగనున్నది. ఈతనికి మతవిషయమై శ్రీరంగాచార్యుఁడు గురువుగనున్నను విద్యావిషయమై పాలగుమి భీముఁడను వాఁడు గురువుగనున్నట్టు మన మీక్రింది పద్యము వలన నూహింపవచ్చును.

గీ॥ నన్నపార్యాదులను బుద్ధి సన్నుతించి
పాలగుమి భీమగురుని సద్భక్తిఁగొలుతు. [౧. ౯.

ఈకవి రామకృష్ణుని తమ్ముఁడగుటచే నాతనికాలమే యీతనికాలము. కాని

రామకృష్ణుని కాలము నిశ్చయముగ నింకను తేలలేదు. గనుక నీతని కాలము స్వతంత్రముగ నిర్ణయింపఁ బ్రయత్నించెదము. ఈ ప్రయత్నము రామకృష్ణకవి కాలనిర్ణయమునకుఁ గూడ సహకారి కావచ్చును.

కవి కాలనిర్ణయము

ఈ కావ్యము (సుదక్షిణా పరిణయము) పులిజాలసోమామాత్యునకు నంకితముచేయఁబడినది. ఈ యమాత్య శేఖరుఁడు కోనేటి రామరాజు అను రాజునొద్ద మంత్రిగానుండెను. ఈ రామరాజును, కృష్ణదేవరాయల యల్లుఁడైన అళియ రామరాజును ఏకవంశము వారు. ఆర్వేటి బుక్కరాజు కుమారుఁడైన రామరాజిద్దఱకును మూలపురుషుఁడు. కోనేటి రామరాజు అళియ రామరాజునకు వరుసకు మనుమఁడు. వీరిద్దఱకుఁగల సంబంధ మీక్రింది వంశవృక్షమువలనఁ దెలియఁగలదు.* ఈతఁడు వరుసకు మనుమఁడైనను అళియ రామరాజు యొక్క చివరదశయందున్నట్లు కానవచ్చుచున్నది. అళియ రామరాజు మిక్కిలి వృద్ధుఁడై యుండునందున నాతనికి మనుమలు పుట్టి యుండుట యొక యాశ్చర్యము కాదు. మనుమఁడైన యీ కోనేటి రామరాజు అళియ రామరాజునొద్దనుండి కొంత రాజ్యమును వడసినట్లు సుదక్షిణా పరిణయమందలి యీ క్రింది పద్యమువలనఁ గాన్పించుచున్నది:-

మ॥ సమరజిద్విక్రమధాముఁ డాయళియరా
　　　　మక్ష్మావరోత్తంసుచే
గురుసామ్రాజ్యధురంధరత్వ ఘనుఁడా
　　　　కోనేటి రామాధిప
స్థిరసైన్యాధిపుఁ డబ్బమంత్రివరియిం
　　　　చెన్ యజ్ఞమాంబన్ మనో
హర భాగ్యోన్నతిఁ గంకి పాటిపురవే
　　　　ద్యామాత్యపుత్రీమణిన్. [౧-౮౭

రామరాజు ౧౫౬౫ లో తాళికోటయుద్ధమునందు వీరమరణము నొందుట సుప్రసిద్ధమే. కావున నాతనిచే రాజ్యముఁ బొందిన కోనేటి రామరా జప్పటికిఁ జిన్నవాఁడని అనుకొనినను ఆతని మంత్రికి నంకితమిచ్చిన కావ్యము




సూచన:- ఈవంశవృక్షము వసుచరిత్రమును, సుదక్షిణాపరిణయమును అనుసరించి వ్రాయఁబడినది.

మొదటిదానియందు శ్రీరంగరాజు వంశము వర్ణింపఁబడినది; రెండవదానియందు తిమ్మరాజు వంశము వర్ణింపఁబడినది. ఈవంశవృక్షమునందు మనకు వలసినంత వఱకే పేర్లీయఁ బడినవి. తక్కినవి విడిచిపెట్టఁబడినవి. శ్రీరంగరాజునకు నైదుగురు కొడుకులుగలరు. వారిలోఁ బ్రస్తుత విషయమునకు నావశ్యకమని ఒక్క అళియ రామరాజు పేరు నుదాహరించి మిగిలిన పేర్లు విడిచిపెట్టితిమి.

౧౫౮౪ కంచెర్ల దిరువాతి కాలమున వ్రాయఁబడియెనని తలంచుటకు వీలులేదు. మేము చూపిన పై ప్రమాణముఁ జూపకపోయినను, ఉభయ రామరాజుల సంబంధమును బట్టియు, మఱికొన్ని ప్రమాణములను బట్టియు *శ్రీ వీరేశలింగముగారీ కవికాలము ౧౫౮౦-వ ప్రాంతమనియు †శ్రీరామకృష్ణ కవిగారు ౧౫౬౫ అనియు వ్రాసియున్నారు. కావున నీకవియేమి, యితనియన్నయైన రామకృష్ణుఁడేమి క్రీ. శ. పదునాఱవ శతాబ్దముయొక్క మూఁడవ నాల్గవ పాదములోని వారనుట స్పష్టము. నిశ్చయమున నీయేట్ల నెప్పుట్టి ఈ యేటఁ గీర్తిశేషులైరని చెప్పుటకు వీలులేదు.

సుదక్షిణాపరిణయము ౧౫౬౭ వ సంవత్సరము తరువాతను, ౧౫౭౭ వ సంవత్సరమునకుఁ బూర్వము రచింపఁబడెననుటకు నొక నిదర్శన మిందుఁగాన వచ్చుచున్నది. ద్వితీయాశ్వాసమునందు శివుఁడు, తపస్సు చేయుచున్న రాజుకడకు, మాయాబ్రాహ్మణుని వేషము వేసికొనివచ్చి తన నివాసస్థలము చెప్పుటలో నిట్లు చెప్పెను:-

క. పెనుగొండనిలుతుఁ దఱచుగ
మనసెనసి ధనాఢ్యుఁ డొకఁడు మముఁగూడుకరాఁ
జనవున సకల జనంబులుఁ
బనిసేయఁగఁ గొదవలేనిబలగముతోడన్. [౨. ౯౯.

ఈ పద్యమునందు 'పెనుఁగొండ' శబ్దముపై శ్లేషగలదనుట స్పష్టము. పెద్దకొండ మీఁదనని యొకయర్థము, పెనుగొండ పట్టణమున నని రెండవ యర్థము. కవి యిట్లు పెనుగొండశబ్దమును ఉపయోగించుటకు నప్పుడు పెనుగొండ గొప్పపట్టణముగను, రాజధానిగను ఉండవలెను. లేనిచో శ్లేషసారస్యము కానుపించదు. పెనుగొండకు తిరుమల రాయిలు ౧౫౬౭ లో తన రాజధానిని మార్చెను. అచ్చట ౧౧౭౭ వఱకుండి యచ్చటి నుండి యాయేట చంద్రగిరికి రాజధానిని మార్చెను (Brigg's Ferista vol 3,p.141). కావున ఈ కాలములోనే యీ కావ్యమును కవిరచించి యుండవచ్చునని మన మూహించుటకు వీలుకలదు. పై పద్యమునందలి 'ధనాఢ్యుఁడు' అనుపదము శ్లేషచేఁ గుబేరునకును, తిరుమల రాయులకును చెల్లునని కూడఁ దోఁచెడిని.

ఈ కృతిని సంకితముపొందినవాఁడు పులిజాలరామయామాత్య కుమారుఁడైన పులిజాల సోమయామాత్యుఁడు కృతిపతి (౧. ౧.). కవి యీతని వంశమును, ఈతనియేలికయైన కోనేటి రామరాజు వంశమును సవిస్తరముగ వర్ణించియున్నాఁడు. కృతిపతియు, నాతని తమ్ముఁడగు అబ్బన్నయుఁ దప్ప నీ వంశమునందితరు లెవరును రాజులయొద్ద గొప్పయుద్యోగములలో నున్నట్టు కానరాదు. వీరిది కాశ్యప

* ఆంధ్ర కవుల చరిత్రము, ౨-వ భాగము.

† తెనాలిఅన్నయ్య. ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక (౧౯౧౮) ౯౯ పుట.

గోత్రము. సోమయ్యకు నేడవ పురుషుఁడు మల్లయ్య. ఆతని నాల్గవకొడుకు పోచన్న, ఆతని పెద్దకొడుకు సింగన్న, ఆతని కడసారి మూఁడవకొడుకు పోచన్న, ఆతని పెద్ద కుమారుఁడు దుగ్గయ్య. దుగ్గయ్యకిద్దఱుకొడుకులు; రామయ్య, వీరయ్య. రామయ్య భార్య తిమ్మాంబ. ఈదంపతులకుఁ బెద్ద కుమారుఁడు సుదక్షిణా పరిణయ కృతిపతియైన సోమయామాత్యుఁడు. ఈతనికి ఎల్లయ, అబ్బన, కోటయ, దుగ్గయలను తమ్ములుండిరి. వీరిలో అబ్బన యను నతఁడు కోనేటి రామరాజు నొద్ద సైన్యాధిపుఁడుగ నుండెను. సోమయామాత్యుని భార్య వైకుంఠమ్మ. కొడుకు వెంకటయ్య. ఇంతకంటె వీరినిగుఱించి మనకునధికమేమియుఁ దెలియదు.

నివాసస్థలము

గ్రంథకర్త నివాసస్థలము గాని కృతిపతి నివాసస్థలము గాని నిశ్చయముగఁ దెలియుట లేదు. గ్రంథకర్త కృతిపతిని గుఱించి వ్రాయుచు "మహాహట్టబాదాలి పట్టణ శ్రీకిరీటంబగు కొలవు కూటంబునఁ" * గూర్చుండి తనను పిలిపించినట్లు వ్రాసియున్నాఁడు (౧. ౧. ౨.) కాని యీ బాదాలి యెక్కడ నున్నది తెలియదు. 'బాగాలి' యను గ్రామ మొకటి బళ్లారిజిల్లాహరపనహళ్లి తాలూకాలోఁ గలదు. కోనేటి రామరాజు మొదలయినవారు దత్తమండలములోనే చిన్నజమీందారులుగ నుండిరని తోఁచుచున్నది. అయినను ఇది యింకను శోధింప వలసినవిషయము.

సుదక్షిణాపరిణయ కావ్యము

సుదక్షిణా పరిణయము అయిదాశ్వాసముల కావ్యము. ఇందు రమారమి తొమ్మిది వందల పద్యములు కలవు. ఇందు సూర్యవంశపు రాజయిన దిలీపునిగుఱించిన కథకలదు. కాళిదాసుఁడుకూడ తనరఘువంశ కావ్యమును ఈరాజు చరిత్రము తోడనే ప్రారంభించెను. కాన్నియితఁడు సుదక్షిణను వివాహమాడి కొంతకాలము ప్రభుత్వముచేసినతరువాతజరిగినవృత్తాంతము రఘువంశమునందుఁ జెప్పఁబడెను. ఈ కావ్యమునందు వివాహమునకుఁ బూర్వము జరిగిన వృత్తాంతము వర్ణింపఁబడినది. దిలీపునకు నిందుమతికి జరిగినవివాహముతో నీకావ్యము ముగియును. ఈ కావ్యమందలి కథ సంగ్రహముగ నీక్రింద నిచ్చుచున్నారము:-

అంశుమంతుఁడను రాజొకఁ డయోధ్యాపురంబు నేలుచుండెను. అతఁడు మాళవరాజు కూఁతురగు భానుమతిని పరిణయ మాడెను. వారికన్నాళ్లకును సంతానము కలుగకపోయెను. అంత నంశుమంతుఁడు రాజ్యమును మంత్రికొప్పగించి, భార్యను వెంటఁగొని, మేరుపర్వతమున కేగి శివునిగూర్చి ఘోరతపమాచరింప సాగెను. అతఁడు చేయుంతపమున

* రాజమహేంద్రవరమునందు చింతామణిముద్రాక్షరాధి కారులచేఁగ్రాంథలోఁ బ్రకటింపఁబడిన సుదక్షిణాపరిణయము యొక్క రెండవ కూర్పు మేము ఉపయోగించినాము. మాకుఁ బ్రత్యంతరము దొరకలేదు. కావున 'బాదాలి' యను పాఠము సరియైనదికాదని నిశ్చయముగఁ జెప్పుటకు వీలులేదు.

కింద్రాదులు వెఱచి, శివుని కడ కేగి, అతఁడు కోరిన వరము లొసఁగుమని వేఁడుకొనిరి. శివుఁడును వల్లెయని వారినంపి 'అర్థార్థి కల్పశాఖి' యగు నిజభక్తుఁ జూడ రమ్మని పార్వతిని బిల్చెను. 'రాజులు దుష్టచిత్తులు. వారికి భావశుద్ధియుండ'దని యామె పలుక, 'నీ సరి దేహమును చేర్చెదను, నాతో రమ్మ'ని శివుఁడామెను దోడ్కొనిపోయెను. అటు నంశుమంతుఁడు భోజనము జేయఁదలఁచి అతిథికొఱ కెదురుచూచుచుండెను. ఇంతలో నప్పటికి ముసలిబ్రాహ్మణదంపతుల వేషములతో పార్వతీపరమేశ్వరులువచ్చి, తమకు సంతానములేనందున వగచుచుండ నొకసిద్ధుఁడు దమ్ముఁ గనికరించి మేరు ప్రాంతమునఁ దపమొనరించుచున్న అంశుమంతుని భార్యాసహితముగా కాళికాదేవికి బలియిచ్చిన నామె ప్రసాదించునని చెప్పెననియు, వారున్న సెలవును జూపవేడెద మనియుఁ బల్కిరి. అప్పుడా రాజదంపతులు తమ్ముఁదెల్పుకొని బ్రహ్మార్పణ తత్పరులై కపట వేషధారులను వెఱచడింప సమకట్టిరి. అదిజూచి శివుఁడు సాక్షాత్కరించి, నిజభక్తునికి పుత్త్రవర మొసఁగి, పాశుపతాస్త్రమును సమంత్రకముగ ననుగ్రహించి చనియె. కొన్నాళ్ళకు భానుమతీదేవి యొక్క శుభ లగ్నమున నొక సుతుఁగాంచెను. అప్పు డాకాశవాణి వానికి దిలీపుఁడని నామకరణము జేసెను. దిలీపుఁడు దినదిన ప్రవర్ధమానుఁడై యౌవన వంతుఁడు కాఁగా, అంశుమంతుఁడతనికిఁ బట్టముగట్టి తపముఁజేయ వనమున కరిగెను.

వనధర విద్యున్మాలిక లను విద్యాధరదంపతులకు గంధగజుఁడను పుత్రుఁడు జనించెను. ఒకనాఁ డతఁడు కొందఱప్సరసల వెంటనిడుకొని విశ్వామిత్రుని తపోవనము ప్రవేశించి, అందు స్వేచ్ఛమై విహరించి సీధుపానము జేయుచుండెను. అదిజూచి విశ్వామిత్రుఁడు మహోగ్రుఁడై రాక్షసుఁడవుగమ్మని యావిద్యాధరునికి శాపమొసంగెను. అంతట నతఁడు రాక్షసాకృతి వహించి మాయావతి యను పురమునునిర్మించి రత్నచూడాభిధానుఁడై పరగుచు, నన్ని లోకములను జయించి యింద్రుని రాజధానియైన అమరావతిపై దండువెడలెను. మొదట నతఁడింద్రునోడించి. జయలక్ష్మీకరగ్రహణ మొనర్పనెంచెనుగాని, జయంతుఁడు విజృంభించినందున నప్పటికి ముట్టడిఁజాలించి, నిజపురమునకేగక బ్రహ్మనుగూర్చి జలధరాశ్రయమునఁ దపముఁ జేయఁబోయెను.

దిలీపుఁడు వైభవముతో రాజ్యము నేలుచుండెను. ఒకనాఁడతఁడు కొలువుదీర్చి యుండ ధూమకుఁడను బోయవేఁటకాఁడువచ్చి సింహమొకటి దేశమునంతయుఁ బాడుచేయుచున్నదనియు, దాని నెట్లైన సంహరింపవలయుననియు వేడుకొనెను. దిలీపుఁడంత వేట వెడలి, సింహమును వేటాడి బాణమేయ నది యదృశ్యమై స్త్రీరూపముఁ జెంది యిట్లని తనకథను దెల్పెను: "నేను హారిణియను అచ్చరను. ఒక నాఁడింద్రుఁడు నన్ను బిలిచి వీతహవ్యముని తపముఁ జెరుపఁ బంచెను. నేనును వల్లెయని యెంతఁ బ్రయత్నించినను, ఆముని నిశ్చలుఁడైయుండె, అంత నే నాతని కంఠము 'గిరిసింహముగిరెనిదుగో చూడు'మని పల్క నతఁడు కోపించి నన్ను సింహమూర్తివై సంచరింపుమని శపించెను. నేనతని వేడుకొన నతఁడు కరుణించి 'దిలీపుని వలన నీకు ముక్తి కలుగఁగలదని' చెప్పెను. ఇంతకు ముందొక నాఁడు నారదుఁడింద్రుని కడకువచ్చి 'రత్నచూడుఁడను రాక్షసుఁడు బ్రహ్మవలనఁ దానెవ్వరిచే మృతి నొందునో, వానితల వేయివ్రక్కలగునట్లు వరముబొందె' నని చెప్పెను. అప్పు డింద్రుఁడు బ్రహ్మను ప్రశ్నింప నతఁడొకానొక కన్యను పరిణయమాడు దిలీపుఁడతని సంహరింపఁగలఁడని పల్కెను. ఆ లతాంగి ఎవ్వని పుత్రికయో వినఁబడరాదయ్యె'' ఇట్లు చెప్పి నాయప్సరస యదృశ్యమయ్యెను.

అప్పుడు దిలీపుని వెదకికొనుచు నిజసైన్యములువచ్చి చేరెను. దిలీపుఁడు జరిగిన సంగతి తనమంత్రియగు సుదర్శనునికిఁ దెల్పి యాకన్యనుగూర్చి యెఱుఁగుదు నే

యని యడుగ నతఁడిట్లు చెప్పసాగెను. "నేనొకనాఁడుద్యానవనమున విహరించుచుండ నొకడేగచేఁ దరుమఁబడుచున్న చక్రవాకివచ్చి నాశరణువేడెను. అంతట నేను చక్రవాకి కభయహస్తమిచ్చి, డేగను భస్మము నర్చితిని. డేగ రాక్షసాకారమునఁబడెను. చక్రవాకియు స్త్రీయయ్యె. అప్పుడాశ్చర్యచకితుఁడనై తద్వృత్తాంతమడుగ నాస్త్రీ యిట్లని చెప్పెను. 'నేను సాధ్యలోకాధిపతియగు చంద్రపాలుని కూఁతురను. నాతండ్రికిని, మగధరాజగు సురధునికిని జాలస్నేహము. ఇట్లుండ రత్నచూడుఁడు మగధరాజుపై దండెత్తి చంపకావతిని ముట్టడింప, నతఁడా రాక్షసుని ప్రతాపాగ్నికి తాళలేక తొలఁగిచని, శాండిల్యముని వద్దకరిగి రత్నచూడుని సంహరింపఁజాలు పుత్రునిమ్మని వేఁడెను. అంత నమ్మునియుపదేశానుసారమున సురధుఁడు గంగాతీరమున యజ్ఞముఁజేయ అగ్ని ప్రత్యక్షమై యొక్క కన్యను ప్రసాదించి, సుదక్షిణ యని నామకరణము జేసి యదృశ్యుఁడయ్యె. కొన్నిసంవత్సరముల కాబాలిక యౌవనము ప్రాప్తించె. ఈసంగతిని కలహభోజనుఁడగు నారదుఁడు రత్నచూడునకుఁ దెల్ప నతఁడు చంపకావతిపై మఱలదండెత్తి 'నీకుమార్తె నిచ్చుటొండె, నీ రాజధాని దహనమగుటొండె' యని సందేశమంపెను. అంతటఁ నతఁడు చేయునదేమియునులేక విష్ణుదేవుని బ్రార్థింపఁగా నాఁడా పురమును చీమ చిటుకుమనకుండ బ్రహ్మనివసించు శైలమునకుఁ జేర్చెను. రాక్షసుఁడీమోసము గ్రహించి నిజపురంబునకేగి సురధుని నెలవుకనుగొన చారులఁ బంచె. నేనొకనాఁడు సురధుని సౌధమునకేగుచుండ రశ్మికేతనుఁడను రాక్షసుఁడు నన్ను బత్నిమై బట్టరా నేను చక్రవాకినైతిని, అంతనతఁడును శ్యేనమయ్యె' ఇట్లు చెప్పి యాస్త్రీ సాధ్యలోకమునకరిగె" ఇవ్విధమున సుదక్షిణనుగూర్చి తెలిసికొని దిలీపుఁడు మన్మథానల తప్తుఁడయ్యెను. అప్పుడు రౌద్రవదనుఁడను రాక్షస మంత్రి వినువీధినేగుచు 'హా! సుదక్షిణా!' యని విరహార్తిగుందుచున్న రాజుఁగాంచి 'అతఁడే సుదక్షిణనువరించు దిలీపుఁ'గా గ్రహించి, ఆ మానిని, సుదర్శనుని తనవిమానమున నిడుకొని యేగుచుండెను. ఈసన్నఁ దెలిసి దిలీపుఁడు రాక్షసునివధించి పుష్పకము నెక్కి కొంత దవ్వేగ నచ్చటనొక యుద్యానవనము గాన్పింప దిగిరి. అప్పుడు వనదేవత వారికి ప్రత్యక్షమై సుదక్షిణ యిచ్చట నే విరహబాధ నొందుచున్నదని తెలిపెఁగా వారు సఖీజన పరివృతయైన సుదక్షిణను చూసిరి. అట్లు సుదక్షిణా దిలీపు లన్యోన్య సందర్శన భాగ్యమనుభవించుచుండ నొకపులి లేడిపిల్లను తరుము కొనివచ్చినందున స్త్రీలందఱు తలయొకదారిపాఱిరి.

సుదక్షిణ కరగ్రహణ మొనరింపక పూర్వము రత్నచూడుని దునుమ నెంచి, దిలీపుఁడు నిజపురమునకేగి సైన్యముల సమకూర్చుకొని మందరశైలము మీఁదికి దాడి వెడలి, మాయావతిని ముట్టడించెను. అంతఁ ఘనముల యుద్ధము ప్రారంభమయ్యెను. అందు దిలీపుఁడు రత్నచూడుని పాశుపతాస్త్రమున సంహరించి, అతని తనువును బడబాగ్ని మధ్యమున వైచెను. తరువాత నొక శుభలగ్నమున సుదక్షిణా దిలీపులకు మహావైభవముతో వివాహమహోత్సవము జరిగెను.

కావ్యవిశేషములు.

ఈ కావ్యముపేరు సుదక్షిణాపరిణయము అయినను సుదక్షిణకథ చివర రెండు ఆశ్వాసములలో మాత్రము వచ్చును. మొదటి మూఁడాశ్వాసములందును దిలీపుని కథయే వర్ణింపఁబడినది. ఈకావ్యము రసముగల కావ్యములలో నొక్కటియని చెప్పవచ్చును. మహాకావ్యమనిగాని, లోకోత్తరమైనదనిగాని చెప్పుటకు వీలులేకపోయినను ఇందలి "కవిత్వము సలక్షణమై మధురమై కర్ణరసాయనముగా నున్నది" యని శ్రీవీరేశలింగముగారి యభిప్రాయముతో నేకీభవించుచున్నాము. పాశ్చాత్యసాహిత్య, విమర్శన శాస్త్రానుసార

ముఁజూచితిమేని. ఇందు నేపాత్రయొక్కయు స్వభావోన్మీలనము కానరాదు. నాయకుఁడు దిలీపుఁడు, నాయికసుదక్షిణ, ప్రతినాయకుఁడు రత్నచూడాసురుఁడు. వీరి తరువాతఁ జెప్పఁదగినవారు దిలీపుని తండ్రి అంశుమంతుఁడు, సుదక్షిణ తండ్రి సురథుఁడు. వీరిలో నాయిక మనకు విరహవేదన కాలమందు నొక్కసారి, మఱియు వివాహ సమయమున నొక్కసారి మాత్రము కొద్దికాలము కానవచ్చును. (౫-వ ఆశ్వాసము.) అప్పుడైనను ఒక్కమాట కూడ మాటలాడదు. కావున నామె దిలీపుని కొఱకు విరహతాపమ్ము పడునట్టి యొక చక్కని స్త్రీ యన్నమాట తప్ప యామెను గుఱించి మన మామెమాటల వలనగాని చర్యలవల్లనగాని యేమియు నెఱుఁగఁ జాలము. ఇఁక నాయకుఁడు మాత్రము మనకుఁ బెక్కుసారులు కానవచ్చును. ఎన్నిసారులు కానుపించినను యుద్ధము చేయఁగలవాఁడు, వేటాడఁగలవాఁడు, స్త్రీని మోహింపఁ గలవాఁడుగఁ గానవచ్చును. మొట్టమొదట నింద్రుఁడు పరాజితుఁడై తనయొద్దకు రాఁగా నాతని సాయమునకుఁ బోవయత్నించుటయు, సింహము బాధ పల్లెవారికిఁ దొలఁగించుటకు వేటకుఁ బోవుటయు నాయకుని యొక్క పరోపకార చింతను గొంతవఱకు సూచించుచున్నవి. కాని యిది శృంగార ప్రబంధమని కాఁబోలు కవి యీ మనోభావమ్మును పూర్తిగఁ జిత్రించుటకు యత్నము చేయలేదు. ప్రతివీరుఁడైన రత్నచూడుని చర్యలు నాయకుని చర్యకంటె బాగుగ వర్ణింపఁబడినవి. ఇతఁ డింద్రుని పట్టణము మీఁదికి, సురథుని చంపకావతి మీఁదికి దండెత్తిపోయిన ప్రకరణములు చక్కఁగానే వర్ణింపఁబడినవి కాని భారత భాగవతములలో హిరణ్యకశిపుఁడు మొదలయిన దానవులు అమరావతి మీఁదికిఁ బోయినప్పుడు చేయఁబడిన వర్ణనములకు సరిరావు. నాయకుని తలిదండ్రులయిన అంశుమంతుని స్వభావోన్మీలనము చక్కఁగఁ జేయఁబడినది. అతఁడు కపట వేషధారులైన శివపార్వతులకై తమ దేహములను సమర్పించుటకు సిద్ధపడిన ప్రసంగ వర్ణనముఁజూచిన వారి సచ్చారిత్ర మంతయు, నొక్కసారి వెల్లడికాఁగలదు. పాత్రయొక్క స్వభావావిష్కారమునకు నొక్క చిన్న ప్రసంగము చాలును. పెక్కుపద్యము లక్కర లేదు. అంశుమంతుఁడు దిలీపునకు రాజ్యము గట్టి యరణ్యమునకుఁ బోవునప్పుడు కుమారునకుఁ బ్రజలను చక్కఁగఁ జూడుమని చేసిన బోధవలన నాతని స్వభావము వెల్లడియగుచున్నది. ఇట్టి కావ్యమునందుఁ దమగుణములచేఁ జదువరుల గౌరవమునకుఁ బాత్రమై 'ఆహా! మంచివాం' డ్రనిపించుకొను పాత్రలు అంశుమంతుఁడు భానుమతియునను వారిద్దఱే. చదువరులకు నితరుల యెడ నగౌరవముకలుగునని కాదు; ఇతరుల విషయమై యౌదాసీన్యభావము కలుగును.

ఈకవి జాతీయములగు సామెతలను అచ్చటచ్చటఁ బద్యములం దిమిడ్చి కావ్యము

నకు శోభ తెచ్చెను. అందుకు గొన్ని యుదాహరణములు:-

"పేద తెవు లింక నంగడి బెట్టకున్న తీరదు" (౨-౯౧)

"చూడంబోయెదు తీవ కాళ్లఁ బవిలెన్" (౨-౬౪)

"ఆడంబోయెదు పుణ్యతీర్థ మెదురైనట్లు" (౨-౬౪)

"వృడుకవు మ్రొక్కఁగఁ బోయిన గుడిమీఁదఁ బడినయట్లు" (౨-౭౦)

"కానఁగాచిన వెన్నలగాదె బ్రతుకు" (౨-౭౪)

"కతకుఁగాళ్లు ముంతకుఁ జెవులు గల్పించినట్లు" (౪-౨౯)

"కుంజేటికిఁ గొదమకుఁ గొమ్ము చూపునట్లు" (౪-౨౯)

అచ్చటచ్చటఁ గొన్ని విడివర్ణనలు ఔచిత్యముఁ గల్గియున్నవి. ద్వితీయాశ్వాస మందలి మాయాబ్రాహ్మణ బ్రాహ్మణి (శివపార్వతుల) చర్యలు, తృతీయాశ్వాసము నందలి బోయవేటగాని వర్ణనయు మాటలును, పఠనీయములు.

ఈకవి తనకంటెఁ బూర్వకవుల యొక్కయు తన కాలమువారి యొక్కయు కావ్యములను జూచి వారి కావ్యములలోని సీసపద్యముల మాదిరి కొన్ని సీసపద్యములను రచించినట్లు కానవచ్చుచున్నది. ఈక్రింది కొన్ని యుదాహరణములఁ జూడుఁడు:-

సీ. ఆర్యసన్నుత మహాధైర్య నిర్జిత పంచబాణుచే రక్షిత బాణుచేత. [౧-౨.

సీ. అపరంజి బలుగట్టు యతిమనంబులగుట్టు విల్లుగా నిల్లుగా వెలయునతని. [౨-౧౧౬.

సీ. పైశునర్యర్థస వసాభ్యర్ణముల్ కర్ణముల్ మానవివాసంబులు మానసంబు. [౨-౭.

సీ. వైడూర్యరుచిభించు వన్నెలు కన్నులు తపనీయ భినస్ఫూర్తిఁ దాలఁ జెవులు [౩-౧౯౬.

సీ. అది సుధాకర బింబ మానో కాదో కాదు చక్కని నెమ్మొగంబుగాని. [౫-౧౧౩.

[కో. ల.

**అన్నా.** ఆసియాఖండ మందలి తుర్కీ దేశములోని యొక పట్టణము. ఇది బగ్దాద్ సరిహద్దులో 'యుఫ్రిటిస్' నదియొడ్డున నున్నది. దీనియెదుట ఫలవంతములైన సుక్షేత్రములుగల చిన్నచిన్న ద్వీపములు కలవు. ఇది యెడారినడుమనున్న పట్టణమగుటచే బాటసారులు విశ్రమించుటకై మిక్కిలి యుపయోగకరముగ నుండును. పూర్వకాలముండిన నాల్గు దుర్గముల గుర్తులిచట గలవు.

**అన్నా ఐవనోవ్నా.** (౧౬౯౩-౧౭౪౦) రష్యా దేశమునకుఁ జక్రవర్తిని, ఐదవ ఐవన్ అను రాజునకుఁ గూఁతురు, పీటర్ ది గ్రేట్ అనువానికి సవతిచెల్లెలు. ౧౭౩౦ లో రెండవ పీటర్ చనిపోఁగా నీమె రాజ్యమునకు వచ్చెను. ఈమె స్వేచ్ఛగ నిరంకుశముగ ప్రభుత్వముచేసెను. బిరన్ అను వాఁడీమె కృపకుఁ బాత్రుఁడయ్యెను. వానికీమె మంత్రిత్వమొసంగి నందున వాఁడు ప్రజలను మిక్కిలి పీడించెను.

**అన్నా కోమ్నెనా.** (౧౦౮౩-౧౧౪౮) బైజంటయిన్ దేశపు రాజపుత్రి. ఈమె విదుషీ చరిత్ర గ్రంథమును వ్రాసెను. పండి

తులకు స్వాశ్రయమిచ్చెను. ప్రథమ అలెగ్సి యస్ (Alexius I)అను రాజునకుఁ గూఁతురు. ఈమె భర్తపేరు నిసెఫోరస్ బ్రయెన్నిఅస్ (Nicephorus Bryennius). తండ్రిమరణసమయమునరదు నీమె యాతని రాజ్యము తన భర్తకీయుమని వేడెను. కాని యాతఁడందుకు నొప్పుకొనలేదు. తరువాత నీమె తమ్ముఁడు రాజయ్యెను. అతనిని జంప నీమెకుట్రపన్నెను. కుట్రవెలువడినందున నీమెయు, నీమెభర్తయు గ్రీసు దేశమునకుఁ బారిపోయిరి. తరువాత నీమె తనకాలమంతయు విద్యావ్యాసంగము నందే గడిపెను. ఆమె 'అలెగ్జియాడ్' అను కావ్యమును రచించెను. అందు తనతండ్రి చరిత్రమును వర్ణించెను.

**అన్నిగిరి.** బొంబాయి కోస్తాలోని ధార్వాడ్ జిల్లాలోనున్న నవల్గుండ్లోని యొక గ్రామము. ధార్వాడ్నుండి గడగ్ మీదుగా బళ్లారికివెళ్లు రస్తామీఁదనున్నది. ఈగ్రామమునకు దక్షిణమహారాష్ట్ర యినుపదారియొక్క స్టేషనుకలదు. ఇచ్చట నాయధాన్యము, ప్రత్తియొక్క వ్యాపారము విశేషముగా కలదు. ఇక్కడ ప్రతివారమున్ను సంత జరుగును. ఈగ్రామముయొక్క విశేషమేమనఁగా,ఇచ్చట నమృతేశ్వరుని దేవాలయమొకటిగలదు. దీనిని జఖనాచార్యులు కట్టించెనందురు. ఇది ౭౬ స్తంభములమీఁద నిలిచియున్నది. ౧౧౫౭ మొదలు ౧౨౦౦ సంవత్సరములలో లిఖించిన ఆరు శాసనములు దేవాలయములో నున్నవి. ౧౧౬౧ వ సం॥లో బిజ్జలుడనుకాలచూరియోధుఁడు పడమటి చాళుక్యుల నోడించి, అన్నిగిరిని ముఖ్యపట్టణముగా చేసికొనెను. ఆంగ్లేయ ప్రభుత్వముయొక్క ఆదియందు నీపట్టణము నిపాని ప్రభువు జాగీరులో నొకటిగా నుండెను. అటుపిమ్మట ౧౮౩౯-వ సంవత్సరములో బ్రిటీషు వారి క్రిందికి వచ్చెను. ఈ పట్టణమందు నాలుగుపాఠశాలలు గలవు. అందులోనొకటి బాలికలకుగాను నియమింపబడినది.

**అన్యతః ప్లక్షము.** కురుక్షేత్రమునందలి యొకసరోవరము.

[శతపథబ్రాహ్మణము ౧౧.౫.౧.౪.

**అన్యథానుపపత్తి.** మీమాంసకుల మతమున నొకప్రమాణము. ఇది అర్థాపత్త్యంతర్గతము. బలిసినభద్రయ్య పగలుభుజించఁడు. అట్లగుటవలననే రాత్రిభోజనముచేయునని యూహించుట అన్యథానుపపత్తి. బలియుటకు వేఱుకారణము లేనందున రాత్రిభోజనము చేయునని యూహింపవలసియున్నది. ఈ బలుపు మఱొకవిధముగా సాధించుటకు వీలులేదు. కావున దీనిని అన్యథానుపపత్తియందురు కాని నైయాయికులు దీనిని స్వతంత్రప్రమాణముగ నొప్పుకొనరు. ఇదియు నర్థాపత్తియు ననుమాన ప్రమాణాంతర్గతమేయని వారి భావము.

**అన్యథాసిద్ధము.** ఇది న్యాయ శాస్త్రవిషయక పదము. కారణము కాని దానిని, దానికి నిజమైన కారణముతోఁ గల సంబంధమునుబట్టి, కారణముగ నెంచిన యెడల నది యన్యథాసిద్ధమనఁబడును. కార్యమునకు నియత పూర్వమయ్యును కారణము కానిదానిని అన్యథా సిద్ధమందురు. 'కార్య కారణములకు సంబంధమెట్టిది? కారణమెల్లపుడును కార్యమునకు నియతపూర్వవర్తిగ నుండవలయును' అను నియమమునకు సరియైన యర్థము తెలియక కొందఱు, నియత పూర్వవర్తులయిన యన్ని పదార్థములను కారణములుగ నెంచెదరు. అవి అన్యథాసిద్ధములేకాని కారణములుకావు. ఘటమునకు కుమ్మరివాఁడు కారణము. ఎందులకు? నియత పూర్వవర్తి గనుక. అట్లే కుమ్మరి వానితండ్రిగూడ నియతపూర్వవర్తియే. కావున వానితండ్రి, వానితండ్రి తండ్రి, యిట్లెందఱును ఘటమునకు కారణములని చెప్పఁ గూడదు. మన్ను లేనిది కుండ కానేరదు గనుక మన్ను కుండకుఁగారణము. కాని గాడిద లేనిది కుమ్మరి యామన్నును వానివద్దకుఁ దేఁజాలఁడు. కనుక వానిగాడిదయుఁ గుమ్మరి కుండకుఁగారణమని చెప్పవచ్చునా? కూడదు. గాడిదఅన్యథాసిద్ధము. ఇట్లు కారణలక్షణము చెప్పునపుడు నియతపూర్వవర్తిత్వ మనఁగా లఘునియత పూర్వవర్తిత్వమని యర్థముచేసి కొనవలయును. అనఁగాఁ దక్కువలోఁ దక్కువ నెంతయుండిన కార్యముసిద్ధించునో యంతనే కారణమని గ్రహింపవలయును. నియతపూర్వవర్తియొక్క లఘుత్వము మూఁడు విధములు; శరీరకృతము, ఉపస్థితి కృతము, సంబంధకృతము.

అన్యథాసిద్ధము లైదువిధములు:—

౧. కారణవృత్తి, లేక కారణతావచ్ఛేదక రూపధర్మము: కుమ్మరివాని దండము ఘటమునకుఁ గారణమేకాని తద్ధర్మమైన దండత్వము కారణముకాదు, అన్యథాసిద్ధము.

౨. కారణగుణము: దండము కారణమే కాని దండముయొక్క రూపము రంగు మొదలగు నితరగుణములు కారణములు కావు. కావున కారణగుణము లన్యథాసిద్ధములు.

౩. వేఱు కార్యమునకుఁ బూర్వవర్తి (కారణము) అని తెలిసినదానిని, ప్రస్తుత కార్యమునకుఁ బూర్వవృత్తిగాఁ జెప్పినయెడల నది అన్యథాసిద్ధమగును. ఆకాశము శబ్దమునకుఁగారణమని తెలిసియు నాకాశమును ఘటమునకుఁ బూర్వవర్తిగ నెంచినయెడల నాకాశము అన్యథాసిద్ధమగునే కాని కారణము కానేరదు.

౪. కారణము యొక్క కారణత్వమును నపేక్షించుట. కుండకు కుమ్మరి కారణము; కుమ్మరివానికి వానితండ్రి కారణము. కావున కుమ్మరివానియొక్క తండ్రి కారణముయొక్క కారణము. అందుచే నన్యథాసిద్ధము.

౫. ఘటమునకు కుమ్మరి వాని గాడిద కారణముకాదు. అన్యథా సిద్ధము.

ఇందును గూర్చి 'కారణము' అను శబ్దము క్రింద విపులముగాఁ జర్చింపఁబడును.

**అన్యాక్రాంతము.** చూడు 'అస్తి పరాధీనము'.

**అన్వర్ ఉద్దీన్ ఖాన్.** కర్ణాటిక్ నవాబులనఁబడు వారికి మూలపురుషుఁడు. ఇతఁడు మొదట ఢిల్లీ చక్రవర్తివలన కోరా జహానాబాద్ ప్రాంతమునకు సుబేదారుగా నేర్పఱుచఁబడెను. కాని యచ్చటఁ దిన్నగాఁ బనిచేయలేక యితఁడు చెప్పకుండ అహమదాబాదునకుఁ బారిపోయెను. నిజామ్ ఉల్ ముల్క్ (ఇప్పటి నిజాముల యొక్క మూలపురుషుని) యొక్క తండ్రియైన గాజీ ఉద్దీన్ ఖాన్ ఈతనికి సూరతులో గొప్పయుద్యోగమిచ్చెను. నిజామ్ ఉల్ ముల్క్ ఈతనికి కర్ణాటక ప్రభుత్వమిచ్చెను. కర్ణాటక మనఁగా వెల్లూరు, రాజమహేంద్రవరము సూబాలనియర్థము. క్రీ.శ. ౧౭౨౫ మొదలు ౧౭౪౧ వఱకు నీతఁడీపని చేసినపిదప, ఈతనికి ౧౭౪౪ లో సుబేదార్ హోదా యీయఁబడెను. ఈతఁడు ౧౦౭ సంవత్సరముల వఱకుఁ బ్రతికెనఁట. ఈతఁడు ముజఫర్ జంగుతోఁ బోరాడుచు ౧౧౬౨ హిజ్రీలో ౨౩-వ జూలై దినమునఁ జచ్చెను. ఇతనిపెద్దకుమారుఁడు చెఱఁబట్టఁబడెను. రెండవకుమారుఁడైన మహమ్మదు ఆలీ తిరుచినాపల్లికిఁ బాఱిపోయెను. అన్వరుద్దీను నాయకుఁడుగాఁగల అన్వర్ నామా యనునది పారసీలో గలదు. ఆ కావ్యమునకు కవి అబ్ది. అన్వరుద్దీన్ రెండవకుమారుఁడైన మహమ్మద్ ఆలీ క్రీ.శ. ౧౭౫౦ లో నవాబ్ నాసీర్ జంగువలన కర్ణాటక నవాబుగాఁ జేయఁబడెను.

**అన్వరి.** ఒకగొప్ప పారసీకకవి. ఖురాసాన్ దేశజుఁడు. సుల్తాన్ సంజర్ సల్జూకి అనురాజు నాస్థానకవి. ఇతఁడు జ్యోతిషమును గూడ బాగుగ నెఱిఁగి యుండెను. ఇతఁడు బాల్ఖులో క్రీ. శ. ౧౨౦౦-వ సంవత్సరములో మృతుఁడయ్యెను. ఇతని పద్యము లన్నియు 'దీవాన్ అన్వరి' యను గ్రంథమునందు సంగ్రహింపఁబడినవి.

**అన్హిల్ వాడ.** ఈ రాజ్యము ప్రస్తుతము బొంబాయి రాజధానిసరిహద్దులోఁ జేరిన గుజరాత్ రాష్ట్రమునందుండెను. క్రీ. శ. ౭౪౬-౭౫ సంవత్సర ప్రాంతమున చావద రాజపుత్రులలో నొకఁడగు వనరాజు దీనిని స్థాపించెను. ఆతఁడు ౬౦ వఱకు పాలించి చనిపోయెను. ఆతని పిమ్మట అతని వంశము వారలు ఎనమండుగ్గురు పాలించిరి. ఆఖరు అతఁడు ౯౬౧ లో చనిపోయెను. పిమ్మటచాళుక్యవంశజుఁడగు మూలరాజా (౯౪౨-౯౯౬) యను నితఁడీ రాజ్యమునకు ప్రభువై, రాజ్యమును వృద్ధిజేసి, కాఠేవాడ్ కచ్, దక్షిణ గుజరాత్ దేశములలోనికివ్యాపింపఁజేసి ప్రసిద్ధిఁగాంచెను. ఈతనిచే స్థాపితమైన వంశమునకు 'సోలంకి' వంశమనీపేరు. ఈతని సంతతి వార

లిక్కడ రెండు శతాబ్దముల వఱకు పాలించిరి. వీరు శైవమతస్థులగుటచే సోమనాథ పట్టణమందలి సోమనాథుని యాలయమును గూర్చి చాల శ్రద్ధతీసికొనియెడి వారలు. అప్పటి ప్రభువగు మొదటి భీముని ఓడించి ౧౦౨౬ లో మహమ్మాదు గజనీ దేవాలయమును పడగొట్టి ద్రవ్యమును కొల్లగొనెను. గజనీవెళ్లిన తరువాత ఈగుడి భీమునిచే మరలఁగట్టఁబడెను. ఈతనిసంతతి వారలు ౧౧౪౩ వఱకు ఈ దేశమునుపాలించిరి. అటు తర్వాత మూలరాజుయొక్క జ్ఞాతులు ఈ దేశమునకు ప్రభువులై ఒక శతాబ్దమువఱకు పాలించిరి. వీరలు కాఠేవాడ్, మాళ్వాకు కూడ అధికారులై యుండుటయే గాక ౧౧౯౦ లో కొంకణ దేశముపై దండయాత్ర నడపిరి. ఈ మూలరాజు వంశము అంతరించిన పిమ్మట (౧౨౪౨ లో) ధోల్కా దేశస్థులగు 'వాఘేలులు' అనునొక తెగవార్లీ ప్రాంతమునేలిరి. వీరిని ౧౨౯౭లో అల్లా ఉద్దీనుఖిల్జీ తఱిమివైచెను.

**అపర తంగణము.** తంగణదేశమును అంటియున్న భారత వర్షీయ దేశము.

(భార. భీష్మ. అ. ౯.)

**అపర తాలము.** తాలదేశమునంటి యున్న భారతవర్షీయ దేశము. కేకయదేశమునుండి అయోధ్యకుఁబోయిన యెడల మొదట నీదేశము తగులును.

(వా. రా. అయో. స. ౬౮)

**అపరదక్షిణకుంతి రాష్ట్రము.** ఇంద్రప్రస్థమునకు దక్షిణమునందున్న కుంతి రాష్ట్రమును తగిలియున్న దేశము.

(భార. భీష్మ. అ. ౯.)

**అపరదక్షిణనిషాదము.** ఇంద్రప్రస్థమునకు దక్షిణమునందున్న మ్లేచ్ఛరాజుల దేశమునకు దక్షిణమునందును, పురుషాదులను లోకుల దేశమునకు ఉత్తరమునందును, ఈ దేశముండెను.

(భార. సభా. అ. ౩౧.)

**అపరదక్షిణ పాండ్యదేశము.** పాండ్యదేశము తగిలియున్న దేశము. పాండవుల కాలమున నిది ద్రవిడదేశమునకు దక్షిణము నందుండెను. (భార. సభా. అ. ౩౧.)

**అపరదక్షిణ మత్స్యము.** ఇంద్రప్రస్థమునకు దక్షిణంబునను మత్స్యదేశమును తగిలియు నున్న దేశము.

(భార. సభా. అ. ౩౧.)

**అపరదక్షిణ సేకము.** ఇంద్రప్రస్థమునకు దక్షిణంబుననున్న యొక దేశము.

(భార. సభా. అ. ౩౧.)

**అపర నందా.** హిమాలయము మీఁది యొక తీర్థము.

**అపరపూర్వ విదేహము.** ఇంద్రప్రస్థమునకుఁ దూర్పుననున్న రెండు విదేహ

దేశములలో నొక్కటి. గండక దేశమునకుఁ దూర్పుననున్నది యొక విదేహము. ఇది రెండవది. ఈరాజ్యముననే జనక వంశజులు రాజ్యముచేయు చుండిరని కొందఱి యభిప్రాయమైయున్నది. అట్లయిన శ్రీరాముని కాలమున సీతాదేవి తండ్రియైన జనకుఁడును పాండవుల కాలమున బృహదశ్వుఁడను జనకుఁడును రాజ్యము చేయుచుండిరని చెప్పవలసి యున్నది. (భా. ప్ర. కో.)

అపర పూర్వసుహ్మము. భారత వర్షీయ దేశవిశేషము. (భార. సభా. అ. ౩౦.)

అపర బల్లవదేశము. భారత వర్షీయ దేశవిశేషము (భార. భీష్మ. అ. ౯.)

అపరాంత దేశము. భారతవర్షీయమైన యొక దేశము. (భార. భీష్మ. అ. ౯.)

అపరాజిత. శాక ద్వీపములోని యొకనది.

అపరాజితుఁడు. ౧. ఏకాదశ రుద్రులలో నొక్కఁడు.

౨. శ్రీకృష్ణునకును లక్ష్మణకును పుట్టిన కుమారుఁడు.

౩. ధృతరాష్ట్రుని నూర్గురు పుత్రులలో నొక్కఁడు.

అపరోత్తర కులిందము. ఉత్తర దేశమునందు రెండు కులింద దేశములు కలవు. అందలి రెండవది. ఇది కాలకూట, సుమండల దేశముల కు నడుమనుండెను. (భార. సభా. అ. ౨౬.)

అపరోత్తరోలూకము. మోదాపురమునకు ఉత్తర దిక్కుననున్న భారత వర్షీయ దేశము. ఇంద్రప్రస్థమున కుత్తరమున ఉలూక దేశములు రెండు కలవు. అందు రెండవది. (భార. సభా. అ. ౨౭.)

అపరోక్షానుభూతి. శ్రీశంకరాచార్యవిరచితమైన చిన్న వేదాంత గ్రంథము. ఇందు నూటనలుబది శ్లోకములుగలవు. దీనిపై విద్యారణ్యులవారి టీకగలదు.

అపర్ణ. సతీదేవి దక్షయజ్ఞమున దగ్ధమై హిమాలయుని యింటఁబుట్టి శివునికొఱకుఁ గొన్ని దినంబులు పర్ణంబులు భక్షించి తపస్సుచేసి పిదప నా పర్ణంబులం దినుట కూడ విడిచి తపంబొనర్చి సఫల మనోరథ యయ్యెను. పర్ణభక్షణకూడ విడిచినందున నామెకు నీ పేరు వచ్చెను.

అపర్ణి. ఒక బ్రహ్మర్షి. (చూఁడు ౩ అంగిరసుఁడు.)

అపలేచియన్ పర్వతములు. ఉత్తర అమెరికా దేశమందలి పర్వతమాలిక. ఇది యా దేశమునకుఁ దూర్పున నుండును. ఇది ౧౩౦౦ మైళ్లు పొడవుగనున్నది. ఎత్తు శిఖరములు రమారమి ౭౦౦౦ అడుగుల యెత్తున

నుండును. దీని కనేకశాఖలును, శిఖరములును కలవు. ఈ పర్వతమునందు నేలబొగ్గు, ఘట్టి నూనె విశేషముగ దొరుకును.

**అపస్మారము** (ఆంగ్లేయ వైద్య శాస్త్రము ననుసరించి) దీనిని వాడుకలో కొందఱు 'కాకిచమ్మ'లని చెప్పెదరు. అపస్మారములో ననేకవిధములు గలవు. కొందఱికిది చాలతీవ్రముగా వచ్చును. అకాత్తుగ స్మృతి తప్పి కాళ్ళుచేతులు విలవిల కొట్టుకొని నోటివెంట చొంగ పడును. మఱికొందఱు స్మృతి తప్పీతప్పని స్థితిలో కొన్ని నిముసము లుండి కాళ్ళుచేతులు కొట్టుకొనకయే తెలివి తెచ్చుకొందురు. ఒకానొకడు తానుచేయుపని క్షణమాత్రము నిలిపి ప్రపంచజ్ఞానమంతను మఱచి, అంతలోనే తనపనిని తానుచూచు కొనును. జ్వరాది ఇతర వ్యాధులతో సంబంధము లేక ఇతరవిధముల నారోగ్యముగ నున్న మానవున కకస్మాత్తుగ క్షణమాత్రమో, అధికకాలమో స్మృతితప్పి ప్రపంచజ్ఞానము బొత్తిగ లేకుండగజేయు వ్యాధికి అపస్మారమని పేరు. కాళ్లుచేతులు కొట్టుకొనినను లేక పోయినను సరే.

వ్యాప్తి

ఈవ్యాధి ప్రజలలో నెంతమందికున్నదో సరిగా లెక్కించి చెప్పుటకింతవఱకాధారములేవియులేవుగాని సామాన్యముగా నన్ని దేశములందుకూడ జనసంఖ్యలో వేయింటికి ఒకనికి ఈ వ్యాధియున్నదని చెప్పవచ్చును. కొన్ని దేశములలో నింతకంటె హెచ్చుగ నుండవచ్చును. వంశపారంపర్యముగ కుటుంబములలో లేని దే ఈవ్యాధి సంతతికి వ్యాపించునని చెప్పుటకు నిదర్శనములులేవు. కాని ఉన్మాదము త్రాగుడుగల కుటుంబములలో నీవ్యాధి గలవారలు ఎక్కువగానున్నారని చెప్పవచ్చును. చిన్నతనములో బిడ్డలకువచ్చు మూర్ఛ (చంటిబిడ్డ గుణము) కును అపస్మారమునకును, కొంత సంబంధము కానవచ్చుచున్నది. అపస్మారపు తల్లుల బిడ్డలను ౫౮ మందిని గుఱించి శోధన చేయగానందు ౩౭గురికి చిన్నతనములో చంటిబిడ్డగుణము చూపించనిపోయిరనియు మిగిలిన ౨౧ మందిలో ౭ గురికి అపస్మారవ్యాధి యేర్పడినదనియు తెలియుచున్నది.

వయస్సునుబట్టి చూడగా అపస్మారము ౧౦ మొదలు ౨౦ సంవత్సరములలోపు వయస్సులలో హెచ్చుగా గానవచ్చు చున్నది. అందు ౧౩ మొదలు ౧౭ వఱకు మిక్కిలి తరుచుగ నీవ్యాధి అంకురించు చున్నట్లు నిదర్శనములు కలవు. కుటుంబములో ఈవ్యాధి వంశపారంపర్యముగ నున్నకొలది చిన్న వయస్సునందు అంకురించునని కొందఱి యభిప్రాయము. కొందఱికు చిన్నతనము నందు చంటిబిడ్డవ్యాధి అప్పుడప్పుడు వచ్చుచు కొంతకాలమునకు అపస్మారముగ అదే పరిణమించును.

అపస్మారమునకు మనో వ్యాకులత, భయము మొదలగునవి కారణములని యనేకులు సంబంధము కల్పించుటకు ప్రయత్నించిరి.

కారణము

కాని యట్టి సంబంధము నూటికి ౩౦ మందిలో కంటె నెక్కువ వారిలో కనపడదు. నెత్తిమీద తగిలిన దెబ్బవలన పుర్రె ఎముక లోపలికివంగి దాని ఒత్తుడువలన అపస్మారము వచ్చునని కొందఱ యభిప్రాయము కాని యొకానొకచో నట్లున్నను సాధారణ వ్యాప్తి కిది కారణము కాదని చెప్పవచ్చును. అట్టి వారికి శరీరమందేదోయొక భాగమందే ఈడ్పు సాధారణముగా గన్పట్టును. ముష్టిమైథున (Masturbation) మను దురాచారము వలన అపస్మారము జనించునని కొందఱును, అపస్మారపు రోగులకిది యొకలక్షణమే కాని యిది అపస్మారమునకు కారణము కాదని కొందఱును చెప్పుచున్నారు.

త్రాగుబోతులలో వయస్సు చెల్లినపిమ్మట అపస్మారము హెచ్చుగ కానవచ్చుచున్నది. కాని యపస్మారమునకు త్రాగుడు కారణమని నిర్ణయించుటకు వీలులేదు. పైని చెప్పినట్లు త్రాగుడునకును ఉన్మాదమునకును అపస్మారమునకు నరముల సంబంధమేదో కలదు.

లక్షణములను బట్టి అపస్మారమునుమూడు తరగతులుగ విభజింపనగును.

I. ఈడ్పుతోగూడిన పెద్దమూర్ఛ.

II. ఈడ్పులేని చిన్నమూర్ఛ.

III. ఈడ్పుతోగూడిన చిన్నమూర్ఛ.

లక్షణములు

అపస్మార లక్షణములలో కొన్ని వ్యాధి పైకి కనబడక పూర్వము కొన్ని గంటలకో లేక దినములకో రోగియందు కన్పట్టును. మరి కొన్నిలక్షణములు వ్యాధి బయిటికి దెలియక పూర్వము కొద్దినిముషములకో క్షణములకో ముందుగ కన్పట్టును. ఇట్టిలక్షణములను వ్యాధి యొక్క పూర్వరూపమని చెప్పనగును.

అపస్మారపు రోగితో నివశించు వారలు రోగికి ఎప్పుడు మూర్ఛవచ్చునో సాధారణముగా చెప్పగలరు. కొందరు వ్యాధి బయల్పడక పూర్వము కొంతకాలము రుసరుస లాడుచు చీటికిమాటికి కోపపడుచుందురు. కొందరు విచారగ్రస్తముగనుండి పనితోచక ఇటునటు తిరుగుచుందురు. మరికొందరు ఎన్నడును లేని చురుకుతనము గలిగి యుందురు. కొందరువిచిత్రమైనచిత్తభ్రమలు చెందుదురు. కొందరకు మూర్ఛరాక పూర్వము ఆకలి తగ్గును. తలనొప్పి, తలతిరుగుట మొదలగు గుణములు కన్పట్టును.

పైచెప్పినవిగాక మూర్ఛరాకముందు ఒకానొకరోగికి ఒక్కొక్కరీతిని శూచనల్లు గన్పించును. ఒకడు ముందునకు పరుగెత్తిపడును. ఒకడు వెనుక వెనుకనే పరుగెత్తిపడును. మరొకడు గుండ్రముగ చుట్టుచుట్టు తిరిగి పడును. మూర్ఛరాక పూర్వమొకానొక రోగి యేదో పనియున్నట్టుగా మంచము క్రిందకు వంగి

చూచి గభీలున పడిపోవుచుండెనని యొక వైద్యుడు వ్రాసియున్నాడు. కొందఱకు ఒక చెయ్యి లాగినట్లును, తిమ్మిరపట్టినట్లును, మూర్ఛరాకముందు సూచన గాన్పించును. కొందఱకు కడుపునొప్పి యెత్తును, లేదా తల తిరుగును. ఇట్లే ఒక్కొక్క రోగికి ఒక్కొక్క విధమైన సూచనయుండును. కొంద ఱే విధమైన సూచనయు లేకయే అకస్మాత్తుగ పడిపోవుదురు.

నిజమైన మూర్ఛలో మూడవస్థలను వైద్యులు వర్ణించి యున్నారు. ౧. మూర్ఛ.

మూర్ఛ

ఇందు శరీరమునందలి కండలన్నియును ఒక్కపెట్టునబిగపట్టి స్మృతి తప్పిరోగిపడిపోవును. ఈయెడ్డు ఒకప్రక్కను రెండవప్రక్కకంటె బలముగనుండవచ్చును. అప్పుడు తల కండ్లు, ఒక ప్రక్కకుతిరిగిపోవును. శరీరమంతయు కొయ్యవలెనయి నడుము విల్లువంపుగావంగియు మెలిక వేసినట్లగును. ఎదురురొమ్ము కండలన్నియు బిగిసికొనిపోవుటచే విచిత్రముగ మూలిగినట్లు రోగి ఒక పెద్ద కేక వేయును. మొదట ముఖము తెల్లబడి వెంటనే మొగముపెక్కి ఇంతలో నల్లబారి కంటిలోని పాపలు పెద్దవగును. నాడిసన్నగిల్లును. ఈపై చెప్పిన మొదట యవస్థయంతయు నర నిముసములో ముగియును. పిమ్మట రెండవయవస్థ వెంటనే ప్రారంభమగును. ఇపుడు కండలన్నియు దీవ్రముగా గిజగిజకొట్టుకొనును. నాలుక పండ్లమధ్యనుండి బయలుపడును. ఒకానొకప్పుడు తెగి రక్తమువచ్చును. మలమూత్రముల విసర్జనమగును. కనిగ్రుడ్లు గిరగిరతిరుగును. ఊపిరిక్రమముదప్పి ఆడును. ముఖము నల్లబారును. మెడయందలి నెత్తురు కాలువ లుబ్బిపోవును. తీవ్రమైనమూర్ఛలో రోగి ఊపిరాడక చనిపోవునేమోయని భయము కలుగును. కాని ఇంతలోనే ఈవస్థ మారి మూడవయవస్థ ప్రారంభమగును: రోగి కొంచెము తెలివి వచ్చునట్లు కాలో చేయోత్రిప్పుకొనును. నిట్టూర్పు విడుచును. ఒకానొకడు తిరిగి వెంటనే నిద్రపోవును. మఱియొకడు పిచ్చిపట్టినట్లు కేకవేయును. ఇంకొకడు ప్రక్కనున్నవారితో జగడమాడును. కొట్టును. పరుగెత్తిపోవును. కాని కొంత సేపటికి నిద్రబోవును.

i మొదటయవస్థ అరనిముసము లోపుగను, రెండవయవస్థ ఒకటి రెండు నిముసములును, మూడవయవస్థ అయిదు మొదలు పది దినములవఱకును సామాన్యముగ నుండవచ్చును. మూర్ఛవిడచిన తరువాత పట్టునిద్ర ఒకటిరెండు ఘంటలుండును. ఒకానొకప్పుడు రోగి దినమంతయు నిద్రమత్తులో పడియుండును. మొదటి యవస్థయందు సన్నగిలిన నాడి రెండవ యవస్థయందు దృఢమై వేగము గలదియగును. కొందఱకు మూర్ఛవిడచిన పిమ్మట తీవ్రమైన తలనొప్పివచ్చును. మూర్ఛలోనుండగా శరీర వేడిమి ఒకటిరెండు డిగ్రీలు హెచ్చవచ్చును. వెంట వెంటనే మూర్ఛ

విడిచి విడిచి వచ్చుచున్న యెడల అధిక జ్వరము రావచ్చును. కొందఱకు ప్రతిసారియు వాంతి కావచ్చును. అట్టివారలకు గొంతుకలో పదార్థము లడ్డుపడి ప్రాణాపాయము గలుగ వచ్చును.

ii. ఈడ్పులేని చిన్నమూర్ఛ. ఇది ఒక క్షణము మొదలయిదు క్షణములవఱకునుండును అని చెప్పవచ్చును. ఇది వచ్చినపుడు రోగి ముఖము ఇతరులకు విచిత్రముగ కన్పించ వచ్చును. రోగి తానేదియో మరచిపోయినట్లు మాట్లాడుచున్న వాడల్లే అకస్మాత్తుగ నిలుపును. ముఖము తెల్ల బారును, కంటిపాపలు పెద్దవగును. క్షణములో నంతయు మారి యథాస్థితికి వచ్చును. రోగినడచు చున్న యెడల కాళ్ళు కొంచము తడబడును. లేదా ఒక ప్రక్కకు వంగును. కాని క్రిందబడడు. చేతిలోని వస్తువును జారవిడువడు. ఈచిన్నమూర్ఛ రాక పూర్వము రోగి కేమియు సూచనలు తెలియవు. తరువాత గూడ బుద్ధి మాంద్యముండదు.

iii. ఈడ్పుతో గూడిన చిన్నమూర్ఛ. ఇందు శరీరమునం దేదోభాగము బిఱ్ఱుగ బిగిసికొనును. లేదా కొట్టుకొనును. క్షణమాత్రము స్మృతితప్పును. క్షణమాత్రము కనుగ్రుడ్లు తలనొక ప్రక్కకు దిరుగును. ఈమూర్ఛ వచ్చినపుడు ఒకొక్క సారి క్షణమాత్ర మున్నను ఒకదినములో ననేక సారులుగా వచ్చును. నిద్రలో వచ్చినపుడు బిడ్డలు పడక తడుపుదురు.

అపస్మారమును గుర్తించుట సాధారణముగా కష్టముకాదు.

నిదానము

కాని రోగిని చూడక ఇతరులు చెప్పువర్ణనను బట్టి వ్యాధి తెలిసికొనవలెనని కొంచెము కష్టమే. ఈక్రిందిమూడు ప్రశ్నలకును జవాబు తెలిసికొనిన యెడల కొంతవరకు సహకారి యగును.

౧. రోగి అకస్మాత్తుగ స్మృతి తెలియక పడెనా?

౨. రోగినాలుక కఱచు కొనెనా?

3. మూత్రము పడకలో తెలియకుండ పోసికొనెనా ?

ఈమూడింటికి 'అవు'నని జవాబు చెప్పిన యెడల అపస్మారమని నిదానము చెప్ప వచ్చును. కాని 'లేదు' అనిజవాబు చెప్పినయెడల వ్యాధి అపస్మారము కాదని నిశ్చయింప వీలులేదు. ఏలయన చిన్నమూర్ఛలలో పై చెప్పినమూడు ప్రశ్నలకును వ్యతిరేకపుజవాబు వచ్చినను ఒకానొకప్పుడు రావచ్చును. కాని వ్యాధి యపస్మారమే యగును కాబట్టి అట్టిచో నితరవిషయములను గమనించి అపస్మార దానమును గ్రహింపవలెను. హిస్టీరియా అనుమూర్ఛ (దయ్యము)లో ఈప్రక్క విషయములను గమనింప నగును.

| అపస్మారము | హిస్టీరియా |
|---|---|
| ౧. రోగి తననాలుక కరచుకొనును. | ౧. రోగి తననాలుక కరచుకొనదు. పట్టుకొని నిర్బంధించువారిని రోగికరచి విడిపించుకొన ప్రయత్నించ వచ్చును. నాలుకగాక తన శరీరమునందితరభాగములను తాను కరచుకొన వచ్చును. |
| ౨. రోగియొక్క కాళ్ళుచేతులు తమంతట అవి వెనుకకు ముందుకు ఈడ్పుచేత కొట్టుకొనును. | ౨. రోగి తన ఇచ్ఛవచ్చినట్లు కాళ్ళుచేతులు విదిలించి కొట్టుచు ప్రక్కనున్న వారలను తన్ని కొట్టి జగడమాడ ప్రయత్నించును. |
| 3. అపస్మారమునందు ఈడ్పు కొన్ని నిమిషముల కంటె నెక్కువ కాలముండదు. | 3. కొద్దినిమిషములు మొదలు చాలసేపటి వరకు హిస్టీరియా సంబంధమైన మూర్ఛయుండ వచ్చును. |
| ౪. అపస్మారపురోగి మూర్ఛ తరువాత సామాన్యముగా నిద్రపోవును. | ౪. హిస్టీరియా రోగికి నిద్ర సామాన్యముగా పట్టక మనస్సు చెదిరిపోయి యుండును. |

మూర్ఛవలన మరణము మిక్కిలి అరుదు. ఊపిరాడక ప్రాణము పోవునట్లు కనుపించ వచ్చును కాని సామాన్యముగా అంతలోనే వ్యాధితగ్గి రోగికి తెలివివచ్చును. నిప్పులోగాని నీటిలోగాని పడుటవలన రోగికి ప్రాణభయము కలుగవచ్చును. రాతిమీదపడి పుఱ్ఱె ఎముక పగిలి అపాయము కలుగ వచ్చును. ఒకరోగికి నిద్రపోవునపుడు మూర్ఛవచ్చి తలక్రిందుగా దిరిగి ముక్కు గుడ్డలలోనికి అణచుకొని పోయినయెడల ఊపిరాడక రోగి ప్రాణములను విడవ వచ్చును. కాని వ్యాధివల్లనే ప్రాణములు బోగొట్టికొనిన వారరుదు.

సాధ్యాసాధ్య లక్షణము

చాలకాలమువఱకు మూర్ఛ రాకుండగను, వచ్చునప్పుడు తక్కువగ వచ్చునట్లును ఒక్కొక్క మూర్ఛకును మధ్యచాలకాలము పట్టునట్లును చేయవచ్చునుగాని ఇంతటిలో వ్యాధి కుదిరినదని చెప్పుటకు వీలు లేదు. స్థలముమార్పుట వలనను వృత్తి మార్పుట వలనను గుణము గలుగవచ్చును. అపస్మార పురోగులకు కొంత కాలమునకు బుద్ధిబలము తగ్గిపోవును. కొందఱకు పిచ్చెత్తును. పగటియందువచ్చు మూర్ఛ నిద్రలో వచ్చు మూర్ఛకంటె చికిత్సలకు సులభముగ లొంగును. చిన్నమూర్ఛకంటె పెద్దమూర్ఛ చికిత్సకు లొంగును.

అపస్మారము కుదురునా?

పొటాసియము బ్రోమైడ్ అను మందీ వ్యాధికి చాల నుపయోగకరము. పదిమొదలిరువది గ్రెయినుల వఱకు దినమునకు మూడుసారులు భోజనమైనతరువాత నొకఘంటకు నీళ్ళతోనీయవచ్చును. నలుబది మొదలు

చికిత్స

అరువది (గ్రెయినుల మోతాదు నిద్రలో మాత్రమును విసర్జించు వారలకిచ్చిన గుణము కావచ్చును. సోడియం పొటాషియం, అమోనియం, ఈమూడు బ్రోమైడులును సమభాగములుగ గలిపియిచ్చినను ఇయ్యవచ్చును. మూర్ఛ పటోనిసమయమున నిశ్చయముగా వచ్చునని తెలిసినప్పుడు ఒక మోతాదు బ్రోమైడు ఇచ్చినయెడల మూర్ఛ నిలిచిపోవచ్చును. అధికముగ బ్రోమైడు నిచ్చినయెడల బుద్ధిమాంద్యము గలిగి కాళ్లుచేతులు చల్లబడి చొంగ నోటివెంటగారవచ్చును. మాటనెమ్మదిగ వచ్చును. తల్లులకు బ్రోమైడు ఇచ్చుట వలన పాలుత్రాగుబిడ్డలకు పడకపోవచ్చును. మిక్కిలి గుణము కనిపించు రోగులకుగూడ బ్రోమైడును అఖరు మూర్ఛతరువాత రెండు సంవత్సరముల వఱకు నిలుపగూడదు. అటుపిమ్మటగూడ వారమున కొకటి రెండు మోతాదుల నిచ్చుచు క్రమముగ నిలుపవలయును. గుండెలలో వ్యాధిగల వారలకు బ్రోమైడుతోడు జటాలస్ (Digitalis) ను, నెత్తురులేని వారికి ఇనుమును, బలహీనులకు క్వాష్టీవ రాయిలును చేర్చి యియ్యవచ్చును. వెలిగారము ౧౦ మొదలు ౨౦ గ్రెయినుల మోతాదు బ్రోమైడుతో చేర్చిగాని ప్రత్యేకముగగాని దినమునకు మూడుసార్లు ఇచ్చిన గుణము కలదని ఒకానొక్కరు వ్రాయుచున్నారు. ఇవిగాక పలువలకొలది మందులను ఇచ్చి చూచియున్నారుకాని నిజమైన గుణము కానరాలేదు. అపస్మారపు రోగులకు కంటిచూపులో జబ్బు ఉన్న యెడల అద్దములను వేసికొనవలెను. [అ. ల.

(ఆయుర్వేద శాస్త్రము ననుసరించి)

సంప్రాప్తి

స్మృతి నశించునుగాన అపస్మార మనంబడును. చింత, శోకము, భయము, మొదలగువానిచే శారీర మానస దోషములు ప్రకోపించి హృదయమును సంజ్ఞా వాహి స్రోతస్సులను జెంది స్మృతిని నశింపజేయును.

సామాన్య లక్షణములు

ఇదిజనించిన తోడనే రోగికి చీకటిలో ప్రవేశించినటు లుండుట, నేత్రములయందు వైవర్ణ్యము, హస్తపాదములను విదలించుట ఇవి గలిగి మోహమును జెంది జ్ఞానశూన్యుడై పండ్లనుకటకటకొరుకుచు నురుగును గ్రక్కుచు భూమింబడును. దోషవేగము శమించిన తోడనే పూర్వమువలె స్వభావమును జెందును. కొంతకాలము గడచినపిదప మఱల నిటులనే మూర్ఛావికారములను జెందును.

పూర్వ రూపములు

హృదయము నందు కంపము, హృదయము శూన్యముగ నుండు నటులదోచుట, చమట, చింతనొందుట, చిత్తభ్రమ, ఇంద్రియ మోహము, నిద్రానాశము ఇవి అపస్మార రోగములకు పూర్వ రూపంబులు. అపస్మారము వాతజము, పిత్తజము, శ్లేష్మజము, సన్నిపాతజము, అని నాలుగు విధములుగ

నుండును. అందు వణకుట, పండ్లు కొరుకుట, నోటియందు నురుగు కారుట, నిట్టూర్పులు విడుచుట, క్రూరముగ నల్లగ అరుణముగ నుండు రూపములు కంటికగపడుట నీలక్షణములు వాతజాపస్మారమునందు జనించును. నురుగు, అంగములు, ముఖము, నేత్రములు, ఇవి పసుపువర్ణముగ నుండుట, పచ్చగ ఎర్రగనుండు రూపములు కంటికగపడుట, మిక్కిలి దప్పిగలుగుట, ప్రపంచము అగ్నిజ్వాలలచే వ్యాప్తమగునట్లు గాంచుట ఇవి పిత్తజాపస్మారమునందు జనించును. నురుగు, శరీరము, ముఖము, నేత్రములు ఇవి తెల్లగ నుండుట, శరీరము చల్లగ నుండుట, వెంట్రుకలు నిక్కబొడిచి యుండుట, శరీరము బరువుగ నుండుట, తెలుపు వర్ణముతో గూడిన రూపములు కంటికగపడుట, ఈ లక్షణములు కఫజాపస్మారమునందు గలుగును. ఇందు శ్లైష్మికముయొక్క వేగము చిరకాలమునకు నివర్తించును. సన్నిపాతజమునందు వాతజాద్యపస్మారములకు జెప్పియుండు లక్షణము లన్నియు కలిగి యుండును.

చతుర్విధాపస్మారములు, తల్లక్షణములు

సన్నిపాత జాపస్మారము, క్షీణబలముగల వానికి జనించిన యేకదోషజాపస్మారము, చిరకాలమునుండి బాధించుచుండిన యపస్మారము, ఇవి అసాధ్యములు ; చికిత్సలేయందు వర్జింపతగినవి. వ్యాధికి కారణములగు ప్రకుపితదోషములును సర్వదా శరీరము ననుసరించియే యుండినను వ్యాధివేగములను (Epileptic fits) అప్పుడప్పుడు జూపుచుండును. అనగా వాతికము ౧౨ రోజులకును పైత్తికము ౧౫ రోజులకును శ్లైష్మికము మాసమునకును కనబడుచుండును. ఇది సామాన్య విధి. దోషతారతమ్యము ననుసరించి యొకప్పుడీ నియమితకాలమునకు లోపలను రావచ్చును, అతిక్రమించియు రావచ్చును.

సాధ్యాసాధ్యములు

వ్యాధిప్రకోపకాలములు

[మాధవనిదానము ; అపస్మారప్రకరణము.]

౧. పైని చెప్పిన చొప్పున యపస్మారరోగస్వరూపములను గుర్తెరిగి దోషములచే నావరింపబడియుండు బుద్ధి హృదయము మనస్సు స్రోతస్సులు వీనిని తీక్ష్ణములుగ నుండు వమన విరేచనాది కర్మలచే శుద్ధిపరచవలయును. వాతజాపస్మారము వస్తికర్మలచేతను పిత్తజాపస్మారము విరేచనములచేతను శ్లేష్మజాపస్మారము వమనంబులచేతను చికిత్సింపవలయును. అనంతరము పేయాదిగంజులను భుజింపజేసి అపస్మారరోగము శమించుటకై యీదిగువ నుదాహరించు ఘృతపానాదుల నొసంగవలయును.

అపస్మారచికిత్సావిధానము

౨. ఆవుపేడ రసము, పాలు, పెరుగు, మూత్రము, నెయ్యి వీనిని సమభాగములుగ జేర్చి ఘృతపాకవిధిప్రకారము పక్వముచేయ

పంచగవ్యఘృతము

వలయును. దీని సేవనవలన అపస్మారము, జ్వరము, ఉన్మాదము, కామిల, హరించును.

౩. సరస్వతీ ఆకు రసమునకు సమముగా పాతనెయ్యిని కలిపి వచ, చంగల్వకోష్ఠు, శంఖపుష్పి వీనిచూర్ణ మును జేర్చి పాకము చేసి సేవించిన అపస్మారము తప్పక శాంతించును. [౧-౨-3 చర కే. చి. స్థా; అ ౧౫.

బ్రాహ్మీఘృతము

౪. కాశగడ్డి, నేలగుమ్ముడు, చెఱుకు, కుశకడ్డి, వీనిని సమభాగములుగజేర్చి పాదా వశేషముగ కషాయ మూకాచి, వడియగట్టి అందు నావుపాలనుజేర్చి చక్కగ కాచి పానముచేయించిన అపస్మారము హరించును.

క్షీరము

౫. కూష్మాండ స్వరసము ౮ ప్రస్థములు ఆవునెయ్యి ౧ ప్రస్థముచేర్చి యష్టిమధుక కల్కమును కలిపి విధిప్రకారము పక్వము జేసి యిప్పించిన అపస్మారము శీఘ్రముగ హరించును. ప్రశస్తమయిన బుద్ధి, వాక్కు స్వరము కలుగును.

కూష్మాండ ఘృతము

౬. కపిలవర్ణముగల ఆవుయొక్క పిత్తముచే నస్యము చేయించిన రోగికి మిగుల హితము కలుగును.

నస్యము

౭. నువ్వుల నూనెగాని వెల్లుల్లిగాని ఆవు పాలతోడ పిల్లి పీచరునుగాని, తేనెతోమండూక బ్రహ్మీస్వరసమునుగాని చెంగల్వ కోష్ఠుస్వరసమునుగాని వసనుగాని ప్రతిదిన మపస్మార రోగి కిప్పించవలయును. (౪, ౫, ౬, ౭, అష్టాంగ హృదయము, ఉత్తరస్థానము. అ. ౭.)

౮. శ్లో॥ నిర్గుండీ భవ వన్దాక
నావస్యోపయోగతః
ఉపైతిసహసానాశ మపస్మారో
నసంశయః.

యోగతరంగిణి.

వావిల చెట్టుమీద బయలుదేరిన బదని కను దెచ్చి చూర్ణము చేసి నస్యకర్మయందుపయోగించిన అపస్మారము నిస్సంశయముగ శాంతించును.

బదనికయోగము

౯. గొఱ్ఱె మూత్రము గోమూత్రము గోమయరసము వీనిని ఆవనూనెకు నాలుగు రెట్లుచేర్చి తైలము కాచి అభ్యంజనము చేసిన చో అపస్మారము నివర్తించును.

(బృందమాధవము).

౧౦. పంచకోలములు, మిరియాలు, త్రిఫలములు, బిడాల లవణము, సైంధవ లవణము, పిప్పళ్లు, వాయువిడంగములు, వాము, ధనియాలు, జీరకము, వీనిని చూర్ణముచేసి వేడి నీటితో పుచ్చుకొనిన అపస్మారము తప్పక శాంతించును. (యోగరత్నాకరే)

కల్యాణకంచూర్ణం

మరియు చరకసంహితలో చెప్పబడిన మహా పంచగవ్యఘృతముగూడ అపస్మారమును నాశనముచేయుట స్వానుభవము.

అపస్మార రోగముగల వానిని నిప్పు నీళ్లు మొదలగు వానివలన ముప్పు కలుగ, నియ్యకో జాగరూకతతోడ నద్దా రక్షించుచుండ వల యును. పైని వివరించిన చికిత్సలచే రోగము క్షమించి మనోవికారరహితుడుగనుండు, రోగి, తోడ 'నీవు పూర్వము నిందనీయ కృత్యంబు లను జేసినా'వని చెప్పక

రోగి రక్షణావశ్యకము

రోగోపశమనానంతర కర్తవ్యము

ప్రియమును మనోహరమును అగువిషయం బులంజెప్పి వాని మనస్సున కుత్సాహమును కలుగజేయవలెను.　[గం. దూ.

**అపస్యోముడు.** ఒక బ్రహ్మర్షి. (చూడు 3 అంగిరసుడు).

**అపాండువు.** ఒక బ్రహ్మర్షి.

**అపాంతర తముడు.** ఒక బ్రహ్మర్షి (చూడు. ౧ సారస్వతుడు.)

**అపాం ప్రదము.** భారత వర్షీయ తీర్థము.

**అపినైన్ పర్వతములు.** ఇటలీ దేశమునందు నుత్తరమునుండి దక్షిణము వఱకును, అచ్చటనుండి దక్షిణమున సిసిల్ వఱకును గొలుసువలె పొడుగుగ బ్రసరించి యున్న యొక పర్వతపంక్తి. ఇది యూరోప్ దేశమందలి గొప్పపర్వతములలో నొక్కటి. దీనిపొడువు షుమారము ౭౩౦ మైళ్లు. ఇటలీలో మున్న యీపర్వత భాగముయొక్క యెత్తు శిఖరము 'మాంటెకోర్నో' అనునది ౧౦౦౦౦ అడుగులెత్తున నున్నది. సిసిలీలో ఎట్నా (Etna) అను శిఖరముగలదు. అది ౧౧౦౦౦ అడుగులెత్తుననున్నది. ఇదియు, నేపుల్సు నొద్ద నున్న వెసువియస్ అనునదియు నిప్పుడు జాగ్రత్తగానున్న యగ్నిపర్వతములు. మిక్కిలి యెత్తుమీద నీపర్వతము వృక్షవిహీనము గను, గడుగుగను ఉండును. కొంచెము యెత్తు తక్కువ ప్రదేశము వనములతో నిండియుం డును. ఈపర్వతములమీద ఖనిజము లంతగ లేవు. కాని గృహములకు బనికివచ్చు చలవ రాళ్లు మాత్రము విశేషముగ నున్నవి.

**అపొలో.** గ్రీకువారి దేవుడు. గొప్ప దేవతలలో నొక్కడు. తండ్రి జియస్ (Zeus), తల్లి లేటో (Leto). అర్టిమిస్ అను వాడును ఈతడును కవలుపిల్లలుగ బుట్టిరి. ఈతనిని మృత్యువున కధిపతిగను, సంగీతాధి పతిగను, పశ్వాధిపతిగను, పట్టణములకు రాజ కీయ వ్యవహారములకు నధిష్ఠాతగను, సూర్య దేవతగను, భావించుచుండిరి. రోమ్‌పట్టణము నందు నీతనిగుడి మొదట క్రీ. పూ. ౪౩౧ లో గట్టబడెను. ఆగస్టసు రాజు (క్రీ. పూ. ౬౩—క్రీ. శ. ౧౪) కాలమునందు నీ దేవతపూజ రోమక పట్టణములలో హెచ్చెను.

**అపొలోనియస్.** ౧. (పెర్గస్) ఇతడు క్రీ. పూ. మూడవ శతాబ్దమునం దున్న గొప్ప రేఖా గణిత శాస్త్రవేత్త

('The Great geometer'). స్లావ, అయిదవ టాలెమీ రాజుల రాజ్యకాలమున నితఁడు అలెగ్జాంద్రియా పట్టణమునందు యూక్లిడ్ యొక్క శిష్యుల పాఠశాలలో మొదట శిష్యుఁడుగను తరువాత గురువుగను ఉండెను. ఇతఁడు వ్రాసిన గ్రంథములలో మ్యాగ్నమ్ ఆపస్ (Magnum Opus) అనునది ముఖ్యమైనది. ఇందు దీర్ఘవృత్తములను (Conic Sections) గుఱించిన ౪౦౦ ల సిద్ధాంతములు కలవు. ఇందుఁ బెక్కు లాతఁడు క్రొత్తగఁగని పెట్టినవి యున్నవి.

౨. (ర్హోడి అస్) గొప్పకవియు పండితుఁడు. అర్గొనాటికా (Argonautica) యను మహాకావ్యమునకుఁ గర్త. ఇది మన మహాభారతమువలె క్షాత్రవీర్యమును వర్ణించునట్టిది. దీని భాష, వర్ణనాకౌశలము మిక్కిలి యుచ్చతరమైనది. వర్జిల్ మొదలయిన మహాకవులకుఁ గూడ నిదిమార్గదర్శకమైన ద్దందురు. ఈతఁడు మొదట ర్హోడ్సులో సాహిత్యాచార్యుఁడు (Rhetoricision) గానుండి తరువాత అలెగ్జాంద్రియాలో పుస్తకభాండాగారాధ్యక్షుఁడు (Librarian) గానుండెను. ఇతని కాలము రమారమి క్రీ. పూ ౨౪౦ మొదలు ౧౮౦ వఱకు అనఁగా నితఁడిప్పటికి రెండువేలనూట యేబది సంవత్సరముల క్రిందనుండెను.

3. (మోలన్) గ్రీకు (యవన) సాహిత్యవేత్త (Rhetorician). క్రీ. పూ. ౧-వ శతాబ్దము నందున్నవాఁడు. సిసిరోకు సాహిత్యము నేర్పెను. (క్రీ. పూ. ౮౧).

౪. (ట్యోని అస్) పైథాగోరస్ సంప్రదాయమునందలి తత్త్వవేత్త. ఇతని కాలము రమారమి క్రీ. పూ. ౪-వ సంవత్సరము మొదలుకొని క్రీ. శ. ౯౭-వ సంవత్సరము వఱకు. ఈతఁడు ఏశియామైనర్, పార్థియ, హిందూ దేశము మొదలయిన దూర దూర దేశములుతిరిగి వచ్చెను. హిందూదేశము నందు బ్రాహ్మణులతో తత్త్వమును గుఱించి సంభాషించెనని, క్రీ. శ. ౨౦౦ లో నితని చరిత్రమువ్రాసిన పిలాస్ట్రిటస్ (Philostratus) వ్రాసియున్నాఁడు. ఇతఁడు పెక్కు దైవిక చిత్రంబులును, అమానుష కృత్యంబులును చేసి చూపెనఁట.

**అపోస్తలులు.** ఇది క్రైస్తవమత సంబంధమైన సంప్రదాయిక శబ్దము. ఈశబ్దమునకు వార్తదెల్పుటకుఁ బంపఁబడిన దూత యని మూలార్థము. ఇట్లు పంపఁబడిన దూత కేవలము వార్తాహారుఁడు గాక, తన యజమానుని ప్రతినిధియనియు నీశబ్దము బోధించును. ఈపదము ముఖ్యముగ నేసుక్రీస్తు యొక్కముఖ్య శిష్యులయిన పండ్రెండుగురిని సూచించును. క్రీస్తునకుఁ బెక్కుమంది శిష్యులుండిరి. వారిలోనుండి యాతఁడు పండ్రెండుగురినినేరి యాంతరంగిక శిష్యులుగఁజేసికొని వారికి నపోస్తలులని నామకరణము చేసెను.

"ఉదయమైనప్పుడు ఆయన తన శిష్యులను పిలిచి వారిలో పంన్రెండుమందినేర్పరచి, వారికి 'అపోస్తలులు' అను పేరు పెట్టెను. వీరెవరనఁగా:- (౧) ఎవని కాయన పేతురు అను మారుపేరు పెట్టెనో ఆ సీమోను (౨) అతని సహోదరుఁడైన అంద్రెయ, (౩) యాకోబు (౪) యోహాను, (౫) ఫిలిప్పు, (౬) బర్తొలొమయి, (౭) మత్తయి, (౮) తోమా, (౯) అల్ఫయి కుమారుఁడైన యాకోబు, (౧౦) జెలోతే అనబడిన సీమోను (౧౧) యాకోబు సహోదరుడైన యూదా, (౧౨) ఆయన నప్పగించిన యిస్కరియోతు యూదా అను వారు."*

[లూకా. ౬]

"ఆయన తన పంన్రెండుమంది శిష్యులను పిలిచి అపవిత్రాత్మలను వెళ్లగొట్టుటకును, ప్రతివిధమైన రోగమును, ప్రతివిధమైన వ్యాధిని స్వస్థపరచుటకును, వారి కధికార మిచ్చెను.......యేసు ఆపంన్రెండుమందిని పంపివేయుచు, వారినిచూచి వారికి ఆజ్ఞాపించిన దేమనగా - మీరు అన్యజనుల దారిలోకి వెళ్లకుఁడి,.........వెళ్లుచు పరలోకరాజ్యము సమీపించియున్నదని ప్రకటించుఁడి. రోగులను స్వస్థపరచుఁడి, చనిపోయిన వారిని లేపుఁడి, కుష్ఠరోగులను శుద్ధులనుగా చేయుఁడి, దయ్యములను వెళ్లగొట్టుఁడి." [మత్తయి. ౧౦]

వీరిలోఁ జివరవాఁడగు యూదా చివరకుఁ దన గురువును మోసముచేసి శత్రువుల చేతికి నప్పగించినందునఁ దరువాత నాతనికి బదులుగ మత్తయి అను వానిఁజేర్చిరి. [అపోస్తులుల కార్యములు. ౧.] యేసు సులువమీఁదఁ జంపఁబడిన తరువాత సమాధిలో నుండి మరల లేచినప్పుడు (దీనినే పునరుత్థానమని యెదరు) ఆతనిని చూచియుండుట అపోస్తలుల ముఖ్యలక్షణము. కావున నీ పంన్రెండుమందియు పునరుత్థానమును చూచినవారు. క్రీస్తు తరువాత నీయపోస్తలులు దేశదేశములకుఁబోయి యేసు సువార్తఁ జెప్పి క్రైస్తవ మతమును అభివృద్ధిఁజేసిరి. వీరు మతాభివృద్ధికై చేసిన పనులు 'అపోస్తలుల కార్యములు' అను పుస్తకములో వర్ణింపఁబడినవి. ఇది 'క్రొత్త నిబంధన గ్రంథము' అనఁబడు క్రైస్తవుల వేద గ్రంథమండలి యొక భాగము.

అపోహాయుఁడు. ఒక బ్రహ్మర్షి. (చూఁడు 'నీలపరాశరుఁడు').

అప్పకవి. ప్రసిద్ధుఁడగు నాంధ్ర లక్షణవేత్త. అప్పకవీయమను లక్షణ గ్రంథమునకుఁ గర్త. ఆంధ్ర పండితులలో నప్పకవీయమునకు ననమానగౌరవము కలదు. ఇందుండి ప్రమాణము చూపినయెడల నిప్పటి

* ఈపంన్రెండ్గురు అపోస్తలుల పేళ్లు మత్తయి ౧౦, మార్కు ౩, లూకా ౬, కార్యములు ౧, ఈస్థలములలో నీయఁబడినవి. అన్నిచోట్లను ఈ నామములే యున్నవి. కానిఒక్కపేరుమాత్రము భేదముగనున్నది మత్తయి, మార్కు సువార్తలలో తద్దయి (లెబ్బయి) అనుపేరుకలదు. లూకా కార్యములలో నందునకు బదులు యూదా పేరున్నది.

తెలుఁగు పండితులలో నూటికిఁ దొంబది మంది మాత్రాడక శిరసావహించెదరు. ఆంధ్ర మునందుఁ గవిత్వము చెప్పువారికిఁ గావలసిన విషయములన్నియు నిందు సవిస్తరముగఁ జెప్పఁబడి యున్నందున నింతకుఁ బూర్వమున్న ఛందశ్శాస్త్రములన్నయు వెనుకఁబడి దీనికి నింత ప్రాధిక్యత కలిగినది. ఈకవి తన గ్రంథమును గుఱించి యీక్రింది విధముగఁ జెప్పిన మాటలు చాలభాగము నిజమనియే యొప్పుకొనవలసియున్నది:—

వ.....లక్షణ గ్రంథములు లక్ష్యోప లక్షులు గల వందు.

క. ఒకదానికంటె మతి పే
రొకటి విశేషంబుఁ జెప్పుచుండుకతమునన్
సకల గ్రంథములును జదు
వక తెలియునె లక్షణ ప్రపంచంబెల్లన్. ౧౧౧.

క. ఇది చదివిన పిమ్మట మతి
యెదియేనియుఁ జదువ బుద్ధియేలా పొడముక్?
బదఁపడి గ్రంథములన్నియు
వెదకివెదకి సారమెల్ల వివరింపంగన్. ౧౧౨.
[౧-వ ఆశ్వా.

తమకాలమును నివాసస్థానమును స్పష్టముగ వ్రాసికొనిన తెలుఁగు కవులు తక్కువ.

కాలము

అట్లుస్పష్టముగ వ్రాసిన వారిలో అప్పకవి యొకఁడు. శా. శ. ౧౫౭౮ మన్మథనామ సంవత్సర శ్రావణ బ॥ ౮ (క్రీ. శ. ౧౬౫౬ ఆగస్టు 3) దినమున దేవుఁడు కలలోనికివచ్చి గ్రంథము వ్రాయుమనిచెప్పెను. [ఆ. ౧. 33] దశమి గురువారము (ఆగస్టు ౮) నాఁడు కవి గ్రంథము వ్రాయఁ బ్రారంభించెను. (౧-౯౭) ఇట్లప్పకవీయము వ్రాయఁబడి యిప్పటికి ౨౬౦ సంవత్సరములయినది.

ఈతఁడు తనగ్రంథమును కామెపల్లి గోపాలస్వామి వారికి నంకితముచేసినాఁడు, కవియు నాగ్రామమునందె నివాసముగనుండి నట్లు

నివాసస్థలము

కానవచ్చుచున్నది (౧-3౪,3౫). కామెపల్లి యిప్పుడు గుంటూరుజిల్లాయందలి పల్నాడు తాలూకాలో నున్నది. అప్పకవి కాలమున నది తంగెడు సీమలోనిది. ఇప్పుడు తంగెడు అనుగ్రామము కామెపల్లికిఁ బశ్చిమమున పల్నాడుతాలూకాలో నున్నది. ఈ కామెపల్లి అనునది అప్పుడు అగ్రహారము. వట్టెముపెద్దనార్యునకు సాయప వెంకటపతి యిచ్చెను. (౧-౯౯,౧౦౦)

ఈకవిది భారద్వాజ గోత్రము, ఆపస్తంబ సూత్రము. ఈతఁడు వైదికుఁడు. ఇంటిపేరు

వంశము

కాకునూరివారు. ఈ వంశమువారిది మొదట కాకునూరు అగ్రహారము. అది నరికొండ సీమలో నుండెను. వీరి మూలపురుషుఁడు సోమయ్య (౧-౨౧). ఈతఁ డప్పకవి తాతకుఁ దాత. ఈతఁడు చిన్నతనముననే కాశికిఁ బోయి బ్రహ్మేంద్రులయొద్ద శాస్త్రములు చదివి గొప్పపండితుఁడై (౧-23), మథురా పట్టణమునకుఁబోయి యచ్చటపండితుల వాద

ములలో గెలిచి (౧-౭౨). కాకునూరు అగ్రహారమును, నిడుదవెల్లి, భొద్దినేపల్లి, నివఘళపురి అను గ్రామములలో మాన్యక్షేత్రములను సంపాదించెను. ఈతఁడు 'అభినవచూతసద్గ్రామము' లోఁ గాపురముండెను (౧-౭౩). అభినవచూతసద్గ్రామ మనఁగాఁ గ్రొత్త మామిడిపల్లె. మామిళ్లపల్లెయొకటి బాపట్ల తాలూకాలో నున్నది. మామిళ్లపల్లి (అగ్రహారము) యొకటి నూజువీడు తాలూకాలో నున్నది. కాకునూరీతఁడు సంపాదించినాఁడని యప్పకవి వ్రాసినను, ఈతని తండ్రి పేరుచెప్పుటలో 'కాకునూరి తమ్మన' యని చెప్పుటవలన (౧-౭౩) వీరికి సోమయ్యకుఁ బూర్వమే కాకునూరి వారన్న గృహనామ ముండినట్లు కానవచ్చు చున్నది. ఈసోమయ్యకు గంగమాంబయందు నమశ్శివాయుఁడు, కొండలయ్య, రంగప్ప, లక్ష్మణుఁడు అను నల్గురు కుమారులు పుట్టిరి. వీరిలో రంగప్ప మన కవియొక్క ముత్తాత. ఈయనభార్య కన్నమ్మ. వీరిద్దఱకు తిరుమలభట్టు, గంగన్న, పెద్దసోమయ్య, చిన్నసోమయ్య అను పుత్రులు పుట్టిరి. పెదసోమయ్య మనకవికిఁ దాత (౧-౭౭). ఇతఁడు ౯ క్రతువులుచేసెను. రొంపిచెర్లలో పెద్దనూయి త్రవ్వించెను. రొంపిచెర్ల నరసారావుపేటలోనున్నది. గుడిపాటిలో వినుకొండ మార్గమందుఁ గొప్ప తోట వేయించెను. సత్తెనెపల్లి తాలూకాలో గుడిపూడియను పల్లెయున్నది. అదియే యిదికాఁబోలు. వల్లెము పోతనార్యుని కుమార్తెయైన కృష్ణమ్మ యీయనభార్య. పెద్దిభట్టు బాపమఱది. వల్లెమువారు కామెపల్లి అగ్రహారీకులు. ఇట్లు వీరప్పకవి తండ్రికి మాతామహులు. అప్పకవి స్పష్టముగఁ జెప్పక పోయినను అప్పకవికిని వీరు మాతామహు లయినట్లు కానవచ్చుచున్నది. ఈయనకు వెంగన్న, కొన్నభట్టు, గందయ్య అను కుమారులును, తిమ్మక్క, రంగమ్మ, లింగమ్మ, గోపమ్మయను కూఁతులును కలిగిరి (౧-౮౦). వారిలోఁ బెద్దవాఁడయిన వెంగన్న మనకవికిఁ దండ్రి. పల్నాటిలో నీతఁడు గొప్ప పండితుఁడని ఖ్యాతిఁజెందెను.

తే. పల్లెనాటను నూటతొంబదియు నాల్గు
గ్రామములనీడు గానక కాకునూరి
వెంగనార్యుఁడు వేదవేదాంగములను
బ్రిస్తుతికి నెక్క మాఱటబ్రహ్మయనఁగ. [౧-౮౨.

ఈ వెంగనార్యునకు శేషమ్మవలన అప్పకవి, సోమనార్యుఁడు, వేంకటపతి, కృష్ణభట్టు, లక్ష్మణుఁడు అను నైదుగురు పుత్రులుపుట్టిరి.

విద్యాదికములు

కాకునూరివారిది మొదట కాకునూరును, పిదప క్రొత్త మామిళ్లపల్లెయైనను అప్పకవి కామెపల్లికి వచ్చి నివసించుటయెట్లు తటస్థించెను ? కామెపల్లి యాతని మేనమామల స్థలముగఁ గానవచ్చుచున్నది. తన తల్లివైపువారు ప్రబంధకర్తలనియు తనకుఁగలవచ్చిన సమాచారము తాను వారికి మఱునాఁడు చెప్పఁగా

వారు కావ్యము చేయుమని ప్రోత్సాహపఱిచి రనియు కవియే చెప్పియున్నాఁడు.

"షష్ఠీయ స్వప్న విధంబంతయుఁ దేటపడ నెఱింగించిన నాకర్ణించి సకలజనంబులు నానందంబుఁ బొందిరందుఁ గొండఱు మాతృసంబంధులగుమదీయ బంధువులు గూడఁ గులసింధు సౌగంధిక బంధులును, ధృతపరిబంధులును నీతియుగంధరులును గావున నాకిట్లనిరి" [౧. ౬౬.

అప్పకవి మేనమామల యింటిలోనే పెరిగి విద్యావంతుఁడయ్యెనని కూడ లోకవార్త వచ్చుచున్నది. కావున నీతని కుటుంబము మేనమామలఁ బట్టియే కామెపల్లికి వచ్చెనని మనము నిశ్చయింపవచ్చును.

అప్పకవికి స్వరయుక్తముగ యజుర్వేదము నేర్పినవాఁడు మూర్తి సర్వన్న, శబ్దశాస్త్రము చెప్పినవాఁడు కాండూరిగిరి దేశికుఁడు, సిద్ధాంతములు తెలిపినవాఁడు సూరభట్టు, లక్షణవేత్తను చేసినవాఁడు మంచికంటి యోబనకవీంద్రుఁడు, స్మార్తకర్మ మెఱిఁగించినవాఁడు కొలచలమల్ల సింగనార్యుఁడు, ఆగమముల నుపదేశించినవాఁడు రాజయోగి; వీరు విద్యాగురువులు (౧-౩౧). వీరన్యథా తెలుఁగు వాఙ్మయమునందుఁ బ్రసిద్ధిచెందిన వారు కానందున మనకు వీరిని గుఱించి విశేష మేమియుఁ దెలియదు. అప్పకవికి లక్షణము నేర్పిన మంచికంటి యోబనకవి యీ గురువులలో మనకు ముఖ్యుఁడు. ఆతని బోధ ఫలమే యప్పకవీయము. విద్యాభ్యాసమైన తరువాత నీతఁడు కొంతకాలము వఱకు శ్రీశైలముమీఁద నున్నట్లు ఈ క్రింది పద్యము వలనఁ దెలియుచున్నది.

క. శ్రీగిరిని నిలిచి నీవును
భోగివిభూషణుని పట్టపుకవీంద్రుఁడవై [౧. ౮౪.

**ఈతనిచే రచింపఁబడిన గ్రంథములు**

ఆపస్తంబ షట్కర్మ నిబంధనము, కాళీ జ్వాలార్ణవ సంహిత యను గ్రంథమునకు శ్లోకరూపమైన సంగ్రహము అను రెండు గ్రంథములు అప్పకవి సంస్కృతమున రచించినట్లు కాన వచ్చుచున్నది. అప్పకవీయముగాక తెలుఁగున, అనంతవ్రత కథ, శ్రీశైలమల్లిఖార్జునునిమీఁద శ్లేషనిందాస్తుతి గర్భిత సీసపద్యశతకము, కవికల్పకమను లక్షణ గ్రంథము, స్త్రీలకు ధర్మద్విపద, అంబికావాదమను యక్షగానము అను గ్రంథము లీకవి రచించినట్లు అప్పకవీయము లోన కవి చెప్పుకొనియున్నాఁడు (౧-౮౫). ఇందొక్కటియు నిప్పుడు కానరాదు. సూర్యుని యెదుట నక్షత్రములవలె అప్పకవీయము ముందర నవన్నియు లోపించియుండును. ఇట్లే నన్నయ తిక్కన కృతమైన చిన్నపొత్తంబులు లోపించినవి. ఇఁక మిగిలినది అప్పకవీయము.

**అప్పకవీయము**

ఇప్పుడు దొరకునంతవఱ కప్పకవీయ మైదాశ్వాసముల గ్రంథము. ఎనిమి దాశ్వాసముల గ్రంథము రచింపవలెనని కవి మొదట సంకల్పించెను (౧-౯౬). ఏకారణముచేతనో

అయ్యిదాశ్వాసములు మాత్రము వ్రాసెను. ఇది పేరునకు, నన్నయభట్టీయము మనఁబడు ఆంధ్రశబ్ద చింతామణికి టీకయైనను,నిజముగ స్వతంత్ర గ్రంథమనియే చెప్పవలసియున్నది. అప్పకవి ఛందోవ్యాకరణములను గుఱించి ఆంధ్రమున గొప్పగ్రంథము వ్రాయఁ దలఁచి, గౌరవార్థమును లోకులు ప్రమాణముగ నంగీకరించుటకును, దీనిని నన్నయ భట్టీయమునకు టీకగ వ్రాసెను. ఆంధ్ర శబ్దచింతామణియంతకుఁబూర్వము అప్పకవి కన్నదియు విన్నదియుఁగాదు. (౧. ౯౦). 'తెలుఁగున ఘనకావ్యంబొకటి' చేయవలయునని సంకల్పముచేసి కవియొకనాఁడు (శా. శ. ౧౫౭౮ శ్రావణ బ॥ ౮ నాఁడు) నిద్రపోఁగా (౧-౩౪) కలలో శ్రీమహావిష్ణువు కాన్పించి (౧-౩౬) 'నన్నయభట్టుచే రచింపఁబడిన వ్యాకరణమొకటియున్నది. అందు నెనుబది రెండార్యలు కలవు (౧-౫౨). దానిని అసూయచే భీమకవి గోదావరిలోఁ గలిపెను (౧-౪౪), రాజనరేంద్రుని కుమారుఁడైన సారంగధరుఁడు దానిని పాఠముచేసి యుండెను, అతఁడు సిద్ధుఁడై యిన్నాళ్లు జీవించియుండి మొన్నటి కీలకనామ సంవత్సరమున (క్రీ. శ. ౧౬౨౮) ఆగ్రంథమును బాలసరస్వతులకిచ్చెను.అతఁడు దానికి తెలుఁగుటీక వ్రాసెను. అది నీకు దొరకఁగలదు, నీవు దానికిఁ దెనుఁగు చేయుము' (౧-౪౦) అనిచెప్పెను. అప్పకవి మేల్కొని యాశ్చర్యముఁ జెందుచుండఁగ, కుతంగ పర్వతప్రాంత విప్రుఁడొకఁడు నవమి నాఁడువచ్చి, ఆంధ్రశబ్ద చింతామణి గ్రంథమును, బాలసరస్వతి టీకను ఆతని కిచ్చెను (౧-౬౫). అంతనప్పకవి దశమినాఁడు గురువారమునాఁడు, గ్రంథము వ్రాయుటకుఁ బ్రారంభించెను! (౧-౯౭).

పైని చెప్పిన కథలను మనము నమ్మినను నమ్మకపోయినను ఆంధ్ర శబ్దచింతామణి యంతకుఁ బూర్వమెన్నడును అప్పకవి విని కని యుండనిది యనియు, పూర్వలక్షణ గ్రంథములెన్నియో శోధించిన యప్పకవియే దీనిని అంతకుఁ బూర్వమెఱుంగ నందున నిది నూతనమే యైయుండవచ్చుననియు ఊహింపవచ్చును.

ఆంధ్రశబ్దచింతామణి యను గ్రంథము భారతము రచించిన నన్నయ్యచే రచింపఁబడినదాలేదా యన్నవిషయము శ్రీయుత వీరేశలింగముగారు ఆంధ్రకవుల చరిత్రములో విపులముగఁ జర్చించినారు. మేమును ఆశబ్దము క్రిందఁగొంత చర్చింపఁగలము.

ఆంధ్రశబ్ద చింతామణియొక్క నిజమైనకర్త యెవ్వఁడైనను, అప్పకవి యది నన్నయభట్టారక రచితమనినమ్మి, దానిని ఆధారముగఁ బెట్టుకొని అప్పకవీయమును రచించెను. బ్రహ్మ సూత్రాదుల మీఁద భాష్యములు వ్రాయునప్పుడు శ్రీ శంకర రామానుజాదులైన యాచార్యులు, పదియక్షరములుగల సూత్రముపై నూఱుపుటలు భాష్యము వ్రాసినట్లు

ఆంధ్రశబ్దచింతామణి సూత్రమును పేరునకు నాధారముగ గ్రహించి అప్పకవి తనకిష్టము వచ్చినట్లు వ్రాయుచుఁ బోయెను. అప్పకవిచే దెన్గింపఁబడిన మూలగ్రంథమందలి ఆర్యావృత్తము లేఁబది. దానివివరము:-

| ఆశ్వాసము | ఆంధ్రశబ్దచింతామణిలోని ఆర్యావృత్తముల సంఖ్య | అప్పకవీయములోని తెలుఁగు పద్యములసంఖ్య |
|---|---|---|
| ౧ | ౬ | ౨౩౭ |
| ౨ | ౨౦ | ౪౩౭ |
| ౩ | ౧౧ | ౩౯౮ |
| ౪ | ౫ | ౪౪౦ |
| ౫ | ౧౮ | ౧౯౩ |
| | ౬౦ | ౧౭౦౫ |

ఇట్లు ౬౦ ఆర్యావృత్తములకు ౧౭౦౫ పద్యములైనవి. ఆర్యావృత్తము చిన్నది. మననకంధమంతేదీ. అందు నొక భేదమే కందము. కావున ౬౦ ఆర్యలనఁగా ౬౦ కందములతో సమానమని మన మనుకొన వచ్చును. ఇఁక తెలుఁగుభాగమున శార్దూలాది వృత్తములును, సీసము మొదలగు విశాలాంధ్ర పద్యములును, పుటలకొలంది నిండియున్న గద్యములును కలవు. కావున మూలమునకును, భాషాంతరమునకును ఏవిధమైన పోలికయులేదు. మూఁడవ ఆశ్వాసములోని

> ఆద్యోవళిర్ద్వితీయో-
> వర్ణః ప్రాసోత్ర పాదపాదేషు
> స్వస్వచరణేషు పూర్వః
> ప్రాసస్సర్వేషు చైక ఏవస్యాత్.*

ఈ యొక్క యార్యను ఆధారము చేసికొని యతిప్రాసలకు సంబంధించిన నియమము లన్నియుఁ జెప్పుచు ౩౯౮ పద్యములు వ్రాసి యున్నాఁడు. కావున అప్పకవీయము ఆంధ్రశబ్దచింతామణికి భాషాంతరమని కాని రూపాంతరమనికాని తలఁపఁగూడదు. స్వతంత్రగ్రంథమనియే చెప్పవలసియున్నది.

అప్పకవీయము స్వతంత్రగ్రంథమని తెలిసికొని దానిని జూడ మొదలుపెట్టిన నట్టివారికిని దానివిషయమై గౌరవము కలుగక మానదు. ఈ గ్రంథమునందు లక్ష్య లక్షణములను సంగ్రహించుటకు గ్రంథకర్త మిక్కిలి పాటుపడినాఁడని తప్పక చెప్పవలసి యున్నది. కవి చెప్పుకొనినట్లు 'వెతకి వెతకి సారమెల్ల వివరించినాఁ'డనుటకు సందేహములేదు. ఇతనికాలమునకుఁ బూర్వము పుట్టిన లక్షణగ్రంథములన్నియు నీతఁడు శోధించెను. లక్ష్యములకై పెక్కు కావ్యములను గాలించెను. ఇతఁడిచ్చిన లక్ష్యములన్నియుఁ గ్రొత్తవికావు నియుఁ బూర్వలాక్షణికు లిచ్చిన పెక్కులక్ష్యములను ఆయా గ్రంథములలోనుండి యుదాహరించెననుటయు స్పష్టమేగ్గును ను, అట్లు యప్పుతీస్కికొనిన లక్ష్యములుగాక స్వతంత్రముగఁ దానుశోధించిన లక్ష్యములు గూడఁ బెక్కులిచ్చియున్నాఁడు. ఆంధ్రలక్ష్యలక్షణగ్రంథములుగాక సంస్కృత ఛందశ్శాస్త్ర

*ప్రతిపాదము నందును మొదటి యక్షరము యతి, రెండవ యక్షరము ప్రాస, యతి చరణచరణమునకును వేఱువేఱు, ప్రాసాక్షరము నాలుగు చరణములకును ఒక్కటియే.

గ్రంథములను, గొంతవఱకు సంస్కృత ప్రాకృతవ్యాకరణ గ్రంథములను శోధించి వానిలోఁగావలసిన విషయములను ఈగ్రంథమునందుఁ జేర్చియున్నాఁడు. గణితశాస్త్రమందలి కఠినమైన అంకయోగ వ్యవహారములనుగూడ (Permutations and Combinations) ఛందశ్శాస్త్రమునకు సంబంధించినంతవఱకు సంగ్రహించియున్నాఁడు. విశేషముగ జతుర్థాశ్వాసముఁ జూడుఁడు.

అప్పకవీయ మైదాశ్వాసములు కలదియని యిదివఱకే చెప్పియున్నాము. ప్రథమాశ్వాసమునకు భాషాపరిచ్ఛేదమనియు, ద్వితీయాశ్వాసంబునకు వర్ణపరిచ్ఛేదమనియు,తృతీయాశ్వాసంబునకు వళిప్రాసపరిచ్ఛేదమనియు, చతుర్థాశ్వాసమునకు పద్యపరిచ్ఛేదమనియు, పంచమాశ్వాసమునకు సంధిపరిచ్ఛేదమనియు నామాంతరములు. తత్సమ, దేశ్య, క్రియాపరిచ్ఛేదంబులనఁబడు మూఁడుపరిచ్ఛేదంబులింకను వ్రాసెదనని కవి మొదట (౧-౬౯) ప్రతిజ్ఞచేసెను గాని యేకారణముచేతనో యవి యెచ్చటను గానరావు. వానిని వ్రాయకమునుపే కవికి నవసానకాలము ప్రాప్తించెనని తలఁపవలసియున్నది. తత్సమ దేశ్య ప్రకరణము లప్పకవి వ్రాసియుండిన యెడల నవి యాంధ్రభాషా చరిత్రమునకు మిక్కిలి యుపయోగకరములై యుండు ననుటకు సందేహములేదు. ఇఁక నొక్కొక్క యాశ్వాసమునందలి కొన్నికొన్ని విశేషములఁ జూపెదము.

ప్రథమాశ్వాసము

ప్రథమాశ్వాసమునందు గవి సంస్కృతాది యష్ట భాషలను గుఱించియు, కావ్యభేదంబులను గుఱించియు, దశవిధ నాయక నాయికలను గుఱించియు, ఆంధ్రభాషాభేదములను గుఱించియు విపులముగ వ్రాసియున్నాఁడు. ఇందలి శబ్దార్థ లక్షణాలంకార సీసమాలిక, శబ్దార్థ దోషసీస మాలిక, భావ సీసమాలిక, శృంగార రస సీసమాలిక, అష్టరస సీసమాలిక, నాయక నిర్ణయసీసమాలికలనునట్టి మాలికలు కవియొక్క యసామాన్య సాహిత్యజ్ఞానమును వెల్లడిచేయుచున్నవి. నూతనముగా నీ విషయమును అభ్యసించువారికి పాఠము చేయుటకు వీలుగ నుండుటకునై యివి సీసమాలికలుగ వ్రాయఁబడినవి. ఇదివఱకు షడ్ భాషలనియే వాడుక. వీనికి సంస్కృతము, ఆంధ్రము కలిపి యప్పకవి అష్టభాష లనియెను. ఈ విభాగములో నప్పకవి, తన కాలమునందు వాడుకలోనున్న యట్టి హిందీ, బంగాళీ, కన్నడము, అరవము మొదలయిన అన్యదేశభాషలకు తావిచ్చినవాఁడు కాఁడు. కన్నడ వ్యాకరణము వ్రాయువారు అష్ట భాషలలోనుండి ఆంధ్రమును తొలఁగించి, దాని స్థానమందు కన్నడమును ఉంచుకొనవలయుననియు, అరవము వారు అరవమును ఉంచుకొనవలయు

ననియు నప్పకవి తాత్పర్యము కాఁబోలును. నాటకములలో నేయేభాష యెవరెవరికి నుప యోగింపవలసినది చూపుటకు నప్పకవి యీ క్రిందిపద్యము వ్రాసియున్నాఁడు.

సీ. క్షపణ జైనాదిక కర్మ హీనులకున్న
  బ్రాహ్మజన్ములకును బ్రాకృతంబు
క్షితివైశ్య శూద్ర ప్రభృతి మధ్యమాధమ
  జాతుల కెల్లను శౌరసేని.
ధీవర లుబ్ధ కాదివినీచజాతుల
  మానవులకు నెల్ల మగధభాష
మొగిఁ బిశాచాసుర ముఖ్యుల కెల్లఁ బై
  శాచికానామ భాషాద్వయంబు
గీ. పతిత చండాల యవనాది పరమనీచ
  జాతి నరుల కపభ్రంశ, మీతెలుంగు
సీమవారికి నాంధ్రంబుఁ జెప్పవలయుఁ
  గావ్యనాటకముల గోపికాభుజంగ! [౧.౧౮౬.

ఈపద్యమునుగూర్చి కొంత ఆలోచింప వలసి యున్నది. సంస్కృత నాటకములలో భిన్న భిన్న పాత్రలకు భిన్న భిన్న భాషలు వాడుచుండేదరు. రాజు మాటలాడు భాష యొకటి, రాణి మాటలాడునది మఱియొకటి, రాజు స్నేహితుఁడగు విదూషకుఁడు మాట లాడునది యింకొకటి! ఆ నియమములను అనుసరించి యప్పకవి యీ పద్యమును వ్రాసెను. తెలుఁగు వాఁడగుటచే అందు 'ఆంధ్ర' మొకటి యెక్కుడుగాఁ గలిపెను. కాని యిందలి నియమములు లాంధ్రకావ్యములకుఁ గాని, ఆంధ్ర నాటకములకుఁగాని యెట్లు పనికి వచ్చును? తెలుఁగులో నాటకములు వ్రాయుచు నాయకునకు సంస్కృతము, నాయికకుఁ బ్రాకృతము, వైశ్యునకు శౌరసేని, తెలుఁగువానికి తెలుగు భాష, వాడుట పొసఁగునా? పొసఁగదు. అప్పకవి కాలమునందు, వీధినాటకములు తప్ప యాంధ్రమునందు కావ్యములనఁ దగు నాటకములు లేవు. వీధి నాటకముల భాష గ్రామ్యము. తెలుఁగులో నాటకములు వ్రాయునప్పుడు వేఱువేఱు జాతులకును, వేఱువేఱు వృత్తు లవలంబించు వారికిని ఏయేభాష యుపయోగింపవలయునో యది స్పష్టముగ వ్రాయక, సంస్కృత నాటకమునకుగాని, తెలుఁగు నాటకములకుగాని ఉపయోగములేని యీపద్యమును వ్రాయుట వింతగనున్నది.

నాటకాదులలోని భాషలను గుఱించి స్పష్టముగఁ జెప్పక పోయినను, మ్లేచ్ఛభాషా పదములను, అన్యదేశభాషాపదములను జాతీయములను వలయునప్పుడు కావ్యములలో నుపయోగింపవచ్చునని యప్పకవి యీ క్రింది పద్యములలోఁ జెప్పి పెద్దన తిమ్మనధూర్జటి కవులపద్యముల నుదాహరించియున్నాఁడు:-

క. క్షితిమ్లేచ్ఛ భాష శ్రుతి గ
 ర్హితమగు నట్లైన సౌభగత్రిని దానిన్
 మతిరోసి విడువఁగూడదు
 సతతము వ్యవహారహాని సంధిలుకతనన్.

క. నీతంబని దేశీయము
 జాతీయంబును వచించు సమయమున నిజ
 ఖ్యాతల భాషాకృతులను
 ఖ్యాతిగ మ్లేచ్ఛోక్తు లాదిగాఁ గూర్తురజా.
 [౧-౧౬౯, ౧౭౦

దేశభాషా గ్రంథములు సంస్కృత గ్రంథములవలెనే నాలుగు పురుషార్థముల నిచ్చునని యీ కవి వ్రాసిన యీ క్రిందిపద్యము (౧. ౧౬౭), భాషాభిమానులు గమనింపఁ దగినది:

క॥ ఆయాదేశము వారికి
నాయాదేశంబు భాష నమరినకావ్యం
బాయత పురుషార్థంబులఁ
బాయక సమకూర్చు దేవభాషయపోలెన్.

ఈకవికి శూద్రకవులయందు నసూయ యుండెను. ఈతని యభిప్రాయ ప్రకారము బ్రాహ్మణులు తప్ప నితరులు పద్యములు చెప్పఁగూడదు!

తే॥ ఉపమగలిగిన శయ్యలనొప్పియున్న
సంఘిభవుని కావ్యంబు గ్రాహ్యంబుగాదు
పాయసంబైన సంస్కార పక్వమైనఁ
గాక పృష్టంబుహవ్యంబుకానియట్లు.
[౧.౧౨౯.

క॥ ధరణీసురుఁడు ప్రశాంతుఁడు
గురుభక్తుఁడు శుచియుఁగల్పకుఁడు పూర్వకవీ
శ్వరవాక్ప్రయోగదక్షుఁడు
గరుణామతి యెవ్వఁడతఁడు కవియనఁ బరఁగున్.
[౧, ౧౪౭.

'ఉపమగల్గిన శయ్యలనొప్పియున్న' యను పద్యము ముఖ్యముగ వసుచరిత్ర కారుఁడైన రామరాజ భూషణుని మనుసునందుంచికొని వ్రాసినట్లున్నది. అప్పకవీయమువంటి లక్షణ గ్రంథమునకు వసుచరిత్రము, హరిశ్చంద్ర నలోపాఖ్యానములవంటి కావ్యరత్నములలో నుండి యసంఖ్యములైన లక్ష్యములు దొరికి యుండును. కానియప్పకవి కీ శూద్రకవులయెడ నుండు అసూయతప్ప యీ కావ్యములనుండి యాతని, లక్ష్యము తీయకుండఁ జేసినది* ఇంతపెద్దలక్షణ గ్రంథమునందు రామరాజ భూషణుని కావ్యములనుండి లక్ష్యములు లేకపోవుట యొకగొప్ప వింతయే. ఇంతియ కాదు. కవి మొదట కవిస్తుతి చేయునప్పుడు రామరాజభూషణుని స్తుతింపకపోఁగా నతని మస్తకమును తన్నినాఁడన్న అయ్యలరాజు రామభద్రకవిని

'రామరాజ విభూషణ రత్నఖచిత
చాముమస్తకలాపాదిహారి వాక్య
గౌరవము పెక్కుభంగుల గణనచేసి' [౧-౨౭.

అనుపదిమలత్తో స్తుతించి రామరాజభూషణుని నగౌరవ పెఱచినాఁడు.

విష్ణుచిత్తీయమను కావ్యము కృష్ణదేవ రాయలచే వ్రాయఁబడ లేదనియు, దానిని పెద్దనయే వ్రాసెననియుఁ దన భావమును అప్పకవి యీ క్రింది గద్య పద్యములచేఁ జూపినాఁడు:-

వ. అది యెట్లనినఁ గనియె ననవలసివ బూతార్థక్రియా పదైక వచనంబునందు వర్ణ

* తృతీయాశ్వాసమునందు నొక పద్యము (౨౭౭) వసుచరిత్రము నందుండి యీయఁబడినది. కాని యది అప్పకవి స్వయముగ నుదాహరించినది కాదు. "లక్షణ విలాసమువారు తెలియక కొన్ని యుదాహరణంబులు వ్రాసినారు. అవియును వివరించెద" నని యుపోద్ఘాతము వ్రాసి లక్షణవిలాసమువారు పడ్డతప్పును దిద్దియున్నాఁడు. కావున నప్పకవి రామరాజభూషణుని గ్రంథమునుండి లక్ష్యము తీయలేదనియే చెప్పవలసియున్నది.

లోపము చేసి కనెగంటయని గ్రామ్యపదముగా భావనుశాస్త్రులు యోచించిరిగాన నిది సాధకము చేసికొని యాంధ్రకవితాపితామహుఁడు కొనియాడినటుకుఁ గానెనని చెప్పెనవి యెవ్వియనిన.

ఆదిపర్వమునను *

క. వనకన్యక యఁట! నేనఁట!
ఘనమున గాంధర్వమున వివాహంబఁట! సం
దనుఁగనెనఁట! మఱచితినఁట!
వినఁగూడదు నెయ్యిట్టిభంగి విపరీతోక్తుల్.

ద్వితీయమునందు.

ఉ. పూని ముకుందు నాజ్ఞఁగను
బొమ్మనె కాంచి యజాండభాండముల్
పానను మీఁదఁ బోవ నదు
వంగ్రానెఁ దన్నన శీగ్రనిశ్చల
త్వానచలత్వనిష్ఠలై సమ
స్తజగంబుల జాడ్యచేతనల్
గానుతికెక్కు సైన్యవతి
కాంచనవేత్రము నాశ్రయించెదన్.

రెండవ యాశ్వాసమునందు సతురముల యుచ్చారణను గుఱించియు, స్వరూపమును గుఱించియు, విపులముగ వ్రాయఁబడినది.

ద్వితీయాశ్వాసము

లసదుచ్చారణకును, శుద్ధ లేఖనమునకును గావలసిననియమములిందు శ్రద్ధతో నీయఁబడినవి. ఆంధ్రలేఖకులు తరుచుగాఁ జేయునట్టి ప్రమాదములనన్నిటిని శ్రద్ధతోఁ గనిపెట్టి వానినన్నిటిని దిద్దియున్నాఁడు. సాధారణలేఖకులు వత్తులు వ్రాయవలసిన చోట కొమ్ము ద్రావడులును, కొమ్ము ద్రావడులు వ్రాయవలసినచోట వత్తులనుడులును వ్రాయుచుండుటఁగని యప్పకవి యివి వత్తులు, ఇవి కొమ్ము ద్రావలు అని తెలుపుటకు రెండు సీసములను ఇచ్చినాఁడు. ఇట్టి పెక్కుతప్పులను సవరించినాఁడు. లోని "శుద్ధాంధ్ర నిరుక్తులు, వీనికి లేఖనక్రమము" అనుశీర్షిక క్రింద అచ్చుల రూపములను, హల్లుల రూపంబులను, స్వరగుణితములును, విడివిడిగా వ్రాసిచూపినాఁడు. కాని లేఖకులకు అప్పకవి వ్రాసిన అక్షరముల యాకారములు తెలియనందున ఈరూపములొక్కొక్క ప్రతిలో నొక్కొక్క విధముగ నున్నవి. అప్పకవి యెట్లు వ్రాసెనో కనుగొనుటకు అప్పకవినాఁటి ప్రతిగాని, తరువాతఁ గొద్దిదినములకు వ్రాయఁబడిన ప్రతిగాని దొరకవలెను. అప్పుడుగాని అప్పకవి యిచ్చిన లిపియిట్టిదియని తెలియరాదు. ఈ ప్రకరణమునందు రేఫఱకార సంబంధమైన సీసమాలికలును, పట్టికలును మిక్కిలి పెద్దవి. కవియొక్క శోధనకును పరిశ్రమమునకును గొప్ప సూచకములు. ఈతనికిఁ బూర్వులైన తాళ్ళపాక చిన్నయ్య మొదలయిన వారు రేఫఱకారముల జాబితాలిచ్చినను తాను ఇంకను శోధించి క్రొత్తవిచేర్చితినని కవియిట్లు చెప్పుకొన్నాఁడు:-

* ఈపద్యమిప్పటి భారతమునందు నాదిపర్వమునఁ గానరాదు. పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి-రచితమైన 'శకుంతలాపరిణయము' అనఁబడు కావ్యమునందు నాల్గవయాశ్వాసమున నున్నది.

సీ. ఆదికవీంద్రు కావ్యము లెల్ల శోధించి
క్రమత హ్రస్వములు దీర్ఘములునైన
యచ్చులమీఁదను హల్లులమీఁదను
గలుగు రేఫ ఱకారములు వచింతుఁ
ద్రాక్షాపాకాన్వయోదధిపూర్ణధవళకీ
ర్తి పెద తిరుమల వేంకటుండు
మొదలైనవారలు మును ప్రచురించిన
యవియెల్లఁ జాలమాయనఁగవలదు
పండితులు నొకకొన్ని పదకేఁగూర్చితి గవి
రాజులు మేలని ప్రస్తుతింప
[౨.౧౫౬.

అప్పకవి రేఫ ఱకారములను గుఱించి మిక్కిలి పట్టుదలగలవాఁడు. యతిస్థానమందుఁ గాని, ప్రాసస్థానమందునఁగాని మరిచినైనను రేఫ ఱకారములకు మైత్రిచేయఁగూడదని యీతని యభిప్రాయము (౨-౨౨౯-౨౩౭). రేఫ ఱకారములపట్టిక యేర్పఱుచుటలో నప్పకవి యేమార్గమును అవలంబించెనో స్పష్టముగ వ్రాయలేదు. కాని యొకానొక తెలుఁగు శబ్దమందలి 'ర' అను అక్షరము రేఫమా ఱకారమా యని సంశయము వచ్చినప్పుడు అది రేఫమనిగాని ఱకారమనిగాని నిశ్చయించుటకు నిచ్చిన లక్ష్యముల వలన మనము కొంతవఱకు నూహింపవచ్చును. తాను ప్రమాణముగఁ దీసికొనఁ దలఁచుకొన్న గ్రంథములలో సంస్కృతపదములందలి రేఫముతోఁ బ్రాసయందుగాని, యతియందుగాని మైత్రిఁ జెందిన 'ర' అను అక్షరము రేఫము అని మొదట రేఫముల నేరుకొనెను. మిగిలిన వానిని ఱకారములనెను. సంస్కృత పదాంతర్గతమైన 'ర' కారముతో నెన్నడును (తాను శోధించిన) గ్రంథములలో మైత్రిఁ జెందనివన్నియు ఱకారములనెను. ఒకప్పుడు రేఫముతోను, మఱియొకప్పుడు ఱకారముతోను (పైని చెప్పినరీతిని విడదీసిన రేఫ ఱకారములతో నని యర్థము) మైత్రిఁ జెందిన వానికి నుభయరూపములున్నవనెను. ఇట్లు రేఫ ఱకార నిర్ణయము చేసి మరల రేఫ ఱకారములకుఁ బూర్వకవులు మైత్రియొప్పలేదని చెప్పుట అన్యోన్యాశ్రయ హేత్వాభాసము కాదా? అది యట్లుండె. ఈ రెండు వర్ణములకును పూర్వమొకప్పుడు భిన్నోచ్చారణ యుండినను లేకపోయినను అప్పకవికాలమునాఁటికే యది లోపించి యీ రెండు వర్ణములకును ఒక్కటియే యుచ్చారణ యుండెననుట స్పష్టము. అప్పకవి వీనిని విభజించుటకు నింతకష్టపడుటయే యిందుకు సాక్ష్యము. సమానోచ్చారణగల యీ యక్షరములకు మైత్రియుండవచ్చును. అనఁగా ప్రాసస్థలములలో నిది రేఫమనిగాని, ఇది ఱకారమనిగాని ఆలోచింప నక్కరలేదని కవిజనాశ్రయాది గ్రంథకారుల యభిప్రాయమైనందున దానిని ఖండించుటకు అప్పకవి యింతపరిశ్రమ చేయవలసివచ్చినది!

అక్షర స్వరూపనిర్ణయమైన తరువాత నీయాశ్వాసమందు నాగమాదుల ననుసరించి, అక్షర బీజములు, వాని లింగములు వాని బూజచేయు విధము మొదలయిన విషయములు చెప్పఁబడినవి. చివర సారస్వతౌషధ

ములని రెండవ మూఁడు మందులు చెప్పఁబడి నవి. ఇందులో నొకమందు తినిన 'సూక్ష్మలు ఘటించు', రెండవమందు తినిన 'గడియకొక పద్యశతకంబు నుడువు' సామర్థ్యము కలుగును, మూఁడవమందు తినిన 'వాని నాలుకను గాపురంబుండు నలువ చెలువ' (౪౯-౫౧).

మూఁడవ యాశ్వాసము యతిప్రాసలకు సంబంధించినది. ఈప్రకరణమునందును అప్పకవి పూర్వ లక్ష్యములను ఎక్కువగఁ బరిశోధించి, పూర్వలక్షణ వేత్తలకంటె నెక్కుడు పనిచేసి యున్నాఁడు. భీమకవి పదియతులు చెప్పినాఁడు. అనంతామాత్యుఁ డిరువది చెప్పెను. అటుమీఁదఁ గొందఱు కవులు యతుల నిరువదియేడు విభాగములుగఁ జేసిరి. అప్పకవి నలుబదియొకటి విధములైన యతులను చెప్పెను (౭,౮)! ఇట్లు యతులసంఖ్య పెరిగిన దనఁగాఁ గ్రొత్తయతులు తెచ్చిపెట్టఁబడినవని కాదు. పూర్వకవులచేఁ జేయఁబడిన పెద్ద విభాగములలోఁ బరకవు లింకను సూక్ష్మములైన విభేదములును కలిపెట్టిరని యర్థము. సంస్కృత సాహిత్య వాఙ్మయమునందు నిట్లే యలంకారములసంఖ్య దినదిన ప్రవర్ధమానమైనది. అప్పకవిచేఁ జెప్పఁబడిన ౪౧ యతులలో స్వరయతులు ౭, వ్యంజనయతులు ౧౯, ఉభయయతులు ౧౪, ప్రాసయతి ౧. అప్పకవి చెప్పిన ప్రాసలు పదునేడు విధంబులు.

తృతీయాశ్వాసము

నాలుగవ యాశ్వాసమునందు ఛందంబుల లక్షణములు వివరింపఁబడినవి. చిత్రబంధగర్భకవిత్వమును గుఱించియుఁ గొంతయుందుఁ జెప్పఁబడి యున్నది. పద్యముల నల్లువారిభాగములు చక్కఁగనల్లించుచుందురు. ఈ యాశ్వాసమునందు గద్యమును గుఱించి యొక విశేషముకలదు. అప్పకవి యిందు రెండువిధములయిన గద్యములను (వచనములను) వ్రాసి యున్నాఁడు. ఒకటి సాధారణమైనగద్య, మొన గ్రంథాదులలో వాడఁబడునది. రెండవది వ్యవహారభాషలో వ్రాయఁబడిన గద్య. కవి మొదట గద్యలక్షణ మీక్రింది విధముగ జెప్పి యీ యుదాహరణ మిచ్చియున్నాఁడు:-

చతుర్థాశ్వాసము

"మ. ధర సాహిత్యము గద్యపద్యము లనం
దా రెండు భేదంబులై
పరఁగు న్గద్యమునందుఁ బాదనియతు
ల్భావింపఁగా లేవు వా
క్స్ఫురణంబై విలసిల్లఁగా నుడువ నా
ప్పుం గావ్యఁ డెంతేనియు
మరుతంత్రీ మతిదీనికే వచన నా
మంబయ్యె సాంధ్రించునన్."

గద్యము.

శ్రీవిలాసినీ వక్షోరుహ ద్వయగిరి దుర్గసంచారవ్యక్తు, పద్మజాండానేకభరణ దక్షదక్ష జామాతృధాత్రీప్రముఖ విశాలనేత్రప్రముఖ నిఖిల బర్హిర్ముఖ ప్రస్తూయమాన శుభశీల * * * * *

వాసభరత్నాభ, వారిజనాభ, నాగారిస్యందన, నందగోపనందన, కరుణాలవాల, కాంచనచేల భుజగేంద్రశయన, ఆర్తరక్షణపరాయణ, గోవింద, ముకుంద నమస్తే నమస్తే నమస్తే.

"వ. అని యిన్విధంబున గద్యరూపంబుగా నాది మధ్యాంతములు వ్యాయనున్న, సకలసద్గుణ సంపన్నుండున్న, ......................వేన్నుచు గోపాల బాలు వినుతించు జనంబులకు......................మోక్షం బంగణంబునంగల వెల్పుటాకుబడి నిశ్చయంబని విపశ్చి ద్వదనంబులు ప్రచురంబుగ వెలయుచుండు."

ఇంక రెండవ విధమైన గద్యము వ్రాయుటకుఁ బూర్వమొక పద్యము వ్రాసి తేట తెల్గుగ వ్రాసెదనని చెప్పెను. ఆపద్యమును ఆగద్యమును ఈక్రింద నుదాహరించుచున్నాము.

> తే. గీ. ప్రత్యయములాలు నీచప్పు పద్యములను
> దెలిసికొన నంతవారికి నలవిగామి
> వరుసనన్నింటికిఁ టీక వ్రాయవలెనుఁ
> దెనుఁగుమాటలఁ గదు తేట తెల్లఁగాఁగ. [౧౩౪.

టీ. వృత్తసంఖ్యాప్రత్యయ మనగాను ఇన్నవ ఛందమునందు యెన్ని సమవృత్తములుపుట్టినవి అని అడిగితేను సరిచెప్పెడివిధము, వారు యెన్నవఛందమున కడిగితేను అన్ని గురువులు అడ్డవరుసగాను వ్రాసి వాటిక్రిందను ఒకటిమొదలుగాను యినుమడించుచు లెక్కలు వరుసవెంబడిన్ని కడకువెడలాను వ్రాసి తుదలెక్కలు యినుమడించితేను యెన్నో ఆయెన్ను అన్ని సమవృత్తములు ఆఛందమునందు బుట్టినవి అని చెప్పటిది.* [౧౩౫.

ఈరెండవ విధమైన గద్యము లేఖకప్రమాదమున నిట్లు వ్రాయఁబడిన దనుటకు వీలులేదు. ఏమనఁగా నిట్టి టీకలన్నియు నొక్కవిధముగ నుండుటయు నితరవచనములన్నియు సలక్షణముగ నుండుటయు నొక్క ప్రతిలోనే కానవచ్చుచున్నది. లేఖకప్రమాదమైన నన్నివచనములయందు నొక్క దోషమే కానుపింప వలయును గదా. అట్లు కానుపింపదు కావున నివి ప్రమాదజనితము కాదనియు, బుద్ధిపూర్వకమేయనియుఁ దోఁచుచున్నది.

అయిదవయాశ్వాసమునందు సంధివిషయమీయఁబడినది కవి చతుర్థాశ్వాసములో ఛందోవిషయమును పూర్తిచేసి పంచమాశ్వాసమునుండి వ్యాకరణ విషయమును ప్రారంభించినాఁడు. ఇందుఁ గళ్లు దృత

పంచమాశ్వాసము

* ఇది ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమునందలి ౧౩-౩-౨ అన్నగుర్తుగల గ్రంథమునుండి యున్నది యున్నట్టు ఎత్తివ్రాయఁబడినది. ఇటీవల అప్పకవీయము అచ్చువేసినవారు పై వచనమును సలక్షణముగ దిద్దియే యచ్చువేసినారు. కావున ఈవచనముయొక్క మూలస్వరూపము చూడవలయునన్న మిక్కిలి పురాతనములైన లిఖిత ప్రతులు, తాటాకు గ్రంథములు చూడవలయును. తాటాకుప్రతుల నన్నిటిలోను ఈ టీకలన్నియు గ్రామ్యభాషలోనే వ్రాయఁబడినట్లు కానవచ్చుచున్నది. ఆంధ్రసాహిత్యపరిషత్తువారి సంగ్రహమందలి తాటాకుగ్రంథమొకటియు మ-రా-శ్రీ గిడుగు రామమూర్తిగారియొద్ద నున్నది యొకటియుఁ జూచితిని. దానిలో 'టీక' అనఁబడిన వచనములన్నియు గ్రామ్యములుగను, ఇతర వచనములు సలక్షణములుగను నున్నవి. తామింకను పెక్కుప్రతులను జూచితిమనియు నన్నిటిలో నిట్లేయున్నదనియు శ్రీ రామమూర్తిగారు చెప్పినారు.

ప్రకృతికములకు గనుగొనుటకై యీయఁబడిన పద్యములు విద్యార్థులకు నెంతేయు నుపయోగకరములు.

సంస్కృతమునఁ దు 'శకంధ్వాది' గణమునకుఁ బరరూపము చెప్పఁబడినది. అదియే తెలుఁగులోని సంధికి మూలమని యప్పకవి యొక్క యభిప్రాయముగ గానవచ్చుచున్నది. అతఁడిట్లు వ్రాసియున్నాఁడు:-

క॥ అరయ శకంధ్వాదిషు టేః
పరరూపము వాచ్యమనుచుఁ బ్రక్రియలోనన్
వరరుచివాక్యము కలిమిని
పరరూపమె వికృతిఁ గానఁబడుస్వరసంధిన్. [౫ ౩౮.

ఇతర వ్యాకరణముల మతమున ప్రథమపురుషేకార సంధి వైకల్పికమైనను, ఆంధ్రశబ్దచింతామణిలోని 'నిత్యమ నుత్తమ పురుష క్రియాస్వితః' అను సూత్రమునుబట్టి, ప్రథమ మధ్యమపురుషముల యికారమునకుఁ గూడ సంధి నిత్యమనిచెప్పుచు నప్పకవి శ్రీనాథుని యంతటి ప్రామాణికకవినిగూడ నిట్లు ఆక్షేపించి యున్నాఁడు:-

క. విరచించెను శ్రీనాథుఁడు *
ధరణినిశృంగార నైషధంబునఁ 'గూర్చుం
డిరియొండొరు'నని కానక
పరపురుషక్రియలఁ బ్రకృతిభావముకలదే. [౫.౬౪.

* బలభిద్వహ్నిపరేత రాజవరుణుల్
పర్యుత్సుకత్వంబు స్వం
ధిలఁ గూర్చుండిరి యొండొరుం గదిసి య
ద్ధిం దత్ప్రదేశంబున
న్నల నాళీకమృణాళ నాళలతికా
నవ్యప్రణాళీ మిళ
ల్లలినాలాప కథాసుధాను భవలీ
లాలోల చేతస్కులై. [నైషధము. ౩.౭౮.

సంధిపరిచ్ఛేదమునందు నాంధ్రశబ్దచింతామణిలో నప్పకవి పాఠానుసారము 'సమ్యోతో హల్యథర్వణాచార్యః మతాత్' అను సూత్రముకలదు. కాని అహోబలుని పాఠమునందును ఇటీవల అచ్చుపడిన బాలసరస్వతుల పాఠమునందును ఈపాఠము కానరాదు.

ఆంధ్రశబ్ద చింతామణియందు 'సర్వత్రాజ్వత్ కార్యంజ్ఞేయం యస్యద్రుత ప్రకృతికేభ్యః' అనియొక సూత్రముకలదు. 'ద్రుతమునకుఁ బరముఁగవచ్చిన యకారమునకు సంతటను అచ్చువలె గార్యమని యెఱుఁగునది' అని దీనికి నర్థము. దీనిని పట్టి చూడఁగా నీసూత్రకారుని మతమున తెలుఁగు మాటలకు మొదట యకారమున్నదనియు, అవి ద్రుతప్రకృతికములకుఁ బరముగా వచ్చినప్పుడు సంధికర్మలో దానిని అచ్చుగ (అనఁగా 'య' వచ్చిన'అ' గ 'యి' వచ్చిన 'ఇ' గ ఇత్యాది) నెంచవలయునని స్పష్టముగఁ దెలుచున్నది. కాని యీమత మప్పకవికి నిష్టములేనందున నాతఁడీ సూత్రమునిట్లు తెనిఁగించి యున్నాఁడు:-

ఉ. అరయ వైకృతోక్తులఁ బ
దాదులయందు యకారముండ దా
తీరునఁబల్కు ప్రాఁత గణు
తింపఁగనచ్చగు దాని దాపలన్

నీరజనాభ నాశితములు
నిల్చిన నచ్చటఁ బ్రాణసంధి చే
స్నారు నితండు చైద్యవసు
ధాధిపు నేపడగించె నేఁడనఁ. [గీ.శం.
[కో. ౮.

**అప్పయ్య దీక్షితులు:** వీరు వేలూరుజిల్లా ఆరణినగరమునకు సమీపము నందున్న అడయపాళెమను అగ్రహారమునందు జన్మించిరి. విశ్వజిద్యాగ మొనర్చి జగద్విఖ్యాత పాండిత్యమును వహించిన రంగరాజమఖి వీరితండ్రి. వీరికి శ్రీకంఠమత ప్రతిష్టాపనాచార్యుఁడు, చతురధిక శతప్రబంధ నిర్మాత, మహావ్రతయాజి అను బిరుదములు గలవు. వీరికే అప్పాదీక్షితులనియు[1] అప్పయదీక్షితులనియు,[2] అప్పయ్య దీక్షితులనియు,[3] గ్రంథములందు వ్రాసియున్నారు. వీరు ద్రావిడ బ్రాహ్మణులు. వీరిచరిత్రమును శివానంద యోగియను యతివరుఁడు వ్రాసియున్నాఁడు. అందు వీరు కలివర్షంబులు ౪౬౫౪ (క్రీ. శ. ౧౫౫౩) స్వరియగు ప్రమాది (చ) సంవత్సరము నందు కన్యామాసబహుళ ప్రతిపత్తిథియందు ఉత్తరాభాద్రనక్షత్రమున కన్యాలగ్నమందు జన్మించినటులు వ్రాయఁబడి యున్నది.

అప్పయ్య దీక్షితులవారు సామవేదులు, భారద్వాజ గోత్రులు.

వీరు వేలూరు పురమున కధీశ్వరుఁడగు చిన్నబొమ్మ రాజుచేత హేమాభిషేకము మొదలగు సత్కారములనందుచు ఆతని సమీపమునందే తనజీవిత సమయమును వెళ్ళ బుచ్చినటులు ఆకాలపుపండితులొనర్చిన గ్రంథములవలన తెల్లియవచ్చుచున్నది.[4] ఈచిన్నబొమ్మ భూపాలుఁడు విజయనగరాధీశుఁడగు సదాశివరాయునకును పెనుగొండాధీశుఁడునుకర్ణాటరాజునగుశ్రీరంగమహారాయునకు సామంతుఁడు. ఇతని ప్రార్థనమువలన సదాశివరాయులు శ్రీరంగ మహారాయలు ఇచ్చిన దాన శాసనములు వేలూరు జ్వరఖండేశ్వరాలయమునందున్న శిలయందు చెక్కఁబడి యున్నవి. అయ్యవి శా.శ. ౧౪౭౭, ౧౪౯౭

1. శ్లో. విద్వద్గురోర్విహిత విశ్వజిదధ్వరస్య
శ్రీసర్వతోముఖ మహావ్రతయాజిసూనోః
శ్రీరంగరాజమఖి నశ్శ్రితచన్ద్రమౌళి
రస్త్యప్పదీక్షిత ఇతిప్రథితస్తనూజః॥
సిద్ధాంతలేశ సంగ్రహే.

2. శ్లో. మునిరస్తిభరద్వాజః ఖ్యాతస్త్రిభువనేష్వపి
అనైన్దర్యస్యజహారాత్మా౽ప్యర్ధణ్యభరణశ్రమం
తస్యాన్వయేమహాత్మాసీత్క్షీరోద ఇవచంద్రమాః
శ్రీకంఠచరణాసక్తశ్శ్రీమానప్పయదీక్షితః॥
గంగావతరణే. ౧ సర్గే శ్లో. ౩౭, ౩౯

3. అప్పయ్య దీక్షితేన్ద్రా
నశేషవిద్యా గురూనహంవన్దే
యత్కృతి బోధాబోధౌ
విద్వదవిద్వ ద్విభాజకోపాధీ
తన్త్రసిద్ధాన్తదీపికాయాం

4. హేమాభిషేకసమయే పరితోనిషణ్ణ
సౌవర్ణసంహతిమిషాద్భిన బొమ్మభూపః
అప్పయ్యదీక్షితమణే రనవద్యవిద్యా
కల్పద్రుమస్యకురుతే కనకాలవాలం.

లందు చెక్కఁబడినవి[1]. కావున జాతకమునం దుదాహరింపఁబడిన సమయమును మనము విశ్వసింపవచ్చును.

తరువాత పెనుగొండ పురాధిపతియగు తిరుమలరాయని పుత్త్రుఁడునగు వేంకట దేవుని సమీపమున నుండి అతని యనుజ్ఞచేత కువలయానందమను పేరుగల అలంకార గ్రంథమునొనర్చెను.[2] పిదప శా. శ. ౧౫౪౫ సరియగు అక్షయ సంవత్సరమునందు శైవులకును వైష్ణవులకునుగల వివాదమును తీర్చుటకు పాండ్య దేశాధిపతియగు తిరుమలనాయకుని ప్రార్థనముచేత మధురకు పోయిరి. వైయాకరణ శిరోమణియగు శ్రీ భట్టోజీ దీక్షితుఁడు అప్పయ్య దీక్షితులవారి సమీపమునందు వేదాంతశాస్త్రము నభ్యసించెను. ఈయంశము భట్టోజీదీక్షితుఁ డొనర్చిన తంత్ర సిద్ధాన్త దీపికవలన తెలియ వచ్చుచున్నది.

అప్పయ్య దీక్షితేంద్రా
నశేషవిద్యా గురూనహంవందే
యత్కృతి బోధాబోధా
విద్వదవిద్వద్విభాజకోపాధీ.

శ్రీ అప్పయ్య దీక్షితులవారు శైవమతము లోకమునందు వ్యాపింపఁ జేయుటకునై చాలప్రయత్నించిన వారిలో ప్రధానులు. వీరిని కృష్ణదేవరాయలకు సమకాలీనులనుగా కొందఱు చెప్పునది ప్రమాణవిరహితము. శైవమతమును లోకమునందు వ్యాపింపఁ జేయుటకు అవతరించి గ్రంథముల నొనర్చిరి. కావున తద్భాష్యగ్రంథమగు నీలకంఠ భాష్యమునకు శివార్కమణిదీపిక యను పేరుతో విపులమగు వ్యాఖ్యానము నొనర్చిరి. అయినను శ్రీమచ్ఛంకరాచార్యము తాను సారియగు భామతియను గ్రంథమునకు పరిమళము అనుపేరుతో వ్యాఖ్యానగ్రంథము నొనర్చి యున్నవారు. పూర్వోత్తర మీమాంసలందును వ్యాకరణమందును అలంకార శాస్త్రమునందును వీరికిగల పాండిత్యము సర్వతోముఖమై సమకాలికులను విస్మయాధీనులనుగ నొనర్చుచుండెను. అప్పయ్య దీక్షితులవారిని తాతాచార్యుల వారిని సమకాలికులను గాఁజేర్చి మనయాంధ్రదేశము నందనేకకథలు వ్యాపించి యున్నవి. వానికి తగిన ఆధారములు లభించనందున నిందుదాహరింపలేదు. అప్పయ్య దీక్షితుల వారికి పుత్త్రులుకొందఱు గలరుగాని వారినామములును గాని పాండిత్యమునుగాని తెలిసికొనుటకుతగినయాధారములభించలేదు. అప్పయ్య దీక్షితులవారు పాండిత్యముచేతను సదాచారపరాయణత్వము చేతను వన్నెకెక్కి సమకాలీనులగు పండితోత్తములకు నాయకమణియై ప్రకాశించుటయే గాక దేశయాత్రచేసి వారాణసిమున్నగు పుణ్యక్షేత్రములకుఁ బోయి తనపాండిత్యమును వ్యాపింపఁ

1. Vide pp. 69—75, vol. South Indian Inscriptions by Dr. E. Hultzsch.

2. అముంకువలయానంద మకరోదప్పదీక్షితః,
నియోగాద్వేంకటపతేర్నిరుపాధికృపానిధేః
కువలయానందే.

జేసిన మహామహుడు. ఈయంశము శ్రీదీక్షితులవారి సోదరుని పౌత్రుండగు నీలకంఠదీక్షితులొనర్చిన గంగావతరణకావ్యము వలన తెలియవచ్చు చున్నది.

అప్పయ్య దీక్షితులవారు ౭౨-సంవత్సరములు జీవించిరి. చివఱకు చిదంబరమునందు నిర్యాణము నందినటులు విద్వాంసు లొకశ్లోకమును పరంపరగాఁ జెప్పుచున్నారు.

శ్లో. కాలేనశంభుః కిలతావతాపి
కలాశ్చతుష్షష్టిమితాః ప్రణిన్యే
ద్వాసప్తతింప్రాప్యసమాః
ప్రబంధాఞ్శతంవ్యధా దప్పయదీక్షితేంద్రః
శివలీలార్ణవః. ౧-౯.

చిదంబరమిదంపురం ప్రథితమేవపుణ్యస్థలం
సుతాశ్చవినయోజ్వలా స్సుకృతయశ్చకాశ్చిత్కృతాః
వయాంసిమమసప్తతే రుపరినైవభోగేస్పృహాదకించి
దహామర్థయే శివపదందిదృక్షేపరం.

వీరొనర్చిన గ్రంథనామములు

౧ పరిమళము
(బ్రహ్మసూత్రవ్యాఖ్యానము)
అద్వైతదీపిక
౨ సిద్ధాంత లేశసంగ్రహము
౩ వేదాంతనక్షత్రవాదావళి
౪ మధ్వతంత్రముఖమర్దనము
౫ మధ్వమత విధ్వంసనము
౬ న్యాయరక్షామణి

శివోత్కర్షప్రతిపాదకములు

౭ సగుణనిష్ఠ
౮ శిఖరిణీమాల
౯ శివతత్త్వవివేకము
౧౦ బ్రహ్మతర్కస్తవము
౧౧ లఘువివరణము
౧౨ ఆదిత్యస్తవరత్నము
౧౩ ఆదిత్యస్తవరత్నవ్యాఖ్య
౧౪ శివాద్వైత వినిర్ణయము
౧౫ శివధ్యానపద్ధతి
౧౬ పంచరత్నములు
౧౭ పంచరత్నవ్యాఖ్య
౧౮ ఆత్మార్పణము
౧౯ మానసోల్లాసము
౨౦ శివకర్ణామృతము
౨౧ ఆనందలహరి
౨౨ చంద్రిక
౨౩ శివమహిమకలాస్తుతి
౨౪ రత్నత్రయపరీక్షా
౨౫ రత్నత్రయ పరీక్షావ్యాఖ్య
౨౬ అరుణాచలేశ్వరస్తుతి
౨౭ అపీతకుచాంబాస్తవము
౨౮ చంద్రకలాస్తవము
౨౯ శివార్కమణిదీపిక
౩౦ శివార్చనచంద్రిక
౩౧ శివపూజావిధి
౩౨ నయమణిమాల
౩౩ నయమణిమాలావ్యాఖ్య
౩౪ నయమయూఖమాల
౩౫ నయమయూఖమాలావ్యాఖ్య
౩౬ యాదవాభ్యుదయవ్యాఖ్య
౩౭ పాదుకాసహస్రవ్యాఖ్య
౩౮ వరదరాజస్తవము

న్యాయశాస్త్రములో

౩౯ న్యాయరత్నమాల
౪౦ న్యాయరత్నమాలావ్యాఖ్య

పూర్వమీమాంసలో

౪౧ నక్షత్రవాదావళి

౪౩ నిధిరసాయనము
వ్యాకరణము
౪౪ నక్షత్రవాదావళి
అలంకారగములో
౪౫ కువలయానందము
౪౬ చిత్రమీమాంస
౪౭ వృత్తవార్తికము
౪౮ రామాయణసార సంగ్రహస్తోత్రము
౪౯ భారతసార సంగ్రహ స్తోత్రము
౫౦ భస్మవాదావళి
౫౧ ప్రాకృతమణి దీపిక

మాకు తెలియవచ్చి నంతవఱకు పేరుల నిచ్చియున్నాము. గ్రంథములు దాదాపు౧౦౪ అని పలువురు పలుకుచున్నారు. [క. మా.

**అప్రతిరథుఁడు:** ౧. ఋగ్వేదము నందలి యొక సూక్తమును (౧౦. ౧౦౩) రచించినఋషి (ఐతరేయ బ్రాహ్మ ౧ ము. ౮. ౧౦).

౨. (సూ. వం.) ఇక్ష్వాకు కులోత్పన్నుఁడైన కులాశ్వరాజునకు నామాంతరము (భార. వన. అ. ౨౦౪.)

3. (చం. వం.) యయాతి పుత్రుఁడైన పురురాజు వంశజుఁడగు అంతిభారుని ముగ్గురు పుత్రులలోఁ జిన్నవాఁడు. పుత్రుఁడు కణ్వుఁడు.

**అప్సరసలు:** స్వర్గమందలి భోగ స్త్రీలు. నాట్యకర్మ వీరివృత్తి. అగ్నిపురాణమందు వీరు ముఖ్యముగఁ బండ్రెండు గురని చెప్పఁబడినది; ఊర్వశి, మేనక, రంభ, మిశ్రకేశి, అలంబుష, విశ్వాచి, ఘృతాచి, పంచచూడ, తిలోత్తమ, భానుమతి, అబల, రమ్య (గణభేదాధ్యాయము). మహాభారము నందు వేఱుజాబితా యీయఁబడినది; అలంబుష, మిశ్రకేశి, విద్యుత్పర్ణ, తిలోత్తమ, అరుణ, రక్షిత, రంభ, మనోరమ, కేశిని, సుబాహు, సురత, సురస, సుప్రియ, అతిబాహు (మహా. ఆది.). వీరందఱును దేవ దానవుల వలెనే కశ్యపప్రజాపతి సంతతివారనియుఁ జెప్పఁబడినది. అప్సరసలు పదునాలుగు కులముల వాండ్రనియు, అందునొకటి బ్రహ్మదేవుని మనస్సు నుండియు, రెండవది వేదములనుండియు, మూఁడవది అగ్నినుండియు, నాల్గవది గాలినుండియు, అయిదవది అమృతము నుండియు, ఆఱవది జలమునుండియు, ఏడవది సూర్యకిరణముల నుండియు, ఎనిమిదవది చంద్రకిరణముల నుండియు, తొమ్మిదవది మేరువునుండియు, పదవది మెఱుపునుండియు, పదునొకండవది మృత్యువు నుండియు, పండ్రెండవది మన్మథుని నుండియు, దక్షప్రజాపతి కూఁతులయిన ముని, అరిష్టయను వారికి గంధర్వులవలన రెండు కులములు పుట్టెను అనికాదంబరిలోఁ జెప్పఁబడియున్నది. (వాచస్పత్యము)

**అప్సరోయుగము:** భారత వర్షీయతీర్థము.

**అప్పాసాహెబు భోంసలా.** (నాగపూరు)నాగపూరురాజు. రెండవరఘోజీ

రాజునకు వెంకోజీయను పినతండ్రి కలఁడు, ఆతనికి సేనాధురంధరుఁడన్న బిరుదుండెను, చాందా, ఛత్తీస్‌గడ ప్రాంతములె జాగీరును ఉండెను. ఆతని కుమారుఁడే, అప్పాసాహెబు.* ఇతనికి ముధోజియన్న పేరుండెను. కాని వ్యవహారమందు మాత్రము అప్పాసాహెబన్న పేరే కలదు. ఇతఁడు చాందాలోఁ బుట్టి కొన్ని సంవత్సరముల వఱకు నచ్చటనే పెరిగినట్టు కానవచ్చుచున్నది. ౧౮౧౧లో నీతనితండ్రి చనిపోఁగా నితనికి సేనాదురంధరత్వమును జాగీరును ప్రాప్తించెను. రెండవ రఘోజి ౧౮౧౬లో మరణము నొందెను. ఆతని కుమారుఁడైన పర్సోజీ రాజయ్యెను. కాని యాతఁడు పిచ్చివాఁడగుటచే రాజప్రతినిధి (Regent) కావలసివచ్చెను. రాజుతల్లియైన బాకాబాయికిని, రాజ్యమునకు అనంతర వారసత్వముగల అప్పాసాహెబునకును ఈప్రతినిధిత్వమును గుఱించి పేచీపడెను. తుదకు రాజ్యమందలి సరదారుల యనుమతినను, ఇంగ్లీషు రెసిడెంటు సాయమునను అప్పాసాహెబే రాజప్రతినిధి యయ్యెను. ఈతఁడు ప్రతినిధిగా నున్నకాలమందు నింగ్లీషువారికిని ఆతనికిని ఇట్లుసంధిజరిగెను. "ఇంగ్లీషువారు పర్సోజీకిసాయము జేయుటకై ఆఱు కాల్బలముల పటాలములును, కొంతగుఱ్ఱపు సైన్యమును, తోఫుఖానాయును ఉంచునట్లును, దానికి బదులుగా పర్సోజీ ఇంగ్లీషువారికి నేడులక్షల యేబదివేల రూపాయిలు ప్రతియేడు నిచ్చుటయేగాక ౨౦౦౦ కాల్బలమును ౩౦౦౦ అశ్వసైన్యమును ఉంచవలెను". ౧౮౧౭లో అప్పాసాహెబు తనజాగీరైన చాందాకుఁబోయెను. ఆతఁడు వెళ్లిన కొద్ది దినములకే పర్సోజీచచ్చెను. అప్పాసాహెబే పర్సోజీని చంపించెనని కొందఱింగ్లీషు చరిత్రకారులు వ్రాసిరి. కాని యందునకు నాధారమేమియు లేదు. పర్సోజీ తరువాత అప్పాసాహెబు రాజయ్యెను.

ఈతఁడు రాజ్యారూఢుఁడై నప్పటినుండియు నీతనికి నింగ్లీషువారి యెడఁగల గౌరవము తగ్గఁజొచ్చెను. ఇంగ్లీషువారికిఁ బ్రతికూలులగు పూనాపేష్వాతోడను గ్వాలేర్ సింధియాతోడను రహస్యముగఁ గలిసి యింగ్లీషువారిమీఁదికి యుద్ధప్రయత్నములు చేయసాగెను. మహారాష్ట్ర సైన్యముల కన్నిటికిని అప్పాసాహెబును సేనాధిపతిఁజేసి పూనా పేష్వాబాజీరావు సన్నదులను, దుస్తులను నాగపురమునకుఁ బంపెను. అంతకుఁ బూర్వమే యింగ్లీషు వారికిని బాజీరావుకును యుద్ధముప్రారంభమైనందున, నాసన్నదును దుస్తులును గ్రహింపవలదని బ్రిటిషు రెసిడెంటు ఎంతచెప్పినను వినక అప్పాసాహెబు ౨౪నవంబరు ౧౮౧౭-వ దినమునఁ బెద్దసభచేసి పూనానుండివచ్చిన యధికారమును వహించెను.

* ఈశబ్దమునకు మరాఠీలో 'ఆప్పా' 'ఆబా' అని రెండురూపములును గలవు. ఈశబ్దము తెలుఁగు కన్నడములలోని 'అప్ప' (అయ్య) శబ్దమే కానివేఱు కాదు.

౨౬-వ తేదిన రెసిడెన్సిలోని యింగ్లీషు వారి సైన్యమునకును అప్పాసాహెబు సైన్యమునకును యుద్ధము ప్రారంభమాయెను.

రెసిడెన్సియనఁగా నింగ్లీషు రెసిడెంటు ఉండుస్థలము. ఇది నాగపూరు పట్టణమునకుఁ బశ్చిమమున మూఁడుమైళ్లు మీఁదనున్నది. దానికిఁ గొన్ని గజములు తూర్పున సీతాబర్డి* గుట్టకలదు. ఇందు రెండు శిఖరములుకలవు. ఒకటియెత్తుగను, మఱియొకటి దానికంటెఁ దక్కువ యెత్తుగను, ఈరెండు శిఖరములకు నడిమిభాగము ఈరెంటి కంటెను ఎత్తు తక్కువదిగను నుండును. ఈగుట్ట మొదట నెవ్వరి స్వాధీనమందును లేదు. 'ఈగుట్టను స్వాధీనము చేసికొని, దానిమీఁదినుండి రెసిడెన్సికి గురిపెట్టవలయు'నని అప్పాసాహెబు ఆలోచించెను. కాని యీసంగతి మొదటనే తెలిసికొని యప్పటి రెసిడెంటగు జంకిన్సు తన సైన్యమునుబంపి గుట్టను స్వాధీనపరచుకొనెను. పైగుట్టమీఁద ౮౦౦ భటులును, క్రిందిగుట్టమీఁద ౩౦౦ భటులును ఒకఫిరంగియు నుంచఁబడెను. రెసిడెన్సి కాపుదలకు గుఱ్ఱపుదళము లుండెను. ఇంగ్లీషువారు గుట్టనుపట్టుకొనుట కొంచమాలస్యమైయున్న యెడల నప్పాసాహెబు సైనికులగు నరబ్బీవారాగుట్టను స్వాధీన పఱచుకొని యుందురు. గుట్టకు కొంచెము దూరమునన వారు యజమానుని యాజ్ఞకునై యెదుర్చూచుచుండిరి.

౨౬-వ తేది సాయంకాలము ౬ గంటలకు నరబ్బీ సైనికులు సీతాబర్డిగుట్టను పట్టుకొనవలయునని దానిమీఁదికి వచ్చిరి. తెల్లవారుజామున రెండుగంటలవఱకు నెన్నియో పర్యాయము లరబ్బీవా రింగ్లీషువారిమీఁదికి నొత్తుకొని వచ్చిరి. ౨౭-వ తేది యుదయము వఱకుఁ గొండక్రింద ౧౮౦౦౦ లసైన్యమును, ౩౬ ఫిరంగులును వచ్చిచేరెను. గుట్టమీఁదివారు తమరక్షణ నిమిత్తమై చుట్టు ధాన్యపుబస్తాలుపేర్చి చిన్నయడ్డుగోడనునిర్మించుకొనిరి. తొమ్మిది గంటలవఱకు నరబ్బీసైనికులు చిన్నగుట్టను స్వాధీనపఱచుకొని యందున్న ఫిరంగితో పైగుట్టమీఁదికిఁ గాల్పఁజొచ్చిరి. ఇంగ్లీషుసైనికులు పెక్కుమంది హతులైరి. కాని మధ్యాహ్నమువఱకు నాగుట్ట మరల నింగ్లీషువారి స్వాధీనమాయెను. అరబ్బీసైన్యమును ఫిరంగులును గుట్టయొద్దనుండి వెడలిపోయెను.

ఇట్లు పరాభూతుఁడైన యప్పాసాహెబు తన యాజ్ఞలేకయే స్వతంత్రించి యరబ్బీవారు పోరాడిరని రెసిడెంటుకు కబురంపెను. వీరికి వారికి రాయబారములు జరుగుచుఁ గొంతకాలము గడిచెను. డిసెంబరు ౧౬-వ తేదిన అప్పాసాహెబు ఇంగ్లీషువారి స్వాధీనమయ్యెను. కాని యాతనిసైనికులు మాత్రము వశులయినవారుకారు. ఆసైనికులతో

* దీనినే యింగ్లీషులో సితాబల్డి (Sitabaldi) అని వ్రాయుదురు.

నాగనదికిని మెక్కర్ దరోచెరువునకును నడుమ నింగ్లీషువారికి యుద్ధము తటస్థమాయెను. అందు మరాటీవారు పరాజితులైరి. కాని అప్పాసాహెబు సేనలోనున్న అరబ్బీసైనికులును హిందూస్థానీసైనికులును, అప్పాసాహెబు చెప్పినను 'మేము నాగపురపట్టణమును ఇంగ్లీషువారి స్వాధీనము చేయ'మని డిసెంబరు ౩౦-వ తేది వఱకు నాపట్టణమును వశమందుంచుకొనిరి. చివరకు వారికిముట్టవలసిన జీతమంతయుఁ దీసికొని యింకఁగొంత బహుమతివడసి, సురక్షితముగ దమశస్త్రాస్త్రముల తోఁబోవుటకు నధికారముఁబొంది వారు నాగపురపట్టణమును విడిచి వెళ్లిరి. అచ్చటి నుండి హైదరాబాదు నవాబునొద్దకుఁబోయి యాతనికొలువులోఁ జేరిరి.

ఇచ్చట నప్పాసాహెబును జనేవరి ౯-వ తేదివఱకు రెసిడెన్సీలోనుంచి యాతనిచే నీక్రింది ప్రకార మొప్పుదలలుచేయించుకొని యింటికిఁ బోనిచ్చిరి:—

"నర్మదానదికి నుత్తరమందున్న రాజ్యమంతయు, దక్షిణమందలి కొన్నిప్రదేశములును వర్హాడ్ (దీనినే యింగ్లీషులో బీరార్ అందురు), గావిల్ గడము, శిర్ గుజా, జష్పురము అను సంస్థానములపైఁ దనకుఁ గల హక్కును అప్పాసాహెబు ఇంగ్లీషువారికినీయవలయును. ఇంగ్లీషు వారాతని నిమిత్తమై యుంచునట్టి సబ్ సిడీ సైన్యమునకును కాంటింజెంటు సైన్యమునకునై యీపైని జెప్పిన ప్రాంతములు ప్రతిఫలముగ నీయవలెను. రెసిడెంటు సలహానను సరించియు, బ్రిటిష్ గవర్నమెంటువారి సమ్మతముననుఁ బాత్రులయిన మంత్రుల యనుమతిని అప్పాసాహెబు రాజ్యము చేయవలయును. ఈతఁడు నాగపురరాజ్య భవనమునందు నింగ్లీషు సైనికుల సంరక్షణములో నుండవలయును. పైని చెప్పఁబడిన ప్రాంతములన్నియు నింగ్లీషువారిస్వాధీన మగువఱకు వారికి సబ్ సిడీక్రింద రావలసిన మామూలుపైకము ముట్టుచుండవలెను. ఇంగ్లీషువారాతని రాజ్యమందలి యేకోటనుకోరినను వెంటనే యదివారి స్వాధీనముచేయవలెను. యాజ్ఞవినసట్టి పురుషుని నింగ్లీషువారికి వెంటనేపట్టి యీయవలయును. సీతాబర్డి రెండు గుట్టలును, బాజార్లును దానికినమీపమునందలి భూమి వలయునంతయును బ్రిటిషు గవర్నమెంటువారికి నిచ్చివేయవలయును. వారికి నావశ్యకమని తోచిన పనులు, యుద్ధమునకు నక్కఱకువచ్చునవి, వారాగుట్టమీఁదఁ జేయుటకు వారికి(ఇంగ్లీషు వారికి) స్వాతంత్ర్యముకలదు"*

అప్పాసాహెబిట్లు మరల రాజ్యమును పొందియునింగ్లీషువారిమీఁది వైరము మానఁడయ్యెను. ఇంగ్లీషువారి కిచ్చెదనన్న ప్రదేశములు వారికి స్వాధీనముగాకుండ యత్నించెను. బాజీరావును చాందామీఁదికి నెత్తి రమ్మని చెప్పి తానుగూడ నచ్చటికిఁ బోవ

*Atchison's Treaties, Vol' iii. pp. 109-110.

తలంచెను. అందుచే రెసిడెంటు ఆతనినిఁ బట్టుకొని, తగినసిబ్బందినిచ్చి ప్రయాగకోట లోనుంచుటకై పంపెను. కాని త్రోవలోనతఁడు తప్పించుకొని యిమాదేవపర్వతముల మీఁదికిఁ బోయెను. పెంఢారినాయకుఁడగు చిత్తూతో గొన్నిదినములు కలిసి యుండెను. అచ్చట నుండి ఆసీర్‌గడమునకుఁ బోయెను. తిరిగి అచ్చటినుండి పంజాబు దేశమునకుఁబోయి రణజిత్ సింగునొద్దనుండి యచ్చటనే మరణ మునొందెను.

## అప్పాసాహెబ్ భోంసలా

(సాతారా). సాతారా రాజులలోఁ జివర వాఁడు. ఇతనికి శహాజీ యన్న పేరు కలదు. అప్పాసాహెబ్ అనునది గౌరవనామము, వ్యవహార నామము. శివాజి పెద్దకుమారుఁడైన సంభాజియొక్క సంతతివారు సాతారాలో రాజ్యముచేయుచుండిరి. క్రీ.శ. ౧౮౩౯ లో 'ప్రతాపసింగ్ నారాయణ'యనురాజును సింహాసన భ్రష్టునిఁజేసి, యాతనిమీఁదివ తమ్ముఁడైన అప్పాసాహెబును ఇంగ్లీషువారు రాజ్యము మీఁదఁ గూర్చుండఁ బెట్టిరి. ఈతఁడు రాజ్యమునకువచ్చినతోడనే స్త్రీలచే సహగమనముచేయుట ఆపివేసెను. రెండు లక్షలరూపాయిలు వెచ్చించి సాతారాకు నీటివసతి నేర్పఱిచెను. రెండులక్షలుపెట్టి వేణాకృష్ణానదులకు వంతెనలు కట్టించెను. నూతనరాజభవన మొకటి నిర్మించెను. అద్ది యిప్పుడు న్యాయస్థానముగ నుపయోగింపఁ బడుచున్నది. ఇతఁడింగ్లీషువారియెడ మిక్కిలి విశ్వాసముతోఁ బ్రవర్తించెను. ఈతఁడు ౧౮౪౮-వ సంవత్సరము ఏప్రిల్ నెల ౫-వ తేదిన మృతినొందెను. మరణమునకుఁ బూర్వము బలవంతరావు భోంసలాయనుకుఱ్ఱవానిఁ బెంచుకొనెను. వానికి వెంకాజియని పేరు పెట్టెను. కాని యింగ్లీషువారాదత్తతను ఒప్పుకొనక సాతారా రాజ్యమును తమస్వాధీపఱచుకొనిరి.

## అఫ్గానతుర్కిస్థానము.

ఇది అఫ్గానిస్థానపు అమీరుస్వాధీన మందున్న తుర్కిస్థానములోని భాగము. అఫ్గాన్ తుర్కిస్థాన మన్నపేరు ఇంగ్లీషు వారు వాడునదే కాని యీ దేశమునందు వాడుకలోలేదు. ఆ దేశమువారు తమ దేశ మును తుర్కిస్థానమే అనియెదరు. ఇది అఫ్గానస్థానమునకు మిక్కిలి ఉత్తరమునను మధ్య ఆసియా కంటుకొనియు నున్నది. దీని కుత్తరమున రుష్యా రాజ్యము గలదు. పూర్వము బదక్షాన్, వాఖాన్, కటఘాన్ అనునవి దీనిలోనివిగానే యుండెను. కాని యిటీవల ఆమూఁడును ప్రత్యేకముగా విడఁదీసి ఒకపర్గగణా నిర్మింపఁబడినది. ఇందలి కొంతభాగము పర్వతమయముగను, మిగిలి నది మైదానములు కలదిగను నున్నది. దీని విస్తీర్ణము ౫౭౦౦౦ వేల చదరపు మైళ్ళు.

జనసంఖ్య ౭౫౦౦౦౦. ఇందలి 'బాల్క్' అను ప్రదేశమును పూర్వము 'బాక్ట్రియా' నాఖ్యని యనుచుండిరి. జరతృష్ణుఁడు (Zoraster) తనమతమును మొదట నచ్చటనే, బోధించె నని చెప్పుదురు. ఈబాక్ట్రియా మిక్కిలి పురాతన కాలమందు 'అకియ మేనియన్' సామ్రాజ్యములో (Achaemenian Empire) నిమిడి యుండెను. క్రీ. పూ. ౨౫౦లో థియోడోటస్ అనువాఁడు, అచ్చట 'సెల్యూసుడే' రాజునకు ప్రతినిధిగా నుండి స్వతంత్రుఁడయ్యెను. ఇతఁడు గ్రీకోబాక్ట్రియన్ వంశమునకు మూలపురుషుఁడని చెప్ప వచ్చును. తరువాత క్రీ. పూ. ౧౨౬ ప్రాంతమున పార్థియనులు, శ్వేతహూణులు, కుశనల్లు మొదలయిన వారిచే నీవంశ మంతరించెను. తరువాత బౌద్ధయుగము వచ్చెను. ఇచ్చట బౌద్ధమత ప్రచారము విశేషముగా నుండినట్లు ఇప్పటికిని గనపడు విగ్రహాదుల వలన స్పష్టపడుచున్నది. అప్పుడుండిన నవ విహారమను పేరుగలది ఇప్పటికినీ అచ్చట నొకటిగలదు.

ఛంగీస్ ఖానుని దాడికిలోఁబడి పాడైన యీప్రదేశము మిక్కిలి దీనావస్థ నొందెను. ఇది కొంతకాలము ఢిల్లీశ్వరుల స్వాధీనమం దుండి తరువాత హుసేన్ బెగ్ వంశీయులచే నాక్రమింపఁబడియెను. ౧౮-వ శతాబ్దమందు నిది అహమ్మద్ ఖాను రాజ్యములోఁ జేరియుండెను. తరువాత నాతని కుమారుఁడైన తైమూరు కాలమున విడిపోయెను. ౧౯-వ శతాబ్దప్రారంభమునందిది. బొఖారా రాజ్యమునకుఁ జేరియుండెను. దోస్తుమహమ్మద్ కాలమున అఫ్‌గానులు ౧౮౫౦లో బాల్కు, తష్కుర్గ్ అను ప్రాంతములను, ౧౮౫౯లో, అక్చా మొదలయిన అయిదు పశ్చిమ ప్రాంతములను ౧౮౬౫లో కుందుస్ ప్రాంతములను స్వాధీనపఱచుకొనిరి. ఇందులోఁ గొంతభాగమును గుఱించి తగాదాలుండెను. కాని ౧౮౭౩ లో ఇంగ్లీషువారును, రుష్యావారును గలిసి ఒక పంచాయతి నేర్పఱచిరి. ఆపంచాయితీదారు లాప్రాంతములను అఫ్‌గానుల కొసంగిరి. అబ్దుల్ రహిమాన్ ఖాన్ కాలమున ఈప్రాంతము అఫ్‌గాన్ వారికి పూర్తిగలోఁబడెను.

**అఫ్‌గానిస్థానము** హిందూదేశమునకు వాయవ్యపు దిక్కునను్డు మహమ్మదీయ రాజ్యము. దీని కుత్తరమున రుష్యావారి రాజ్యమును, దక్షిణమున బలుచిస్థానమును, తూర్పున హిందూదేశమందలి వాయవ్యపుఁ

ఎల్లలు, వైశాల్యము

బొలిమేర పరగాణాయును (నార్తువెస్టుఫ్రాన్టియర్ ప్రావిన్సును) పశ్చిమమున పారసీక దేశమునుకలవు. ఆతూర్పువైపున కొంచెము చీనాసామ్రాజ్యముకూడ నంటియున్నది. దీని విస్తీర్ణము ౨౪౬,౦౦౦ (రెండులక్షల నలుబది యారు వేల) చదరపుమైళ్లు. ఈ దేశ మీశాన్యమూలనుండి నైరృతిమూలకుఁ బొడుగుగ రమారమి ౭౦౦ మైళ్లు వ్యాపించియున్నది.

వాయవ్యమునదిక్కునుండి ఆగ్నేయపు దిక్కునకు దీనిమధ్యకొలత రమారమి ౬౫౦ మైళ్ళుండును. ఈ దేశమందలి జనసంఖ్య రమారమి ౫౦,౦౦౦౦౦ (ఏబదిలక్షలు). దీని రాజధాని కాబూల్.

ఈదేశమంతయు పర్వత ప్రాంతముగుట యేగాక యెత్తుభూమి. సముద్రముకంటె ఈదేశము ౨౦౦౦ మొదలు ౮౦౦౦ అడుగులవరకు నెత్తుగనుండును. కొన్నిప్రదేశములు ౭౦౦౦ అడుగుల యెత్తుకూడ నున్నవి. అనగా బందరు, కాకినాడ మొదలగునస్థలములనుండు వారికంటె ఈదేశమువారు మైలుకంటె నెత్తుగ నున్న ప్రదేశమునందురు. ఇట్లీదేశమంతయు మన దేశమునకంటె మిక్కిలియున్నతముగనుండుటయేగాక పర్వతమయమైయున్నది. ఇచ్చటి పర్వతశిఖరములు ౧౫౦౦౦ అడుగులు మొదలు ౨౫౦౦౦ అడుగులవరకును ఎత్తుగనుండును. ఈ దేశమందలి పర్వతములలో ముఖ్యమైనది హిందూకుష్. ఇది హిమాలయపర్వతమును వాయవ్యదిక్కున నంటుకొనియుండును. హిమాలయముయొక్క యొకభాగమనియే చెప్పవచ్చును. ఇదీ యీ దేశముయొక్క నైరృతివైపు వ్యాపించినది. రెండవపర్వతమాల కోహిబాబా. ఇది హిందూకుష్ యొక్క పడమటివైపు నుండి బయలుదేరి పశ్చిమదిక్కున వ్యాపించి యక్కడ వలంగు నొద్ద మూడుశాఖలుగ జీలినది.

పర్వతములు

ఈదేశముయొక్క తూర్పువైపునగల పేరొందినది సఫేద్ ఖో అనుపర్వతము. హిందూదేశమునకును ఈదేశమునకును గల బాటలును, కనుమలును—ముఖ్యముగ కైబరుకనుమ అను నది—దీనికి సంబంధించినవే. పర్వత ప్రాంతముగాని మైదానము అఫ్గానిస్థానములో మిక్కిలి తక్కువకలదు.

ఈ దేశమందలి ముఖ్యమైన నదులు నాలుగు; ఆక్సస్, హెల్మండ్, కాబూల్, గోమల్. అఫ్గానిస్థానముయొక్క యుత్తరభాగమంతయు ఆక్సస్‌నదియొక్కయు, దాని యుపనదులయొక్కయు జలములు పానము చేయునని చెప్పవచ్చును. ముర్ఘాబ్, హారిరూడ్ అనునదులు, కొంతవఱకువచ్చి యిసుకలో నదృశ్యమైనను వానిని ఈ నదియొక్క యుపనదులుగనే యెంచవలెను. ఎన్నియో పర్వత కనుమలనుంచి ఆక్సస్ నదికి మంచు కరిగిన నీరు వచ్చును. అది బొఖారా దేశము నుండి ప్రవహించి ఆరల్ సముద్రములో బడును. హెల్మండ్‌నదియు దాని యుపనదులును అఫ్గానిస్థానముయొక్క నైరృతి భాగమునకు జలాధారములు. కాబూల్ నది ఆపేరుగల పట్టణమునకు పశ్చిమమున నలుబది మైళ్లదూరమున బుట్టును. తూర్పుగా బ్రవహించి అటక్ వద్ద సింధునదిలో గలియును. ఇది యీదేశము యొక్క తూర్పు భాగమునకు నాధారము. గోమల్ నది

నదులు

ఆగ్నేయ భాగమునకు నీటివసతి కలుగఁ జేయును.

చిన్నవానిని వదిలినయెడల నీ దేశమున రెండు పెద్ద తటాకములున్నవని చెప్పవచ్చును.

తటాకములు

అబ్ ఇ ఇస్తాదా అను నది గజ్నినైరృతినిక ౫౭ మైళ్ళ దూరమందున్నది. ఇది ౧౭ మైళ్లు పొడుగు, ౧౫ మైళ్ళు వెడల్పు ఉండును; కాని ౧౨ అడుగులలోతు మాత్రముండును. దీనికి ముఖ్యాధారము గజ్నీనది. ఇందలినీరు ఉప్పగనుండును. రెండవది లేక్ విక్టోరియా యనునది. అచ్చటివారు దీని నేమందురో కాని యీపేరింగ్లీషువారిచేఁ బెట్టబడినది. ఇది రుష్యాకును, అఫ్గానిస్థానముకును గల ఉత్తర సరిహద్దుమీఁద పామీర్ అను దేశములో ౧౩౯౦౦ అడుగులయెత్తు ప్రదేశమందుఁగలదు. పదిమైళ్ళుపొడుగును మైలున్నర వెడల్పును కలిగియుండును.

దేశకాలస్థితులు; ఎండ, వాన, గాలి

ఈ దేశమున ఎండకాలమెండలు విశేషముగను చలికాలము చలి విశేషముగను ఉండును. చలికాలము కాబూలులో రెండు మూఁడునెలలు వఱకు మంచుకురియుచుండును. గజ్నిలోఁగూడ నిల్చియుండును. అప్పుడు జనులు బాజారులలో సాధారణముగఁ దిరుగరు. కుంపట్లు వద్దనుంచుకొని నిద్రపోయెదరు. అప్పు డుష్ణతామాపక యంత్రమందలి పాదరసము సున్నకుఁగ్రింద ౫౬ అంశములు (ఫారన్‌హీట్) దిగియుండును. మంచు తుపానులవే గజ్ని పట్టణము ప్రాంతము పెక్కుసార్లు వినాశము జెందినట్లు కథలుకలవు. ఎండకాలము కాబూలులో నీడలో ౧౦౦° అంశము వరకు నెండయుండును. కందహారులో ౧౧౦° ఉండును. ఎండకాలము వడగాలియు, దుమ్ముతోఁగూడిన సుడిగాలియు నెక్కువగవీచును. ఈ దేశమందు మనకువలె నెండకాలములో తొలకరివానలు అరిది. కాబూలులో సంవత్సరమునకు సరాసరి ౧౧ ఇంచిలవానకురియును. మొత్తముమీఁద సంవత్సరమున తొమ్మిదినెలలెండ బాగుగఁ గాయును.

జనులు

ఈ దేశమందలి జనులనందఱిని మనము అఫ్గానులని యన్నను, వీరిలోఁ బెక్కు భేదములుకలవు. దురాణీలు లేక అబ్దాలీలు అనువారు ప్రముఖులు. ప్రభుత్వముచేయు జాతివారు వీరే. ఈ దేశముయొక్క దక్షిణభాగము, నైరృతి దిగ్భాగము వీరిచే నాక్రమింపఁబడినది. గిల్‌చాలను వారుకూడ దురాణీలంత ప్రముఖులే. ఈ రెండు జాతులవారును అచ్చపు అఫ్గానులు. దురాణీలు గిల్‌చ్యాలు కలిసి పదునైదు లక్షలమందికలరు. స్వదేశవాసులు. ఇతర జాతులవారు పరదేశములనుండివచ్చి యచ్చట నిల్చిపోయినవారు. అట్టివారిని తాజికులందరు. వీరు తొమ్మిదిలక్షలవఱకున్నారు. వీరు పల్లెలలో వ్యవసాయమును

పట్టణములలో వేతపనులును వృత్తిగా జేసె కొందురు. వీరు అఫ్గానులను తమకంటె గొప్పవారుగ నొప్పకొందురు. మొగల్ వంశజులయిన హజారాలను జాతివారు కలరు. హెరాల్ ప్రాంతమున చహర్ అయిమాకులను లక్ష యెనుబదివేల జనమున్నారు. యుస్ బెకులను వారు మూడులక్షలజనము అఫ్గాన్ తుర్కిస్థానమునందుఁగలరు. నాదిర్ శాహా (౧౭౩౭) కాలమందు నీ దేశమునకు వచ్చినవారు కిసిల్ బాషీలనువారు ఏబదివేల వఱకుఁగలరు. వీరు ముఖ్యముగ కాబూలులో వైద్యులుగ, వర్తకులుగ, లేఖకులుగనుందురు. హిందూజనులు ౩౫౦౦౦ వఱకునున్నారు. వీరి యొద్దనుండి మహమ్మదీయులీయ నక్కఱలేని యొక పన్ను వసూలుచేయఁబడినను మొత్తముమీఁద వీరిని నచ్చటివారు బాగుగనే చూతురు. కాఫరిస్థానమందలి కాఫరులను వారు కొద్దిదినములక్రిందనే మహమ్మదీయులై అఫ్గానిస్థానపు రాజునకు లోఁబడినారు.

అఫ్గాన్ దేశస్థులు మిక్కిలి బలశాలులు, దృఢకాయులు. వీరిశరీరము మిక్కిలి లావుగను, కడ్డీవలె దృఢముగను ఉండును. హిందూదేశమందు వీరినిఁబోలిన వారొక్క పంజాబివారే.

రూపరేఖా విలాసములు

తెలుఁగు దేశమందలి సామాన్య జనులు మగ్గురైనఁగాని యొక్క కాబూల్ వారితో సమానుఁడు కాఁడని చెప్పిన నతిశయోక్తి కానేరదు. ఆకారమును మిక్కిలి చక్కఁగనుండును. వర్ణము ఎఱుపు పసుపు మిశ్రమముగ నుండును. ఇందు విషయమై కాశ్మీరదేశజులు వీరును ఒక్కటిగాఁగాన వచ్చుచున్నారు. స్త్రీలును బలముగలవారుగను చక్కని వారుగను, కొందఱు గులాబి రంగు గల వారుగను ఉందురు.

ఈ దేశముయొక్క దేశభాష పష్తు. ఇది ఆర్యభాషలలో నొక్కటి. అచ్చపు అఫ్గానులు కాని వారిలో

భాష

బెక్కుజనుల స్వభాష పారసీకము (పార్సి). ఈ భాషయందు మహమ్మదీయులకు గౌరవ మెక్కువగనుక నిది యెక్కువగ వ్యాపించుచున్నది. రాజకీయ వ్యవహారమంతయు నీ భాషలోనే జరుగును. హిందూకుష్ పర్వతమునకు నుత్తరమునకుండు దేశవాసులభాష తుర్కీ. బదఖాను ప్రాంతమునందు పారసీక తద్భవమైన యొకభాష మాటలాడుదురు. ఇవిగాక యీ దేశమునందుఁ బెక్కు చిల్లరభాషలు కలవు.

ఈ దేశమందలి జనులు మహమ్మదీయ మతస్థులు. అందును సున్నీపంథప్రభావ

మతము

మెక్కువ. రాజు, ముఖ్య సరదారు లీ పంథము వారు. షీయా పంథమువారు కొద్దిగాఁగలరు. ౭-వ శతాబ్దమునందు నీ దేశమునకు మహమ్మదీయ మతదీక్ష యీయఁబడెను. ముల్లాలను వారు వీరి గురువులు.

ఇచ్చటి రాజును అమీర్ అందురు. ఇతఁడు స్వతంత్ర ప్రభువు. ఇంగ్లీషు ప్రభుత్వము వారిత నికి సంవత్సరమునకుఁ బదునెనిమిది, లక్షల రూపాయిలు కప్పమిచ్చెదరు. అందుచేనాతఁడు వీరిసమ్మతిలేనిది, యితర రాజులతో రాజసంబంధమైన వ్యవహారములు నడుపఁడు. ఇతర విషయములలో నీతఁడు సంపూర్ణ స్వాతంత్ర్యము కలవాఁడు. ఇదివఱ కీతనిని బ్రిటిషు ప్రభుత్వము వారు "హిస్ హైనెస్" అను బిరుదుతో సంబోధించుచుండిరి. ఈబిరుదు హిందూదేశమందలి స్వదేశ సంస్థానికులకుఁ జెల్లుచున్నది. కాని కొన్నిసంవత్సరముల క్రింది నుండి అమీరును "హిస్ మ్యాజెస్టి" అన్నబిరుదుతో సంబోధింప వలయునని తీర్మానింపఁబడినది. ఈబిరుదు మనచక్రవర్తి గారికి మాత్రము (లేక వారితో సమానులైన చక్రవర్తులకు మాత్రము) చెల్లుచుండెను.

ప్రభుత్వము

ఈదేశము ప్రభుత్వము నిమిత్తమై అయిదు పరగణాలుగ విభజింపఁబడినది. ౧. కాబూల్ ౨. అఫ్గాన్ తుర్కిస్థాన్ ౩. హీరత్ ౪. కందహార్ ౫. బడక్‌షాన్. ఈపరగణాల అధికారిన్ని 'నాయబ్' అనిగాని 'హాకీము' అనిగాని అందురు. ఈహోదా మనగవర్నరు హోదాతో సమానమైనది. ఈ హాకీములు రాజ్య సంబంధమైన వ్యవహారములు గాక తమపరగణాలోని సివిలు క్రిమినలు వ్యాజ్యెములుగూడఁ బరిష్కరించుచుందురు. వీరి న్యాయస్థానమునకు 'మహాకమ ఇ హాకీము' అందురు. ఈన్యాయస్థానమునకు లోఁబడిన విధము ఖాజీల అధ్యక్షత క్రిందనున్న విధము నగు న్యాయస్థానములకు 'మహాక్మ ఇ షరా' అందురు. ఒక్కొక్క ఖాజీకితోడుగా ముఫ్తీ అను వారుందురు. కాజీముఫ్తీలు భిన్నాభిప్రాయులైనపుడు ఆతగాదా కాబూలులో నున్న 'ఖాన్ ఇముల్లా' అనువాని తీర్మానమునకుఁ బంపుదురు. ఆతఁడును తీర్మానింపఁజాలనియెడల 'అమీర్' స్వయముగఁ దీర్మానించును. న్యాయస్థాన వ్యవహార విధానములఁ దెల్పు చట్టము లిటీవల నేర్పఱచఁబడినవి. ఉన్నతన్యాయస్థాన విధానములకు 'కితాబ్బ ఇ మ్యాకూమతీ' అని పేరు. కాజీముఫ్తీల న్యాయ స్థానములకై యేర్పఱచఁబడిన చట్టమునకు 'అసాస్ ఉల్ కజ్జాత్' అని వ్యవహారము గలదు.

రాజ్యమేలుటకు అమీర్ గారి సాహాయ్యార్థము ఒకసభకలదు. దానిని దర్బార్ అందురు. అందు మూఁడు రకముల సభాసద్యులుందురు. ౧ సర్దారులు, ౨ ఖానులు, ౩ ముల్లాలు. సర్దారులు గొప్పగొప్పభూస్వాములు, ఖానులు సామాన్యజనుల ప్రతినిధులు, ముల్లాలు మత గురువులు. వేఱువేఱు తెగలవారు (Tribes) తమలోనుండి ఖానుల నెన్నుకొనియెదరు.

సర్దారులు, ఖానులు, ముల్లాలు సభాసదులుగాఁగల సభలు రెండుగలవు. ఒకదానిపేరు దర్బారు షాహీ, అనఁగా రాజసభ. రెండవది

'ఖర్ వ్వానీ మల్కీ' అనఁగా సామాన్య సభ. ఇదిగాక కార్యనిర్వాహక సభయొకటి గలదు. దానిని 'ఖల్వత్' అందురు. అమీరు స్వయముగా న్యాయవిచారణ చేయును. అమీరు న్యాయసభకు క్రిందిది 'కాజీ' న్యాయసభ, దానికి క్రిందిది 'కొత్వాల్' న్యాయసభ. కొన్ని పట్టణములలో వర్తక సంబంధమైన తగాదాలు 'పంచాయతీ' ద్వారా విచారించుటయుఁగలదు.

ఆదాయము

ఈ దేశము రాజుయొక్క ఆదాయము ౧౮౫౬ లో ౩౦ లక్షలుండెను. అది ౧౮౬౯ లో ౭౦ లక్షలుగను, ౧౮౮౫ లో ౧౦౦ లక్షలుగను నాచ్చెను. ఇపుడు కోటి ఇరువది లక్షలు మొదలు కోటి ముప్పది లక్షల వఱకు నాదాయము పెర్గినది. ఇదియును గాక కాబూలులో విశేషముగ ధనసంగ్రహము ఖజానులో నున్నదని వాడుకగలదు.

అఫ్గానులలో 'గిల్జా'లనువారును, దురానిలనువారును మిక్కిలి శూరులు, బలశాలులు.

సైన్యము

పూర్వకాలమందు పటాలములపద్ధతి లేకయుండెను. మనసబు పద్ధతికలదు. యుద్ధసమయమందు నిందరు భటులఁ దేవలయునన్న షర్తుమీఁద రాజ్యమందలి సరదారులకుఁగొన్ని భూములీయఁబడుచుండెను. ఆ సరదారులు యుద్ధకాలమందు సైనికులను తెచ్చుచుండిరి. కాని యీపద్ధతివలన సైనికులమీఁద నమీరునకు తగినంత నధికారము కలుగకుండెను. యుద్ధసమయమున బెక్కుసారులు సైనికులు శత్రువులలోఁగలియుచుండిరి. కావున అమీర్ దోస్తు మహమ్మదు ౧౮౫౮-౯ లో జీతములు తీసికొను సైనికులఁజేర్చి పటాలము లేర్పఱిచెను. అప్పుడు ౧౬ కాల్బలపు పటాలములును, ౩ గుఱ్ఱపు పటాలములును, ౮౦ ఫిరంగులును ఏర్పడెను. ఒక్కొక పటాలములో ౮౦౦ సైనికులుండిరి. షేర్ అల్లీ ఖానుఁడను వాఁడు బ్రిటిషు పటాలములవలెఁ దనపటాలములకు కవాతు మొదలయినవినేర్పి ౧౮౬౯ లో వానిని అభివృద్ధిచేయ యత్నించెను. అబ్దుల్ రహిమాన్ ఖానుఁడు పూర్తిగ నింగ్లీషు పద్ధతి నవలంబించి తనపటాలములను యూరోపీయ పటాలముల యోగ్యతకుఁ దెచ్చెను. ఇట్లు క్రమమైన సైనికులు ౫౦౦౦౦ మంది యెప్పుడును యుద్ధమునకు సిద్ధముగనుందురు. ఇదియుఁగాక అబ్దుల్ రహిమాన్ కాలములో నొక నిబంధన చేయఁబడినది. పదునాఱు సంవత్సరములు మొదలు డెబ్బది యేండ్ల వయస్సుగలవారిలో నెనిమిదిమందికి నొక్కరు చొప్పున ప్రతిగ్రామమునను సైనికులను యుద్ధప్రసంగము వచ్చినప్పుడు రణమునకుఁ బంపవలెను. ఈ నిబంధన ననుసరించి వలయునప్పుడు మూఁడులక్షలవఱకు సైన్యము యుద్ధమునకు సిద్ధముగనుండునని క్రిందటి అమీరైన అబ్దుల్ రహిమాన్ ఖానుఁడు తన స్వీయ చరిత్రమునందు వ్రాసియున్నాఁడు. నిల్వ

యున్న సైన్యములు హేరత్, కందహార్, కాబూల్, మజర్ ఇషరీఫ్, జలాలాబాద్, అస్మార్ అను చోట్లను, హిందూదేశపు సరిహద్దు మీఁదను శిబిరములలో నుండును.

మందుగుండు, తుపాకులు చేయుటకు కాబూలులో నొక కర్మాగారము కలదు. అందు దినమునకు ౨౦౦౦౦ తోటాలును, ౧౫ తుపాకులును, వారమునకు ౨ ఫిరంగులును చేయుదురు. ఉత్తరపు అఫ్గానిస్థానమునందు రెండు గొప్ప దుర్గములు కలవు. ఒకటి హెరత్, రెండవది దెహదాది. ఈ రెండవది బాల్కుకు సమీపమందున్నది. ఇది ఆక్సస్ నుండి అఫ్గాన్ తుర్కిస్థానమునకుఁబోవు బాటలనన్నిఁటినిఁగాయును. ఈ కోటకట్టుటకుఁ బండ్రెండేండ్లు పట్టినది. ఈ కోటబురుజులపై క్రప్ హాచీకిస్, నార్డన్‌ఫెల్డ్, మ్యాక్సిమమ్ అను పేళ్ళుగల నావిక శీఘ్రశతఘ్నులు (Naval quick-firing guns) కలవు.

**వాఙ్మయము**

పష్టుభాషలోఁ గొంతకావ్య వాఙ్మయము కలదు. షేక్‌మాలియనువాఁడు స్వాత్ దేశమును గెలిచిన సమాచారమును వర్ణనచేయు నట్టికావ్య మీభాషలో మిక్కిలి పురాతనమైనది. ఇది పదునైదవ శతాబ్ద ప్రారంభమున వ్రాయఁబడినదిగాఁ గానవచ్చుచున్నది. ౧౪౯౪ లో కాజిఖానను వాఁడు ఒక రాజయి కొన్ని దేశములు గెల్చెను. వాఁడే యాచరిత్రను వర్ణించుచు గ్రంథము వ్రాసెను. అక్బరు కాలమందు బెయజిద్ అన్సరీ అనువాఁడు పష్టుభాషలోఁ గావ్యము వ్రాసెను. ఇతఁడు మతస్థాపకుఁడు కూడ. పదునేడవ, శతాబ్దమందలి కవియైన అబ్దుర్ రహీమాన్ అనువాఁడు ఈభాషలోని విఖ్యాతకవి. ఔరంగజేబు కాలమువాఁడును, యుద్ధప్రియుఁడును నగు ఖుషాల్ ఖానుఁడనువాఁడు గూడ లోకప్రియుఁడైనకవియే. ఈతని వంశమందును పెక్కుకవులు పుట్టిరి. అహమద్‌షాహకూడ కవియని పేరొందినవాఁడు. ఈభాషలో వీరకథాగానములు (Ballads) పెక్కులు కలవు.

**కలాకౌశల్యములు: వర్తకము**

ఈ దేశమునందు చక్కనిపట్టు, పట్టువస్త్రములు తయారగును. ఆక్సస్‌నదియొడ్డుననుండి అఫ్గాన్ తుర్కిస్థానమందలి గ్రామములును, బొఖారా, మెషెడ్ అనునవి పట్టుపనులకుఁ బేరొందినవి. హెరాత్, కందహారు పట్టణములలోఁ గూడ పట్టుపనులు జరుగును. హెరాత్ ప్రాంతమున మంచి తివాసులు నేయుదురు. గొఱ్ఱెలతోళ్ళతోఁ జేయఁబడిన అంగీలు, పోస్తీను లనఁబడునవి మిక్కిలి నిపుణతతో నీదేశమందంతటను చేసెదరు. ఒంటెలవెంట్రుకలతోడను, గొఱ్ఱెలయొక్కయు పర్వతపుమేకల యొక్కయు బొచ్చుతోనేయఁబడిన మెత్తని వస్త్రములు ఈదేశమందలి యొకవిశేషమని చెప్పవచ్చును. ఇవి మిక్కిలి వెలగలవి. కందహారులో ఎఱ్ఱ రాళ్ళతోటి(పూసల) జపమాలలు చేయుదురు.

రుచికరములను, శ్రేష్ఠజాతియు, పుష్టికరములును నగు అత్తి, ద్రాక్ష, అక్రోడ్, బాదామ్, పిస్తా మొదలయిన ఫలజాతులీ దేశమునుండి యెక్కువగా నెగుమతి యగుచుండును. ఈపండ్లను ఎండఁబెట్టి నిలువచేసి దేశాంతరములకును బంపెదరు. రంగులకుపయోగపడు మంజిష్ఠయు నింగువయు నెగుమతి యగును. ఈ దేశమందు వేటకుక్కలను పెంచి యమ్ముదురు.

అఫ్గానిస్థానమునుండి యితర దేశములకుఁ బోవుటకు వర్తకపు బాటలు పెద్దవి నేడుకలవు. అందు మూఁడు హిందూ దేశమునకు వచ్చునవి. ఒకటి పారసీకమునకుఁ బోవునది. మిగిలినమూఁడు ఆ దేశముయొక్క యొకభాగమునుండి మఱియొక భాగమునకుఁ బోవునవి. హిందూ దేశమునకువచ్చు బాటలలో నొకటి కాబూలునుండి ఖైబరుకనుమగుండ జలాలాబాదు మీఁదుగా వచ్చును. రెండవది కందహార్ గజ్నీలనుండి గోమల్‌కనుమలగుండ వచ్చును. మూఁడవది కందహార్ నుండి క్వేటామీఁదుగావచ్చును. ఈమూఁటిలో ఖైబర్ మార్గమును క్వేటా మార్గమును మంచివి. ఇందు క్వేటామార్గమంతయు బండ్లు నడువ వచ్చును. ఖైబరు మార్గమునఁ జాలవఱకు బండ్లుపోఁగలవు. ఈ దేశమందుబండ్లు విశేషము లేవు. సరకులన్నియు గుఱ్ఱపు తట్లమీఁదను, ఒంటెలమీఁదను తీసికొని పోఁబడును.

ఈ దేశమునందున్న పొవిందా లనఁబడువారు కొందఱు తిరుగుడు (సంచార) వర్తకులుగ నుందురు. వీరు వందలకొలఁది గుంపులుగఁజేరి గుఱ్ఱముల మీఁదను, ఒంటెలమీఁదను సరకులు వేసికొని, దొంగలు దోచుకొననకుండ వెంటఁగత్తులను కఠారులను తీసికొని హిందూ దేశమునకు, బొఖారా ఖొరాసాన్ దేశములకుఁ బోవుచువచ్చుచు నుండెదరు. హిందూ దేశమునకు చలికాలము ప్రారంభము కాఁగానే గోమల్ కనుమద్రోవన వచ్చెదరు. పంజాబుకుఁ జేరి యచ్చటి తమ స్త్రీలను, పశువులను పంజాబు మైదానములలో నుంచి ఆయుధములను ప్రభుత్వము వారి స్వాధీనముచేసి, రైలుమార్గమున తమసరకులను బొంబాయి, కలకత్తా, కరాచీ, నాగపూర్ మొదలైన ప్రదేశములకుఁ బోయి యమ్మి అచ్చట అఫ్గానిస్థానమునకుఁ గావలసిన సరకులఁ దీసికొని వసంతఋతువు వఱకుఁ దిరిగి పోవుదురు. వీరిని ఉత్తర హిందూ దేశమందు రోహిలాలనియు, అఫ్గానులనియు నందురు. వీరేకారణముననో దక్షిణ దేశమునకు వచ్చుటలేదు.

పర్వత ప్రదేశమైనను ప్రజలు కష్టపడి సంవత్సరమునకు రెండు పంటలు పండించెదరు. మఱి యెత్తు ప్రదేశములయందు మాత్ర మొక్క పంటే పండును. గోధుమలు, యవలు, కాయధాన్యములు, వరి, జొన్న, మొక్కజొన్న, పొగాకు, ముల్లంగి, ఆముదాలు ఇచ్చట

పండును. ఇచ్చటిప్రజలముఖ్యాహారము గోధుమలు. కుంకుమపువ్వు పండించి విశేషముగ నెగుమతి చేయుదురు.

వ్యవసాయము, పంటలు మొదలయినవి

ఇచ్చటి ముఖ్య విశేషము ఫలములు. యూరోపుదేశమందును హిందూదేశము నందును పండునట్టి యుత్తమ ఫలములన్నియు నీదేశమందుం బండును. ద్రాక్షలు విశేషముగం గాయును. కొన్నిప్రదేశము లన్నియు ద్రాక్షాలతలయుద్యాన వనములని చెప్పవచ్చును. నలుబది విధములయిన ద్రాక్షపండ్లు కలవు. కందహార్ చుట్టునున్న పల్లెలలో నిట్టితోటలసంఖ్యములుకలవు. విత్తులులేనిద్రాక్షలుఅత్తిపండ్లుకూడ నెక్కుడుగనుండును. ఈదేశమువారనేకులు ఈఫలములను, ఈఫలముల రసముతోం జేయంబడిన రొట్టెలనుతినియుందురు.

నీటివసతి కావలసిన పైరులకు నీరు కాలువలద్వారాపెట్టెదరు. కొన్నికాలువలు భూమిమీందనుండును, కొన్నిభూమిలో నుండును. భూమిలోనున్న జలలను ఒకదానితో నొకదానిని కాలువలద్వారా కలిపి, యంతకంటెం బల్లపు ప్రదేశములకుం బారునట్లుగం జేయుదురు. ఇట్టివానిని నా దేశమున కరేజ్ అందురు.

దేశచరిత్రము

ఇప్పుడు అఫ్గానిస్థానమనంబడు దేశము పూర్వకాల మొక్క దేశముగ లేదు. వేఱువేఱు భాగములకు వేఱువేఱు పేళ్లుకలవు. అవి వేఱువేఱురాజులక్రిందనుండుటయు సంభవించెను. మిక్కిలి పూర్వకాలమున నంంగా ౨౩౦౦ యేండ్లకుం బూర్వమిప్పుడు కాబూల్ అనంబడు దేశమునకు పరోపనిసడె అనియు (Paropanisadæ) హెరాత్ ప్రాంతమునకు ఏరియా (Aria-హరిరూడ్) అనియు, కందహార్ ప్రాంతమునకు ఆరోకోషియా (Archosia) అనియుం బేళ్లుండెను. మక్రాన్ అనుప్రాంతమునకు గెడ్రోషియా (Gedrosia) అనియు బాల్క అనువానికి బ్యాక్ట్రియా (Bactria) అనియు బేళ్ళుండెను. ఈభాగములన్నియు పారసీకరాజుల క్రింద ఉండెను. క్రీ.పూ. ౩౨౭-౨౬ లో నీదేశములనన్నిటిని మహామహుండైన అలెగ్జాండరు*జయించెను. ఇతండు క్రీ. పూ. ౩౨౩లో మృతుండుకాంగా నాతనిరాజ్యములోని తూర్పుభాగమాతని సేనానియైన సెల్యూకస్నికటర్ అనువానికిం జెందెను. ఆతని రాజ్యములోనే అఫ్గానిస్థానమందలి పై రాజ్యములుకలవు. క్రీ. పూ. ౩౦౩ లో నీతనిని ఓడించి (బాల్క రాజ్యము తప్ప) యీ రాజ్యములన్నియు మగధదేశపు మౌర్యచక్రవర్తియైనచంద్రగుప్తుండు స్వాధీనపఱచుకొనెను†. కొన్ని దినములకు నీ రాజ్యములు మగధరాజులచేతినుండిపోయెను.

*ఈశబ్దమునకు పారసీభాషలో సికందర్ అనియు, సంస్కృతభాషలో అలకసుంతుండ నియు, రూపాంతరములు కానవచ్చుచున్నవి.

† V. Smith's Early History of India, 3rd edition, p. 119.

ఈ దేశములో, పార్థియను లనువారు కొంతభాగమును, శకవంశమువారు కొంత భాగమును క్రీ. పూ. ౧౩౦ ప్రాంతమున నాక్రమించిరి. గ్రీకువారి ప్రభుత్వము బాక్ట్రియాలోఁ గొంతవఱకుండెను. రెండు శతాబ్దముల తరువాత యుహెచి అనువారు మధ్యాశియానుండి వచ్చి గ్రీకువారిని పార్థియనులను వెడలఁగొట్టిరి. వీరినే కుషనవంశము వారని చెప్పుదురు. వీరిలో కనిష్కుఁడను వాఁడు మిక్కిలి గొప్పరాజు (౭౮-౧౨౩). ఈతని రాజ్యము హిందూదేశమందు గంగవఱకును, కాశ్మీరము, పెషావర్, కాబూల్, ఆక్సస్ నదీప్రాంతము మొదలయిన ప్రదేశము లన్నియు వ్యాపించియుండెను. ఈతఁడు బౌద్ధమతాభిమాని. ఈ వంశమువారు ౫-వ శతాబ్దమువఱకు నీదేశముపై రాజ్యముచేసిరి. ఆ శతాబ్దమునందు వారు తెల్లనివారైన హూణులచే నోడింపఁబడిరి. కాని వీరిప్రభుత్వము పూర్తిగ నేడవ శతాబ్దమువఱకుఁ బోలేదు. వీరినే షాహిరాజులందురు. వీరి కాలములో నీదేశమున బౌద్ధమతము వ్యాపించియుండెను. ఇప్పటికిని బౌద్ధమత చిహ్నము లాదేశమునందుఁ గానవచ్చును. ఈ షాహివంశముచివరి పురుషుఁడు కతోర్మానుఁడనువాఁడు దుర్మార్గుఁడై నందున నాతనిని చంపి యాతనిమంత్రియగు కలారుఁడనువాఁడు క్రీ. శ. ౮౫౦వ సంవత్సరప్రాంతమున రాజయ్యెను. వీఁడు బ్రాహ్మణుఁడనీ కొందఱుతురకలు వ్రాసినారు. కానిక్షత్రియుఁడై యుండునని యితరుల యూహ. ఈవంశమువారు క్రీ. శ. ౧౦౦౦ వఱకుఁ గాబూలులో రాజ్యముచేసినట్లు కానవచ్చుచున్నది. ఈ వంశమువారు "మిక్కిలి రాజ్య విస్తారముగల వారయ్యును ఉత్తమ సద్గుణ మండితులుగను, ఆడినమాట తప్పని వారుగను, తమకంటెఁ దక్కువవారిని దయతోఁ జూచువారుగను నుండిరి" అని యొక మహమ్మదీయ చరిత్రకారుఁడే వ్రాసియున్నాఁడు.*

కాబూలును జయింపవలెనని మహమ్మదీయులుచేసినప్రథమ ప్రయత్నములు సిద్ధించినవి కావు. అరబ్బీవారు ౭-వ శతాబ్దాంతము వఱకు పశ్చిమవైపు అఫ్గానిస్థానమును జయించి మహమ్మదీయమతమును స్థాపించిరి. హీరాత్ మహమ్మదీయమతసంబంధమైన యొక ముఖ్యపట్టణమయ్యెను. తొమ్మిదవ శతాబ్దమునందుఁ గొంతకాలము వఱకు హేరాతులోను, బాల్కులోను, పారశీకులయిన సఫారిదులు రాజ్యముచేసిరి. వారి తరువాత సామానీదు లనువారు వచ్చిరి. వారిని పారదోలి గజ్నీలోని తుర్కీవంశము వారు రాజులయిరి. వీరిలో గొప్పవాఁడు హిందూదేశము మీఁదికి బదునేడుసారులు దండెత్తివచ్చిన మహమూద్ అనుమూర్తిభంజకుఁడు (౯౯౭-౧౦౩౦). ఈతఁడు గజ్నీలో గొప్పవిద్యాపీఠమునుస్థాపించెను. గొప్పగొప్ప

* Elliot's History of India as told by its own historians, Vol. II. pp. 12 & 40.

పణ్డితులకు నాశ్రయమిచ్చెను. తనరాజధానిని బహుసౌధములతో నలంకరించెను. ఈవంశమువారిని వెడలఁగొట్టి అఫ్గాను రాజ్యమును ఆక్రమించుకొనినది గోర్ వంశము. ఈవంశమునందుఁ జేరొందినవాఁడు షహాబుద్దీన్ గోరీ (౧౧౭౩-౧౨౦౬). ఈతఁడు ఢిల్లీశ్వరుఁడైన పృథ్వీరాయుని ఓడించి హిందూదేశమందు తురుష్కుల సామ్రాజ్యమును స్థాపించెను. ఇతని ప్రతినిధులే స్వతంత్రులై బానిస వంశజులనఁబడు ఢిల్లీశ్వరులైరి. వీరు అఫ్గానిస్థానముతో సంబంధము లేకుండ స్వతంత్రులైరి. కొంతకాల మీ అఫ్గాన్ రాజ్యము ఖ్వారిజమన్న పేరుతోఁ గొద్ది కాలమున్న సామ్రాజ్యములోఁ జేరెను. తరువాత చంగీజుఖానుని బందిపోటు మూకలీదేశమును ఆక్రమించుకొనెను. ఇందలి చాలభాగము మఱియొక బందిపోటు నాయకుఁడగు తైమూరు వచ్చి యాక్రమించుకొనువఱకు (౧౩౯౮) వారి స్వాధీనమందే యుండెను. ఇతనితరువాత నీతనిగొప్పరాజ్యము తునకలుతునకలైపోయెను. కాని హెరాత్, బాల్ఖ్, గజ్నీ, కాబూల్, కందహార్ ప్రదేశములలో నీతని వంశజులే రాజ్యము చేయుచుండిరి. ఇతని వంశజుఁడే బాబరు. ఈతఁడు బదక్షాన్, కాబూల్, కందహారు ప్రాంతములకుఁ బ్రభువుగ నుండెను. ఆతఁడు ౧౫౨౬ లో ఢిల్లీలో రాజ్యము చేయుచున్న ఇబ్రాహింలోదీ సుల్తానును ఓడించి హిందూదేశములో మొగల సామ్రాజ్యమును స్థాపించెను. ఈమొగల్లులకు హిందూరాజ్యము వచ్చినతరువాత చిన్నదియగు అఫ్గానురాజ్యము స్థలగమ్ము మీఁది పప్పువలెనయ్యెను. అక్బరు ప్రభుత్వకాలమునందు తిరుగఁబడిన అఫ్గాను దేశజులను గెలుచుటకునై అక్బరు తనసేనానులగు రాజాబీర్ బల్ రాజాతోడర్‌మల్ రాజామాన్‌సింగ్ అను హిందూ సరదారులను వాని మీఁదికిం బంపెను. రాజాబీర్ బల్ యుద్ధమునందు మడసెను. ఔరంగజేబు కాలమందు మార్వాడీదేశపు రాజగు యశవంతసింహుఁడు రాజకార్యనిమిత్తమై కాబూలునకంపఁబడెను. అతఁడచ్చటనే మరణమునందెను. కొన్ని సంవత్సరముల తరువాత బదక్షానును ఉజ్బెక్కు లాక్రమించుకొనిరి. కందహారును పారసీకరాజులయిన సఫవిదులు తీసికొనిరి. గజ్నీ కాబూలులు మాత్రము మొగలులకు దక్కినవి. ౧౭౩౮లో నాదిల్‌శాహ యనువాఁడు అఫ్గానిస్థానములోని రాజ్యములన్నిటిని నాక్రమించి ౧౭౩౯ లో ఢిల్లీని దోచుకొనెను. ఇట్లిన్ని యో శతాబ్దములు పారతంత్ర్యమును అనుభవించి యీదేశము నాదిల్‌శహమృతినందగనే (౧౭౪౭)లో స్వతంత్రమయ్యెను. దీనికి స్వాతంత్ర్యమును జాతీయతను ఇచ్చినవాఁడు అహమదు్‌శాహ అబ్దాలి.

నాదిల్‌శాహ తనసైన్యములో అఫ్గానులను కొందఱిని చేర్చుకొనెను. అట్లు చేరినవారిలో అహమద్‌శాహ అబ్దాలియొకఁడు.

నాదిర్ షాహా మరణమందగనే ౧౭౪౭లో కంద
హారు పట్టణమందు అఫ్గాన్ నాయకులం
దఱుఁ గలిసి యీతనిని రాజుగ నేన్నుకొనిరి.
ఆతఁడు "దుర్ ఇదుర్రాన్" (ఈయుగమునకు
ముత్యము) అను బిరుదమును ధరించెను. తన
జాతివారికి (అబ్దాలీలకందఱికి) దుర్రానీలన్న
బిరుదు నొసంగెను. ఈదుర్రానీ వంశమే
ఇప్పటివఱకును రాజ్యము చేయుచున్నది.
అబ్దాలీ ప్రభుత్వమునకు వచ్చినప్పటినుండియే
అఫ్గానిస్థానమునకు స్వతంత్ర రాజ్యమన్న పేరు
ప్రతిష్ట వచ్చినది. అంతకుఁబూర్వమిది యీ
దేశమువారికి నాదేశమువారికిలోఁబడి స్వతం
త్రనామము లేకయుండెను. పానిపత్ యుద్ధ
రంగమూమీఁద మరాటావారిని నోడించిన
వాఁడు ఈ అహమ్మదుశాహ అబ్దాలియే.
ఇతఁడు మిక్కిలి శూరుఁడై తనరాజ్యమును
చాలవఱకు వ్యాపింపఁజేసెను. ఈతని మరణ
కాలమువఱకు అఫ్గానిస్థానమంతయు నతని
స్వాధీనమగుటయేగాక, ఉత్తరమున తుర్కి
స్థానము, దక్షిణమున సింధు బలుచిస్థానములు
తూర్పున కాశ్మీరము, పశ్చిమమున ఖురాసాన్
దేశపురాజు లీతని సార్వభౌమత్వమును ఒప్పు
కొనిరి. ఇతఁడు ౧౭౭౩లోఁ గాలధర్మము
నొందెను.

ఈతని కుమారుఁడగు తైమూరు రాజ
ధానిని కందహారునుండి కాబూలుకు మా
ర్చెను. ఈతఁడు ఇరువదియేండ్లు రాజ్యము
చేసి ౧౭౯౩ లోఁ జచ్చిపోయెను. ఈతని
ప్రభుత్వకాలములో సింధుదేశము వీరిస్వాధీ
నమునుండి తప్పెను. బాల్కు, అఫ్గాన్
తుర్కిస్థానముయొక్క యుత్తరభాగములు చాల
వఱకు స్వతంత్రములయ్యెను. ఖోరాసాన్,
కాశ్మీరములలో తిరుగుబాటునకు బీజారోపణ
ముచేయఁబడెను. తైమూరునకు నిరువదిమంది
పుత్రులుండిరి. ఆరాజ్యము గుఱించి వారిలో
వారికిఁ బెక్కుతగాదాలు కలిగెను. జమాన్
అనువాఁడు అమీరయ్యెను (౧౭౯౩). ఈతని
కాలములో పంజాబు వీరిచేతినుండి పోయెను.
౧౭౯౯ లో నీతనిసహోదరుఁడైన మహ
మూదు అనువాఁడు రాజ్యము నాక్రమించు
కొనెను. ౧౮౦౩ లోఁ గొన్ని కుట్రలు
జరిగి రాజ్యము ఈతని సోదరుఁడైన శాహ
సుజా ఉల్ ముల్కు అన్నవానిస్వాధీన
మయ్యెను. మహమూదు రాజ్యభ్రష్టుఁ
డయ్యెను. నెపోలియన్ పారసీకదేశపు రాజు
తోఁ జేయుచున్న స్నేహమువలన బ్రిటిషు
రాజ్యమునకు నష్టమురాకుండ జాగ్రతపడు
టకై ౧౮౦౮లో ఇండియా దొరతనమువారు
మౌంటుస్టుఅర్ట్ ఎలిఫిన్టన్ అను వానిని
శాహసుజాయొద్దకు దూతగాఁబంపిరి. కాని
యింతలో రాజ్యభ్రష్టుఁడైన మహమ్మూదు
శాహసుజాను ఓడించి మరల రాజయినందున
(౧౮౦౯) ఈదూత వెళ్లిన ప్రయోజనము
సఫలముకాలేదు. మరల రాజయిన మహ
మూదు తొమ్మిది సంవత్సరములు రాజ్యము
చేసెను. ఈతని కాలమందు నీతనిమంత్రి

యైన ఫతేఖాన్, అనువాఁడు (బరక్ జాయ్ వంశజుఁడు) సర్వాధికారిగ నుండెను. కాని మహమూదు ౧౮౧౮లో నీమంత్రి కన్నులు దీయించెను. అందువలన మంత్రి యొక్క తమ్ముఁడైన మహమ్మద్ ఆజీమ్ అనువాఁడును అతని సవతి తమ్ముఁడైన దోస్తుమహమ్మద్ అనువాఁడును రాజుపైఁ దిరుగఁబడి ౧౮౧౮లో నాతని రాజ్యభ్రష్టునిఁ జేసిరి.

తరువాతఁ గొంతకాలమువఱకు నిశ్చితుఁడైన రాజేర్పడలేదు. మహమ్మద్ ఆజీం కాబూలు స్వాధీనపరచుకొనెను. కాని ఇతర ప్రాంతముల గవర్నరులాతని యాజ్ఞకులోఁబడక పోయిరి. హెరాత్ స్వతంత్రమాయెను. అఫ్గాన్ తుర్కిస్థానముఁ బదక్షాన్ చీలి పోయినవి. పంజాబుసింహమైన రణజిత్ సింగు కాశ్మీరము, ముల్తాన్, డెరాగాజిఖాన్, అటక్ అను దేశములను ప్రాంతములను, స్వాధీనపఱచుకొనెను. నౌషహరయొద్ద ౧౮౨౩లో అఫ్గానులను పూర్తిగఁ బరిభవించి పెషావర్ గూడ లాగుకొనెను. మహమ్మదుఖాన్ ౧౮౨౩లో మృతుఁడయ్యె. అంతవారి(బారక్ జాయ్) యన్నదమ్ములలో రాజ్యమునకై కలహములుముదిరి ౧౮౨౬లో దోస్తుమహమ్మద్ కాబూల్, గజ్నిప్రదేశముల స్వాధీనపఱచుకొనెను. జలాలాబాదుకూడ త్వరలోనే యతనికి వశమయ్యె. ౧౮౩౪లో శాహశుజా మరల రాజ్యము సంపాదించుటకు యత్నముచేయఁగా నాతనిని ఓడించి దోస్తుమహమ్మద్ 'అమీర్' అన్నపదవిని ధరించెను. శాహశుజా యింగ్లీషు వారియొద్దకువచ్చి హిందూదేశమునందు దాగియుండెను.

౧౮౩౭లో పారసీకరాజు హెరాతును ముట్టడించెను. రుష్యావారికి నమీరుకు స్నేహమధికముగాఁ జొచ్చెను

మొదటి అఫ్గాన్ యుద్ధము ౧౮౩౮-౪౨

ఈ కారణముల చేత నిండియా దొరతనమునకు వారికి నాందోళనముగలిగి వారు అఫ్గానిస్థానమునకు బర్నెస్ అను రాయబారినిపంపిరి: కాని అమీర్ వీరికి ననుకూలముగఁ జెప్పకపోవుటయేగాక యిప్పుడు వీరికి స్నేహితుఁడుగానున్న రణజీతుసింగుమీఁదికిఁ దానుయుద్ధమునకుఁ బోయెదననియుఁ, తనకుసాయము చేయవలసినదనియుఁ గోరెను. అంత, నిండియాగవర్న్మెంటువారు అఫ్గానిస్థానము మీఁదికి దండువెడలి దోస్తుమహమ్మదును రాజ్యభ్రష్టునిఁజేసితమయాశ్రయమునందున్న శాహశుజాను రాజ్యముపైఁ గూర్చుండఁబెట్ట నిశ్చయించిరి. రణజీతుసింగుకూడ సాయము చేయ నొప్పుకొనెను. కాని యంతగా సాయము చేసినవాఁడుకాఁడు.

ఉత్తరసింధు దేశమునందు ౧౮౩౮లో అఫ్గాన్ దండయాత్రనిమిత్తమై ౨౧౦౦౦ సైన్యము సిద్ధముచేయఁబడెను. సర్ జాన్ కీన్ అనువాఁడు వారికి సేనాధిపతిగ నుండెను. ఈసైన్యము బోలన్ కనుమలోనుండి వెళ్లి ౧౮౩౯-వ సంవత్సరమునందు ఏప్రిల్ నెలలో

కందహారుని ఆక్రమించి, యచ్చట శాహాశుజాకు పట్టముకట్టెను. జూలైలో గజ్నీ వశమయ్యెను. దోస్తుమహమ్మదు పారిపోగా ౭-వ ఆగష్టుదినమున శాహాశుజా రాజధానిలోఁ బ్రవేశించెను. ౧౮౪౦-వ సంవత్సరమున దోస్తుమహమ్మదు ఇంగ్లీషు వారిస్వాధీనమయ్యెను. అతనిని ఇండియాకుఁ బంపిరి. అందఱును యుద్ధము సంపూర్ణ దిగ్విజయముతోఁ బూర్తియైనదని సంతసించిరి. శాహాశుజాకు సాయముగ కాబూలులో ౮౦౦౦ ఇంగ్లీషుసైన్యమును మ్యాక్‌నాటన్ అనువాని ఆధిపత్యము క్రిందనునిచి, బర్నిస్ అనువానిని ఇంగ్లీషువారితరఫు రాయబారిగనియమించి సర్ జాన్‌కీన్ వెడలిపోయెను. కాని మొదటి నుండియు కాబూల్ ప్రజ లీక్రొత్త ప్రభుత్వము మీఁదఁ గోపముగలవారుగనే యుండిరి. ౧౮౪౧-వ నవంబరులో ప్రజలు తిరుగఁబడి కాబూలులో బర్నిసును, ఇతరాంగ్లేయాధికారులను నరికివేసిరి. దోస్తుమహమ్మదు కుమారుఁడైన అక్బరుఖానుఁడు తిరుగుబాటువారందఱకు నాయకుఁడు. సంధివిషయమై మాటలాడుటకుఁ బోయినప్పుడాతఁడు తనచేతితో సర్ విలియం మ్యాగ్‌నాటనును పొడిచివేసెను. ఇట్లే ఇంగ్లీషుసైన్యమునకు నచ్చటఁ బెక్కు ఆపదలు సంభవించెను. ౮౦౦౦లో ౩౧౦౦ మంది యిట్లు హతులైరి. ౪౧ మంది మాత్రము మిగిలిరి. వీరును శత్రుమధ్యమున నుండుట యసంభవమయ్యె. ౧౮౪౨-వ సంవత్సరము జనేవరి ౬-వ తేదిన ఇంగ్లీషు సైన్యమంతయు కాబూలువిడిచి వెళ్లునట్లు, త్రోవలో వారికి కాబూలువారేవిధమైన యిబ్బంది కలుగఁజేయకుండునట్లును కరారునామా వ్రాసికొని, ఇంగ్లీషుసైన్యము కాబూలునుండి బయలుదేరెను. ఇట్లీసైన్యము హిందూదేశమునకు వచ్చుటకు బయలుదేరినప్పుడు ౪౧౦౦ సైనికులుండుటయేగాక, ౧౨౦౦౦ మంది సేవకులుగూడ నుండిరి. చలివిస్తారముగ నుండెను. అఫ్గానులు వీరికి త్రోవలో మిక్కిలి బాధ కలిగించిరి. వారిచేతనేమి, చలిచేతనేమి యీ సైనికులందఱును మడిసిరి. కొందఱు చెఱఁబెట్టఁబడిరి. డాక్టరు బ్రైడన్ అనువాఁ డొక్కఁడుమాత్రము మిక్కిలిదైన్యస్థితితో ఇంగ్లీషువారి పటాలమున్న జలాలాబాదుకుఁ జేరెను. గజ్నీలోనున్న సైన్యముకూడఁ గాబూలువారివశమయ్యెను. కందహార్, జలాలాబాద్ ఈ రెండుమాత్రము ఇంగ్లీషువారి స్వాధీనమందుండెను.

ఇట్లు బ్రిటిషుసైన్యమునకు నఫ్గానిస్థానమునందుఁగల్గిన ఘోరమైనయాపత్తుకు బదులు తీర్చుకొనవలయునని, ౧౮౪౨-వ సంవత్సరపు ఏప్రిల్ నెలలో నిండియానుండి జనరల్ పొలాక్ యొక్క యాధిపత్యముక్రింద ఖైబర్ కనుమ గుండ గొప్పసైన్యము పంపఁబడెను. ఆతఁడు సెప్టెంబరులో కాబూలు నాక్రమించి అచ్చటి దుర్గమును నడిమిబాజారును పడఁగొట్టి, ఖైదీలుగనున్న కొందఱు బ్రిటిషుసైనికుల

వశపఱుచుకొన్న డిసెంబరునెలలో హిందూ దేశమునకుఁ దిరిగివచ్చెను. ఇతరులచే దీసి కొనిరాఁబడి, బలవంతముగఁ దమకురాజుగఁ జేయఁబడిన శాహాశుజాను అఫ్గాను లెన్న డును ప్రేమింపలేదు. ౧౮౪౨-వ సంవత్సరము ఏప్రిల్ నెలలో నాతఁడు చంపఁబడెను. హిందూ దేశమునందున్న దోస్తుమహమ్మదును విడిచివేసిరి. వాఁడు మరల కాబూలుకు రాజయ్యెను.

సిక్కువారికిని ఇంగ్లీషువారికిని జరిగిన రెండవయుద్ధ కాలమునందు నీతఁడు సిక్కువారిలోఁగలిసి అటక్ తీసికొనెను. ఇంగ్లీషు వారీతనిసైన్యములను ౧౮౪౯ ఫిబ్రవరిలో గుజరాత్ యుద్ధములో సిక్కువారితోఁగూడ నోడించిరి. దోస్తుమహమ్మదు ౧౮౫౦ లో బాల్ఖ్ప్రాంతమును స్వాధీనపఱుచుకొనెను. ౧౮౫౫ లో కందహార్ గెలిచెను. ఆసంవత్సరమునందే యతనికిని ఇంగ్లీషువారికిని స్నేహము కుదిరెను—౧౮౫౬ లో హెరాతును పారశీకులు తీసికొనిరి. ౧౮౫౭ లో పంజాబుదేశపు చీఫ్ కమిష్నరును, దోస్తుమహమ్మదును పెషావరులోఁగలిసికొని సంధి చేసికొనిరి. ఇంగ్లీషువారు అమీరునకుఁ బారసీకము నెదురించుటకునై కొంతసైన్యధనమును (Subsidy) ఆయుధములును ఈయ నొప్పుకొనిరి. తరువాత హిందూ దేశచరిత్రమునందుఁ బ్రఖ్యాతమైన సిపాయిల తిరుగుబాటు హిందూదేశమందు సంభవించినది. ఆకాలమందు అమీరు ఇంగ్లీషువారికి స్నేహితుఁడుగనే యుండెను. ౧౮౬౩ లో దోస్తుమహమ్మదు హెరాతును ముట్టడించి పట్టుకొనెను. అచ్చటనే యాతఁడు ౧౩ దినములకు మృతుఁడయ్యె.

ఈతని కుమారుఁడు షేర్ అలీఖాన్ రాజయ్యెను. ఈతఁడు రాజ్యముకొఱకుఁ బెక్కుజనులతోఁ బోరాడవలసినవాఁడాయెను. కాని ౧౮౬౮ లో కాబూలు రాజ్యము మీఁద స్థిరుఁడయ్యెను. ఇతఁ డింగ్లీషువారితో స్నేహము కలిగియుండెను. ఇంగ్లీషువారాతనికి బాకీయున్నధనము పండ్రెండులక్షల రూపాయిలును, ఫిరంగులును, ఆయుధములును, బహుమతిచేసిరి. అప్పుడప్పుడు ధన సాహాయ్యముఁగూడఁ జేయుచుండిరి.

ఇట్లుండఁ గొన్నిదినముల కాతఁడు రుషియా వారికి ననుకూలుఁడుగను, ఇంగ్లీషు వారికిఁ బ్రతికూలుఁడుగను మారెను. క్రీ.శ. ౧౮౭౮ లో నాతఁడు రుష్యావారి రాయబారులు కాబూలుకురాఁగా వారిని గౌరవించెను. ఈసమాచారము తెలిసి ఇంగ్లీషు ప్రభుత్వమువారు తమరాయబారిన్ని పంపెదమనఁగా నొప్పుకొనలేదు. అందుమీఁద ఇండియా దొరతనమువారు అఫ్గానిస్థాన్ అమీరుతో యుద్ధమునకుఁ గడంగిరి. దీనికే రెండవ అఫ్గాన్ యుద్ధమని పేరు.

రెండవ అఫ్గాన్ యుద్ధము ౧౮౭౮-౮౦

ఇంగ్లీషు సైన్యములు కైబరు ద్రోవను కురంకనుమను ఆక్రమించెను. ౧౮౭౯ జనెవరిలో కందహారును ఆక్రమించిరి. అమీర్ కాబూలునుండి పారిపోయి ఫిబ్రవరి నెలలో చచ్చెను. తరువాత నాలుగు నెలలవఱకును, అఫ్గానులతోను కొండజాతులతోను చిల్లరయుద్ధములు జరుగుచుండెను. ఇంకను పైకి బోయినయెడల తిరిగి వచ్చుట కష్టమేమోయని తమకు ననుకూలుఁడైన అమీరును రాజ్యముమీఁదఁ గూర్చుండఁ బెట్టి తిరిగివచ్చుటకు నెదురుచూచుచుండిరి. ఇంతలో షేర్ అల్లీ కుమారుఁడైన యాకుబ్ ఖానుఁడు తాను అమీరునైతిననియు, సంధి చేసికొనియెదననియు నింగ్లీషువారికి వర్తమాన మంపెను. ౧౮౭౯ మేనెలలో గండమక్ వద్ద నిద్దఱికి సంధిజరిగెను. ఈ సంధిప్రకారము సరిహద్దుమీఁదనున్న కొండజాతిగుంపులపై యధికారమును, కుర్రం, పిషీన్, సిబీతావులును, ఖైబర్ మిచ్నీ కనుమలమీది స్వత్వమును ఇండియా ప్రభుత్వమువారికీయఁబడెను. బ్రిటిషు రెసిడెంటు కాబూలులోనుండుటకునొప్పు కొనెను. ఇంగ్లీషువారి సలహాలేనిది యితర రాజులతో రాజకీయవ్యవహారములు నడుపనని సమ్మతించెను. ఇందుకుబదులుగ నింగ్లీషువారు అమీర్ మీఁదికిఁ బెరరాజులురాకుండఁ గాపాడెదమని యొప్పుకొనిరి (౧౮౭౯ మే). మేజరు సర్ లూయికవగ్నరి యనువానిని కాబూలులో రెసిడెంటుగా నేర్పఱిచిరి. కాబూల్ నుండి సైన్యము వెడలిపోయెను. అంతయు మనకు ననుకూలముగ జరిగెనని సంతసించిరి. కాని అఫ్గానులు మోసముచేసి సెప్టంబరు నెలలో రెసిడెంటును ఆతని సిబ్బందిని చంపి వేసిరి.

ఈ సమాచారము తెలియఁగనే హిందూదేశమునుండి జనరల్ (తరువాత లార్డు) రాబర్ట్సను పెద్దసైన్యముతోఁ బంపిరి. ఆతఁడు అఫ్గన్ సైన్యమును ఓడించి ౧౮౭౯ అక్టోబరులో కాబూలుస్వాధీనపఱుచుకొనెను. యాకూబ్ ఖానుఁడు ప్రభుత్వమువదలుకొని, యింగ్లీషు వారిస్వాధీనమై హిందూదేశమునందు వారి వలన నుపకారవేతనమునుపొందుచు నుండ సాగెను. ౧౮౭౯-౮౦ సంవత్సరపు జలికాలము కాబూలు దేశమందున్న యింగ్లీషు సైన్యమునకు మరల విపత్తుసంభవించునేమో యన్న భయముకలిగెను. అఫ్గానుసరదారులు తిరుగఁబడిరి. ఎట్టకేలకు వారిని నింగ్లీషు సైన్యము లోడించెను.

కాబూలు కందహారుప్రాంతములను విడఁదీసి యింగ్లీషువారు కాబూలుకు అబ్దుర్ రహిమాన్ ఖాన్ అనువానిని, కందహారుకు షేర్ అల్లీ ఖాన్ అనువానిని ప్రభువులుగా నొప్పుకొనిరి (౧౮౮౦, జూలై, మే). అబ్దుర్ రహిమాను దోస్తుమహమ్మదుకు మనుమఁడు, షేర్ అలీకితమ్ముని కుమారుఁడు కందహార్ రాజయిన షేర్ అల్లీ చేతగాక రాజ్యమువదలుకొని హిందూదేశమునందు ప్రభుత్వమువారిచ్చు పెన్షనుపుచ్చుకొనుచుండెను.

౧౮౮౧లో నింగ్లీషు సైన్యములు అఫ్గాని స్థానమువిడిచి హిందూదేశమునకుఁబోయెను.

అబ్దుర్ రహిమాన్ ఖాన్ క్రమముగఁ దనకు బ్రతికూలురైన వారిని జయించి అఫ్గాన్ దేశమునకంతకును బ్రభువయ్యెను.

అబ్దుర్ రహిమాన్ ఖాన్ ౧౮౮౦-౧౯౦౧

ఈతఁడిరువది యొక్క సంవత్సరములు రాజ్యము చేసెను. ఇండియా ప్రభుత్వము వారితో మైత్రి కలిగి యుండెను. ఈతని ప్రభుత్వ కాలములో అఫ్గాని స్థానమునకు నంతకుఁ బూర్వమెన్నఁడును లేని యేకఛత్రాధిపత్యము, శాశ్వతసైన్యము (Standing Army), ఇతర రాజ్యములతో సమానముగనుండు రాజ్యమన్న గౌరవము కలిగినది. ఇంతకుఁ బూర్వము సరదారులును ప్రాంతాధీశులును తమయిష్టము వచ్చిన యెడల అమీర్ ఆజ్ఞవినుటయు లేనియెడల వినకపోవుటయు సంభవించుచుండెను. ఈతఁడు తనప్రచండ విక్రమముచే నాపద్ధతులన్నియు మాన్పి వారందఱును తనయాజ్ఞలో మెలఁగునట్లు చేసెను. ఈతనికాలములోనే రుషియాకు అఫ్గానిస్థానునకుఁగల పొలిమేరలు, హిందూ దేశమునకు ఈదేశమునకుఁగల పొలిమేరలు పారశీకదేశమునకు నీదేశమునకుఁగల పొలిమేరలుఁ గొల్వఁబడి సినలుచేయఁబడినవి. ఈతనికి నిండియా గవర్నమెంటువారు సరిహద్దుసంరక్షణనిమిత్తమై మొదట పంద్రెండు లక్షల రూపాయిలిచ్చుచుండిరి. ౧౮౯౩లో నీమొత్తము, పదునెనిమిది లక్షలు చేయఁబడినది. ౧౮౯౬ లో కాఫిరిస్థాన్ అను దేశముపై అమీరుయొక్క సార్వభౌమత్వము స్థిరపడెను. ఈతఁడన్ని వ్యవహారములలోను తన స్వాతంత్ర్యమునకు భంగము రాకుండ మిగుల జాగ్రత్తతోఁ గాపాడుచుండెను. ఏసలహాలు వినినను తనరాజ్యములో పరదేశీయులు రైళ్లు టెలిగ్రాములు వేయుదమన్న వినినవాఁడు కాఁడు.

అబ్దుర్ రహిమాన్ ఖాన్ మృతినొందఁగా నాతని కుమారుఁడు హాబిబుల్లాఖాన్ అమీరయ్యెను. ఈతఁడు తండ్రిమార్గమునే యవలంబించెను. ఈతఁడు

హాబీబుల్లా ౧౯౦౧

ప్రభుత్వమునకు వచ్చిన తరువాత క్రొత్తషరతులతో రాజీచేసికొనవలయునని యిండియా గవర్నమెంటువారు ౧౯౦౫ లో మిస్టర్ (ఇప్పుడుసర్) లుయీడేనును పంపిరి. కాని హాబీబుల్లా క్రొత్తషరతులొప్పలేదు. అదివఱకు నాతనితండ్రికాలమునయున్న షరతులనే యొప్పుకొనుచు సంధిచేసెను. ఈప్రసంగముననే యీతనికి "హిస్‌మ్యాజెస్టి" అన్న బిరుద మీయఁబడినది. ౧౯౦౭ లో నీతఁడు హిందూదేశము చూచుటకు వచ్చెను. అప్పుడీతఁడు, ఇండియా దొరతనమువారిచే మిక్కిలి గౌరవింపఁబడెను. [కొ. ల.

**అఫ్ జల్ గడ్.** యునైటెడ్ ప్రావిన్సులో (ప్రయాగ రాజధానిలోని) బిజ్నాను జిల్లా, నాగీనా తాలూకాలోని యొక గ్రా

మము. జనసంఖ్య ౭౭౭౨౪. ఇచ్చట నొకకోట పదునెనిమిదవశతాబ్ద మధ్యకాలమున నఫ్జుల్ ఖానుఁడనువాఁడు కట్టెను. ౧౮౫౭ లో తిరుగుబాటు కాలమున ఈకోట పడఁగొట్టఁబడెను. ఇచ్చట మంచినేతబట్టలు ద్దొరుకును.

అఫ్జుల్ ఖాన్. ౧. అక్బరుచక్రవర్తికి ప్రాణప్రియ మంత్రియైన అబుల్ ఫజల్ అనువానికుమారుఁడు. జహాంగీరు రాజ్యకాలమున క్రీ. శ. ౧౬౧౦ లో నీతఁడు బిహారుదేశమునకు సుబేదారుగ ననఁగా గవర్నరుగ నుండెను. క్రీ. శ. ౧౬౧౩లో ఆగ్రాపట్టణమున మృతుఁడయ్యెను.

౨. షీరాజీదేశజుఁడు. మొదటనితని పేరు ముల్లాషుక్ర్ఉల్లా. తండ్రిపేరు అబ్దుల్ హక్. జహాంగీరుచక్రవర్తి యీతనికి అమీర్ పదవి నిచ్చెను. ౧౬౨౮లో నీతనికి విజారత్ ఇకుల్ అను నధికారమీయఁబడెను. ౧౬౩౦లో ౭౦౦౦ వేల పదాతులకును ౪౦౦౦ గుఱ్ఱములకును మన్సబుదారాయెను. డెబ్బదియేండ్లు బ్రతికి ౧౬౩౯ లో ఆగ్రాపట్టణమున మరణమునొందెను. ఈతఁడు కవిత్వముచెప్పువాఁడు, అల్లామియన్నది కవిత్వసంబంధమైన యీతనినామము.

3. విజాపుర నవాబులయొద్దనుండిన యొక సరదారు. ఇతఁడు మహమ్మదు ఆదిల్ శాహ యొక్క దాసీపుత్రుఁడని కొందఱు వ్రాసియున్నారు.* వాఈయీనుప్రాంతమునకునితఁడు సుబేదారుఁగ ౧౬౪౪ మొదలు ౧౬౫౮ వఱకునుండెను. శివాజితండ్రియైన శహాజికిని వీనికిని వైరముకలదు. శహాజిపెద్ద కుమారుఁడును శివాజికన్నయునగు సంభాజి కర్ణాటకయుద్ధములో కనకగిరిని పట్టుకొనుటకై పోరాడుచున్నప్పుడు అఫ్జుల్ ఖానుని మోసమువలన నాతఁడు చంపఁబడెను. ఈతఁడు విజాపుర నవాబునొద్ద శివాజినిబట్టితెచ్చెదనని ప్రతిజ్ఞచేసి ౧౬౫౯ సెప్టెంబరునెలలో బయలుదేరెను. అప్పుడు శివాజి రాయగడముమీఁద నుండెను. అఫ్జుల్ ఖానుఁడు పూనామీఁదికి రాకుండఁ దగినయేర్పాట్లుచేసి యాతఁడు ప్రతాపగడదుర్గముమీఁదికిఁబోయెను. శివాజి ప్రతాపగడముమీఁద నున్నాఁడని విని అటు వెళ్లవలెనని అఫ్జుల్ ఖాను పంఢరపురము, తుళజాపురము, మాణకేశ్వరము, కరకముబోసే, శంభుమహాదేవము, మలవడి, రహిమతపురము అను గ్రామములమీఁదుగ వాఈపట్టణముఁ జేరెను. పంఢరపురములోని విఠలదేవుని, తుళజాపురమున భవానీదేవిని విధ్వంసము చేసెను. ఇందుచే హిందువులకు నాతనిపై మిక్కిలి కోపము వచ్చెను. వాయీకిఁ జేరి యాతఁడాగ్రామమునకుఁ గులకరణి(కరణము) అగు కృష్ణాజీభాస్కరుఁడను వానిని శివాజియొద్దకుఁ బంపెను. శివాజియుఁ దనగుమాస్తా

* మరాఠీరియాసత్, (మరాటిభాష), రెండవ భాగము ౩౮౭ పుట.

యైన పంథాజీగోపీనాథుని ఖానునియొద్దకును బంపెను. తాను భయపడితిననియు, విజాపూర నవాబు నొద్దకువచ్చెదనియు, శివాజి ఖానునకు వర్తమానమంపెను. ప్రతాపగడము క్రింద అఫ్జుల్ ఖానుండును, శివాజియు మొదటఁగలిసికొనునట్లు ఏర్పాటుజరిగెను. అందు కై యొకమండపము కట్టఁబడెను. శివాజి నఖశిఖాంతము కవచముఁదొడుగుకొని తానాజిని వెంటఁదీసికొని వచ్చెను. ఖానుఁడును ఒక్కబంటుతోడనే పల్లకినెక్కివచ్చెను. ఇద్దరును మొట్టమొదట కౌఁగిలించికొనినప్పుడు ఖానుఁడు శివాజిని తనయెడమచంకలో నొత్తిపట్టి కత్తివ్రేటువేయఁబోఁగా శివాజి తనచేతనున్న పులిగోళ్ళతో ఖానుని పొట్టలోఁగ్రుచ్చెను. అంతమోసము మోసమని ఖానుఁడరచి శివాజినెత్తిమీఁదఁ గత్తిదెబ్బ వేసెను. కాని శిరస్త్రాణమున్నందున నాదెబ్బ వ్యర్థమయ్యెను. ఇంతలో శివాజి తనకత్తితో ఖానుని భుజముపై దెబ్బతీసి పొట్టవఱకుఁజీల్చెను. అంత ఖానుఁడు గతప్రాణుఁడై నేలఁబడియె. ఖానుని బోయీలు పల్లకిలో వేసికొని వీనుఁగును తీసికొని పోవఁజొచ్చిరి. కాని శివాజిసైనికులు బోయీలనుజంపి ఖానుని తలద్రుంచి కోటమీఁదికిఁ దీసికొని పోయిరి.

౪. ఒకపారసీక కవి. ఇతని పూర్తియైన నామము మీర్ మహమ్మద్ అఫ్జల్. ఈతఁడు ఢిల్లీ చక్రవర్తియైన మహమ్మద్‌షా కాలమందుండెను. క్రీ. శ. ౧౭౩౦ లో మృతుఁడయ్యెను.

అఫ్సర్. బీహారులోని గయజిల్లా నవడవిభాగములోని యొకపల్లె. దీనిజనసంఖ్య ౧౦౦౨. ఇది చిన్నపల్లెయైనను పూర్వచరిత్రనుగురించి దీనికి ఖ్యాతివచ్చెను. ఇచ్చటఁ దివ్యగుప్త రాజులు రాజ్యము చేసిననాఁటి వరాహవిగ్రహమొకటి దొరకెను. దీనిమీఁద నద్భుతమైనపనితనము చూపఁబడినది. చూచుటకు చాలసొగసుగనున్నది. ఉత్తరగుప్త రాజుల వంశమును వర్ణించు శాసనమొకటి యిచ్చట దొరికినది. ఇచ్చటఁ బాడిపోయిన పూర్వకాలపు దేవాలయమొకటి కలదు. దీనియొక్క చెక్కడముపని బీహారు దేశమునందలి యితరదేవాలయములమీఁది పని కంటె నెంతయో దర్శనీయముగనున్నది.*

అఫ్రీడీ. హిందూదేశమునకు వాయవ్యసరిహద్దుమీఁద ఖైబరుకనుమకు దక్షిణమున పర్వత ప్రాంతములందు నివసించియుండునొక యారణ్యకమానవజాతి. వీరుపఠానులు. హిందూదేశపు సరిహద్దులలోనుండు ఆరణ్యకజాతులలో వీరు మిక్కిలి బలవంతులు, స్వతంత్రులు. జనసంఖ్య సుమారు ౨౦౦౦౦. ఇందుముఖ్యజాతులారు. వీరుండు ప్రదేశమునకు తీరాయనిపేరు. వీరుచూచుటకు చక్కనివారుగను పొడవుగను, కాయపుష్టిగలవారుగను నుందురు. వీరి నివాసమగు కొండల

* Inscriptions of the Early Gupta Kings and their successors by J. F. Fleet.

మీఁద నీరిత్రోఁబోరాడుట. నెవరికిని దుస్తరము. ఇతరపటాలములలోఁ జేర్చినప్పుడు కూడ మిక్కిలి శూరులుగ బనిజేయుదురు. కాని తమకొండలనుండి వెలుపలవచ్చుటకు సాధారణముగ సమ్మతింపరు.

అబర్ క్రోంబి. (సర్ జాన్) (౧౭౭౨-౧౮౧౭) ఈతఁడు సర్ రాల్ఫ క్రోంబియను నతని తనయుఁడు. ౧౭౭౨లో జన్మించి ౧౭౮౬లో సైనికోద్యోగములోఁ చేరెను. కొంతకాలమీతఁడు ఫ్లాండర్సులోను పశ్చిమ ఇండియాదీవులలోను పనిజేసి తనతండ్రికి ఈజిప్టు దేశములో నున్నపుడు మిలిటరీ శెక్రటరీగ నుండెను. ౧౮౦౩లో నెపోలియను ఈతని చెఱసాలలోనుంచి ౧౮౦౮ లో విడుదలచేసెను. ౧౮౦౯ లో బొంబాయిచేరి అక్కడ ముఖ్య సైన్యాధిపతి ఆయెను. ఆమరునటి సంవత్సరము మారిషస్ ద్వీపములను స్వాధీనపఱచుకొనుటకు వెడలిన దండయాత్రకు ఈతఁడు నాయకుడు. తరువాత ఈతఁడు చెన్నపురికివచ్చి అక్కడ సైన్యాధిపతి యగుట తటస్థించెను. ౧౮౧౩-౧౮౧౪ సంవత్సరముల నడుమను ఈ రాజధానికి గవర్నరుపని ఖాళీవచ్చుటచే గవర్నమెంటు వారీతనిని ఆపనిని జూచుటకు నియోగించిరి. ఈతనికి ౧౮౧౨ లో లెఫ్టినెంటు జనరలు, ౧౮౧౪లో కె.సి.బి. ౧౮౧౬ లో జి.సి.బి. యను బిరుదులు ఈయఁబడెను. ౧౮౧౭ లో నీతఁడు మరణించెను.

అబర్ క్రోంబి. (సర్ రాబర్టు) (౧౭౪౦ - ౧౮౨౭) ఈతఁడు సర్ రాల్ఫ క్రోంబియను నతని తమ్ముఁడు. ఈతఁడు ౧౭౫౮ లో సైన్యములో ప్రవేశించి అమెరికా దేశములో ౧౭౬౩ వఱకు సైనికుఁడుగనుండెను. తిరిగి ౧౭౭౬ మొదలు ౧౭౮౩ వఱకు యార్కుటవ్ను అను నగరమును స్వాధీనపఱచుకొనుపర్యంతము అక్కడ యుద్ధము జేయుచుండెడి వాఁడు.

తరువాత నీతఁడు ౧౭౮౮ లో ఇండియాకు వచ్చి ఆమరునటి సంవత్సరమే బొంబాయి రాజధానికి గవర్నరుగను ముఖ్యసైన్యాధిపతిగను నియమింపఁబడెను. ౧౭౯౦లో మేజరు జనరలు అయ్యెను. మలబారు ప్రాంతముల కొన్ని కార్యముల నెఱవేర్చి ౧౭౯౨ లో శ్రీరంగ పట్టణమువద్ద టిప్పుసుల్తాను నోడించుటకై చేయఁబడిన ప్రయత్నములో కారన్వాలీసునకీతఁడు చాలసాయ మొనర్చెను.

౧౭౯౩ లో కారన్వాలీసు హిందూదేశమునుండి వెడలిపోవుటచే నీతఁడు ఈ దేశమునకు ముఖ్యసైన్యాధికారి అయ్యెను. ఆకాలములోనే ౧౭౯౭ పర్యంతము సుప్రీము కౌన్సిలులో సభ్యుఁడుగాగూడ నుండెను. ౧౭౯౪ లో రోహిల్ ఖండు సందలి బాటినా యనుచోట రోహిలాల నోడించెను.

అబనో: (పైట్రోడి) (౧౨౫౦ - ౧౩౧౬) వైద్యశాస్త్ర విశారదుఁడు. జన్మస్థానము పడువా. పెద్దవాఁడైన తరువాత

నచ్చుటనే వైద్య శాస్త్ర విశారదుఁడుగ నుండెను. జ్యోతిశ్శాస్త్రములోను, రసాయన శాస్త్రములో నెక్కువ పరిశ్రమచేసెను. వైద్యశాస్త్రములోఁ బెక్కు గ్రంథములను రచించెను. ముఖ్యముగా విషములకుఁగల విఱుగుళ్ళనుగుఱించి చర్చించెను. క్రైస్తవ మతమునకు వ్యతిరేకాభిప్రాయములు గల వాఁడగుటచే నితనిని మతసంబంధమైన 'ఇన్క్విజిషన్' (Enquisition) అను న్యాయ స్థానమునకు నీడ్చి తెచ్చిరి. వారితనికి ఉరిశిక్ష విధించిరి. కాని యీతఁడు, ఉరిశిక్షననుభ వించక పూర్వమే మరణించెను.

అబర్డీన్. స్కాట్లండు దేశములోని నాలుగవ పట్టణము. పంద్రెండవ శతాబ్దమున నుండి క్రమక్రమముగ వృద్ధినందినది. ఉత్తమ హర్మ్యములన్నియు తెల్ల చలువరాతితో నిర్మింపఁబడి యుండుటచేత నీపట్టణమునకు 'చలువరాతి ప్రోల'ను అర్థమునిచ్చు నామ మొకటికలదు. వానవెలిసిన పిమ్మట స్వచ్ఛ ధవళిమచే నీ పురవరము మెఱయుటంబట్టి సముద్రమునుండి చూచిన నిది రజతపురమై యుండుననియు వర్ణింపఁబడియున్నది. ఇదియే స్కాట్లండు దేశపు నుత్తరదిగ్భాగమున పేరు గాంచిన రేవుపట్టణము. ఇచ్చటినుండి చని తనంపుచలువరాతి వస్తువులు నానాదేశముల కెగుమతియగుచున్నవి. ఇటీవల చేపలవ్యాపారము మిన్నయైనది. ప్రత్తి, ఉన్నివస్త్రములు గూడ నితర దేశములకు నంపఁబడు చున్నవి.

ఈపట్టణమునుండి ఇంగ్లాండులోని పార్ల మెంటు సభకు నిద్దఱు సభ్యులు నిర్వాచింపఁ బడుచున్నారు. ఇచ్చటి సర్వకళాశాలయుఁ బేరైనదియె. జనసంఖ్య ౧౬౩౦౪౭.

అబర్డీన్ (జార్జిహ్యామిల్టన్ గార్డన్-౧౭౮౪-౧౮౬౦). ఈ పేరుగల ఆర్లను సరదారులలో నీతఁడు నాల్గవవాఁడు. స్కాట్లాండు రాజధానియగు ఎడింబరు పట్టణమున జన్మించెను. రాజకార్యనిపుణుఁడు. ౧౮౧౩ లో ఆస్ట్రియాలో నింగ్లండు తరఫున రాయబారిగా నుండెను. టోప్లిడ్జుసంధిపత్రము మీఁద నింగ్లీషువారి తరఫున సంతకము చేసెను. వెల్లింగ్టన్ ముఖ్యమంత్రిగా నుండినపుడు ౧౮౨౮-౩౦ వఱకు నీతఁడు విదేశాంగ మంత్రిగ (Foreign Secretary) నుండెను; ౧౮౩౪-౩౫ లో ఉపనివేశయుద్ధకార్యదర్శిగ (Colonial and War Secretary) నుండెను. పీల్ ముఖ్యమంత్రిగ నున్నపుడుగూడ నతఁడు పెక్కు రాజకీయోద్యోగములను నిర్వహించెను. ౧౮౫౨ లో ముఖ్యమంత్రియయ్యెను. ఈతని కాలములో క్రిమియన్ యుద్ధము జరిగెను. ఇది రుష్యావారికిని, టర్కీవారికిని జరిగిన యుద్ధము. ఇందు బ్రిటీషువారును ఫ్రెంచి వారును టర్కీవారికి మిక్కిలి సాయముచేసిరి. ఈ యుద్ధమునందు క్రమముగా వ్యవహార

ముల్లు జరుపఁబడదని ఈతని ప్రతిపక్షులు ఒక సూచన (Motion) తెచ్చి బహుమతమును బొందినందువలన ఈతఁడు ముఖ్య మంత్రిత్వమును వదలుకొనెను (౧౮౫౫). ఇతఁడు గ్రంథకర్త. గ్రీకువారి శిల్పకళలోని 'సౌందర్య తత్త్వము' అను గ్రంథమును రచించెను.

## అబలాసచ్చరిత్రరత్నమాల.

చూడు అచ్చమాంబ.

**అబాఖాన్.** పారసీక దేశపురాజు, మొగల్ లేక తార్తర్ శాఖవాఁడు. చంగిస్ఖాన్ వంశజుఁడు. ఇతనితండ్రి హులాఘూఖాన్. తండ్రిం తరువాత నీతఁడు క్రీ ౧౨౬౫ లో రాజ్యమునకు వచ్చెను. జూన్ ౧౯ శుక్రవారమున రాజ్యాభిషిక్తుఁడయ్యెను. ఇతఁడు ధైర్యశాలి, తెలివిగలవాఁడు, ప్రజలయెడల దయగలవాఁడు, న్యాయశీలుఁడు. జెరుసులేములోనుండు క్రైస్తవుల కితనివలన కొంత బాధకలిగెను. మైకిల్ పేలియోలొగస్ అను కాన్స్టాంటి నోపల్ చక్రవర్తియొక్క కూతు నతఁడు వివాహమాడెను. ఈమెను మొదట నీతని తండ్రి వివాహమాడ నిశ్చయించి పిలిపించెను. కాని యీమెవచ్చులోపల నాతఁడు మృతినందినందున అబాఖాన్ వివాహమాడెను. ఇతఁడు పదునేడు సంవత్సరములు రాజ్యముచేసి క్రీ. శ. ౧౨౮౨ ఏప్రీలు ౧-వ తేదిని మరణమునందెను.

**అబాజిత్.** (ఫర్మిన్, అబాజిత్-Firmin Abauzit) (౧౬౭౯-౧౭౬౭). ఇతఁడు ఫ్రాన్సు దేశమునందలియొక ప్రసిద్ధకవి. ఇతని తండ్రి అరబ్బీజాతీయుఁడైనను తల్లిదండ్రులు ప్రొటెస్టాంటు మతస్థులు. రెండేండ్లవయస్సుననే తండ్రిచనిపోయినందున నధికారులీతనికి రోమన్ కాథలిక్కు మతమును బోధించు నేర్పాటుచేయుటచే తల్లి యీతని జెనీవా నగరమునకు పాఱిపోవునట్లు చేసెను. ఇతఁడును ఇతని తమ్ముఁడును సెవినీసు పర్వతముల మీఁద రెండు సంవత్సరములు దాగియుండిరి. ఈమెయు నింతకాలము చెఱసాల యందే యుండి తప్పించుకొనివచ్చి కొమాళ్ళనుగలిసికొనియెను. ఇతఁడు చక్కఁగాఁ జదువుకొని అనేకభాషలయందును, పదార్థవిజ్ఞానశాస్త్రమునందును, మతగ్రంథములయందును ప్రావీణ్యమును సంపాదించి న్యూటన్, వాల్టెయ్యర్, రోస్సో మొదలగు విద్యాధికులమెప్పును గాంచెను. ఇతఁడు విశేషముగ దేశసంచారమును గావించి ప్రఖ్యాతుఁ డయ్యెను. బైబిలులోని నవనిబంధనమును ఫ్రెంచిభాష లోనికి తర్జుమాచేసెను. మఱియు ననేక గ్రంథములను విరచించెను.

**అబాక్సోర్లు.** (చార్లస్ క్సేవియర్ జోసెఫ్ ౧౭౪౫-౧౮౨౨). ఈతఁడు ఫ్రాన్సు దేశపురాజయిన పదునాఱవ లూయీరాజునకు సహాయుఁడుగ నుండెను. ఫ్రెంచివారు రాజు

మైలి తిరుగఁబడ్డి దేశమ్మును కల్లోలపఱచిన పుడు ౧౭౮౩ వ సంవత్సరమున యుద్ధ మంత్రిగ నియమింపఁబడియెను. వార్సెల్లీసు నగరమునజనసమూహముచేఁజంపఁబడియెను.

అబానో (పీట్రోడీ) (౧౨౫౦-౧౩౧౬) ఇటలీ దేశములోని పాడ్వా పట్టణమున జనించి ప్రసిద్ధిగాంచిన యొక వైద్యుఁడును తత్త్వశాస్త్ర వేత్తయునై యుండెను. ఈతఁడు గ్రీకుభాష నేర్చుకొనుటకై పారీసు నగరమునకుఁబోయివిద్యాభ్యాసముచేసివైద్య శాస్త్రమునందును,తత్త్వశాస్త్రమ్ము నందును డాక్టరుపట్టమును బొందెను. ఇతఁడు స్వస్థానము చేరినతరువాత గొప్పవైద్యుఁడని ప్రఖ్యాతి కలుగుటచేతచికిత్సచేయించుకొనుటకై యనేక రోగులురాఁదొడంగిరి. అందుచేత నధికధనము నార్జింపఁగోరి యెక్కువ ధనమీయఁగలరోగులనే చేరఁదీయుచు వచ్చెను. ఇదియున్నగాక, జోశ్యమునందును జోక్యము కలిగియుండు కొన్నాఁడను కారణముచేత కాఁబోలు నితఁడు స్పర్శవేదిమణి కలిగియున్నాఁడనియు, మంత్ర విద్యా ప్రభావముచేత తాన్నితరుల కిదివఱకు చెల్లించియుండిన సొమ్మునంతయు మరలరాఁబట్టుకొన్ని ధనాగారము నించుచున్నాఁడనియు యభియోగములు తేఁబడినవి. మతనియమ భంగములనుగూర్చి కాథలిక్, మతగురువులు చేయు విమర్శాసభకు రెండు విస్తాఱులు రప్పింపఁబడియెను. మొదటిసారి నిర్దోషియని విడచిపెట్టఁబడియెను గాని రెండవ సారి విచారణ ముగింపునకురాక పూర్వమే మృతినొందెను. అట్టుణ్ణిమ్మట మతగురువులు దోషియని తిరుమానించి పాతిపెట్టఁబడిన వానిశవమును పైకిదీసి తగులఁబెట్టవలసినదని యుత్తరువుచేసిరిగాన్ని యింతలో నతని మిత్రుఁడొకఁడు దానిని రహస్యమ్ముగా తొలగించివైచెను. అయినను గురుసభవారు దండోరామూలమున వానిమరణశిక్షను ప్రకటించి అబానోవంటి యాకారముగల బొమ్మను జేయించి దానినగ్ని హోత్రమున కర్పణము చేసిరి. ఇతఁడు వైద్యశాస్త్రమునందును తత్త్వశాస్త్రమునందును అనేకగ్రంథములను రచియించెను.

అబిచ్ (విల్హెల్మ్ హెర్మాన్ అభిచ్—౧౮౦౬-౮౬.) భూగర్భ శాస్త్రజ్ఞుఁడు. జర్మనీ దేశమునకు రాజధానియగు బెర్లిన్నగరమున జనించెను. డోర్పట్ అను పట్టణమున ఖనిజశాస్త్రమునందు పండితోపాధ్యాయుఁడుగ నుండెను (౧౮౪౨). కకాసస్, రుష్యా రాష్ట్రములోని ఆర్మీనియా, ఉత్తర పారశీకము, దాఘేస్థానము మొదలగు దేశములకుఁబోయి భూములన్నుత్రవ్వించి భూగర్భ శాస్త్రమునుగూర్చి గ్రంథములను రచియించెను.

అబిమెలెచ్. (౧). ఇతఁడు గెరారు దేశపురాజు. అబ్రహాము పొరపుచ్చినందున 'సారా' అనునామెనుదెచ్చి యంతఃపురమున నుంచెను. కాని స్వప్నములో దేవుఁడు ప్రత్య

కున్నాను, హెచ్చరిక చేసినందున సారాను మరల స్వామి భర్తృపరము చేసెననుకథకలదు. ఇట్టి కథయే ఇసాక్, రిబెకాలను గూర్చికూడ వినబడుచున్నది (జెనిసిస్ ౨౬). శిచిమైట్ జాతిస్త్రీ యొక్క తెయు, గిడియోన్ యొక్క కుమారుడును "అబిమెలెచ్" ను రాజుగా గైకొనుడనీ ప్రోద్బలము చేయఁగా నితఁడు జోతమ్ అనువానిని దక్క తనసవతి సోదరుల డెబ్బదిమందిని చంపించెను. తుదకు శిచిమైట్లు వానిపై తిరుగఁబడిరి. 'తీబెజ్'ను తాఁగొను నప్పుడొక స్త్రీవలన తిరుగటి జాయిచేత తలబ్రద్దలు కొట్టఁబడియెను. కాని స్త్రీచేత చంపఁబడియెనన్న యవమానమునకుఁ బాల్పడకుండుటకై దనకవచమును మోయుచున్న వానిని తన్నుఁజంపుమని యాజ్ఞ చేసెను.

**అబిల్, క్లార్కు:** (౧౭౭౦-౧౮౨౬) మెకార్ట్నే ప్రభువు చైనా దేశమునకు వెడలినపుడీ అబిల్ క్లార్కునుగూడ తన వెంట నిడుకొనిపోయెను. ఈతఁడు గొప్పవైద్యుఁడు. మెకార్ట్నే తరువాత అహంరస్టు ప్రభువునకు కూడ నీతఁడు వైద్యుఁడుగ నుండెను. ఈతఁడు ౧౮౨౬లో చనిపోయెను.

**అబిషాయ్.** దేవిడ్డురాజునకు మేనల్లుఁడు. ఇతఁడు ధైర్యసాహసములు గలిగి రాజునెడ విశ్వాసము చూపుచు నాతని వెంబడించిన వాఁడు. సాలుస్కంధావారముపై నర్ధరాత్రిమున నడిపించిన దండయాత్రలో రాజునకు తోడ్పడియెను. దేవిడ్డుసింహాసన మెక్కినపిదప వారి యనేకయుద్ధములలో ప్రవేశము గొనుట యేగాక ముఖ్యసేనాధిపతులలో నొకఁడయ్యెను.

**అబిసీనియా:** ఆఫ్రికా ఖండమునందు ఈశాన్యమునఁగల యొకస్వతంత్ర సామ్రాజ్యము. దీనికి హాబషా అనునది మూలనామము. ఎథియోపియా అనునది గ్రీకువారిచే పెట్టఁబడిన పేరు. ఇప్పటియూరోపియనులందఱును 'అబిసీనియా' అని వ్యవహరింతురు. రాకపోకల కనుకూలముగల స్థితియందు లేమింజేసి ఆఖండపు దేశములన్నింటిలోనిది నాగరికమున అధమస్థితియందున్నది. దీనికి నుత్తరమున ఈజిప్టు ఎరిట్రియాలును, తూర్పున ఎరిట్రియా సోమాలిలాండులును, దక్షిణమున సోమాలిలాండు బ్రిటిషుతూర్పు ఆఫ్రికాలును, పశ్చిమమున సూడాను మధ్య ఆఫ్రికాలును ఎల్లలు. విస్తీర్ణము ౨౦౦,౦౦౦ ల చదరపుమైళ్లు. జనసంఖ్య రమారమి ఒక కోటి.

విమానములోఁ గూర్చొని ఆకాశమధ్యమునుండి ఈదేశమును చూచితిమేని అగ్నియందు కాలిన వంకాయ మాదిరి కనఁబడగలదు. ఇట్టి యాకారమునకు భూగర్భమున యుగములుగఁ బనిచేయుచుండు అగ్నిబలమే కారణమని చెప్పుదురు. అబిసీనియా దేశము సమభూమిగాదు. అపరిమితమయిన మిట్టపల్లములుగల ప్రదేశము. సము

ద్రముట్టమునకు ౫,౦౦౦ అడుగులు మొదల్కొని ౧౦,౦౦౦ అడుగులవఱకు ఎత్తుగల ఉన్నతభూములను మిక్కిలి యగాధములగు లోయలును ఈదేశ విస్తీర్ణమునంతయు నాక్రమించుకొని యున్నవి. అచ్చటచ్చట ౧౫,౦౦౦ ల అడుగుల ఎత్తునకుఁ బ్రాకు పర్వతములుకలవు. కాని ఇవిక్రమమైన వరుసలుగ లేవు. ప్రకృతివైపరీత్యమును ప్రకటించుచు నియ్యవి వంకరటెంకరలై వ్యాపించియున్నవి. ఇందు సేమెను అనుపర్వతపంక్తిమాత్రముకొంచెము నిడివికలది, ఉత్తరదక్షిణములకువ్యాపించినది. సీమోన్నతవైపరీత్యమువలననే గొప్పనదులును లేవు. ప్రదేశము సమముగ నేటవాలగు పశ్చిమోత్తరభాగమున మాత్రము మూఁడునదులు గలవు. మారెబు, ఆట్బారా, అబే అనునవి నైలు మహానదియందు చేరునవి. తక్కుంగలయెడములనెల్ల ఉన్నతభూములనుండి లోయల్లోనికి దుముకు సెలయేళ్లె మెండు; ఇవి వానకాలమున ప్రవహించుచు బురదనేలలోను ఎడారులలోను కనపడకుండ పోవుచున్నవి. పేరుగల సరస్సొక్కటి మాత్రముగలదు: దానిని డెంబియా లేక సానాయని యందురు. నైలునది యందొకభాగ మిందుండి పుట్టును. ఈ కారణములచే అబిసీనియాయందు శీతోష్ణస్థితియుఁ బెక్కువిధములుగఁ గన్పట్టును. ఉన్నతభూములు సమశీతోష్ణములుగలవయి హాయినొసంగుచుండును. లోయలలో శీతోష్ణస్థితులు విపరీతములయి శీతజ్వరములు మున్నగునవి ఒక్కొక్క సమయమున సాధారణములగుచుండును. ఉన్నతభూములగోధుమ, అరటి, పొగాకు, నిమ్మ, దానిమ్మ, ద్రాక్ష, టెంకాయ, బార్లి, ఓటు, వేరురు మున్నగునవియు, ఉష్ణప్రదేశములగు లోయలలో చెఱకు, ప్రత్తి, కాఫీ*, ఖీలి, చింత, అరటి, అత్తి, తుమ్మ మొదలగునవియు ఉత్పత్తియగును. ఇనుము, బంగారము, నల్లబొగ్గు, పెట్లుప్పు, గంధకము, రాగి, వెండి, రాతిఉప్పు మున్నగు ఖనిజపదార్థములు దొరకును. ఏనుగు, ఖడ్గమృగము, నీటియేనుగు (హిప్పొపాటమసు), జీబ్రా, ఎనుము, జింక, తోడేలు, సింహము మొదలగునవి సామాన్యమృగములు. చిత్రవర్ణములుగల పక్షులనేకములు గలవు.

యుద్ధభటులుగ నుండుటయే ఉత్తమోద్యోగమని అబిసీనియనుల యభిప్రాయము. వారు చేతిపనులనువ్యాపారములను నిరసింతురు. నూలువస్త్రములను ఊర్ణవస్త్రములను నేయుటయు లోహములతో పనిచేయుటయు తోళ్లను పదును చేయుటయు అబిసీనియాలోని ముఖ్యవృత్తులు. బంగారు, పునుగు, దంతము, కాఫీ, మైనము, జిగురు ఇవి ముఖ్యమయిన ఎగుమతులు. ఒంటెలు, కంచరగాడిదెలు, గాడిదెలు, గుఱ్ఱములు వాహనములుగ నుపయోగింపఁబడుచున్నవి.

---

* ఇది అబిసీనియా నైఋతిమూలయందలి కాఫా యను భాగమున విశేషము పంటయగుచున్నది. ఆపేరునుబట్టియే దీనిని కాఫియనుట.

జను లనేకజాతులవారుగలరు. దక్షిణ అరేబియా నుండివచ్చిన సెమెటిక్కు జాతివారు ప్రముఖులు. రెండుముఖ్య భాషలు ప్రచారమునందు గలవు. అమ్హారిక్కు రాజకీయభాష. ఇథియోపిక్కు అనఁబడు 'గీజు' భాష దేశభాషయున నొప్పును. ఇందే వాఙ్మయంబును గలదు.

ఈ దేశమున జనులు క్రైస్తవమతస్థులు. అయిన నిది యొకవిచిత్రమగు క్రైస్తవమతము. వీరు రోమను క్యాథలిక్కులుగాని ప్రొటెస్టాంటులుగాని కారు. క్రైస్తవమతములో వీరిది యొకస్వతంత్రశాఖ. అలెగ్జాండ్రియాలో నుండె పేట్రియార్కు అనువారిచే వీరిముఖ్య గురువు నియమింపఁబడును. వీరి మతమును మోనోఫైసైట్ (Monophysite) క్రైస్తవమత మందురు. ఇందు కొందఱు యూదుమతస్తులుగూడఁ గలరు. అఫార్, సొమాలి గల్లా ప్రాంతములలోని బహుజనము మహమ్మదీయ మతమువారు.

అబిసీనియా సామ్రాజ్యమునందు చక్రవర్తిచే స్వయముగఁ బాలింపఁబడు అబిసీనియా దేశముగాక షోవా, కాఫా, గల్లమధ్యసొమాలీ అను సామంత రాజ్యములు గలవు. అబిసీనియా దేశము పరిపాలన నిమిత్తము ముఖ్యముగ నాలుగు మహామండలములుగా విభజింపఁబడినది. ఈశాన్యమున ౧. టైగ్రె, ౨. నడుమ అమ్హారా, ౩. దానికి దక్షిణమున గోజాం, ౪. దక్షిణమునషోవా.

అనాదిగ నీదేశము నిరంకుశులగు రాజులచే పరిపాలింపఁబడుచు వచ్చుచున్నది. ప్రాచీనకాలమున ఇథియోపియాయని పిలువంబడుచుండిన ఈఅబిసీనియాకును ఈజిప్టుసామ్రాజ్యమునకును విశేషసంబంధము ండెను. కావున నీరెండు రాజ్యములు నాగరికవిషయమున పరస్పరము పోషకము లయియుండె. టాలిమీల కాలమున గ్రీకుల యధినివేశము లీదేశమున నెలకొల్పఁబడియె. క్రీ. శ. 330-వ సంవత్సరప్రాంతమున క్రైస్తవ మతము ఈభూమింజొచ్చె. క్రైస్తవాచార్యుల పలుకుబడిరాజులవద్ద చెల్లుచుండె. కాలెబ్ అనురాజు తనమతస్థులగు క్రైస్తవులను గొందఱిని పీడింపుచుండిన ఈ మెన్ దేశపురాజుపై దండువెడలి అరేబియాచొచ్చి అతనిని పరాజితునిజేసి ఆ దేశభాగము నాక్రమించుకొనెను. ఇదియె అబిసీనియా చరిత్రమున నుత్తమకాలము. ఇథియోపియనులు అరేబియాలోని సారవంతభాగమును కైవశము చేసికొనినవారై విస్తారవ్యాపారము నడుపుచు హిందూదేశము సింహళము వఱకుఁ బోవుచుండిరి. మహమ్మదీయ లేడవ శతాబ్దమున విజృంభించుటచే అబిసీనియా బలంబణఁగిపోయె. తమ మతమునకు శత్రువులగు తురుష్కుల యొత్తిడి వలన అబిసీనియాయొక్క యంతర్భాగమునకుఁ దరుమఁబడిన వారయి ఈ ఇథియోపియనులు పదునైదవ శతాబ్దాంతము వఱకును నాగరిక ప్రపంచమున కగోచరులయిరి. అఫ్రి

ఖండమునందు నీశాన్యభాగమున నేఁదో యొక క్రైస్తవజాతి కలదని బహుకాలముగ గాలివార్తగ వినుచుండిన పోర్చుగీసుమతాచార్యులు క్రీ. శ. ౧౪౯౦-వ సంవత్సరమున నబిసీనియాను కనుగొనిరి. వీరికిని నీగస్టునీగసునకును (ఇది అబిసీనియారాజు బిరుదము; రాజులకురాజని యర్థము) స్నేహము కుదిరెను. క్రీ. శ. ౧౫౪౧ మొదలు ౧౫౪౩ వఱకును ప్రచండయోధుఁడగు తురుష్కుఁడు మహమ్మదుగ్రాగనునకును అబిసీనియా చక్రవర్తికిని జరిగిన పోరాటములో పోర్చుగీసువారు నీగసునకు సాహాయ్యపడిరి. హిందూదేశమునుండికూడ సైన్యము లనుపఁబడియెను.

మహమ్మదుగ్రాగన్ గుండుదెబ్బచే మృతుఁడగుట వలన నీగసునకు సంపూర్ణజయము కలిగె. తదనంతరము ఇతనికిని పోర్చుగీసు క్రైస్తవాచార్యుఁడు బర్ముడసునకునువివాదం బయ్యె. బర్ముడసు అబిసీనియా వదలివచ్చు వాఁడాయె. క్రీ. శ. ౧౬౩౩-వ సంవత్సరము వఱకును గొంద ఱైరోపియనులు అబిసీనియా కుఁబోయి రాజును స్నేహము చేసికొనుచు వచ్చిరి. కాని ఆమీఁదటవాత నొక శతాబ్దకాలము ఐరోపియను లేరును అబిసీనియాలోనికిఁ బోరైరి.

౧౬-వ శతాబ్ద మధ్యమునుండి ఆ దేశమునకు దక్షిణము నందుండిన 'గాలాలు' అనుజాతివారు అల్లనల్లన లోనికిఁ జొచ్చి దేశము నాక్రమించు కొనిరి. ౧౮-వ శతాబ్దాంతమున చక్రవర్తి వారిచేతులలోని చిక్కి క్రమముగ తగ్గుచువచ్చుచుండిన చక్రవర్తి బలము సంపూర్ణముగ నశించె. తత్కాలమున నేస్వామంతుఁడు బలవంతుఁడగువాఁడై చక్రవర్తిని వశపఱచుకొని అతనిమంత్రియను పేరిట రాజ్యమేలుచుండెను. ఈప్రకారము ౧౮౫౫-వ సంవత్సరము వఱకు ననేకరాజులయిరి. ఆ సంవత్సరమున విజ్కాసాయను వాఁడు మూఁడవ థియొడోరను బిరుదముతోఁ జక్రవర్తియయ్యెను. ఇతఁడు అబిసీనియాయందు పశ్చిమభాగమునను౦డు కొరామండలమున ౧౮౧౮ లో జన్మించెను. ఇతని పినతండ్రి డంబియా, కొరా మెల్గాయను మండలములకు గవర్నరుగా నుండెను. అతని మరణానంతరము విజ్కాసా కొర్గా మండలమునకు మాత్రము పాలకుఁడుగ నేమింపఁబడియెను. ఇదియతనిం దృష్టి పరపదయ్యె. కొన్ని ప్రయత్నములు చేసి ౧౮౫౫లో నితఁడు రాజయ్యెను. మిక్కిలి విపరీతమగు విజిగీష గలవాఁడయి కార్యము సూపుచు వచ్చినందున నీతఁడు నాశనమునకు మార్గ మేర్పఱచు కొనువాఁడాయె. మొదటమొదట నీతనికి బ్రిటీషువారికి మిక్కిలి స్నేహముండెను. కాని ౧౮౬౨-వ సంవత్సరమున నితఁడు ఆంగ్లేయ చక్రవర్తినికి వ్రాసి పంపిన యుత్తరమునకు జవాబే రానందున సహజముగ కోపియగు నీథియొడోరు బద్ధవైరుడాయెను. ఎన్ని ప్రయత్నములు చేసినను ఈ వైరము మానినదిగాదు. ౧౮౬౭-వ సంవత్సర

ముస నితనికిని ఆంగ్లేయులకును విగ్రహము ప్రారంభమాయె. థియొడోరు బహుదూరము పోరి సంధిచేసికొన ప్రయత్నించి విఫలమనోరథుడ్డయి తప్పించుకొని పారిపోవ ప్రయత్నించి దానికిని మార్గము కానక ఆత్మహత్య చేసికొనెను. మాగ్డలా ఆంగ్లేయుల స్వాధీనమాయె. ఈయుద్ధమునందు వీరికి సాయముచేసిన టిగ్రిపాల కుండగు కాస్సేయనువాడు జోహాన్న సురాజను పేరిట అబిసీనియా చక్రవర్తియయ్యె. ఆంగ్లేయులింతటితో అబిసీనియా వదలిరి. జోహాన్నసు ౧౮౮౯-వ సంవత్సరమున యుద్ధమునందు హతుండయ్యెను. యూరోపునందు బలవత్తములగు ఫ్రెంచి, జర్మను, ఇటాలియను, పోర్చుగీసు, బ్రిటీషుజాతులవారు ఆఫ్రికా ఖండమును వ్యాపారార్థులు కయ్యును తుదకు ఆక్రమణకయ్యును విభాగించికొని యుండుట తటస్థించెను. అపుడు అబిసీనియా ఇటాలియనుల భాగమయ్యె. వారిసాయమున షోవారాసగు రెండవ మెనెలిక్కు అబిసీనియా చక్రవర్తియయ్యెను. ఇటాలి యనులకు లోబడినదని పేరొక్కటియకాని అబిసీనియా ఎప్పుడును వారికి జెందినదిగాదు. ౧౮౯౬-వ సంవత్సరమున ఇటాలియనులనోర్చి మెనెలిక్కు సర్వస్వాతంత్ర్యము వడసెను. ౧౮౯౭-వ సంవత్సరమున ఆంగ్లేయులతో స్నేహసంధి చేసికొనియె. ౧౯౦౨, ౧౯౦౮-వ సంవత్సరములలో అబిసీనియా, ఇరిట్రియా సూడానుల సరిహద్దులు నిశ్చయపఱచుకొను సంధులు జరిగెను.

ఇది నిరంకుశప్రభుత్వము. అయినను ౧౯౦౭-వ సంవత్సరము నవంబరు నెలలో చక్రవర్తి మెనెలిక్కు అబిసీనియాకు ఒక విధమైన సాంకుశప్రభుత్వము నొసంగెను. చక్రవర్తి అందఱకు పైనధికారి. అతనికి సాహాయ్యముచేయుటకై యొక సభయుండును. సామంతరాజ్యములలోని రాజులును, మహామండలముల పాలకులును ఇందు సభాసదులుగనుందురు. యూరోపు దేశములందలి మంత్రిమండలముల (Cabinet) వంటి మండలములుగూడ నీరాజుచే స్థాపింపఁబడెను. ఇతని యొద్ద ౧౫౦౦౦౦ సైన్య మెప్పుడు నిలువయుండును. అందలి సైనికులు యూరోపియను సైనికులవలె యుద్ధవ్యూహములను చక్కఁగ నేర్చి నూతనశస్త్రాస్త్రముల గలిగియుందురు. ఈదేశమిదివఱకు నాగరకతలో వెనుకబడ్డను ప్రస్తుతము జాతీయభావమందుఁ జక్కఁగ వికసించినది. ఇచ్చటివారు పూర్వము విశేషము విద్యావంతులు గాకపోయినను ౧౯౦౭-వ సంవత్సరమున పురుషులందఱును తప్పక చదువ కొనవలయునను చట్టము చేయఁబడినది.

[గా. హ.

## అబుల్ ఘాజీ బహదర్.

(౧౬౦౫-౬౩) ఇతఁడు ఖైవాప్రభుత్వమును కుమారునకు నొప్పగించి జెంగిస్‌ఖాను యొక్క వంశచరిత్రమును వ్రాసెను. అయ్యది జెర్మనీ, ఫ్రెంచి భాషలలోనికి తరువాత తర్జుమాచేయఁబడినది.